"ABK's leaders enjoyed a wide readership . . . his forceful writing lends charm to the Editorials . . . They are evidence of his versatality . . . should be of interest to the specialists as well as the general public . . ."

– THE HINDU

**ABK SAMPADAKIYALU–4**

A collection of Editorials (1989-91)

| | | |
|---|---|---|
| PUBLISHERS | : | NAVYA PRACHURANA |
| PUBLICATION NO. | : | 5 |
| FIRST PUBLISHED | : | April - 1995 |

**Rs. 50/-**

| | | |
|---|---|---|
| COVER | : | RUDRA COMMUNICATIONS |
| TYPESETTING | : | VSS LASER GRAPHICS, Hyd'bad–4 |
| PRINTING | : | NAVYA PRINTERS<br>Badam Sohna Apts.,<br>Raj Bhavan Road,<br>Hyderabad-500 482. Phone : 314147 |
| SOLE DISTRIBUTION | : | NAVODAYA BOOK HOUSE<br>3-3-865, Opp. Arya Samaj Street,<br>Kachiguda, Hyderabad. Phone : 552387 |

# అంకితం

"నిద్రలేపే కోడి కెవరో నిద్రమాత్రలు వేశారు
వాళ్ల వెర్రికాని వాల్చిన శిరస్సు
స్వప్నించకుండా వుంటుందా?
ఒక్క కలలోనే వెయ్యి కొక్కరోకోలు"

పోలీసుల బూటకపు ఎన్‌కౌంటర్‌లో
మరణించిన
యువపాత్రికేయ మిత్రుడు

**గులాం రసూల్ కి**

# కృతజ్ఞతలు

వ్యయప్రయాసలకోర్చి ఈ
సెలెక్టెడ్ సంపాదకీయాలను ఆదరంతో
పాఠకుల సౌకర్యార్థం ముచ్చటగా
ముద్రించిన నవ్యప్రింటర్స్ అధినేత
శ్రీ రామకృష్ణారెడ్డి గారికి,

ఈ సంపాదకీయాలను పునర్ముద్రిస్తున్న
సందర్భంగా "ఆంధ్రభూమి"
యాజమాన్యానికి కృతజ్ఞతలు

- రచయిత

# ఎందుకు చదవాలి?

విభజించి బోధించే విద్యా వ్యవస్థ మనది. అందుకే శాస్త్రానికీ శాస్త్రానికీ మధ్య అన్ని అడ్డుగోడలు! రాజనీతి పొసగని అర్ధశాస్త్ర కోవిదులూ, అర్ధశాస్త్రం పడని రాజనీతిజ్ఞులూ మనకి కోకొల్లలు. ఈ కారణంగా ప్రతి సమస్యకీ పైపై విశ్లేషణలే వస్తుంటాయి.

అయితే వీటిని అనుసంధానం చెయ్యగల దమ్మూ, సత్తా పత్రికలకున్నాయి, కాని దురదృష్టవశాత్తూ కొన్ని తెలుగు పత్రికలకు నేడు వీధి వార్తల మీద వున్న మోజు విశ్లేషణల మీద వుండడం లేదు.

అయితే కారుచీకట్లో కూడా ఒక కాంతిరేఖ వుంటుంది. ప్రతి సమస్యనీ పునాదుల్లోంచి దర్శించి విశ్లేషించగల నిపుణులు ఎబికె ప్రసాద్. ఆయన రాసే ప్రతి సంపాదకీయం ఒక సిద్ధాంత వ్యాసం.

తెలుగు సంపాదకీయానికి నార్ల వెంకటేశ్వరావు రాజకీయ దృక్కోణాన్నిస్తే ఎబికె ప్రసాద్ ఆర్థిక దృక్పథాన్ని కూడా జోడించారు. వియాత్నాం మీద రాసినా, వివేకానందుడి మీద రాసినా ఆయనలోని రాజకీయార్ధిక దృష్టి ద్యోతకమవుతుంది.

ఇప్పటికే ఆయన సంపాదకీయాలు మూడు సంపుటాలుగా వెలువడ్డాయి ఇది నాలుగో సంపుటి. ఆయన 'ఆంధ్రభూమి' దిన పత్రికలో వున్నప్పుడు రాసిన వాటిలో కొన్ని మాత్రమే ఈ సంపుటిలో వున్నాయి.

నిజానికి అన్నీ వేయదగ్గవే. ఆయన ఒక పరిశోధన గ్రంథాన్ని తయారు చేయడానికి తీసుకోవాల్సిన శ్రద్ధ, ఆయన ప్రతి సంపాదకీయానికీ తీసుకున్నారు. గ్రంథ విస్తృతి కారణంగా కొన్నింటిని వదలివేయాల్సి వచ్చింది. ఎంపిక చాలా కష్టమయింది. నిజం చెప్పాలంటే మేం వదలిపెట్టినవి గొప్ప సంపాదకీయాలు. ఇందులో వున్నవి అంతకంటే గొప్ప సంపాదకీయాలు.

సమాజంలో వస్తున్న సకల పరిణామాలనీ లోతుగా అధ్యయనం చెయ్యాలని కాంక్షించే మేధావులకూ, విద్యార్థులకూ, ప్రగతిశీలురకూ, ప్రజాస్వామిక వాదులకూ ఈ సంపుటి ఒక కరదీపిక కాగలదని మా ప్రగాఢ విశ్వాసం.

- ప్రచురణ కర్తలు

# మబ్బుతెరలు తొలగించండి!

"An understanding of economics is an understanding of life's principal preoccupation. The newspaper headlines are largely concerned with the economic decisions of the governments.

**– J.K. Galbraith**

నన్నయాదులు ఒక్క కవనకుతూహలంవల్లనే సారమతులు కావొచ్చు. కానీ, పాత్రికేయులు అన్ని విద్యలలోనూ సారమతులు కాకపోయినా, సామాజిక న్యాయ దర్శనం కోసం, లేనితనానికి దేవిడీమన్నా చెప్పించగల ఆర్థిక సమతా సంక్షేమ వ్యవస్థ కోసం భిన్న దృక్కోణాలనుంచి విభిన్న అంశాల పరిశీలనలో, విశ్లేషణలో ఓపానశక్తి విజ్ఞాన సర్వస్వాలుగా వ్యవహరించవలసి ఉంటుంది. ఈ అవసరం తమ కోసం కాదు. ఏనాడైతే తమ చేతులమీదుగా నడిచే పత్రిక సమగ్ర సమాచార దర్పణం కావాలని వారు ఆశించి సంకల్ప బద్ధులు కాగోరుతున్నారో ఆనాటినుంచీ వారి వృత్తీ, వ్యావృత్తీ - జ్ఞాన సముపార్జనే కావాలి. తద్వారా సామాజికులకు విజ్ఞాన వ్యాప్తి బాధ్యతనూ తలకెత్తుకోవాలి.

ఇందుకు తగిన డొక్కశుద్ధి అవసరం. అందుకు తగిన మార్గాలను తమ తనాన్ని ముద్రవేసుకోదలచిన పాత్రికేయులు వెతుక్కోవాలి. "కాదేదీ కవిత కనర్హం" అన్నట్లుగా సామాజిక స్పృహ కలిగిన పాత్రికేయులెవరూ విజ్ఞానార్జనలో 'అస్పృశ్యతను' పాటించలేరు, జ్ఞాన మార్గాన్ని విడవలేరు. ఇందుకు నిరంతర అధ్యయనం తప్ప అడ్డదారి లేదు. ఓపికను బట్టీ, అవకాశాన్ని బట్టీ, ప్రాచీన అర్వాచీన సంప్రదాయాలు, ఆధునిక రచనలనూ అందివచ్చినంతవరకూ తెలుసుకోవాలి. నన్నయనుంచి నగ్నమునిదాకా, నన్నెచోడునుంచి నార్ల వరకూ అలవోకగా స్పృశిస్తూ వెళ్ళాలి. ప్రతివాడూ గద్య పద్య చింతామణులు కానక్కరలేదు. శబ్దం అర్థమూ, స్వరూపమూ తెలుసుకోడానికి ప్రయత్నించాలి. వాగర్థాల ఐక్యతను తెలుసుకుంటూ మనకు మనంగానే దిద్దుకోవాలి. కనుకనే విలియం ప్రీరర్ 20వ శతాబ్దాన్ని పాత్రికేయ శకంగా పేర్కొంటూ ఆంగ్ల యువ పాత్రికేయులకు న సందేశంలో ఇలా అన్నాడుః "విషయం పూర్వాపరాలు తెలుసుకోండి - ప్లాటో, సోక్రటీస్,

షేక్స్పియర్, కార్లైల్, అనటోల్ ఫ్రాన్స్ రచనలూ అలాంటి ఇతర ఉద్దండుల రచనలూ చదవండి. ఎందుకంటే కేవల పాత్రికేయ వృత్తి నేర్చుకోవడానికి పట్టే కాలం కంటే, ఈ రచనలను అధ్యయనం చేయడానికి ఎక్కువ కాలం పడుతుంది. కానీ - ఈ అధ్యయనం లేకుండా మీరు రాణించలేరు, లేరు''.

అంతేగాదు, రాజకీయానికీ, అర్థశాస్త్రానికీ సంబంధం ఉంది, చరిత్రకు అర్థశాస్త్రానికీ అనుబంధం ఉంది. రాజకీయార్థ శాస్త్రం (పొలిటికల్ ఎకానమీ) తెలుసుకోకుండా, కనీసం రాజ్యాల, ప్రభుత్వాల వైభవ, పతన దశలలో పొలిటికల్ ఎకానమీ పాత్రను స్పష్టంగా అవగాహన చేసుకోకుండా పరిణామాలను పరిశీలించలేరు, తగిన వ్యాఖ్యలను పాఠకులకు ప్రసాదించలేరు. వృత్తుల సమస్త చిహ్నాలు మానవాళి మనుగడకూ, నాగరికతల ఎదుగుబొదుగులకూ ఆనవాళ్ళు. అందువల్ల పాత్రికేయ వృత్తికి ముట్టరాని, అంటరాని విజ్ఞాన శాఖలంటూ ఉండవు. పిండికొద్దీ రొట్టె, ఆసక్తి కొలదీ అక్షర జ్ఞానం, విషయ పరిజ్ఞానం. శాస్త్ర సాంకేతిక రంగాలు విభిన్న శాఖలుగా చిలువలు పలువలుగా విస్తరించుకుపోతూ తమ ఉనికినీ, శక్తి సామర్థ్యాలనూ నిరూపించుకుంటున్న ఈ తరుణంలో ఈ విస్తరణ వేగాన్ని అక్షర బంధువులైన పాత్రికేయులు సవాలుగా అందుకొని అందంగా పాఠకులకు అందించగల తమ సత్తాను కూడా చూపగలగాలి. ఈ శాఖలు - సైన్స్, టెక్నాలజీ, ఇన్ఫోటెక్స్, జెనెటిక్స్, క్రియోజెనిక్స్, బిజినెస్ మేనేజిమెంట్, బయోమెడిసిన్, ఒకటేమిటి? పలురకాలున్నాయి.

పొలిటికల్ ఎకానమీని విస్మరించరాదు. మనిషి, అతని పరిసరాలు - వెరసి రాజకీయం. అందుకు అనుగుణంగా రూపుదిద్దుకొనేది ఆర్థికం. రాజకీయ వ్యవస్థ ఆర్థిక వ్యవస్థ రూపురేఖల్ని దిద్ది తీర్చుతుంది (మంచికో-చెడుకో). అందుకే దానిని రాజకీయార్థశాస్త్రం అన్నారు. ఇది సాంఘిక వ్యవస్థకు పునాదిరాయి. ఈ భవంతి బాగోగులూ, దాని నిర్మాణ శక్తి పొలిటికల్ ఎకానమీ పొత్తిళ్ళలో ఉంది. కనుకనే పాత్రికేయులు ఈ శాస్త్రాన్ని అలక్ష్యం చేయకూడదు. మనలో కొంతమంది రాజకీయాలపై చూపే ఆసక్తిలో నాల్గోవంతుకూడా అర్థశాస్త్రాధ్యయనంపై చూపరు. ఈ లోటు తేలికగా భర్తీ చేయగల్గింది కాదు. చారిత్రిక ఘట్టాలను, రాజకీయ పరిణామాలను ఆర్థిక వ్యవస్థ తీరుతెన్నులతో మిళితం చేసి బేరీజు వేయనంతకాలం, పాఠకులకు అందించగల చిత్రం అసంపూర్ణం, అసమగ్రం, అర్థరహితం. మన తెలుగు పత్రికా రంగంలో ఆదినుంచీ ఇదో పెద్ద వెలితి. చొల్లు కబుర్లు, చొప్పదంటు రాతలు, కప్పదాట్లతో కాలక్షేపాలు, డంబాడంబరాలతో సరదాలూ! పి.వి. నరసింహారావు 'ఆర్థిక సంస్కరణల' పేరిట ప్రవేశపెట్టిన సరళీకృత విధానం (లిబరలైజేషన్ - దాని మంచి చెడుల సంగతి అలా ఉంచితే) జాతీయార్థిక వ్యవస్థను మొదటిసారిగా విస్తృతస్థాయిలో ప్రజల దృష్టిలో ఓ ప్రధాన చర్చనీయాంశంగా మార్చివేసింది. ఆయా సామాజిక వ్యవస్థల స్వరూప స్వభావాలు అర్థం చేసుకోవడానికి అర్థశాస్త్రమూ, చారిత్రిక దృక్పథమూ

అవసరం. అలాగే చారిత్రిక నేపథ్యాన్ని కాలదన్నుకునే అర్థశాస్త్రం నేలవిడిచిన సాముగరిడీ. పి.వి. - మన్మోహన్ సింగ్‌ల 'నూతన ఆర్థిక సంస్కరణల'కు పూర్వరంగాన్ని రాజకీయార్థశాస్త్రం పరిధులలోనే తప్ప మరోలా అర్థం చేసుకోలేము. అర్థశాస్త్రాన్ని "శూన్యశాస్త్రం"గా (డిస్మల్ సైన్స్) పక్కకునెట్టజూచే కొందరు ప్రబుద్ధులు రాజకీయ వేత్తలలోనూ ఆర్థిక వేత్తలలోనే కాదు, ఆర్థికాంశాల పొడగిట్టక ఆమడ దూరం జరిగిపోయే సంపాదకులలో కూడా ఉన్నారు! ఏదీ గాలిలో పుట్టదు, గాలిలో పెరగదు. అలాగే అర్థ శాస్త్రం కూడా. చారిత్రిక నేపథ్యంలో మాత్రమే అర్థశాస్త్రాధ్యయనం విలువ తెలిసివస్తుంది. 1776 విప్లవాన్ని తలచుకుంటే, అమెరికా స్వాతంత్ర్య ప్రకటన స్ఫురణకు వస్తుంది. ఆ తిరుగుబాటు ఇంగ్లాండ్ వాణిజ్య వలస విధానంపై సాగిన తిరుగులేని విరగబాటు; ఆ పూర్వరంగంలో వచ్చిందే ఆడమ్‌స్మిత్ రచన "జాతుల సంపద" (వెల్త్ ఆఫ్ నేషన్స్); పెక్కు నిర్బంధాలతో, నిబంధనలతో, ఆంక్షలతో కూడిన వలస వాణిజ్య విధానానికి వ్యతిరేకంగా నాడు ప్రబలుతూ వచ్చిన తిరుగుబాటు సంక్షిప్త చరిత్రే అర్థశాస్త్రానికి తొలి పూవుగా వెలువడిన స్మిత్ రచన. రాజకీయాలనుంచి అర్థశాస్త్రాన్ని, చరిత్రనుంచి అర్థశాస్త్రాన్ని వేరు చేసి చూపజూచే వాళ్ళున్నంతకాలం అర్థశాస్త్రానికీ, ఆర్థికాంశాలకూ వక్రభాష్యాలు పుడుతూనే వుంటాయి. చారిత్రిక నేపథ్యం నుంచి పరిశీలించనందుననే - లోగడ రికార్డో "లా ఆఫ్ రెంట్" పాఠకులకు కొరకరాని కొయ్యగా కనిపించింది. కాని చారిత్రిక నేపథ్యంలో ఈ 'లా ఆఫ్ రెంట్' (భూమికౌలు - అద్దె చట్టం) అన్నది 19వ శతాబ్దపు ఇంగ్లండ్ భూస్వామ్య వర్గానికీ, పారిశ్రామిక పెట్టుబడిదారీ వర్గానికీ మధ్య జరుగుతున్న సంకుల సమరంలో అంతర్భాగం అని తెలుసుకున్న మరుక్షణం 'రెంట్‌థీరీ'ని ఆవరించిన మబ్బు తెరలు కాస్తా విడిపోయాయి. మార్క్స్ "పెట్టుబడి (కాపిటల్)" గ్రంథాన్ని వివరించి విద్యార్థులకు చెప్పకపోవడానికి కారణం అది అర్థంకాకపోవడం కానే కాదు. అది రాజకీయార్థశాస్త్రం అయినందున విద్యార్థుల మనస్సులు పరిపక్వమై 'అదనపు విలువ'నూ, దోపిడీ వ్యవస్థనూ ప్రశ్నించే శక్తి యుక్తుల్ని వీరు పొందుతారన్న భయమే!

ఇప్పటికైనా తెలుగు పత్రికాలోకం స్వతంత్ర బుద్ధితో పొలిటికల్ ఎకానమీ దృష్ట్యా, రాజకీయ, ఆర్థిక, చారిత్రిక పరిణామాలను పరిశీలించి, విశ్లేషించాలి. సంపాదకీయాలను సుసంపన్నం చేసుకోవాలి. నిశితమైన వాద ప్రతివాదాలకు తగిన అజెండాను పాఠకులకోసం ముందుకు నెట్టాలి. పాఠకుల ఆలోచనను సునిశితం చేయడంలో పత్రిక అగ్రగామి పాత్ర వహించాలి.

# విషయసూచిక


| | | | |
|---|---|---|---|
| గోదావరి-కృష్ణా-పెన్నా మధ్యే... | 1-3 | 'అయోధ్య' వల: ఎన్నికల కల (1) | 86-88 |
| మానవేతిహాసంలో మరపురాని మహద్ఘటన | 4-7 | 'అయోధ్య' వల: ఎన్నికల కల (2) | 89-91 |
| నెల్సన్ రోలిహాలా! గుండెలో 'మండేలా'..! | 8-11 | ఎడా పెడా - చెడా మడా (1) | 92-93 |
| గోర్బచేవ్ విధానాలు: పశ్చిమ రాజ్యాల జూదం! | 12-14 | ఎడా పెడా - చెడా మడా (2) | 94-95 |
| అక్కడ లెనిన్ కూడా పాతబడిపోయాడు..! | 15-17 | ఎడా పెడా - చెడా మడా (3) | 96-97 |
| వ్యాపార ప్రకటనలు: ఆడియో, వీడియో! | 18-19 | జాతీయ ప్రభుత్వ స్థాపన: వి.పి. భావన (1) | 98-100 |
| సరికొత్త అధ్యాయం | 20-22 | జాతీయ ప్రభుత్వ స్థాపన: వి.పి. భావన (2) | 101-102 |
| రామ! రామ! ఇన్ని అబద్ధాలా?! | 23-25 | భారత 'ప్రజాస్వామ్యం: "మేహ" రోగం! (1) | 103-105 |
| పాలకులు-నైతిక విలువలు | 26-27 | భారత 'ప్రజాస్వామ్యం: "మేహ" రోగం! (2) | 106-108 |
| 'కిడ్నాప్' రాజకీయాలు | 28-30 | పంజాబ్ సమస్యకు పరిష్కారం లేదా? (1) | 109-111 |
| మహిళా కళ్యాణ్! | 31-33 | పంజాబ్ సమస్యకు పరిష్కారం లేదా? (2) | 112-114 |
| 'ఇండియన్ బాల్డ్విన్' వి.పి.సింగ్?! | 34-36 | భారతదేశాన్ని తాకట్టు పెట్టకండి! | 115-117 |
| "ఎమితిని సెపితిమి కపితము"... | 37-38 | 'దేశం' పరాజయం: కేంద్రంలో "కిచిడీ" (1) | 118-120 |
| తిట్టు రాజకీయాలు: నెహ్రూ పాఠాలు | 39-40 | 'దేశం' పరాజయం: కేంద్రంలో "కిచిడీ" (2) | 121-123 |
| చిరంజీవులు విద్యార్థి, యువజనులకు... | 41-43 | 'దేశం' పరాజయం: కేంద్రంలో "కిచిడీ" (3) | 124-126 |
| 'తీగ' కదిలిస్తే చాలు డొంకంతా..! | 44-46 | రాజీవ్ రాజీనామా: కేంద్రంలో కిచిడీ (4) | 127-128 |
| కమ్యూనిస్ట్ ప్రపంచంలో కల్లోలం-1 | 47-49 | "తడ": పోలీసుల తడాఖా! | 129-130 |
| కమ్యూనిస్ట్ ప్రపంచంలో కల్లోలం-2 | 50-51 | కుంభకోణాలు: గాంధీ దృక్కోణాలు! | 131-132 |
| కమ్యూనిస్ట్ ప్రపంచంలో కల్లోలం-3 | 52-53 | అమానుషం, పాశవికం! | 133-135 |
| సియాచిన్ హిమగిరిలో... | 54-55 | వైద్య రాజకీయాలు! | 136-138 |
| సునో! సునో! ఉనో..! | 56-57 | రాజకీయాల్లో గాడ్గిల్ 'ఫార్ములా'! | 139-140 |
| పార్లమెంటరీ ప్రజాస్వామ్యం-కొన్ని పాఠాలు | 58-59 | ఈ రీ-నోటిఫికేషన్ ఎందుకు? (1) | 141-142 |
| పంజాబ్ సమస్య-1 | 60-62 | ఈ రీ-నోటిఫికేషన్ ఎందుకు? (2) | 143-144 |
| పంజాబ్ సమస్య-2 | 63-65 | పంచాయతీరాజ్-"గాంధేయ రాజ్యాంగం" (1) | 145-146 |
| పంజాబ్ సమస్య-3 | 66-67 | పంచాయతీరాజ్-"గాంధేయ రాజ్యాంగం" (2) | 147-148 |
| పంజాబ్ సమస్య-4 | 68-70 | పంచాయతీరాజ్-"గాంధేయ రాజ్యాంగం" (3) | 149-150 |
| ప్రగతికి ప్రతిబంధకం-'ద్రోణ' సంప్రదాయం-1 | 71-73 | పంచాయతీరాజ్-"గాంధేయ రాజ్యాంగం" (4) | 151-152 |
| ప్రగతికి ప్రతిబంధకం-'ద్రోణ' సంప్రదాయం-2 | 74-76 | పంచాయతీరాజ్-"గాంధేయ రాజ్యాంగం" (5) | 153-154 |
| కాశ్మీర్ సమస్య: కొన్ని చేదు నిజాలు (1) | 77-79 | పంచాయతీరాజ్-"గాంధేయ రాజ్యాంగం" (6) | 155-156 |
| కాశ్మీర్ సమస్య: కొన్ని చేదు నిజాలు (2) | 80-82 | "విశ్వామిత్ర" విజయం!! | 157-158 |
| కాశ్మీర్ సమస్య: కొన్ని చేదు నిజాలు (3) | 83-85 | గవర్నర్ల వ్యవస్థ | 159-160 |

# గోదావరి - కృష్ణా - పెన్నా మధ్యే...


దేశీ ప్రచారం, స్వభాషా ప్రబోధం, స్వాతంత్ర్యోద్యమం మూడు పాయలుగా, మూడు పూవులు, ఆరు కాయలుగా విస్తరిల్లిన ఆంధ్రప్రాంతంలోనే ఈ అన్ని శాఖల కూడళ్లకూ దేశ భక్తితో "ఎరువు" పెట్టి, రక్షరేఖ కట్టి, తెలుగు పత్రికా లోకం కూడా వర్ధిల్లుతూ వచ్చింది. ఆంధ్రదేశంలో స్వాతంత్ర్యోద్యమ కాలంలోనూ, ఆ తరువాతా వచ్చిన రాజకీయ, సాంస్కృతిక ఉద్యమాలకూ, వైజ్ఞానిక వికాసానికీ తెలుగు పత్రికా ప్రపంచానికీ కేంద్రంగా అనుదిన చైతన్య క్షేత్రంగా వాసికెక్కిన విజయవాడ కార్యరంగంగా ఈ రోజునుంచీ మరొక దిన పత్రిక వెలువడుతోంది. అయితే ఇది కొత్త పత్రిక కాదు. ఆ కొత్తదనం ఏదైనా వుంటే అది ఈ ప్రాంతానికే పరిమితం! గత 29 ఏళ్లుగా విశాఖ వేదికగా తెలంగాణాలోనూ, ఉత్తర సర్కారు జిల్లాలోనూ అకుంఠిత యాత్ర సాగిస్తోందీ పత్రిక. ఆయా ప్రాంతాల ప్రజలకు తలలో నాలుకగా మెలగుతూ ఇతోధికంగా తన వంతు సేవలనందజేస్తోంది.

ఇప్పుడు గోదావరి, కృష్ణా, పెన్నా నదీ మండలాల మధ్యనున్న దక్షిణ మధ్య సర్కారు జిల్లాలకు కూడా పరివ్యాప్త మయ్యేందుకు, ఇక్కడి ప్రజల సమస్యలకు అద్దం పడుతూ జరిగే అక్రమాలనూ, అన్యాయాలనూ ఎండగడుతూ - నిర్మొహమాటంగానే, నిండు మనసుతోనే, సత్యాన్వేషణలో నిష్పాక్షికంగానే ప్రజల పక్షాన నిలబడాలన్నది ఈ పత్రిక సంకల్పం. ఈ మహదాశయంతో ముందుకు దూసుకువస్తున్న ఈ పత్రిక విజయవాడ ఎడిషన్‌ను కూడా ఆశీర్వదించి, ఆస్వాదించవలసిందిగా పాఠకులను కోరుతున్నాం. పెరుగుతున్న పాఠకలోకం రుచులకూ, అభిరుచులకూ అనుగుణంగా సమాచార వ్యాప్తికోసం విస్తరిల్లుతున్న పత్రికలు కూడా దూర ప్రాంతాలకూ, మారుమూల పల్లెలకూ సాధ్యమైనంత త్వరలో చేరుకోవడానికి చేస్తున్న ప్రయత్నంలో - ప్రాంతాల వారీగా ఎడిషన్లు పెట్టడం ఇటీవల ఒక మహాసంకల్పంగా మారింది. ఈ యాజ్ఞాన్ని ఒక విధంగా ఏ "జాతీయ జల సమాఖ్య" ఏర్పాటుతోనో లేదా "జాతీయ విద్యున్మాలిక" (గ్రిడ్) నిర్మాణంతోనే పోల్చుకోవచ్చు! ప్రాంతీయ ప్రత్యేకతలను, వాటి ప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తూ సమస్యల పరిష్కారంకోసం ప్రజలకు చేదోడు వాదోడు కావడమే పత్రికల లక్ష్యం. ప్రాంతీయ తగాదాలను రెచ్చగొట్టడమే, వాటిని భుజాన వేసుకొని ఊరేగడమే వాటి ఆదర్శం కాదు, కారాదు. దేశ సమగ్రత, రాష్ట్ర సౌభాగ్యం ప్రాంతాల మధ్య మైత్రి, ప్రజల మధ్య సమన్వయం, సహకారం, వీటి రక్షణ, పెంపుదల పత్రికల పరమావధి. ప్రజలకూ, ప్రభుత్వానికీ మధ్య పత్రిక విశ్వాస వారధి, సారథీ!

నదీ మండలాలు నరుల జీవనానికి ఆశీర్వాదాలు పలుకుతాయి. కనుకనే అప్పకవి పేర్కొన్న సప్త సంతానాలలో వనాన్ని, జలాన్నీ చేర్చడం! నాగరికతలను దిద్ది తీర్చినవి నదీ మండలాలు కనుకనే, శాఖోపశాఖల సంగమ స్రవంతిగా గోదావరి, కృష్ణ, పెన్న, తుంగభద్రలు జల వనరులతో, సహజ వనరులతో

సుభిక్షం చేస్తున్న ఈ నదీ వ్యవస్థలు ఆంధ్రత్వానికి, ఆంధ్ర భాషకే కాదు, రాజకీయ చైతన్యానికీ, సాహిత్య విభవానికీ, సంస్కృతీ వికాసానికీ ఉగ్గుబాలు పోశాయి. శాతవాహనులు తొలి పాలకులుగా ఈ ప్రాంతాలు వర్తక వాణిజ్యాభివృద్ధికి ముఖ ద్వారాలు, ఖండాంతర ఖ్యాతికి ఆనవాళ్ళు. పంట సిరి నాట్యమాడిన నాగేటి చాళ్ళు! ఇది హొయలు చిందే శిల్ప సంపదలకు లయలు కలిపిన ఆంధ్రభూమి! భౌతికమైన ప్రతీదీ జీర్ణమై పోవడం తథ్యమని, సంఘాన్ని శరణు వేడుకోవడం సత్యమనీ, నిత్యమనీ చెప్పి జీవిత ధర్మానికి వాస్తవిక నిర్వచన ఇచ్చిన తథాగతుని బోధలతో ప్రభావితమైన ప్రాంతమిది! దేశాల మధ్య శాంతికి ప్రతీకగా ఉన్న పంచశీలను ప్రపంచానికి పంచి పెట్టిన బౌద్ధ సంస్కృతి, వాఙ్మయం, శిల్పం తామర తంపరగా అల్లుకుపోయిన మండలాలివి. "క్షేమ సుఖమును కోరితే ప్రేమతారక మంత్రమే.. రక్షమైత్రీ దీపమే" అని చాటిన నేల తల్లి ఇది !

రాజకీయ, సాంస్కృతిక జీవనంలో పెక్కు అభ్యుదయకర పరిణామాలకు "తొలిపూజ"లు జరిపిన తెలుగు గడ్డ ఇది. ఆంధ్రుల తొలి రాజధానీ, మలి రాజధానీ కృష్ణానది ఒడ్డున విలసిల్లిననవే! పరాయి పాలనలో ప్రత్యేకాంధ్ర నినాదానికి పల్లవి అందించి ప్రథమాంధ్ర మహాసభకు హారతులు పట్టింది బాపట్ల. బాపట్ల జాతీయోద్యమ ఉద్ధతికీ, గాంధీజీ సహాయ నిరాకరణోద్యమానికీ, అహింసా ఉద్యమానికీ "బీజాక్షరాలు' ' నేర్పిన తొలి ఉద్యమం చీరాల పేరాల సత్యాగ్రహం! తోట నరసయ్య జాతీయ జెండా ప్రతిష్ఠకు బందరు ప్రశస్తి. "తేజము పెంపుమీర కదుధీరులు" వీర విహారం చేసిన ప్రాంతం వెలలేని పలనాడు. తొలి సహపంక్తి భోజనాలకు తలుపు తెరిచిన సంస్కర్త బ్రహ్మనాయుడు. నన్నయ్య మహాభారత రచనకే కాదు, వీరేశలింగం "విచ్చుకత్తి"గా విహరించిన సంస్కరణఉద్యమాలకు పుట్టినిల్లు రాజమహేంద్రవరం. అన్యాయమైన పనులకు వ్యతిరేకంగా సాగిన తొలి ప్రతిఘటనకు నాయకత్వం ఈ సర్కారులదే. స్వాతంత్ర్యోద్యమంలో జైలుకు వెళ్ళిన తొలి మహిళ రావూరి మంగతాయారమ్మ ఈ ప్రాంతపు (చీరాల) మాణిక్యమే. మన్య విప్లవానికీ, తద్వారా భావి భారతంలో దోపిడీ దుర్మార్గాలపై విరుచుకుపడిన గిరిజనోద్యమాలకు ఊపిరిగా నిలిచిన అల్లూరి సీతారామరాజు అఖిలాంధ్ర ప్రజలకు "అభిరాముడు". జాతీయోద్యమ దినాలలో గాంధీ, చిత్తరంజన్‌దాస్, అలీ సోదరులు మెట్టిన విజయవాడ సభలు నాటి యువతరాన్ని త్యాగధనులుగా, ఆదర్శమూర్తులుగా తీర్చిదిద్దిన విజ్ఞాన ప్రభలు.

ఈ అడుగుజాడలలో నడిచి ఈ ప్రాంతంలో వివిధ రంగాలలో ప్రభవిల్లిన ప్రముఖులెందరో, ఎందరెందరో!!! వీరంతా కుల, మత, వర్గ వివక్షలకు, కక్షలకు దూరంగా, ప్రాంతీయ దురభిమానాలకు ఎడంగా ఉన్న 'అజాత శత్రువులు'. ఉత్తరాన గోదావరీ మండలం నుంచి దక్షిణాన నెల్లూరు మండలందాకా విస్తరిల్లిన బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, ఆత్మకూరి గోవిందా చార్యులు (అంగోస్త్రం ఆచార్యులు), సర్దార్ దండు సూర్యనారాయణ రాజు, కూర్మా రెడ్డినాయుడు, దువ్వూరి సుబ్బమ్మ, బులుసు సాంబమూర్తి, జమలాపురం కేశవరావు, కశీనాథుని నాగేశ్వరరావు, పట్టిభి, వీరపనేని గోపాలకృష్ణయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, ప్రకాశం, కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, తల్లావఝుల శివశంకర శాస్త్రి, బెజవాడ రామచంద్రారెడ్డి, వెన్నెలకంటి రాఘవయ్య, పుచ్చలపల్లి సుందరయ్య ప్రభృతులు ఆ రోజుకీ ఈ రోజుకీ ప్రాతఃస్మరణీయులు.

గోదావరి కృష్ణా ఆనకట్టల వాస్తు శిల్పిసర్ ఆర్థర్ కాటన్ సేవలను మరువలేము. కోస్తా రైతాంగానికి తెలంగాణాలో కొంత భాగానికీ ప్రాణధార లందిస్తున్న నాగార్జున సాగర్ సాధనలో భగీరథులై నిలిచిన వారు ముక్త్యాల రాజా, కె.ఎల్.రావు, మోటూరి సత్యనారాయణ, ఎన్.జి.రంగా.

సంగీతంలో పారుపల్లి రామకృష్ణయ్య, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, చిత్రకళలో దామెర్ల రామారావు, మొక్కపాటి, మాగోఖలే, నాట్యకళలో వేదాంతం, ఆంధ్రనాట్యంలో నటరాజ రామకృష్ణ, అభ్యుదయ చలన చిత్ర నిర్మాణంలో బి.ఎన్.రెడ్డి, గూడవల్లి రామబ్రహ్మం, నాటక రంగంలో గోవిందరాజుల సుబ్బారావు, స్థానం, బందా, మాధవపెద్ది, వేమూరి గగ్గయ్య, గరికపాటి రాజారావు, ఒజ్జబంతులయ్యారు.

జీవనదుల "క్షీరధారలు" జుర్రుకొని అటు కవనంలో, ఇటు కథనంలో, పలుకులో, పలుకుబడిలో తెలుగు వెలుగు లొలికించిన కవులు, సాహితీ మూర్తులు - తిరుపతి వేంకట కవులు, కృష్ణశాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి, విశ్వనాథ, త్రిపురనేని రామస్వామి, నండూరి సుబ్బారావు, బసవరాజు, చలం, కొడవటిగంటి, దాశరథి, హీరాలాల్ మోరియా, పాత్రికేయ ప్రభాకరులై సమకాలీన సమాజాన్ని చైతన్య మార్గానికి మళ్ళించిన సంపాదకులు ముట్నూరి కృష్ణారావు, కోటం రాజు రామారావు, కోలవెన్ను రామకోటేశ్వరరావు, మనికొండ చలపతిరావు, నార్లా వెంకటేశ్వరరావు. వీరందరికీ, ప్రచారభాగ్యానికి నోచుకోని మరెందరో అజ్ఞాత వీరులకూ, జ్ఞానవిజ్ఞాన ప్రదాతలకూ, జాతినేతలకూ ఈ శుభ ముహూర్తాన ఇవే మా నమోవాకాలు.

ఇంతగా రాజకీయంగా, సాంస్కృతికంగా, చారిత్రికంగా ఎంతో ముందడుగు వేసిన ఈ ఏడు జిల్లాలు (ఉభయగోదావరులు, కృష్ణా, ఖమ్మం, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు) అన్ని రంగాలలోనూ అప్పుడే పరిపూర్ణమైన అభివృద్ధిని సాధించేసాయని చప్పలేము. కోస్తాలో ఇప్పుడిప్పుడే లభ్యమౌతున్న పెట్రోలియం వనరులు, సహజ వాయువు వాణిజ్య ప్రయోజనాలకు పెద్దపెట్టున వినియోగంలోకి రాబోతున్నందున పరిశ్రమాభివృద్ధికి మరిన్ని అవకాశాలు పెరుగుతున్నాయి. ప్రతి నదీ మండలం ఒక 'మాంచెస్టర్' గా, ప్రతి జిల్లా ఒక 'హంబర్గ్'గా పారిశ్రామికంగా వైభవాన్ని చూడగల అవకాశాలు, వనరులు ఇక్కడ ఉన్నాయి. వాటిని సద్వినియోగం చేసుకోవడానికి జరిపే కృషిలో ప్రజలకు పత్రిక అండదండలుగా వుంటుంది. అలాగే పూర్తిగాని ప్రాజెక్టులూ, ఈ ప్రాంతంలో వున్నాయి. ఏలేరు రిజర్వాయర్ నిర్మాణం అలాగే ఉండిపోయింది. పోలవరం ప్రాజెక్టు పథకం ఇంకా బూజు దులుపుకొనే స్థితిలోనే వుంది! ఉభయ గోదావరులలోనూ, కృష్ణలోనూ డెల్టా ఆధునీకరణ పెద్ద ఎత్తున జరగవలసి వుంది. మురుగు నివారణ పథకాలు అమలు జరిపించుకోవాలి. పులిచింతలలో రిజర్వాయర్ ఇంకా అక్కరకు రాని ఆలోచనగానే, శంకుస్థాపన దశలోనే మిగిలివుంది. కృష్ణా బేసిన్‌లో జరిగినంత అభివృద్ధి కూడా గోదావరి బెసిన్‌లోనూ, పెన్నా బెసిన్‌లోనూ జరుగలేదు. సోమశిల పూర్తికావడానికి 38 ఏళ్ళు పట్టినా ఇప్పటికీ అన్ని కాలవల నిర్మాణం పూర్తికాలేదు. శిథిలావస్థలో వున్న అరవై ఏడేళ్ళనాటి కట్టడాల పునర్నిర్మాణం, కాల్వల అనుసంధానం ఇంకా జరగవలసే వుంది. పెన్నార్ డెల్టా ఆధునీకరణ ఎంతైనా అవసరం. పంట విస్తీర్ణం కూడా గోదావరి బేసిన్‌లోనే హెచ్చుగా వుంది కాబట్టి అక్కడి నదీలోయ ప్రాజెక్టుల నిర్మాణం త్వరలో పూర్తి చేసుకోగలిగితే, నదీ జలాలలో 65 శాతం వృథాగా పోకుండా చేసుకోవచ్చు. గంగ-కావేరీ అనుసంధాన క్రియకంటే ముందు గోదావరి బేసిన్‌లోని ఉపనదులను కూడదీసి, గోదావరి-కృష్ణ లింక్ కాల్వను కలిపి, "ప్రాంతీయ జల సమాఖ్య'ను రూపొందించ గలిగితే వ్యవసాయ భూములున్న విస్తీర్ణంలో 64 శాతం భూమికి పుష్కలంగా నీటి సౌకర్యం కల్పించవచ్చునని నిపుణుల అంచనా. మనసన్నది మనకుంటే ఎన్నయినా చేసుకోవచ్చు, చేయించుకోవచ్చు. ఇలాంటి చైతన్య స్రవంతికి పత్రిక నేతృత్వం వహించాలని ఉబలాటపడుతోంది. న్యాయమైన కోర్కెలసాధనలో ఉడుతా భక్తిగానైనా "ఊతకోల" గా ఉండాలని గాఢంగా అభిలషిస్తోంది. పౌర హక్కుల సాధనలో, రక్షణలో పత్రికది ధర్మ పక్షం, ప్రజలపక్షం. అందుకే ఇక పాఠకుల సరికొత్తబాణి, జననీ "ఆంధ్రభూమిశ్చ! స్వర్గాదపి, గరీయసీ!".

జూన్ 1, 1989

# మానవేతిహాసంలో మరపురాని మహద్ఘటన

ప్రపంచ చరిత్రలో స్వార్థపూరితమైన కోరికలకు "కోపు" కాసిన ఘట్టాలు కోకొల్లలు. బ్రిటన్‌లో మధ్య యుగాలలో వెలసిన "మాగ్నకార్టా"(హక్కుల పత్రం) రాచరికపు లేదా ఫ్యూడల్ శక్తుల స్వప్రయోజనాలకు, వారి అధికారాలకు పూచీపడిన తరువాతనే సామాన్య ప్రజల బాగోగులకు 'పిసరంత' విలువ యిచ్చింది. 1776 నాటి అమెరికా స్వాతంత్ర్య ప్రకటనకు విలువ - బ్రిటిష్ సామ్రాజ్య పెత్తనం నుంచి తన కాలనీలకు స్వేచ్ఛ సాధించడం వరకే పరిమితమైంది. ఆ మేరకు అవి ఇతర దేశాలను ప్రభావితం చేసి ఉండవచ్చు. కాని, ఎలాంటి అధికార దాహంతో నిమిత్తం లేకుండా, ప్రభువర్గాల ఇనుప చట్టాల క్రింద, వారికి అండదండలుగా నిలిచిన మతాధిపతుల మదమాత్సర్యాల వల్ల కుంగి, కృశించిపోతున్న ప్రజల విముక్తి కోసం - కేవలం మానవ హక్కుల కోసం, న్యాయం కోసం ఉద్యమించిన తొలి సంఘటిత మహావిప్లవం 1789 జూలై 14 నాటి ఫ్రెంచి విప్లవం. ఈ రోజు దాని ద్విశత జయంతి ఉత్సవాలు. మన తరంలో జరుపుకొంటున్న ఒక విలువైన మహోత్సవం ఇది. సకల దేశాలలోని బాల బాలికలకు "ఉగ్గుబాలు'గా అందివచ్చిన "స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాత్రం" అనే మూడు నినాదాలకు "మూలపుటమ్మ" ఫ్రాన్స్. ఆధునిక రాజకీయ చరిత్రకు అది ద్వారబంధం. కారణం లేని తోరణం ఉండదు. అకారణ విప్లవం ప్రపంచానికి తెలియదు! ఈ విషయంలో కారల్ మార్క్స్ తన మిత్రుడు రూజీకి రాసిన లేఖాంశాలు, పండిట్ జవహర్ లాల్ శ్రీమతి ఇందిరాగాంధీకి జైలునుంచి రాసిన ఉత్తరాంశాలూ ఫ్రెంచి విప్లవ పుట్టుపూర్వాలలోని కొన్ని మౌలికమైన సత్యాలను వెల్లడించాయి.

వ్యక్తిగాని, జాతిగాని సిగ్గుపడితేనే, దుస్సహమైన పరిస్థితులకు స్పందించగలిగినంత అవమాన భారంతో తీసుకున్నప్పుడు మాత్రమే తిరగబడతారనీ, అప్పుడే విప్లవం వస్తుందనీ అన్నాడు కారల్ మార్క్స్. అలాగే, ఎవరో ఉద్యమకారులు నడిపిస్తే విప్లవాలు వస్తాయని బుర్రలేని పాలకులు భావిస్తారు, కాని ప్రజానుకూలమైన భావాలూ, ఆర్థిక పరిస్థితులు మాత్రమే విప్లవాలకు కారణమన్నాడు నెహ్రూ. ఆర్థిక పరిస్థితులవల్ల జీవనం దుర్భరం అయినపుడే, దుస్సహమైనపుడే ఇవి పుట్టకొస్తాయనీ, అపుడు బలహీనుడు కూడా ప్రాణత్యాగానికి వెనుదీయడనీ నెహ్రూ అన్నారు. మానవుని కనీసావసరాలను తీర్చుకొనేందుకు, కనీస న్యాయం కోసం విప్లవించిన ఫ్రెంచి ఉద్యమంలో వేల సంఖ్యలో ప్రాణసుమాలు అర్పించింది పారిస్ నగరం. ఇతర విప్లవాలకూ (రష్యాలో 1917లో, చైనాలో 1948లో బోల్షివిక్కు విప్లవాలు వచ్చేవరకూ) ఫ్రెంచి విప్లవానికీ ఒక తేడాను నెహ్రూ గమనించాడు. సమస్యలపై అంతకుముందెన్నడూ లేని భావ సమైక్యత, నిర్దిష్టమైన ఆర్థిక కార్యక్రమం ఆధారంగా విప్లవ కార్యాచరణకు దిగడం - ఇదీ ఆ నూతనత్వం. కనుకనే ఫ్రెంచి విప్లవం మానవ జీవితంలో ఏ ఒక్క శాఖకో పరిమితం కాకుండా అన్ని రంగాలనూ - సాంఘిక, మత,

రాజకీయ, ఆర్థిక, నైతిక రంగాలన్నింటినీ స్పృశించ గలిగింది, శాసించగలిగింది. అదొక పెద్ద చిత్రపటం, నిలువెత్తు విగ్రహం.

కావడానికి అది 18వ శతాబ్దపు ఫ్రెంచి రాజకీయ, సామాజిక, ఆర్థిక వ్యవస్థను ఊగించి, శాసించిన విప్లవమే అయినా, రానున్న యుగాలలో కూడా మానవుల భాగ్యోదయానికి అవసరమైన "బ్లూ ప్రింట్"ను రెండు శతాబ్దాలనాడే సిద్ధపరచిన మహద్ఘటన. ఆ సువిశాల "వర్ణచిత్రాన్ని" భావితరాలకు సువర్ణ రేఖగా దిద్దితీర్చిన ఫ్రెంచి మేధావులు, పునరుజ్జీవనోద్యమ వైతాళికులూ ఒకరా, ఇద్దరా - ఎందరెందరో. వోల్టేర్, రూసో, డెడిరో, మాంటెస్క్యూ విప్లవ బీజాలకు భావ ప్రకాశకులుగా నిలబడితే, పారిస్ నగరంలోనేగాక, కుతకుత ఉడికిపోతున్న ఫ్రాన్స్ నలుమూలలా విప్లవానికి రాబ్స్‌పెరీ, మిరాబా, తామస్ పేనీ, కండోర్సెట్, మరాత్, డాంటన్‌లు సారథ్యం వహించారు. ఎన్నో పురిటి నొప్పుల తర్వాతగాని ప్రజలు కార్యరంగంలోకి దిగలేదు. రాచరిక వ్యవస్థతో విసిగి వేసారిన ప్రజలు సంస్కరణల కోసమే ఏళ్ళూ పూళ్ళూ ఎదురు తెన్నులు కాచారు. విప్లవానికి ఒక ఏడాది క్రితం వరకూ పిటిషన్లతోనే సరిపెట్టుకున్నారు. లూయీ చక్రవర్తి ఆగడాలకు సమాధానంగా స్టేట్స్-జనరల్ (అసెంబ్లీ) ద్వారా కోర్కెల పత్రాన్ని సమర్పించుకొన్నారు. కరవు కాటకాలగురించి వివరించారు. ఫ్యూడల్ ప్రభువుల ప్రత్యేక హక్కులు రద్దుకావాలని, క్రమానుగత పద్ధతిలో పన్నులు ప్రవేశపెట్టాలనీ, న్యాయవ్యవస్థను ప్రజలకు అందుబాటులో ఉంచాలని నినదిస్తూ రాజప్రాసాదానికి ఊరేగింపులు తీశారు. అయినా ఫలితం కనిపించనప్పుడే విప్లవానికి తెగించారు. నిత్యావసర సరకుల ధరలు, ముఖ్యంగా రొట్టె ధరలు చుక్కలనంటినప్పుడు రాజకీయ అస్థిరత్వం ముంచుకొస్తున్నప్పుడు, ఫ్రెంచి నగరాలన్నిటా లూటీలు జరిగాయి. బ్లాక్ మార్కెటీర్లను బజారుకీడ్చారు; పారిస్ విడిచి వర్సెల్స్‌లో కూర్చున్న చక్రవర్తి సైన్యాన్ని పంపాడు. అయినా విప్లవించిన ప్రజలు వెనుకాడలేదు.

ఈ పరిణామాలకు పరాకాష్ట. రాచరిక, భూస్వామ్య వ్యవస్థలు పెంచి పోషించిన నిరంకుశ శాసనాలకు, ధోరణులకూ, నిరంకుశ ప్రవర్తనకూ, దుర్మార్గాలకు ప్రత్యక్ష సాక్షిగా నిలిచిన బాసిలీ దుర్గాన్ని, జైలు కవాటాలను జూలై 14న బద్దలుకొట్టారు. ఖైదీలను విడుదల చేశారు. ఆ క్రోధంలో పారిస్ నగర మేయర్‌నూ, పోలీసు ఉన్నతాధికారులనూ చంపారు. ఆ విధంగా విప్లవం అరాచకానికీ, అభ్యుదయానికీ కూడా సంకేతమై నిలిచింది. ఫ్రెంచి విప్లవంపై సాధికార వ్యాఖ్యాతగా కార్లీల్ - విప్లవంలో అమానుష కాండను మాత్రమే చూడగా, ఆ దుర్ఘటనలకు దారిచూపిన రాచరికపు, ధనికవర్గ అరాచకాన్ని విప్లవానికి రెండవ ముఖంగా అనిబిసెంట్ చూపింది. ఫ్రెంచి విప్లవం గురించి రాస్తూ, ప్రభువర్గాలు, నిరంకుశాధికారులూ, చర్చి వర్గాలూ మూకుమ్మడిగా ప్రజలపై జరిపిన అమానుష కాండతో, దుర్మార్గాలతో పోల్చితే ఫ్రెంచి విప్లవంలో ప్రజలు ఇంకా చాలా ఓర్పు పట్టారనే భావించాలని ఆమె వ్యాఖ్యానించింది. ప్రజల కష్టాలతో పోల్చుకుంటే విప్లవ కాలంలో జరిగిన నష్టాలు లెక్కలోకి రావని చెప్పింది. నాడు (1789లో) పారిస్ ప్రజల మనోభావాలు అలా ఉన్నాయి. ఇందుకు అద్దంపడుతున్న ఆనాటి కారమగ్నోల్ కవిత ఇందుకో ఉదాహరణః "పెద్ద మనుషు లనుకుంటున్నవారిని ఎక్కడుంచాలో అక్కడుంచండి, చిన్నవాళ్ళకి పెద్ద పీట వేయండి, ఎక్కువతక్కువలొద్దు - ఎక్కడ చూచినా ఈ జీవిత బోధే కద్దు."

ఈ బోధలతోనే నాడు ఫ్రెంచి ప్రజలు జాతీయ శాసనసభ అయిన నేషనల్ అసెంబ్లీని, కమ్యూన్స్‌నూ, నేషనల్ గార్డ్స్‌నూ ప్రభావితం చేసుకున్నారు. మార్పును ఏ మాత్రం వ్యతిరేకించినా తమ ప్రతినిధులయినా సరే కొరత వేయడానికి ప్రజలు వెనుకాడలేదు. చివరికి వర్సెల్స్‌నుంచి పీఠం కదిలించి

లూయీ చక్రవర్తిని పారిస్‌కు బలవంతంగా తీసుకొచ్చి, రిపబ్లికన్ రాజ్యాంగాన్నే కాకుండా అంతకుముందు ప్రపంచ మానవాళికే పరమ పవిత్రమైన పత్రంగా భావించే "మానవ హక్కుల ప్రకటన"ను కూడా ఆమెదించేటట్టు చేసింది. ఈ కర్తవ్య సాధనలో పారిస్ మహిళలు చూపిన చొరవ, నాయకత్వం చరిత్ర పుటలలో చెరపరాని ఘట్టం. అసలు మహిళలే మొత్తం విప్లవానికి నాయకత్వం వహించి వుంటే చరిత్ర మరొకలా ఉండేదని లెనిన్ వ్యాఖ్యానించవలసి వచ్చింది. ఎందుకంటే పిటిషన్లద్వారా, వీలుకాకపోతే ప్రదర్శనలద్వారా నయానా, భయానా చక్రవర్తిని ఒప్పించి, రక్తపాతాన్ని సాధ్యమైనంతవరకూ తప్పించేందుకు ఓర్పుతో నాడు మహిళలు చేసిన ప్రయత్నం బహుధా ప్రశంసనీయం.

ఫ్రెంచి విప్లవం సాంఘిక, నైతిక, రాజకీయ, ఆర్థిక, సాహిత్య రంగాలలోనెలకొల్పిన సంప్రదాయాలు, సదాచారాలు, ప్రవేశపెట్టిన సంస్కరణలూ ఒకటి కావు, ఎన్నో, ఎన్నెన్నో. మళ్ళీ ఇందులోకూడా దేశ చరిత్రలకు శ్రీకారం చుట్టిన తొలి సన్నివేశాలు మరెన్నో!

ఫ్రెంచి విప్లవం తొలిసారిగా రాచరికాన్ని రద్దుచేసింది; అనేక "డిక్రీ"లద్వారా ఫ్రెంచి పబ్లిక్ జీవితాన్నే కొత్త పుంతలకు మళ్ళించి, యూరప్ ఖండంలోనూ ఇతరచోట్లా రాచరిక వ్యవస్థలలో కల్లోలం పుట్టించి, 'గర్భస్రావాలు' చేయించింది.; పార్లమెంటులో ఎగువ సభను (సెకండ్ ఛాంబర్) రద్దుచేసిన తొలి విప్లవం ఫ్రెంచి విప్లవం; ఆదాయ వనరులనుబట్టి అభ్యుదయకర పన్నుల వ్యవస్థకు శ్రీకారం చుట్టింది; పేద వర్గాలను పన్నుల భారంనుంచి మినహాయించింది; తల్లిదండ్రులు లేని అనాథలైన బాల బాలికలను దత్తం చేసుకొని వారి పోషణ భారానికి పూచీపడిన తొలి విప్లవం అది; జీవితంలో అనేకమంది ఒక బలహీన దశలో కాలుజారి అనాథలైన స్త్రీలను గౌరవించి రక్షణ కల్పించిన తొలి విప్లవం అది; అంతరాత్మ స్వేచ్ఛను గౌరవించిన, సార్వత్రిక నైతిక ధర్మాన్ని ప్రకటించిన తొలి విప్లవం అది; బానిసత్వాన్ని, నీగ్రో బానిస వ్యాపారాన్ని రద్దు చేసిన తొలి విప్లవం అది; వితరణకు, ప్రజా సేవ కార్యక్రమాలకు శాసనరూపం కల్పించిన తొలి విప్లవం అది; రైతుల రుణభారాన్ని రద్దుచేసిన మొదటి విప్లవం అది; వ్యభిచారవృత్తినిరద్దుచేసి, విడాకులను అనుమతించి, విడాకుల కాలపరిమితిని ఏడాదికి కుదించిన తొలి విప్లవం అది; మరణ శిక్షణను ఖండించిన మొదటి విప్లవం అది; అశ్లీల సాహిత్యాన్ని, చిత్రాలను నిషేధించిన తొలి విప్లవం అది; సమతా చర్యలు పూర్తిగా అమలులోకి వచ్చేవరకూ పేద రోగులకు ఆసుపత్రులలో ప్రత్యేక పడకలు పరిశుభ్రంగా ఏర్పాటు చేయిస్తూ డిక్రీ అమలుచేసిన తొలి విప్లవం అది; ప్రత్యేక "డిపార్ట్‌మెంట్స్" ద్వారా ఫెడరల్ వ్యవస్థను ఆచరణలోకి తెచ్చిన తొలి విప్లవం అది; ఫ్యూడల్ శక్తుల, నిరంకుశాధికారుల ప్రత్యేకాధికారాలను ఊడగొట్టిన తొలి శాసనమూ అక్కడిదే; ప్రపంచ చరిత్రలో రాజకీయ చిహ్నాలకు గుర్తింపు తెచ్చిన, తొలి త్రివర్ణ పతాకం అందించిన తొలి విప్లవం అది; స్వేచ్ఛా ప్రతిమనూ, "స్వేచ్ఛా వృక్షాన్నీ" (ట్రీ ఆఫ్ లిబర్టీ) ఇతర దేశాలకు పంచిన తొలి విప్లవం అది; ఫ్యూడల్ వ్యవస్థ రద్దుతోపాటు భూ సంస్కరణలకు పరిమిత స్థాయిలోనే అయినా నాడే ఆశీస్సులు పలికిన తొలి ప్రపంచ విప్లవం అది; గుత్తాధిపతులను, గిల్డునూ రద్దుచేసిన తొలి విప్లవం అది; ప్రజాభిప్రాయాన్ని మలిచే పత్రికలకు స్వేచ్ఛ ప్రసాదించి సెన్సార్ షిప్‌ను రద్దుచేసిన తొలి విప్లవం అది; మత స్వేచ్ఛను అనుమతిస్తూనే ప్రభుత్వ వ్యవస్థను సెక్యులర్ రాజ్యంగా ప్రకటించి, మైనారిటీల రాజకీయ హక్కులను గౌరవించిన తొలి విప్లవం అది; ఆధునిక ప్రజాస్వామిక వ్యవస్థలకు తొలిమెట్టుగా ఉన్న సార్వత్రిక వోటు హక్కును గుర్తించిన తొలి విప్లవం అది; మొదటి సారిగా కొత్త కొలమానాలు ప్రవేశపెట్టి, మెట్రిక్ వ్యవస్థను ఆచరణలోకి తెచ్చిన తొలి

విప్లపమూ అదే; న్యాయ వ్యవస్థను సమూలంగా సంస్కరించి నూతన శిక్షాస్మృతిని రచించి, తొలి స్వతంత్ర న్యాయ వ్యవస్థను నెలకొల్పిన తొలి విప్లవమూ అదే.

ఇన్ని సంస్కరణలకు తల్లివేరుగా, భావితరాల భాగ్యోన్నతికోసం "తొలిపూజలు" చేసిన ఈ ఫ్రెంచి విప్లవాన్ని రిపబ్లిక్ రాజ్యాంగ రచయితలలో ఒకరైన కండోర్సెట్ వర్ణించిన తీరును గమనించండిః "ఒకే ఒక్క ఘట్టంతో, జూలై ఫ్రెంచి విప్లవంతో - నేటి మానవునికీ, రేపటి మానవునికీ మధ్య ఒక శతాబ్దం ఆవిష్కరించుకుంది. జాంబవంతుని అంగలా, కాలం వేగాన్ని పుంజుకుంది!" ఈ యుగం యూరప్‌ను కకావికలు చేసింది; లాటిన్ అమెరికాకు ఫ్రెంచి విప్లవ భావాల వ్యాప్తి అక్కడి విమోచనోద్యమాలకు ఉద్దీపన కలుగజేసింది; రూసోభాషకు బోలివార్ లొంగిపోయాడు! విక్టర్ హ్యూగో నవలలు మత్తెక్కించాయి. కవిత్వంలో, కరపత్ర రచనలో, చిత్రకళలో ఫ్రెంచి విప్లవం "ఎత్తువారి చేతిబిడ్డయి" వింత సోయగాలు పోయింది! సింబాలిజం, సురియలిజం, క్యూబిజం - కళాజగత్తులోని ప్రతికదలికనూ అది శాసించింది; వర్డ్స్‌వర్త్, హాజ్‌లిట్, కోల్‌రిడ్జ్ కవులను ప్రభావితం చేసి, ఖండాంతరాలుదాటి తెలుగు కవులను కూడా "కాల్పనికోద్యమా"నికి మళ్ళించిన ఘనత ఫ్రెంచి విప్లవ సంప్రదాయానిదే. ఎన్నెన్నో అగ్ని కణాలను ప్రసవించిన ఆ విప్లవం - 1789 జూలైలో పుట్టి 1794 జూలైనాటికే, అయిదేళ్ళలో వీగిపోవడానికి కారణం, విప్లవకారులు చీలుబాటలలో ప్రయాణించడమే. "ఈ ద్రాక్షరసం, ఈ 'వైన్' నా రక్తంగా మారితే, దాన్ని స్వేచ్ఛ, సమానత్వాలకే ధారపోస్తా"నని ("Where this wine, my blood, I would drain it to liberty and equality") ప్రతిన బూనిన వీరులలో కొందరు ముఖ్యులు (మహావక్త మిరాబా ఒకడు) పాత ప్రభువుల పంచజేరి ఫ్రెంచి విప్లవాన్ని మధ్యలోనే ముంచారు. మధ్యతరగతి నాయకత్వానికి మధ్యలో పుట్టిన ఈ పుండు మొత్తం రిపబ్లిక్ ఆశయాలకే ఎసరు పెట్టింది. అయినా అగ్నికి చెదలంటుతుందా? విప్లవాదర్శాలు చెక్కుచెదరలేదు! కనుకనే ఈ రోజుకీ ఆ విప్లవానికి అంతటి ప్రాధాన్యం. "మానవ హక్కుల ప్రకటన" జ్ఞప్తికి వచ్చినన్నాళ్ళు, ఈ ప్రపంచంలో తన సంకెళ్ళు తెంచుకొనే ఆఖరి మానవుడు సజీవుడై ఉన్నంతకాలం, అడుగడుగునా మానవ హక్కులకు ఆధునిక ప్రభుత్వాలు కూడా విఘాతం కల్గిస్తున్నంతవరకూ - "ఫ్రెంచి విప్లవం", దాని ఆశయ ఆదర్శాలు చిరంజీవులై వర్ధిల్లుతూంటాయి!

జూలై 14, 1989

# నెల్సన్ రోలిహాలా! గుండె గుండెలో 'మండేలా'....!

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు సులువైన రహదారులుండవని పండిట్ నెహ్రూ చెప్పాడు! ఈ మాట ఎంత సత్యమో, సుమారు 20 ఏళ్ళ వ్యవధిలో పుట్టి పెరుగుతూ వచ్చిన భారత జాతీయ కాంగ్రెస్, దక్షిణ ఆఫ్రికా నేషనల్ కాంగ్రెస్ బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి, తెల్లవాళ్ళ జాత్యహంకారానికి, దుర్మార్గ పరిపాలనకు వ్యతిరేకంగా సాగిస్తూ వచ్చిన స్వాతంత్ర్య సమరాలు నిరూపించాయి. రేపోమాపో జరుగనున్న నెల్సన్ రోంహోలా మండేలా విడుదల ఒకవ్యక్తి కృషి ఫలితంకాదు, ఒక వ్యక్తి ప్రయోజనం కోసం కాదు. నవ ఆఫ్రికా నిర్మాణం కోసం. 80 ఏళ్ళుగా దక్షిణాఫ్రికా నల్లజాతి ప్రజలు, తదితర రంగు జాతుల ప్రజలు మైనారిటీ తెల్లజాతి ప్రభుత్వంపైన, దాని వర్గ, వర్ణ వివక్షా విధానాలపైన సాగిస్తున్న సమష్టి పోరాటానికి, సాయుధ పోరాటానికి అంతిమ విజయం మండేలా విడుదల; అది యావత్తు ఆఫ్రికా ప్రజలకు సంతోష సంబరం; నాడు దక్షిణాఫ్రికా ఇండియన్ల తరపున రాజకీయ పోరాటం సాగించిన (స్మట్స్ చట్టాలకు వ్యతిరేకంగా) గాంధీజీకి కేంద్రమైన డబ్లిన్ అహింసాయుత సాత్వీక ప్రతిఘటనోద్యమాన్ని, సత్యాగ్రహాన్ని ప్రసాదించగా, మండేలా సారధ్యంలో కేప్‌టౌన్, క్లిప్‌టౌన్ నగరాలు దక్షిణాఫ్రికా నల్లజాతి ప్రజల స్వాతంత్ర్య సమరానికి సాయుధ పోరాట కేంద్రాలుగా మారాయి. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ అర్థశతాబ్దం వరకు (1961వరకు) జాత్యహంకార ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాత్వికంగానే పోరాడుతూ వచ్చింది. అహింసనే పరమ ధర్మంగా నమ్ముతూ వచ్చింది. అయినా స్మట్స్, వెర్‌వోర్డ్, వోర్‌స్టర్, బోతాలవంటి జాత్యహంకార పాలకులు నమ్ముకున్నది మాత్రం తుపాకీ గొట్టాన్ని, సైనిక శక్తిని మాత్రమే! కనుకనే అంతవరకు పిటిషన్లతో, సమ్మెలతో, సాధారణ ఉద్యమాలతో, రాయబారాలతో, చర్చలతో అహింసాయుతంగా సాగుతున్న ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ ఉద్యమం సాయుధ పోరాటాన్నే ఏకైక సాధనంగా చేసుకుంది. ఈ ఉద్యమానికి నాయకత్వం వహించదలచిన నేషనల్ కాంగ్రెస్ ప్రత్యేక సదస్సుద్వారా ముప్పయిదేళ్ళనాడే సమరశీల స్వేచ్ఛాపత్రాన్ని రూపొందించింది. ఈ రూపకల్పనలో ప్రధాన శిల్పులులో లుతూలీ, సిసులూ, నెల్సన్ మండేలా, ఆలివర్ టాంబో. దక్షిణ ఆఫ్రికా సమస్యను అర్థం చేసుకోవాలంటే 'మాలపల్లి చట్టాలు' అర్థం అయి ఉండాలి. అంటే 'వెలివేత' చట్టాలు తెలిసి ఉండాలి. దక్షిణాఫ్రికా సమస్య మన దేశంలో కుల,వర్గ వ్యవస్థలాంటిదే! పాస్‌లాస్, రేస్‌లాస్ లేకుండా తెల్లజాతి మైనారిటీ ప్రభుత్వం పరిపాలించే స్థితి పోయింది. మనుషులను చీల్చినట్టే భూములనూ చీల్చారు, జాతులను చీల్చినట్లే నీతులనూ చీల్చారు. తెల్లవాడికొక నీతి, మెజారిటీ నల్లజాతి ప్రజలకొకరీతి. నల్లవాళ్ళను విద్యకు దూరం చేశారు. ఉద్యోగానికి దూరం చేశారు. ఈ దారుణ నిరంకుశ విధానాల ఫలితమే, వర్గ, వర్ణ వివక్ష ఫలితమే నెల్సన్ మండేలా లాంటి నాయకుల ఆధ్వర్యాన సాగుతున్న నేషనల్ కాంగ్రెస్ సాయుధ పోరాటం. ఈ పోరాటం తెల్లవాడు స్వార్థంకోసం

బలవంతాన రుద్దినదే కానీ, నల్లవాడు కావాలని నెత్తిపైకి తెచ్చుకున్నది కాదు. అందుకే ఒకప్పుడు మండేలా అన్నాడు : "బుద్ధి ఉన్నవాడు ఎవడూ కావాలని జైలుకి వెళ్ళడు. నా జీవితంలో సంభవించినట్లే ప్రతివారికి ఒక్కో సమయం వస్తుంది - సాధారణ జీవితాన్ని సాగనివ్వకుండా, ఆ హక్కును అనుభవించనివ్వకుండా ప్రభుత్వం మనిషిని ఎప్పుడు దూరం చేస్తుందో, అప్పుడు ఆ మనిషి బహిష్కృతుడుగా, 'నేరస్థుడు'గా పైకి జీవించాల్సి వస్తుంది. అటువంటి చట్టాలను చేయడం ద్వారానే ప్రభుత్వం పౌరులను హింసా మార్గానికి నెడుతుంది." ఈ జీవన సత్యం తెలిసిన మండేలా మనందరి గుండెలు కూడ మండేలా ఒక ప్రకటన చేశాడు! ఆ ప్రకటన ఫ్రీడమ్ ఛార్టర్ వెలువడినప్పుడే చేశాడు. ప్రజల మధ్య ఉన్నప్పుడూ కూడా ఆ ప్రకటనకే కట్టుబడి ఉన్నాడు: "మీతో భుజం భుజం కలిపి ఈ ప్రభుత్వంతో పోరాడుతాను, అంతిమ విజయం సాధించేవరకూ పోరాడుతాను. మీరూ తేల్చుకోండి. ఏమి చేయబోతున్నారో. ఈ పోరాటంలో మీరు కూడా నాతో కలిసి వస్తారా, లేక మన ప్రజలందరి ఆశయాలను, ఆదర్శాలను కాలరాచేందుకు కాచుకుకూర్చున ఈ ప్రభుత్వ దమనకాండతో సహకరించదల్చారా? ప్రజల, మన ప్రజల జీవన్మరణ పోరాటంలో ఏమీ పట్టనట్టుగా ఎవరికి వారు తటస్థంగా ఉండిపోదల్చారా? నా మట్టుకి నేను తిరుగులేని నిర్ణయం చేసుకున్నాను - నేను దక్షిణాఫ్రికాను విడిచిపోయేదిలేదు, ప్రభుత్వానికి లొంగిపోయేదిలేదు...... నా జీవితమంతా పోరాడాను, ఇంకా పోరాడుతున్నాను, నా ఆఖరి శ్వాసవరకూ పోరాడుతూనే ఉంటాను. దక్షిణాఫ్రికా చరిత్రలో ఒక నూతన శకం ప్రారంభం కాబోతుంది."

ఆ 'నూతన శకం' ప్రారంభం కావడమే కాదు. ప్రజల త్యాగాల మధ్య లక్షలాది వీరుల రక్తతర్పణ మధ్యనే సజల నేత్రాలతో ఆ సమరానికి ఒక అందమైన ముగింపు కూడా రాబోతూంది! తన జీవితంలో సుమారు సగభాగం ఏకబిగువున జైలు జీవితం గడిపిన నెల్సన్ మండేలాకు ప్రపంచ రాజకీయ నాయకులలో ఉజ్జీగా చెప్పుకోదగినవాడు, భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో బహుశ ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ ఒక్కడే. ఆయన అయినా మొత్తంమీద 26 సంవత్సరాల జైలు జీవితం గడిపినాడే కాని వరుసగా 26 సం॥లు గడిపినవాడు మాత్రం కాదు. దక్షిణాఫ్రికా స్వాతంత్ర్య పోరాటంలో మండేలా జీవితాన్ని దిద్దితీర్చడంలో ఆయనను ప్రభావితం చేస్తూ వచ్చినవి జాత్యహంకార నిర్బంధ చట్టాలూ, దమనకాండ మాత్రమే కావు, గాంధీజీ సత్యాగ్రహోద్యమాలు, నెహ్రూ 'యూనిటీ ఆఫ్ ఇండియా', జాత్యహంకార ప్రభుత్వనేత 'స్మట్స్' మురికివాడల బిల్లుకి వ్యతిరేకంగా సాత్విక ప్రతిఘటనోద్యమానికి నాయకత్వం వహించిన తమ సహచరులు ఇస్మాయిల్ మోర్, జె.ఎన్.సింగ్, నేటాల్ గాంధేయవాది మోతీ నాయకర్, ట్రాన్స్‌వాల్ కమ్యూనిస్టు నాయకుడు యూసుఫ్ దాదూల ప్రభావం కూడా ఉంది. తన ఉద్యమాన్ని నడిపించడంలో మండేలా అన్ని ప్రపంచ ఉద్యమాల ప్రభావానికి లోనయ్యాడు. దక్షిణాఫ్రికాలో నిషేధిత రాజకీయ పక్షాలలో ఒకటైన దక్షిణాఫ్రికా లిబరల్ పార్టీ నాయకుడు ఎడ్డీ డేన్నియల్స్ కోర్టులో ఒక వాఙ్మూలం సందర్భంగా మండేలాను ఇలా వర్ణించాడు: "తను రాజుల్నీ ఒప్పించగలడు, పేదల్నీ ఒప్పించగలడు....' ' ఉద్యమానికి కత్తులు నూరుకోవడంలో మండేలా - బిడిల్ హార్ట్, క్లాజ్‌విజ్, మావోసేటుంగ్, షేగునేరాల యుద్ధ వ్యూహరచనలను, ఎత్తుగడలనూ ఆపోశనం పట్టాడు. అందుకే మండేలా ఏనాడూ తన జీవితమే ఒక పోరాటంగా భావించకుండా "పోరాటమే తన జీవితం"అని ప్రకటించాడు. (ఆయన రాసిన పుస్తకం పేరు కూడా అదే.) వెనుక 'విద్రోహ' నేరం పేరిట డ్రీఫస్‌ను 'డెవిల్స్‌దీని'లో పెట్టారట. అలాగే మండేలాను ప్రజలనుంచి దూరం చేయడానికి ఒక చోట కాదు. పలుచోట్లకు, కాకులు దూరని కారడవులకు మార్చారు!

భారత జాతీయ ఉద్యమంలో నైనిటాల్, ఆగాఖాన్ ప్యాలస్, కడలూర్, అహమ్మద్‌నగర్‌ఫోర్ట్ ఎలా మన జాతీయ నాయకులకు ప్రసిద్ధ ఖైదులుగా, రాజకీయ పాఠశాలలుగా మారాయో, అలాగే దక్షిణాఫ్రికాలో ప్రిటోరియా, రాబెన్ ఐలాండ్, పోల్స్‌మూర్ జైళ్ళు మండేలాకు రాజకీయ పోరాట కేంద్రాలుగా మారాయి. ఐనా జాత్యహంకార ప్రభుత్వాలు ఇన్నేళ్ళుగా దేశవ్యాప్తంగా సాగుతున్న ప్రజా పోరాటాలను అణచలేకపోయాయి. ఫలితం - షార్ప్‌విల్లీ, సొవేట్లో, బ్రాడ్‌ఫోర్డ్, కేప్‌టౌన్, నేటాల్, ట్రాన్స్‌స్కీ, కేప్ కేంద్రాల ప్రజలు లక్షలాదిగా తిరగబడ్డారు. రాష్ట్రాల్లో రక్తతర్పణ జరిగింది, మైనారిటీ శ్వేతపత్రానికి 'రక్తస్రావం'జరిగింది! దేశాల సమస్యలకు సరిహద్దులుండవు. ఇక్కడ గిరిజనుల భూములను గిరిజనేతరులు ఆక్రమించుకున్నట్టే అక్కడ దక్షిణాఫ్రికాలో నల్లజాతివారి భూములను తెల్లజాతివాళ్ళు ఆక్రమించుకొని కులుకుతున్నారు! ఈ కులుకు రంగుజాతివారి గుండెల్లో ములుకుగా మారి మంటలుగా చెలరేగి 'మండేలా'లుగా-మారి సాయుధ పోరాటం కంటికి కన్ను పంటికి పన్నుగా మారింది! దేశాన్ని ఆక్రమించి మైనారిటీలో కూర్చున్న తెల్లవాడు 'బుద్ధిమంతుడ'య్యాడు. తమ సర్వస్వాన్నీ కోల్పోతున్న నల్లజాతివారు, పోరాటంలో ఉన్న ఇతర రంగుజాతులవారూ 'కుట్రదారు'లయ్యారు! మన జాతీయోద్యమ కాలంలో బ్రిటీషు సామ్రాజ్యవాదులపై ధ్వజమెత్తిన విప్లవకారులపై కాన్పూర్, కాకోరి, చిటగాంగ్ కుట్ర కేసులు పెట్టినట్టే, ఆంధ్రప్రదేశ్‌లో గిరిజన భూములను రక్షించుకోవడానికి, వారికి దక్కించడానికి విప్లవించిన కార్యకర్తలను కుట్రదారులుగా మార్చి, పార్వతీపురం, రామ్‌నగర్ కుట్ర కేసులు పెట్టినట్టే జోహన్స్‌బర్గ్, సొనెటో, షార్ప్‌వెల్లీ కుట్ర కేసుల పేరిట ఒకఅర్ధ శతాబ్దంగా వేలాదిమంది ఆఫ్రికా నేలతల్లి బిడ్డలను తెల్లవాడి ప్రభుత్వం జైళ్ళలో కుక్కింది, అనేకమందిని ఉరితీసింది. మండేలా, సిసులూ ప్రభృతులను ప్రజలనుంచి దూరం చేసి నిర్బంధించింది. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్‌లోనే చీలికలు తేవడానికి ప్రయత్నించింది. విద్రోహ కేసులు మోపి విచారణలు జరిపింది. "ట్రయల్ ఆఫ్ డిఫైయన్స్ పేరిట తప్పుడు కేసులు బనాయించింది. పీటర్ మోరెజ్‌బర్గ్, జూలూలాండ్, పోండోలాండ్ మొదలైన ప్రాంతాలనుంచి వేలాదిమందిని ఈ కేసులలో ఇరికించింది. కమ్యూనిస్టుల అణచివేత పేరిట, టెర్రరిస్టుల అణచివేత చాటున మన నేషనల్ సెక్యూరిటీ చట్టం లాంటి ఆంతరంగిక భద్రతా చట్టాలను కుప్పలుగా చేసింది! వీటన్నింటిని ప్రతిఘటిస్తూ ఉద్యమాన్ని చంద్రవంక దశనుంచి సంపూర్ణ చంద్రుని దశ వరకూ, ప్రచండ తేజస్సుతో ప్రకాశించే అరుణోదయం వరకూ పెంచుతూ, తాము పెరుగుతూ వచ్చినవాళ్ళు - మండేలా, సిసులూ, డమానోక్సి, మైకేల్ స్కార్ట్, బ్రాన్‌ఫిషర్, మోపెట్లా మోఫ, లిలియన్ నోయీ, అహమ్మద్ తిమోర్ (యువ భారతీయుడు).

ఈ మండేలా ప్రభృతులందరూ తెల్లజాతి ప్రజలకు వ్యతిరేకంగా ఉద్యమించిన స్వార్థపరులు మాత్రం కారు. తెల్లవారితోసహా ఆఫ్రికన్ల అందరి సమష్టి సంక్షేమాన్ని కోరుకున్న వీరులు, మహానాయకులు. ఈ రోజుకీ ఈ విషయమై ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్‌లో మిలిటెంట్లకూ, సామరస్యవాదులకూ మధ్య సాగుతున్న కీచులాటలు కూడా దక్షిణాఫ్రికా సంపూర్ణ స్వాతంత్ర్య ప్రకటనకు, మెజారిటీ ప్రభుత్వ స్థాపనకూ ప్రతిబంధకంగానే ఉన్నాయి. దీనికి తోడు దక్షిణాఫ్రికా స్వాతంత్ర్య సమరానికి, అదే తెల్లజాతి ప్రభుత్వ నిర్బంధకాండకు గురిఅవుతూ వచ్చిన నైరుతి ఆఫ్రికా (నమీబియా) ప్రజలకూ మధ్య ఏర్పడిన అనుబంధం కూడా తెల్లవాడికి కంటకంగానే మారింది. ఇరుగుపొరుగు మొజాంబిక్, అంగోలా, జాంబియాలాంటి అగ్రగామి సహాయక దేశాలకు, నేషనల్ కాంగ్రెస్‌కు మధ్య ఏర్పడిన సంబంధాలు కూడా తెల్లవాడి మెడకు ఉచ్చుగా మారాయి. అయినా నేషనల్ కాంగ్రెస్‌లో చీలుబాటలను తెల్లవాడు అవకాశంగా తీసుకొని

దశాబ్దాలుగా నాటకమాడుతూ ఎప్పటికప్పుడు మండేలాను విడుదల చేస్తున్నట్లు ప్రకటనలు చేయడమేగాని విడుదల చేయడంలేదు. బోతాపోయి డీక్లెర్క్ అధికారంలోకి వచ్చినా ఇదే పరిస్థితి కొనసాగుతూ వచ్చింది. ఎమర్జన్సీ ఎత్తివేయలేదు. కాని నేషనల్ కాంగ్రెస్‌పైన నిషేధాన్ని తొలగించాడు. దానితోపాటు పాన్ ఆఫ్రికన్ కాంగ్రెస్, దక్షిణాఫ్రికా కమ్యూనిస్టు పార్టీలపై కూడా నిషేధం తొలగించాడు. అయితే ఎమర్జన్సీ మాత్రం అలాగే ఉంచాడు. అందుకే ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ తన సాయుధ పోరాటాన్ని నిలిపివేయడానికి నిరాకరిస్తోంది. ప్రవాసంలో ఉన్న నేషనల్ కాంగ్రెస్ మిలిటెంట్లు బయటకు వస్తే మళ్ళీ నిర్బంధకాండ పురివిప్పుకోదన్న గ్యారంటీ తతంగం కూడా ఇదే. అందుకనే యావజ్జీవ ఖైదీగావున్న మండేలా కూడా తెల్లవాడి మనస్సేదో స్పష్టం కానంతవరకు తాను విడుదలయ్యే ప్రసక్తి లేదంటున్నాడు. వీర పూజను ప్రపంచం మానుకోలేదు. 1962 నుంచి కటకటాల మధ్యనే మగ్గుతున్న మండేలాకు రోమ్, గ్లాస్కో, ఒలింపియా, అబర్డ్ తదితర ప్రపంచ నగరాలన్నిటా గౌరవ పురస్కారాలు లభిస్తున్నాయి. సోషలిస్టు దేశాలు, ఇండియా ఆశీర్వదించి, ఆహ్వానించాయి. ఫ్రీడమ్ ఛార్టర్‌తోపాటు, 'ఉమెన్స్ ఛార్టర్'కు రూపకల్పన చేసి మహోద్యమాలు నిర్మించిన సిసులూ భార్య అల్బర్టనీ, మండేలా సతీమణి విన్నీని 'దక్షిణాఫ్రికా మాతృమూర్తులు'గా ప్రజలు ప్రకటించుకుంటున్నారు. ప్రతి తప్పుడు కేసు, ప్రతి కోర్టు విచారణా మండేలాకు ఒక ఆటవస్తువుగా, క్రీడారంగంగా మారాయి. బాధల మధ్య చతురతను కూడా ప్రదర్శించాడు. ఒకకోర్టు విచారణలో అతను ప్రాసిక్యూషన్ వారితో సంభాషిస్తూ "ఈరోజు మాకు చాక్‌లెట్ ఇవ్వబోతున్నారా? వెనీలా ఇవ్వబోతున్నారా?" అని సరదా చేశాడు. అంతేకాదు, స్వాతంత్ర్య సమర వీరుల విడుదల బేషరతుగా జరగాలేగానీ షరతులు కూడవని భావించినవాడు మండేలా. అందుకే అతను "స్వేచ్ఛ పొందిన వీరులు మాత్రమే సంప్రదింపులలో పాల్గొనగలుగుతారు. ఖైదీలెప్పుడూ శత్రువులతో కాంట్రాక్టులకు దిగరు. నా స్వేచ్ఛ, ప్రజల స్వేచ్ఛ, విడదీయరానిదీ, విభజించరానిదీ. అనుబంధం ఆంక్షలకు అతీతం. ("Only free men can negotiate, prisoners cannot enter into contracts") అని ఏనాడో దండరా వేశాడు! ఏక నాయకత్వం ఏ పార్టీలో అయినా నిరంకుశత్వానికి దారితీస్తే బహునాయకత్వం అరాచకత్వానికి మార్గాలు వేస్తుంది. 70 ఏళ్ళ దక్షిణాఫ్రికా ప్రజల పోరాటం, ఆ ప్రజల వాణి, ఆ వీరుల, వీర నారీమణుల త్యాగాలు, ఆ సమరశీల శక్తి వృధాపోకుండా ఉండాలంటే ఇప్పటికైనా ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్‌లోని అన్ని గ్రూపులు ఒకే మాటగా, ఒకే బాటగా ముందుకు సాగాలి. అంతవరకూ మండేలా ప్రభృతుల విడుదల ఎప్పటికప్పుడు ఎండమావులుగానే ఉండవలసివస్తుంది! ఆఫ్రికన్ విప్లవ రచయిత్రి నోమూసా జాబో ఎలుగెత్తి చాటినట్లు మహోద్యమాలపట్ల, త్యాగాలపట్ల కావలసింది కడివెడు కన్నీళ్ళు కావు, దోసెడు సానుభూతికాదు, కావలసిందల్లా లక్ష్యసాధనకోసం పోరాటం, నిరంతర పోరాటం. (No time to grieve/ for, the struggle continues to continue/There is no time for tears)!!

ఆదివారం ॥ ఫిబ్రవరి 1990

# గోర్బచేవ్ విధానాలు : పశ్చిమరాజ్యాల జూదం!

తూర్పు యూరప్‌లో కమ్యూనిస్టు (సోషలిస్టు) వ్యవస్థను కూల్చివేస్తూ వచ్చిన పరిణామాలనుంచి ఎలాంటి గుణపాఠాలు నేర్చుకోవచ్చునని "ఇలస్ట్రేటెడ్ వీక్లీ" ప్రత్యేక ప్రతినిధి ప్రసూన్ భూమిక్ దక్షిణాఫ్రికా నీగ్రో నాయకుడు, ప్రపంచంలో దీర్ఘకాల రాజకీయ ఖైదీగా ఉండి, విడుదలైన నెల్సన్ మండేలాను ప్రశ్నించినప్పుడు, మండేలా ఇచ్చిన సమాధానం ఇదిః "తూర్పు యూరప్ పరిణామాల గురించి పశ్చిమ రాజ్యాలు కనబరుస్తున్న అతి ఆసక్తి, లేదా కలవరం మనకు అనవసరం. సోషలిస్టు వ్యవస్థలో తీవ్రమైన లోటుపాట్లు చోటుచేసుకున్నాయని నిజాయితీతో అంగీకరించి ధైర్యంగా చెప్పగలిగిన ఏకైక ప్రపంచ నాయకుడు గోర్బచేవ్. ఈ సత్యాన్ని పశ్చిమ రాజ్యాలు మరిచిపోతున్నాయి. కాని, సామ్రాజ్యవాద విధానాలను అనుసరించి ప్రపంచ దేశాలను తమ వలసలుగా దిగజార్చి, వలస దేశాల ప్రజలను దారుణంగా అణచడంద్వారా ఘోరమైన తప్పు చేశామని అంత ధైర్యంగానూ, అంత శక్తివతంగానూ ప్రపంచ ప్రజల ముందు చెప్పగల దమ్ములున్న నాయకుడు పశ్చిమ దేశాలకు లేడని గ్రహించాలి." సోవియెట్ అధినేత గోర్బచేవ్ గురించిన మండేలా అంచనాతో ఏకీభవించని ప్రగతి కాముకులు, సంస్కరణ ప్రియులూ ఉండరు. ప్రపంచంలో ప్రథమ సోషలిస్టు రాజ్యమైన సోవియెట్ సోషలిస్టు రిపబ్లిక్‌ను నామరూపాలు లేకుండా చేయడానికి హిట్లర్ ఒక దృష్టితోనూ, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్‌లు వేరొక దృష్టితోనూ ముందుకు దూకి చతికిలబడవలసివచ్చింది. లెనిన్-స్టాలిన్‌ల సమష్టి నాయకత్వం తొలి సోషలిస్టు రిపబ్లిక్ ఉనికిని కాపాడడమే గాకుండా ప్రపంచంలో బలమైన పారిశ్రామిక సాంకేతిక శక్తిగా రష్యాను అగ్రరాజ్య స్థానంలోకి నెట్టగలిగింది. ఆ వారసత్వాన్ని కాపాడే బాధ్యత తరువాత అధికారానికి వచ్చిన సోవియెట్ నాయకత్వానిది కావాలి. కాని, సోషలిజాన్ని నిర్మించే దశలో కొన్ని చారిత్రక పరిస్థితులలో (అనివార్యమైనా తప్పు తప్పే) ప్రజాస్వామిక విలువలను స్టాలిన్ దెబ్బతీస్తే, ఆ తరువాత వచ్చిన కృశ్చేవ్, బ్రెజ్నేవ్, అంద్రపోవ్ నాయకత్వం సోషలిస్టు వ్యవస్థను సంస్కరించబోయి - ప్రజాస్వామిక విలువలను ఆధునీకరించబోయి - అసలు సోషలిస్టు వ్యవస్థనే అభాసుపాలు చేస్తూ వచ్చారు. గ్లాస్‌నాస్త్, పెరిస్త్రోయికా ఉద్యమంతో ఇందుకు మరికొంత దోహదం చేస్తున్నవారు గోర్బచేవ్. ఈయని హయాములో ప్రారంభమై కొనసాగుతున్న "ప్రజాస్వామ్యీకరణ" విధానాలు మొత్తం తూర్పు యూరప్‌లోని సోషలిస్టు దేశాలలోని కమ్యూనిస్టు నాయకత్వాలకు ఉద్వాసన చెప్పించడమేగాక, సోవియట్ యూనియన్‌లోనూ, బాల్టిక్ రిపబ్లిక్స్‌లోనూ కూడా వెర్రితలలు వేయడానికీ, మొత్తం సోషలిస్టు వ్యవస్థ ఉనికినే ప్రశ్నించడానికి మార్గం తీసాయి. "సంస్కరణల"లో "ప్రజాస్వామ్యం"లో పదడుగులు ముందుకు వేయాలని, పూర్తి ప్రయివేట్ రంగానికి ఆర్థిక వ్యవస్థను మార్చాలనీ భావించే వర్గాలకూ, స్టాలినిజం నాటి ప్రణాళికాబద్ధమైన కేంద్రీకృత ఆర్థిక

వ్యవస్థనే కాపాడుకోవాలని కోరే "ఛాందసుల"కూ మధ్యేమార్గంగా గోర్బీ ప్రవేశపెట్టదలచిన ఆర్థిక విధానం సోషలిస్టు ఆర్థిక సూత్రాలకు భిన్నంగా నడుస్తోంది. "ప్రజాస్వామిక విలువల"ను కాపాడగోరే గోర్బచేవ్ దేశాధినేతగా "ఎగ్జిగ్యూటివ్ ప్రెసిడెంట్"గా ఎన్నికయింది ప్రజాస్వామిక పద్ధతులతో మాత్రం కాదు. ప్రత్యక్ష ఎన్నికలను దాటవేసి, పరోక్ష ఎన్నికద్వారా "నామినేషన్ సంస్కృతి" ద్వారానే ఆయన ఎంపిక కావడం - స్టాలినిజం నుంచి వేరై నూతన సామాజిక విలవలను ఆశించిన నూతన తరంలో విశ్వాసాన్ని నెలకొల్పలేకపోయింది; పైగా తాను తలపెట్టిన "సంస్కరణలను", నేడు రష్యా ఆర్థికంగానూ, సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్‌లో ఎదుర్కొంటున్న భీకరమైన ఇబ్బందులనూ, జాతి వైషమ్యాల ఫలితంగా ఏర్పడిన సంక్షోభాన్ని గోర్బీ 1917 విప్లవంనాటి పరిస్థితులతో పోల్చడమేగాక, 1920ల నాటి లెనిన్ "నూతన ఆర్థిక విధానం"తో (NEP) పోల్చుకోవడం వింతలలో వింత! లెనిన్ "నెప్" విధానం లక్ష్యం, విప్లవాన్ని జయప్రదం చేసుకున్న ప్రజలకు సరసమైన ధరలకు నిత్యావసర సరకులు అందించడం; కంట్రోళ్ళద్వారా బ్లాక్ మార్కెటింగ్‌ను అరికట్టడం; ప్రథమ సోషలిస్టు రాజ్య నిర్మాణానికి అవసరమైన విదేశీ పెట్టుబడులను సోషలిస్టు ప్రభుత్వ షరతులపైన మాత్రమే ఆహ్వానించడం, అందుకు సమ్మతించే విదేశీ పెట్టుబడలకు మాత్రమే రక్షణ కల్పించడం. కాని ఈ రోజున గోర్బీ విధానాలవల్ల జరుగుతున్నపని - సోషలిస్టు ప్రణాళికా పద్ధతులకు విరుద్ధమైన "మార్కెట్ (స్వేచ్ఛా) ఆర్థిక వ్యవస్థ"ను అనుమతించి వస్తూత్పత్తిని దారిదోపిడీకి గురి చేయడం. బహుశా అందుకనే ప్రముఖ పత్రిక లండన్ "ఎకనామిస్ట్" (మే 12) ఇలా వ్యాఖ్యానించవలసి వచ్చిందిః "గోర్బీకి ప్రత్యామ్నాయ నాయకత్వం ఉండగలదని పశ్చిమ రాజ్యాలు ఊహించడానికే ఇష్టపడడంలేదు. కనుకనే ఎలాగైనా సరే 'గోర్బీ'ని అధికారంలో కొనసాగేలా చూడాలన్న మాట పశ్చిమ రాజ్యాల రాజధానీ నగరాల్లో ఒక తారక మంత్రంగా వినిపిస్తోంది"! ఎందుకని? "మధ్యేమార్గ" వాదిగా కనిపిస్తున్న గోర్బీకి రష్యాలోనే "సంస్కరణ వ్యతిరేకులు", 'మరింత ప్రజాస్వామ్యం' కావాలని వాంఛించే గ్రూపులూ తలెత్తి వృద్ధి చెందుతున్నందున. ఈ గ్రూపులు ఇంకా శక్తి పుంజుకునే లోపుగానే గోర్బీని కాపాడుకోవాలని ఈ దేశాధినేతలు తహతహలాడుతున్నారు. మాస్కో సిటీ కౌన్సిల్‌ను "లిబరల్స్" చేజిక్కించుకొన్నందుకు కాపిటలిస్టులు సంతోషించడం అందుకే! ఎందుకంటే, కాపిటలిస్టు వ్యవస్థకున్న ఆవలక్షణాలన్నీ నేడు గోర్బీ సంస్కరణవల్ల రష్యన్ ఆర్థిక వ్యవస్థలో చోటుచేసుకొన్నాయి. అవి - ప్రభుత్వమే నిత్యావసర సరకుల ధరలను పెంచివేయడం, దొంగడబ్బు చెలామణిద్వారా ఆర్థిక వ్యవస్థను క్రమంగా అనుమతించడం, విదేశాలకు ఇవ్వతేలిన రుణాలను తీరుమానం చేయలేకపోవడం, లోటు ఆర్థిక విధానం ద్వారా ద్రవ్యోల్బణాన్ని మొట్టమొదటిసారిగా అనుమతించడం, క్రమంగా ప్రయివేట్ ఆర్థిక వ్యవస్థకు పూర్తిగా ద్వారాలు తెరవడం. అందుకోసం షాపులపైన సోవియట్ అంతటా పౌరులు దాడులు జరపడం. "స్వేచ్ఛాయుతమైన, బాధ్యతాయుత సామాజిక వ్యవస్థలో స్వేచ్ఛాపౌరుణ్ణి" పెంచడంకోసం వీరు చేస్తున్న పని - రష్యన్ కమ్యూనిస్టు పార్టీ పొలిట్ బ్యూరో సభ్యుడు, కేంద్ర కమిటీ కార్యదర్శి అయిన అలెగ్జాండర్ యాకొలేవ్ మాటల్లోనే చెప్పాలంటే - "సరుకునకు డబ్బుకూ ఉన్న సంబంధాలలో లీజింగ్‌నూ, వ్యక్తిగతమైన షేర్లనూ" అనుమతించడం; పబ్లిక్ సంస్థలను ప్రయివేట్ వ్యక్తులకు ధారాదత్తం చేయడం, తద్వారా ప్రయివేట్ ఆస్తిని కాపాడుకోవడం, పెంచుకోవడం! యాకోలేవ్ వాదనకు పునాది ప్రధాని రైకోవ్ "మార్కెట్ ఎకానమీ" ముసాయిదా ఒక్కటే కాదు. పోలెండ్‌లో వలేసా లాగా అమెరికాతో ప్రత్యక్ష సంబంధాలు పెట్టుకొన్న సోవియెట్ ఫెడరేషన్‌లోని రష్యన్ రిపబ్లిక్ నూతనాధ్యక్షుడు, గోర్బీ "ప్రత్యర్థి" అయిన ఎల్సినూ

కాదు! రష్యన్ పరిణామాలపై సాల్జ్‌బర్గ్ (ఆస్ట్రియా)లో జరిగిన అంతర్జాతీయ సదస్సులో పాల్గొన్న ప్రముఖ సోవియెట్ ఆర్థికవేత్త బొగొమొలోవ్ సిద్ధాంతాలూ, ప్రసిద్ధ రష్యన్ రచయిత, కమ్యూనిస్టు పార్టీ పార్లమెంటు సభ్యుడూ అయిన ఐతమతోవ్ సూత్రాలూ గోర్బీకి, యాకొలోవ్‌కూ తారకమంత్రాలు! "కొన్ని పశ్చిమ రాజ్యాలూ, కెనడా నిజమైన సోషలిస్టు దేశాలు; సోషలిజానికి ఆదర్శం స్విట్జర్లాండ్" అని బాహాటంగానే బొగొమొలోవ్, ఐతమతొవ్ చాటేశారు! అటు రుమేనియా కొత్త ప్రెసిడెంట్ ఇలెస్క్యూ స్వీడిష్ తరహా (అంటే 'బోఫోర్స్' తరహా) ప్రజాస్వామ్యం తమ ఆదర్శమని చాటాడు!! వీరికి ముందే పోలెండ్ ఆర్థికవేత్త బిన్కోవెస్కీ - అసలు సోషలిస్టు ప్రాథమిక సిద్ధాంతంలోనే మార్పు రావాలంటే ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థ స్థానే స్వేచ్ఛాయుతమైన మార్కెట్ ఎకానమీ రావాలన్నాడు. ఈ ఊబిలో చిక్కుకున్నందుననే గోర్బీ మాల్టా, వాషింగ్టన్ శిఖరాగ్ర చర్చలలో పశ్చిమ రాజ్యాలను ఉద్దేశించి "రష్యన్ సంస్కరణలకు మీరంతా అండదండలుగా నిలబడాల"ని ప్రాధేయపడవలసివచ్చింది, ఆర్థికవ్యవస్థ మెరుగుదలకోసం ఆధునీకరణకోసం అవసరమైన మారక ద్రవ్యాన్ని సరఫరా చేయమని అమెరికాను కోరవలసివచ్చింది. అన్నింటికంటే మరీ దారుణమైన ప్రకటన - "రానున్న 18 మాసాలూ సోవియెట్ యూనియన్‌కు ప్రమాదకరమైన సంధికాలం' గా గోర్బీ పేర్కొనడం.

ఆదివారం 10 జూన్ 1990

# అక్కడ లెనిన్‌కూడా పాతబడపోయాడు.....!

సిగ్గులేని ముఖానికి చిరునవ్వే అలంకారమంటారు! విగ్రహ పూజ కమ్యూనిజానికి, సోషలిస్టు భావజాలానికీ విరుద్ధమైనదైతే, ఇప్పుడు గోర్బచేవ్ రష్యాలో వీరపూజ కూడా నిషిద్ధమవుతోంది! జారుడు బండమీద కాలు పెట్టకూడదుగాని, మోపిన తరువాత ఎక్కడికి పోయి పతనమవుతామో చెప్పలేము. స్టాలిన్ 'దుర్మార్గు'డనుకుంటే, లెనిన్ అంతకంటే 'దుష్టుడు'గా 'కొత్తదాసరి' గోర్బచేవ్‌కి అనిపించాడు; ఆ మధ్య రష్యన్ పత్రికలలో రష్యాలో దుర్మార్గాలన్నిటికీ శ్రీకారం చుట్టినవాడు లెనినేనని ఒక ప్రబుద్ధుడు రాస్తే దానికి 'దాసరి' గోర్బచేవ్ అభ్యంతరమూ చెప్పలేదు, ఖండించనూ లేదు. ఈ వీరపూజ నిరసనోద్యమం స్టాలిన్ మరణానంతరం మూడేళ్ళలో కృశ్చేవ్ ఆధ్వర్యంలో జరిగిన 20వ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ మహాసభతో ప్రారంభమై గోర్బీ నాయకత్వాన మొన్నటి 28వ మహాసభతో పరాకాష్టకు చేరుకుంది. 1986 నాటి 27వ పార్టీ మహాసభ వరకు రష్యన్ కమ్యూనిస్టు పార్టీ ప్రభుత్వ, పార్టీ విధానాలకు నిర్ణేతకాగా, 28వ మహాసభ పార్టీ అగ్రగామి పాత్రకు 'సున్న' చుట్టి, ప్రభుత్వ విధానాలపై పార్టీ కంట్రోల్‌ను సడలించి, బ్యురాక్రసీ పట్టునుంచి ప్రభుత్వాన్ని తప్పించాలన్న పేరుతో కొత్త బ్యురాక్రటిక్ యంత్రాంగం సృష్టికి పునాదులు వేసింది. కడచిన అయిదేళ్ళ రష్యన్ పార్టీ చరిత్ర సర్వరంగాలలోను పతన చరిత్ర. పార్టీ అగ్రగామి పాత్రను కోల్పోవడమేగాక, ప్రతీఘాత విప్లవాలను (కౌంటర్ రివల్యూషన్) ప్రతిఘటించడంలో మొనగాడుగా నిలబడిన రష్యన్ పార్టీ, యుద్ధ కాలంలోనూ, యుద్ధానంతరమూ తూర్పు యూరపు దేశాలను విముక్తం చేయడంలో, వాటి పునర్నిర్మాణంలో పాల్గొన్న పార్టీ - నేడు ఆయా దేశాల్లో ప్రభుత్వాల పతనానికి కూడా నాయకత్వం వహించింది; సోషలిస్టు వ్యవస్థలు కూలిపోవడానికి పౌరోహిత్యం వహించింది; చివరికి రష్యాలోని మధ్యాసియా రిపబ్లిక్‌లోనూ, బాల్టిక్ ప్రాంతాలలోనూ అల్లకల్లోలానికి దారులు తెరిచింది; జాతులమధ్య మమతానుబంధాలు పెనవేసుకొని డెబ్భైయేళ్ళుగా సంస్కృతీ విభవంతో విరాజిల్లుతున్న రిపబ్లిక్స్ మధ్య తగాదాలు పెంచింది. పరిష్కారం పేరిట, ఏ నిర్బంధ విధానాన్ని అనుసరించినందుకు స్టాలిన్‌ను దుయ్యబట్టారో అదే నిర్బంధ యంత్రాంగంతో వందలు, వేలాదిమందిని జాతి తగవాల పేరిట రెడార్మీ బలిగొన్నది. ఈ వరసక్రమంలో, పెరిస్త్రోయికా, గ్లాస్‌నోస్త్ పేరిట గోర్బీ 'కొత్త దాసరి'గా ప్రారంభించిన యజ్ఞంలో భాగంగా చివరికి అక్టోబర్ విప్లవనేత లెనిన్ కూడా రేపోమాపో బలికానున్నాడు. ఇప్పటికి కొన్ని మాసాల క్రితమే - లెనిన్ భౌతికకాయాన్ని (పేటిక) మాస్కోలోని మసోలియంనుంచి తొలగించి, లెనిన్ స్వస్థలంలో నెలకొల్పాలని నిర్ణయించారు! ఈ అవకాశం చూసుకొని ఇందుకు తగినట్టుగానే మసోలియం ఉన్న రెడ్‌స్క్వేర్‌వద్ద "పెరిస్త్రోయికా" మత్తులో ఉన్న కొన్ని గ్రూపులు చేరి లెనిన్ పేటికను ధ్వంసం చేయడానికి బాంబులు కూడా విసిరారు. చివరికీ 'పెరిస్త్రోయికా'తూర్పు

యూరప్ సోషలిస్టు వ్యవస్థతోపాటు పోలెండ్, రుమేనియా, హంగరీ, బల్గేరియాలలో లెనిన్ విగ్రహాల విధ్వంసనకు కూడా ప్రారంభోత్సవం చేసింది. ఇంతకూ అసలు విచిత్రమేమంటే మన సంపన్నులు ఆదినుంచీ ఈసడించుకున్న సోవియట్ వ్యవస్థలో మాస్కో, తాష్కెంట్‌లలో మన గాంధీజీ, నెహ్రూ, ఇందిరాజీ, టాగోర్, లాల్‌బహదూర్‌శాస్త్రుల శిలా విగ్రహాలు పూజార్హమవుతూండడం; మన ప్రధానులు వెళ్ళినప్పుడల్లా పూలగుచ్ఛాలు సమర్పిస్తున్నారు. కాని అదే సమయంలో యావత్తు రష్యాలోను, పెక్కు రిపబ్లిక్‌లలోను ఆ దేశపు విప్లవనేత లెనిన్ విగ్రహాలను కూలగొట్టేస్తున్నారు. బహుశా మన దేశంలో గాంధీజీ సిద్ధాంతాలతోపాటు, విగ్రహాలను పట్టించుకోనట్టే, రష్యాలో కూడా లెనిన్ బోధలకూ, ఆయని విగ్రహాలకు కూడా అదే గతి పడుతూ ఉండొచ్చు! ఎందుకంటే, స్టాలిన్ కాలంలో (1953) మాస్కోలో భారత రాయబారిగా ఉన్న కె.పి.ఎస్.మీనన్ "ఫ్లయింగ్ ట్రాయికా" అన్న గ్రంథంలో తన అనుభవాలు రాస్తూ స్టాలిన్ చనిపోయిన మూడేళ్ళలోనే - సోవియట్ యూనియన్ నిర్మాణానికి, దాని సమగ్రతకు, రక్షణకు కారకుడైన వ్యక్తిని ప్రపంచంలో పెట్టుబడిదారీ దేశాల మధ్య ఒక మహత్తర పారిశ్రామిక, సైనిక శక్తిగా రష్యాను తీర్చిదిద్దిన ఆ వ్యక్తి సేవలను (స్టాలిన్‌ను) తరువాతి నాయకత్వం విస్మరించడంపట్ల ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

మనిషి పోయిన తరువాత అతని చెడు మిగులుతుంది. అతను చేసిన మంచి పనులన్నీ అతని అస్థికలతో కలిసిపోతాయన్న షేక్‌స్పియర్ మాటల్ని ఉదాహరించాడు. సుమారు పదేళ్ళ ముందే రానున్న యుద్ధ ప్రమాదాన్ని గ్రహించి దేశాన్ని అందుకు సమాయత్తం చేసిన నాయకుడు ప్రపంచ చరిత్రలో లేడని చెబుతూ "స్టాలిన్ లేకపోతే, రష్యా, రష్యన్ కమ్యూనిజమూ హిట్లర్ పదఘట్టనకు నాశనమయ్యేవి" అన్నాడు. "విప్లవం ఎన్నడూ మహామహుల్ని సహితం లెక్కచేయదు; వాళ్ళను తన సేవలకు వినియోగించుకుంటుంది. లేదా చెత్తబుట్టలోకి పంపిస్తుంది; ఇందుకు విప్లవం ఏ కోశాన విచారం ప్రకటించదు" అని స్టాలిన్ ఒకసారి అన్నాడు. "ఇంతటి మహా చారిత్రిక పురుషుడ్ని ఇంత వేగంగా తిరస్కరించడం చరిత్రలో అతి అరుదైన ఘటన" అని శ్రీ మీనన్ అంటాడు. అది కృశ్చేవ్ కాలంలో స్టాలిన్‌కు పట్టిన గతి, నేడు ఇది గోర్బీ హయాములో లెనిన్‌కు పట్టబోతున్న దుర్గతి! జార్జియాలో, ఉక్రెయిన్‌లో, డజన్లకొలది పట్టణాలలో గత కొలది వారాలుగా లెనిన్ విగ్రహాలను కూలగొడుతున్నారనీ, కొన్నిచోట్ల విగ్రహాలను తొలగించి అమ్మేస్తున్నారనీ, సోవియట్ ప్రభుత్వ పత్రికలే ప్రచురించడాన్నిబట్టి కమ్యూనిస్టు పార్టీని క్రమంగా రద్దుచేసి లాభాపేక్షతో కూడిన మార్కెట్ వ్యవస్థ, ప్రయివేటీకరణలతోపాటు బహుళపక్ష రాజకీయ వ్యవస్థకు మళ్ళాలని నిశ్చయించిన గోర్బీకి తెలియకుండా ఈ పరిణామం జరిగిందని వూహించలేము. ఈ పార్టీ గత అయిదేళ్ళుగా సర్వ భ్రష్టతవైపుగా ప్రయాణిస్తోందని రష్యన్ ఫెడరేషన్ కమ్యూనిస్టు పార్టీ ఆమోదించిన (జూన్ 25న) తీర్మానం స్పష్టం చేస్తోంది. 'పార్టీలో క్రమశిక్షణ పోయింది. అవినీతి పెరిగింది. శాంతి భద్రతలు నశించాయి. నేరాలు పెరిగిపోయాయి. ప్రజలు అస్థిరతలో జీవిస్తున్నారు!! ఈ నేరాల సంఖ్య గత అయిదేళ్ళలోనే పెచ్చుమీరిపోయాయని సోవియెట్ పత్రిక "స్పుత్నిక్" లెక్కలే ప్రత్యక్ష సాక్ష్యం. ఈ అయిదేళ్ళలో ఆర్థిక నేరాలకంటే హత్యలు, అత్యాచరాలు (రేప్స్), దౌర్జన్యాలు పెచ్చరిల్లాయి. జనాభాలో ప్రతి 150 మంది పౌరులలో (అమెరికాలో మాదిరే) ఒకరు నేరగాడుగా తయారయ్యాడనీ, 1985నాటికంటే ఈ నేరస్తులసంఖ్య 1989లో 33 శాతం పెరిగిందనీ (1,75,000 నేరాలు) సోవియట్ యూనియన్ ప్రాసిక్యూటర్స్ కార్యాలయం ప్రకటించింది. 14-17 ఏళ్ళ వయస్సులో ఉన్న పిల్లలలో ఈ నేరాల సంఖ్య హెచ్చు. నేరాలకు శిక్షపడిన వారిలో మూడింట ఒక వంతు 30 ఏళ్ళలోపు వాళ్ళు. విప్లవానంతరం మొదటిసారిగా "మాఫియా" అన్న

పదం రష్యన్ భాషలోకి చొరబడడం కూడా 1985 తర్వాతేనని "స్పుత్నిక్" (1989 నవంబర్) ఉవాచ!! ఎందుకిలా జరుగుతోంది? గోర్బీ పెరిస్త్రోయికా, గ్లాస్‌నాస్త్ సోషలిజాన్ని చంపి సెక్స్ స్టాండర్డ్స్‌ను పెంచుతోంది కాబట్టి; సమాజ శ్రేయస్సుకు బద్ధం కాని వ్యక్తి స్వేచ్ఛ పేరిట వెర్రిబాగుల తనానికి, లంపటత్వానికి దారులు తెరిచింది కాబట్టి. సాహిత్యంలో, కళలలో, చిత్ర కళలలో ఈ విచ్చలవిడితనం అవధులు మించిన అంగాంగ ప్రదర్శనలు (సెక్సీ)గాబహిర్గతమవుతోంది. ఒకనాటి "సోవియట్ లిటరేచర్' మాగజైను ఆలోచనా వీచికలకు, భావ శబలతకు తార్కాణం. కాని నేడో - అనుమానం ఉన్నవారు 1990లో వెలువడిన నాల్గవ సంచిక "సోవియట్ లిటరేచర్" చూడవచ్చు! అంతేకాదు, ఆత్మశక్తిని కోల్పోయి, అతీత శక్తుల్ని విశ్వసించి ఉపాసించే స్థితికి రష్యన్ కమ్యూనిస్ట్ నాయకత్వం దిగజారినదనడానికి ఉదాహరణ 1990 జూన్ "స్పుత్నిక్" సంచిక (పేజీ 151). ఉన్నట్టుండి ఒక రష్యన్ మహిళ తన భాష "రష్యన్" మరచిపోయి (కారణాలు చెప్పలేదు) అకస్మాత్తుగా టర్కిష్ భాష మాట్లాడేసిందట! ఉన్నట్టుండి కమ్యూనిజాన్ని మరచి కాపిటలిజాన్ని ప్రేమించాలని బుద్ధి పుట్టినట్టే ఆ మహిళ కూడా రష్యన్ మరచి "టర్కిష్" మాట్లాడేసి ఉండాలి!! ఇంతకన్నా మరో విచిత్రం దేశంలో ఎక్కడికక్కడ ఎవరికివారు 'నాకు కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వ కార్డూ వద్దు, పాడూవద్దు' అని చాటుతూ, పార్టీ కార్డులను వరసబెట్టి నిప్పంటించి తగలబెడుతున్న దృశ్యాన్ని కూడా అదే సంచిక ప్రచురించడం! ఒకప్పుడు పార్టీ కార్డు ఉంచుకోవడం రెడార్మీ సైనికుడికి కూడా గర్వకారణంగా ఉండేది, నేడు అదే కార్డు పార్టీ సభ్యుడికే ఏవగింపు కారణమవుతోంది! ఈ పరిణామానికి సారథ్యం ఈ తరానిదా? లేక తరం పేరిట సాగుతున్న గోర్బీదా?! "భ్రష్టస్య కావా గతిః"!

**ఆదివారం 29 జూలై 1990**

# వ్యాపార ప్రకటనలుః ఆడియో, వీడియో!

వెనకటికొకడు వ్యాపారం జోరుగా సాగుతోంది, రెండో బర్రెను కూడా అమ్మి డబ్బు పంపమన్నాడట! అలాగే రాజకీయ వ్యాపారం సంగతి కూడా! ఎన్నికలలో రేపటి ఫలితాలు ఎలా ఉన్నా టెక్నాలజీ మైకం రాజకీయ పక్షాలను ఆవరించింది. భారత రాజకీయ చరిత్రలో, ఎన్నికల చరిత్రలో ఈసారి జరుగుతున్నంత విస్తృత స్థాయిలో పరస్పరం ప్రత్యర్థి పక్షాలమధ్య వార్తా పత్రికలలో రాజకీయ వ్యాపార ప్రకటనలుగానీ, ఆడియో, వీడియో రాజకీయాలుగానీ ఇంతకు ముందెన్నడూ జరుగలేదు. పేరుకు ఎలక్షన్ కమిషన్ అభ్యర్థుల ఎన్నికల ఖర్చు పరిధిని ఎంత నిర్ణయించినా కోట్లాది రూపాయలను "హైటెక్" ద్వారా రాజకీయ ప్రచార యుద్ధానికి ఆజ్యంగా ధారపోస్తున్నారు. ఇంత తెంపరితనం రాజకీయపక్షాలకు ఎక్కడినుంచి వచ్చింది? 50 కోట్లమంది వోటర్లలో ఏకైక బలమైన శక్తిగా మొదటిసారిగా 18-21 సంవత్సరాల మధ్య వయస్సులో ఉన్న అయిదుకోట్ల మంది వోటుహక్కును వినియోగించుకోబోతున్నారు! బెల్లం ఉన్నచోట చీమలు చేరతాయి! యువత ఉన్నచోట రాజకీయ పక్షులు గుమిగూడుతాయి! ఈ వయస్సులో వారికి (మంచికైనా, చెడుకైనా) ఆకర్షించడానికి తగిన ఆధునిక పద్ధతులను రాజకీయ పక్షాలు అనుసరిస్తున్నాయి. కటౌట్లు, ఆడియో, వీడియో క్యాసెట్లు, కొత్త తరహాలో (పరోక్షంగా దూషణ, ఎత్తిపొడుపులతో) 'రాజకీయ వ్యాపార' ప్రకటనలు ఈ టెక్నిక్‌లో భాగమే. వ్యక్తిగత స్థాయిలో ప్రత్యర్థులను పేరుబెట్టిగానీ, పరోక్షంగాగానీ ఎత్తిపొడిచే రెచ్చగొట్టే ప్రకటనలూ, వ్యాపార ప్రకటనలూ తగవని కమిషన్ ప్రవర్తనా నియమావళి హెచ్చరించినా, కొంత మితిమీరిన 'అతి' చోటుచేసుకోకపోలేదు! ప్రజా సంబంధాలకు ప్రధాన లక్ష్యం - సమాచారం ప్రజలకు అందజేసి, వారి మనస్సులను నిర్మలం చేయడం, అంతేకాని తప్పుడు సమాచారం అందజేసి, మనస్సులను సంకుచితం చేయడం కాదని జాన్‌హిల్ బోధ! అయితే ఎన్నో అనుభవాల తర్వాత సుప్రసిద్ధ రచయిత హెచ్.జి.వెల్స్ వ్యాపార ప్రకటనను చట్ట సమ్మతమైన అసత్యంగా వర్ణిస్తే, అర్థసత్యాలనుంచి అసత్యాలను సృష్టించే కళే రాజకీయ వ్యాపార ప్రకటన అని మరో ఉద్దండుడన్నాడు! అంతేగాదు, అడ్వర్టయిజ్‌మెంట్ల తీరుతెన్నులనుబట్టి ఒక దేశపు ఆదర్శాలేమిటో వివరించవచ్చునని నార్మన్ డగ్లస్‌లాంటి వాళ్ళు చెప్పారు. కాని ఎన్నికల సమయంలో విడుదలయ్యే రాజకీయ పక్షాల ప్రచార వ్యాపార ప్రకటనలు చూస్తున్నప్పుడు అలాంటి ఆశాభావం కలగదు. అయినా, "గుడ్డి గుర్రానికి దాణా జాస్తి" అన్నట్లుగా పత్రికల్లో రాజకీయ ప్రచార ప్రకటనలకోసం ప్రధాన రాజకీయ పక్షాలు తగిన బడ్జెట్లు తయారుచేసుకొని ముందుకు సాగాయి. జనతాదళ్ ఈ ప్రకటనల కోసం 50 లక్షలు, బి.జె.పి. 70 లక్షలూ ఖర్చుపెట్టాలని నిర్ణయించుకుంటే (పైకి తేల్చిన అంచనా యిది), ప్రకటనల మెరుపుదాడి కోసం కాంగ్రెస్-ఐ రు. 40 కోట్లు కేటాయించిందని అంచనా. ఈ ప్రచార యుద్ధంలో పైకి

కనిపించేవి రాజకీయ పక్షాలేగానీ, అసలు సిసలు యుద్ధం, ప్రచ్ఛన్న యుద్ధం అంతా ప్రసిద్ధ అడ్వర్టైజింగ్ ఏజెన్సీల మధ్య సాగుతోంది! ఇటీవల కాలంలో భారత రాజకీయాలకు అంబానీ - నస్లీవాడియాల తగాదాలు ఎలా కేంద్రమయ్యాయో, ఎన్నికల ప్రచార యుద్ధంలో ఈ ఏజెన్సీల మధ్య స్పర్థ అంతటి కీలక పాత్ర వహిస్తోంది. కాంగ్రెస్-ఐకి "రీడిఫ్యూజన్" సంస్థ, బి.జె.పి. జనతాదళ్ ప్రచారానికి "ఇంటెల్", 18-21 సంవత్సరాల మధ్య వయస్సు గల కుర్రకారును ఆకర్షించేందుకు 14 కోట్ల వ్యయంతో ప్రచారం నిర్వహించుతున్న "జైనస్స్", నేడు ఎలెక్ట్రానిక్ ప్రచార యుగకర్తలుగా లాభసాటిగా ఎదుగుతున్న సంస్థలు! ఇవి కాక "ముద్రా" కమ్యూనికేషన్స్, మాడిస్ అడ్వర్‌టైజర్స్‌కూడా ఈ ప్రచార యజ్ఞంలో పాల్గొన్నాయి. జనతాదళ్‌కు కేవలం "బోఫోర్స్" సమస్యపై మూడు భాగాలుగానూ, బి.జె.పి. కోసం తొమ్మిది భాగాలుగానూ ప్రచారం నిర్వహిస్తున్నది "ఇంటెల్". రాజీవ్‌పై సంపూర్ణ చిత్రంగా సరళా అగర్వాల్ చలనచిత్రం దేశవ్యాప్తంగా కాంగ్రెస్ అభ్యర్థులందరికీ చేరవేశారు. ఈశాన్య భారతంలో "క్లారియన్" సంస్థ కేంద్రీకరించగా, వీడియో క్యాసెట్లకు తారాసిన్హా, పోస్టర్ల ముద్రణలో గ్రాఫిక్ యాడ్స్ ది ముందడుగయింది.

అయితే, కొత్త బిచ్చగాడు పొద్దెరగడన్నట్లు ఈ బావతు ప్రచారస్థాయి మనకుకొత్త కావచ్చు. కాని సుమారు ముప్పైఏళ్ళుగా పత్రికలలో రాజకీయ ప్రచార వ్యాపార ప్రకటనలకు అలవాటుపడిన యూరప్ దేశాలలో రాజకీయ ప్రముఖులు, సామాజిక శాస్త్రవేత్తలు "రాజకీయ ప్రచార వ్యాపార ప్రకటనలు" (పొలిటికల్ అడ్వర్‌టైజింగ్) అప్రతిష్ఠాకరమనీ, అగౌరవమనీ, ఈసడించుకుంటున్నారు. నిజాయితీపరుడుగా, నిరాడంబర జీవిగా బతికిన గోల్డ్‌వాటర్‌ను "సంకరుడుగా, జారుడు"గా అడ్వర్టైజింగ్ ఏజెన్సీలు చిత్రించుతూ వ్యాపార ప్రకటనలు విడుదల చేసిన తరువాత పొలిటికల్ అడ్వర్టైజింగ్‌మీద పెక్కుమందికి ఏవగింపు పుట్టింది. అబద్దాల ప్రచారంలో అందెవేసిన చెయ్యి అయిన హిట్లర్, రాజకీయ ప్రచారం కోసం వ్యాపార ప్రకటనలు విడుదలచేసే చిట్కాను పట్టి ఈ టెక్నిక్ ప్రాధాన్యాన్ని కనిపెట్టిన తొలి యూరోపియన్ రాజకీయవేత్త. ఆ తర్వాత ఆ దారి తొక్కినవాళ్ళు బ్రిటన్‌లోని టోరీలూ, కన్సర్వేటివ్‌లూ, పార్టీ ప్రతిష్ఠను పార్టీ నిబంధనావళిద్వారా, విధానాలద్వారా, సంక్షేమ కార్యక్రమాలద్వారా గాకుండా అడ్వర్టయిజ్‌మెంట్ ఏజెన్సీలపై ఆధారపడడం ద్వారా పెంచుకోడానికి ఈ అడ్డదారులు తొక్కారు. ఈ పద్ధతులవల్ల ఖర్చులు పెరిగిపోయి, ప్రవర్తనా నిబంధనలు బదాబదలైపోతాయని తెలుసుకున్నారు. అందుకనే పొలిటికల్ అడ్వర్టయిజ్‌మెంట్లపైన బ్రిటీష్ కామన్స్‌లో 30 ఏళ్ళనాడే సుదీర్ఘమైన చర్చ జరిగింది. ఆ చర్చకు నాయకత్వం వహించింది మిస్ ఎలిసీ బేకన్. పొలిటికల్ అడ్వర్టయిజ్‌మెంట్లు ప్రవేశం బ్రిటీష్ ప్రజాస్వామ్యానికి పొసగని సరికొత్త పరిణామమని ఆమె వ్యాఖ్యానించింది కూడా. అంతేగాదు, "మన రాజకీయాలు ఇలాగే నడవాలా, మరో గతి లేదా? బ్రిటీష్ రాజకీయాలు ఇలా రెండు అడ్వర్టైజింగ్ ఏజెన్సీల మధ్య వ్యాపార పోటీలా సాగాలని మనం కోరుకుంటున్నామా?" అని ఆవేదనతో ఆమె ప్రశ్నించింది. అలాగే సుప్రసిద్ధ పత్రికా రచయిత హెన్రీఫెర్లీ వ్యాఖ్యానిస్తూ "టి.వీలలో వ్యాపార ప్రకటనకర్తల టెక్నిక్‌నే ఉపయోగించి కన్సర్వేటివ్‌లు వోటర్లను తమకు బందీలైన మరుగుజ్జులుగా భావించసాగారని ఎత్తిపొడిచాడు! అంతేకాదు. బ్రిటీష్ రాజకీయాల్లో ప్రజాసేవా ధర్మంస్థానే రాజకీయాలు "వృత్తి"గా (ప్రొఫెషనలిజం) ప్రవేశించడం ఈ పొలిటికల్ అడ్వర్టయిజ్ మెంట్ల వల్ల వచ్చిన దుష్పరిణామం" అని కూడా చెప్పాడు. స్వేచ్ఛా సమాజం, సేవాధర్మం పదికాలాలపాటు మనగలగాలని కోరుకునేవారంతా ఈ పద్ధతులను తిరస్కరించాలని కోరాడు. అన్నింటికంటే దీనివల్ల పెద్ద ప్రమాదం పొలిటికల్ అడ్వర్టయిజ్‌మెంట్లవల్ల పోటీలో బతికి బయట్ట కట్టకలిగేది ఒక్క ధనికుడు మాత్రమే!

ఆదివారం నవంబర్ 19, 1989

# సరికొత్త అధ్యాయం

భారత రాజ్యాంగ చరిత్రలో, పార్లమెంటరీ చరిత్రలో నవంబర్ ఏడోతేదీన ఒక అధ్యాయం ముగిసి, పదవతేదీతో మరొక అధ్యాయం ప్రారంభమయింది. దేశంలో ప్రతిపక్ష ప్రభుత్వం ఏర్పాటుకోసం గత పదేళ్ళలో సాగిన రెండు ప్రయత్నాలూ ఘోరంగా, అవమానకరంగా ముగింపునకు వచ్చాయి. అభాసుపాలైన కలయికలతో, విలువలు కోల్పోయిన వ్యక్తుల సమాహారంగా ఒకసారి ఈ ప్రయత్నానికి "జనతా" (1977-79) నాయకత్వం వహించగా, మరోసారి "జనతాదళ్" ప్రధాన భాగస్వామిగా "నేషనల్ ఫ్రంట్" (1989-90) నేతృత్వం వహించింది. అప్పుడూ, ఇప్పుడూ కూడా ఫిరాయింపులతో, అవకాశవాద రాజకీయాలతో, మితవాద, మతవాద శక్తుల ఆగడాలతో ఈ రెండు ప్రయోగాలూ ఆదర్శాలలో శిఖరాలు చూచినా, ఆచరణలో అధోలోకాలకు చేరినందున భారత పార్లమెంటరీ చరిత్ర, రాజ్యాంగ చరిత్రకూడా మలినమైపోయాయి. అంతేకాదు, ఎన్ని తప్పులు చేసినా, అంతరంగికంగా ఎన్ని గుంపు చింపులు పడినా, బాహాటంగా ముఠా తగాదాలతో ఎంతగా కుమ్ములాడుకున్నా కాంగ్రెస్ (ఐ)కి ప్రత్యామ్నాయ పక్షం ఈ దేశంలో బలంగా ఇంకా అవతరించలేదని కూడా రెండు ప్రతిపక్ష ఐక్య సంఘటన ప్రభుత్వాలు మరోసారి ధృవపరిచాయి. ఫలితంగా ఒకరు (వి.పి.సింగ్) దేశ చరిత్రలో మొదటిసారిగా అల్పమైన సంఖ్యాబలంతో మైనారిటీ ప్రభుత్వం ఏర్పరచి చరిత్ర సృష్టించగా మరొకరు (చంద్రశేఖర్) అల్పాతిఅల్పమైన సంఖ్యతో "మినిస్క్యూల్" క్షుద్ర ప్రభుత్వాన్ని నిన్నటినుంచి ఏర్పాటు చేశారు. "మండల్ - మందిర్" సమస్యలపై దారిమళ్ళిన దేశంలో, ఆ పేరిట కొన్ని శక్తులు, అంధమత విశ్వాసాలకు వారసులైన దురహంకార శక్తులు సృష్టించిన అరాచకం మధ్య, జనతాదళ్‌లో చీలికవల్ల తీవ్ర అశాంతి పరిస్థితులను ఎదుర్కొంటున్న దేశంలో ఏడాది తిరగకుండానే రెండు వేల కోట్ల రూపాయలు ఖర్చుచేసి ఆ భారాన్ని దేశ ప్రజల నెత్తిన రుద్దడానికి ఏ రాజకీయ పక్షమూ సిద్ధంగా లేదు (ఇళ్ళు తగులబడుతూంటే బొగ్గులేరుకునే మత పక్షం తప్ప!). ఈ క్లిష్ట సమయంలో రాష్ట్రపతి వెంకట్రామన్ రాజ్యాధినేతగా నిభాయించుకొని, నిర్వహించుకు వచ్చిన తీరు బహుధా ప్రశంసనీయం. రాజ్యాల చరిత్రలు, రాజ్యాంగాల నడవడికలు, పార్లమెంటరీ వ్యవస్థల తీరుతెన్నులూ క్షుణ్ణంగా పరిశీలించిన తరువాత తీసుకొన్న కొన్ని నిర్ణయాలు కొన్ని పక్షాలకు రుచించకపోవచ్చు, లేదా ఆయన చర్య కొందరికి అసంబద్ధంగా, అక్రమంగా తోచవచ్చు. కాని రాజకీయపక్షాల మాదిరిగా, కుట్ర రాజకీయాలలో ఆరితేరిన వ్యక్తిగా ఒకరి మాటలొకరికి చెప్పి, బొమ్మలాటలతో కాలక్షేపం చేయకుండా వి.పి.సింగ్ రాజీనామాను ఆమోదించిన వెంటనే వెంకట్రామన్ చేసిన పని - లోక్‌సభలో ఏకైక పెద్ద మెజారిటీ ఉన్న కాంగ్రెస్(ఐ), బి.జె.పి, వామపక్షాల నాయకులతో ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పాటునకు గల అవకాశాలపై వరుసగా చర్చించి, అభిప్రాయాలు తెలుసుకొని, నేటి

పరిస్థితులను బేరీజు వేసుకోవడం. వి.పి. రాజీనామాకు ముందుకూడా ఆయన, ఈ క్లిష్ట దశలో "ఫ్రంట్" ప్రభుత్వ స్థానంలో జాతీయ ప్రభుత్వం ఏర్పాటు చేయగల అవకాశాలను కూడా పరిశీలించారు. కాని ఏ రాజకీయపక్షమూ ఆ విలువైన ప్రతిపాదనకు మనసారా అంగీకరించగల స్థితిలో లేకపోయినందునా, అటు వి.పి.నీ, ఇటు రాజీవ్‌నూ మినహాయించి జాతీయ ప్రభుత్వం ఏర్పరచాలన్న కొందరి సూచన ఇంకొందరికి రుచించనందునా - ఆ ప్రయోగం విఫలమయింది; ఆ తరువాత జరిపిన విన్యాసంలో రాష్ట్రపతికి నేటి పరిస్థితులలో మిగిలిన ఏకైక మార్గం అల్పాతిఅల్పమైన సంఖ్యాబలం ఉన్న 'జనతాదళ్ చీలిక వర్గం నాయకుడు' చంద్రశేఖర్ కాంగ్రెస్ (ఐ) మద్దతుతో ప్రభుత్వం ఏర్పరచడానికి సంసిద్ధత వెల్లడించినందున అందుకు అంగీకరించడం, "పిల్లిమెడలో గంట కట్టడానికి" ఈ పరిస్థితులలో ఎవరూ ముందుకురానందుననే రాష్ట్రపతి ఈ నిర్ణయం చేయవలసి వచ్చిందని మరచిపోరాదు. పైగా ఈ పరిణామాలన్నింటికీ అమరికలు లేకుండా, చరిత్రలో ఒక అవమానకరమైన అధ్యాయం గురించి భావితరాలు తనను తప్పుపట్టకుండా ఉండడంకోసం రాష్ట్రపతి ఒక ప్రకటన చేశారు కూడా. "ప్రస్తుత పరిస్థితులలో దేశాన్ని జనరల్ ఎన్నికలకు నెట్టడం జాతీయ ప్రయోజనాలకు" హానికరమని భావించినందున, ఉన్నంతలో "స్థిరమైన ప్రభుత్వం ఏర్పాటుకు సర్వ ప్రయత్నాలు చేయాల"ని ఆ ప్రకటనలో కోరవలసి వచ్చింది. ఇందుకోసం వెంకట్రామన్ సుమారు పక్షం రోజులుగా మధనపడిన తీరు ఇటీవల కేంద్ర ప్రభుత్వాల నడకతో పోల్చితే ఎంతో గర్వించదగినదిగా ఉంది; అధికారం ఆఖరి క్షణాలలో, రెండో ప్రపంచ యుద్ధానికి ముందు ఆస్వాల్డ్ మోస్లీ, ఆ తరువాత ప్రసిద్ధి పొందిన స్టాఫర్డ్ క్రిప్స్, క్లెమెంట్ అట్లీలు అధికార దుర్వినియోగానికి పాల్పడకుండా బ్రిటీష్ రాజు (అతనే అక్కడ రాష్ట్రపతి) తెలివిగా అడ్డుకున్న చందంగానే ఇక్కడ వెంకట్రామన్ కూడా వి.పి. అనంతర పరిణామాలను దిద్దితీర్చుతున్నారు. అయితే ఈ పరిణామ క్రమంలో ఆయన 1920లో ఆస్ట్రేలియా "రాష్ట్రపతి" జాన్‌కెర్‌లాగా, కెనడా "రాష్ట్రపతి" లార్డ్ బయింగ్‌లాగా నిరంకుశంగానూ వ్యవహరించకుండా ప్రత్యామ్నాయ మంత్రివర్గం ఏర్పాటుకు పరిమిత ప్రజాస్వామ్య సంప్రదాయంలోనే కడు జాగ్రత్తగా ముందుకు సాగారు.

ఇక కాంగ్రెస్‌లోని ఒకనాటి "యంగ్‌టర్క్" నాయకులలో ఒకరైన "సోషలిస్టు" చంద్రశేఖర్ జీవితేచ్ఛకూడా (ఒక్కసారి ప్రధానమంత్రి కావడం) నెరవేరినట్టయింది; నిజానికి 1979లో ఒక్కనెల ప్రధానమంత్రి అయిన చరణ్‌సింగ్ పేరును ఈ సందర్భంలో ఆయన ప్రస్తావించవద్దంటున్నారుగానీ, చరణ్‌సింగ్‌కు ఈ సమయంలో ఆయన రుణపడి ఉన్నారు! ఎందుకంటే, బ్రిటీష్ రాజనీతిజ్ఞులలో ఒకరైన డిజ్రేలీ చెప్పినట్టు "పార్లమెంటరీ ప్రభుత్వం అంటే పార్టీ ప్రభుత్వమనే అర్థం. ఒకటి లేకుండా మరొకదానికి అస్తిత్వం లేదు". అయినప్పుడు జనతాదళ్‌ను చీల్చిన చంద్రశేఖర్ ఫిరాయింపుదారుగానే ఉండిపోయారు. నాడు ఒక్క నెల ప్రధానమంత్రిత్వంకోసం జనతాను చీల్చిన చరణ్‌సింగ్ తన జనతాకు "సెక్యులర్"అని ఎలా పేరుపెట్టుకున్నారో, ఇప్పుడు చంద్రశేఖర్ పార్టీనుంచి బర్తరఫ్ అయిపోయినందున జనతాదళ్ "సోషలిస్టు" అని నామకరణం చేసుకున్నారుగాని డిజ్రేలీ చెప్పిన ప్రమాణాలకు అందని అల్పాతిఅల్ప సంఖ్యాబలం చంద్రశేఖర్‌ది! "సోషలిస్టు" చంద్రశేఖర్ "మేము అభిమానిస్తున్న విలువలు, సిద్ధాంతాలకు కట్టుబడి ఉంటాం" అంటూ ఎన్ని మాటలు చెప్పినా అవన్నీ ఫిరాయింపు రాజకీయాలతో గాలికి ఎగిరిపోయినట్టయింది. లేబర్ పార్టీ నాయకుడు అనూరిన్ బెవాన్ "ప్రాధాన్యతల ప్రకారం నడుచుకోవడమే సోషలిజం ధర్మ సూత్రం" అని ఎన్ని చెప్పుకున్నా అంతిమంగా హెరాల్డ్ లాస్కీ చెప్పిన "రాజకీయ

వ్యాకరణ'' పాఠాలనే, అవకాశవాద రాజకీయాలనే అనుసరించవలసి వచ్చింది! రాజకీయాలకూ మరపునకూ అవినాభావ సంబంధం ఉంది. జ్ఞాపకశక్తి కోల్పోవడం రాజకీయాల్లో ఆనవాయితే అంటాడు గాల్‌బ్రెత్. 1979 జనతా ప్రయోగమప్పుడు పార్టీ అధ్యక్షుడుగా చంద్రశేఖర్ ఫిరాయింపులను వేనోళ్ళ ఖండించాడు; జనతాను చీల్చడంలో ''ప్రధానపాత్ర'' వహించిన కాంగ్రెస్(ఐ)ను తప్పుపట్టిన వాడు డాక్టర్ సుబ్రమణ్యస్వామి! తీరాచూస్తే పదేళ్ళ తరువాత వీరిద్దరూ చేసిన పనికూడా అదేనని లోకం మరచిపోవాలని వాళ్ళ అభిలాష! ఎన్నికల్లో ప్రజలిచ్చిన తీర్పునకూ, ఫిరాయింపులకూ మధ్య తేడా చెరిగిపోయింది; ఫిరాయింపులను పెద్దఎత్తున ప్రోత్సహించడానికి వీలుకల్పించే చట్టానికి అనుకూలంగా కొందరు న్యాయ సలహాదారులు కూడా వత్తాసు పలుకుతూ, ప్రజాస్వామ్యాన్ని మరింత అపహాస్యం చేయడం దురదృష్టకరం. ఇంతకన్నా ఏకైక పెద్ద పక్షంగా ఉన్న కాంగ్రెస్ (ఐ) ప్రత్యామ్నాయ మంత్రివర్గం ఏర్పాటుచేసి ఉంటే పార్లమెంటరీ చరిత్ర ప్రక్కదారులు చూసుకోవలసి వచ్చేది కాదు. ఎందుకంటే, 524మంది సభ్యులున్న లోక్‌సభలో 61 మంది సభ్యులతో మాత్రమే ఏర్పరచే మంత్రివర్గానికి 213మంది సంఖ్యాబలం ఉన్న కాంగ్రెస్, దాని మిత్రపక్షాలు ప్రత్యక్ష ''షరతులు'' లేకుండా మద్దతు ప్రకటించినా, లోపాయకారీ షరతులమీదనే ప్రభుత్వం మనుగడ సాగించక తప్పదు! నస్లీవాడీ సహకారంతో రాజకీయ భారతంలో ఒక అధ్యాయం ముగిసింది; అంబానీ సహకారంతో మరొక అధ్యాయం రేపు ముగుస్తుంది! జెస్సీఅన్‌రూ అనలేదూ - అవినీతి పాలైన రాజకీయ రంగంలో ''డబ్బు రాజకీయాలకు తల్లిపాలు''గా పనిచేస్తుందని!! ("Money is the mother's milk of politics") జైహింద్!!.

ఆదివారం ॥ నవంబర్ ౹౯౯౦

# రామ! రామ! ఇన్ని అబద్ధాలా?!

మధ్యంతర ఎన్నికలు తాననుకున్నసమయంలో రాకపోయినా, మొత్తంమీద "రామజన్మభూమి-బాబ్రీమసీదు" వివాదాస్పద సమస్యపై ఆధారపడి వచ్చే ఎన్నికలలో భారతీయ జనతాపార్టీకి "వోట్లు" పొందడానికి వీలుగా పార్టీ జెండాతో, పార్టీ ఎన్నికల చిహ్నంతో శ్రీరామచంద్రుని పేరిట "రథయాత్ర"ను పార్టీ అధ్యక్షుడు శ్రీ ఎల్.కె.అద్వానీ సాగిస్తే సాగించుకోవచ్చు! కాని తన "రథయాత్ర" రాజకీయ ప్రయోజనంకోసమేనని ఆయన బాహాటంగా అంగీకరించడంద్వారా ("టైమ్స్ ఆఫ్ ఇండియా"కి ఇచ్చిన ఇంటర్వ్యూలోనూ, విజయవాడ సభలోనూ) అయోధ్య వివాదానికి ఉన్న విలువ కూడా పోయినట్టయింది. కాని బి.జె.పి., విశ్వ హిందూపరిషత్, ఆర్.ఎస్.ఎస్.లు - ఇటీవల మత వైషమ్యాలను రెచ్చగొడుతూ ఢిల్లీలో విడుదల చేసిన ఆడియో క్యాసెట్లతో తమకు సంబంధం లేదని ఇంతవరకూ ప్రకటించలేదు. కాబట్టి వాటి విడుదల దేశ సమైక్యతకు హిందు-ముస్లిమ్ ఐక్యతకూ విఘాతమని ఖండించలేదు. కాబట్టి - ఎన్నికలలో రాజకీయ పరమైన లబ్ధిపొందేవరకూ వి.హెచ్.పి., ఆర్.ఎస్.ఎస్. సహాయంతో బి.జె.పి. ప్రజల మధ్య ఉద్రేకాలను చల్లారనివ్వబోదని స్పష్టమైపోయింది. అంతేకాదు, సోమనాథ్‌లో "రథయాత్ర" ప్రారంభించిన నాడు మొదలైన అబద్ధ ప్రచారం (పటేల్ ప్రకటన గురించీ, నెహ్రూ ప్రభుత్వ "అనుమతి" గురించీ చేసిన అద్వానీ ప్రకటనలు) విజయవాడ సభలో పండిట్ నెహ్రూ సెక్యులర్ విధానాలను దూషించే వరకూ వెళ్ళింది. అయోధ్య సమస్యపై ఎన్నికలు వాయిదాపడి, నేడు చిక్కులలో పడిన బి.జె.పి. ఆ ఇబ్బందినుంచి బయటపడడంకోసం అసత్యాలకు దిగకూడదు. "అయోధ్యలో మసీదును పడగొట్టి మందిరం నిర్మించడమే" ధ్యేయంగా ఆర్.ఎస్.ఎస్, వి.హెచ్.పిలతో చేతులు కలిపి, ప్రకటించి ముందుకు సాగిన "రథయాత్ర" అసలు ఉద్దేశం అదికాదనీ, ఇతర రాజకీయ పక్షాలు అనుసరిస్తున్న "నకిలీ" సెక్యులరిజానికి వ్యతిరేకంగా మాత్రమే బి.జె.పి. ఉద్యమించిందనీ, తమది మాత్రమే "అసలీ" సెక్యులరిజమనీ ఇప్పుడు నమ్మమంటోంది! అయోధ్య సమస్యపై గడచిన చరిత్రకు వక్రభాష్యం చెప్పడమే కాదు, నడుస్తున్న చరిత్రను కూడా మరచిపొమ్మని కోరడం రాజకీయ పార్టీకి మాత్రమే చెల్లుబడి అవుతుంది! ఢిల్లీలో విడుదలై మ్యూజిక్ షాపులలో అమ్మకాలకోసం క్రమంగా పంపిణీ అవుతున్న మత వైషమ్యపూరితమైన ప్రచార క్యాసెట్లను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వెనువెంటనే స్వాధీనపరచుకోవాలి; మత ద్వేషాన్ని రెచ్చగొట్టే ప్రచారంతో, ప్రకటనలు చేస్తున్న మత సంస్థలను నిషేధించాలి. విశ్వమానవ ధర్మానికి హైందవ మతానికీ వివేకానందుడిచ్చిన విజ్ఞతా పూర్వకమైన నిర్వచనాలను కూడా కాలదన్ని విర్రవీగజూస్తున్న కుహనా .శక్తుల విషప్రచారాన్ని మేధావులూ, రచయితలూ ఎండగట్టి, బలంగా ఎదుర్కొనవలసిన సమయం వచ్చింది. మత విశ్వాసం వ్యక్తిగత విషయం. పూజలూ, పునస్కారాలు,

వ్యక్తుల నమ్మకంతో సాగే ప్రశాంత కార్యాచరణ. మత సామరస్యం సర్వమత ధర్మంగా విధిగా రాజ్యాంగ సమ్మతంగా చెలామణిలో ఉండాలి. అన్ని మతాల సారం మానవుణ్ణి ఉన్నత స్థాయికి చేర్చడమే అయినప్పుడు, ఉత్తమ మానవుని అభివృద్ధికి దోహదం చేయడమే అయినప్పుడు మతాల మధ్య కొట్లాటలు, ఉద్రేకాలు, వీడియో విష ప్రచారాలు, ఆడియో అబద్ధాలూ దేనికి? "రథయాత్ర"వల్లా, వివాదభూమిలో కరసేవవల్ల, దాని ఫలితంగా శాంతిభద్రతల యంత్రాంగాన్ని పటిష్ఠం చేయవలసి వచ్చిన ప్రభుత్వాల తదనంతర చర్యలవల్లా, ఒక్క యు.పి., బీహార్‌లలోనేగాక ఆ ఉన్మాదంతో సంబంధంలేని మిగతా రాష్ట్రాలలో కూడా దేశ వ్యాపితంగా ఉద్రేకాలు చెలరేగడమేగాక, పత్రికలలో రాని అకృత్యాలెన్నో వివిధ ప్రాంతాలలో "చాపకిందనీరు"లా జరిగాయి. తప్పుడు ప్రచారంలో మతోద్రేకాలకు దోహదం చేసే "న్యూస్‌ట్రాక్" క్యాసెట్లను ఒక బాధ్యతగల పత్రికా సంస్థ కూడా విడుదలచేసి అభాసుపాలు కావలసివచ్చింది. దేశ సమస్యలను ప్రక్కకునెట్టి, సమస్యకాని సమస్యపైన తగాదాలు పెంచి ప్రజల మనోభావాలను ప్రక్కదారులు పట్టించడమే బి.జె.పి., గాంధీ హత్యకు కారణమైన ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి.ల లక్ష్యంగా మారడం క్షమించరాని వైఖరి. పైగా పురావస్తు శాఖాధిపతులకూ, పరిశోధకులకూ అయోధ్య స్థల నిర్ణయం విషయంలో ఏళ్ళు పూళ్ళుగా నలుగుతున్న వాదోపవాదాలకు మతరూపం తొడిగి ప్రజలమధ్య నెలకొన్న సాధారణ మమకారాలను కూడా ఈ మతశక్తులు చంపివేస్తున్నాయి. "పనిలేనివాడు పిల్లితల గొరిగి"నట్లుగా కటికి దారిద్ర్యంలో ఉన్న కోట్లాదిమంది ప్రజల తిండి, బట్ట, వసతి, ఉపాధి సమస్యలపై ఖర్చుపెట్టవలసిన మనస్సునూ, భావధారనూ కేవలం "మూఢవిశ్వాసం"పై ఆధారపడి నిరక్షరాస్యతవల్ల ఉద్రేకాలకు లోనుకాగల అమాయక ప్రజల ప్రశాంత జీవనాన్ని చెదరగొట్టి సంఘంలో అశాంతిని వోట్లుగా మార్చుకోవడానికి ప్రయత్నించడం మానవత్వం కాదు, తిరిగి మత పరిభాషలోనే చెప్పాలంటే "దానవత్వం"అనిపించుకుంటుంది.

కేవలం అయోధ్య సమస్యపై చెలరేగిన ఉద్రిక్తత కారణంగానే కొలదిరోజులనాడు, ప్రసిద్ధ భారతీయ శాస్త్రవేత్తలకు వారి పరిశోధనలకు కూడా తీవ్రమైన ఆటంకం కలిగింది. శాస్త్రవేత్తల తప్పిదమల్లా - మతోన్మాదాన్ని నిరసిస్తూ, ఇంగిత జ్ఞానం మానవునికి అఖండ జ్యోతి కావాలని, మత విశ్వాసాలను రాజకీయాలతో ముడిపెట్టరాదనీ, సర్వమత సమభావన, మత సామరస్యమే దేశ సమైక్యతకు ఏడుగడ అనీ 200 మంది శాస్త్రవేత్తలు, మేధావులు బెంగుళూరు నుంచి విశిష్ట ప్రకటను విడుదల చేయడమే! అరెస్టయిన బి.జె.పి., వి.హెచ్.పి. నాయకులను విడుదల చేయించే పేరుతో "కన్నడ వారియర్స్ బెటాలియన్"కు చెందిన అయిదుగురు సభ్యుల దళం ఒకటి భారతీయ రోదసీ పరిశోధనా సంస్థ చైర్మన్ డాక్టర్ యు.ఆర్.రావును "కిడ్నాప్" చేయడానికి విఫలయత్నం చేసింది! అందుకనే, శాస్త్రవేత్తలు తమ సంయుక్త ప్రకటనలో "ఈ కలుషిత వాతావరణంలో శాస్త్ర పరిశోధనా రంగంలో ప్రపంచ పరిమాణాలను అందుకోడం కడుదుర్లభంగా ఉంది. స్వేచ్ఛా వాతావరణంలో సమస్యలపై హేతుబద్ధమైన చర్చ, గోష్ఠి - ప్రజాస్వామ్యానికి పునాది. కాని మత దురహంకారం, చాందసమూ ఈ హేతుబద్ధమైన చర్చ జరక్కుండా తలుపులు మూసేస్తుంద"ని పేర్కొన్నారు. ఆలోచనకు, పరిశోధనకూ, పరిశీలనకూ "తలుపులు మూసే" ఈ ధోరణివల్లనే "అయోధ్య"తగాదాకు కూడా ముగింపు రావడం లేదని గమనించాలి! క్రీస్తుపూర్వం 7వ శతాబ్దం దాకా జనపదాల స్థిరనివాసం అయోధ్యలోనే లేదని భారత పురావస్తు పరిశోధనా శాస్త్రవేత్తలు ఆర్.పి.సింగ్, బి.బి.లాల్ అయోధ్యలోని 17 స్థలాలను క్షుణ్ణంగా తవ్వకలు జరిపి పరిశోధించి నిగ్గుతేల్చిన తర్వాతకూడా మనం కొట్లాడుకుంటున్నామంటే చరిత్రకు, మానవ కథ వికాసానికీ ఎంత 'విలువ'

ఇస్తున్నామో అర్థమవుతుంది. వారు కనిపెట్టిన మరి రెండు స్థలాలు కూడా (అయోధ్యలోనే), "మణిపర్వతం'', "సుగ్రీవపర్వతం'' కూడా మౌర్యుల కాలంనాటివేనని తేల్చారు. ఇక క్రీ.శ. 11-12 శతాబ్దాలలో రామమందిర నిర్మాణం "కరసేవ'' జరిగిన అయోధ్యలో అసలు జరగనేలేదని పురాతత్వశాఖ సాగించిన పరిశోధనలూ, త్రవ్వకాలూ రుజువుచేసినా మనం నమ్మకపోతే ఎలా? అజ్ఞానం విజ్ఞానాన్ని కిడ్నాప్ చేస్తే ఎలా? చివరికి బాబర్ కాలంనాటి "రామచరిత మానస'' కావ్యకర్త తులసీదాసు (16వ శతాబ్దం) రామకథను రాసింది "అవధపురం''లో అన్నాడేగానీ అయోధ్య అనలేదు! అయినా అవధపురాన్ని కూడా అతను తీర్థయాత్రాస్థలంగా పేర్కొనలేదు. "ప్రయాగ''ను తీర్థయాత్రా కేంద్రాలకు తలమానికంగా భావించి దానికి "తీర్థరాజ'' అని నామకరణం చేశాడుగాని అంతటి భక్తుడు కూడా అయోధ్యను మాటమాత్రంగాకూడా పేర్కొనలేదు. పైగా "త్రేతాయుగ'' రామునికీ, ఈ కలియుగానికీ మధ్య లక్షల సంవత్సరాల తేడా ఉన్నప్పుడు సమన్వయం ఎలా సాధ్యం? అలాగే "చారిత్రిక'' రాముని జననం ఒకవేళ క్రీ.పూ. 2000 అనుకున్నా, భారత యుద్ధానికి 65 తరాల ముందు జన్మించాడని విశ్వసించినా - తేదీలు అసలు కుదరడం లేదు. భారత యుద్ధం జరిగింది సుమారు క్రీ.పూ. 1000 ప్రాంతంలో. కాని అయోధ్య జనపదంగా రూపొందడానికి, అయోధ్యలో రామశకం ప్రారంభం కావడానికి మధ్య ఏర్పడిన వెయ్యేళ్ళ 'తొర్ర'ను ఎవడు, ఎలా పూడుస్తాడు?! ఈ ఇబ్బందిని కనిపెట్టే కొందరు పండితులు తమ భావాలు మార్చుకొని అయోధ్యను తీసుకుపోయి అఫ్ఘానిస్తాన్‌లో 'కనిపెట్టడా'నికి ప్రయత్నించడం!! నిజానికి మన అథర్వవేదం ప్రకారంగానీ, విష్ణుధర్మోత్తర పురాణం ప్రకారంగానీ అయోధ్య "దేవతల నగరం'' మాత్రమే! మరి "దేవతల నగరం'' ఇక్కడికెప్పుడొచ్చిందట?! ప్రొఫెసర్ ఆర్.ఎస్.శర్మ పరిశోధనల ప్రకారం అయోధ్య గంగానది ప్రాంతంలోనిది గాని, ఊహాపోహలపై ఆధారపడి 'కరసేవ' జరిపిన సరయూనదిపైన కాదుట! కావ్యాన్నీ, అందలి పాత్రలనూ చదువుకొని ఆనందించాలిగాని కేవల విశ్వాసం ఆవేశానికి ఆహారం కారాదు!

శనివారం । డిసెంబర్ ।౨౨౦

# పాలకులు - నైతిక విలువలు

కాళిదాసు అనేక అనుభవాల తరువాతనే అని ఉంటాడుః "భ్రష్టస్య కావా గతిః" అని. అన్ని విలువలనూ కాలదన్ని బ్రతికినవాడే భ్రష్టుడన్నాడు. అధికారం కూడా అలాంటిదే. లార్డ్ యాక్టన్ చెప్పినట్లు అధికారం మనిషిని అవినీతిపాలు చేస్తుంది. సంపూర్ణాధికారం పూర్తిగా అవినీతిమయం చేస్తుంది. ఇంక దానికి మినహాయింపులుండవట! ఈ లోకంలో తప్పు చేయనివాడుండడుకాని, చేసిన తప్పుని దిద్దుకొని మెలిగేవాళ్ళుంటారు. కనీసం లోకం కోసమైనా ఆ పని చేయవలసి వస్తుంది. మనకో సామెత ఉందిః పని చేయకపోయినా చేసినట్టు కనబడడం కూడా ఒక విద్యేనని! "బ్రహ్మర్షి విశ్వామిత్ర" చలన చిత్ర నిర్మాణం వ్యాపార సంబంధమైనది కాబట్టి, పబ్లిక్ సర్వీసులో ఉన్న ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు పూర్తికాలం వినియోగించే పబ్లిక్ సర్వెంట్‌గా వ్యవహరించకుండా "పార్ట్-టైమ్" ఉద్యోగిలా వ్యవహరిస్తూ, ఆయన చిత్ర నిర్మాణానికి, నటనకూ దిగడాన్ని నిరోధించాలనీ, ఈ లాభసాటి వ్యాపారానికి దిగిన వ్యక్తి ముఖ్యమంత్రిగా పదవిలో ఉండతగరనీ వచ్చిన "కో-వారెంటో" రిట్స్‌ను విచారణకు రాష్ట్ర హైకోర్టు ఫుల్‌బెంచి స్వీకరించింది. వీటిపైన ధర్మాసనం అంతిమ తీర్పు ఎలా ఉన్నప్పటికీ, విచారించదగిన అంశాలు ఉన్నాయని ధర్మాసనం భావించి, రిట్స్‌ను స్వీకరించడంతోనే ముఖ్యమంత్రి ఎన్.టి.రామారావు స్పష్టమైన నిర్ణయానికి రావలసింది. ఎందుకంటే, కోర్టులో అంతకుముందు రిట్స్ స్వీకార సమస్యపై నడిచిన వాదప్రతివాదాలలో ప్రస్తావనకు వచ్చిన కొన్నిఅంశాలు ఆధారంగా ధర్మాసనం రిట్స్ స్వీకారం సందర్భంగా చేసిన కొన్ని వ్యాఖ్యలు ఉన్నత స్థానంలో ఉన్న పాలకుడు ఒకటికి పదిమార్లు పరిశీలించుకోవలసినవి. తక్షణం స్పందించవలసినవి. అధికారంలో ఉన్న వ్యక్తులు పాటించదగినవిగా భావించి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు రూపొందించిన ప్రవర్తనా నియమావళికి చట్టరూపం లేనందున, వాటిని అమలు జరిపించే అధికారం కోర్టుకు ఉన్నా లేకున్నా రిట్స్‌లో లేవనెత్తిన అంశాలను పరిశీలించదగినవిగా కోర్టు భావించింది. పైగా ఈ విషయంలో ఇంతవరకూ న్యాయస్థానాలపరంగా నిర్దిష్టమైన సంప్రదాయాలు నెలకొల్పుతూ తీర్పులూ లేవు. అందువల్లనే ధర్మాసనం పిటీషనర్లు కోరినట్టుగా రామారావు ముఖ్యమంత్రిగా కొనసాగకుండా నిరోధిస్తూ అటు తాత్కాలికమైన ఉత్తర్వును (ఇంజంక్షన్)గానీ, ఇటు "విశ్వామిత్ర" చిత్రంలో నటించకుండా తాత్కాలిక ఆదేశాలనుగానీ ఇవ్వలేకపోయింది. ఇది కేవలం లీగల్ పరిమితులకు సంబంధించిన వ్యవహారం. కానీ ఈ కేసుకు రెండో ముఖం ఉంది. అది నైతిక సంబంధమైన విషయం. రాజ్యాంగం ప్రకారం ఒక అధికార పదవిలో ఉన్న వ్యక్తి, పదవిలో ఉంటూనే స్వలాభానికి సంబంధించిన వ్యాపారంలోగానీ, వ్యాపకంలోగాని, వేరే వృత్తిలోగాని కొనసాగినట్టయితే అది - అధికార దుర్వినియోగం అవుతుంది. ఆ ఉన్నత పదవికి తగిన అన్ని విలువలనూ గాలికి వదిలినట్టే

అవుతుందని కోర్టు వ్యాఖ్యానించింది. ఈ వ్యాఖ్య చాలు - ముఖ్యమంత్రి వెనుదిరిగి తాను ఆలోచించుకొని తాను చిత్ర నిర్మాణానికి ప్రాధాన్యమివ్వాలో, లేక రాష్ట్రపాలనాఛత్రానికి ప్రాముఖ్యం ఇవ్వాలో తేల్చుకోవడానికి. అయినా ఆయనలో చలనంలేదు. బహుశా అది కోర్టు ఆదేశముకాదు, తీర్పుకాదు, కేవలం అబ్జర్వేషన్, ఓ వ్యాఖ్య అని అనుకుంటున్నట్టుంది. ఒక పరిశీలనను, వ్యాఖ్యను న్యాయశాస్త్ర పరిభాషలో "ఆబిటర్ డిక్టా" అంటారు. నిజానికి రాజ్యాంగంలోని 141వ అధికరణ ప్రకారం ఒక అంశంపైన, లేక ఒక వాదన సందర్భంగా కోర్టు చేసే "వ్యాఖ్య"ను కూడా శిరసావహించవలసి ఉంటుంది. ఈ పనిని ఆరోపితులు నైతిక బాధ్యతగా భావించి చేయవలసిందిగాని బయటవారి వత్తిడివల్ల జరిగే పని కాదు.

గతంలో బస్‌ల జాతీయీకరణ సందర్భంగా రాష్ట్రంలోని కొందరు బస్ ఆపరేటర్లు దాఖలు చేసుకున్న రిట్ పిటీషన్లపై సుప్రీంకోర్టు చేసిన స్వల్పమైన వ్యాఖ్యలకు సహితం స్పందించి నాటి ముఖ్యమంత్రి సంజీవ్‌రెడ్డి పదవికి రాజీనామా చేసారు. అలాగే ఎన్నికల సందర్భంలో ఒక మత సమావేశంలో వోట్లు అడిగినందుకు ఒక మాజీ ముఖ్యమంత్రిని ఆరేళ్ళపాటు ఎన్నికలలోనే పాల్గొనరాదని కోర్టు ఆదేశించింది. పైగా రాజ్యాంగంలోని 19(1)(జి) నిబంధన సాధారణ పౌరులకు వర్తింపజేసే వ్యాపార, వ్యవహార, వృత్తి ధర్మాలేగాని, రాజ్యాంగ ధర్మాలను నిర్వర్తించుతానని, పదవీ స్వీకారం సందర్భంగా బాసచేసే ప్రజా ప్రతినిధులకూ, ముఖ్యంగా మంత్రులకూ, ముఖ్యమంత్రులకూ వర్తించేది కాదు. సాధారణ పౌరుడు "ప్రాథమిక హక్కుల"ను అనుభవించడంలో అతనిపైన 19(2),(6) సెక్షన్‌లకింద విధించే "సహేతుకమైన ఆంక్షలు" (రీజనబుల్ రెస్ట్రిక్షన్స్) ఈ దేశంలోని పాలకులకు వర్తించకపోవడం మన రాజ్యాంగం ఆచరణలో అనుమతిస్తున్న అసమానతలలో ఒకటిగా భావించాలి!

ఇంతకూ హైకోర్టు ఫుల్‌బెంచి ఈ విషయంలో తటపటాయించడానికి ఉన్న ప్రధాన కారణాన్ని మరచిపోరాదు. ఇంగ్లీష్ కామన్ లా ప్రకారం, ఒకసారి న్యాయస్థానం "కో-వారంటో" రిట్‌ను అనుమతిస్తే లేదా విచారణకు స్వీకరిస్తే చాలు వేరే ఇంజంక్షన్ జారీ చేయకుండానే ఆరోపితుడు ఎంత పెద్ద పదవిలో ఉన్నాసరే దిగిపోవలసివస్తుంది. కాని మన ఇండియన్ లాలో, అలాంటి రిట్‌ను కోర్టు అనుమతించినప్పటికీ, తాత్కాలిక ఆదేశాలు జారీచేసేవరకూ ఆరోపితులకు స్థానభ్రష్టత ఉండదు. కాని తుది తీర్పువచ్చేలోగా ధర్మాసనం చేసిన వ్యాఖ్యలనుబట్టి నైతిక విలువలు ఆధారంగా, వెరపుతో, పాలకులు తమ మార్గాన్ని నిర్ణయించుకోవాలి! క్రిష్టియన్ కీలర్ కేసులో కేవలం వ్యక్తిగత వ్యవహారమే అయినా బ్రిటీష్ మంత్రి ప్రొఫ్యూమోతోపాటు మంత్రివర్గం రాజీనామా చేసింది. అంతేగాదు, టీచర్లూ, లెక్చరర్లూ, డాక్టర్లూ ప్రయివేట్ ప్రాక్టీస్ పెట్టుకోరాదని శాసిస్తూ, ఆ పనివల్ల విద్యాబోధనలో, వైద్యంలో శ్రద్ధ కుంటుపడుతుందని సాకుచెబుతూ ఉత్తర్వులు జారీ చేసిన ఎన్.టి.రామారావు తన "ప్రయివేట్ ప్రాక్టీసు"ను వదలుకోవడానికి సిద్ధం కాలేకపోవడం అధర్మం కాదూ? అయితే ఆయన 'నైతిక బలం' అంతా - భ్రష్టుపట్టిపోతున్న దేశ వ్యవస్థలో ఉంది! ఆ నైతిక విలువలు బోఫోర్స్, ఫెయిర్‌ఫాక్స్, ఫాడర్ కుంభకోణాలతో పతనమయ్యాయి! ఆ నైతిక విలువలు ఠక్కర్ కమిషన్ పూర్తి నివేదికను బయటకు రాకుండా తొక్కిపెట్టడంతో దెబ్బతిన్నాయి. పాలకులంతా ఒక తానులో బట్టగా వ్యవహరించినంత కాలం పరిస్థితిలో మార్పు ఉండదు!

ఈ సర్వభ్రష్ట వాతావరణంలో, ఒకప్పుడు క్రామ్‌వెల్‌ను ఉద్దేశించి అతని పతనానికి దారితీసిన ఘటనలను తలపోసుకుంటూ చాన్సిలర్ థామస్ ఊల్సీ అన్న మాటలు జ్ఞప్తికి వస్తున్నాయి! "అధికారం వల్ల, అత్యాశవల్ల దేవతలే పతనమయ్యారు. ఫర్వాలేదు, ఫికరుపడకు" అని!!

శుక్రవారం జూలై 7, 1989

# 'కిడ్నాప్' రాజకీయాలు

మనకిప్పుడు ఉన్నవి ప్రజా రాజకీయాలని ఎవరైనా నమ్మించజూస్తే నమ్మకండి. రాజకీయం కాదు. అరాచకీయం. మనకున్నవీ, ప్రభుత్వం, పోలీసుల పరంగా సాగుతూ వచ్చినవీ 'ఎన్‌కౌంటర్' రాజకీయాలూ, 'కిడ్నాప్' రాజకీయాలు మాత్రమే. ఒకరు దీనిని "ప్రజాస్వామ్యమ"ని విశ్వసించమంటున్నారు. వేరొకరు దీనినే 'విప్లవోద్యమం'అని నమ్మమంటున్నారు. కాని ఉభయత్రా సాగుతున్నది రాజకీయంకాదు, రాక్షసం. రాక్షస వివాహాల్లో, రాక్షస రాజకీయంలో ఆలోచనకు, ఆదర్శానికి, చెప్పి ఒప్పించగల నేర్పునకూ ఆస్కారం లేదు, ఒక్క బలవంతానికి తప్ప. ఎదుటివారి అభిప్రాయాలను మన్నించకపోయినా, కనీసం గౌరవించడం కూడా ఉండదు. ఆంధ్రప్రదేశ్‌లో గుర్తేడు ఘటన తర్వాత (ప్రభుత్వాధికారులను నక్సలైట్లు అపహరించి, అరెస్టయిన నక్సల్స్ విడుదలకోసం వారి ప్రాణాలను బేరం పెట్టడం) ఇతరచోట్ల కూడా అలాంటి పరిణామాలు కొన్ని తలెత్తాయి. ఇవి రాష్ట్ర ప్రజా జీవితంలో, రాజకీయాల్లో అనర్థకరమైన ధోరణులను ప్రవేశపెడుతున్నాయి. ఈ నెత్తురుకూడు రాజకీయాలకు, ప్రజలతో, ప్రజా ఉద్యమాలతో సంబంధంలేని ప్రయివేట్ గ్రూపు టెర్రరిజానికి, విచారణ లేకుండా రాజకీయ భావాలు కలిగి ఉన్నందుకే యువకులను అపహరించి మాయం చేస్తున్న సర్కారీ టెర్రరిజానికీ స్వస్తి చెప్పవలసిన సమయం వచ్చింది. నిజానికి 1987 డిసెంబర్‌లో "పీపుల్స్‌వార్ గ్రూపు" నక్సలైట్లకు చెందిన రాజమల్లు, ఐలయ్య అనే యువకులను పట్టపగలు ఒక థియేటర్‌వద్దనుంచి పట్టుకుపోయి వాళ్ళ ఆచూకీ పోలీసులు, ప్రభుత్వమూ తెలుపనందుననే ఇన్ని పరిణామాలు వచ్చాయి.

ఆ తర్వాత వరసనే మండల ప్రజాపరిషత్ అధ్యక్షులను నక్సల్స్ కిడ్నాప్ చేయడం, కాల్చడం లేదా విడుదల చేయడం ప్రాణాలతో చెలగాటంగా కాకుండా ఒక "దాగుడుమూతలాట"గా మారిపోయింది. రాజమల్లు, ఐలయ్యల ఆచూకీ విషయమై ప్రభుత్వం న్యాయ విచారణకు ఆదేశించిన తరువాతకూడా నక్సల్స్ ఆగడాలు తగ్గలేదని నిన్నమొన్న ఇరువురి కానిస్టేబుల్స్ అపహరణ ఘట్టమూ, పౌరహక్కుల సంఘం నాయకుడు బాలగోపాల్‌ను "పోలీసులు" కిడ్నాప్ చేసిన ఉదంతమూ నిరూపిస్తున్నాయి. ఈ రెండు ఘట్టాలతో ఏ మాత్రం సంబంధంలేని ప్రజాబాహుళ్యాన్ని ఉభయపక్షాలూ నిష్కారణంగా అశాంతిలోకి నెట్టి పౌర జీవితాన్ని అల్లకల్లోలం చేశాయి. రామవరం ఘటనకు (కానిస్టేబుల్స్ అపహరణ) నక్సల్స్‌ను ప్రోద్బలం చేసిన ప్రధాన కారణం - మరణించిన నక్సల్స్‌కు ఏర్పాటుచేసుకున్న స్మారక స్థూపాలను పడగొట్టిన పోలీసులే తిరిగి నిర్మించాలన్న డిమాండ్, ఆ కోరికను ప్రభుత్వం అంగీకరించి, వాటిని పునర్నిర్మిస్తున్న ఘడియలలో ఎవరో విమర్శించారని చెప్పి, అందుకు విరుద్ధంగా అన్న మాటను అనలేదని ముఖ్యమంత్రి ఎన్.టి.ఆర్. మాట మార్చడం. పతనమైన స్థూపాల పునర్నిర్మాణానికి హామీ పడబట్టే

ముఖ్యమంత్రి 'మనకు ప్రీతిపాత్రులైన వారి స్థూపాలను ఎవరైనా తొలగిస్తే మన మనస్సులు చివుక్కుమనవా' అని కూడా ఒక దశలో సమర్థించుకోగలిగారు. అయినా మన రాష్ట్రానికి సంబంధించని వర్గాలెవరో ఆ చర్యను విమర్శించారన్న మిషపైన ముఖ్యమంత్రి "స్థూపాల పునర్నిర్మాణం ప్రభుత్వం బాధ్యత కాద"ని తప్పుకొన్నారు. ఆ మాట పట్టుకొని, నక్సల్స్ ఇరువురు కానిస్టేబుల్స్‌ను దొంగతనంగా ఎత్తుకుపోయి ముఖ్యమంత్రి మాటనుసవరించుకుని ప్రకటించకపోతే, ఆ ఇరువురిని "చంపుతామ"ని బెదిరించారు. ఈలోగా డాక్టర్ బాలగోపాల్ "కిడ్నాప్" వల్లనే నక్సల్స్‌లో జ్ఞానోదయం కలిగి, కానిస్టేబుల్స్‌ను విడుదల చేశారు. ఈ "రాజకీయం" చాలా అల్లరచిల్లరగా తయారైంది. ప్రతి కాలానికీ మనకిష్టమున్నా లేకపోయినా "వీరులు' ఉంటారు. అలాగే మన ఇష్టానిష్టాలతో నిమిత్తం లేకుండా "వీరపూజలూ" ఉంటాయి. బ్రహ్మనాయుడు, నాయకీ నాగమ్మల తాలూకు వీరులందరికీ కారెంపూడిలో ఒక 'దేవాలయమే' వెలవలేదా? గాంధీ - ఇర్విన్ ఒప్పందం ఫలితంగా ఉరికంబం ఎక్కిన భగత్‌సింగ్‌కు (నెహ్రూమాత్రం ఆ ఉరిని ఖండించి, ప్రదర్శన నిర్వహించారు) స్వాతంత్ర్యానంతరం పాలకవర్గాలు ఉత్సవాలు చేస్తూ, పాత పాపానికి పరిహారంగా తమ కొలువుల వీరుడుగా సింగ్‌ను ప్రకటించుకోలేదా? సుభాస్ బోసును కాదన్నవాళ్ళు అయనకు ఇవాళ ఎందుకు హారతులు పడుతున్నట్టు? ప్రతి రాజకీయం వెనక ఒక స్వార్థం ఉంటుంది.

ముఖ్యమంత్రి ఈ కిటుకును గమనించినట్టులేదు! ఇంతకూ, రాష్ట్ర పౌరహక్కుల సంఘం అధ్యక్షుడు కన్నాభిరాన్ చెప్పినట్టుగా ఉభయత్రా ఈ వ్యక్తుల "అపహరణ రాజకీయాలు ఒక ఫార్సు"గా పరిణమించాయి. రాజకీయాలకు దూరంగా జరిగిపోయిన ఈ వ్యక్తిగత హింసావాదంవల్ల (అటు సర్కారీ టెర్రరిజం, ఇటు ప్రయివేట్ టెరరిజం) విషపూరిత వాతావరణం అలుముకుంటోంది. దీనిని ప్రజాస్వామ్య వాదులు, పత్రికలూ, మేధావులూ తిప్పికొట్టాలి. కానిస్టేబుల్స్‌ను విడుదల చేసినట్టే, పోలీసులు ముద్దుపేరుగా పెట్టుకున్న "ప్రజాబంధు" సంస్థ డాక్టర్ బాలగోపాల్‌ను కూడా విడుదల చేయగలదని ఆశిస్తున్నాం. ఇకనుంచైనా ఉభయపక్షాలూ ఈ "కిడ్నాప్" రాజకీయాలకు భరతవాక్యం పలకాలి. ఇటీవల "ఎన్‌కౌంటర్లు' 'పేరిట వ్యక్తులను "గల్లంతు"చేయడం కొంత తగ్గినప్పటికీ, రాజమల్లు, ఐలయ్యల అపహరణ ఘట్టానికి న్యాయ విచారణ సంఘం త్వరగా ముగింపు తీసుకురావాలి. "అపహరణ"లో ఉన్న ఆ ఇద్దరు వ్యక్తులు బొంబాయి ఆసుపత్రిలో పోలీసుల ఆధ్వర్యంలో చికిత్స పొందుతున్నారన్న వార్త నిజానాజాలు తేల్చి, ప్రజలకు తెలియజెప్పాలి. వారిని విచారణకై మెజిస్ట్రేట్ ముందు హాజరుపరచాలి. లేదా వారి దుస్థితికి బాధ్యులైన అధికారులను శిక్షించాలి. ఎందుకంటే తప్పుడు "ఎన్‌కౌంటర్ల"ద్వారా "కిడ్నాప్స్" ద్వారా సామాజిక కల్లోలానికి నక్సల్స్‌తోపాటు పోలీసులూ బాధ్యులవుతున్నారు కాబట్టి ఈ శిక్షలు అవసరం.

అధికార చట్రంలో, సర్వాధికార రక్షణలో ఉన్న పోలీసుశాఖ "ఎన్‌కౌంటర్ల" విషయంలో చాలా అప్రమత్తంగా వ్యవహరించాలేగాని, చట్టం చేతిలో ఉందికదా అని మానవ హక్కులను యధేచ్ఛగా ఉల్లంఘించేహక్కు చలాయించుకోడానికి వీలులేదు. హిట్లర్ అనుయాయి హిమ్లర్ నాజీ జర్మనీలో "గెస్టపో' ' రహస్య సంస్థద్వారా "ప్రొటెక్టివ్ కస్టడీ" పేరిట చేసిన పనులన్నీ - పౌర హక్కుల ఉల్లంఘనే. నేడు లాటిన్ అమెరికాలో జరుగుతున్నవీ అవే! అందువల్ల "ప్రజాబంధు" ను మరొక అనధికార 'గెస్టపో'గా తయారుచేస్తే ఇక ప్రభుత్వం ఉండీ, లేనట్టే జమ అవుతుంది!! అలాగే కక్ష కొద్దీ తీసే "అదురుదెబ్బలూ" ఎదురుదెబ్బలూ

రాజకీయం కాజాలవని పీపుల్స్‌వార్ గ్రూపువారు కూడా గుర్తించాలి. నేల విడిచి సాముచేసే 'అదురుదెబ్బ' తాత్కాలికమైన విస్మయం కల్గించవచ్చుననీ, వ్యక్తిగత హింసావాదం ప్రజా ఉద్యమం నిర్మించదలచిన వాడికి బలహీనమైన గుణమనీ లెనిన్ అన్నాడు. రాజకీయ దుస్సాహసం సిద్ధాంత దారిద్ర్యం వల్ల వస్తుందన్నాడు! "అదురుదెబ్బలు" తీసే పార్టీలోని వ్యక్తిగత హింసావాదులను (రివల్యూషనరీ సోషల్ డెమోక్రాట్స్) ఖండిస్తూ, ఈ చర్యలు చివరికి వారిలో ఉదాసీనతకు, మరిన్ని వ్యక్తిగత తప్పిదాలకూ దారితీస్తుందని అవి విడనాడాలని ఆయన చెప్పాడు. ఈ పాఠం చెవికెక్కించుకుంటే, పరిస్థితులు అన్నివైపులా చక్కబడతాయి. ప్రభుత్వం సార్వత్రిక క్షమాభిక్ష ప్రకటనద్వారా మంచి పరిణామాలను మరింత త్వరితం చేయవచ్చు!.

గురువారం, ఆగస్టు 31, 1989

# మహిళా కల్యాణ్!

ఆదర్శం "గుంటపూలు పూయ"కూడదనే గాని - ఏ రోజున మాత్రం ఏ పథకం మంచిది కాదు?! ఎమర్జన్సీ కాలంలో సామాన్య ప్రజలకు ఉపయోగకారిగా ఉన్న "కనీసావసరాలు తీర్చిపెట్టగల"కనీస కార్యక్రమాన్ని (నీడ్‌బేస్‌డ్ మినిమమ్ ప్రోగ్రామ్) అర్ధాంతరంగా అవతలకు నెట్టినా, ఇందిర అంతకు ముందు ప్రవేశపెట్టిన "గరీబీ హటావో" పథకం, తరువాత 20 సూత్రాల కార్యక్రమం సిద్ధాంతపరంగా తప్పులని ఎవరూ అనలేకపోయారు; సంజయ్‌గాంధీ "అయిదు అంశాల" కార్యక్రమం (చెట్లు నాటడం, వరకట్న వ్యతిరేక ఉద్యమం వగైరా) పనికి రాదని ఎవరూ అనలేదు; అలాగే ఇటీవల రోజ్‌గార్ యోజన, పంచాయితీరాజ్, నగర పాలిక బిల్లులు నిరుపయోగమని ఎవరంటారు? అన్నీ మంచివే - అమలు జరిగితే! దేశంలో కొరవడింది కూడా సరిగ్గా అదే - "ఆచరణ". కాంగ్రెస్(ఐ) ఎన్నికల మానిఫెస్టోలో నిన్నటి వరకూ లేనిది, గత కొన్ని రోజులుగా వివిధ ఎన్నికల సభల్లో కాంగ్రెస్ అధ్యక్షుడూ, ప్రధానమంత్రీ పదేపదే హామీపడుతూ వస్తున్నదీ, ఇందిర 72వ జన్మదినోత్సవంనాడు (19న) కొత్తగా ప్రకటించినదీ - "ఇందిర మహిళా యోజన". ఇదీ ఉత్తమ పథకమే! ఏడాదికి రు. 5000కోట్ల రూపాయలు ఖర్చుకాగల ఈ నూతన పథకాన్ని కాంగ్రెస్(ఐ) అధ్యక్షుడు ఎఐసిసి కార్యాలయంనుంచి ప్రకటించారు. దానిని ఎన్నికల తర్వాత "రాబోయే ప్రభుత్వానికి పార్టీ ప్రతిపాదించిన కార్యక్రమం"గా వెల్లడించారు. అయినా, కొంతమందికి ఈ పథకం - రాజకీయ పక్షాలు ఆమోదించిన, ఎలక్షన్ కమీషన్ రూపొందించిన ఉమ్మడి "ఆదర్శ ప్రవర్తనా నిబంధనావళి"కి విరుద్ధంగా కన్పించవచ్చు! కాని, ఇంతవరకూ, కేంద్రంలో, రాష్ట్రాలలో అధికారంలోవున్న ఏ ప్రభుత్వమూ (కాంగ్రెస్‌కానీ, నాన్-కాంగ్రెస్‌కానీ) ఈ "ఆదర్శ" నియమావళిని ఖరారుచేస్తూ చట్టం చేయలేదు. అలాంటి శాసనం రానంతవరకూ ఎవరినీ ఎవరూ నిందించగల స్థితిలో లేరు. ఎన్నికలో జమా ఖర్చులకు సంబంధించి అబద్ధపు ప్రకటనతోనే అభ్యర్థి శాసనసభా ప్రవేశం చేస్తున్న రోజుననే అవినీతికి ఆశీర్వాదం పలుకుతున్నాడని మరచిపోరాదు! "ఎలక్షన్ కోడ్" తంతుకూడా అంతే. "కటౌట్"లను ఇరవై నాలుగు గంటలలో తొలగించాలని ఎన్నికల కమిషన్ ఆదేశాలివ్వగలిగింది కాని, ఇక 48 గంటలలో పోలింగ్ జరుగనుండగా అధికార పక్షం సరికొత్త "మహిళా యోజన" పథకాన్ని ప్రకటించకుండా నివారించలేకపోయింది. మరొకవైపున "న్యూస్‌ట్రాక్" పత్రిక ('ఇండియా టు-డే') విడుదల చేసిన క్యాసెట్లను సెన్సార్ బోర్డు కత్తిరిస్తోంది. ఇంకొకవైపున రాజ్‌బబ్బర్ "అంధే గర్దీ" హిందీ చలనచిత్రాన్ని మొదట విడుదలచేసి కూడా ఫిల్మ్ సర్టిఫికేషన్ సెంట్రల్ బోర్డు మళ్ళీ వాపసు తీసుకుంది. అధికారంలో ఉన్న రాజకీయ పక్షం ఎన్నికల సమయంలో ఎలా ప్రవర్తించాలో కమిషన్ "ఆదర్శ" నిబంధనావళి ఏడవ సెక్షన్ స్పష్టం చేసింది. ఎన్నికలు ప్రకటించిన తరువాత ఓటర్లకు ఎలాంటి ఆర్థికపరమైన హామీలను

ఇవ్వరాదనీ, కొత్త పథకాలు ప్రకటించరాదని చెప్పింది! అధికార పక్షం "రాజకీయ వార్తలను పాక్షికంగా ప్రచారం చేయడానికీ, తన విజయాలను గురించి పబ్లిసిటీ ఇచ్చుకోడానికీ అధికార ప్రచార సాధనాలను దుర్వినియోగ పరచరాద"నీ చెప్పింది. అందుకే అధికారంలో ఎవరు ఉన్నా - లెజిస్లేచర్‌ను రద్దుపరిచి, ఆపద్ధర్మ ప్రభుత్వంతో ఎన్నికలు నిర్వహించాలని చెప్పేది. "ఇందిర మహిళా యోజన" ప్రభుత్వ ప్రకటనగా కాకపోయినా లెజిస్లేచర్ రద్దుకానందున అధికార పక్షం ప్రతిపాదనగా విడుదల కావలసి వచ్చింది! పార్టీ ప్రెసిడెంటూ, ప్రధాన మంత్రీ ఒకే వ్యక్తిగా చెలామణి అవుతున్న పార్టీ వ్యవస్థలో ఏ "స్కీము" పార్టీదో, ఏది ప్రభుత్వానిదో వేలెత్తి చూపడం కష్టం! ఎలక్షన్ కమీషన్ ఆదేశాలూ, ప్రకటనలూ లోకం కళ్ళునీళ్ళు తుడవడానికేగాని అమలు జరిపించడానికి తోడ్పడేవి కావు! ఇందుకు రేడియో, టి.వి.లు వినియోగపడుతున్న పద్ధతే నిదర్శనం! ఛీఫ్ ఎలక్షన్ కమీషనర్ పేరుకు మాత్రమే పేరిశాస్త్రి. కొత్తగా అదనపు కమీషనర్లు అయిన మాజీ గూఢచారిశాఖ అధికారులు లేదా సంబంధీకులు ధనేవా, సీగల్ మాటలే మనకిక వేదవాక్కులు!!

"మహిళా యోజన" కూడా రోజ్‌గార్ యోజనలాగానే, ఇప్పటికే వివిధ శాఖల కింద అమలులో ఉన్న 90 రకాల మహిళా పథకాలను 40 భాగాల కింద సమన్వయపరచేందుకు ఉద్దేశించినట్టిది. ఈ "పథకాలన్నింటినీ కొత్త స్కీముకిందకు తేవాలని ప్రభుత్వం సంకల్పించింద"ని పార్టీ ప్రెసిడెంటు ప్రకటించడంద్వారా కూడా ఇది పార్టీ కార్యక్రమం కంటే ప్రభుత్వ పథకమే అవుతుంది! ఎందుకని? అయిదువేల కోట్ల ఖర్చుతో పథకాలు ప్రవేశపెట్టి అమలుజరిపే స్తోమత ప్రభుత్వాలకు తప్ప పార్టీలకు ఉండదు గనుక!! అయితే, "మహిళాయోజన" పథకంలోని రెండు ప్రధాన లక్ష్యాలు ప్రశస్తమైనవి: (అ) తమ హక్కులను తాము గుర్తించగలిగేట్టు స్త్రీలలో చైతన్యం కల్గించడం; (ఆ) సమాజంలో తామూ అందరితో సమానమేనని, దేశ నిర్మాణంలో తామూ ఇతరులతో సమభాగులమేనన్న గుర్తింపును వారిలో కల్గించడం. నలభై రెండేళ్ళ స్వాతంత్ర్యం తరువాత వింటున్నవి ఈ మేలుకొలుపులు! స్త్రీలలో చైతన్యం కల్గించడమే కాక, "జాతి జీవితంలో వారు గౌరవాదరాలతో, సమతా భావనతో ప్రతిష్ఠాకరమైన పరిపూర్ణ పాత్ర నిర్వహించేలా వారిని ఉద్యుక్తులను చేయాలని"కూడా పథకం లక్ష్యం. మనకు భాండశుద్ధిలేని పాకలూ వద్దు, చిత్తశుద్ధిలేని శివపూజలూ వద్దు, ఆచరించలేని ఆదర్శాలూ వద్దు, ఆత్మవంచన అంతకంటే వద్దు! ఎందుకంటే కనీసం రోజుకు కొన్ని డజన్ల సంఖ్యలో దేశవ్యాపితంగా వరకట్నపు చావులు చూస్తున్న ఈ దేశంలో, స్వాతంత్ర్యం తరువాత మహిళలపై అత్యాచారాలు మూడింతలుగా పెచ్చరిల్లి కూర్చున్న ఈ దేశంలో, సతీసహగమనాలను నిరోధించకుండా చాందసులకు ప్రభుత్వాలు లొంగిపోతున్న ఈ దేశంలో అనాథలకు వకాల్తాపట్టే పాలకులే కరవైపోయారు. నాడు ఎమర్జన్సీ కాలంలో స్త్రీకి పురుషునితో సమాన ఆస్తి హక్కును వ్యతిరేకించి ఇందిరాగాంధీ ఒక చెడు సంప్రదాయాన్ని నెలకొల్పారు. అయితే, అసభ్య చిత్రాల ప్రదర్శనను నిషేధిస్తూ 1986లో రాజీవ్ ప్రభుత్వం మంచి చట్టం తెచ్చింది. కాని మళ్ళీ షాబానో కేసులో ముస్లిం చాందసులకు తలొగ్గి, సుప్రీంకోర్టు తీర్పును కూడా ఖాతరు చేయకుండా - విడాకులు పొందిన ముస్లిం స్త్రీకి భర్త మనోవర్తి ఇవ్వనక్కరలేదని ఒక అభివృద్ధి నిరోధక చట్టాన్ని తెచ్చింది! ఆ సమస్యపై కేంద్ర మంత్రి అరీఫ్ మహమ్మద్ ఖాన్‌కూడా రాజీనామా చేయవలసివచ్చింది! దేశానికంతకూ ఒకే "సివిల్‌కోడ్" ఉండాలన్న రాజ్యాంగ నిర్ణేతల లక్ష్యం ఇంకా నెరవేరలేదు. ఈలోగా అభివృద్ధి నిరోధక చట్టాలకు "పట్టా"లిచ్చి మహిళా లోకంలో ఒకభాగానికి అన్యాయం చేస్తున్నాం! అలాగే, ఒకవైపున "మహిళా యోజన" రూపుదిద్దుకుంటున్న సమయంలోనే కేంద్ర సహాయమంత్రి జడ్.ఎ. అన్సారి అధికారం

'క్షైపు'లో సంఘ సేవిక అయిన ముక్తిదత్తా పొందుగోరి ఆమెను వేధించి భీతిల్లచేసిన తరువాత కూడా అతను పదవిలో కొనసాగడమే కాదు, ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థిగా కూడా 'అర్హత' పొందడం మన పతన రాజకీయాలకు పరాకాష్ఠ కాదా?! అలాగే నాన్-కాంగ్రెస్ ప్రముఖులలో ఒకరైన దేవిలాల్ స్త్రీకి సమాన వాటాను, ఆస్తిహక్కును నిరాకరిస్తూ ప్రకటించారు. నేడు స్త్రీలు ఆ ఉన్న హక్కులనైనా ఏమాత్రం అనుభవించగలుగుతున్నారో - ఒక నీరాదేశాయ్‌ని, లేదా ఒక మైత్రేయ కృష్ణరాజ్‌ను అడిగితే తబిసీళ్ళు చెబుతారు. తన ఉనికినీ, వ్యక్తిత్వాన్ని నిర్ధారించుకోవడానికి ఇప్పుడిప్పుడే ప్రయత్నిస్తున్న భారతీయ మహిళ గురించి సదా ఆసక్తితో పరిశీలిస్తున్న మన ఆడబడుచు సోమా ఛటర్జీనీ కదిపితే ఎన్నో గాథలు తెలిసొస్తాయి! లేదూ, "స్త్రీల కన్నీటి గాథలకు కారణం నాకు తెలుసున"న్న గురజాడ అప్పారావును తలచుకున్నా ఎందరో 'పూర్ణమ్మ'ల కథలూ, 'కన్యక'ల వ్యథలూ బయటపడతాయి!

బుధవారం నవంబర్ 22, 1989

# 'ఇంపీయన్ బాల్ స్పిన్' వి.పి.సింగ్?!

భారత పార్లమెంటరీ వ్యవస్థ చరిత్రలో రెండవ నాన్-కాంగ్రెస్ ప్రతిపక్ష ప్రభుత్వ నాయకునిగా, రేపటి ఎనిమిదవ దేశ ప్రధానిగా, జనతాదళ్ (నేషనల్ ఫ్రంట్) పార్లమెంటరీ పార్టీ నాయకునిగా శ్రీ విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ బాధ్యతలు స్వీకరించారు. జనతాదళ్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వానికి పోటీ జరగడమూ, ఒక దశలో కుమ్ములాటలూ సాగడమూ విశేషం కాదు. ఎందుకంటే ఈ "సంస్కృతి" ఇప్పటిది కాదు. వీరందరూ ఎప్పుడో ఒకప్పుడు కాంగ్రెస్ సంస్థలోని వారే అయినందున, ఆ తరువాత కొన్ని పరిణామాలవల్ల వారు మాతృ సంస్థనుంచి విడిపోయినంత మాత్రాన ఆ కీచులాటలు అంత త్వరగా అంతరించవు! ఎటుతిరిగీ ఇందిరాగాంధీ ఏక వ్యక్తి నాయకత్వం వచ్చిన తరువాత ప్రత్యామ్నాయ నాయకత్వాన్ని చంపి ఎదుగుతున్న కాంగ్రెస్‌లో కూడా రాష్ట్రాలలో లెజిస్లేచర్ పార్టీ నాయకత్వ ఎన్నికలు ఎంత 'చక్కగా' జరుగుతున్నాయో అందరికీ తెలిసిన బహిరంగ రహస్యమే. అదే, అంతో ఇంతో తేడాతో జనతాదళ్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వ ఎన్నికలో కూడా ప్రతిఫలించింది. అదీ ఒక 'తానులోనిబట్టే' కాబట్టి మరొకలా కన్పించదు; రంగు మారవచ్చుగాని దిక్కు మారలేదు! 1977-79 నాటి "జనతా" అనుభవాలుగానీ, కాంగ్రెస్‌లో 'యంగ్‌టర్క్' నాయకుడుగాను, "సోషలిస్టు" భావమూర్తిగానూ అంతో ఇంతో పేరు గడించుకుని ఉన్న చంద్రశేఖర్ కూడా (గాంధేయ పద్ధతుల్లో "పాదయాత్రలు" జరిపి కూడా) నాయకత్వ స్థానం కోసం అంత గడబిడకు పాల్పడడం ఆశ్చర్యకరం. జనతాదళ్ ఆవిర్భావంలో, బోఫోర్స్ సమస్యలో అధికార స్థానాలలో, ఉన్నత స్థానాలలో సాగుతున్న అవినీతి భాగోతాన్ని సకాలంలో వెల్లడించి దేశ ప్రజలను హెచ్చరించడంలో, చైతన్యవంతులనుచేయడంలో, ధరవరల సమస్యపైన స్పష్టమైన వైఖరి ప్రదర్శించడంలో గత రెండేళ్ళుగా వి.పి.సింగ్ చేసిన కృషి మాత్రమే - జనతాదళ్‌ను కేంద్రంలో అధికారంలోకి తెచ్చిన ప్రజల దృష్టిలోను, దళ్ కార్యకర్తల దృష్టిలోను ఉందిగాని, మరొకటి కాదు! అత్యున్నత స్థానంలో పెరిగిపోతున్న అవినీతి సమస్యపై నైతిక బాధ్యతతో మంత్రి పదవిని త్యజించి రాజీవ్ క్యాబినెట్‌నుంచీ, కాంగ్రెస్(ఐ) నుంచీ రాజీనామా చేసి 'ముగ్గులో'నిలబడిన వ్యక్తిగా, అగ్రగామిగా వి.పి.సింగ్ పొందే గౌరవం, ఆదరం వెంటనే మరొకరికి దక్కడం కష్టం. పార్టీలోనూ, ప్రజలలోనూ నేటి రాజకీయ పరిస్థితులలో ఆ అభిప్రాయం ఉంది కాబట్టే, అంతర్గత కుమ్ములాటలు ఎన్ని ఉన్నా అంతిమంగా అతనే నాయకునిగా ఎన్నికై, ప్రధానమంత్రి పదవిని స్వీకరించవలసి వచ్చింది. ఈ పరిణామం - స్థిరమైన ప్రభుత్వం ఏర్పాటును అభిలషిస్తున్న ఓటర్ల అభీష్టానికి అనుగుణమైనదిగా భావించాలి. కాంగ్రెస్(ఐ) ఇప్పటికీ ఏకైక పెద్ద రాజకీయ పక్షంగా లోక్‌సభలో ఉన్నదన్న వాస్తవాన్ని కూడా మరిచి దళ్ నాయకత్వంలో కొందరు ఈ రోజుకీ వ్యవహరించడం సిగ్గుచేటని గమనించాలి. అంతేగాదు, నూతన సభలో నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వానికి బి.జె.పి., వామపక్షాలు

బయటినుంచి ఎంత మద్దతును ప్రకటించినా, ఆ పక్షాలు కూడా వివాదరహితమైన "కనీస కార్యక్రమం" పై ఆధారపడి మంత్రివర్గంలో కూడా పాల్గోనంత వరకూ ఫ్రంట్ ప్రభుత్వం మనుగడ "దినదినగండం నూరేళ్ళాయుష్షు"గా గడపవలసి వస్తుందన్న ఇంగిత జ్ఞానం కూడ చంద్రశేఖర్ ప్రభృతులకు లేకపోవడం విచారకరం. దక్షిణ భారతం నేషనల్ ఫ్రంట్‌ను నిరాకరించాయి. కాబట్టి యావద్భారతానికి ఫ్రంట్ ఎంతమాత్రం ప్రాతినిధ్యం వహించజాలదని కాంగ్రెస్(ఐ) ప్రతినిధి ఆనందశర్మ పలుకుతున్న ప్రగల్భాలు కూడా చంద్రశేఖర్ ప్రభృతులకు "ముల్లుకర్ర"గా పనిచేయకపోవడం మరీ దురదృష్టకరం. దేశంలో "జాతీయ ప్రభుత్వం" ఏర్పాటుకు ముందు ఫ్రంట్ సంకీర్ణ మంత్రివర్గాన్ని పటిష్ఠం చేసుకోలేని చంద్రశేఖర్, జాతీయ ప్రభుత్వ స్థాపన గురించి చెప్పే మాటలకు ఎంత మాత్రం విలువ ఉండదని గ్రహించాలి.

నేషనల్ ఫ్రంట్ పార్లమెంటరీ పార్టీ నాయకునిగా ఎన్నికైన తర్వాత వి.పి.సింగ్ ఫ్రంట్ మైనారిటీ ప్రభుత్వం అమలు జరపదలచిన కార్యక్రమం ప్రాధాన్యతలను వెల్లడించారు. అవి : ధరల పెరుగుదలను అరికట్టడం, పంజాబ్, జమ్మూకాశ్మీర్, రామజన్మభూమి - బాబ్రీమసీదు లాంటి సమస్యలపై జాతీయ స్థాయిలో అన్ని పక్షాల అభిప్రాయాలకు ప్రాధాన్యమిచ్చి విశాల ప్రాతిపదికపై పరిష్కరించడానికి ప్రయత్నించడం, ఆకాశవాణి, దూరదర్శన్‌లు స్వతంత్ర ప్రతిపత్తిగల కార్పోరేషన్లుగా మలచడం, సమాచార సేకరణకు గల హక్కును రాజ్యాంగపరంగా గుర్తించడం, అధికార రహస్యాల చట్టాన్ని సవరించడం, ఉన్నత స్థానాల్లో ఉన్నవారి (ప్రధానమంత్రి సహా) అవినీతి కార్యక్రమాలపై విచారణ జరిపేందుకు లోక్‌పాల్ బిల్లును దిద్దితీర్చడం, పార్టీలు కంపెనీల విరాళాలపై ఆధారపడి, అవినీతికి పట్టంగట్టే ఎన్నికల వ్యవస్థను సంస్కరించి, ప్రభుత్వమే ఆ ఖర్చును భరించేటట్టు చట్టాన్ని సంస్కరించడం, ప్రధానమైన జాతీయ సమస్యలపైన ప్రతిపక్షాన్ని విశ్వాసంలోకి తీసుకొని సంప్రతించడం. అధికారానికి వచ్చిన కొత్తలో అందరు ప్రధానులూ చెబుతూ వచ్చే మాటలూ, చేసే బాసలూ ఇవే. కాని ఆదర్శం రూపురేఖలు ఆచరణలో తెలిసిపోతాయి. ఈ కనీస కార్యక్రమాన్ని అమలుపరచడానికి ఫ్రంట్ సభ్యులలోనే కాదు, ఫ్రంట్‌కు బయటనుంచి పూర్తి మద్దతు ప్రకటిస్తామని హామీ పడిన బి.జె.పి., వామపక్షాలకు కూడా ఎలాంటి అభ్యంతరం ఉండడానికి వీలులేదు, అంతేకాదు, మధ్యలో పుండుపుట్టి మరొక అనవసర సమస్యను "పానకంలో పుడక"లా లేవనెత్తకుండా ఉండే పక్షంలో బి.జె.పి., వామపక్షాలూ, ఫ్రంట్ మంత్రివర్గంలో బాధ్యతాయుత స్థానాలను ఎందుకు అలంకరించకూడదు? కొలది రోజుల క్రితం మా సంపాదకీయ పరంపరలో వెల్లడించినట్టుగా కొన్ని యూరోపియన్ మంత్రివర్గాల్లో రైటిస్టులతో కలిసి లెఫ్టిస్టులు పనిచేయగా లేనిదీ, క్రిష్టియన్ చర్చి మద్దతుతో "సాలిడారిటీ మూవ్‌మెంట్" మంత్రివర్గంతో పోలెండ్‌లో కమ్యూనిస్టులు చేతులు కలుపగా లేనిదీ, గ్రీస్‌లో పచ్చి మితవాదపక్షమైన "న్యూడెమోక్రసీ"తో కలిసి కమ్యూనిస్టులు మంత్రివర్గంలో చేరగా లేనిదీ - ఇక్కడ అభ్యంతరం దేనికో అర్థం కాదు! అలాగే బ్రిటన్‌లో బద్ధ విరోధులైన కన్సర్వేటివ్‌లూ, లేబర్ పార్టీ కలిసి కొన్ని జాతీయ సంక్షోభ సమయాలలో ఒకే మంత్రివర్గంలో చెట్టాపట్టాలు కట్టుకుని పనిచేయగా లేనిది ఇక్కడ మంత్రివర్గంలో బి.జె.పి. ఎందుకు ఇమడలేదో తెలియదు! "యుద్ధ పరిస్థితులు" ఉంటేనే మిశ్రమ ప్రభుత్వం ఉండాలిగానీ, సాధారణ పరిస్థితులలోను, లేదా సంక్షోభ కాలంలోనూ అక్కరలేదన్న వాదన "మరుగుజ్జులు" చేసే వితండ వాదన! నేడు దేశం ఎదుర్కొంటున్నది సంక్షోభ దశ అని అని మరచిపోరాదు. సాంఘిక, ఆర్థిక, నైతిక సంక్షోభంలో దేశం ఉంది. ఈ దశను దాటడానికి స్థిరమైన ప్రభుత్వమేగాక, ముందుచూపుతో కనీస కార్యక్రమాన్ని తు.చ. తప్పక అనుసరించే

## ఎబికె సంపాదకీయాలు

స్థిమితమైన నాయకత్వం అవసరం. 1920లలో, 1974లో బ్రిటన్‌లో ఆ పని చేయగలిగిన వారు మైనారిటీ ప్రభుత్వాలను సమర్థవంతంగా నిర్వహించిన స్టాన్లీ బాల్డ్విన్, హెరాల్డ్ విల్సన్. కనీస కార్యక్రమం మాత్రమే చేపట్టి 'శెభాష్' అనిపించుకుని బయటపడ్డారు. రాజకీయ స్థిరత్వ సాధనకూ, పార్లమెంటులోనూ, దేశంలోనూ రాజకీయ వివాదాలను రాజీ ధోరణిలో పరిష్కరించి గొప్ప 'సమవర్తి'గా పేరు మోసినవాడు బాల్డ్విన్. ఆ పనిని నేడు వి.పి.సింగ్ చేయగలగాలి. రెండేళ్ళుగా ఆయన చేస్తున్న ప్రకటనలు, ఆయన ప్రవర్తనను గమనించిన వారికి ఆ ఆశాభావం కలుగుతుంది. కక్ష సాధింపు ధోరణి నాయకునికి లేనంతవరకు, లక్ష్యసాధనకు చేరువవుతూంటాడు!.

ఆదివారం డిసెంబర్ ౩, ౧౯౮౯

# "ఎమి తిని సెపితిమి కపితము....."

క విత్వంలో 'అధిక్షేపం' - ఎత్తిపొడుపు, బెదరింపు - ఒక ప్రక్రియ. అలాగే రాజకీయాల్లో కూడా ఈ అధిక్షేపం తప్పడం లేదు! అల్లసాని పెద్దనను ఏదో విధంగా ఆడిపోసుకోవాలన్న బుద్ధిని ఎంతకూ విడనాడలేని తెనాలి రామలింగడు ఓసారి "ఎమి తిని సెపితివి కపితము" అని ఎద్దేవాగా అన్నాడు! అలాగే ప్రధాని రాజీవ్‌గాంధీ పరిపాలనను సమయం సందర్భం లేకుండా ఎత్తి పొడవబోయిన ముఖ్యముంత్రి ఎన్.టి.రామారావు ఒక కొత్త రకం "తిరుగుబాటు"ను (మ్యూటినీ) భారత్ బంద్ రోజున హైదరాబాదు పత్రికా గోష్ఠిలో సృష్టించడానికి ప్రయత్నించారు. "బోఫోర్స్ శతఘ్నుల కొనుగోళ్ళ కుంభకోణం" గురించి ప్రస్తావిస్తూ ఆయన ఆకస్మికంగా మధ్యలో "తిరుగుబాటు(మ్యూటినీ) దానంతట అదే వస్తుంది. అదొచ్చినప్పుడు మనమేమి చేయగలం" అన్నారు! ఇంతకూ ఆయన మనస్సులోని ఈ గందరగోళానికి అసలు కారణమూ, ఆయన చెప్పదలచుకున్న విషయమూ - ఈ "కుంభకోణాలు" ఇలా కొనసాగుతుంటే ప్రజలలో విప్లవం వస్తుందని చెప్పాలనుకున్నారు! కాని దురదృష్టవశాత్తూ ఆయనకు "విప్లవా"నికీ, "తిరుగుబాటు"కీ తేడా తెలియదు! తెలియదనడానికి ఉదాహరణ - "తిరుగుబాటు" గురించి మీరు చేసిన ప్రస్తావనను వివరించమని విలేకరులు అడిగిన ప్రశ్నకు సమాధానంగా ఆయన "రష్యాలో విప్లవం రాలేదా?" అని చెప్పడమే!! నిజానికి ఈ పదాన్ని - "మ్యూటినీ" - విన్నవారు ఆగస్టు 15న ముఖ్యమంత్రి చేసిన ప్రసంగాన్ని గుర్తుచేసుకుంటారు. సైనికులకు పనికిమాలిన తుపాకులిచ్చినందుకు వారి ప్రాణాలకు ప్రభుత్వం ముప్పు తెస్తున్నదని, 'ఇది "దేశద్రోహ" చర్య' అని ఎన్టీఆర్ అన్న మాటలు - ఇప్పుడీ "మ్యూటినీ" పదంతో జోడించి చదువుకొనేవారికి - అర్థాలు వేరుగా కనిపించక మానవు. అక్కడికీ పి.సి.సి. అధ్యక్షుడు డాక్టర్ చెన్నారెడ్డి ముఖ్యమంత్రి పదప్రయోగాన్ని వ్యాఖ్యానించే ముందు తిరుగుబాటుకీ, విప్లవానికీ తేడాతెలుసుకొని ఉండవలసిందనీ, బహుశా తాను చెప్పదలుచుకున్న భావానికి ఆయన తప్పు అర్థంలో వాడారనీ, ఆ పదాన్ని తరువాత సవరించుకొని ఉండవలసిందనీ చెన్నారెడ్డి అన్నారు. ఎందుకంటే, సైన్యంలో వచ్చేది తిరుగుబాటు, ప్రజలనుంచి పుట్టేది విప్లవం. ఈ భేదం ఎన్టీఆర్‌కు తెలియకపోవడం, గమనించలేకపోవడం విచారకరం. రాజకీయవేత్తకు, రాజనీతిజ్ఞుడికి చరిత్ర, రాజనీతి శాస్త్రం, సామాజిక శాస్త్రం, వాటి విలువలూ సాంగోపాంగంగా కాకపోయినా స్థూలంగానైనా తెలిసి ఉండాలి. మిగతావి పరిపాలనానుభవంలో తెలుసుకోగలవి. ఇందుకోసం ప్రతి రాజకీయవేత్త ఏ "లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్ అండ్ పొలిటికల్ సైన్స్" లోనో చదవక్కర్లేదు, డాల్టన్‌నో, ఒక వాలాస్‌నో, మరొక హాబ్‌సన్‌నో ప్రత్యేకించి మథించనక్కరలేదు. కాని కనీస రాజకీయ పరిభాషకు రాజకీయవేత్త పరిచయమై ఉండాలి. ఇందుకు కనీసం భారత దేశంలో రాజకీయ తొలి పాఠాలకు ఆద్యుడనదగిన అప్పాదొరై రాసిన "సబ్‌స్టెన్స్

ఆఫ్ పాలిటిక్స్" అన్నా చదువుకొని ఉండాలి. పైగా ప్రతిఏటా "తెలుగుదేశం" పార్టీ రాజకీయ పాఠశాలలు నెలల తరబడి నిర్వహిస్తున్న ఎన్టీఆర్‌కు ఏ తరగతిలోనూ "తిరుగుబాటు"కూ, "విప్లవా"నికీ తేడా వివరించలేదా?! ఇలాంటి తప్పిదాలనే ఇంగ్లీషులో "బ్లూమర్స్" అంటారు. రాజకీయవేత్తలకే కాదు, పత్రికల వారికీ కూడా ఈ 'బ్లూమర్స్' తప్పవు. ఆ మాటకొస్తే - కొన్నాళ్ళనాడు ప్రధాని రాజీవ్‌గాంధీ ఒక ఢిల్లీ సభలో ప్రసంగిస్తూ బుద్ధుడి కాలంలో గాంధీ బోధలు అమలులోకి వచ్చాయని చెప్పినట్టు కొన్ని పత్రికలు "బ్లూమర్స్"గా ప్రకటించాయి. ఏనాటి బుద్ధుడు? ఎప్పటి గాంధీ?! అలాగే పంచాయితీ రాజ్ దక్షిణాది రాష్ట్రాల్లోనే పుట్టి విస్తరించగా, ఆ వ్యవస్థకాస్తా విఫలమైనట్టు బెంగుళూరు సభలో ఆయన ప్రకటించగా, గాంధీనగర్ సభలో దానిని ఆయన సవరించుకొని "తొలుత పంచాయితీరాజ్ వ్యవస్థ సఫలమయింది దక్షిణ భారతంలోనే" అని చెప్పారు! ఈ "బ్లూమర్స్" కు ప్రధాన కారణం - రాజకీయ అపరిపక్వత, రాజకీయ పరిభాషకు అలవాటు పడకపోవడమూ, విజ్ఞతకంటే ఎంతసేపూ ఎదుటి పక్షాన్ని దెబ్బతీయాలన్న శ్రుతిమించిన ఆశ, ఆబా. బెర్నార్డ్ క్రిక్ "స్వేచ్ఛా రాజకీయం" అన్నాడంటే ("Politics is freedom") ఇలా రాజకీయ పారిభాషిక పదాల అర్థాలను తారుమారు చేయడానికి "స్వేచ్ఛ" అన్న అర్థంలో కాదని గుర్తించాలి! అందుకనే ఏనాడో సిసిరో "ప్రాథమిక విలువల గురించి" రాజకీయవేత్తల మధ్య ఒక అవగాహన, లేదా ఏకవాక్యత అవసరం అన్నాడు (agreement about fundamental values - i.e., Consensus Juris)! అప్పుడుగాని తిట్టు రాజకీయాలకూ, గొట్టు ప్రసంగాలకూ ఆటవిడుపు ఉండదు! ఎవరూ తక్కువ తిన్నవారు లేరు. కొలది రోజులనాడు జలగం వెంగళరావు కూడా - దేశంలో సైనిక నియంతృత్వం ప్రవేశపెట్టడానికి "కొందరు" ప్రయత్నిస్తున్నారనీ, దేశానికి సైనిక నియంతృత్వ ప్రమాదం ఉన్నదనీ ఉబుసుపోని ప్రకటన ఒకటి చేశారు. భిన్న మతాలు, భాషలు, విభిన్న జాతులతో కూడుకున్న దేశంలో సైనిక తిరుగుబాటు అంత తేలిక కాదన్న ప్రాథమిక సత్యం కూడా తెలియని బాపతు బాధ్యతాయుత స్థానాల్లో కొనసాగడం ఆశ్చర్యకరం కాదా? ఇలాంటి చౌకబారు ప్రకటనల వల్లనే దేశానికి నిజమైన ప్రమాదం వస్తుంది. పౌర ప్రభుత్వాన్ని కించపరచ జూచిన జనరల్ తిమ్మయ్యను నాటి ప్రధాని నెహ్రూ హెచ్చరించి కూర్చోబెట్టిన సంగతిని మరచిపోతే ఎలా? లేని బూచీని ఊహించుకోవడమే గాక, దానిని భూతద్దంలో చూపడానికి ప్రయత్నించడం మరింత ప్రమాదకర మనస్తత్వంగా పరిగణించాలి.

వార్తా సంస్థలు కూడా "బ్లూమర్స్" వ్యాప్తి చేస్తుంటాయి. 1923 ఆగస్టులో ఒకసారి "రాయిటర్' ' సంస్థ గైక్వాడ్ (బరోడా) మహారాజు బెర్లిన్ నుంచి వస్తూ మార్గమధ్యంలో చనిపోయారని పంపిన వార్తను 'హిందూ' ప్రకటించుకుందట. కాని తీరా చనిపోయిన వ్యక్తి - బరోడా రాజా కొడుకు జైసింఘ్‌లాల్ గైక్వాడ్. అప్పుడు వరసపెట్టి రాయిటర్ సహా లండన్ పత్రికలు, భారత పత్రికలూ సవరణలు వేసుకోవలసి వచ్చింది! అలాగే క్వెట్టా భూకంపంలో చనిపోయిన వారిలో సుప్రసిద్ధ క్రికెటర్ మహమ్మద్ నిస్సార్‌ను కూడా పత్రికలు చేర్చాయి. కాని చనిపోయిన వారు - అదే పేరున్న ఒక యువ క్రికెటీర్! మళ్ళీ సవరణ! ఇంతకూ అసలు విశేషమేమంటే - పత్రికలకు సవరణలు ఉంటాయి, కాని 'ప్రజా ప్రతినిధులమ'ని చెప్పుకొనే రాజకీయవేత్తలకు 'పొరపాటున తూలాను, తప్పయింది, అన్యథా భావించుకోకండి' అని తమకు తాముగా సవరించుకొనే సంస్కారమే లేకపోవడం! ఒకవేళ ఉన్నా, తమ తప్పిదాన్ని పత్రికల మీదనో, పరులమీదనో నెట్ట జూడడం ఓ పెద్ద పోజూ, రివాజూ అయిపోయింది!

శుక్రవారం సెప్టెంబర్ 1, 1989

# తిట్టు రాజకీయాలు : నెహ్రూ పాఠాలు



"తి ట్టితే గాలికి పోతుంద"న్నది సామెత. కాని అది సాధారణ జీవితంలో నిజం కావచ్చును గాని రాజకీయ జీవితంలో తిట్లూ, పరుష వచనాలూ నాయకుల పరువును, దేశం ప్రతిష్ఠనూ తగలబెడతాయి. మొత్తం రాజకీయ వాతావరణమే కలుషితమైపోతుంది. రాజకీయం 'బూతు'గా మారినచోట నాయకులు అప్పకవులయి వారి అవసరాలూ, పరిసరాలూ కూడా అలాగే మారతాయి. దేశ రాజకీయాలలో ఎప్పుడో ఒకప్పుడు ఇలాంటి పరిణామం వస్తుందేమోనని క్రాంత దర్శిగా మన తొలి ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ముందుగానే ఊహించి ఇలా హెచ్చరించి ఉంటారు : "మనం ఏ పార్టీలకు చెందిన వాళ్ళమయినా, మనందరం ఉన్నత స్థాయిలో గౌరవ మర్యాదలనూ, యుక్తాయుక్త వివేచనను కాపాడుకోవడం ఎంతైనా ముఖ్యం. మనం ఉపన్యాసాలు చేసినా, లేదా వ్యాసాలు రాసినా ఆ ప్రచారం వ్యక్తి నిష్ఠంగా ఉండరాదు; ఆ విమర్శ కేవలం విధానాలకు, కార్యక్రమాలకు సంబంధించి మాత్రమే జరగాలి. ఏదశలోనూ, ఏ రూపంలోనూ అ ప్రచారం వ్యక్తి విమర్శగా, వ్యక్తి దూషణగా దిగజారిపోరాదు. నేడు మనం రూపొందించుకుంటున్న ఈ ప్రమాణం ఆదర్శం కావాలి, ఉత్తరోత్తరా జరిగే ఎన్నికలను ఈ ఉన్నత ప్రమాణాలు శాసించాలి" (Nehru speech, broadcast from AIR, Delhi, November 22, 1951).

పండిట్‌జీ పెట్టిన కొలబద్దలు ఇప్పుడు ఎందుకూ కొరగాకుండా ఉన్నాయి! పరస్పర దూషణే ఎన్నికల రాజకీయం అయిపోయింది. పాలక పక్షం నాయకులూ, ప్రతిపక్షాల నేతలూ సహనం కోల్పోతున్నారు. కడచిన రెండు మాసాల్లో ఈ పరిణామం మరింత వికృత రూపం దాల్చింది. నివేదికల నుంచి, వరద బాధితులకు నిధులు సమకూర్చే సమస్య వరకూ ప్రజల సంక్షేమ కార్యకలాపాల స్పృహ కంటే పార్టీ స్వార్థ రాజకీయాలకు మాత్రమే ప్రధాన్యం ఇవ్వడం వల్ల వచ్చిన అనర్థం ఇది. వరద బాధితుల పరామర్శ కాస్తా అందరికీ 'కళ్ళ తుడుపు'గా మారింది. పాలకపక్షమూ, ప్రతిపక్షమూ 'బురద' మాత్రం ఒకరి మీద మరొకరు చల్లుకుంటున్నారు. ఇందుకు ఒక కారణం - పాలక, ప్రతిపక్షాలకు చెందిన అధినేతలే ప్రభుత్వాలకు కూడా నేతలు కావడం వల్ల వారు పరిపాలనను పార్టీ రాజకీయాలనుంచి దూరం చేసి చూడలేకపోవడం. ఇందుకు నెహ్రూకు ఉన్న దృష్టే కాదు, నెహ్రూకు ఉన్న రాజనీతిజ్ఞత, చారిత్రిక బుద్ధి, సంస్కారం కూడా అవసరం. అది లేదు కనుకనే పరస్పరం దూషణ 'పంచాంగాలు' విప్పుకుంటున్నారు. ఒకరు ఒక సందర్భంగా ఒక నాయకుణ్ణి "మోసగాడు", "తైతక్కలవాడు" అంటే, వేరొకరు ఆ నాయకుణ్ణి "ద్రోహి", "దేశద్రోహి" అంటున్నారు. ఒకరు ఎదుటి పక్షం నాయకుడిది "చౌకబారు" ప్రచారం అంటే, ఇంకొకరు అతిణ్ణి "అబద్ధాల కోరు" అంటున్నారు; ఒకరు ఒక పక్షం వారిని "నత్తగుల్లలా సీట్లకు

అంటిపెట్టుకు పోయిన వాళ్ళు" (Limpets) అంటే, మరొకరు అతణ్ణి "అవినీతిపరుడు, పేద ప్రజల ఎంగిలి తిని బ్రతికేవాడనీ" అంటున్నారు; ఒకడు "అనుభవ శూన్యుడైన కుర్రకుంక" (Inexperienced young brat) అని అంటే, మరొకరు "అబద్ధాలతనికి పుట్టు విద్య"(Congenital lier)అంటున్నారు! ఒకరు "నీవు దేశ ద్రోహులతో చేతులు కలిపావ"వనీ, "రాష్ట్రంలో కుటుంబ పాలన పోవాల"నీ అరుస్తూంటే, మరొకరు "నీవు దేశాన్ని అమ్మి, సమాజాన్నే తాకట్టు పెట్టావనీ" ఆరోపిస్తున్నారు! అయినా రాజకీయాలు నిందలకు, అపనిందలకూ అతీతమని నమ్మమంటున్నారు! కాంగ్రెస్ పార్లమెంటేరియన్ ఉన్నికృష్ణన్ రాజకీయ పార్టీలకూ, నాయకులకూ "సాధారణ నైతిక విలువలు" వర్తించవని ఒక సందర్భంలో చెప్పింది నిజమే కాబోలునని అనిపిస్తుంది! వారంతా అలా 'ఎదిగి' పోయారన్న మాట! బహుశా ఇన్ని అనుభవాల తర్వాతనే బ్రిటన్‌లో కామన్స్ సభ్యుడుగా పనిచేసిన రిచర్డ్ బాడీ "ఒక మంత్రిని సంస్కరించాలనుకుంటే, నీవు అతణ్ణి ముక్కుమీద గుద్దినట్టు మాట్లాడకూడదు, నలుగురిలో అతన్ని 'ఫూల్' చేయొద్దు" అని అంటాడు! ఇప్పుడు మనకా పద్ధతులు పోయాయి! రుజువులతో, వాస్తవాలతో నిమిత్తం లేదు. అరచుకోవడాలు, తన్నుకోవడాలు. రాజకీయాలుగాక, తిట్టు రాజకీయాల మీద 'ఎదిగి' వస్తున్న నాయకత్వాలు ప్రజా రాజకీయాలతో జనాన్ని చైతన్యవంతులను చేయడం మానుకున్నాయి. ఇక్కడ ఈ తిట్ల 'పంచాంగం' కేంద్ర - రాష్ట్ర ప్రభుత్వ నాయకుల మధ్య నడుస్తూండగానే, అటు పశ్చిమ బెంగాల్‌లో పి.సి.సి. అధ్యక్షుడు ఘనికాన్ చౌధురి భావాలనూ, భాషనూ మాజీ కేంద్ర ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ 'సంస్కరించ' వలసి వస్తోంది! ఈ 'ఘర్షణ' వల్ల నష్టపోయేది నాయకులు కాదు, ప్రజలు - ఓటర్లు. నెహ్రూ రాజకీయవేత్తలకు ఆశించిన ప్రవర్తనా ప్రమాణాలు ఆచరణ సాధ్యం కావడానికి భారత ప్రజాస్వామ్యం ఇంక చాల దూరం ప్రయాణించవలసి ఉందని నేటి అనుభవాలు చాటి చెప్పడం లేదా? నివేదికలకు, కోర్టు వ్యాఖ్యానాలకు కమిషన్‌ల తీర్పులకూ స్పందించని, చలించని నాయకులూ, వారి నాయకత్వాలూ దేశ భవిష్యత్తును తీర్చి దిద్దలేరు, లేరు. ఎక్కడో రైలు ప్రమాదంలో రెండువందల మంది ప్రయాణీకులు చచ్చిపోతే లాల్ బహదూర్ రాజీనామా ఇవ్వాలా? కోర్టు ఏదో వ్యాఖ్యానించిందని చెప్ప సంజీవరెడ్డి ముఖ్యమంత్రి పదవిని వదలుకోవాలా, అంటే - అది వారి వారి సంస్కారాలకు సంబంధించిన విలువలు! రాజకీయాల్లో ఒకరిని "అనుభవం లేని కుర్రకుంక" అని చెప్పే "పెద్ద మనిషి" కూడా రాజకీయాల్లో "ఓనమాలు" దిద్దుకోవడం ప్రారంభించింది 1982లోనే అని మరచిపోరాదు! కవి అన్న పేరు 'నీరుకాకికి లేదా' అన్నాడు తెనాలి రామకృష్ణుడు! అలాగే రాజకీయంలో పరిపక్వత కేవలం వయస్సును బట్టే రాదు! తలలు పండిన వారు కూడా రాజకీయాల్లో 'తిరు క్షవరాలు' చేయించుకు రావడం లేదూ?! అందువల్ల నిందలవల్ల, అపనిందలవల్ల ఎవరికీ మంచి జరగదు. తిట్ల రాజకీయం అసలే చెల్లదు. "పరుష వాక్యత సమవర్తి భట్టు మూర్తి" అన్నారు! ఇప్పుడు మనకు రాజకీయాల్లో కూడా "రామకృష్ణలూ", "రామరాజభూషణ"లూ అవతరించేశారు! "నెట్టకమాన, నా మతము తీవ్ర మహోగ్ర భయంకరంబు" అని తిట్టు కవుల్లా రాజకీయ నాయకులు కూడా చాటుకోవచ్చు గాక! కాని రేపు ఓటరు కూడా తాను చాటేది చాటి తీరాలి!

ఆగస్టు 22, 1989

# చిరంజీవులు విద్యార్థి, యువజనులకు...

ధర్మకోపానికి కూడా కొన్ని హద్దులుండాలి. చూరులో ఎలుక పడిందని చెప్పి మొత్తం ఇంటినే తగుల పెట్టుకోవడం అనాలోచితమైన ఆగ్రహం. "కులం" అన్నది అన్ని క్రిమిములలోకి పెద్ద "వైరస్" క్రిమి! నలభైమూడేళ్ళుగా ఈ దేశంలోని పాలకులు చేపట్టిన అధర్మ రాజకీయాలతో పాటు, కుల పిచ్చితో తీసుకొంటూ జీవచ్ఛవంగా మారిపోయిన మన వర్ణ వ్యవస్థను ('నాలుగు పడగల హైందవ నాగుబాము') సంస్కరించడానికి సంఘ సంస్కర్తలు చేసిన ప్రయత్నాలు ఎందుకు విఫలమయ్యాయో కూడా చిరంజీవులైన విద్యార్థి, యువజనులు ప్రశాంతంగా ఆలోచించవలసిన సమయం వచ్చింది. పెద్దలు చేస్తున్న తప్పిదాలకు, రాజకీయ పక్షాలు ఆడుతున్న స్వార్థపూరితమైన రాజకీయాలకు నేటి తరం, భావితరం యువలోకం పావులుగా వినియోగపడరాదు. ఆంధ్రప్రదేశ్ సహా దేశ వ్యాప్తంగా నేడు నడుస్తున్న "రిజర్వేషన్స్" అనుకూల, ప్రతికూల ఆందోళనోద్యమాలకు పరిష్కారం మొత్తం కులవ్యవస్థపైననే ధ్వజమెత్తడం తప్ప మరొకటి కాదు. రెండు రకాల ఉద్యమాల వల్ల కొంత నష్టం జరిగిన మాట నిజమేగాని, ఈ ఆగ్రహం ఈ దెబ్బతో నైనా కులవ్యవస్థను రద్దు చేయించుకోగలిగితే అందరి ప్రయోజనాలూ నెరవేరగల్గుతాయి. కానీ - కుల వ్యవస్థను అంత తొందరగా మన రాజకీయ వేత్తలు (కాంగ్రెస్, జనతాదళ్, బిజెపి, పీఠాధిపతులు ఇత్యాదులు) తొలగనివ్వరు! ఎందుకని? ఎన్నికలు, వోట్లు ఉన్నంత కాలం స్వార్థ రాజకీయాల కోసం సమాజం కులాలతో, మతాలతో చీలిపోయి ఉండాలి! నలభై మూడేళ్ళుగా దేశంలో ఉన్న రిజర్వేషన్లను మనసు పెట్టి అమలు జరపకపోడానికీ, నిర్బంధ ప్రాథమిక విద్యను సార్వత్రికంగా అమలు చేయకపోవడానికీ కారణం ఇదే; కమిషన్ల సిఫారసులను బుట్టదాఖలు చేయడానికి కారణమూ అదే. అధికారం మనుషులను అవినీతికి నెడుతుంది. అవసరం దానిని పెంచుతుంది! బలహీన వర్గాల సముద్ధరణకు ఉద్దేశించిన రిజర్వేషన్లుగానీ, దాని తాలూకూ అమలు జరపవలసిన సంక్షేమ కార్యక్రమాలను గానీ రాజకీయ నాయకులు చేపట్టింది - వాటిని ఎన్నికలలో ఒక సాధనంగా మార్చుకొని, ఆ తర్వాత వాటిని మరచిపోవడానికే! నేడు దేశ నాయకులుగా చెలామణీ అవజూస్తున్న బాపతు అంతా "వర్ణయుద్ధం" - కులాల కొట్లాటలు - రక్తపాతం గురించి విభిన్న కోణాల నుంచి బాహాటంగా బరితెగి ప్రకటనలు చేయడానికి కూడా కారణం, కులాన్ని కవచంగా పెట్టుకొని వర్గ ప్రయోజనాలు ఈడేర్చుకునేందుకేనని యువత మరువరాదు. నిజానికి ఈ దేశంలో - ఈ రెండు రకాల ఉద్యమాలవల్ల కులవ్యవస్థ అంతరించిపోదు సరికదా, మరింత పెచ్చరిల్లి ముక్కుపచ్చలారని ముద్దు బిడ్డలందరి మధ్య ( అన్ని కులాలలోని వారి మధ్య) మానసికంగా శాశ్వతమైన, భయంకరమైన అగాధం ఏర్పడిపోయే ప్రమాదం ఉంది. ఈ రెండు ఉద్యమాలూ, కులాంతర, మతాంతర వివాహాలకు ప్రతిబంధకాలు సృష్టిస్తాయి. నిలువునా చీలిన సమాజం నిండు

జీవనం సాగించలేదు. దురాలోచనా పరులైన రాజకీయవేత్తలు పెట్టిన ఈ చిచ్చును రిజర్వేషన్ అనుకూల, ప్రతికూల ఉద్యమకారులైన యువకులంతా గ్రహించి, వెంటనే మేల్కొనకపోతే, అశాస్త్రీయమూ, నిర్హేతుకమూ అయిన వినాశకర మార్గం నుంచి మళ్ళకపోతే జాతీయ సమైక్యతకు పూడ్చలేని గండిపడుతుంది. మాలిన్యం ఎరుగని లేతమనుసులు విద్యార్థి, యువజనులవి. నిజానికి, నిజాయితీకి నిలబడగల శక్తీ, అబద్ధాలకూ, వంచనలకూ దూరంగా ఉండేశక్తీ ఒక్క యువతకు మాత్రమే ఉంటుంది. ఆ శక్తిని వృథా పోనిచ్చుకోరాదు, ఆ శక్తిని గమ్యంలేని ఉద్యమాలలో ఖర్చుపెట్టుకోరాదు. ఆ శక్తిని రాజకీయవేత్తల స్వార్థ ప్రయోజనాలకు బలికానివ్వరాదు. ఆ శక్తిని రాజకీయ వేత్తల స్వార్థ ప్రయోజనాలకు ఎరకానివ్వరాదు. ఆ శక్తిని మంచిపనులకు, అవసరమైన త్యాగాలకు మాత్రమే వినియోగించుకోవాలి. ఒక చారిత్రిక దశలో, స్వార్థపరుల కుయుక్తులవల్ల శ్రమ విభజనలో కృత్రిమంగా ఏర్పడిన "కుల" వ్యవస్థను నిర్మూలించడం రిజర్వేషన్లవల్లా, లేదా యాంటీ - రిజర్వేషన్ ఉద్యమాలవల్లా అయ్యేపని కాదు! ద్రోణాచార్యుడు, మనువు సృష్టించిన మాయపొరలను మనం ఇంకా విడిచి పెట్ట వలసే వుంది; ఈ రోజుకీ పేర్ల చివర్లలో - నామాంతపు వర్ణరుచులుగా, కులకవచకుండలాలుగా ఆయా కులాలను గుర్తు చేసే పేర్లను తగిలించుకుంటున్న మన మనస్సులు సంకుచిత పరిధిలో ఏనాడో "రిజర్వు" అయిపోయాయి!

మనం ఎక్కడినుంచి ఎక్కడికి ప్రయాణిస్తున్నామో ఒక్కసారి గుర్తు చేసుకోండిః ఈ కుల వ్యవస్థ నిర్మూలన సంస్కర్తలవల్ల కాలేదు; "చారిత్రిక ఘట్టంగా" భావించిన ఒక నాటి "ప్రత్యేక నియోజకవర్గాల' ' (మైనారిటీలు, షెడ్యూల్డు కులాల పేరిట) ఏర్పాటు వల్లనూ సాధ్య పడలేదు; మాక్డొనాల్డ్ కమ్యూనల్ అవార్డువల్లా, గాంధీజీ కుదుర్చుకున్న 'పూనాసంధి' వల్లా సాధ్యం కాలేదు; ఇప్పటికే భారతీయ సమాజాన్ని కుల, మత శక్తులూ, అంతరాల దొంతర్లు పేర్చిన అసమ ఆర్థిక వ్యవస్థా కలిసి చిందర వందర చేశాయి; ఈ దశలో మన సమాజాన్ని మరింతగా విభజించి - పాలించే కుల వ్యవస్థను సంస్థాగతం చేసి, ఇప్పట్లో తేరుకోలేని 'గండి' కొట్టే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ పరిణామం ఎందుకొచ్చింది? 19వ శతాబ్దంలో బ్రిటీష్ పాలకులు చేసిన అనేక తప్పుడు సివిల్, క్రిమినల్ చట్టాలను మనం అప్పనంగా ఎలా సంక్రమింపచేసుకున్నామో, అలాగే రాజకీయ, సాంఘిక ఆర్థిక విభేదాలను పెంచి పోషించే (1935 ఇండియా యాక్టు ప్రకారం) "మాంటేగ్ - చెమ్స్‌ఫర్డ్ సంస్కరణల"లను కూడా కాపీ కొట్టుకున్నాం! అఖిల భారత స్థాయిలో ఆర్థిక దారిద్ర్యం కొలమానంగా కాకుండా, కులాన్ని మాత్రమే కొలబద్దగా మార్చి, సాంఘికంగా ప్రజల బడుగు స్థితిని అంచనా కట్టడానికి బీజాలు నాటిన సంస్కరణలవి! స్వాతంత్ర్యానంతరం 16,000 కోట్ల రూపాయలు ఖర్చుచేసి కూడా మన పాలకులు సాంఘికంగా, ఆర్థికంగా దోపిడీకి గురవుతున్న వర్గాల ప్రజలను ఉద్ధరించలేక పోయారంటే, అత్యాచారాలు ఆపలేకపోయారంటే ఎంత "చిత్త శుద్ధి"తో సంస్కరణలను వీరు అమలు జరిపారో అర్థమవుతుంది!! కాకా కలేల్కర్ కమిషన్ (1955) లెక్క తేల్చిన 2399 "కులాలు" లేదా బాగా వెనుక బడిన 839 "కులాలు" మండల్ కమిషన్ (1978) నాటికి 3,743 కులాలుగా, తెగలుగా పెరిగిపోయాయంటే - ఈ దేశం ఇన్నేళ్ళుగా సాధించిన ఆర్థికాభ్యుదయం ఏ వర్గాలను వరించిందో అర్థం చేసుకోవచ్చు! ఈ విలోమ పరిణామం, పేద వర్గాలను మరింత నిరుపేదలుగా మార్చింది. ఈ అక్రమ ప్రగతి - "రిజర్వేషన్లు" ఉండగానే సజావుగా కొనసాగిపోతోందని గమనించాలి! బండిని ముందు పెట్టి, గుర్రాన్ని వెనకన కట్టారు! ఉత్పత్తి సాధనాలపై పెత్తనాన్ని వ్యక్తుల చేతులలోనే అట్టి పెట్టి, "సోషలిజాన్ని" ఒక అలంకార ప్రాయమైన నినాదంగా మాత్రమే రాజ్యాంగం ఉపోద్ఘాతంలోకి ఎక్కించారు!

ఆర్థిక వ్యవస్థను "ఆడా-మగా" కాని "మిశ్రమ" వ్యవస్థగా మార్చి, మిశ్రమ సంస్కృతిలోని మేలిమిని చంపే కుల, మత ద్వేషాలను చొప్పించి పెంచారు! రాజ్యాంగం ఆదేశిక విధాన సూత్రాలు చెప్పింది వేరు, నాయకులు చేసింది వేరు. అట్టడుగు వర్గాల వారికి కనీస వైద్య ఆరోగ్య సదుపాయాలు లోటులేకుండా అందాలనీ, 14 ఏళ్ళు వయస్సు వచ్చేవరకూ బాలబాలికలకు సార్వత్రిక నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్య గరపాలనీ అవి ఆదేశించాయి. వాటిని గాలికి వదిలేశారు. ఈ పరిస్థితులలో, గంజాయి వనంలో తులసి మొక్కలా కొలదిమంది మేధావులు మాత్రమే పెరుగుతూ వస్తారు. ఈ పరిస్థితులు చక్కబడనంతవరకూ "మెరిట్", "సామర్థ్యం" అన్న వాదనలు అసమ ఆర్థిక వ్యవస్థలో కులాన్నీ, ఆర్థిక సంపన్నతనూ ఆశ్రయించినంతమాత్రాన చెల్లనేరవు. మనకు కావలసింది ఒక్క అంబేద్కర్, ఒక్క గాంధీ, ఒక్క నెహ్రూకాదు - అలాంటివారు వందలు వేలూ అవసరం. ఈ పరిణామం విద్యా సంస్కరణల ద్వారా, ఆర్థిక విప్లవం ద్వారా, నిర్బంధ ఉచిత విద్యావ్యాప్తి ద్వారా రావాలిగాని, రాజకీయ లబ్ధికోసం సంకుచిత ప్రయోజనాల కోసం కులాన్ని ప్రాతిపదికగా చేస్తే రాదు. ఇండియాలో కులానికి, వర్గానికీ తేడా లేదు. రెండూ జోడు గుర్రాలుగా ఒకదాని సరసన ఒకటి పరిగిడుతాయి. కాని కులరహిత సమాజం వర్గాలు రద్దు అయితే గాని ఏర్పడదు. వర్గాలు రద్దు కావడం రిజర్వేషన్ అనుకూల, ప్రతికూల ఉద్యమాల వల్ల జరగదు! ప్రైవేటు ఆస్తిని రద్దు చేయగల సమాజమే వాటినీ తొలగిస్తుంది. అంటే, అంబేద్కర్ భావించినట్టుగా అగ్రవర్ణాల రద్దువల్లనే కులాలు అంతరించవు. వర్గ వ్యవస్థను రద్దు చేయగల శ్రామిక వర్గమే అగ్ర వర్ణాలతో పాటు తనను తాను కూడా రద్దు చేసుకుంటుంది! చిరంజీవులు ఈ వైపుగా ఆలోచించడం ప్రారంభించాలి.

సెప్టెంబరు 13, 1990

# 'తీగ' కదిలిస్తేచాలు డొంకంతా...!

మన వాళ్ళు ఉబుసుపోక అనలేదు - తీగ కదిలిస్తే డొంకంతా కదులుతుందని! ఇప్పుడు కర్ణాటక తీగలు, ఢిల్లీ తీగలు కూడా కదిలాయి, ఫలితంగా భారత తంతితీగల చట్టపు డొంకంతా కదలవలసి వస్తోంది. 1988లో ఏ టెలిఫోన్ టాపింగ్ సమస్యపై వచ్చిన ఆరోపణలు ఆధారంగా (తనకు ప్రత్యక్ష పాత్రలేకపోయినప్పటికీ) నైతిక బాధ్యతపైన, విలువలపైన విశ్వాసముంచి ఆనాటి కర్ణాటక ముఖ్యమంత్రి రామకృష్ణ హెగ్డే పదవికి రాజీనామా యిచ్చారో, ఆ సమస్యపైన ఏ రాజ్య సభ కమిటీ ఏ వ్యక్తి ప్రస్తావనా లేకుండానే తన స్థూలాభిప్రాయాన్ని ప్రకటించిందో, తిరిగి అదే సమస్యపైన వీరేంద్ర పాటిల్ ముఖ్యమంత్రిత్వంలో కర్ణాటక శాసన సభలో చర్చ జరుగుతోంది. కడచిన రెండు రోజులుగా కర్ణాటక శాసన సభా చర్చలు పరిశీలించినప్పుడు తేలిన సారాంశం - ఇంతకూ ఈ "ఫోన్ టాపింగ్స్"కు ఎవరు కారకులన్నది ఎవరూ తేల్చలేకపోవడం! ఆనాడు జనతాదళ్ పాలకపక్షంలోనే తనకు ప్రత్యర్థిగా ఉన్న దేవగౌడ్‌కు, పార్టీ అగ్రనాయకులలో ఒకరైన అజిత్ సింగ్‌కూ మధ్య టెలిఫోన్‌లో ఢిల్లీనుంచి జరిగిన సంభాషణను ఎవరో టాప్ చేశారన్న ఆరోపణపై రేగిన దుమారం మధ్య హెగ్డే పదవినుంచి తప్పుకోవలసి వచ్చింది. ఈ 'టాపింగ్'కు కారకులు నాడు కేంద్రంలో అధికారంలో ఉన్న కాంగ్రెస్(ఐ) ఇంటెలిజెన్స్ వర్గమా లేక హెగ్డే వర్గమా అన్నది ఆ రోజుకీ ఈ రోజుకీ తేలలేదు. అదొక "బ్రహ్మ రహస్యం"గానే ఉండిపోయింది. పైగా ఈ మొత్తం వ్యవహారంపై న్యాయవిచారణ జరిపించాలని హెగ్డే కేంద్రానికి చేసిన విజ్ఞప్తిని రాజీవ్ ప్రభుత్వం కూడా పక్కకు ఎందుకు నెట్టిందో తెలియదు. అయినా "ఫోన్ టాపింగ్" సమస్యకు చరమాంకం రాలేదు! కేంద్రంలో కాంగ్రెస్ (ఐ) తొలగిపోయి, జనతాదళ్ ప్రధాన భాగస్వామిగా ఉన్న నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం ఏర్పడిన తరువాత ఫ్రంట్ అగ్రనాయకులలో. ఒకరూ, అసంతృప్తివాదీ అయిన చంద్రశేఖర్ సరికొత్త ఆరోపణలు చేయడంతో, తిరిగి టాపింగ్ సమస్య ప్రాణం పోసుకుంది. తన ఫోన్‌నూ మరి ఇరవైమంది పార్లమెంటు సభ్యుల ఫోన్ సంభాషణలను "టాప్" చేస్తున్నారని చంద్రశేఖర్ ఆరోపించారు గాని, స్పష్టీకరణ లోపించడంతో ఆ విచారణ మాలపడిపోయింది. అయితే, రాజ్య సభ కమిటీ హెగ్డేపై వచ్చిన ఆరోపణలను పరిశీలించిన తరువాత, తన 82వ నివేదికలో తెల్పిన అంశాలను బట్టి - హెగ్డేకు టాపింగ్ విషయంలో ప్రత్యక్ష సంబంధం ఉన్నట్టు సాక్ష్యాధారాలు లేవు! అయినా మళ్ళీ ఆ సమస్యను కర్ణాటక అసెంబ్లీలో కొందరు సభ్యులు తేవనెత్తారు. ఈలోగా కేంద్రంలో వి.పి.సింగ్ ప్రభుత్వం అసలు "ఇండియన్ టెలిగ్రాఫ్ యాక్ట్"ను సవరించి, వ్యక్తుల మధ్య స్వేచ్ఛాయుతమైన సంభాషణలకు, స్వేచ్ఛకు అవరోధం కల్గించే అయిదవ సెక్షన్ (2)ను పూర్తిగా తిరగతోడాలని, ఇందుకు బిల్లు తేవాలనీ నిర్ణయించింది. ఎన్నికల ప్రణాళికలో చేసిన వాగ్దానాన్ని అమలు పరుస్తామని చెప్పింది. అయితే ఇది కూడా "దూరదర్శన్

అటానమీ లాంటిదే'' ! స్వయం పాలనా వ్యవస్థగా "దూరదర్శన్"ను ప్రకటించాలని ప్రభుత్వానికి కోరిక ఉండవచ్చుగాని, దాని రాజకీయ ప్రయోజనాలు కళ్ళాలను పూర్తిగా విడిచి పెట్టనివ్వవు! అలాగే టెలిగ్రాఫ్ యాక్టును "సవరించాల''ని ఉద్దేశ్యం ఉంటుందిగాని, సవరించలేదు! హెగ్డేపై ప్రత్యక్షసాక్ష్యం ఏదీ లేదని కాంగ్రెస్(ఐ) ముఖ్యమంత్రి వీరేంద్రపాటిల్ ఒప్పుకొంటున్నారు, కాని ఆనాటి "సంబంధిత పరిస్థితులను'' తను పరిగణనలోకి తీసుకుంటున్నామన్నారు! ఇంతకంటే విచిత్రమైన విషయం - ఏ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఆదేశాలపై ఈ టాపింగ్ జరిగిందో, ఆ ఉన్నతాధికారి లేఖకు సంబంధించిన ఫైళ్ళను ఆయన సభకు సమర్పించడానికి నిరాకరించడం! ఎందుకంటే ఆ ఫైలే మొత్తం "టాపింగ్" పూర్వాపరాలకు ప్రాణప్రదం. ఎందుకని? 1986లోనే నాటి కేంద్ర ప్రభుత్వం (రాజీవ్ ప్రభుత్వం) "ప్రజాప్రయోజనాల" దృష్ట్యా, "దేశరక్షణ దృష్ట్యా'' టెలిగ్రాఫ్ యాక్ట్ ప్రకారం అమలు జరపవలసిన "టెలిఫోన్ టాపింగ్ ఆదేశ' ' పత్రాన్ని ఎప్పటికప్పుడు పునరుద్ధరించడం లీగల్‌గా అవసరమని రాష్ట్ర ప్రభుత్వానికి ఒక లేఖ వ్రాసింది. అలాగే కర్ణాటక గూఢాచారిశాఖ ఉన్నతాధికారి రఘురామన్ లెక్క ప్రకారం కూడా "1962 డిసెంబర్ లగాయతూ ఇన్నేళ్ళుగానూ ముఖ్యమంత్రుల పూర్వానుమతితో, వారితో సంప్రదించిన మీదటనే టెలిఫోన్లు టాపింగ్'' కార్యక్రమం యధేచ్ఛగా సాగిపోతోంది''!! అయితే ఇక్కడో చిన్న మెలిక కనిపిస్తుంది. ఆ పని యాక్ట్ ప్రకారం రొటీన్‌గా చేస్తున్న పనికాదు. కాని ఆ పని హెగ్డే విషయంలో సంప్రతించిన తరువాతనే జరిగిందా లేదా అన్నది ఇక్కడ తేలవలసిన సమస్య. హెగ్డే ప్రకటన ప్రకారం, రొటీన్‌గా కేంద్రం నుంచి వచ్చిన లేఖ ఆధారంగా, ప్రస్తుతం అమలులోవున్న ఉత్తర్వును ("Existing order on telephone tapping") కేవలం లాంఛనంగానే అనుమతించడం - "రీవాలిడేట్'' చేయడం. ఈ "రీవాలిడేషన్'' కేంద్రం లేఖ ప్రకారం జరిగినట్టు ఆ లేఖను బట్టే అర్థమవుతుంది!

వెనుకటికొకడు - ఆరోపించడానికి ఏమీ దొరక్క "మీ తాత పొగచుట్టలు తాగేవాడట, తెలుసా'' అని బూకరించాడట. అలాగే జనతా, కాంగ్రెస్(ఐ), జనతాదళ్ ప్రభుత్వాల హయాముల్లో ఫోన్ టాపింగ్స్‌పై పరస్పరం సాగుతున్న ఆరోపణలు కూడా ఉన్నాయి. టాపింగ్‌ను ఖచ్చితంగా దేశ రక్షణకు భంగకరమైన విషయాలకూ, ప్రమాదకర సన్నివేశాలకూ పరిమితం చేయకుండా, ఆ పరిధులు దాటిపోయి అధికారంలో ఉన్న పక్షాలు కేవలం రాజకీయాల కోసమే టెలిగ్రాఫ్ యాక్టును వినియోగించడంవల్ల ఇంత చెడు జరుగుతోందని గుర్తించాలి. ఎమర్జెన్సీ కాలంలో ఇందిరాగాంధీ పేరట ఈ టెలిగ్రాఫ్ చట్టం ప్రత్యర్థుల అణచివేతకు ఎంతగా దుర్వినియోగం అయిందో, కేవలం నోటిమాటపైననే ఆదేశాలను ఆమె, పదవుల వేటలో ఆమె ప్రాపకం కోసం పడిగాపులు పడిన పార్టీ ప్రముఖులూ బలవంతంగా ఎలా అమలు చేయిస్తూ వచ్చారో షా కమిషన్ నివేదిక భావితరాలకు గుణపాఠంగా హెచ్చరికలు చేసింది. అధికారంలో ఉన్నవారికి - తన పార్టీలోని తన ప్రత్యర్థులు తనకు వ్యతిరేకంగా పన్నే కుట్రల గురించి తెలుసుకోవడానికి, ప్రతిపక్షాలు పన్నుతున్న వ్యూహాన్ని పసికట్టడానికే ఈ చట్టం ఉపయోగపడుతోంది. తెలివిగల టెర్రరిస్టులూ, మిటిటెంట్లూ, నక్సలైట్లూ లేదా ఇతర కుట్రదారులెవరూ బెదిరింపులను మినహాయించి - కుట్రకోసం టెలిఫోన్లు వాడిన ఘటనలు చాలా తక్కువ. కుట్ర సంభాషణను టాప్ చేసి, అది ఆధారంగా హోంశాఖ బనాయించిన కేసు ఒక్కటీ ఇంతవరకూ లేదు! ఈ టాపింగ్ భాగోతమంతా ప్రధానంగా పదవీ వేటలో భాగంగా, పదవీ రక్షణలో భాగంగా, ఫిరాయింపుల పర్వంలో అంతర్భాగంగా, వాటి నిరోధింపుల అధ్యాయంలో ఒక భాగంగా మాత్రమే జరుగుతోంది. పార్లమెంటు సభ్యుల ఫోన్స్‌టాప్ అయితే అది "సభ్యుల హక్కులకు'

'భంగకరమైన పనట; మరి సాధారణ పౌరుడికి ఆ హక్కు ఎందుకని మృగ్యం? టెలిగ్రాఫ్ యాక్టు 1885 నాటిదైతే మన పోలీసు చట్టాలన్నీ 1860ల నాటివి. అధికార రహస్యాల చట్టం 1923 నాటిదీ. నాటి నుంచీ నేటి వరకూ పేరుకు "దేశ రక్షణ", ఆచరణలో నాయకుల "దేహ రక్షణ" లేదా పదవీ వేటలో ఆత్మరక్షణ! అధికారం బహుచెడ్డది. అందేకే పౌరహక్కుల రక్షణకోసం ప్రతి ఒక్కరూ తన రెండు కళ్ళను వేయికళ్ళుగా చేసుకొని మసలుకోవాలి! దేశానికి నాలుగు దశాబ్దాల రాజకీయ స్వాతంత్ర్యం తర్వాత కూడా ఈ వలసావశేషంగా మిగిలిపోయిన పాడుపడిన చట్టాలను, వలస పాలకుల నుంచి సంక్రమించిన పిదప బుద్ధులను పాలకులూ, ప్రజా ప్రతినిధులూ ఎందుకు సవరించుకోరు? నేడు మనకున్న ఎన్ని చట్టాలు పాలసావశేషాలు కావు? మన టెలిగ్రాఫ్ చట్టం ప్రకారం - టెలిఫోన్స్‌కు "సౌండ్ ప్రూఫ్ మెకానిజం" లేదు. అందువల్లనే బగ్గింగ్ సౌండ్స్ ఇరుప్రక్కల వారికీ వినిపిస్తూనే ఉంటాయి! కనుకనే ఈ చట్టం రాజ్యాంగంలో వ్యక్తి స్వేచ్ఛను పౌరునికి హామీపడుతున్న 21వ అధికరణ ప్రకారం కూడా అసమర్ధనీయం అవుతోంది. బహుశా అందువల్లనే ఇటీవల యూరోపియన్ కోర్ట్ ఆఫ్ హ్యూమన్ రైట్స్ కూడా (1990 ఏప్రిల్ 1న) రెండు కేసులలో తీర్పు చెబుతూ, ఇండియన్ టెలిగ్రాఫ్‌ను కూలంకషంగా మార్చకపోతే పౌరుల ప్రాథమిక హక్కులకే ప్రమాదం అని హెచ్చరించవలసి వచ్చింది. మేనకా గాంధీ కేసు విషయంలో కూడా ఇదే జరిగింది. కనుకనే మన చట్టాలలో పౌరునికి తగిన రక్షణల సంగతి అలా వుంచి, అసలు రక్షణలే లేవు, ఉన్న రక్షణలన్నీ అధికారులవీ, వాళ్ళపైన ఆధారపడిన పాలకులవీ! కనీసం ఫ్రెంచి ప్రభుత్వమైనా వాళ్ళ చట్టంలో 17 రకాల రక్షణలను పౌరులకు కల్పించింది. అక్కడ కనీసం జడ్జి ఆదేశం మేరకైనా ముఖ్య సందర్భాలలో అధికారులు పౌరుల ఫోన్స్‌ను టాప్ చేస్తారు. ఇక్కడ న్యాయమూర్తి ఆదేశాలతో కూడా నిమిత్తం లేదు. రాజు: చెప్పిందెల్లె శాస్త్రం, చేసిందెల్లె ధర్మం - అమలులో ఉంది; వలసావశేషాలనూ ఉన్న చట్టాలనూ మార్చుకోవాలి.

జూన్ 28, 1990

# కమ్యూనిస్టు ప్రపంచంలో కల్లోలం-I

బీజింగ్‌లో విద్యార్థుల తిరుగుబాటు తర్వాత, విద్యార్థుల కోర్కెలను చైనా ప్రభుత్వం చర్చల ద్వారా కాకుండా పాశవికంగా అణచి, "విప్లవ ప్రతీఘాతకుల" పేరిట కొంతమందిని కాల్చి చంపిన తరువాత, చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం ఓ విచిత్రమైన వాదనలతో ప్రపంచం ముందు నిలబడుతోంది! "దెయ్యాలు వేదాలు"వల్లించినట్టు, ఏమీ ఎరుగని 'గురువింద గింజ' లా "చైనా డెయిలీ" పత్రిక ద్వారా ఒక ప్రకటన విడుదల చేసింది. విద్యార్థులు కోర్కెలను ప్రశాంతంగా వెలిబుచ్చడాన్నీ, ప్రజాస్వామికంగా చర్చించడానికి అవకాశం కల్పించవలసిందని కోరడాన్నీ "దేశద్రోహ" చర్యగా, "ప్రతీఘాత విప్లవం"గా భావించి సైనిక చర్యకు దిగిన నాయకత్వం ఈ ప్రకటన ద్వారా మరొకసారి తన చర్యలను సమర్థించుకోజూచింది. ఆ ప్రకటనలో మనస్సు లేదు. నిజాయితీ లేదు, నిండుదనమూ లేదు. "కమ్యూనిస్టు పార్టీ ప్రభుత్వాన్ని కూలదోసి, సోషలిస్టు వ్యవస్థను నాశనం చేసి, బూర్జువా రిపబ్లిక్‌ను తిరిగి స్థాపించడాని"కి ఈ "ప్రతీఘాత విప్లవం" ప్రయత్నించిందని నాయకత్వం చెప్పింది!! విద్యార్థులకు ఇంతవరకూ తమ ముఖాలు చూపించలేకపోతున్న చైర్మన్ డెంగ్ సియావో పింగ్, ప్రధాని లీపెంగ్ ప్రభృతులు దొంగచాటుగా జూన్ 9న టెలవిజన్‌లో సైనిక నాయకత్వంతో కలిసి ముచ్చటిస్తూ, సైనిక చర్యను సమర్థిస్తూ ప్రకటన చేశారు. పార్టీ ప్రధాన కార్యదర్శి జావో జియాంగ్‌ను పదవీ భ్రుష్టుణ్ణి చేసి, "మల్టీ నేషనల్స్" కంపెనీలకు ద్వారాలు బాహాటంగా తెరిచిన షాంఘై పార్టీ నాయకుడు జియాంగ్ జెమిన్‌ను చైనా పార్టీ ప్రధాన కార్యదర్శిగా ఎక్కించారు. దానికి తోడుగా డెంగ్ ప్రకటన ఆధారం చేసుకుని పార్టీ క్రమశిక్షణ తనిఖీ సంఘం ఒకటి "సోషలిస్టు మార్గా"నికి దూరంగా జరిగిన వారందరినీ పార్టీనుంచి బహిష్కరించాలని దండోరా వేసింది! అంతేకాదు, పార్టీ పత్రిక "పీపుల్స్ డైలీ" ఇంకొక అడుగుముందుకు వెళ్ళి "పార్టీ దేశంలో తలపెట్టిన ఆర్థిక సంస్కరణలలోగాని, చైనాతో సంబంధాలకోసం ఇతర దేశాలకు ద్వారాలు తెరిచి ఉంచే విధానంలోగాని ఎట్టి మార్పు ఉండద"ని తెలిపింది. నిజానికి "సోషలిస్టు మార్గా"నికి దూరంగా జరగడానికి, "సంస్కరణల" పేరిట రకరకాల పద్ధతులను - ప్రైవేట్ ఆస్తికి ద్వారాలు తెరిచి, మార్కెట్ ఎకానమీ పేరిట స్వేచ్ఛా వ్యాపారానికి, బోనస్‌లు, ఇతర ప్రోత్సాహకాల పేరిట ఆర్థిక అసమానతలు మళ్ళీ తలెత్తడానికి అవకాశాలు కల్పించింది ఎవరో కాదు, ఈ డెంగ్ ప్రభృతులే! చివరకు విద్యార్థులు కోరుతున్న విద్యా సంస్కరణలను ప్రవేశ పెట్టడంలో కూడా వారు విఫలమయ్యారు. 1989 మేలో బీజింగ్ ఘటనలకు పూర్వరంగాన్ని 1985లోనే ఊహాన్ నగరంలో విద్యార్థి ప్రదర్శనలు సమకూర్చి పెట్టాయి. యూనివర్సిటీల్లో అధ్యాపకుల సెలక్షన్‌లో, వైస్-ఛాన్సలర్‌ల నియామకాల్లో జరుగుతున్న అవకతవకలకు, నిరంకుశ

నిర్ణయాలకు నిరసనగా విద్యార్థులు, అధ్యాపకులు సమష్టిగా ఆనాడే పెద్ద ఎత్తున ప్రదర్శనలకు దిగారు. విద్యావేత్తలు కానివారు కూడా వైస్-ఛాన్స్‌లర్‌లుగా నియమితులు కావడం మన దేశంలోనే కాదు, చైనాలో కూడా సాగుతోంది! కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం లేకపోతే, ప్రజ్ఞావంతుడైన గ్రాడ్యుయేట్ అయినా సరే ప్రమోషన్‌కు "అనర్హుడ"వుతాడు! అందుకే సెంట్రల్ చైనాలోని ఉహాన్‌లో మొదటిసారిగా 1985లో స్వతంత్ర విద్యార్థి సంఘం అవతరించి, పోరు ప్రారంభించవలసి వచ్చింది! యూనివర్సిటీ వ్యవస్థకు పోటీగా కమ్యూనిస్టు పార్టీ సంస్థ కూడా నీడలా అక్కడ వెన్నాడడంవల్ల వచ్చిన ఫలితం యిది! చైనాలో బీజింగ్, షాంఘైల తార్వత హెచ్చు సంఖ్యలో విద్యా సంస్థలు వర్ధిల్లిన నగరం ఊహాన్. అందువల్ల ప్రభుత్వంలో మార్పు లేకుండా, వ్యవస్థను సంస్కరించకుండా విద్యా వ్యవస్థలో కూడా మౌలికమైన మార్పులు సాధ్యపడవని బహుశా విద్యార్థులు భావించి ఉంటారు. అందుకే ఈ ఆందోళన, తొక్కిసలాట!

ఇప్పుడు చైనీస్ నాయకత్వం చెబుతున్నది పరస్పర విరుద్ధం. సోషలిజం పైనే విశ్వాసం పోయేటట్టు అమానుష చర్యలకు తలపడిన నాయకత్వం ప్రజలను రాజకీయంగా, వైజ్ఞానికంగా చైతన్యవంతులను చేయడానికి దేశ వ్యాప్తంగా మావో తలపెట్టిన "సాంస్కృతిక విప్లవాన్ని" కాలదన్ని, నీరసింపజేసి, ఇప్పుడు ప్రత్యేకించి "జన చైతన్య ఉద్యమా"న్ని సాగిస్తానంటోంది! అలా అని "దాసుడు తప్పులు ఒక్క దణ్ణం"తో సరిపెట్టుకోవాలని చూస్తోంది! తమది నిజమైన "క్షాళనోద్యమమే" అయితే విదేశీ పెట్టుబడులకు దేశాన్ని బాహాటంగా తెరిచి పెట్టే విధానాన్ని ఇక ముందు కూడా కొనసాగించదలచామని ఆ నాయకత్వం ప్రకటించి ఉండదు! ఇదే దాని "జన చైతన్య ఉద్యమా"నికి అర్థమైతే ఆ మార్పులను ప్రశ్నించవలసిందే: డెంగ్ ప్రభృతులు ప్రవేశ పెట్టిన "సంస్కరణల" స్వభావాలను అర్థం చేసుకోవాలంటే అందుకు సంబంధించిన అధికార నివేదికలను పరిశీలించవలసిందే ("'ఏ రిపోర్ట్ ఆన్ ఎకనామిక్ రిఫారమ్' '; విదేశీ కంపెనీలకు పూర్తి రాయితీలు కల్పిస్తూ 1986 ఎప్రిల్ 12న రూపొందించిన చట్టం).

కష్టపడి పనిచేసేవాళ్ళకూ, ఎక్కువ ఉత్పత్తి చేసేవారికి "ఆదాయాల్లో వ్యత్యాసాలు చూపించాలని, ఇందుకు బోనసులు విధిగా ప్రవేశ పెట్టాలనీ" ఇది "వ్యక్తి చొరవ" కిందకే వస్తుంది గాని, "దోపిడీ" కిందకు రాదనీ ఆ డాక్యుమెంట్లు స్పష్టంచేశాయి! అంటే, మనిషి తోటి మనిషిని దోపిడీ చేసే వ్యవస్థను రద్దు చేసుకున్న సమాజానికీ, నిత్యం పరస్పరం దోపిడీపై ఆధారపడిన ధనిక వర్గ వ్యవస్థకూ స్వభావంలో తేడాలేదని చైనీస్ నాయకత్వం (ఇప్పుడు సోవియట్‌లో కూడా) నిరూపించదలిచింది! ఈ వ్యతాసాలను, తిరిగి ప్రవేశ పెట్టినందువల్లనే, ప్రైవేట్ ఆస్తికి తలుపులు తెరిచినందువల్లనే ఆ అవకాశం తీసుకొని డెంగ్, చైనా ప్రెసిడెంట్ షంగ్, చౌ-ఎన్-లై దత్తపుత్రుడైన నేటి ప్రధాని లీ-పెంగ్ ప్రభృతుల బిడ్డలు "సంపన్న వర్గాల" హోదాలో చేరిపోయారనీ, విలాస జీవితాలు గడుపుతున్నారనీ, ఈ అవినీతి అంతరించాలనీ, ఈ ప్రవర్తనపై విచారణ జరపాలనీ - విద్యార్థులు "మే" ఉద్యమంలో ఒక ప్రధాన కోరికను వెలిబుచ్చిన సంగతి మరవరాదు! ఈ కొడుకుల బాధ ఇక్కడే అనుకున్నాం, చైనాలో కూడా వచ్చింది!! కమ్యూనిస్టు పార్టీ నాయకత్వ ప్రవర్తన వారి మహోపాధ్యాయుడు లెనిన్ బోధించిన "కమ్యూనిస్టు సబ్బోట్నిక్" (Subbotnik Spirit) చైతన్యానికీ భావనకూ పూర్తి విరుద్ధం. దోపిడీ వ్యస్థను రద్దు చేసుకున్న సోషలిస్టు సమాజ నిర్మాణం ఐచ్ఛికమైన చొరవవల్ల, సేవా దృక్పథం వల్లనే సాధ్యపడుతుందిగాని, బోనస్‌ల వల్లా, ఇతర "ఎర' 'లవల్లా కాదని లెనిన్ చెప్పాడు. అంతేగాదు, సోషలిజంలో కూడా వర్గాలు అంత త్వరగా రద్దు కావని,

వందలాది సంవత్సరాల జడత్వం, స్వార్థ చింతన, సంప్రదాయ పద్ధతులూ అజ్ఞాతంగా కొన్నాళ్ళు పనిచేస్తూనే ఉంటాయని చెప్పాడు. కనుకనే వర్గాలు పూర్తిగా రద్దు కావాలంటే, "పెట్టుబడి దారీ వ్యవస్థను తొలగించడమేగాక, వ్యక్తిగత యాజమాన్యపు హక్కును రద్దుచేయడమే గాక, ఉత్పత్తి సాధనాలపై ప్రైవేట్ యాజమాన్యపు హక్కును కూడా రద్దు" చేసి తీరాలన్నాడు. అప్పుడు మాత్రమే పల్లెలకు - పట్టణాలకూ, కార్మికుల శ్రమకూ, మేధా శ్రమకు మధ్య వ్యత్యాసాలు కూడా తొలగుతాయన్నాడు ("On Culture and Cultural Revolution"). ఇప్పుడీ ఆలోచనకే ఎసరు పెట్టారు డెంగ్ ప్రభృతులు. పైగా 1960లో చేసినట్టుగానే వీరు, చెట్టు పేరు చెప్పి కాయలు అమ్ముకున్నట్టుగా మావో పేరును వాడుకుంటూ, ఆచరణలో "మావో భావనకు" జయప్రదంగా తూట్లు పొడిచారు! చైనా ప్రజలనేగాక, ప్రపంచ దేశాలను కూడా ఈ వంచనా శిల్పంతోనే ఇంకా మోసగిస్తున్నారు.

జూన్ 28, 1989

# కమ్యూనిస్టు ప్రపంచంలో కల్లోలం-2

చైనాలో నేడు వస్తున్న పరిణామాలు పోలెండ్, చెక్‌స్లావేకియా, హంగరీలలోనూ, విభిన్న జాతులకు నిన్నటివరకూ నిలయంగా ఉన్న సోవియట్ రిపబ్లిక్‌లలోనూ వస్తున్న పరిణామాలకు పెద్దగా భిన్నమైనవేమీ కావు. ఎక్కడైనా సంస్కరణలు, సడలింపులు మంచి పరిణామాలకు దారితీయాలి కాని అంతకు ముందుకంటే వికృత మార్గాలకు మళ్ళకూడదు. విప్లవాలను జయప్రదంగా నిర్వహించి, సాంఘిక, ఆర్థిక రంగాలలో ప్రపంచానికి ఆదర్శంగా ఘన విజయాలను సాధించిన ఈ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు ఇప్పుడు ప్రజల సమస్యలు ముందుకు చొచ్చుకు వచ్చేసరికి - అటు తమ ప్రభుత్వాలనూ, ఇటు బ్యూరాక్రసీలనూ అదుపులో పెట్టుకోవడంలో విఫలమవుతున్నాయి. వ్యవస్థపై ప్రజలలో క్రమంగా విశ్వాసం సడలుతున్న సమయంలో సోవియెట్ యూనియన్‌లో గోర్బచేవ్ మేలుకొన్నాడు, ప్రజల నాడిని పట్టుకున్నాడు. రాజకీయాలలో "నిర్మొహమాటపు" తాత్వాన్ని(గ్లాస్‌నాస్త్), సాంఘిక, ఆర్థిక రంగాలలో "పునర్నిర్మాణం"(పెరిస్ట్రోయికా) ప్రవేశపెట్టి ముందుకు సాగుతున్నాడు. కాని ఆయన కూడా అధికారం చేపట్టిన మొదటి రోజుల్లో పార్టీలోని ముఖ్యులకు రెండు పదవులు ఉండకూడదని, మన దేశంలో విఫలమైన "కామరాజ్ ప్లాన్" లాంటిదాన్ని ఒకటి ప్రకటించాడు. అయితే ఆచరణలో ఇప్పుడు ఆయనే ప్రెసిడెంటూ, పార్టీ ప్రధాన కార్యదర్శి కూడా! ప్రస్తుతం రష్యా అనుభవిస్తున్న ఇబ్బందులన్నిటికీ కారణాన్ని తన పూర్వపు పాలకుల మాదిరే పాత నాయకత్వం మీదకు, స్టాలిన్‌పైకే నెట్టారు. గోర్బచేవ్ పార్టీ కేంద్ర కమిటీ జనాంతిక సమావేశంలో ఇలా పేర్కొనవలసి వచ్చింది: "దేశంలో ఆహార సమస్య పరిష్కారం కాలేదు. ఇళ్ళ సమస్య తీవ్రంగా వుంది. దుకాణాల్లో నిత్యావసర సరకులకు కొరత ఏర్పడింది. ఈ కొరత ఇంకా పెరిగిపోతోంది. ప్రభుత్వ ద్రవ్య (ఆర్థిక) పరిస్థితి ఆందోళన కరంగా ఉంది". తన అధికారాన్ని నిలదొక్కుకోడానికి ఇతర నాయకత్వాన్ని ఇందుకు నిందించవలసి రావచ్చుగాని 72 ఏళ్ళ విప్లవం తర్వాత దేశంలో సాంఘిక పరిస్థితులు ఎలా ఉన్నాయో తిరిగి గోర్బీ మాటల్లోనే వినాలంటే - "మాటకూ, చేతకూ గండి పెరిగింది... నైతిక విలువలు పతనమవుతున్నాయి, విప్లవకాలంలో, ఆ వీరోచిత దినాలలో, తొలి పంచవర్ష ప్రణాళికలు అమలు జరుగుతున్న ఆ రోజులలో, ఇనుమడించిన దేశభక్తితో సాగిన రెండవ ప్రపంచ మహా సంగ్రామ కాలంలో, తర్వాత పునరావాసం దశలో ప్రజల మధ్య పెరిగిన ఆ గొప్ప సంఘీభావం కాస్తా సడలిపోయింది; మద్యపానం, మాదక ద్రవ్యాలు సేవించడం పెరిగిపోయింది; నేరాలు పెరుగుతూ వచ్చాయి; సోవియట్ సోషలిస్టు నాగరికతకు భిన్నమైన అన్య నాగరికతా ధోరణులు చొరబారాయి. ఫలితంగా వెర్రిబాగులతనం, వికృత చేష్టలు, చౌకబారు అభిరుచులూ బలిశాయి; ఇవన్నీ వెరసి సైద్ధాంతిక దారిద్ర్యానికి దారి తీశాయి" ('పెరిస్ట్రోయికా' - గోర్బీ). గోర్బచేవ్ వేసిన ఈ అంచనాలు సరైనవే. కాని ఆయనే

చెప్పినట్టు విప్లవ దశలో, నిర్మాణ దశలో, యుద్ధకాలంలో, ఆ తర్వాత బ్రహ్మాండంగా సాగుతూ వచ్చిన పునర్నిర్మాణ దశలో లెనిన్-స్టాలిన్‌ల నాయకత్వాన నెలకొన్న ఆ సమష్టి చింతన, ఆ సంఘీభావం, సోవియెట్ రిపబ్లిక్‌ల మధ్య, జాతుల మధ్య ఆనాటి సమైక్యతా భావన ఇప్పుడెందుకు సడలిపోవలసి వచ్చిందో ఆయన సరైన సమాధానం చెప్పరు! ప్రైవేట్ ఆస్తులపై మమకారం పెంచడం, మార్కెట్ ఎకానమీ పేరిట ప్రైవేట్ వ్యాపారాలను ప్రోత్సహించడం, మల్టీ నేషనల్స్‌ను బేషరతుగా దించడం అక్కడ కూడా ప్రారంభమైంది. జాతుల సమస్య పరిష్కారంలో ప్రపంచ దేశాలకే తలమానికంగా, ఆదర్శ రిపబ్లిక్‌గా లెనిన్-స్టాలిన్‌లు తీర్చిదిద్దిన సోవియెట్ రిపబ్లిక్‌లు అయిన జార్జియా, కజకిస్తాన్, అజర్‌బైజాన్, ఉజ్‌బెకిస్తాన్‌లలోనూ, ఇస్తోనియా, లాట్వియా తదితర బాల్టిక్ రిపబ్లిక్‌లలోనూ పెద్ద ఎత్తున జాతి ఘర్షణలు, వేర్పాటు ధోరణలూ ప్రబలిపోతున్నాయి. ఎందుకని? ఈ ఘర్షణలకు ప్రారంభం స్టాలిన్ జన్మస్థలమైన జార్జియాలోనే బీజాలు ఎందుకు పడ్డాయి? స్టాలిన్ మీద రాజకీయ కక్షను, ప్రజల మీదగా తీర్చుకోవడం సమర్థనీయమా? ఇప్పటి ఘటనలకు కారణం - లోగడ ఏనాడో దక్షిణ జార్జియాలో టర్కిష్ సరిహద్దు ప్రాంతాల్లో నివసించే మెస్‌కెట్ టర్క్స్‌ను (Meskhet Turks) ఉజ్‌బెకిస్తాన్‌లో స్టాలిన్ స్థిరపరిచాడనీ, నేడు జాతిగా ఉజ్‌బెక్‌లకూ, ఈ మెస్‌కెట్ టర్కులకూ మధ్య చెలరేగిన ఘర్షణలకు కారణం ఇదేననీ గోర్బచేవ్ ప్రభృతులు ప్రచారం చేయడం దుర్మార్గం కాదా? ఆ కారణాన ఇప్పుడు అక్కడ జాతి కొట్లాటలు పెరగడానికీ, అనేక వందల మంది చనిపోవడానికీ వాతావరణం కల్పించడం ఘోరంకాదూ? అలాగే కజకిస్తాన్‌లోని పెక్కు పట్టణాలకు కూడా ఈ జాతి ఘర్షణలు విస్తరించాయి. "ఎంత మంది చనిపోయారో చెప్పడాని"కి వీలులేదనీ, సోవియెట్ రక్షణ దళాలపైన కూడా స్థానికులు విరుచుకు పడ్డారనీ వింటున్నాం. గోర్బచేవ్ వచ్చిన తరువాత ప్రైవేట్ రంగంలో ఏర్పాటు చేసిన కో-ఆపరేటివ్స్‌లో ప్రైవేట్ బిజినెస్ ప్రయోజనాలు పెరిగిపోయి, సరకుల కొరత పేరిట ప్రవేశపెట్టిన "రేషనింగ్" కాస్తా అవినీతి పాలవుతున్నందన -అసలు "రేషనింగ్"నే ఎత్తివేయవలసిందిగా కోరుతూ యువకులు ఉద్యమించారు! ఇది అశాంతికి దారితీసింది. అంతేకాదు, ఏ స్టాలిన్‌ను అయితే మెస్‌కాట్ టర్క్స్ వలసకు కారకుడని ప్రస్తుత పాలకులు నిందిస్తున్నారో, అదే నిందను పశ్చిమ కజకిస్తాన్‌లో గోర్బచేవ్ ప్రభృతులు కూడా నేడు మోయవలసి వస్తోంది! స్థానికులను కాదని,ఇతరులను తమ "ప్రాంతానికి తీసుకొచ్చినం"దుకు పశ్చిమ కజకిస్తాన్ యువకులు పెద్ద ఎత్తున ప్రదర్శనలకు, కొట్లాటలకు దిగారు. ఉజ్‌బెకిస్తాన్‌లో ఘర్షణలవల్ల తిరిగి జార్జియాకు ప్రవేశిస్తున్న మెస్కకాట్ టర్క్స్‌తో జార్జియన్లు ఘర్షించడం - పరిస్థితి సోవియెట్ ప్రభుత్వం అదుపు తప్పిపోయినట్టు రుజువు చేస్తోంది. అలాగే జార్జియా రాజధాని తిబ్లిస్‌లో జరిగిన ఘర్షణలలో సైన్యం జరిపిన కాల్పుల్లో 20 మంది ప్రదర్శకులు బలయ్యారు. మరొక వైపున ఉజ్‌బెకిస్తాన్‌లోని ఆర్మీనియన్లు హెచ్చుగా ఉన్న ప్రాంతాలను విడగొట్టి ఆర్మీనియా రిపబ్లిక్‌లో విలీనం చేయాలని ఉద్యమం సాగుతోంది. ఇలా బహుళ జాతుల సమైక్య వేదికగా ఏడు దశాబ్దాలుగా ఎలాంటి ఘర్షణలు లేకుండా గడిపిన రిపబ్లిక్స్ ఈనాడు అల్లకల్లోలంలో ఉన్నాయి. ప్రధానంగా ఉత్తర కాకసస్ పర్వత శ్రేణులలో కేంద్రీకరించిన ఈ రిపబ్లిక్స్ భవితవ్యం - గోర్బచేవ్ చెప్పినట్టు జాత్యహంకారానికి నాయకత్వం దూరంగా ఉండడంవల్ల, పరస్పరం గౌరవభావంతో మెలగడంపైననే ఆధారపడి ఉంది. మరి ఆ వైపు ఆచరణకు ఉద్యమించేదెప్పుడు?

జూన్ 29, 1989

# కమ్యూనిస్టు ప్రపంచంలో కల్లోలం-౩

1989 జూన్ 3-4 తేదీలు చైనా చరిత్రలోనూ, చైనీస్ కమ్యూనిస్టు పార్టీ చరిత్రలోనూ "దుర్దినం" (బ్లాక్ డే) అయితే, 1989 జూన్ 5వ తేదీ పోలెండ్‌లో రాజకీయాలను తారుమారు చేస్తూ యూరోపియన్ చరిత్రలో కొత్త మలుపునకు కారణమైంది. సోవియెట్ చరిత్రలో "విస్తృత ప్రజాస్వామిక" ప్రాతిపదికపై తొలిసారిగా ఇటీవల జరిగిన ఎన్నికలు, ప్రజా ప్రతినిధుల సభకు, సుప్రీమ్ సోవియెట్‌లోని రెండు విభాగాలకు (యూనియన్ ఆఫ్ సోవియెట్స్, యూనియన్ ఆఫ్ నేషనాలిటీస్) ఎన్నికలు జరిగిన పద్ధతి తూర్పు యూరప్ దేశాలలో త్వరలో రానున్న పరిణామాలకు సూచన. పైగా సోవియెట్ అధినేత గోర్బచేవ్ నిరాయుధీకరణ విషయంలో, తూర్పు యూరప్ నుంచి వార్సా సంధి రాజ్యాల సేనలను తగ్గించడంలో, ఆఫ్ఘనిస్తాన్ నుంచి రష్యన్ సేనలను ఉపసంహరించడంలో పాటిస్తున్న పద్ధతులూ, అనుసరిస్తున్న విధానాలూ కమ్యూనిస్టు ప్రపంచంలోనే నూతన పరిణామాలకు నాంది పలుకుతున్నాయి. ఈ నిర్ణయాలతో ప్రభావితమవుతున్న తూర్పు యూరప్‌లోని పోలెండ్, హంగరీ తూర్పు జర్మనీలు కూడా కొంత అలజడికి గురికాక తప్పడంలేదు. మరో మాటలో చెప్పాలంటే - "పెరిస్ట్రోయికా", "గ్లాస్‌నోస్త్" పేరిట గోర్బచేవ్ ప్రారంభించిన వినూత్న ప్రయోగం ఫలితంగా రానున్న కొలది సంవత్సరాలలోనే ఈ దేశాల కమ్యూనిస్టు పార్టీలు సోషల్ డెమోక్రటిక్ పార్టీలుగా మారడమో, లేదా వాటి స్థానే మాజీ సోషల్ డెమోక్రాట్లు అధికారంలోకి రావడమో సంభవమనిపిస్తోంది! ఇందుకు పోలెండ్‌లో ఎన్నికల ఫలితాలు, హంగరీ కమ్యూనిస్టు పార్టీలో వస్తున్న మార్పులూ తాజా ఉదాహరణలు. లోగడ ఎన్నికలు జరిగినా, లేదా ఏ ఎద్దడి వచ్చినా రష్యావైపు అంగలార్చే పోలెండ్, హంగరీ, తూర్పు జర్మనీలు ఇప్పుడు స్వతంత్రమైన నిర్ణయాలు చేసుకొంటున్నాయి. గోర్బచేవ్ "సంస్కరణల" ప్రభావంతో రష్యాలో ఎల్‌సిన్ ప్రభృతులు బహుళ రాజకీయ పక్ష వ్యవస్థను (మల్టీ పార్టీ సిస్టమ్) బాహాటంగానే కోరుకొంటున్నారు. జాతీయ స్థాయిలో పార్టీ సమర్పించే (ఎన్నిక కావలసిన వారి) "జాబితాల" ద్వారా ఎంపికయ్యే "పలువురి అభ్యర్థుల" (మల్టీ క్యాండిడేట్) వ్యవస్థను కాకుండా, బహుళ రాజకీయ పక్ష వ్యవస్థ మాత్రమే తమకు తృప్తి కలిగిస్తుందంటున్నారు! ఈ ఛాయలు తూర్పు యూరప్ దేశాలకు పాకిపోయాయనడం కంటే పోలెండ్, హంగరీలలో వస్తున్న మార్పుల ప్రభావమే రష్యన్ నాయకత్వంపై కూడా పడిందని చెప్పుకోవడం సబబుగా ఉంటుంది. 1984లో పశ్చిమ జర్మనీ పర్యటించడానికి వీల్లేదని రష్యా అంటే తూర్పు జర్మనీ అధినేత హోనేకర్ ఆగిపోయాడు! ఇవాళ మారిపోయిన బాన్-మాస్కో సంబంధాల ఫలితంగా హోనేకర్ తన స్వతంత్ర నిర్ణయం తనకుతాను చేసుకో గల్గుతాడు. అలాగే ఇప్పుడు చైనాలో పార్టీతో నిమిత్తంలోని స్వతంత్ర విద్యార్థి సంఘాలు, స్వతంత్ర కార్మిక సంఘాలూ, రాజకీయ గ్రూపులూ ఎలా తలెత్తాయో 1980-81 లోనే పోలెండ్‌లో "సాలిడారిటీ" పేరిట

స్వతంత్రమైన ట్రేడ్ యూనియన్ ఏర్పడినప్పుడు కమ్యూనిస్టు పార్టీ అధినేత జనరల్ జరూల్‌స్కీ, ఆ "సాలిడారిటీ"ని దారుణంగా అణచివేయడానికి వీధుల్లోకి టాంకులు నడిపించాడు. "సాలిడారిటీ" నాయకుడు వలెసాను, ఇతర నాయకులను నిర్బంధించాడు, వత్తిడిపై తర్వాత విడుదల చేశాడు. గత ఎనిమిదేళ్ళలో ఎన్నో నిర్బంధాలకు గురిచేశాడు. అయితే 'సాలిడారిటీ' బలం చూచి సమాధాన పడక తప్పింది కాదు. పోలిష్ పార్లమెంటుకు జరిగిన ఎన్నికల్లో పోలిష్ కమ్యూనిస్టు పార్టీ అయిన "యునైటెడ్ వర్కర్స్ పార్టీ" దాని మిత్ర పక్షాలైన "పెజెంట్స్ డెమోక్రటిక్" పక్షాలు దారుణంగా ఓడిపోయాయి; వలెసా "సాలిడారిటీ" అది బలపరిచిన అభ్యర్థులూ పార్లమెంటులోని దిగువ సభ "సేమ్" (Sejm) కూ ఎగువ సభ సెనెట్‌కూ పెద్ద సంఖ్యలోనే ఎన్నికయ్యారు. అయితే మరి జెరూల్‌స్కీ రాజీనామా ఇచ్చినా, కమ్యూనిస్టు పార్టీ స్థానే, "సాలిడారిటీ" అధికారం స్వీకరించడానికి ఏర్పాటు జరగాలి కదా? మరి ఎందుకు జరగలేదు? ఇక్కడో గమ్మత్తు జరిగింది - రాజ్యాంగం ప్రకారం "సేమ్"లోని 460 సీట్లలో 60 శాతం పాలక పక్షం మిత్రమండలి ప్రతినిధులకు కేటాయించింది; మిగిలిన 35 శాతం సీట్లను మాత్రమే పోలిష్ బలమైన స్థానాలుగా ప్రకటించింది! అంటే సర్కారు సీట్లను రిజర్వుడు సీటుగా మార్చుకొని, సాలిడారిటీ పోటీని తప్పించుకున్నారు! అయినా సరే, జాతీయ స్థాయి జాబితాలోని 35 మంది పాలక పక్షం అభ్యర్థులలో 30 మందినీ ఓటర్లు తిరస్కరించారు. చివరికి ప్రధాని రకోవస్కీ కూడా ఓడిపోయాడు. అయినా పదవిలోనే ఉన్నాడు! ఓడినవారిలో పొలిట్ బ్యూరో సభ్యులు 8 మంది. "సాలిడారిటీ" ఘన విజయం సాధించింది. అలాగే సెనెట్‌లోని 161 స్థానాల్లో 160 సీట్లలో సాలిడారిటీ నెగ్గి కమ్యూనిస్టు పార్టీ చిత్తయింది. అప్పుడు జెరూల్‌స్కీ "మనం మిశ్రమ ప్రభుత్వాన్ని" ఏర్పాటు చేద్దామని సాలిడారిటీకి ప్రతిపాదించాడు! "సాలిడారిటీ' ' పైకి టాంకులు నడిపించిన నాయకత్వమే "1993లో జరిగే నూతన ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ అధికారంలో ఉండకపోవచ్చు"ని - ప్రకటించుకోవలసి వచ్చింది.

అటు హంగరీలో కూడా పార్టీ నాయకత్వం చీలుబాటలో ఉంది. జానోస్ కాదర్ మరణం తర్వాత పార్టీ ప్రధాన కార్యదర్శిగా నియమితుడైన కరోలీ గ్రోజ్‌కు పోటీగా ఇప్పుడు "సమష్టి అధ్యక్ష మండలి" పేరిట కొత్తగా మాజీ సోషల్ డెమోక్రాట్ అయిన రెజో నీర్స్‌ను ప్రెసిడెంట్‌గా నామినేట్ చేశారు! 1968లోనే కమ్యూనిస్టు పార్టీ ప్రణాళికకు విరుద్ధంగా "మార్కెట్ ఎకానమీ" పేరిట, విదేశీ పెట్టుబడులను బాహాటంగా ఆహ్వానించేందుకు వీలుగా "హంగరీ నూతన ఆర్థిక సంస్కరణల"ను ప్రతిపాదించిన వ్యక్తి రెజోనీర్స్. నిజానికి అటు పోలెండ్, ఇటు హంగరీలలో నడుస్తున్న ఆర్థిక చరిత్రకు నాయకత్వం సోషలిస్టు ఆర్థిక కూటమి అయిన "కామెకాన్" కాదు, ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్య నిధి సంస్థలే అని మరవరాదు! ఈ సమస్యపైనే రెండు దేశాల పార్టీల్లోనూ పెద్ద ఎత్తున చీలికలు కూడా వస్తున్నాయి. పెద్ద ఎత్తున ప్రైవేట్ పరిశ్రమలను అనుమతించారు; ప్రైవేట్ వ్యవసాయ భూములను పెద్ద విస్తీర్ణంలో అనుమతించారు. పోలెండ్ విదేశీ రుణాలు రూ.6240 కోట్లకు పెరిగిపోతే హంగరీకి "ఆర్థిక సంస్కరణల"ఫలితంగా పెరిగిన విదేశీ రుణం రూ.1120 కోట్లు! ఈ లోటు బడ్జెట్లను భర్తీ చేయడానికి పరపతి సౌకర్యం కల్పించడానికి ఇప్పుడు అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (ఐ.ఎం.ఎఫ్) తటపటాయిస్తోంది! అలా అని పైకి అంటుంది ఐ.ఎం.ఎఫ్. కాని యూరప్‌లో "ప్రజాస్వామ్యం" రక్షణకు ఎంత "మూల్యమై"నా చెల్లించడానికి అమెరికా గొడుగు చాటున ప్రపంచ బ్యాంకు సిద్ధంగానే ఉంటుందని మరవరాదు!!

జూన్ 30, 1989

# సియాచిన్ హిమగిరిలో...

దేశాల మధ్య సంబంధాలు మెరుగయినా, తరుగయినా అందుకు బాధ్యత వహించవలసినవారు ఆయా దేశాల అధినేతలే గాని, వాటి విదేశాంగ శాఖ కార్యదర్శులో లేక రక్షణ శాఖ కార్యదర్శులో కారు. రాజకీయంగా కుదరవలసిన సమస్యలకు సైనిక పరిష్కార మార్గాలు వెదకడం తప్పు. ఇండియా-చైనా సరిహద్దు తగాదాలు ముదిరిన తరువాత మన ఉత్తర సరిహద్దులలోని "అక్సాయిచిన్" మండలం చైనా ఆక్రమణలో ఉన్నప్పుడు పండిట్ నెహ్రూ "గడ్డిపోచకూడా మొలవని గడ్డపైన ఈ పోరు దేనికి" అని ప్రశ్నించారు. అయినా దేశ సార్వ భౌమాధికారాన్ని, భౌగోళిక వాస్తవాలను శాసించగల కీలకమైన ప్రాంతాలు దుర్గమమైనవే అయినా రక్షణ ప్రయోజనాల కోసం జాగరూకులై ఉండడం అవసరం. అయితే అప్రమత్తతను యుద్ధంగా మలచుకునే ఆలోచనను మనస్సుల్లోకి రానివ్వకూడదు. నేడు భారత ఉత్తర సరిహద్దుల్లోని సియాచిన్ మంచుకొండలలో ఇండియా-పాకిస్తాన్ తగాదాలు ముదిరిపోయే పరిస్థితులు ఏర్పడ్డాయి. నిన్నగాక మొన్ననే ఇస్లామాబాద్‌లో రెండు దేశాల రక్షణ శాఖల కార్యదర్శులు కూర్చుని, సియాచిన్ ప్రాంతంలో ఉభయత్రా ఉద్రిక్తతలు నివారించే విషయమై చర్చలు జరిపారు; చర్చల ఫలితం "ఆశాజనకం" అన్న వార్తలు వచ్చాయి. అవి ఆధారంగా ప్రధాని రాజీవ్‌గాంధీ కూడా ఉద్రిక్తత సడలిపోగలదన్న ఆశాభావం వ్యక్తం చేశారు. అయితే పాకిస్తాన్ విదేశాంగ శాఖ కార్యదర్శి హుమాయూన్ ఖాన్ ఒక ప్రకటన చేస్తూ "సిమ్లా సంధి పత్రంపై సంతకాలు జరిగేనాటికి, అంటే 1972కు ముందు ఉభయ దేశాల ఆధీనంలో ఉన్న స్థానాలకు ఉభయులూ సైనికులను ఉపసంహరించాలి" అని రెండు దేశాలు నిర్ణయించాయని తెలిపారు. ఈ వాదనతో మన విదేశాంగ ప్రతినిధి విభేధించారు. ఇండో-పాక్ రక్షణ శాఖల కార్యదర్శుల సమావేశంలో అలాంటి అవగాహన ఏదీ కుదరలేదని చెప్పారు. ఉభయుల మధ్య ఘర్షణకు దారితీయగల "అవకాశాలను తగ్గించే" ఉద్దేశంతో, సిమ్లా ఒప్పందానికి అనుగుణంగా సియాచిన్ ప్రాంతంలో సరిహద్దు రేఖను నికరం చేసే ఉద్దేశంతో, బలప్రయోగాన్ని నివారించే ఉద్దేశంతో తద్వారా "సమగ్ర పరిష్కారం" కోసం కృషి జరపాలని ఉభయ దేశాల రక్షణ కార్యదర్శులు విడుదల చేసిన సంయుక్త ప్రకటనలో ఉంది. అయితే ఇప్పుడు తగాదా అల్లా - ఈ సంయుక్త ప్రకటనకు రెండు దేశాల అధికారులు చెబుతున్న భాష్యాలలో ఉంది! భాష్యాలలో తేడావల్ల తిరిగి ఉభయ దేశాల భద్రతకు చేటు రాకూడదు! నిజానికి "ఘర్షణావకాశాలను సడలించాల"న్నా, సియాచిన్ మంచుకొండలను శాంతి గిరులుగా మార్చాలన్నా జరగవలసిన పని - అసలు దుర్గమమైన ఆ హిమానీ ప్రాంతంలో ఉభయత్రా సైనికులను శాశ్వతంగా ఉపసంహరించడం. కాని అలా జరగడంలేదు. ఎందుకని?

భారత ఈశాన్య సరిహద్దుల్లో చైనాతో వచ్చిన తగాదాకు మూల కారణమైన "మక్‌మహాన్ రేఖ"ను

పటాలలో తప్ప భూమిపై వాస్తవ సరిహద్దు రేఖగా గీయకుండా బ్రిటిష్ సామ్రాజ్య వాదులు వదలి పోయారు. అలాగే రెండు స్వతంత్ర దేశాలుగా ఉన్న ఇండియా, పాకిస్తాన్‌లు కూడా సియాచిన్ ప్రాంతంలో 1949లో "కరాచీ యుద్ధ విరమణ ఒప్పందం" ప్రకారం యుద్ధ విరమణ రేఖను మ్యాపులలోనే గీసుకున్నాయి గాని, నేలపైన హద్దుల నిర్ణయం జరగలేదు. పటాలలో ఉన్నది ప్రాంతంలో లేకపోతే ఏమవుతుంది? పొలాల హద్దులు నిర్ణయించకపోతే ఏమవుతుంది? గట్టు తగాదాలు పుట్టి, గడ్డపారలతో యుద్ధం జరుగుతుంది! అలాగే నిర్ణయించకుండా వదలివేసిన సరిహద్దుల్లో జమ్మూ - కాశీర్ ప్రాంతంలోని కార్గిల్ మండలానికి కొంచం అవతలగా వెళ్లి ఈ హద్దును మ్యాపుల్లో గుర్తు పెట్టారు. దాన్నే "గ్రిడ్ పాయింట్" (ఎన్.జె.9842) అంటారు. తగాదా అంతా ఇప్పుడు ఈ పాయింట్ దగ్గరనుంచే ప్రారంభమైంది. నిజానికి ఇండో -పాక్ యుద్ధాల వల్ల ఇప్పటికే అస్థిరంగానే ఉన్న కాశ్మీర్ ప్రతిపత్తి ఈ చిల్లర తగాదాలకు కారణమని మరువరాదు. కాశ్మీర్ సమస్యకు తిరుగులేని అంతిమ పరిష్కారం కుదిరే వరకూ, సమస్యను ఐక్య రాజ్య సమితి పరిధినుంచి ఉపసంహరించుకునే దాకా, పాకిస్తాన్ ఆక్రమణలో ఉన్న కాశ్మీర్ భాగాన్ని ఏం చేయాలి? అలాగే కాశ్మీర్‌లోని లడక్ ప్రాంతం సరిహద్దులుగా భావిస్తున్న అక్సాయిచిన్ మండలం చైనా ఆధీనంలో ఉన్నంతకాలం మనం ఏం చేయాలి? అలాగే 1963 "తాత్కాలిక ఒప్పందం" పేరిట పాకిస్తాన్, కాశ్మీర్‌లోని 4500 చదరపు మైళ్ళ భూభాగాన్ని చైనాకు "దత్తం" చేసింది. దాన్ని ఏం చేయాలి? ప్రస్తుతం భారత - పాకిస్తాన్‌ల మధ్య తగాదాలో ఉన్న సియాచిన్ మంచుకొండలు కూడా ఎక్కడివో కావు - తగాదాల్లో ఉన్న ఈ మూడు ప్రాంతాల మధ్యలోనే అవీ ఉన్నాయి! మరొక మాటలో చెప్పాలంటే పాక్ ఆక్రమిత, చైనా ఆక్రమిత ప్రాంతానికీ, మన అధీన ప్రాంతమైన జమ్మూ - కాశ్మీర్ కూ మధ్యస్థంగా (అటు కొంత, ఇటు కొంతగా) ఈ హిమగిరులు తిష్టవేశాయి. ప్రపంచంలోనే అత్యంత దుర్గమ ప్రాంతంగానూ, యుద్ధాలకు దుస్తరంగానూ ఉన్న సియాచిన్ హిమగిరి, పామీర్స్ పర్వత శ్రేణుల్లోని "ఫెడ్‌చెంకన్" తర్వాత ఆసియాలో రెండవ పెద్ద మంచుకొండగా ప్రసిద్ధి చెందింది! అటువంటి చోట కరాచీ ఒప్పందం తర్వాతనేకాదు, సిమ్లా సంధి తర్వాత కూడా భౌతికంగా రేఖా నిర్ణయం జరగలేదు. జరిగిన ఒక్క పనల్లా - 1972 నాటి సిమ్లా సంధి పాత యుద్ధ విరమణ రేఖను "వాస్తవాధీన రేఖ"గా మార్చడం. కాని రేఖ భౌతిక నిర్ధారణకు ఇది సరి సమానం కాదుకదా! అయితే దుర్గమంగా ఉన్న ప్రాంతంలో రేఖా నిర్ణయం సాధ్యపడని పని! ముందు నుయ్యి, వెనుక గొయ్యి. అందుకే ఉభయత్రా ఇష్టానుసారం కదలికలు! చైనా - పాకిస్తాన్ సైనిక మైత్రి ఉత్తర దిక్కునుంచి సియాచిన్ గ్లేసియర్స్ మీదుగా లడక్ రాజధాని "లే"కు సరాసరి శత్రుదాడులకు మార్గం తీయవచ్చు. ఇది నుబ్రూ లోయగుండా సాగనూవచ్చు. అంటే కారాకోరమ్ కనుమలలో చైనా - పాక్ సైనిక వత్తిడి పెరగవచ్చు. కాని రాజకీయ పరిష్కారం ద్వారా ఈ వత్తిడిని తొలగించుకోవచ్చు. ఇందుకు అధినేతలు సకాలంలో నిర్ణయాలు చేయాలి.

జూన్ 21, 1989

# 'సునో! సునో!' ఉనో...!

తినగ తినగ వేము తీపిగానూ, తినగా తినగా గారెలు చేదుగానూ మారాయట! రాను రాను పార్లమెంటరీ ప్రజాస్వామిక వ్యవస్థల వరస కూడా అలా వికటిస్తోంది! 'మేడి పండు' సామెతగా తయారవుతోంది. బ్రిటిష్ కామన్స్ సభాసదుల "మానుష ప్రవృత్తి"ని అధ్యయనం చేసిన సుప్రసిద్ధ పార్లమెంటేరియన్ ఆస్టిన్ మెషెల్ "వెస్ట్ మినిస్టర్ మాన్" అన్న గ్రంథంలో "రాజకీయాల్లో 'మచ్చలేనివాడు' అంటూ ఎవడూ ఉండడ"ని రాశాడు(No one is 'Mr. Clean' in politics. Grapes as sour as these should be trodden privately if possibile ) చేతనైతే అలాంటివాళ్ళను గుట్టు చప్పుడు కాకుండా తొక్కేయ్యమన్నాడు. అయితే విశేషమేమంటే - రకరకాల కుంభకోణాలు (స్కాండల్స్) పొక్కిన తరువాత నైతిక విలువల్లో ఇంకా కొంత విశ్వాసం మిగిలి ఉన్న దేశాధిపతులూ, పాలక పక్షాల నాయకులూ తమ పదవులకు రాజీనామాలు చేసిపోతున్నారు. మరికొందరు "గురివిందలు"గా ఏమీ ఎరుగనట్టు పదవుల్లో కొనసాగుతున్నారు. ఇంకొందరు పార్లమెంటు కమిటీల అభిశంసలవల్లా, లేదా న్యాయ స్థానాలు వేసిన 'మొట్టి కాయల'వల్లా కొంత వెరపుతో పదువులు విడిచిపోవలసి వస్తోంది. అంతేగాని, అంతరంగికంగా తాము నేరస్థులమని తెలిసి, మరొకరు వేలెత్తి చూపే వరకూ వేచి ఉండకుండా ఆత్మ సాక్షిగా "స్కాండల్"ను ఒప్పేసుకుని పదవినుంచి తొలగిపోయిన వాడు ఇంతవరకూ ఎవడూ లేడు! అందుకే పబ్లిక్ జీవితంలో ఉన్న ప్రతి ఒక్కడి మీదా వాడెంత గొప్పవాడైనా సరే అంత నిఘా అవసరం అని చెప్పేది. ఇటీవల ఈ గీటురాయికి గురైనవారు ఇరాన్ కాంట్రా కుంభకోణంలో చిక్కుకున్న రేగన్ - బుష్‌ల అనుయాయి, ప్రధాన సలహాదారులలో ఒకరైన ఆలివర్ నార్త్, అమెరికా ప్రతినిధుల సభ స్పీకర్ రైట్(లంచం), జింబాబ్వే రాజకీయ వ్యవహారాల సీనియర్ మంత్రి మారిస్ నంగుబో(అవినీతి), జాపనీస్ ప్రధాని తకెషీతా(రిక్రూట్ లంచాలు).

ఈ జాబితాలో తకెషీతాకు తోడుగా వచ్చి చేరిన వ్యక్తి అతని తర్వాత సమర్థుడూ, మంచివాడూ, 'మచ్చలేని'వాడూ అనుకున్న జాపనీస్ కొత్త ప్రధాని ఉనో(Uno). తకెషీతా "లంచాల" ఆరోపణలవల్ల రాజీనామా ఇవ్వవలసి వస్తే, ఉనో 'మంచాల' నెపంపైన (గైషా సెక్స్ కుంభకోణం) తొలగిపోవలసి వచ్చింది! అంతకంటే పెద్ద పరిణామం ఉనోకి పాలకపక్షమైన లిబరల్ డెమోక్రటిక్ పార్టీలో తగినంత పలుకుబడి లేకపోయినందున, జాపనీస్ పార్లమెంటు ఎగువసభకు జరిగిన ఎన్నికల్లో పార్టీ చిత్తుగా ఓడిపోవలసి రావడం, "సెక్స్ స్కాండల్" అందుకు తోడు కావడమూ! కడచిన ముప్పయ్యేళ్ళ జాపనీస్ "ధన రాజకీయాల" చరిత్రకు ఈ పరిణామం పరాకాష్ట. పైగా ఎగువ సభ ఎన్నికల ఫలితాలు పూర్తిగా వెలువడక ముందే, ముందు జాగ్రత్తగా ప్రధాని ఉనో తన రాజీనామాను ప్రకటించుకోవలసి వచ్చింది. జాపనీస్ రాజకీయాలను గత రెండేళ్ళుగా ఊగించి శాసిస్తున్న "స్కాండల్స్" ఫలితంగానే లిబరల్ డెమోక్రటిక్

పార్టీ(ఎల్.డి.పి) నామరూపాలు లేకుండా పోయే ప్రమాదం ఏర్పడింది. అందులోని సీనియర్ సభ్యులూ, "స్కాండల్స్"కు దూరంగా ఉన్న ముఖ్యులూ సరైన ప్రత్యామ్నాయం ద్వారా ఎల్.డి.పి. ప్రభుత్వం కాలపరిమితి అయిన డిసెంబర్ వరకూ 'దేకించ'డానికి చేస్తున్న ప్రయత్నాలు ఎంతవరకూ ఫలిస్తాయో చెప్పలేం. రొటేషన్ పద్ధతిపై జరిగే ఎగువసభ ఎన్నికల్లో ఎల్.డి.పి. గెలుచుకున్న సీట్లు 36 మాత్రమే. కోల్పోయిన సీట్లు 30. కాగా మొత్తం ప్రతిపక్షానికి కొత్తగా వచ్చిన సీట్లు 87. అంటే 252 మంది సభ్యులున్న ఎగువ సభలో ఎల్.డి.పి. కి ప్రస్తుతం ఉన్న సీట్లు సహా మొత్తం 109 మాత్రమే ఉంటాయి. సోషలిస్టు పార్టీగా అవతరించిన జపాన్ సోషలిస్టు పార్టీకి నాయకత్వం వహించిన మహిళ కుమారి తకావోదోయీ. ఎగువ సభ ఎన్నికల్లో ఈసారి మహిళలు హెచ్చుమంది పాల్గొని, గెలవడం జాపనీస్ రాజకీయాల్లో ఒక నూతన దశకు నాందిగా భావించవచ్చు. ఒక రకంగా రాజకీయ వేత్తల "సెక్స్ స్కాండల్స్"కు సమాధానంగా కూడా ఈ ప్రాతినిధ్యాన్ని తలంచుకోవచ్చు! గమనించదగిన మరొక అంశం - ఈ ఎన్నికల్లో ఇతర ప్రతిపక్షాలూ, సెంట్రిస్టులూ కూడా తుడిచి పెట్టుకుపోవడం. ఈ "దిగతుడుపు" సోషలిస్టు పార్టీకి లాభించింది. అయితే పాలక పక్షమైన ఎల్.డి.పి.కి శక్తిమంతమైన దిగువ సభలో పెద్ద మెజారిటీ ఉన్నందున, బిల్లులు పాస్ కావడానికి ప్రతిబంధకం ఉండదు. దిగువ సభ ఎన్నికలు 1990 జూన్‌లో జరిగే వరకూ ఎల్.డి.పి. ప్రభ ఎన్ని స్కాండల్స్ ఉన్నా సాగిపోతూనే ఉంటుంది.

ఎల్.డి.పి.లో నాయకులపై వచ్చిన అనేక స్కాండల్స్ ఫలితంగా ప్రారంభమైన కుమ్ములాటలు ఉనో ప్రధాని కావడానికి ఒకరోజు ముందే పరాకాష్టకు చేరుకున్నాయి. జూన్2న పార్లమెంటులో ఒక బిల్లుపై జరిగిన ఓటింగ్‌లో ఎల్.డి.పి. నాయకులూ, మాజీ ప్రధానులైన సుజూకీ, ఫకూడాలు సహా మొత్తం 44 మంది పార్టీ సభ్యులు ప్రభుత్వానికి వ్యతిరేకంగా వోటు చేశారు. వృద్ధతరానికీ, యువతరం సభ్యులకూ ఈ వోటింగ్ ఒక బల ప్రదర్శనగా సాగింది. పైగా రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత మొత్తం నలుగురు జాపనీస్ ప్రధాన మంత్రులు ఏదో ఒక "స్కాండల్" వల్లనే పతనం కావడాన్ని శ్రద్ధగా పరిశీలిస్తున్న యువతరం, నాయకత్వంపై తిరగబడవలసి వచ్చింది. పతనమైన నకసోనె, తకెషీతాలకు గురువు, అంతకంటే పతన మైన "లాక్ హీడ్" కుంభకోణంలో ఆరితేరిన తనాకా. అంతేకాదు, ఎల్.డి.పి. సామాజిక దృక్పథం కూడా స్త్రీని "వంటింటి కుందేలు"గానే అట్టిపెట్టాలని, స్త్రీ ఒక భోగ్య వస్తువనీ. ఈ దారుణ వైఖరికి నిరసనగా రాజకీయంగా ఉద్యమిస్తున్న మహిళలకు మిస్ తకావోదోయీ నేతృత్వం వహించబోతోంది. ఏడడుగులు కలిసి నడిస్తే సఖ్యత ఏర్పడుతుందని మనకు సామెత. కాని భర్తలకు మూడడుగుల వెనకనే భార్యలు నడవాలన్న సంప్రదాయంతో తీసుకుంటున్న జాపనీస్ సమాజంలో రాజకీయాధికారం కోసం నేడు జాపనీస్ మహిళలు వేస్తున్న మందడుగు అక్కడి మకిలి, వెకిలి రాజకీయాలకు స్వస్తి చెప్పించగలిగితే ఆసియా దేశాలూ, ఇతర ప్రపంచమూ సంతోషిస్తుంది. "ఈ మహిళా శక్తిని దేశ వ్యాపితం చేద్దాం" అన్న నినాదంతో మిస్ దోయీ మహోద్యమం ఇటీవల టోక్యో మునిసిపల్ ఎన్నికలలో ఎల్.డి.పి.పై దండోరా వేసి ఘన విజయం సాధించడంతో ప్రారంభమైంది. ఎగువసభలో మహిళలు ఇంతకు ముందు 10 మందే ఉన్నారు. ఇప్పుడు ఆ సంఖ్య 17 కి పెరిగి రికార్డు సృష్టించింది. గత ఎన్నికల్లో 82 మంది స్త్రీలు ఎగువసభకు పోటీచేస్తే, ఈ సారి 146 మంది పోటీ చేశారు. అయితే ఇప్పటికీ ఈ సంఖ్య చాలా తక్కువే. 126 సీట్లకు పోటీలో ఉన్న 670 మంది మొత్తం అభ్యర్థుల సంఖ్యతో పోల్చుకున్నప్పుడు ఈ సంఖ్య నిజంగానే గర్వించదగినదికాదు! అయితే మహిళా రథం కదలికకు ఇదొక నిదర్శనం మాత్రమే. రాబోయే ఎన్నికల్లో 50 మహిళా సంస్థలు పోటీ చేయబోవడం జాపనీస్ ఎన్నికల్లో రానున్న గుణాత్మకమైన మార్పు.

జూన్ 28, 1989

# పార్లమెంటరీ ప్రజాస్వామ్యం - కొన్ని పాఠాలు

మనం ఏరికోరి తెచ్చుకొన్న పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థ పాలక పక్షానికీ, ప్రతిపక్షానికీ నిర్దేశించిన నియమావళీ, సభా సంప్రదాయాల నిబంధనావళీ సక్రమంగా అమలులోకి రానప్పుడు, ప్రజలు తమను ఎందుకు ఎన్నుకొని పార్లమెంటుకు పంపించారో ఆ లక్ష్యాన్ని ప్రతినిధులు వమ్ము చేస్తున్నప్పుడు, ఆ వ్యవస్థ ఉన్నా లేనట్టే జమ అవుతుంది! పార్లమెంటరీ వ్యవస్థ జయాపజయాలు ఒక పక్షం రాజీనామాలు ఇవ్వడంపైనో, వేరొక పక్షం అధికారానికి అంటిపెట్టుకొని ఉండడంపైనో ఆధారపడిలేవు. తమ సమస్యలను పరిష్కరించిపెట్టడానికి శాసన వేదికను సద్వినియోగ పరుచుకోమని ప్రజలు ఈ ప్రతినిధులను అక్కడికి పంపించారుగాని, ప్రజలతోను, ప్రజా సంఘాలతోనూ నిమిత్తం లేకుండా తమ యిష్టమొచ్చిన బిల్లులను, పద్దులనూ ప్రవేశ పెట్టుకుని ప్రజల బొక్కసానికి ఎసరు పెట్టడానికీ, తమ హక్కులను హరించడానికీ వారు వోటు వేయలేదు. అటు పాలక పక్షానికి, ఇటు ప్రతిపక్షానికి ఓటర్లు ఇచ్చిన అయిదేళ్ళ వ్యవధీ - తమ నెత్తిపైన ఎక్కి సవారీ చేయించుకోడానికి కాదు, అర్ధాంతరంగా ఎన్నికలు తెచ్చిపెట్టడానికీ కాదు. తాము పన్నుల రూపంలో చెల్లించే ప్రతి పైసాకూ అన్ని పక్షాల ప్రతినిధులూ జవాబుదారీ వహించాలన్న ఉద్దేశంతోనే వోటు వేసి పంపారుగాని, అధికారం పలుకుబడి ఆసరా చేసుకుని సొంత లావాదేవీలు చూసుకోడానికి కాదు. బోఫోర్స్ కాంట్రాక్టులపై కంట్రోలర్-ఆడిటర్ జనరల్ సమర్పించిన నివేదిక ఆ కాంట్రాక్టులోని పెక్కు అవకతవకలను బహిర్గతం చేసింది కాబట్టి ప్రభుత్వం రాజీనామా చేయాలన్న ప్రతిపక్షం కోరికను ప్రభుత్వం ఆమోదించలేదు కాబట్టి - తామే రాజీనామా చేసి పోతున్నామని 12 ప్రతిపక్షాలు ప్రకటించి, తమ సభ్యులచే లోక్ సభ సభ్యత్వాలకు రాజీనామాలు చేయించాయి. "తెలుగుదేశం" పక్షం నాయకుడు మాధవ రెడ్డి తొలుత రాజీనామా సమర్పిస్తూ "దురదృష్టవశాత్తూ ఈ లోక్ సభ పనికి మాలిన రాజ్యాంగ చట్టంగా తయారైంది. తన ప్రజాప్రాతినిధ్య స్వభావాన్ని అది కోల్పోయింది" అని వ్యాఖ్యానించారు. కాని ఆ "పనికి మాలిన చట్రం' 'లోనే గత నాలుగేళ్ళు ఎలా పనిచేయగలిగారు? సాధారణ ఎన్నికలు ఇక అయిదు మాసాలు మాత్రమే ఉన్నందున లేదా పార్లమెంటు ఆఖరి సమావేశం ఇక వారం రోజుల్లో ముగుస్తుందనగానే అది "పనికి మాలిన చట్రం" అయిందా? ఇప్పుడు రాజీనామాలు ఇచ్చారు కాబట్టి సరిపెట్టుకోవచ్చునేమోగాని, ఆయన వ్యాఖ్య పార్లమెంటరీ వ్యవస్థనే అవహేళన చేసినట్టుకాదా? ఇదే వ్యాఖ్య సామాన్యుడు చేస్తే "సభా ధిక్కార నేరం' 'గానూ, పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యతిరేకిగానూ దండోరా వేసే వారు కారా? అయితే పార్లమెంటరీ సంప్రదాయాలను, నిబంధనలనూ ముందెవరు 'గాడితప్పించార'న్న ప్రశ్న వస్తుంది.

రెండేళ్ళుగా బోఫోర్స్‌పై సాగుతున్న చర్చనుగాని, సమాచారాన్ని గాని విశ్లేషించి చూచినప్పుడు - శతఘ్నుల కొనుగోళ్ళ ఒప్పందంలో ఎవరికో ఒకరికి ముడుపులు ముట్టాయన్నది స్పష్టమవుతోంది. కాంగ్రెస్ సభ్యులు వాదించినట్టుగా, కంప్ట్రోలర్ ఆడిటర్ జనరల్ నివేదిక కూడా "ఒప్పందంలో జరిగిన అవకతవకల'

' గురించి నిశితంగా వ్యాఖ్యానించిందేగాని, "ముడుపుల" సంగతిని ప్రస్తావించలేదు. అయితే ప్రభుత్వం ఇప్పటికైనా చేయవలసిన మంచి పని - ప్రభుత్వాన్ని అడ్డం పెట్టుకుని ప్రభుత్వ యంత్రాంగంలోని ఎవరో ఒక వ్యక్తికి (బురాక్రాట్ కావచ్చు, మంత్రి కావచ్చు) లేదా కొందరు వ్యక్తులకు ఈ లావాదేవీలతో సంబంధం ఉందని గ్రహించి, వారిని బహిర్గతం చేయవలసి ఉంటుంది. దానిని నిర్ధారణ చేయకపోతే ప్రధాని రాజీవ్ గాంధీని 'బదనాం' చేయడానికి ఈ లోపాయికారీ శక్తులు వెనుకాడవు. కనుకనే ప్రభుత్వాన్ని, దేశ రాజకీయ వ్యవస్థను అభాసుపాలు జేయడానికి వెనుకాడని ఆ వ్యక్తులను రాజీవ్ నిర్భయంగా, నిర్మొహమాటంగా, నిస్సంకోచంగా బయటకులాగి శిక్షించాలి. ఈ పని మొత్తం కాంగ్రెస్ పార్టీ ప్రతిష్ఠనే పెంచివేస్తుంది. కొన్నాళ్ళు ఈ లావాదేవీల్లో అసలు "మధ్యవర్తే" లేడనుకున్నాం; తర్వాత కొన్ని రోజులకు పాత కాంట్రాక్టు ముగింపు సందర్భంగా చేసిన చెల్లింపులు, దుకాణం "మూసివేత చార్జీలు" (వైండింగప్ చార్జెస్) అనుకున్నాం; అసలు ఈ వ్యవహారంలో సంబంధం ఉన్న ఇండియన్ ఏజెంటే లేడనుకున్నాం. కాని "స్టేట్స్ మన్" వెల్లడిస్తున్న తాజా సమాచారం ప్రకారం బోఫోర్స్ లావాదేవీలతో ప్రత్యక్ష పరోక్ష సంబంధాలున్న భారతీయ ఏజెంట్లు ఉన్నారని ప్రజలు నమ్మవలసి వస్తుంది! మన రక్షణ వ్యవస్థనూ, ప్రభుత్వాన్ని అప్రతిష్ఠపాలు చేసిన ఈ ఏజెంట్లను రాజీవ్ వదలి పెట్టకూడదు. ఇది కాంగ్రెస్ పార్టీ వ్యక్తిత్వానికే కాదు, దేశం వ్యక్తిత్వానికే సవాలు. దేశ రక్షణ రహస్యాలను అమెరికా, రష్యా, పోలెండ్, ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీలకు (డాక్యుమెంట్ల విక్రయంద్వారా) అమ్మి సొమ్ము చేసుకోజూచిన కుమార్ నారాయణ్ లాంటి నిందితులను అరెస్టు చేసి, విచారణ జరుపడానికి నిర్ణయించిన ప్రభుత్వం - బోఫోర్స్ వ్యవహారంలో కూడా సాహసించాలి. అంతేగాని, లావాదేవీలో 'అవకతవకల'ను ఎత్తి చూపిన ఆడిటర్ జనరల్‌నూ, అతని నివేదికనూ పార్లమెంటు వెలుపల దుమ్మెత్తిపోసినందున ఒరిగే ప్రయోజనం లేదు.

దేశంలో "ప్రజాస్వామ్య వ్యవస్థలను అస్థిరం" చేసే ప్రయత్నం రెండు విధాలుగా సాగుతోంది: బోఫోర్స్‌లాంటి సమస్యలు తలెత్తినప్పుడు సకాలంలో వెంటనే ప్రభుత్వం చర్య తీసుకోనందువల్లా, ప్రతీ సమస్యనూ దీర్ఘకాలిక ప్రయోజనాల దృష్ట్యా కాకుండా స్వార్థపూరితమైన తాత్కాలిక ప్రయోజనాలకోసం వినియోగించుకోవాలన్న ప్రతిపక్షాల తాపత్రయంవల్లా. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం సుస్థిరతకు ఉభయత్రా పాటించవలసిన ధర్మాలు చాలా ఉన్నాయి. కాని అవి నెరవేరడం లేదు. ఉదాహరణకు రాజ్యాంగంలో పౌరుల ప్రాథమిక హక్కులకు సంబంధించిన మూడవ అధ్యాయాన్ని పూర్తిగా అమలు జరిపించడంలో పార్లమెంటు విఫలమవుతోంది; ఉన్నత శాసన వేదికగా పార్లమెంటుకు ఉన్న అధికారాన్ని ఎగ్జిక్యూటివ్ (ప్రభుత్వం) అనేక సందర్భాల్లో గుంజేసుకుంటోంది. ఇందుకు ఉదాహరణ సి.ఎ.జి. నివేదికను పార్లమెంటుకు సమర్పించడంలో జరిగిన అంతులేని జాప్యం, సబ్ మెరైన్ల డీల్‌పై పి.ఎ.సి. నివేదిక రాకపోవడం, వ్యవధి లేదన్న సాకుతో ఏ చట్టాన్నైనా స్థూలమైన ముసాయిదాగా మాత్రమే శాసన వేదిక రూపొందించడం, తగిన చర్చ లేకుండా ఆ తర్వాత వివరాలను క్యాబినెట్ పొందుపరచడం. పైగా మెజారిటీ పేరిట క్యాబినెట్టే బిల్లులు తయారు చేసి, సభచే ఆమోదింపచేసుకోవడం, క్యాబినెట్‌ను కంట్రోల్ చేయవలసిన శాసన వేదిక క్రమంగా కేవలం "రిజిస్టరింగ్ బాడీ"గా మారడం, అలాగే పార్లమెంటు సమావేశాల్లో లేనప్పుడు గబగబా ఆర్డినెన్సులు జారీ చేయడం, ఇందుకు రాష్ట్రపతి శాసనాధికారం కూడా దుర్వినియోగం కావడం!!

ఈ సందర్భంగా బ్రిటీష్ విదేశాంగ మంత్రిగా (కన్సర్వేటివ్) పనిచేసిన ఫ్రాన్సిస్ మాటలు గమనార్హం: "పార్లమెంటులో పాలకపక్షానికి అతి మెజారిటీ ఉండడం వాంఛనీయం కాదు. సభలో ప్రభుత్వ మద్దతుదారులే హెచ్చు సంఖ్యలో ఉంటే, 'అలసిపోయిన' కామన్స్ సభ ('tiresome' House) ప్రభుత్వాన్ని అదుపులో పెట్టడం కష్టం"! కనుకనే వాక్‌లాండ్ ఎన్నికల సంస్కరణల ద్వారా "ప్రాతినిధ్య నియంతృత్వా'న్ని (Elective dictatorship) సవరించి, పార్లమెంటరీ కంట్రోల్ పెంచవలసి వచ్చింది!

జూన్ 26, 1989

# పంజాబ్ సమస్య -

పంజాబ్ సమస్యకు జాతీయ స్థాయిలో పరిష్కారం కనుగొనడానికి, పదేళ్లుగా టెర్రరిస్టులవల్ల, కేంద్ర ప్రభుత్వ భయంకర నిర్బంధ విధానం వల్ల యమయాతనలు అనుభవించి, విసిగివేసారిపోయిన పంజాబ్ ప్రజలకు సామరస్య పూర్వకమైన పరిష్కారం కనుగొనడానికి తగిన వాతావరణం డిసెంబర్ 7వ తేదీననే ఏర్పడింది. డిసెంబర్ 17న నేషనల్ ఫ్రంట్ ఆధ్వర్యాన ఢిల్లీలో జరిగిన అఖిలపక్ష సమావేశానికి, స్వతంత్ర భారతంలో మొదటిసారిగా ఒక రాజకీయ పరిష్కారం కోసం, జాతీయస్థాయిలో స్థూలాభిప్రాయ ప్రకటనకోసం, సామరస్యంకోసం జరిగిన ప్రయత్నానికి స్ఫూర్తినిచ్చింది కూడా డిసెంబర్ 7. ఆరోజున నూతన ప్రధాని వి.పి.సింగ్ జరిపిన పంజాబ్ యాత్ర, ఆ పర్యటనలో ఆయన అన్ని వర్గాల ప్రజలనుంచి పొందిన ఆదరాభిమానాలు, విషమ ఘడియల మధ్యనే ఆనాడు ధైర్యంతో చేసిన క్రియాశీలమైన ప్రకటనలూ, అతని ప్రవర్తనా డిసెంబర్ 17 ఢిల్లీ సమావేశాన్ని సుసాధ్యం చేశాయని మరవరాదు. మెషీన్ గన్లు, అధికార దర్పం తప్ప, టెర్రరిజానికి సమాధానం ప్రభుత్వ టెర్రరిజమేనన్న ఆలోచనా విధానం తప్ప, చర్చలకు పూర్తిగా తిలోదకాలిచ్చిన తప్పుడు వాతావరణం నుంచి బయటపడి - చర్చల ద్వారానే రాజకీయ సమస్యల పరిష్కారం సాధ్యమూ సుసాధ్యమూనన్న విశ్వాసాన్ని తిరిగి నెలకొల్పినందుననే ఢిల్లీ సమావేశం కొన్ని స్పష్టమైన నిర్ణయాలకు రాగలిగింది. "నేడు పంజాబ్ రక్తసిక్తమై ఉంది. మమతానుబంధాలు తెగిపోయాయి. గాయపడిన ఈ మనస్సులను నయం చేయాలి, ఆ పగుళ్ళను బాగు చేయాల్సి ఉంది... సమస్యల పరిష్కారానికి సంప్రతింపులు, సంప్రతింపులే తప్ప మరొక మార్గం లేదు. జరిగిన పరిణామాల గురించి మనం ఆత్మ పరిశీలన చేసుకోవడంలోనే గొప్పతనం ఉంది. మన మనస్సులను మనం పరీక్షించుకొని, హృదయాలను పరస్పరం దగ్గరకు చేర్చేందుకు మనసారా ప్రయత్నించాలి" అని ప్రధాని వి.పి.సింగ్ స్వర్ణ దేవాలయ సందర్శన సందర్భంగా ప్రకటించారు. దానికి అక్షర రూపమే ఢిల్లీ అఖిలపక్ష భావన, స్థూలాభిప్రాయ ప్రకటన! అయితే, జాతీయ, ప్రాంతీయ స్థాయికి చెందిన 15 రాజకీయ పక్షాలు పాల్గొని అకాలీదళ్ (లోంగోవాల్) వర్గం సహా ఆమోదించిన అఖిలపక్ష ప్రకటనను ఒక్క కాంగ్రెస్(ఐ) మాత్రమే ఆమోదించకపోవడం విచారకరం, గర్హనీయం. కేవలం ముసాయిదా సకాలంలో అందలేదన్న సాంకేతిక కారణాలను సాకుగా చూపి పంజాబ్ పరిష్కారానికి స్థూలాభిప్రాయాన్ని ఆమోదించడానికి కాంగ్రెస్(ఐ) నిరాకరించడం చాలా చిలిపిగా ఉంది. పంజాబ్‌లోనేగాక, దేశంలోని ఏ ఇతర రాష్ట్రంలోనైనా, లేదా రాష్ట్రంలోని ఒక ప్రాంతంలోనైనా రాష్ట్రపతిపాలన పేరిట కేంద్రపాలన నెలకొల్పడానికి, చివరికి పౌరుని జీవించే హక్కును కాలదన్నడానికి ప్రభుత్వానికి నిరంకుశాధికారాలు దత్తం చేస్తున్న 59వ రాజ్యాంగ సవరణ

బిల్లును రద్దు చేయాలని, 1984లో (ఇందిరాగాంధీ హత్యానంతరం) ఢిల్లీలోను, ఇతర చోట్ల సిక్కులపై మూకుమ్మడిగా దౌర్జన్య కాండకు, హత్యలకూ కారకులయిన నేరస్తులను శిక్షించేందుకు వెంటనే చర్యలు తీసుకోవాలనీ అఖిలపక్ష సమావేశం కేంద్ర ప్రభుత్వాన్ని కోరింది. "పంజాబ్ ప్రజల బాధలకు వేగాతివేగంగా స్వస్తి చెప్పాల"ని సమావేశం అభిప్రాయపడడమేగాక, ఇంతకు ముందు ప్రభుత్వం వహించిన వైఖరికి భిన్నంగా పంజాబ్‌లోని అన్ని వర్గాల ప్రజల విశ్వాసాన్ని చూరగొనడానికి అనువైన వాతావరణం సృష్టించడం మొట్టమొదటి పనిగా ఉండాలని, క్రమంగా జాగ్రత్తగా ముందడుగువేస్తూ అంతిమ పరిష్కారానికి బాట వేసుకోవాలని కోరింది.

చేయిదాటిపోతున్న పంజాబ్ పరిణామాలకు వెంటనే పరిష్కారం కుదర్చాలన్న ఆతురతలో నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం - ఒక్క కాంగ్రె(ఐ) తోనే గాదు, అఖిలపక్ష సమావేశానికి హాజరైన ఇతర రాజకీయ పక్షాలతో కూడా సుదీర్ఘమైన చర్చల తతంగానికి దిగని మాట వాస్తవం! అయితే, తొలిచర్యగా అందరికీ ఆమోదయోగ్యమైన "స్థూలాభిప్రాయ ప్రకటన"ను(కాన్సెన్సస్) జాతికి నివేదించడానికి కాంగ్రెస్ (ఐ) అభ్యంతరం చెప్పి ఉండవలసింది కాదు, తాను ఇతరులనుంచి వేరుపడి ఉండవలసిందికాదు! చివరికి కాంగ్రెస్ (ఐ) మిత్ర పక్షాలుగా ఉంటున్న అన్నా డి.ఎం.కె., నేషనల్ కాన్ఫరెన్స్ పక్షాల నుంచి కూడా ఈ విషయంలో కాంగ్రెస్ (ఐ) దూరం కావడం ఎంత మాత్రమూ సమర్థనీయం కాదు. ఎందుకంటే 1982 నవంబర్ నుంచీ, 1985లో కుదిరిన రాజీవ్ - లోంగోవాల్ ఒడంబడిక దాకా సాగుతూ వచ్చినవి చర్చలు, అంతులేని చర్చలేగాని ఆచరణ మాత్రం శూన్యమన్న సంగతి పంజాబ్ ప్రజలకేగాదు యావద్భారతావనికీ తెలిసిన బహిరంగ రహస్యం! నేటి పరిస్థితి చర్చలకు తప్ప చర్చల పేరిట కాలయాపనకు అనువైనదీ కాదు!

ఢిల్లీ సమావేశంలో కాంగ్రెస్(ఐ) ప్రతినిధివర్గానికి నాయకత్వం వహించిన పి.వి.నరసింహారావు తనకున్న అపారమైన అనుభవం దృష్ట్యా కాంగ్రెస్(ఐ) పాత్రను, ఎన్నికల అనంతరం అది ప్రకటించుకున్నట్టు "బాధ్యతాయుతమైన ప్రతిపక్షం" పాత్రను మరింతగా ఇనుమడించేట్టు చేయవలసింది. పైగా పంజాబ్‌లోని అకాలీదళ్ వర్గాలలోని కుమ్ములాటలను ఇంతకుముందు ఎలా ఆసరాచేసుకొని పరిష్కారాన్ని నుసాధ్యం చేయకుండా కేంద్రం తాత్సారం చేసిందో, ఇప్పుడు కూడా ఆ తగాదాలను వినియోగించుకుని, పరిష్కారం కోసం జరుగుతున్న మరొక విశిష్ట ప్రయత్నాన్ని అడ్డుకోజూడడం ఎంతమాత్రం వివేకం కాదు; వి.పి.సింగ్ పంజాబ్ పర్యటనను అకాలీదళ్ లోని సిమ్రంజిత్ మాన్ వర్గం, బాదల్ వర్గాలు హర్షించాయి. అది సుహృద్భావాన్ని పెంపొందించే చర్యగా అభివర్ణించాయి.

కాని ఆ మేరకు కాంగ్రెస్(ఐ) అంత చొరవచూపలేదు. అయినా ఢిల్లీ చర్చలలో పాల్గొనబోయే ముందు మాన్, బాదల్ వర్గాలు కొన్ని షరతులు విధించాయి; వాటిపై ఒక నిర్ణయానికి కేంద్ర ప్రభుత్వం వచ్చేదాకా అవి, చర్చలలో ఈ దశలో పాల్గొనకపోవడం సహజం. ఆ షరతులేమిటో కాంగ్రెస్(ఐ)కు పూర్తిగా తెలుసు! కాని ఈలోగా చర్చలలో కాంగ్రెస్(ఐ) పాల్గొనడం నేరంగానూ, న్యూనత గానూ భావించనక్కరలేదు. ఇటీవల ఎన్నికల్లో కాంగ్రెస్(ఐ)కు పంజాబ్‌లో 26 శాతం, యునైటెడ్ అకాలీదళ్(మాన్)కు 30 శాతం, అకాలీదళ్(బాదల్)కు 5.5 శాతం వోట్లు వచ్చినందున, వీరు లేకుండా ఢిల్లీ చర్చలు నిష్ఫలమని పి.వి.నరసింహారావు వాదన! మండిపోతున్న పంజాబ్‌కు కావలసింది కారుణ్యం కాని 'కరణీకం' కాదు! అదే నిజమైతే కాంగ్రెస్(ఐ) తరపున పి.వి. కొన్ని ప్రశ్నలకు సమాధానం చెప్పుకోవలసి వస్తుంది: 1982 నవంబర్

నుంచి అకాలీదళ్ వర్గంతో కాంగ్రెస్ చర్చలు జరుపుతున్నప్పటికీ పంజాబ్ పరిణామాలు ఎందుకలా వికటించవలసి వచ్చింది? చివరికి కాంగ్రెస్(ఐ) ప్రముఖుడు స్వరణ్ సింగ్, మార్క్సిస్టు నాయకుడు హరికిషన్ సింగ్ సూర్జిత్ ఉమ్మడిగా చేసిన ప్రతిపాదనలను ఆనాటి కేంద్రం ఎందుకు ఆమోదించలేక పోయింది?! ఒక్క ప్రాంతీయ సరిహద్దు సమస్యలపై వివాదం విషయంలో తప్ప మిగతా అకాలీ డిమాండ్లు అన్నింటిపైనా (మతపరమైన కోర్కెలు సహా) అకాలీలు కూడా పాల్గొన్న 1984 ఫిబ్రవరి అఖిలపక్ష సమావేశం ఆమోదించిన ఒప్పందాన్ని ఎందుకు ఇంతకాలం నానబెట్టవలసి వచ్చింది? ఇంతగా వోట్ల శాతాన్ని ప్రేమించేవారు ఆనాటి అఖిలపక్ష సమావేశ ప్రతిపాదనలను గానీ, ఆ తర్వాత రాజీవ్ - లోంగోవాల్ ఒప్పందాన్ని గానీ ఆచరణలో ఎందుకు అమలు పెట్టలేదు? అదే "వోట్ల శాతం" పట్ల ప్రేమాభిమానాలున్నవారు, ప్రజాభిప్రాయాన్ని గౌరవించదలచినవారు, ఆ ప్రజలకు జీవించే ప్రాథమిక హక్కునే హరించివేసే 59వ రాజ్యాంగ సవరణను ఏ ప్రజల అనుమతితో పంజాబ్‌పైనా, దేశంపైనా రుద్దగలిగారు? "ఆపరేషన్ బ్లూస్టార్", "ఆపరేషన్ బ్లాక్ థండర్"లనూ, ఢిల్లీలోని 1984 నాటి మూకుమ్మడి హత్యాకాండనూ, గృహదహనాలనూ ఏ ప్రజల అనుమతితో సహించగలిగారు?

డిసెంబర్ ౹౨, ౹౯౮౯

# పంజాబ్ సమస్య - 2



ల్లీ అఖిలపక్ష సమావేశ ప్రకటన విషయంలో పి.వి. నరసింహారావు "పప్పులో కాలువేసింది" ఎక్కడంటే - సమరస వాతావరణం కోసం జాతినుద్దేశించి సిద్ధపరిచిన ఆ ప్రకటనను, ఆ స్థూలాభిప్రాయాన్ని "పంజాబ్ ఒప్పందం"గా ఆయన భావించడంలో! ఆ ప్రకటన రాజీవ్ - లోంగోవాల్ ఒడంబడిక లాంటిదీ కాదు, అదే శాశ్వత పరిష్కారమూ కాదు. పంజాబ్ సమస్యపై శాశ్వత పరిష్కారాన్ని సాధించడానికి ముందుగా అక్కడి ప్రజలలో వ్యక్తి హింసావాదం వల్ల (టెర్రరిజం), ప్రభుత్వ హింసాకాండ (స్టేట్ టెర్రరిజం) వల్ల ఏర్పడిన మానసికమైన భీతావహస్థితిని తొలగించడానికి, పరిపాలనా సంబంధమైన పద్ధతులను ప్రజలకు సన్నిహితంగా ఉండేటట్టు సంస్కరించి మెరుగుపరచడానికి, తగిన మానసిక స్థయిర్యాన్ని పెంపొందిచడానికీ ఉద్దేశించింది ఢిల్లీ ప్రకటన. కనుకనే అఖిలపక్ష సమావేశం ముందుగా, రాష్ట్రపతి పాలన విధింపునకు పౌరుని జీవించే హక్కును రద్దు చేయడానికి ఉద్దేశించిన 59వ రాజ్యాంగ సవరణను ఉపసంహరించడం ద్వారా, 1984లో సిక్కులపై మూకుమ్మడి హత్యాకాండకు, దహనకాండకు దిగిన నేరస్తులను శిక్షించేందుకు చర్యలు తీసుకోవాలని కేంద్ర ప్రభుత్వాన్ని కోరడం ద్వారా - సామరస్య వాతావరణం సృష్టికి పునాది వేసింది. నిజానికి "కాన్సెన్సస్" ప్రకటనముసాయిదా తమకు అందలేదనో, లేదా తమను సంప్రతించలేదనో పి.వి. సాకుచెప్ప జూచారుగాని, అఖిలపక్ష ప్రకటనకు కాంగ్రెస్(ఐ) అంగీకారం తెలపకపోవడానికి అసలు కారణం - 59వ సవరణకు, ఢిల్లీ అల్లర్లకూ కాంగ్రెస్(ఐ) ఆత్మ పరిశీలనకు, స్వాతంత్ర్యోద్యమ సంప్రదాయాలను పుణికిపుచ్చుకున్న బాధ్యతాయుతమైన ఒక జాతీయ రాజకీయ పక్షంగా ఆత్మ విమర్శకూ కాంగ్రెస్(ఐ) సిద్ధం కాకపోవడం. ఆ పార్టీ ఉనికికేకాదు, దేశ ప్రయోజనాలకు కూడా హానికరమని గుర్తించాలి. జరిగిపోయినదేదో జరిగిపోయింది. ఒక నూతనాధ్యాయం తెరవడానికి ఎందుకు జంకాలి? జాతీయ జీవన స్రవంతిలో కలగలిసిపోయి పంజాబ్ సమస్యకు నూతన దృక్కోణం నుంచి, రాజకీయ విభేదాలతో నిమిత్తం లేకుండా అఖిలపక్ష స్థాయిలో ప్రారంభమైన ఒక ప్రయత్నానికి కాంగ్రెస్(ఐ) కూడా ఎందుకని చేదోడువాదోడు కాదు? అఖిలపక్ష ప్రకటనగా వెలువడే ముసాయిదా ప్రతి తమకు అందలేదన్న పి.వి. వాదన కూడా తప్పే. ఎందుకంటే డిసెంబర్ 16న విదేశాంగ మంత్రి గుజ్రాల్ స్వయంగా కాంగ్రెస్ అధ్యక్షుడు రాజీవ్‌కు ఫోన్ చేసి "ముసాయిదా ప్రకటన రూపకల్పనలో సహాయపడేందుకు" పార్టీ తరపున ఒక ప్రతినిధిని పంపవలసిందిగా కోరారు! అయితే, తాము యింకా చర్చించుకోనందున ఈ దశలో అఖిలపక్ష ముసాయిదా దూపకల్పనలో తమ పార్టీ పాల్గొనలేకపోతోందని రాజీవ్ సమాధానం చెప్పారు! అంతేగాదు, 17వ తేదీ ఉదయం ముసాయిదా ప్రతిని కాంగ్రెస్ కార్యాలయానికి

పంపించినప్పటికీ, తమను "సంప్రతించలేదు" కాబట్టి ఆ ప్రకటనను తాము ఆమోదించబోమని కాంగ్రెస్ ప్రతినిధులు చెప్పారు! వచ్చిన ఆహ్వానం మన్నించి ముసాయిదా రచనలోనూ పాల్గొనరు, తీరా ముసాయిదా ప్రతిని పంపితే, తమను సంప్రదించలేదని అలగడం! ఈ పద్ధతి గాంధీ, నెహ్రూల సంప్రదాయానికి పూర్తిగా విరుద్ధం! పంజాబ్ సమస్య పరిష్కారానికి తొలిమెట్టుగా అఖిలపక్ష సమావేశం ఆమోదించిన ముసాయిదా ప్రకటన - లోగడ మాదిరిగా ఏ ఒక్క పార్టీ అభిప్రాయంగానో రుద్దిన ప్రకటన కాదు! అందుకనే దానికి ప్రాధాన్యమివ్వాలి. ఆ ప్రకటనకు ఇతర పక్షాలతోపాటు నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం కూడా భాగస్వామి అవుతున్నట్టే, ప్రధాన ప్రతిపక్షంగా కాంగ్రెస్(ఐ) కూడా ఆమోదం తెలిపి ఉండాల్సింది. అలా కాకుండా, "ఖలిస్తాన్" వాదుల ప్రకటనలపట్ల, టెరరిస్టుల చర్యలపట్ల ఫ్రంట్ ప్రభుత్వం వైఖరి ఏమిటో స్పష్టం చేయనందున తాము ఆ ప్రకటనను ఆమోదించబోమని సమావేశంలో పాల్గొని వచ్చిన తరువాత కాంగ్రెస్(ఐ) విడుదల చేసిన ప్రకటన - సమస్యా పరిష్కారానికి ఎంతమాత్రం తోడ్పడదు. ఏమంటే - అఖిలపక్ష సమావేశం విడుదల చేసిన 'అభిప్రాయ ప్రకటన'లో కాంగ్రెస్(ఐ) తరపున పి.వి. లేవనెత్తిన ప్రస్తావనలన్నీ ఉన్నాయి.

అఖిలపక్ష ప్రకటన - దేశ సమైక్యతను, సార్వభౌమాధికారాన్నీ పణం పెట్టకుండానే, భారత రాజ్యాంగ పరిధులలోనే పంజాబ్ సమస్యను పరిష్కరించవలసి ఉంటుందని స్పష్టం చేసింది; ప్రత్యేకించి ఎవరినీ బుజ్జగించకుండా అందరికీ న్యాయం చేకూర్చేటట్టు చూడడం జాతీయ విధానంగా ఉండాలనీ పేర్కొన్నది; అమాయక ప్రజలను చంపడాన్ని ఈ సమావేశం ఖండితంగానూ, నిర్ద్వంద్వంగానూ ఖండించింది, హింసాకాండను రాజకీయ సాధనంగా ఉపయోగించడాన్ని నిరసించింది; ఎన్నో కష్టనష్టాలకు గురైనా పంజాబ్‌లోని వివిధ వర్గాల మధ్య సంప్రదాయంగా వర్ధిల్లుతూ వచ్చిన సఖ్యత ఇంకా చెక్కు చెదరలేదని చెబుతూ, ఇప్పటికైనా హింసాకాండకు స్వస్తి చెప్పకపోతే మరోసారి ప్రజల వలసకు దారితీసే ప్రమాదముందని హెచ్చరించింది; అలాగే ఒక వైపునుంచి రాజకీయ పరిష్కారానికి మనస్సుపెట్టి ప్రయత్నాలు జరుపుతూనే, మరోవైపు నుంచి టెరరిజాన్ని ఎదుర్కోడంలో వెనకంజ వేసేది లేదని ప్రజలకు హామీ పడాలని కోరింది; ఇందుకోసం ముందు పంజాబ్ శాంతి భద్రతల యంత్రాంగాన్ని సంస్కరించి, పోలీసుల అత్యాచారాలకు స్వస్తి చెప్పించవలసిన అవసరాన్నీ, టెరరిజాన్ని ఎదుర్కొనే పేరుతో డబ్బులు వసూలు చేసినవారిపైనా లేదా ప్రజలను వేధించిన వారిపైనా చర్యలు తీసుకోవాలనీ, అదే సమయంలో విధినిర్వహణకు మాత్రమే విధేయులై ఉన్న అధికారులకు పూర్తి మద్దతు ఇవ్వాలనీ కోరింది; నేరం చేసిన వారిని శిక్షించకుండా, న్యాయాన్ని సంరక్షించకుండా విడిచిపెట్టడం వల్ల ప్రభుత్వ యంత్రాంగం ఉనికే ప్రశ్నార్థకమవుతుందనీ, ఫలితంగా రాజకీయ పరిష్కారానికి అవసరమైన చర్చలు, సంప్రతింపుల విధానానికే అవరోధం ఏర్పడుతుందనీ స్పష్టం చేసింది. ఇలాంటి ప్రకటనకు పి.వి. ఎందుకు అభ్యంతరం చెప్పారో అనూహ్యం! అన్ని పక్షాలా ఓర్పుతో, పట్టుదలతో, సుహృద్భావంతో సంక్లిష్టమైన పంజాబ్ సమస్య పరిష్కారానికి జాతీయ స్థాయిలో జరుగుతున్న తొలి ప్రయత్నాన్ని ఎందుకు శంకించాలో అర్థం కాదు! పైగా నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వానికి అకాలీదళ్ (మాన్), అకాలీదళ్(బాదల్) వర్గాలు మద్దతు ప్రకటించిన తరువాతనైనా కాంగ్రెస్(ఐ) వైఖరిలో మార్పు రావడం అవసరం! చరిత్ర అనుభవాలనుంచైనా నేర్చుకోవాలి, లేదా తనకైనా తట్టాలి. ఎందుకంటే, 1982 నవంబర్ - 1984 ఫిబ్రవరి మధ్య కాలంలో కనీసం అయిదు సందర్భాలలో అకాలీలకూ, ఆనాటి

కేంద్ర ప్రభుత్వానికీ మధ్య " ఒప్పందానికి అనువైన అంశాలపై ఉభయపక్షాలూ స్పష్టమైన అంగీకారానికి వచ్చాయి. కాని ప్రతిసారీ కేంద్ర ప్రభుత్వమే అడినమాటపై నిలబడక జారుకుంటూ వచ్చింది". (సమతా ఈరా పబ్లికేషన్: "పంజాబ్"; పే.24)! అంతేగాదు, స్వరణ్ సింగ్, సూర్జిత్‌ల సమష్టి కృషి ఫలితంగా 1982 నవంబర్ 2న అకాలీలూ, ప్రభుత్వమూ ఒక "అవగాహన"కు వచ్చారు. మరుసటి రోజున ఆ విషయాన్ని పార్లమెంటులో ప్రకటించవలసి ఉంది. కాని ఆ ప్రకటన నవంబర్ 3న చేసారు. అయితే, అంతకు ముందు కుదిరిన అవగాహనకు భిన్నంగా ఉంది-ఆ ప్రకటన! అప్పుడు కాంగ్రెస్ వృద్ధ నాయకుడు, సంప్రతింపులలో పాల్గొన్న స్వరణ్ సింగ్ కేంద్రం ధోరణిపై ఏమన్నాడు? "ఇది తొలి ప్రకటనలోని భాషా కాదు, ఆ ప్రకటనలోని జీవద్భావమూ(స్పిరిట్) కాదు" అని వ్యాఖ్యానించవలసి వచ్చింది. అంతే, అది మొదలు అకాలీల విశ్వాసం సడలిపోవడానికి అదేపునాది అయింది! దాంతో ఆందోళనా రూపాలూ మారిపోయాయి! ఇలా చేతులు కాలిన తరువాత, ఆకులు పట్టుకోడానికి ప్రయత్నిస్తున్నాం!

డిసెంబర్ 20, 1989

# పంజాబ్ సమస్య - 3

తీయ మైనారిటీలు నివసించే ప్రాంతాలలో ప్రజాస్వామ్య పద్ధతుల ద్వారా మైనారిటీ ప్రజలలోని ఒక వర్గాన్ని తలదువ్వి, మరొక వర్గంపై కాలుదువ్వే పద్ధతులవల్ల, తిరకాసు రాజకీయాలవల్ల (Manipulative politics) ఆయా రాష్ట్రాల ప్రజలకే గాదు, మొత్తం దేశం సమగ్రతకే ముప్పు వస్తుంది. స్వార్థ రాజకీయ ప్రయోజనాలకోసం ఎప్పుడైతే 'మెజారిటీ సెంటిమెంట్స్'ను మైనారిటీలకు వ్యతిరేకంగా రెచ్చగొట్టడానికి ప్రయత్నిస్తారో అప్పుడది వివక్షా రాజకీయాలుగా మైనారిటీల మనస్సుల్లో ముద్రపడిపోతుంది. ఇది చారిత్రిక సత్యం. అమెరికాలో నీగ్రోలపైకి, ఇంగ్లాండ్‌లో ఆసియన్లపైకి తెల్లవాళ్ళను ఉసిగొల్పినట్టే, జర్మనీలో హిట్లర్ యూదలపైకి జర్మన్‌లను పురిగొల్పాడు. ఫలితం? అది యూదులను హతమార్చడానికేగాక, జర్మన్‌లకు కూడా హాని కలిగించింది. సామాన్య ప్రజలు అధికార దాహ రాజకీయాలకు బలిపశువులైపోవలసి వచ్చింది. అలాగే 1849లో బ్రిటిష్ ఇండియా దత్తం చేసుకున్న పంజాబ్‌లో, బ్రిటీష్ వాళ్ళు ఏ 'రాజనీతి'ని, ఏ "విభజించి । పాలించ"మనే దుర్మార్గపు నీతిని అనుసరించారో, స్వతంత్ర భారతంలోని కేంద్ర ప్రభుత్వాలు కూడా ఆ తప్పుడు నీతినే పంజాబ్‌లో కూడా అనుసరిస్తూ వచ్చాయి. సిక్కులలో ఒక వర్గాన్ని దగ్గరకు చేర్చి, శిరోమణి గురుద్వారా ప్రబంధక్ కమిటీ "మహంత"లను బుజ్జగించి, ప్రలోభపెట్టింది. వారిని బ్రిటీష్ వాళ్ళు నాడు - భారత స్వాతంత్ర్య సమరంలో ప్రాణ తర్పణ చేయడానికి సిద్ధపడిన "కామగాట మారు" తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్న సిక్కు వీరులను ఖండిస్తూ ప్రకటనలు చేయడానికి, 'సింగ్ సభా' ఉద్యమాన్ని దూషిస్తూ హుకుమ్‌నామాలు జారీ చేయడానికీ, గదర్ పార్టీ వీరులను తూలనాడడానికీ వినియోగించుకున్నారు; అంతకన్నా విచిత్రం, జలియన్‌వాలాబాగ్ హత్యా కాండకు 'పౌరోహిత్యం' వహించిన బ్రిటిష్ అధికారి నరరూప రాక్షసుడైన జనరల్ డయ్యర్‌కు అదే 'మహంత'లతో, స్వర్ణ దేవాలయ 'సర్బ్రా'తో 'సరోపాలు' బహూకరించడం!! అలాంటి పనిచేసే ఇందిర ప్రభుత్వం అకాలీలకు పంజాబ్ రాజకీయాలలో స్థానం లేకుండా చేయడానికి చేసినపని - 1980 నుంచి భింద్రేన్ వాలాను పెంచి పోషించడం; జైల్ సింగ్ - దర్బారా సింగ్‌ల మధ్య రాజకీయమాడుతూ ఒక బొమ్మను దించి, మరొక బొమ్మను ఎక్కిస్తూ, చివరికి దర్బారా సింగ్‌ను కూడా దించుతూ, మొత్తం అకాలీలలో గందరగోళం సృష్టించడానికి భింద్రేన్ వాలాను వాడుకున్న తీరు బ్రిటీష్ వాడి విభజించి - పాలించే సిద్ధాంతానికి మక్కీకి మక్కీ అనుకరణగా భావించాలి! అకాలీ సమస్యలపై చర్చల రాజమార్గం వదిలి సిక్కులలో చీలికలు పెట్టడానికి అకాలీ మత గురువులను వాడారు! 'నిహాంగ్' లను ముందుకు తోశారు; స్వర్ణ దేవాలయంపై 'బ్లూస్టార్ ఆపరేషన్', తద్వారా "కర్‌సేవా" కార్యక్రమం పేరుతో బుద్ధదళ్ నిహాంగ్ బాబా సంతాసింగ్‌ను (1984లో) వినియోగించారు; ఇందుకు 'సై' అన్న వారు జైల్ సింగ్, అందుకు ప్రతిఫలంగా జనరల్ డయ్యర్‌కు బ్రిటీష్ వాడు దేవాలయ మహంత్ ద్వారా 'సరోపా' ఇప్పించినట్టే, సంతా సింగ్‌చే జైల్‌సింగ్‌కు "పరమసిక్" సనదు ప్రకటించారు! అయినా "టెర్రరిస్టు" చర్యలకుగానీ, కేంద్ర ప్రభుత్వ టెరరిస్టు చర్యలకుగానీ అటవిడుపు లేదు. చివరికి పంజాబ్

పరిణామాలపై ప్రకటించిన "శ్వేత పత్రం"లో కూడా దాపరికాలేగాని మనసు విప్పి మాట్లాడుకొన్నది లేదు! ఎంతసేపూ అకాలీలు ప్రక్కతోవ పట్టారని మూకుమ్మడిగా ఖండించడమేగాని, సిక్కులందరూ టెర్రరిస్టులు కారనీ, టెరరిస్టులందరూ సిక్కులు కారనీ, ప్రభుత్వ నిర్బంధ విధానంవల్ల, ఎన్‌కౌంటర్ల పేరిట నాన్-టెరరిస్టులను, అన్యాయానికి వ్యతిరేకంగా గొంతెత్తిన ప్రతి సామాన్య పౌరుణ్ణి, మేధావినీ టెరరిస్టుగా భావించి హత్యాకాండను నిత్యకృత్యంగా మార్చినందున టెరరిజం పెరిగిందనీ పాలకులు గుర్తించలేకపోయారు; సకాలంలో తప్పిదాలను సవరించుకోలేకపోయారు. అంతవరకూ అకాలీలతో జరుగుతూ వచ్చిన సంప్రతింపులు ఎందుకు విఫలమయ్యాయో ఒక్క ముక్క కూడా "శ్వేత పత్రం"లో ప్రకటించలేకపోయారు. చివరికి ఈ "విభజించి - పాలించే" రాజనీతి వల్లనే 1985 నాటి రాజీవ్ - లోంగోవాల్ ఒప్పందం కూడా నిర్వీర్యమైపోయింది. అకాలీలలో పేరు ప్రతిష్ఠలు గల బాదల్, తోహ్రా వర్గాలను, సిక్కు విద్యార్థి సమాఖ్య నాయకులనూ ఆ ఒప్పందపు సంప్రదింపులలోకి ఆకర్షించుకోలేకపోయారు.

ఇప్పుడు నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం ఆధ్వర్యంలో జరిగిన అఖిలపక్ష సమావేశ విశిష్ట ప్రకటన పంజాబ్‌లో శాశ్వత శాంతి స్థాపనకు మార్గాన్ని సుగమం చేయాలన్నా - క్రమంగా రేపటి నుంచి జరిగే చర్చలలో ప్రభుత్వంతో ఇప్పటివరకూ ముఖాముఖి పోరాటంలో ఉన్న అన్ని అకాలీ వర్గాలనూ మనఃపూర్వకంగా ఆహ్వానించుకోవలసి ఉంటుంది. మొన్నటి అఖిల పక్ష సమావేశానికి అకాలీ మాన్, బాదల్ వర్గాలు హాజరు కాకపోవడం వెలితిగా భావిస్తున్న కాంగ్రెస్(ఐ) ప్రతినిధి పి.వి. నరసింహారావు ఆ వర్గాల నాయకులను నాలుగైదేళ్ళుగా ఎందుకు నిర్బంధాల పాలుజేసి, వేధించవలసి వచ్చిందో (ఇందిర హత్యకు సంబంధించిన కుట్ర కేసుల పేరిట) సమాధానం చెప్పలేకపోయారు! ఇప్పటికైనా కపట నాటకాలు మానాలి. భోళాగా మాట్లాడడం నేర్చుకోవాలి. అకాలీల ఆనందపూర్ సాహెబ్ తీర్మానం పట్ల, టెరరిస్టుల చర్యలపట్ల, ప్రకటనలపట్ల నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం వైఖరి స్పష్టంగా లేదని ఫిర్యాదు చేస్తున్న పి.వి. టెరరిస్టుల పేరిట నిర్బంధించిన డజన్లకొలదీ సిక్కు యువకులను రాజీవ్ – లోంగోవాల్ ఒప్పందం సమయంలో బేషరతుగా ఎలా విడుదల చేశారో చెప్పాలి! రాజీవ్ - లోంగోవాల్ ఒప్పందంలో రాష్ట్రాలకు హెచ్చు అధికారాలను, స్వపరిపాలనా ప్రతిపత్తిని కోరిన ఆనందపూర్ సాహెబ్ తీర్మానాన్ని ఎలా చేర్చగలిగారో, అదే తీర్మానాన్ని తరువాత సర్కారియా కమిషన్‌కు ఎలా నివేదించగలిగారో చెప్పాలి!! అలాగే, నిన్నగాక మొన్న - నాలుగైదేళ్ళ నిర్బంధం తర్వాత, విచారణ లేకుండా, అరెస్టు కారణాలు, వివరణ కూడా లేకుండా సిమ్రంజిత్ మాన్ వర్గాన్ని ఎలా విడుదల చేశారో పి.వి. చెప్పలేదు, చెప్పలేరు!! జాతినెదుర్కొంటున్న కొన్ని కీలకమైన సమస్యల విషయంలో, కొన్ని క్లిష్టమైన దశలలో నాయకత్వానికి కావలసింది బింకాలు, మొండితనమూ కాదు, వెసులుబాటు, మానవీయత, ప్రజాస్వామిక దృక్పథం, భోళాతనం. ఆవైఖరి కోసం కాంగ్రెస్ నాయకత్వం ప్రత్యేకించి వెతుకులాడనక్కరలేదు. కాంగ్రెస్ చరిత్రనుంచే ఉత్సాహం పొందవచ్చు. బ్రిటీష్ ఇండియాలో విప్లవకారులపట్ల, 1935 చట్టం ప్రకారం డిమాండ్ చేసి పొందిన రాష్ట్రీయ స్వపరిపాలన (ప్రొవిన్షియల్ అటానమీ) పట్ల, ద్వంద్వ పరిపాలనపట్ల, గవర్నర్లపాత్ర గురించీ జాతీయకాంగ్రెస్ పరిస్థితులకు అనుగుణంగా మారుతూ, సంస్థను పెంచుకుంటూ వచ్చింది. హింసా చర్యలవల్ల దేశ ప్రయోజనాలకే హాని తలపెడుతున్నారని బెంగాల్ విప్లవకారులను అంతకుముందు శరించిన కాంగ్రెసే, విచారణ లేకుండా డిటెన్షన్‌లో పడి మగ్గుతున్న విప్లవకారులనుద్దేశించి, ఒక తీర్మానం చేస్తూ "వీరందరూ భారతదేశ స్వాతంత్ర్యం కోసం సాహసంతో, మూగబాధలు అనుభవిస్తున్న విప్లవకారులు"గా కీర్తించవలసి వచ్చింది! అంతేగాదు, 1939 గయ కాంగ్రెస్‌లో డాక్టర్ రాజేంద్రప్రసాద్ రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయడం"నేటి పరిస్థితులలో అవశ్యం" అని కోరారు. గాంధీ, రాజన్‌బాబుల చొరవపైనే ప్రభుత్వం టెరరిస్టులను విడుదల చేసింది. అలాగే ఈ రోజున పంజాబ్‌లో కూడా జరగవలసింది ఇలాంటి పనే. బ్లాక్ లాస్ అన్నీ తొలగిపోవాలి.

డిసెంబర్ 21, 1989

# పంజాబ్ సమస్య - 4


తుల సమస్య జ్యాతీయ సమస్య ఎలాగో జాతీయ సమైక్యత జాతుల మనుగడకు కూడా అంత అవసరమూ. భిన్నమతాలు, భిన్నజాతుల, విభిన్న భాషామైనారిటీల సమాహారమే ఈ సుందర భారతదేశం అన్న స్పృహ, చైతన్యమూ కొరవడబట్టే భారతీయతకు ఇంతకాలమూ పాలకులు పెడార్థాలు తీస్తూ వచ్చారు. దాని ఫలితమే వేర్పాటు వాదాలుః రాష్ట్రపతి వెంకట్రామన్ తొమ్మిదవ పార్లమెంటు ఉభయసభలసంయుక్త సమావేశంలో చేసిన ప్రసంగం నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం పంజాబ్ సమస్యపై జాతీయస్థాయిలో ఏకాభిప్రాయ సాధనకు చేస్తున్న ప్రయత్నాన్ని మరొకసారి ధృవపరిచింది. వేర్పాటు వాదంతో రాజీపడకుండానే, ఉగ్రవాదులకు లొగుబాటు ప్రదర్శించకుండానే చర్చలద్వారా, సంప్రతింపుల ద్వారా జాతీయ సమస్యల పరిష్కారాన్ని ఆయన అభిలషించారు; "దేశ భావ సమైక్యతకు, జాతీయ సఖ్యతకు సెక్యులర్ ఇండియా పునాది. మరోసారి ఈ దేశం మతప్రాతిపదికపై చీలిపోకుండా వాతావరణం నెలకొనడం నేడు అత్యవసరం" అన్న రాష్ట్రపతి అభిప్రాయంతో ఏకీభవించని వారుండరు. నిజానికి, కేంద్రానికీ, రాష్ట్రాలకూ మధ్య ఫెడరల్ వ్యవస్థలో అధికారాల పంపిణీకి, ఉమ్మడి జాబితాలలోని అంశాల పంపిణీకి సంబంధించి తలత్తే పెక్కు భేదాభిప్రాయాలను పరిష్కరించుకునేందుకు రాజ్యాంగంలో కల్పించిన అవకాశాలను కేంద్ర ప్రభుత్వం ఇంతవరకూ వినియోగించుకోలేదు. ఈ తాత్సారమే వేర్పాటు వాదానికి ఒక కారణం. అలాగే స్వాతంత్ర్యానంతరం రాజ్యాంగం కేంద్రం - రాష్ట్రాలకు మధ్య గుర్తించి గిరిగీసి పెట్టిన మూడు అధికార జాబితాలలో (కేంద్రం జాబితా, రాష్ట్రాల జాబితా, ఉమ్మడి జాబితా) స్టేట్‌లిస్టు, కంకరెంట్ లిస్టులోని అంశాలు క్రమంగా కేంద్ర జాబితాలోకి జారుకోవడం కూడా దేశంలో వేర్పాటువాదానికి మరో కారణం! ఇలాంటి సమస్యలు చర్చలు, సంప్రతింపుల ద్వారా తప్ప, రాచరికాలు - సామంతుల భావనలో కేంద్రం వ్యవహరించడంవల్ల పరిష్కారం కావని భావించబట్టే రాజ్యాంగంలో "జాతీయ సమైక్యతా మండలి (నేషనల్ ఇంటెగ్రేషన్ కౌన్సిల్) స్థాపనకు వీలు కల్పించారు. బహుశా ఈ మండలిని తొలిసారిగా ఫ్రంట్ ప్రభుత్వం ఆచరణలో పెట్టబోతోంది. ఇది ప్రజాస్వామ్య యుగం. రాజులూ లేరు తరాజులూ లేరు, సామంతులు అంతకంటే లేరు. సుప్రసిద్ధ రాజ్యాంగ శాస్త్రకోవిదులలో ఒకరైన హెచ్.ఎం. సీరవాయ్ చెప్పినట్టు " ప్రజాస్వామ్య సూత్రాలన్నవి వాస్తవానికి దూరంగా ఎక్కడో శూన్యతలో విహరించవు. పరిస్థితులకు అనుగుణంగా మారి ఆ సూత్రాలు తమ ఉనికిని తామే సమర్థించుకొంటూ ఉండాలి." ఆ వెసలుబాటుకు దూరమైనందుననే జాతీయ నాయకత్వం లోగడ క్యాబినెట్ మిషన్ పథకాన్ని కాలదన్నుకుంది. క్యాబినెట్ మిషన్ ప్లాన్‌ను ఆమోదించి ఉంటే దేశ విభజన తప్పి ఉండేది. నేడు కాశ్మీర్ సమస్య, పంజాబ్

సమస్య కూడా దేశ ప్రజలకు తలనొప్పులుగా ఉండేవి కావు. ఉపఖండం చాలావరకు శాంతిగా ఉండేది! కేవలం - ఆనాటి సెంట్రల్ లెజిస్లేచర్‌లోనూ, సెంట్రల్ ఎగ్జిక్యూటివ్‌లోనూ "హిందువులకు - ముస్లింలకు' ' సరిసమాన ప్రాతినిధ్యం ఉండాలన్న ప్రతిపాదనను (దేశ సమైక్యత మన ప్రధాన కర్తవ్యం కాబట్టి కొన్ని ప్రయోజనాల కోసం సర్దుబాట్లు అనివార్యం) నిరాకరించిన ఫలితమే దేశ విభజన. సమైక్య భారతం కోసం ఈ "త్యాగం" అవసరమని గాంధీజీ విశిష్ట శిష్యులలో అగ్రగణ్యుడైన భులాభాయ్ దేశాయ్ కుదిర్చిన (లియాఖత్ అలీతో) ఒప్పందమూ, సప్రూ కమిటీ నివేదికా, కాంగ్రెస్ ప్రెసిడెంట్‌గా అబ్దుల్ కలామ్ అజాద్ గాంధీజీకి రాసిన లేఖా, సర్‌స్టాఫర్డ్ క్రిప్స్‌కూ, క్యాబినెట్ మిషన్‌లో మరో సభ్యుడైన అలెగ్జాండర్‌కూ నేషనలిస్టు ముస్లిములు చేసుకొన్న విజ్ఞాపనా - పదేపదే నొక్కి నొక్కి చెప్పాయి! అయినా ఉభయత్రా నాయకత్వాల మొండితనం వల్ల దేశవిభజన జరిగిందని మరవరాదు!

అంతేగాదు. ఈ రోజున రాజీవ్, పి.వీ. ప్రభృతులు అకాలీల ఆనందపూర్ సాహెబ్ తీర్మానం పట్ల ఫ్రంట్ ప్రభుత్వ వైఖరి స్పష్టంగా ఉండాలని పట్టుబడుతున్నారు. కాని ఆనందపూర్ సాహెబ్ తీర్మానానికి పునాది పురుషుడైన లోంగోవాల్‌తో రాజీవ్ ఒప్పందం కుదుర్చుకున్నప్పుడు ఆ ఒప్పందంలో ఆ తీర్మానాన్ని చేర్చినపుడు - ఏ ఉద్దేశ్యంతో చేర్చారో కూడా వారు చెప్పవలసింది! అలాగే ఏ ఉద్దేశంతో ఆ తీర్మానాన్ని సర్కారియా కమిషన్‌కు నివేదించారో వివరించవలసిన బాధ్యత ఉంది! నిజానికి ఆనందపూర్ సాహెబ్ తీర్మానాన్ని ఎటు తిరగేసి చూసినా, దాని సారంశం (1978 నాటి 12 అంశాలలోనూ, 1981 నాటి 15 అంశాలలోనూ) ఒక్కటే - "రాష్ట్రాలు బలంగా ఉంటేనే, వాటి అభివృద్ధివల్లనే కేంద్రం సంపదైశ్వర్యాలతో తులతూగుతుంది. ఇందుకోసం రాష్ట్రాలకు హెచ్చు అధికారాలు ఇస్తూ రాష్ట్రాల స్వపరిపాలనా ప్రతిపత్తిని గుర్తిస్తూ కేంద్రం అజమాయిషీలో మాత్రం విదేశ వ్యవహారాలు, రక్షణ, కరెన్సీ, రవాణా మార్గాలు, సహా కమ్యూనికేషన్స్ ఉండాలి. మిగతా శాఖలన్నీ రాష్ట్రాలకు వదలాలి". వినడానికీ, చూడ్డానికీ మనకిది వింత కోర్కెగానే కన్పిస్తుంది! కాని అసలు విషయం - ఆనందపూర్ సాహెబ్ తీర్మానానికి కూడా ప్రోత్సాహం జాతీయోద్యమకాలంలో కాంగ్రెస్ ప్రచారం చేసిన ఈ "ప్రావిన్షియల్ అటానమీ"(స్వపరిపాలనా ప్రతిపత్తి) నుంచే లభించినదని మరువరాదు! పైగా కాంగ్రెస్ ప్రెసిడెంట్‌గా అజాద్ ప్రతిపాదించిన ఈ "అటానమీ' ' సూత్రానికి జాతీయ కాంగ్రెస్ ఆమోద ముద్ర వేసిందన్న సత్యాన్ని కూడా కాదనలేరు! ఎందుకంటే, మత ప్రాతిపదికపై దేశ విభజన జరక్కుండా భారత సమైక్యతను కాపాడేందుకు గాను నాడు కాంగ్రెస్ చేసిన పని - "పాకిస్తాన్ పథకం"లోని మెరుగయిన అంశాలన్నింటినీ చేర్చి, అందులోని లోపాలనూ, లొసుగులనూ జల్లిడిపట్టి అజాద్ ప్లాన్‌గా రూపొందించడం! కేంద్ర - రాష్ట్ర అధికారాల విభజనకు సంబంధించి "ఆనందపూర్ సాహెబ్"లో అకాలీలు ఏమి చెప్పారో వాటిలో కొన్నింటిని కాంగ్రెస్ ప్లాన్‌లోనే నాడు పొదిగారు! కనుకనే, నేడు జాతీయ స్థాయిలో ఏకాభిప్రాయ సాధనకు జరుగుతున్న విశ్వప్రయత్నం. అంతేగాదు, ఈ 'అటానమీ' కిందనే 1937 నాటి కాంగ్రెస్ ప్రభుత్వాలు సమర్థవంతంగా, మంచి సంక్షేమ కార్యక్రమాలను అమలు జరుపుకొని ప్రజల మన్ననలు పొందాయని కూడా మరవ రాదు! అలాగే రాష్ట్ర ప్రభుత్వాల దైనందిన విధాన వ్యవహారాలలో గవర్నర్ల జోక్యం తగదనీ, సహించబోమనీ హెచ్చరించడమేగాక, ఆ హామీ బ్రిటీష్ ప్రభుత్వం ఇచ్చేదాకా రాష్ట్రాలలో బాధ్యతాయుత మంత్రివర్గాలు ఏర్పరచబోమని భీష్మించిన రోజుల్ని కూడా మనం మరవలేము! ఇంతకూ ఇంతసోది ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే - జాతుల సమస్య

పరిష్కారంలో కడు జాగరూకతతో ప్రభుత్వాలు వ్యవహరించవలసి ఉంటుందని గుర్తు చేయడానికే. 70 ఏళ్ళ తర్వాత కూడా సోవియెట్ జాతీయ మైనారిటీలు, అటానమీని అనుభవిస్తూ కూడా బాల్టిక్ స్టేట్స్ సహా స్వయం పాలిత రిపబ్లిక్స్‌లలోనూ పూర్తి "ఆర్థిక స్వాతంత్ర్యం" కోసం ఎలా ఆందోళనోద్యమాలు ఉవ్వెత్తున సాగిస్తున్నాయో చూస్తున్నాం. అందువల్ల చిన్న రాష్ట్రాలు, పెద్ద రాష్ట్రాల భావనే మనకు తగదు; మైనారిటీ, మెజారిటీ తగాదాలు అంతకంటే పనికిమాలినవి. ఇలాంటి తగాదాలను భరించి భరించి, తలలు బొప్పికట్టిన తరువాతనే ప్రపంచంలోనే గొప్ప ప్రజాస్వామిక వ్యవస్థగా పేరొందిన అమెరికాలో ఫెడరల్ రాజ్యాంగాన్ని రాష్ట్రాల స్వయం ప్రతిపత్తికి అనుకూలంగా రూపొందించుకొన్నారని గుర్తించాలి. సమైక్య సమాఖ్య భావన తప్ప దానికి మరో స్పృహలేదు. కనుకనే అమెరికాలోని రాష్ట్రాలనీ దేనికదే (ఫెడరల్ రాజ్యాంగం గాక) ప్రత్యేక రాజ్యాంగం రూపొందించుకోడానికి కూడా రాజ్యాంగ నిర్మాతలు అనుమతించారు.

డిసెంబర్ 22, 1989

# ప్రగతికి ప్రతిబంధకం - 'స్రోణ' సంప్రదాయం-

ముందరికాళ్ళకు బంధాలు ఎవరో బయటివాళ్లో, కానివాళ్లో వేయనక్కరలేదు. మనకుమనమే తగిలించుకున్నాం.

ప్రపంచంలో మరే ఖండంలోనూ, ఏదేశంలోనూ లేని కులవ్యవస్థ, పాముకి పాలుపోసి పెంచినట్టు పెంచుకున్న మనకే నేడు ఉరిత్రాడుగా మారింది! సమాజ కట్టుబాటులకు, సామూహిక సద్వర్తనకు, ప్రజాబాహుళ్యపు మౌలికమైన మంచి ప్రయోజనాలకు ఎసరు పెట్టి అశాంతికి ప్రోద్బలంచేసిన ఈ వర్ణవ్యవస్థను దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం రావడంతోనే రూపుమాపుకొని ఉండవలసింది. ఆ పనిచేసినందుననే, రాజకీయవేత్తలు, దేశనాయకత్వం ఆ మెలకువతో సంచరించనందువల్లనే, స్వార్ధ రాజకీయ ప్రయోజనాలకోసం బ్రిటిష్ వాడు (మాక్డొనోల్డ్) కమ్యూనల్ అవార్డు పేరిట, "పూనా సంధి"పేరిట పెట్టిన కుంపటి మరింత రాజుకుని సమాజాన్ని పట్టి పల్లారుస్తోంది. కులాలను వ్యవస్థాగతం చేశారు; రిజర్వేషన్ల పేరిట సమాజంలో శాశ్వతమైన గండికొట్టారు. పైగా రిజర్వేషన్ల అనుకూల ఉద్యమాలకు, ప్రతికూలమైన పోరాటాలకూ నాయకత్వం వహిస్తున్న వారు ఈ నలభైమూడేళ్ళుగానూ ఉన్న పాలక పార్టీలే కావడం (కాంగ్రెస్, జనతా, జనతాదళ్ లేదా నేషనల్ ఫ్రంట్) మరింత దురదృష్టకరం. ఈ స్వార్ధపూరిత రాజకీయాల నుంచి అవతరించినదే మండల్ కమిషన్. ఈ దేశానికి ఒక జాడ్యం కాదు - కుల, మత, వర్గ వైషమ్యాలకు పునాది అంతా వర్ణ వ్యవస్థలోనే ఉంది. కనుకనే, బహుళజాతుల, బహు భాషలకు నిలయమైన భారతదేశానికి కావలసింది వర్ణరహిత, వర్గరహిత వ్యవస్థ మాత్రమే. అదొక్కటి మాత్రమే జాతీయ సమైక్యతను కాపాడగలుగుతుంది. ఇందుకు ఉదాహరణ మండల్ కమిషన్ వారే హరిజన, గిరిజన తెగలకు కల్పించిన రిజర్వేషన్లతోపాటు అదనంగా "తదితర వెనుకబడిన తరగతులు"గా పేర్కొన్న 3743 తరగతులు కూడా మొత్తం జనాభాలో అంతర్భాగం. అందువల్ల భారతదేశానికి కావలసింది కుల వ్యవస్థ కాదు, కులాలకు చోటులేని సమసమాజ వ్యవస్థ. కాని మండల కమిషన్ సిఫారసులవల్ల జరుగుతున్న పని కులవ్యవస్థ శాసనబద్ధం కాబోవడం, సాంఘిక, ఆర్థికపరమైన మౌలిక సంస్కరణవల్ల గాకుండా రిజర్వేషన్ల వల్లనే దేశంలో నిరుద్యోగం తొలగిపోతుందన్న భ్రమతో (కాదు, అది రాజకీయ స్వార్థం కోసం వేసుకున్న ముసుగు మాత్రమే) జాతీయ నాయకత్వం సమాజంలో ఇప్పటికీ కులవ్యవస్థ నెలకొల్పిన చిచ్చుకు మరింత ఆజ్యం పోస్తోంది. ఇప్పుడు మండల్ కమిషన్ సిఫారసులను ఆమోదించడానికి తోడుగా, ఆర్థికంగా వెనకబడిన బలహీన వర్గాలకు అదనంగా మరో 5-10 శాతం రిజర్వేషన్లను ప్రభుత్వ ఉద్యోగాలలోనూ, విద్యా సంస్థలలోనూ కల్పించాలని కేంద్ర రాజకీయ వ్యవహారాల మంత్రి మండలి ఉపసంఘం నిర్ణయించి, పార్లమెంటు ఆమోదం కోసం ప్రతిపాదించబోతోంది.

హైందవ సమాజంలోని ప్రగతినిరోధక భావాలకు చెల్లించుకోవలసిన మూల్యంగా మనం ఈ రిజర్వేషన్లను గుర్తించకతప్పదు. ఎందుకంటే ఈ జాడ్యం ఇవాళ్టిది కాదు, తరతరాలది, ఏలినాటిశని, ఏలేనాటిశని! ద్రోణాచార్యునితో ప్రారంభమైన విద్రోహ సంప్రదాయం మనది. అగ్రవర్ణాల వారి పిల్లలకు తప్ప (రాజ కుమారులకు తప్ప) ఆదివాసులయిన బిల్లులకు విద్య నేర్పబోనని నిరాకరించిన ద్రోణ సంప్రదాయం మనది; అలా విద్యకు దూరంగా తనను ద్రోణుడు నెట్టివేసినా, గురుభావాన్ని మనసునుంచి తొలగించుకోకుండా ద్రోణుడి మట్టి బొమ్మనే 'గురువు' గా కళ్ళ ముందు పెట్టుకొని విలువిద్యలో వీరుడైన ఏకలవ్యుడి సంప్రదాయం కూడా మనదే! ఇప్పుడు జరుగుతున్న రిజర్వేషన్ల అనుకూల, ప్రతికూల ఉద్యమాలు కూడా ఈ రెండు సంప్రదాయాలనే స్థూలంగా ప్రతిబింబిస్తున్నాయని చెప్పాలి!! యోగ్యత పోయింది. కనీసం అన్ని "కులా" లలోని ఆర్థికంగా వెనుకబడిన వర్గాల వారందరికీ కలిపి 'రిజర్వేషన్ల' కల్పన అన్న తాత్కాలిక కార్యక్రమమైనా లేకుండా పోయింది; నలభైమూడేళ్ళలో రాజ్యాంగం గ్యారంటీపడిన "సోషలిస్టు రిపబ్లిక్" స్థాపనకు అవసరమైన వర్ణరహిత వ్యవస్థ కాస్తా ఇంకా కాగితపు పులిగానే మిగిలిపోయింది.

ఎన్నికలొచ్చి కులవ్యవస్థను కాపాడడమేగాక, మరింతగా పెంచాయి. అధికారంలోకి వచ్చిన పార్టీకి "రిజర్వేషన్లు" అధికారం కాపాడుకోడానికి దగ్గరి మార్గంగానూ, ప్రతిపక్షాలకు రిజర్వేషన్ల వ్యతిరేక ఉద్యమాలు తాము అధికారంలోకి రావడానికి సులువైన మార్గంగానూ మారాయి! మన పాలకుల చిత్తశుద్ధిని శంకించడానిక ఒక్క ఉదాహరణ చాలు: నిరుద్యోగులు ఉద్యోగాల కోసం లేదా ఎంప్లాయిమెంట్ ఎక్ఛేంజీలలో ఉద్యోగార్థులై పెట్టుకొనే దరఖాస్తులలో "కులం" ప్రస్తావనను ఎత్తివేయదలచామని కాంగ్రెస్(ఐ), ఆ తర్వాత నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వాలు ప్రజలకు వాగ్దానం చేశాయి. కాని అది కూడా ఎలెక్షన్ చిట్కాలలో ఒకటిగానే మిగిలిపోయింది! కనుకనే కులాలూ, ఉపకులాలూ ఇంకా పెరిగిపోతున్నాయి! నిరుద్యోగ సమస్య పెరిగినకొలదీ "కులాల" సంఖ్య కూడా పెరిగిపోతుంది. రిజర్వేషన్లకోసం "కులాంతర" "మతాంతర" మార్పిళ్లు యథేచ్ఛగా, ఒక క్రతువుగా సాగిపోతున్నాయి! ఇది అన్ని "కులాల"కూ వ్యాపించిపోతోంది. మొత్తం దేశమే "వెనుకబడిన" దేశమయింది. ఉన్న బుద్ధి కూడా చిన్నదైపోయింది! చివరికి హరిజన గిరిజన సంస్థలు కూడా చీలిపోతున్నాయి. షెడ్యూల్డు కులాలు, తరగతులు కొన్ని ప్రయోజనాలవల్ల లబ్ధిపొంది పై అంతస్తుకు చేరిన వారి ద్రోహం వల్ల ఆయా "కులాల"లోని యువజనులు ఎదురు తిరిగి "దళిత యువత"గా అవతరించారు. "మనుధర్మ" శాస్త్రంపై దండోరా వేశారు; రిపబ్లికన్ పార్టీలో "అవినీతి" ప్రబలిందని భావించిన యువత "దళిత్ పాంథర్"లుగా అవతరించడమే గాక, మొత్తం భారతీయ కుల వ్యవస్థపైనే కత్తికట్టారు; వర్ణవ్యవస్థ నిర్మూలనకు వ్యతిరేకంగా సాగే ఉద్యమాలలో తమతో కమ్యూనిస్టులు చేతులు కలిపితే, తాము "వర్గపోరాటా"లలో కలిసి రావడానికి సిద్ధంగా ఉన్నామని దళితులు మరొక వైపునుంచి ప్రకటనలు చేస్తున్నారు; ఇందుకు అనుకూలంగా ఒక్క "సత్యశోధక్ కమ్యూనిస్టు పార్టీ" మినహా మిగతా అన్ని వామపక్షాలూ నీళ్లు నమిలినవే. అలాగే రిపబ్లికన్ పార్టీలోని గవాయ్, కాంబ్లే, ఖోబ్రగడే శాఖల మధ్య కూడా సమన్వయం లేదు; ఒక ధ్యేయం లేదు. అందువల్ల - భారతీయ సామాజిక వ్యవస్థను పీల్చి పిప్పి చేస్తున్న కులవ్యవస్థ రద్దు కానంతవరకూ ఫ్యూడల్ వ్యవస్థ అవశేషాలు తొలగవు; ఫ్యూడల్ వ్యవస్థ మిగులు సగుళ్ళన్నీ బదాబదలు కానంతకాలం కులవ్యవస్థ నశించదు; కులవ్యవస్థ పోనంతవరకూ వర్గ వ్యవస్థ తొలగదు; ఈ రెండు జబ్బులూ తొలగనంతవరకూ ఈ

అంతరాలూ, ఆర్థికపరమైన దోపిడీ రద్దుకాదు; రాజ్యాంగం హామీపడుతున్న "సోషలిస్టు వ్యవస్థ" అవతరించేదాకా ఈ ఆర్థిక దోపిడీ తొలగదు; ఈ పరిస్థితులలో బుర్రలేని నాయకత్వాలు చేస్తున్న పని - ఉద్యోగ దరఖాస్తులలో "కులం" జాగాను చెరిపి వేయకుండానే, పౌరుడికి "పనిచేసుకునే హక్కు"ను ప్రాథమిక హక్కుగా గుర్తిస్తామని ప్రగల్భాలు పలుకుతూండడం! అందరికీ ఉపాధికల్పన, నిరుద్యోగ నిర్మూలన ఒక్క సోషలిస్టు దేశాలలోనే సాధ్యమయింది. చివరికి కాపిటలిస్టు దేశాలకు "గురు"స్థానంలో ఉన్న అమెరికాలో కూడా "పని హక్కు" ప్రాథమిక హక్కుగా లేదు! ఇది పాలకవర్గాలు మన కళ్ళల్లో కొడుతున్న దుమ్ముమాత్రమే. ఈ పరిస్థితులలో - లక్ష కోట్ల రూపాయల వాణిజ్యం లోటుతో, 12 కోట్లమంది నిరుద్యోగుల భారంతో తీసుకొంటున్న భారతదేశానికి కావలసింది ప్లానింగ్ కాని, రిజర్వేషన్లు కావు; మానవశక్తిని కులాల కింద దిగజార్చడం కాదు, సద్వినియోగం చేసుకోవడం; దేశ జనాభాలో కటికి దారిద్ర్యంలో ఉన్న సగం జనాభాకు కావలసింది కులాలు, దేవాలయాలు, మసీదులూ కావు, పట్టెడన్నం, ప్రాథమిక విద్య. ప్రాథమిక విద్యను పేదవర్గాలకు అందని పండుగా చేసిన ఖ్యాతి మన పాలకులదే?! చెలామణీలో ఉన్న 40 వేల కోట్ల రూపాయల "బ్లాక్ మనీ" రిజర్వేషన్లకు పరిష్కారమా?!

ఆగస్టు 28, 1989

# ప్రగతికి ప్రతిబంధకం 'శ్రేణ' సంప్రదాయం-2



ఈ దేశంలో - ఉద్యోగాలలో, విద్యాలయాలలో రిజర్వేషన్లు ఉన్నా, లేకపోయినా, వర్ణవ్యవస్థకు ప్రధాన ఆదరవుగా ఉన్న వర్గ వ్యవస్థను తొలగించనంతకాలం, నూటికి తొంభైమంది జనాభా పేదరికంగాని, దానిని అంటిపెట్టుకుని పెరుగుతున్న నిరక్షరాస్యతగానీ, దానిని అంటకాగి బతుకుతున్న నిరుద్యోగంకానీ పరిష్కారం కావు. వరసక్రమంలో ఈ మర్పులను తీసుకురాకుండా ఏ పాలక పక్షం ఎన్ని చొల్లు కబుర్లు చెప్పినా ప్రజలు నమ్మరాదు. మన మనస్సులను భక్తి ఉద్యమాలు మార్చలేకపోయాయి, దేశభక్తి ఉద్యమాలూ కదల్చలేకపోయాయి, జాతీయ స్వాతంత్ర్య సమరోత్సాహం చిత్రికపట్ట లేకపోయింది - కనుకనే పాలకపక్షాలు ప్రజలను కులాలలతో మతాలతో చీల్చి విద్రోహానికి పాల్పడుతూ వచ్చాయి; డెబ్బయ్యేళ్ళ స్వాతంత్ర్యం తర్వాత మన బ్యాలెన్స్ షీటు - కులపిచ్చి, మతోన్మాదం ! హిందూ, ముస్లిమ్ ఛాందస వర్గాలకు కావలసింది రామజన్మభూమో, లేదా బాబ్రీ మసీదోగాని జన్మభూమి బాగోగులు కావు, దారిద్ర్య భారతం రూపురేఖలను మార్చడంకాదు; ఆ మధ్య ఉత్తర, మధ్య భారతంలో కొన్ని చోట్ల "మను ధర్మా"నికి వ్యతిరేకంగా నౌజవాన్ శక్తి\సంఘటన, బహుజన సంఘర్షక సమితి కలిసి "మను విరోధికృతి సమితి" ఆధ్వర్యంలో పెద్దఎత్తున సాగిన ప్రదర్శనల అంతర్యం - నిజానికి కులవ్యవస్థ సంరక్షణ కాదు, పేదరికంపట్ల వ్యక్తమైన నిరసన మాత్రమే. కులం తలంపుగానీ, మతోద్రేకంగానీ ప్రజల దైన్యస్థితిపట్ల వ్యక్తమయ్యే ధర్మనిరసనగా మాత్రమే భావించాలి. కనుకనే రిజర్వేన్లు చిన్న చిన్న మజిలీలు కావచ్చుగాని అవి దారిద్ర్య నిర్మూలనకూ నిరద్యోగ సమస్యకూ శాశ్వత పరిష్కారం కాజాలవు. ఎందుకంటే, నిరుద్యోగులూ, పాక్షిక నిరుద్యోగుల సంఖ్య 12 కోట్ల మందిగా ఉన్న ఈ దేశంలో పాలక వర్గాలు ఎన్ని రిజర్వేషన్లతో పేదవర్గాలను బులిపింప చేయగల్గుతారు? 2001 సంవత్సరందాకా రిజర్వేషన్లు ఉంటాయని, తరువాత రద్దు కాగలవన్న పాలకుల మాట కూడ నీటిమూటగానే ఉండిపోవలసి వస్తుంది. ఎందుకని? మన పాలకులకు జనాభా నిరక్షరాస్యులై ఉంటేనే సుఖం! అవిద్య, అజ్ఞానం, వోట్లు గుంజడానికి సోపానాలు! 6-14 సంవత్సరాల మధ్య వయస్సులో ఉన్న బాలబాలికలందరికీ పదేళ్ళలోగా (1962 నాటికే) నిర్బంధ ప్రాథమిక విద్య పూర్తి కావాలన్న లక్ష్యం ఏ మేరకు నెరవేరింది? ప్రాథమిక విద్యకు, ప్రాథమిక వైద్య ఆరోగ్య విధానానికి, పౌరుని ప్రాథమిక నిత్యావసరాలకూ అవినాభావ సంబంధం ఉంది. ఈ మూడింటిలోనూ పాలకులు విఫలమయ్యారు. ప్రాథమిక విద్యా వ్యాప్తి పక్కకు నెట్టి, ఉన్నత విద్యపై మోజు పెంచినందువల్ల వచ్చిన నష్టం - ధనికవర్గాల పిల్లలకు కాదు, నూటికి తొంభైమందిగా ఉన్న సామాన్య, నిరుపేద వర్గాల కుటుంబాలకు, వారి పిల్లలకూ మాత్రమే! అయితే ఈ రిజర్వేషన్లకు - అనుకూలంగా కొందరు, ప్రతికూలంగా కొందరు బజారునపడి కల్లోలం సృష్టించుకున్నందువల్ల దారిద్ర్య బాధగానీ,

నిరుద్యోగంగానీ పరిష్కారం కాదు సరికదా, ఈ తగాదాలు, కొట్లాటలూ స్వార్థపర రాజకీయవేత్తలకు, పాలకవర్గాలకే ప్రయోజనకరమని మరవరాదు. ఒకనాడు "తెల్లవాడు" హిందూ- ముస్లిమ్ తగాదాలు పెంచి, విభజించి - పాలించే దుర్నీతితో మనల్ని ఏలి ఉపఖండాన్ని విభజించడంలో జయప్రదమయ్యాడు, తంపులు పెట్టి తమాషా చూశాడు. అలాగే నేడు మన దేశీయ పాలకులు కూడా అదే దారిలో మరొక పద్ధతిలో సంఘాన్ని చిన్నాభిన్నం చేస్తున్నారు. ప్రపంచంలోని ఇతర పాలకవర్గాల మాదిరే "మనవాళ్ళయ్య"లు కూడా రెక్కాడితేగాని డొక్కాడని కష్టజీవుల మధ్య విభేధాలు సృష్టించడానికి రిజర్వేషన్ల పేరిట, యాంటీ-రిజర్వేషన్ ఉద్యమాల ముసుగులో విశ్వ ప్రయత్నం చేస్తున్నారు. యోగ్యత, ఆర్థికంగా వెనుకబాటుతనం మినహా ఇతరేతర కారణాలేవీ (కులం సహా) రిజర్వేషన్లకు కొలబద్దగా ఉండకూడదు. "పనికి ఆహారం" పథకం, నిరుద్యోగ భృతిలాంటి స్వల్పస్థాయి పథకాలనే జయప్రదంగా అమలు జరపలేని మన 'వాజమ్మలు' రిజర్వేషన్లను అమలు జరుపుతారని నమ్మడం భ్రమ మాత్రమే!

నిర్బంధ ప్రాథమిక విద్యావ్యాప్తిపై ప్రభుత్వాలు శ్రద్ధ వహించనంతకాలం, అక్షరాస్యత వృద్ధికాదు; ఆ ప్రాథమిక విద్యావ్యాప్తికి 'సున్న' చుట్టి వయోజన విద్యావ్యాప్తివైపు అర్రులు చాచడం మరొక భ్రమ! ఎందుకంటే ప్రాథమిక విద్యావ్యాప్తి జయప్రదం కాగలిగిననాడు వయోజన విద్య అవసరం తగ్గిపోతుంది! ఈ ప్రాథమిక విద్యావ్యాప్తి జరగనంతకాలం ఎన్ని రిజర్వేషన్లు ఉన్నా విద్యాలయాలలో, ఉద్యోగాలలో "ఖాళీ"లు రాజ్యమేలవలసిందే. కనుకనే విద్యా సంఘాలు, షెడ్యూల్డు కులాల, షెడ్యూల్డు తెగల కమిషనర్ల నివేదికలలో "విద్య", "ఉపాధి" ప్రాముఖ్యాన్ని నొక్కి చెప్పడం జరిగింది. మరి పాలకులు ఇన్నాళ్ళు ఏమి చేస్తున్నట్టు? ఆంధ్రప్రదేశ్ సహా దేశంలో ఆరు రాష్ట్రాల్లో హరిజనులు, మరి నాలుగు రాష్ట్రాల్లో ఆదివాసులు, లేదా గిరిజనులూ కేంద్రీకరించి ఉన్నపుడు, భారత జనాభాలో ప్రతి నలుగురి లో ఒకరు షెడ్యూల్డ్ కులానికో, షెడ్యూల్డ్ తెగకో చెందినవ్యక్తి అయినపుడు, మొత్తం 16 కోట్ల మందికి పైగా ఉన్న వీరిపట్ల, వీరి విద్యావ్యాప్తికి ఏమి జాగ్రత్తలు తీసుకున్నట్లు? 1982, 1984 నాటి కమీషనర్ నివేదికలు చూస్తే మన ప్రగతి బండారం బయటపడుతుంది: షెడ్యల్డ్ కులాలలవారిలో 16శాతం, తెగలలో 6 శాతం జనాభా మాత్రమే పట్టణాలలో, నగరాల్లో నివసిస్తున్నారు. మిగతా వారంతా గ్రామసీమల్లోనే. కాని 6-14 సంవత్సరాల మధ్య వయస్సు కలిగి బడిలో చేరకుండా, చేరినా స్కూలుకు వెళ్ళకుండా ఉన్న పిల్లలలో అత్యధిక సంఖ్యాకులు షెడ్యూల్డ్ కులాలు, తెగలకు చెందినవారే. ఒకటో క్లాసులో చేరే ప్రతీ 100 మంది పిల్లల్లో కేవలం 40 మంది మాత్రమే అయిదే తరగతివరకు, కేవలం 25 మంది మాత్రమే ఎనిమిదవ క్లాసువరకూ పూర్తి చేయగలుగుతున్నారు. అంటే, ఒకవేళ బడిలో నమోదు కాని షేడ్యూల్డు కులాల, తెగల పిల్లలను అనియత (ఫార్మల్) విద్యాసంస్థలలో చేర్చినప్పటికీ, చేరిన కొద్ది కాలానికే చదువు చాలించుకొంటున్నారు. ఈ దుస్థితీ, ఈ దుర్గతీ దారిద్ర్యానికి, ఆర్థిక పరిస్థితికి సంబంధించినదేగాని - "రిజర్వేషన్" కోటాలకు చెందినది కాదు! ప్రాథమిక విద్యావ్యాప్తిని ఆటంకపరుస్తున్న ప్రభుత్వాల విధానాలవల్లనే - రిజర్వేషన్లు విద్యాలయాల్లో, ఉద్యోగాల్లో కల్పించినప్పటికీ, ఎప్పటికప్పుడు "ఖాళీ" బోర్డులు ఎదురు కావడమూ, వాటిని నింపేదాకా ఉన్న ఖాళీలలో అర్హత ఉన్న వారికి కూడా మొండిచేయి చూపడమూ జరుగుతోంది. అలాగే పారిశ్రామిక రంగంలో మొత్తం ఉపాధి కల్పనరేటు చూచినా ఏడాదికి 1.1 శాతం పెరగడం గగనమైపోతుంది. పైగా ఈ ఉపాధి రేటు 1970ల నుంచి దారుణంగా పడిపోతూ వచ్చింది! 1970-71 నుంచి 1975-76ల మధ్య కాలంలో ఉపాధికల్పన అభివృద్ధి రేటు ఏడాదికి 2.9 శాతం ఉండగా, అది 1975-76, 1980-81 మధ్య సంవత్సరాలలో 2.6

శాతానికి, 1980-81 నుంచి 85-85కీ మధ్య 1.8 శాతానికి, 84-85 నుంచి 88-89కి మధ్య 1.5 శాతానికీ పడిపోయింది! అదే సమయంలో నిరుద్యోగుల సంఖ్యను నమోదుచేసే ఎక్స్చేంజ్‌లలో ఉద్యోగార్థుల దరఖాస్తులు మేరుపర్వతంలా పెరిగిపోతున్నాయి! అయినప్పుడు ఈ రిజర్వేషన్లు నిరుద్యోగ సమస్యను ఎలా పరిష్కరిస్తాయో మూఢులకు తప్ప మనకు అర్థంకాదు! నిరుద్యోగ సమస్య వృత్తి విద్యావ్యాప్తి ద్వారా, పరిశ్రమాభివృద్ధి ద్వారా, వ్యవసాయాధార పరిశ్రమల వ్యాప్తిద్వారా, స్వయం ఉపాధి పథకాలద్వారా, వ్యవసాయంలో కౌలుపెత్తందారీ తనాన్ని రద్దుచేసి, భూమిలేని నిరుపేదలకు "దున్నేవాడికే భూమి" ఇవ్వడం ద్వారా, ఒక్క ముక్కలో చెప్పాలంటే - యావత్తు ఉత్పత్తి సాధనాలూ వ్యక్తుల పరం కాకుండా సంఘ (ప్రభుత్వం) పరం అయిననాడు పరిష్కారం అవుతుంది. 'నా శ్రమ ఫలం నాకు దక్కుతోంది' అని పేదవాడు భావించన రోజున, నా తిండికి విద్యకు, ఆరోగ్యానికి, వసతికీ సర్కారు పూచీ పడుతోందన్న భావన వాడికి కలిగిననాడు - ఉసురుకీ, ఉపాధికీ కరవువుండదు. వ్యవసాయ రంగంలో ఉన్న జనాభాలో మూడువంతుల మంది షెడ్యూల్డ్ కులాలు, తెగలకు చెందినవారే అయినపుడు, వారికి సాగుచేసుకొనే కాంౘను దూరంచేసి, పరాన్న భుక్కులకు, సోమరిపోతులకే భూమిని కట్టబెడుతున్నపుడు - ఈ దేశంలో మిగిలేది నిరుద్యోగం, ఆకలిదప్పులు తప్ప మరేమీ ఉండవు. ఈ సమస్యలు రిజర్వేషన్లవల్ల పరిష్కారమవుతాయని ఎవరైనా భ్రమించితే అది ఎడారిలో ఎండమావులను చూచి దప్పిక తీర్చుకోవడానికి ప్రయత్నించడమే అవుతుంది! "రిజర్వేషన్" అన్నది కులంగాడూ, రాజకీయ భేతాళుడూ ఈ దేశానికి తగిలించిన పెద్ద ఉచ్చు!! దాన్ని వదిలించుకోండిగాని, మరింతగా బిగించుకోకండి!

ఆగస్టు 29, 1989

# కాశ్మీర్ సమస్య : కొన్ని చేదు నిజాలు 1



ల్లు తగలబడి ఒకరు ఏడుస్తూంటే బొగ్గులు ఏరుకోడానికి ఒకడు వచ్చాడట. నేడు కాశ్మీర్ రాజకీయాలు కూడా అలా తయారయ్యాయి. నలభైమూడేళ్ళ తరువాత కూడా కాశ్మీర్ మనకు ఇంకా "సమస్య"గానే మిగిలిపోవడం సిగ్గుచేటు. రోజురోజుకీ జమ్మూ-కాశ్మీర్ పీనుగుల కుప్పగా మారుతున్న ఈ దశలోనైనా, "టెరరిజం" పేరిట దుర్మార్గాలు పెచ్చరిల్లిపోతున్న ఈ విషమ ఘడియల్లోనైనా కాశ్మీర్‌కు సంబంధించిన కొన్ని వాస్తవాలను రాజకీయ నాయకులు రాగద్వేషాలకు దూరంగా గమనించి, సరికొత్త వ్యూహరచనకు నడుంకట్టాలి. మత ప్రాతిపదికపై దేశ విభజన జరగడమే దుర్మార్గమైన నిర్ణయం కాగా, ఆ తప్పిదమే మరొకసారి అటు కాశ్మీర్‌లోగానీ, ఇటు పంజాబ్‌లోగానీ పునరావృతం కావడానికి ప్రజాస్వామిక శక్తులేవీ అంగీకరించవు. అయితే ప్రజాస్వామిక శక్తులకు, ప్రజాబాహుళ్యానికి ఆమోదకరమైన పరిష్కారాలు కాశ్మీర్‌కు లేకపోలేదు. ఉపఖండ విభజనకు, పాకిస్తాన్ అవతరణకు తప్పనిసరి పరిస్థితుల్లో అంగీకరించిన భారత రాజ్యాంగ నిర్మాత డాక్టర్ అంబేద్కర్ కూడా- ప్రజల బదిలీలకు ఆకస్మాత్తుగా కాకుండా ముందుగా జాగ్రత్తగా ఏర్పాట్లు చేసివుంటే 'విభజన' ఫలితంగా తెలెత్తిన ఘోరకలి, మారణహోమం తప్పి ఉండేదన్నాడు. నాడు సర్దార్‌పటేల్ కూడా ఆ అభిప్రాయంలోనే ఉన్నాడు. కాని పరిణామాలు వక్రించాయి. కొందరి జాతీయ నాయకుల బుద్ధులు కూడా వక్రించాయి. అనంతర పరిణామాలు అందరికీ తెలిసినవే. కాని అక్కరకు రాని నిర్ణయాలవల్ల, అమలు జరపని హామీలవల్ల అనుసరించలేని ప్రకటిత విధానాల మూలంగా కాలక్రమంలో దేశ ప్రయోజనాలకూ, ప్రజా బాహుళ్యం ప్రయోజనాలకూ ఎన్ని ఇబ్బందులు ఎదురవుతాయో పంజాబ్, కాశ్మీర్ సమస్యలే నిదర్శనం. ఈ లోపాలను సరి చేసుకోవాలనుకున్నప్పుడు, సవరణలు చేసుకోవాలనుకున్నప్పుడు - ఎంత మూర్ఖంగా ఆనాడు నాయకులు తప్పులు చేశారో అంతకంటే పదిరెట్లు ధైర్యంగా నేడు ఒప్పులకోసం ముందడుగు వేయవలసి ఉంటుంది. ఈ మాట ఎందుకు చెప్పవలసి వస్తోందంటే - 1947లో ఇండియాలో కాశ్మీర్ "తాత్కాలిక" విలీనీకరణ ప్రకటన అనంతరం కేంద్ర ప్రభుత్వం ఇండియాలోని ఏ ఇతర రాష్ట్రానికీ కల్పించనన్ని రాయితీలూ, అన్నిరకాల సబ్సిడీలూ కాశ్మీర్‌కు కల్పించింది; వేల కోట్ల రూపాయల ధనాన్ని వెచ్చించింది. అయినా, నలభైమూడేళ్ళ తరువాత కూడా రాజ్యాంగపరంగా "ప్రత్యేక ప్రతిపత్తి" రద్దు కాలేదు. ఈ రోజుకీ ఈ అధికరణకు సవరణ చేయాలన్నా, చేర్పులు చేయాలన్నా కాశ్మీర్ అసెంబ్లీ ఆమోదం అవశ్యం, అనివార్యం. నలభైమూడేళ్ళ తర్వాత కూడా మనకీ పరిస్థితి ఎందుకు రావలసి వచ్చింది? ఇతర రాష్ట్రాల ప్రయోజనాలను మాడ్చి, అవసరాలను పస్తుపెట్టి కూడా జమ్మూ కాశ్మీర్‌లో మనకీ అగౌరవ పరిస్థితి ఎందుకు దాపురించినట్టు? ఇందుకు సమాధానం ఒక్కటే కాశ్మీర్ గురించి మన నాయకులు ఆలోచిస్తున్న తీరు వేరు; కాశ్మీరీల

ఆలోచనలు వేరు. మిగతా భారతంతో మమేకం కాకుండా స్వతంత్రకాశ్మీర్ నినాదానికి వారెందుకు ఉవ్విళ్ళూరుతున్నట్లు? 1947లో పాకిస్తాన్ దాడి సహా కడచిన మూడు యుద్ధాలలోను కాశ్మీరీలు సెక్యులర్‌గా ఉన్నట్టు కన్పించి కూడా తిరిగి "స్వపరిపాలనా హక్కు మా జన్మహక్కు" అన్న నినాదాన్ని ఎందుకు ముందుకు నెడుతున్నట్టు? ఇందుకు కారణం భారతదేశంలోని ఇతర రాష్ట్రాలలో ముస్లిమ్ మైనారిటీల రక్షణకు ఉపద్రవం తెచ్చిపెడుతున్న మతశక్తులా? లేక 1947లో పాకిస్తాన్ జోక్యంతర్వాత కాశ్మీర్‌ను మహారాజా హరిసింగ్ "తాత్కాలికం"గా ఇండియాలో విలీనం చేస్తూ కాశ్మీర్ ప్రజల "అంతిమ నిర్ణయం" జరిగేవరకూ ఈ "తాత్కాలిక" ఏర్పాటు కొనసాగాలని కోరడంలోనే కాశ్మీరీలలో "స్వపరిపాలనా హక్కు"నకు బీజాలు పడ్డాయి?! ఈ నలభై మూడేళ్ళుగానూ, ముఖ్యంగా మహారాజా సంతకం చేసిన తాత్కాలిక "విలీనీకరణ పత్రం"మూ (ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ యాక్సెన్), దానికి షరతులు విధిస్తూ అతను సిద్ధపరచిన లేఖాంశాలూ కాశ్మీరీలలో కల్పించిన ఆశలు ఇంకా ఆరిపోలేదని పరిణామాలు రుజువు చేస్తున్నాయి. శతాబ్దాల తరబడి విదేశీయులు సాగించిన దుష్పరిపాలన మూలంగా, నామినేటెడ్ సుబేదార్ల జబర్దస్తీల వల్లా నలిగిపోయిన కాశ్మీరీలకు ఆదినుంచీ ఒక అలవాటు ఉంది. ఎప్పటికప్పుడు ఆ రోజుకు అధికారంలో ఉన్న పాలక వర్గాలకు అనుకూలంగా ఉన్నట్టే ప్రవర్తించి తమ కోరికలను మాత్రం ఈడేర్చుకుంటూ ఉండేవారు. తమ రాజకీయ,సాంఘిక, ఆర్థిక హక్కులను చాటుకోడానికి అందరిమాదిరే వారికీ దొరికిన 'చిట్కా' అదే. అయితే కాశ్మీరీలలో ఉన్న ఈ వాంఛను కొన్ని మతశక్తులూ, మతం పేరిట కొందరు టెర్రరిస్టులూ, స్వార్థ ప్రయోజనాలకు నేడు వినియోగించుకుంటున్నారు. మత ప్రాతిపదికపై ఒకసారి 'దేశ విభజన' జరిగి ఉంది కాబట్టి ఉన్మాదాన్ని రెచ్చగొట్టడం ఈ శక్తులకు మరీ తేలిక.

పైగా - 1948లో భారత సైన్యం హరిసింగ్ పత్రానికి అనుగుణంగానే ఇండియాలో మొత్తం కాశ్మీర్ విలీనీకరణను ఒక్కదఫాగానే పూర్తి చేయడానికి సిద్ధపడినప్పటికీ కాశ్మీర్ ప్రజల మనోభావాలను గౌరవిస్తూ విలీనీకరణ సమస్యపై "ప్లెబిసైట్" (జనవాక్య సేకరణ) నిర్వహించడానికి పండిట్ నెహ్రూ హామీ పడ్డారు. తర్వాత అది తీర్మానం రూపంలో ఐక్యరాజ్యసమితిలో చోటుచేసుకుంది. దీనికి అనుగుణంగానే 1949 జనవరి 5న సమితి తీర్మానం కూడా చేసింది. ఆ తీర్మానం తడి ఇప్పటికీ ఆరలేదు. మనం ఆ తీర్మానాన్ని అమలుపరచాలని అమెరికా, పాకిస్తాన్‌లు పట్టుబట్టినప్పుడల్లా రష్యా 'వీటో' సహాయంతో మనం బయటపడుతూ వచ్చాం! కాని ప్లెబిసైట్‌ను బలపర్చిన అమెరికా ఇప్పుడు ప్లేటుమార్చి 'ప్లెబిసైట్' భావనను వదులుకున్నప్పటికీ కొత్త ఆలోచనను ప్రచారంలోకి తెస్తోంది. అదే - ఇటు ఇండియాతోనూ, అటు పాకిస్తాన్‌తోనూ విలీనం కాకుండా స్వతంత్ర దేశంగా ఉండే కాశ్మీర్ అవతరణను అమెరికా అభిలషిస్తోంది. అందుకే ఏ అదరవు లేకుండా విదేశాల్లో తిష్టవేసి కాశ్మీర్‌లో కల్లోలం సృష్టిస్తున్న "జమ్మూ - కాశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్" నాయకుడు అమానుల్లాఖాన్ అమెరికా నడిబొడ్డుకు చేరి, ఐక్యరాజ్యసమితి కేంద్ర కార్యాలయం కనుసన్నలలోనే ఇండియా వ్యతిరేక ప్రచారాన్ని ప్రారంభించి ఉండడు! అమెరికా నుండి అతడ్ని "గెంటివేయాల"ని మనం కోరినా అది అరణ్యరోదనగానే మిగిలిపోతుంది. 1949నాటి సమితి తీర్మానానికి (ప్లెబిసైట్) అమెరికా 'తులసినీళ్ళు" వదలుకోడానికి కారణం, రేపటినుంచి అమానుల్లాఖాన్‌కు మద్దతునివ్వడానికీ, స్వతంత్ర కాశ్మీర్ ఏర్పాటుకు ఆశీర్వాదాలు తెలపడానికేనని గుర్తించాలి. ఎందుకిలా అగ్రరాజ్యాల పాత్రలు తారుమారవుతున్నాయి? నిన్నటిదాకా తమ తమ "స్వాధీన రేఖ"లు దాటి ఉభయ దేశాల సేనలూ రాకూడదన్న సిమ్లా ఒప్పందం ఆధారంగా ఇండియా, పాకిస్తాన్‌లు కాశ్మీర్ సమస్యను ప్రత్యక్ష సంప్రతింపుల

ద్వారా పరిష్కరించుకోవాలని, మూడో శక్తి ప్రమేయం లేకుండా తీర్మానించుకోవాలని కోరిన అమెరికా ఇప్పుడెందుకీ కొత్త 'దరువు'కు దిగినట్టు? ఒకవైపున "సంప్రతింపుల" గురించి ప్రస్తావిస్తూనే ఇంకోవైపునుంచి పాకిస్తాన్ ప్రధాని బేనజీర్ భుట్టో "కాశ్మీరీలకు సహాయం" పేరిట కోట్లాది రూపాయలను అమెరికా ఎరుకలేకనే కేటాయిస్తోందా? ఈ ప్రశ్నలకు పునాదీ, సమాధానమూ తిరిగి 1949 నాటి సమితి తీర్మానమే! ఎందుకంటే ఆ తీర్మానంలో పేర్కొన్న "ప్లెబిసైట్"ను ఎలా నిర్వహించాలో ఎలాంటి వివరాలూ లేవు. పైగా ఆ తీర్మానంలో "స్వతంత్ర కాశ్మీర్" ప్రసక్తి లేదు. ఈ పరిస్థితి పాకిస్తాన్‌కు కూడా సమస్యే. తీర్మానంలోని "ప్లెబిసైట్"ను పక్కకుపెట్టి ఇప్పుడు కొత్తగా కాశ్మీరీల "స్వయం నిర్ణయ హక్కు"ను పాకిస్తాన్ ఎలా సమర్థించగలుగుతుంది? అందుకని ఇస్లామాబాద్ కోరికను వాషింగ్టన్ నెరవేర్చిపెట్టడానికి గజ్జెకట్టినట్టు కనిపిస్తోంది! అంటే కథ మళ్ళీ మొదటికే వస్తోంది. ఇంతవరకూ కాశ్మీర్ తమలో విలీనం కావాలంటే తమలో కావాలని ఇండియా, పాకిస్తాన్‌లు రెండూ కోరుకున్నవే. కాని ఈసారి అమెరికా వ్యూహం ప్రకారం కాశ్మీర్ స్వయం నిర్ణయ హక్కును కాశ్మీరీలే చాటుకుంటారు! అప్పుడు 370వ అధికరణ, ఇండియాలో కాశ్మీర్ "ప్రత్యేక ప్రతిపత్తి" కూడా అంతరించి పోవలసివస్తుంది. ఇందుకే అమెరికా కొత్త వ్యూహం. నిజానికి కాలహరణంవల్ల "ప్లెబిసైట్" కాలం చెల్లవలసి వచ్చిందికాని ఆనాడే నెహ్రూ భావించినట్టు, హామీపడినట్టు "ప్లెబిసైట్" నిర్వహించి ఉంటే సమస్య తేలిపోయి ఉండేది. కాని ఆనాడు కాశ్మీర్ భవితవ్యాన్ని అనిశ్చితంగా అట్టిపెట్టినవాడు, ఈనాటి అమెరికా వ్యూహానికి అనాలోచితంగా తోడ్పడినవాడూ కాశ్మీర్ "తొలి ప్రధాని" షేక్ అబ్దుల్లా కాడు, ఆ పని చేసినవాడు "హిందూ" మహారాజా హరిసింగే. ఇండియాలో కాశ్మీర్ "తాత్కాలిక" విలీనీకరణకు అమోదిస్తూనే ఆయన ఓ విచిత్రమైన షరతు పెట్టాడు. ప్రకటన చేశాడు. ఈ పూర్వరంగాన్నిమరిచిపోతే కాశ్మీర్ సమస్య మనకు అర్థమూ కాదు, దానికి పరిష్కారమూ దొరకదు.

మంగళవారం, ఏప్రిల్ 17, 1990

# కాశ్మీర్ సమస్యః కొన్ని చేదు నిజాలు (2)



ఇండియన్ యూనియన్‌లో మిగతా మాజీ సంస్థానాలన్నీ విలీనమయి భారత రాజ్యాంగం ప్రకారం నడుచుకొంటున్నప్పటికీ కేవలం జమ్మూ- కాశ్మీర్ ప్రతిపత్తి మాత్రం ఇతర రాష్ట్రాలకు చాలా భిన్నంగా ఉంటూ వచ్చింది. ఎందుకిలా జరిగిందంటే దానికి సమాధానం కూడా మహారాజా హరిసింగ్ ప్రకటనే చెబుతోంది. 1947 అక్టోబర్ 26న నాటి గవర్నర్ జనరల్ మౌంట్ బాటన్‌కు రాసిన లేఖలో రాజా హరిసింగ్ ఇలా పేర్కొన్నాడుః "భౌగోళికంగా జమ్ము-కాశ్మీర్ రెండు డొమినియన్లు అయిన ఇండియా, పాకిస్తాన్‌లకు ఇరుగు పొరుగు ప్రాంతం. ఈ రెండు దేశాలతోనూ కాశ్మీర్‌కు ముఖ్యమైన ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలున్నాయి. అంతేగాదు, నా స్టేట్‌కు అటు రష్యాతోనూ, ఇటు చైనాతోనూ ఉమ్మడి సరిహద్దులున్నాయి. తమ విదేశీ సంబంధాలలో ఇండియా, పాకిస్తాన్ డొమినియన్లు ఈ సత్యాన్ని విస్మరించజాలవు. కాలక్రమంలో ఈ డొమినియన్ల ప్రయోజనాల దృష్ట్యాను, నా కాశ్మీర్ ప్రయోజనాల దృష్ట్యానూ కాశ్మీర్ ఒకవైపున ఉభయ దేశాలతోనూ స్నేహపూర్వకమైన సుహృద్భావ పూర్వకమైన సంబంధాలను కలిగి ఉంటూనే మరోవైపున స్వతంత్ర దేశంగా ఉండటం మంచిది కాదా? ఏదో ఒక నిర్ణయం చేయడానికి నాకు వ్యవధి కావాలి...." ఆ వ్యవధి హరిసింగ్‌కు లభించేది కాబట్టే ఆనాటి పరిస్థితులలో, ఒకసారి మత ప్రాతిపదికపై దేశ విభజన జరిగిన తర్వాత ముస్లిముల రక్షణ పేరిట నాడు కాశ్మీర్‌లో పాకిస్తాన్ జోక్యంవల్ల హరిసింగ్, "కాశ్మీర్ ప్రధాని" షేక్ అబ్దుల్లా, నెహ్రూల సలహాపై చేసిన పని - రక్షణకోసం "తాత్కాలికంగా" ఇండియన్ యూనియన్‌లో కాశ్మీర్‌ను విలీనం చేయడం. అది కూడా ఎలా చేశాడు? ప్లెబిసైట్ సహా అనేక హామీలను మనం ఇవ్వడంవల్ల ఆ "తాత్కాలిక" ఏర్పాటయినా సాధ్యమయింది. ఈ విషయాన్ని హోమ్‌మంత్రి సర్దార్ పటేల్ తరపున సంస్థానాల విలీనీకరణ సమస్యపై సుదీర్ఘ సంప్రతింపులలో పాల్గొన్న వి.పి.మీనన్ కూడా ఇలా స్పష్టం చేశాడుః "కాశ్మీర్‌లో శాంతి భద్రతలు నెలకొన్న తర్వాత అక్కడ ప్లెబిసైట్ పెట్టాలన్న షరతుపైన, జమ్మూ-కాశ్మీర్‌ను ఇండియాలో విలీనం చేయడానికి ఎట్టకేలకు మహారాజా అంగీకరించారు. ఈ నిర్ణయానికి అబ్దుల్లా పూర్తి మద్దతు కూడా ఉంది" అని రాశాడు. అలాంటి హామీలలో మరొక కీలకాంశమే - మన రాజ్యాంగంలో కాశ్మీర్ ప్రత్యేక ప్రతిపత్తిని కాపాడడానికి హామీపడుతూ చేర్చిన 370వ అధికరణం. ఇప్పుడు దీన్ని రద్దుచేయాలంటే ఇండియా రెండు పెద్ద చిక్కులను ఎదుర్కోవలసి వస్తుంది. 1. న్యాయశాస్త్ర రీత్యా వచ్చే ఇబ్బందులు, 2. కాశ్మీర్ వివాదం కాస్తా ప్రపంచ వ్యాపితం కావడంవల్ల వచ్చే ఇక్కట్లూ. కాశ్మీర్ రాజకీయ చరిత్రలో అన్నింటికంటే ఆశ్చర్యకరమైనదీ, అప్రతిష్ఠాకరమైనదీ - రాజ్యాంగంలో ఈ ప్రత్యేక అధికరణం కోసం పోరాడినవారు కాశ్మీర్ సామాన్య ప్రజలు కాకపోవడమూ, ఆ అధికరణకోసం తాపత్రయపడి మహారాజా మెడలువంచి ఒప్పించినవారు భూస్వాములయిన కాశ్మీర్

"పండిట్ సభ", "డోగ్రా సభ" వారే కావడమూ! అంటే 370వ అధికరణం ముస్లిముల సృష్టికాదు, మన సృష్టి! కాని ఆ భూస్వాములయినా ఎందుకా పని చేశారు? అడుక్కునే వాడికి శత్రువు అడుక్కునేవాడేనట. అలాగే కాశ్మీర్‌లోని హిందువులలోని భూస్వాముల "ముల్లె" కాస్తా దేశ విభజనానంతరం ముస్లిములలోని భూస్వాములు కాజేస్తారేమోనని భయపడి చేసిన పని-కాశ్మీరీలలోని కష్టజీవులయిన నిరుపేద ప్రజా బాహుళ్యాన్ని కుల మత రాజకీయాలలోకి ఈడ్చి, భ్రష్టుపట్టించడం. వివిధ వర్గాల మధ్య అనుమానాలు పెంచడం; కాశ్మీరీలలోనే వర్గాలు పెంచి తగవులు పెట్టం. పంజాబ్‌లో సిక్కులందరూ అకాలీలూ, అకాలీలందరూ టెర్రరిస్టులూ కానట్టే - కాశ్మీర్‌లో కూడా హిందువులందరూ ముస్లిమ్ వ్యతిరేకులూ కారు, ముస్లిమ్‌లందరూ హిందువులకు వ్యతిరేకులూ కారు; అలాగే ముస్లిములు సహా కాశ్మీరీలందరూ టెర్రరిస్టులూ, పాకిస్తాన్ అనుకూలురూ కారు! అక్కడ కాశ్మీరేతర ముస్లిములూ ఉన్నారు, ముస్లిములు కాని కాశ్మీరీలూ ఉన్నారు. ఈ చేదు నిజాలను అంగీకరించి, రాజకీయ నాయకులు ప్రజలను చైతన్యవంతులను చేయకపోతే రాగల ఉపద్రవానికి బాధ్యులవుతారు. నేడు ఇండియన్ యూనియన్‌లోని వివిధ రాష్ట్రాల్లో జరుగుతున్న మత కల్లోలాలను పరిశీలిస్తున్న కాశ్మీరీ ముస్లిములలో అనుమానాలు ఎలా తలెత్తుతాయో, అటు పాకిస్తాన్‌లో పంజాబ్, సింధు రాష్ట్రాల్లో సాగుతున్న మత కొట్లాటలు, జాతి వైషమ్యాలను, ముస్లిమ్ కాందిశీకుల (ముహాజ్రీన్) ఇబ్బందులను గమనిస్తున్న కాశ్మీరీ ముస్లిములు కూడా పాకిస్తాన్ వైపునకు మొగ్గు చూపలేరు. 1947 విభజన తరువాత ఉపఖండంలో ఉభయత్రా అవుతున్న జ్ఞానోదయం ఇదేనని కూడా మరచిపోరాదు. విభజనలోని మంచికంటే చెడునే ఎక్కువగా ఇండియా, పాకిస్తాన్‌లలోని చాందస వర్గాలు స్వార్థానికి వినియోగించుకున్నందువల్ల వచ్చిన "నెగెటివ్" ఫలితం ఇది. ఇస్లామ్‌లోని ఉదారవాద భావాలకు గొడుగుపట్టిన సూఫీజాన్ని ఆశ్రయించినంతగా మతోన్మాదాన్ని ముస్లిమ్ ప్రజా బాహుళ్యం ఆదరించలేదు. అలాగే హైందవంలోని సహనశీలతను, లౌకిక ధర్మాలను ఆశ్రయించినంతగా 'మతం' పేరిట చాందసాన్ని చాటలకెత్తుకుని భిన్న జాతులకు నిలయమైన భారతదేశమూ ఆదరించజాలదు.

ఈ పూర్వరంగంలో, వర్తమాన చరిత్రను పరిశీలిస్తే కాశ్మీర్ భవితవ్యాన్ని నిర్ణయించే "ప్లెబిసైట్ 'ను నెహ్రూ ఆనాడే అమలు జరిపి ఉంటే ఈనాటికి కాశ్మీర్ సమస్యకు ఒక శాశ్వత పరిష్కారం సాధ్యపడి ఉండేది. పైగా కాశ్మీర్ మహారాజా "తాత్కాలిక" నిర్ణయంవల్ల జరిగిన మరొక నష్టం - మొదట్లో భారత రాజ్యాంగ పరిషత్తు సర్వం సహాధికారాన్ని చెలాయించజూడడం. నాటి మహారాజావారి "విలీనీకరణ పత్రం' 'ద్వారా మనకు సంక్రమించిన అధికారాలు కేవలం రక్షణ, కరెన్సీ విదేశాంగ వ్యవహారాలు, కమ్యూనికేషన్స్‌కే పరిమితం కాగా, మిగతా అన్నిరంగాలలోనూ కాశ్మీర్ ప్రత్యేక ప్రతిపత్తిని అనుభవిస్తూండడం! అయినా ఆ తరువాత కాశ్మీర్ "ప్రధాని" అయిన షేక్ అబ్దుల్లా మధ్యమధ్యలో పబ్బం గడవడానికి కాశ్మీర్ విలీనీకరణ గురించి ప్రస్తావిస్తూ వచ్చినా 1950నుంచీ స్వతంత్ర కాశ్మీర్ నినాదాన్ని వదులుకొన్నదీ లేదు. ఈలోగా, 370వ అధికరణ ప్రకారం కాశ్మీర్ ప్రజల అనుమతి అక్కరలేకుండానే కేంద్రం ఆధీనంలో ఉన్న అంశాలను కాశ్మీర్‌కు వర్తింపజేస్తూ చట్టాలను రూపొందించే అధికారాన్ని భారత పార్లమెంటుకు దఖలు పరుస్తూ నిర్ణయాలు చేసుకొన్నాం. కాని, కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్తు తాను రద్దు కావడానికి ముందుకొన్ని చర్యలు తీసుకొంది. వాటిలో ముఖ్యమైనదీ, ఇండియా ప్రతిష్ఠకు భంగకరమైన అంశంః మన రాజ్యాంగంలోని 370వ అధికరణను మార్చాలన్నా, సవరించాలన్నా లేదా కొత్త అంశం చేర్చాలన్నా అందుకోసం ఏనాడో రద్దు అయిన పరిషత్తును కూడా మళ్ళీ బతికించుకోవాలన్నమాట. ఇన్ని 'పితలాటకాల' మధ్య కాశ్మీర్

సమస్యతో భారతదేశమూ, ప్రజలూ నలిగిపోతున్నారు. అంతకంటే ఎక్కువగా కాశ్మీరీలు కుమిలిపోతున్నారు. ఈ పరిస్థితులలో విజ్ఞతగల నాయకత్వం "ముందు శాంతి, తర్వాతనే చర్చలు" అని భీష్మించి కూర్చోరాదు. ఎందుకంటే ఒకవైపున కాశ్మీర్ సమస్యను ప్లెబిసైట్ పేరిట చేజేతులా సమితికి చేర్చడంవల్ల, మరొకవైపున కాశ్మీర్ 'సమస్య' లేదని ప్రకటనలు చేయడంవల్లా తీవ్రమైన వైరుధ్యాన్ని మనకు మనమే సృష్టించుకున్నట్టయింది. ఎందుకంటే, ప్రజాస్వామ్యవాదైన పండిట్ నెహ్రూ ఈ విషయాన్ని మరొక రూపంలో స్పష్టం చేశారు: "ఇండియాలో చేరిపోయేటట్టుగా కాశ్మీర్‌పై వత్తిడి తెచ్చే ఉద్దేశంతో, ఈ క్లిష్ట కాలంలో (పాక్ దాడి సందర్భంగా) కాశ్మీర్‌కు మేము సహాయం అందించడం లేదని స్పష్టం చేయదలిచాను..... విలీనీకరణ సమస్య ప్రజల ఇష్టానుసారమే పరిష్కారం కావాలి. ఈ సమస్యపై ప్రజలే అంతిమ నిర్ణేతలని మేము ప్రకటించి ఉన్నాం. ఈ హామీని మేమిచ్చాం, మహారాజా సమర్థించారు. ఈ హామీ ఒక్క కాశ్మీర్ ప్రజలకు మాత్రమే కాదు, యావత్ప్రపంచానికే చేసిన ప్రతిజ్ఞ. ఈ మాట మేము తప్పేది లేదు, వెనుకంజ వేసేది లేదు." అంతేగాదు, అంతకంటే మరో అడుగు ముందుకెళ్ళి నాడు సమితి సెక్యూరిటీ కౌన్సిల్ చర్చలలో భారత ప్రతినిధి వర్గ నాయకుడుగా పాల్గొన్న గోపాలస్వామి అయ్యంగార్ ఇలా ప్రకటించారు (1948 ఫిబ్రవరి): "ప్రస్తుత పరిస్థితులలో కాశ్మీర్ విలీనీకరణ నిర్ణయాన్ని తిరుగులేని నిర్ణయంగా, మార్చడానికి వీలుకాని నిర్ణయంగా మేము తలంచడం లేదు. అత్యవసర పరిస్థితి అంతమై, సాధారణ పరిస్థితులు నెలకొన్న పిమ్మట కాశ్మీర్ - ప్లెబిసైట్ ద్వారా ఇండియాలో తన విలీనీకరణకు ధృవపర్చనూవచ్చు లేదా మనసు మార్చుకుని పాకిస్తాన్‌తో చేరనూవచ్చు లేదా స్వతంత్ర దేశంగా ఉండనూవచ్చు. ఆ స్వేచ్ఛ దానికి ఉంటుంది. కాశ్మీర్ తన మనసు మార్చుకోదలచుకుంటే మేము అడ్డుకునేదీ లేదు." గోపాలస్వామి అయ్యంగార్ అ ప్రకటన చేసిన సుమారు ఏడు మాసాలకే జైలునుండి విడుదలైన షేక్ అబ్దుల్లా కూడా "స్వతంత్ర కాశ్మీర్" కోసం రణభేరి మోగించాడు!

బుధవారం, ఏప్రిల్ 18, 1990

# కాశ్మీర్ సమస్య : కొన్ని చేదు నిజాలు (3)


మ్మూ, లడక్ ప్రాంతాలను ఇండియాలో చేర్చి, మిగతా కాశ్మీర్‌ను "స్వతంత్ర కాశ్మీర్" గా ప్రకటించాలనీ, ఇందుకు నైతికంగానూ, ఆర్థికంగానూ ఐక్యరాజ్యసమితి, అమెరికా, బ్రిటన్‌లు సమీకరించాలనీ షేక్ అబ్దుల్లా 1953లోనే కోరాడు. విచిత్రమైన విషయమేమంటే, ఆ తర్వాత 37 ఏళ్ళకు, కొలది మాసాలనాడే (1989 ఆఖరిలో) లడఖీయులు కూడా తమ ప్రత్యేక ప్రతిపత్తికోసం ఆందోళన ప్రకటిస్తూ ఉద్యమం ప్రారంభించడం! 1953లో అబ్దుల్లా "స్వతంత్ర కాశ్మీర్" ఏర్పాటు అవసరాన్ని గురించి గుర్తుచేస్తున్న సమయంలోనే మన తొలి ప్రధాని పండిట్ నెహ్రూ కూడా లోక్‌సభలో ఒక ప్రకటన చేస్తూ ప్లెబిసైట్ లేదా రిఫరెండం నిర్వహిస్తామని కాశ్మీరీలకు ఇచ్చిన హామీకి "ఎప్పటికీ కట్టుబడి ఉంటామని" ప్రకటించారు. (1953 ఆగస్టు 10). కాని ఆ తర్వాత కాశ్మీర్‌లో జరిపిన ఎన్నికలు సాధరణ ఎన్నికలేగాని కాశ్మీర్ ప్రతిపత్తిని తేల్చే ప్లెబిసైట్‌గానీ, రిఫరెండంగానీ కాదు. కాని మనం మాత్రం సాధారణ ఎన్నికల ఫలితాలనే "ప్లెబిసైట్"గా భావించుకోమని చెబుతూ వచ్చాం. ఇది కాశ్మీరీలకు నచ్చలేదు. పైగా "మోసం'
'గా భావించసాగారు. ఎన్నికల నిర్వహణ కూడా అలాగే సాగిందనీ, కాంగ్రెస్‌కు కాశ్మీర్‌లో స్థానబలం కోసం నేషనల్ కాన్ఫరెన్సును కేంద్ర పాలకులు పెంచుతూ వచ్చారేగాని, కాశ్మీరీల కోరికను నెరవేర్చడానికి కాదన్న అభిప్రాయం వారిలో నాటుకుపోయింది. ఆ తరువాత వచ్చిన ప్రభుత్వాలు కూడా క్రమంగా అసలు ఎన్నికలనే ఒక "ఫార్సు"గా మార్చడం, పెద్దఎత్తున రిగ్గింగ్, బూత్‌ల అపహరణకు పాల్పడడం, నియోజక వర్గాలకు నియోజక వర్గాలనే ఖాళీ చేయించడం, పెద్ద ఎత్తున ప్రత్యర్థుల అభ్యర్థిత్వాలను (నామినేషన్లు) ఏదో ఒక మిషపై రిటర్నింగ్ ఆఫీసర్ల సహాయంతో త్రోసిపుచ్చడం, ఈ నామినేషన్ల నిరాకరణ కేవలం ప్రతిపక్షాలకే పరిమితం చేయడమూ - కాశ్మీర్ రాజకీయాలను విషపూరితం చేశాయి. చివరికి 1987లో జరిగిన ఎన్నికలు కూడా "మోసపూరిత"మైనవిగా కాశ్మీరీలు భావించారు. ఇలాంటి పరిణామంపైనే వ్యాఖ్యానిస్తూ 20 ఏళ్ళనాడే "హిందూస్తాన్ టైమ్స్" పత్రిక కూడా కాశ్మీర్ ఎన్నికలు "చిత్రాతిచిత్రం." "అసమ్మతం" అని (1967 ఫిబ్రవరి 2) నిరసన తెలుపవలసి వచ్చింది. ఈ పరిణామాలన్నీ ఎప్పుడు జరిగాయి? కాశ్మీర్ సమస్య పరిష్కారానికి సమితిని మనమే కదిలించి, సమితి ఆధ్వర్యాన "కాశ్మీర్‌లో శాంతి'
'కోసం ప్రయత్నాలు జరుపుతున్న సందర్భంగా. అప్పటి ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు కాశ్మీర్‌లో వీలైతే ప్రత్యక్ష జోక్యానికీ, వీలుకానప్పుడు సెక్యూరిటీ కౌన్సిల్ తీర్మానాన్ని ఆసరాచేసుకొని పరోక్ష జోక్యానికీ సిద్ధపడ్డారు. అప్పుడే కాదు, ఇప్పటికీ వాళ్ళు కుట్రలను మానుకోలేదు. ఈ దృష్ట్యా చూచినప్పుడు - నాడు అమెరికన్ రాయబారి హెండర్సన్‌తో కాశ్మీర్ ప్రతినిధిగా అబ్దుల్లా జరిపిన చర్చల సారాంశమూ, 1990

మార్చి 6న ఆసియా వ్యవహారాలు సమీక్షించే అమెరికన్ పార్లమెంటు ఉపసంఘం ముందు "స్వతంత్ర కాశ్మీర్" అవసరాన్ని స్ఫురింపజేస్తూ అమెరికా విదేశాంగ సహాయ కార్యదర్శి జాన్ కెల్లీ ఇచ్చిన సాక్ష్యమూ ఒకటే! ఉపఖండంలో ఈ "టైంబాంబు" పేలడం కోసమే ఇంతకాలం ఆంగ్లో-అమెరికన్ పాలకులు ఎదురు చూస్తున్నారని మరువరాదు. 1953 నుంచి 1970ల వరకూ ఈ జోక్యందారీ విధానాన్ని ఆంగ్లో-అమెరికన్లు మానుకోలేదు. 1962 నాటి సెక్యూరిటీ కౌన్సిల్ తీర్మానాన్ని ఆధారం చేసుకొని కాశ్మీర్ సమస్యను "నిర్బంధ మధ్యవర్తిత్వా"నికి నివేదించడానికి ఆంగ్లో-అమెరికన్ వర్గాలు వత్తిడి తెచ్చాయి. ఇండియా, పాకిస్తాన్‌లలో సమితి ఉపఖండ ప్రతినిధిగా పనిచేసిన ఫ్రాంక్ గ్రాహమ్‌ను, ప్రపంచ బ్యాంక్ అధ్యక్షుని హోదాలో యూజీనీ బ్లాక్‌నూ, కామన్వెల్తు కార్యదర్శి హోదాలో డంకన్ శాండీస్ (బ్రిటన్)నూ తమ కార్యకలాపాలకోసం ఆంగ్లో-అమెరికన్లు వినియోగించుకున్నారు. అలాగే 1953 నాటి కాశ్మీర్ పరిణామాలపై షేక్ అబ్దుల్లా, డాక్టర్ కరణ్‌సింగ్‌లు తమ స్వీయ చరిత్రలో చేసిన వ్యాఖ్యలకు, చెప్పిన విషయాలకు బొత్తిగా పొంతన లేదు. అయితే ఒక్కటి మాత్రం వాస్తవం. దేశ విభజన దరిమిలా కాశ్మీర్ లోయలో పొటమరిస్తున్న పాకిస్తానీ అనుకూల (పాకిస్తాన్‌లో కాశ్మీర్ చేరాలన్న వాదన) ధోరణికీ, మొత్తం కాశ్మీర్ ఇండియాలో శాశ్వతంగా విలీనం కావాలని జమ్మూలో ఉధృతమవుతున్న ఉద్యమానికి భిన్నంగా - ఒక పరిష్కార కోసం షేక్ అబ్దుల్లా 1950 నుంచి ప్రయత్నిస్తూనే వచ్చాడు. అదే "స్వతంత్ర కాశ్మీర్" నినాదానికి ఆయువుపట్టు అని గమనించాలి.

దానికితోడు కొలదిరోజులనాడు కాశ్మీర్‌లోని ఐక్యరాజ్యసమితి కార్యాలయానికి వేల సంఖ్యలో "స్వతంత్ర కాశ్మీర్" ఉద్యమకారులు వెళ్ళి మెమొరాండాలు సమర్పించడం యాదృచ్ఛికం కాదు. నలభై మూడేళ్ళుగా మనం కాశ్మీర్‌లో ఒక భాగాన్ని పాకిస్తాన్ ఆక్రమించుకుని కూర్చున్న ప్రాంతాన్ని "పాక్ ఆక్రమిత" కాశ్మీర్‌గా చెబుతున్నామేగానీ, దానిని విముక్తి చేయలేకపోయాం. అది కాశ్మీరీల దృష్టిలో "అజాద్ కాశ్మీర్" అయింది. మన నాయకులు కొందరు వాదిస్తున్నట్టు "కాశ్మీర్ సమస్య" అనేది పాక్ సృష్టేగాని మరొకటికాదన్నదే వాస్తవమైతే, "అజాద్ కాశ్మీర్"ను కాశ్మీర్‌లో అంతర్భాగం చేసేదెప్పుడో చెప్పాలి! ఒకవేళ "అజాద్ కాశ్మీర్" అక్కరలేదనుకున్నప్పుడు ఆ మాటైనా స్పష్టం చేయాలి. అంతేగాని "కాశ్మీర సమస్య" లేదని దాచడం తప్పు, ఆత్మవంచన. ఉద్రిక్తతవల్ల రెండు దేశాల ప్రయోజనాలకు చెడు తప్ప, మంచి జరుగదు. ఈ ఊగిసలాట వైఖరే కాశ్మీర్ విషయంలో అగ్రరాజ్యాల జూదానికి కారణమవుతోంది. చివరికి కాశ్మీర్‌పట్ల రష్యా వైఖరి కూడా తన జాతీయ ప్రయోజనాల దృష్ట్యానే మారుతూ వస్తోందిగాని, మన ప్రయోజనాల దృష్ట్యా అది మారదు. ఉదాహరణకు 1965 ఆఖరిలో నాటి సోవియట్ ప్రధాని కృశ్చేవ్ శ్రీ నగర్‌లో మాట్లాడుతూ "కాశ్మీర్ ఇండియాలో అంతర్భాగం, ఆ సమస్యను కాశ్మీర్ ప్రజలు ఏనాడో నిర్ణయించేశారు" అని ప్రకటించగా, 1966 మార్చి 25న రష్యా తొలి ఉపప్రధాని మికోయాన్ కరాచీలో ప్రసంగిస్తూ "కాశ్మీర్ భవిష్యత్తును అంతిమంగా కాశ్మీర్ ప్రజలే నిర్ణయిస్తారు" అని చెప్పాడు! మూడు నెలల వ్యవధిలో తారుమారైన రష్యా విధానం అది. ఇప్పటికీ అది "కాశ్మీర్ సమస్య" లేదని చెప్పడం లేదు. 1962 నాటి నెహ్రూ - అయూబ్‌ఖాన్ ప్రకటన కూడా "సమస్య" ఉందనే పేర్కొన్నది. చివరికి చైనా పాత్ర కూడా దాని జాతీయ ప్రయోజనాల దృష్ట్యానే నిర్ణయమవుతూ వస్తోంది. కనుకనే "పాక్ ఆక్రమిత" (అజాద్) కాశ్మీర్‌లోని గిల్గిత్ ప్రాంతంలో కారాకోరమ్ కనుమలగుండా పాకిస్తాన్‌కు రోడ్డు నిర్మించిపెట్టిన సందర్భంగా

పాకిస్తాన్‌తో చైనా ఒక ఒప్పందం కుదుర్చుకోగలిగింది. మనం నిరసనతోనే సరిపెట్టుకున్నాంగాని అక్కడ ఒప్పందం కుదిరిపోయింది. అయితే ఒప్పందంలోని ఆరవ క్లాజు ప్రకారం - చైనా ఉద్దేశంలో కాశ్మీర్ సమస్య ఇంకా పరిష్కారం కావలసే ఉంది. అందుకనే పాకిస్తాన్‌తో కుదిరిన ఒప్పందాన్ని "తాత్కాలికం" అని చైనా ఇస్లామాబాద్‌ను ఒప్పించగలిగింది. ఆక్రమిత ప్రాంతం అంతిమంగా పాకిస్తాన్‌కు చెందిన పక్షంలో ఈ "తాత్కాలిక" ఒప్పందాన్ని శాశ్వత ఒప్పందంగా ప్రకటిస్తాననీ, లేదూ, పాక్ ఆక్రమిత ప్రాంతం అంతిమంగా ఇండియాకు అనుకూలంగా మారితే ఇండియాతోనే శాశ్వత ఒప్పందం చేసుకొంటాననీ చైనా చెప్పింది. ఒక విధంగా చైనా వైఖరి మనకు పూర్తి అనుకూలంగా కన్పించకపోయినా కనీసం వ్యతిరేకం కాదు. అయినప్పుడు కాశ్మీర్ సమస్య ఉన్నట్టా లేనట్టా? ఉంటే పరిష్కారం చర్చల ద్వారానా? యుద్ధం ద్వారానా? "స్వతంత్ర కాశ్మీర్" ఉద్యమం వెర్రితలలు వేయకముందే నాయకత్వం విజ్ఞతతో వ్యవహరించాలి.

గురువారం, ఏప్రిల్ ౹౨, ౹౯౯౦

# 'అయోధ్య' వల : ఎన్నికల కల :


జ్యాంగ నిర్ణేతలూ, నవభారత నిర్మాతలు చెప్పిన సుద్దులూ, సూత్రాలు గాలికి వదిలేసిన రాజకీయ పక్షాలు మననేతలు ఆశించిన సెక్యులర్ వ్యవస్థను కుక్కలు చింపిన విస్తరిగా ఈరోజుకీ మార్చుతూనే ఉండడం మన దురదృష్టం. ఏ పని చెయ్యండి - ఎన్నికల ప్రయోజనం కోసమో, లేదా స్వార్థ బుద్ధితోనో తప్ప ప్రజా బాహుళ్యం విశాల ప్రయోజనాలను ఆశించి మాత్రం కాదు. చెప్పే మాటకూ, చేసే పనికీ పొంతన కుదరడం లేదు. అయోధ్యలో ఒక వివాదాస్పద స్థలంలో "రామజన్మభూమి - బాబ్రీ మసీదు" పేరిట రాజకీయ ప్రయోజనం కోసం బి.జె.పి., కాంగ్రెస్ (ఐ), జనతాదళ్‌లు సృష్టించిన రగడ దేశ సమైక్యతను దెబ్బతీస్తోంది. 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో హిందూ - ముస్లిం ఐక్యతను చూచి కలవరపడిన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఉభయ మతాలకు చెందిన ప్రజల మధ్య కలతలు సృష్టించే కుట్రలో భాగంగా అయోధ్య స్థలంలో కూడా రేపిన తగాదాను ఒక చారిత్రిక అవశేషంగా గుర్తించకపోవడంవల్లనే ఇంతటి సమస్యకు దారితీసింది. హిందూ - ముస్లిం పక్షాలకు చెందిన ప్రతినిధులను ఒకచోట సమావేశపరచడానికి జరిగిన ప్రయత్నం ప్రశంసనీయమైనదే గాని, సమస్యను పరిష్కరించడానికి పన్నుతున్న ఎత్తుగడలు సరైనవి కావు. గాంధీజీని హత్యచేసిన మతోన్మాదులూ, దయానంద సరస్వతిని విషాహారమిచ్చి చంపడానికి ప్రయత్నించిన మతోన్మాదులూ మన 'హిందువు'లే కావడం సిగ్గుపడవలసిన విషయం కాగా, హైందవ మతంలోని సద్గుణాలను వదలి వికృతమైన అర్థాలతో "మందిర-మసీదు" తగాదా పేరిట మతసామరస్యాన్ని దెబ్బతీస్తున్న బి.జె.పి., వి.హెచ్.పి., ఆర్.ఎస్.ఎస్. వర్గాల కుయుక్తులకు ప్రత్యామ్నాయంగా కాంగ్రెస్(ఐ) ఒక "వ్యూహం" రచించింది; నవంబర్ 29-30లలో జరిగిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశం ఆమోదించిన ఈ వ్యూహాన్ని వివరిస్తూ పార్టీ అధ్యక్షుడు రాజీవ్‌గాంధీ ప్రధాని చంద్రశేఖర్‌కు డిసెంబర్ 1న ఒక లేఖ రాశారు. ఆ లేఖ సారాంశాన్ని జనతాదళ్ (ఎస్) ప్రభుత్వం కూడా ఆమోదించింది. రెండు మతాలకు చెందిన ప్రతినిధులను సమావేశపరచడంలో కాంగ్రెస్ (ఐ) ముఖ్యమంత్రులలో ఒకరైన శరద్‌పవార్ ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నందున అయోధ్య సమస్యపై చర్చలు ఈసారి ప్రధానంగా "కాంగ్రెస్ చొరవ'పైనే జరిగినట్టు భావించాలి. ఢిల్లీ సమావేశానికి ముందు నవంబర్ 26న చంద్రశేఖర్ ప్రభుత్వం మందిర తగాదా విషయంలో వివాదాస్పద భూమిలో 11వ శతాబ్దం నాటికే రామమందిరం ఉన్నట్టూ, దానిని బాబర్ సేనాపతి పడగొట్టి ఆ స్థానంలో బాబ్రీమసీదు కట్టించినట్టూ పురాతత్వ పరిశోదనా ఫలితాలనూ, ఆధారాలనూ చూపవలసిందిగా బి.జె.పి.నీ, వి.హెచ్.పి.నీ కోరింది. ఆ తరువాత పరిణామం - కాంగ్రెస్ (ఐ) వర్కింగ్ కమిటీ ఆమోదించిన తాజా "వ్యూహం". నిజానికి ఇందులో కొత్తదనమేమీ లేదు. బి.జె.పి. సహా ప్రతి రాజకీయ పక్షమూ స్వప్రయోజనాలకోసం ఎన్నికలను సత్వరం

జరపాలనో లేదా మరికొన్నాళ్ళు వాయిదా వేయాలనో ప్రయత్నిస్తున్నవే అయినందున, "మందిర - మసీదు' ' తగాదాకు ఎన్నికల విషయం ఏదో ఒకటి తేలేదాకా పరిష్కారం కూడా వాయిదా పడుతూనే ఉంటుంది. ప్రజల నిరక్షరాస్యతను, మూఢ విశ్వాసాలనూ ఆధారం చేసుకొని ఉద్రిక్తత సడలకుండా చేయడం రాజకీయ పక్షాలనైజం. కాంగ్రెస్ (ఐ) వ్యూహంలో ప్రధానాంశాలుః మందిర-మసీదు స్థలాన్ని నిర్ధారిస్తూ చారిత్రిక ఆధారాలను స్పష్టీకరిస్తూ ఐదుగురు జడ్జీలతో కూడిన విచారణ సంఘాన్ని నియమించడం, మూడు నెలలలోగా నివేదిక సమర్పించడం, 1950 జనవరి 26 నాటికి, అంటే రాజ్యాంగం అమలులోకి వచ్చిన నాటికి ఉన్న ప్రార్థనా కేంద్రాల ప్రతిపత్తిలో ఎలాంటి మార్పులు చేయకుండా నిషేధిస్తూ చట్టం చేయడం, మందిర వివాదాన్ని పరిష్కరించడానికి ఆర్డినెన్సుద్వారా సుప్రీంకోర్టు పరిశీలనాధికారాలను విస్తృతపరచడం, సమస్యను సత్వరమే పరిష్కరించడంద్వారా "మనం కలలుకనే భారతాన్ని నిర్మించుకొనే లక్ష్యాన్ని ముందుకు తీసుకెళ్ళడం", తద్వారా సెక్యులరిజం సూత్రాన్ని కాపాడడం, రామమందిర నిర్మాణానికి కాంగ్రెస్ (ఐ) అనుకూలమని గుర్తిచడం. ఇవన్నీ బాగానే ఉన్నట్టు కన్పిస్తున్నాయికానీ, తొలి భారత ప్రధాని పండిట్ నెహ్రూ కోరినట్టుగా ఈ "వ్యూహం"లో ఎక్కడా రాజకీయాలనుంచి మతాన్ని వేరు చేయాలని వర్కింగ్ కమిటీ పునరుద్ఘాటించలేకపోయింది. అంతేగాదు, అయోధ్య వివాద స్థలంలో యథా పరిస్థితిని కొనసాగించాలనీ, ఎవరూ తొందరపడి ఏ చర్యకూ దిగరాదనీ అల్హాబాద్ హైకోర్టు ఆదేశించినప్పటికీ, కేంద్ర ప్రభుత్వం కూడా శిలాపూజలు జరిపిన (శిలాన్యాస) స్థలాన్ని వివాదస్పదమయినదిగా ప్రకటించినప్పటికీ, 1989 నవంబర్‌లో ప్రభుత్వం 'శిలాన్యాస' ఉత్సవాలకు ఎందుకు అనుమతించవలసి వచ్చిందో ఆ "వ్యూహం"లో కాంగ్రెస్ దేశానికి చెప్పుకొనలేకపోయింది! అంతేకాదు, ఒకవైపున స్థలానికి సంబంధించి చిన్న కోర్టులలో మూలుగుతున్న దావాలన్నీ అల్హాబాద్ హైకోర్టుకు బదిలీఅయి, విచారణలో ఉండగా, అవి కూడా చారిత్రిక ఆధారాలకు సంబంధించిన తగాదా "సూట్లే" అయినందున ఇప్పుడు కొత్తగా సుప్రీంకోర్టు కమిషన్ ఆఫ్ ఇంక్వయిరీ ఎందుకు అవసరమయిందో వివరణ లేదు.

అంతేగాదు, ఇంతకుముందే ఉత్తర ప్రదేశ్‌కు, భారత పురాతత్వ పరిశోధనా సంస్థలకు చెందిన చరిత్రకారులు ఆర్.సి.సింగ్, బి.బి.లాల్, ఎం.సి.జోషీ అయోధ్యలోని 17 స్థలాలను పరిశీలించి, పరిశోధించి నిగ్గుదేల్చిన విషయాలను కూడా ఆ "వ్యూహం"లో ప్రస్తావించలేదు. ఇక వి.హెచ్.పి. "విశ్వాసం"తో కోసే కోతలను 11వ శతాబ్దం నాటి "కృత్యకల్పతరువు" గ్రంథకర్త అయిన భట్ట లక్ష్మీధర ఆ పుస్తకంలో భాగంగా రాసిన "తీర్థవివేచనకాండ" అయోధ్య గురించిగానీ, రాముని జన్మస్థలం గురించిగానీ ప్రస్తావించకపోవడం గమనార్హమని ప్రొఫెసర్ ఆర్.ఎస్.శర్మ రాశారు. పైగా భట్ట లక్ష్మీధరకు ఉత్తర ప్రదేశ్ తూర్పు ప్రాంతాలన్నీ కొట్టిన పిండి. అందువల్ల కొత్తగా తవ్వకాలలో బయటపడితే చూడవలసిందేగానీ ప్రత్యేకించి నిరూపించదగిన చారిత్రికాధారాలు ఇంతకుముందే ముగిశాయి. పరమ రామభక్తుడూ, మొగలాయీ బాబర్‌కు సమకాలికుడూ, అయోధ్య ప్రాంతాలలో ప్రసిద్ధుడుగా చెలామణి అయిన (16వ శతాబ్దం) "రామచరిత మానస" కృతికర్త తులసీదాస్ కాలం నాటికే రామమందిరం ఉండిఉంటే, దానిని పరాయివాడు కూలగొట్టివుంటే ఆయన ఉగ్రమూర్తి కాకుండా, శాపానుగ్రహశక్తిగా మారకుండా ఉండేవాడా? ఇది మన ఇంగిత జ్ఞానాన్ని పరీక్షించే ప్రశ్న. నిజానికి ఇన్ని విషయాలు తెలిసినందుననే పండిట్ నెహ్రూ, బాబర్ అయోధ్య యాత్రను హిందువుల మీదికి దాడిగా కాకుండా, పఠాన్లమీదికి మాత్రమే దాడివెడలి వచ్చాడని చెప్పవలసి వచ్చింది. అలాగే రామమందిరాన్ని బాబర్ కూలగొట్టించి దానిస్థానే మసీదును లేపి ఉంటాడన్న అనుమానంతో 1949

## ఎబికె సంపాదకీయాలు

డిసెంబర్ 23న తెల్లవారు ఝామునకల్లా మసీదులోపలికి విగ్రహాలను (నాటి జనసంఘ్, - ఆర్.ఎస్.ఎస్. అనుయాయులు) చొప్పించి వచ్చినప్పుడు పండిట్ నెహ్రూ ప్రధానమంత్రి హోదాలో అభ్యంతరం ప్రకటించి, యథాస్థితిని పునరుద్ధరించాలని యు.పి. ముఖ్యమంత్రిని అదేశించడాన్ని కాంగ్రెస్ వర్కింగ్ కమిటి మరచిపోవచ్చునా? నెహ్రూ ఉత్తర్వును ఖాతరు చేయకుండా నాటకమాడి, ఉద్రిక్తతకు కారకుడైన నాటి జిల్లా కలెక్టర్ కె.కె. నాయర్ క్రమంగా పార్లమెంట్ ఎన్నికల్లో జనసంఘ్ అభ్యర్థిగా పోటీచేసిన సత్యాన్ని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఎలా మరిచిపోయింది? పైగా 1949 డిసెంబర్ 29న ఒక వర్గం వారి ప్రార్థనలను నిషేధించి, మరో వర్గం వారి పూజలకు మెజిస్ట్రేట్ అనుమతించి మైనారిటీ వర్గాలలో అనుమానాల సృష్టికి కారణం కావడాన్ని వర్కింగ్ కమిటీ విస్మరించవచ్చా? అంతేకాదు, ఒకవైపున సెక్యులర్ భావాలను పెంచాలని చెబుతూనే, మరొకవైపున డిసెంబర్ 6న అయోధ్యలో బి.జె.పి. "ప్రభవెలిగి" పోకుండా తగ్గించేందుకుగానూ కాంగ్రెస్ కార్యకర్తలు కూడా తిరిగి వివాదాస్పద స్థలంలోనే కరసేవ రెండో విడత కార్యక్రమంలో పాల్గొనడానికి వర్కింగ్ కమిటీ అనుమతించవచ్చా? రాజకీయాలలోకి మతాన్ని దించడం దేశ విచ్ఛిత్తికి" మార్గమన్న నెహ్రూ ఆశయానికి ఇది అనుగుణమా? యు.పి. సీనియర్ కాంగ్రెస్ నాయకుడు ఎన్.డి.తివారీ "కరసేవ"కు దిగబోవడం వ్యక్తిగత నిర్ణయంగా భావించదలచితే, కాంగ్రెస్ అనుబంధ సంస్థల కార్యకర్తలను కరసేవకు ఎందుకు అనుమతిస్తున్నట్టు? ఇది రాజకీయాల మతాంతీకరణ కాదా? వర్కింగ్ కమిటీ "వ్యూహం" ఊహించినట్టు ఇది "సెక్యులర్ భావాన్ని సదా కాపాడడానికి" ఎలా దోహదపడుతుంది? కాంగ్రెస్ సేవాదళ్ అధ్యక్షుడు రామేశ్వర్ నీక్రా ఈ కార్యక్రమంలోనే ఇప్పుడు తలమునకలై ఉన్నాడు!

మంగళవారం 4 డిసెంబర్, 1990

# 'అయోధ్య' వల : ఎన్నికల కల (2)

అయోధ్య తగాదా ఎందుకు ముగియదంటే - ఇల్లు కాలుతూంటే బొగ్గులు ఏరుకొనే రాజకీయ పక్షాల నాయకులు తులసీదాసులూ లేక భక్త రామదాసులూ కారుకాబట్టి! ప్రజల నమ్మకానికి చెందిన ఒక పురాణ పురుషుడు లేదా అందమైన కావ్యసృష్టి అయిన ఒక శ్రీరాముడు జనం నోళ్ళల్లో నానే ఓ ఆరాధ్యమూర్తి కాబట్టి, ఆయని ఆదర్శ రాజ్యం కోసం కష్టపడకపోయినా చెట్టుపేరుచెప్పి కాయలు అమ్ముకోవచ్చుననే రాజకీయవేత్తలు చెలామణి అవుతున్న ఈ దేశంలో - అయోధ్య గాథ ఇప్పట్లో ముగింపునకు రాదు. రామమందిర నిర్మాణం పేరిట అద్వానీ లెక్కలలో ఎనిమిదికోట్ల ధనం వసూలు చేసిన తరువాత అయోధ్య తగాదా అసలు ముగియదు. ఆ రహస్యం అయోధ్య మందిరం చీఫ్ ప్రీస్ట్ లాల్‌దాస్‌ను అడిగితే తెలుస్తుంది. స్థానికంగా ఈ సమస్యను 'మేము పరిష్కరించుకుంటాం బాబూ, మా మానాన మమ్ము వదిలేయండి' అని మొత్తుకున్నా ఉత్తర ప్రదేశ్‌పై దొమ్మీగా, చక్రవర్తులు సామంతరాజులపై దాడి వెడలినట్టుగా 'కరసేవ' పేరిట వివాదాస్పద స్థలంలో రభస సృష్టించి మత సామరస్యాన్ని దెబ్బతీసేవారు ఎంత గొప్పవారైనా మన ఉపనిషత్తులు బోధించిన క్షమకు, సహనశీలతకూ విరుద్ధంగా వ్యవహరించినట్టే లెక్క. ఈ తగాదా మరొక ముఖ్య కారణంవల్ల కూడా ఇప్పట్లో తెగదు: బాబ్రీ మసీదు లోపల అర్థరాత్రిపూట (1949లో) చాటుమాటుగా పెట్టివచ్చిన విగ్రహాలను తొలగించి, శిలాన్యాస స్థలంలో ప్రతిష్ఠించుకోడానికి విశ్వహిందూపరిషత్ (బి.జె.పి) ఒప్పుకొనే పక్షంలో వివాదాస్పద స్థలాన్ని వి.ఎచ్.పి.కి దఖలు పరచడానికి బాబ్రీ మసీదుకార్యాచరణ సంఘం సిద్ధమని ప్రకటించింది. కాని మసీదు లోపల ప్రతిష్ఠించిన విగ్రహాలున్న స్థలాన్ని కలుపుకొని రూపొందించిన రామ మందిర నిర్మాణ పథకాన్ని మార్చడానికి వి.హెచ్.పి. సిద్ధంగా లేదు! పైగా "మసీదును కూలగొడతా"మన్న వైఖరిని వి.హెచ్.పి. మార్చుకున్నట్టు కొంత కనిపిస్తున్నా మసీదును మరోచోటకి తరలించాలని పట్టుబట్టడంలో ఆంతర్యం బొత్తిగా తెలియడంలేదు. పైగా, ఇందుకు అంగీకరించని పక్షంలో మధుర, వారణాసి నిర్మాణాల విముక్తికి ఉద్యమిస్తానంటోంది! ఇదంతా వీళ్ళు "హైందవం"పేరిట, "హిందూత్వం" పేరుతో చెలామణి చేయించుకోవాలని ఆశిస్తున్నారు. కాని వీళ్ళు దురభిమానం కొద్దీ, పురోహిత వర్గ సంప్రదాయం కొద్దీ కొన్ని చారిత్రిక సత్యాలనుకావాలని మరచిపోతున్నారు. దుష్టపాలకులైన కొందరు పాత చక్రవర్తులు (వారే మతస్థులయినా) రాజ్యకాంక్షతో జరిపిన దౌర్జన్యాలకు సమాధానంగా ఈనాడు మత సామరస్యానికి చిచ్చుపెట్టుకోవాలా? ప్రజా బాహుళ్యాన్ని దోచుకోడంలో ఉభయ మతాలకు చెందిన పాలకులు కొందరు ఎవరికీ తీసిపోరు. ముగ్గురు అన్నల్ని చంపి, తండ్రిని హతమార్చి ఔరంగజేబు అధికారానికి ఎందుకొచ్చినట్టు?

సర్వమత సహనానికి ప్రతీకగా నిలిచి ప్రాణాలు కోల్పోయిన దారా, ముస్లిమ్ కాదా? అంతా ముస్లిములే అయినా, బహమనీ సుల్తాన్‌లకూ, గోల్కొండ నవాబులకు ఎందుకు పడలేదు? ఆంధ్ర - కన్నడ కృష్ణ దేవరాయలు, ఒఢ్ర గజపతులూ హిందువులే అయినా నిత్యం ఎందుకు కొట్టుకు చచ్చారు? హిందువులైన షీవ్వాల మధ్య తగాదాలెందుకొచ్చాయి? టిప్పుసుల్తాన్ ముస్లిమే అయినా అనంతపురం, కర్నూలు నవాబులు, నైజాం నవాబు అతనిపై కత్తి దువ్వి ఇంగ్లీషువాడి పంచన ఎందుకు దూరవలసి వచ్చింది? హిందూ పాలకుడు, గద్వాల్ ప్రభువైన సోమ భూపాలుడు దుష్టుడనుకున్న ఔరంగజేబునుంచి ఆదరంగా ఎందుకు సనదులు అందుకున్నాడు? అదే ఔరంగజేబు హయాంలో అయోధ్యలో మత సామరస్యం ఎలా సాధ్యపడింది? కాగా అతని మరణానంతరం శైవ సన్యాసులు, వైష్ణవ బైరాగులు సరిగ్గా రామజన్మ దినత్సోవంనాడే పీఠాధిపత్యాల కోసం బరితెగించి ఎందుకు పరస్పరం హత్యలకు దిగారు. ఇవన్నీ - రాజ్య కాంక్షతో, పీఠాధిపత్యాల కోసం, రాజులు, వారికి అండగా వ్యూహరచనలో పాల్గొన్న పురోహిత వర్గాలూ సూత్రధారులుగా జరిపిన "పరస్పరాహరణోద్యోగమూ", పరపీడన పరాయణత్వమూ కాదా?! భారత ప్రజలను నాలుగు కులాలుగా విభజించి, ఆర్య అనార్య బేధాలు రేపి ఇన్నాళ్ళూ హైందవ సమాజం ఒక్క తాటిపై నడవకుండా, సమైక్యం కాకుండా చీలుబాటలు పట్టించినవాళ్ళు స్వార్థపరులైన కొన్ని పురోహితవర్గాలు కావా? యజ్ఞయాగాదులను నిరసించి, అహింసను బోధించి, ప్రజలకు ప్రశ్నించడం నేర్పిన బౌద్ధాన్ని, జైన మతాన్ని, వాటి చైత్యాలను మందిరాలనూ స్వార్థ ప్రయోజనాలకోసం కూలగొట్టి, బుద్ధుడిని విష్ణువుకు మరో అవతారంగా, దశావతారాల తర్వాత పదకొండో అవతారంగా మార్చి విగ్రహారాధనను నిరసించిన మూర్తిని శిలాబంధం చేసింది మన వాళ్ళే! బహుశా అందుకనే స్వామీ వివేకానందుడు, చిలకమర్తి లక్ష్మీనరసింహం పీఠాధిపతుల వ్యవస్థను నిరసించి ఉంటారు. "దేశాభివృద్ధియన్న వారికి కంటకము" అని తెగేసి విమర్శించవలసి వచ్చింది.

ఇది నిజంగాకపోతే, (1949 తర్వాత) చడీ చప్పుడు లేకుండా అర్థరాత్రి 30 కుడ్య చిత్రాలను మసీదు గోడలపై అంటించవచ్చా? ఈ చిత్రాల్లో (మ్యూరల్స్) రామమందిరాన్ని బాబర్ సైనికులు కూల్చినట్టు లిఖితపూర్వకంగా పనిగట్టుకుని మరీ లేబెల్స్ అంటించవచ్చునా? ఒక విశ్వాసం ఆధారంగా అయోధ్య శ్రీరాముని జనన ప్రశస్తితో ముడిపడి వున్న ప్రాంతమేగాదు, పెక్కుమంది జైన తీర్థంకరులకు, వారి మత బోధకులకూ, కేంద్రం కూడా. ఈ అయోధ్య 7వ శతాబ్దిలో సుదీర్ఘకాలంపాటు బౌద్ధ దేవాలయాలకు ప్రసిద్ధి పొందింది. ఈనాటికీ అయోధ్యలో పెద్దవిగా, చిన్నవిగా ఉన్న ఆరువేల దేవాలయాల పూజారులు, మతాచార్యులూ ఎవరికి వారు తమ ఆలయ ప్రాంగణమే రామజన్మభూమిగా భావించి వాదులాడుతున్నప్పుడు, మరొక విశాల ప్రాంతంలో పెద్ద స్థలాన్ని రామమందిర నిర్మాణానికి కేటాయించడానికి కేంద్ర ప్రభుత్వం ముందుకొచ్చినప్పుడు, మసీదును తొలగించి మాత్రమే మందిరం కట్టాలని భీష్మించేవారు పేరుకు హిందువులయినా హైందవ సర్వమత సమభావనాధర్మానికి వారసులు కాజాలరు! పశుత్వంనుంచీ, దానవత్వంనుంచీ మానవుణ్ణి వేరుచేసేది సత్యం ఒక్కటేనన్నారు మన ఋషులు ("సర్వం సత్యే ప్రతిష్ఠితమ్"). కాని నేడు అసత్యానికి ప్రతిష్ఠ జరుగుతూండడం విచిత్రం! క్షమాగుణానికి మనవాళ్ళు ప్రాధాన్యమిచ్చారు. కాని అది ఆచరణలో నేడు కరవయింది. ఈ క్షమను ఆశ్రయించిన గాంధీజీ విశ్వమానవ దృష్టినీ, పరస్పర గౌరవం అవసరమని బోధిస్తూ చెప్పిన మాటనూ మనం మరచిపోయాం: "నేను

## ఎబికె సంపాదకీయాలు

విశ్వసిస్తున్న హైందవం సంకుచితమైన తత్వం కాదు సుమా! కాలం లాగా సాగిపోయే మహాపరిణామ క్రమం. హైందవం అంటే - జొరాస్టర్, క్రీస్తు, మహమ్మద్, నానక్ తదితర పెక్కు ప్రవక్తల ప్రబోధాల సమాహారం...... సత్యానికి మించిన ధర్మం లేదు" అన్నాడాయన. అంతేగాదు, లౌకిక తత్వాన్ని బోధించి, జాతి వైషమ్యాలను, మత దురభిమానాలనూ ఈసడించుకొని షాజహాన్ తలలో నాల్కలా మెలిగి, ఉపనిషత్తులను ఇతర భాషలలోకి అనువదింపజేసిన తొలి తెలుగు పండితుడు, ముంగండ రసగంగాధరుడైన పండిత రాయలు ముస్లిమ్ - హిందూ దురభిమానులిరువురూ పెట్టిన బాధలను తట్టుకొని నిలిచి, గొప్ప సందేశాన్ని మనకు మిగిల్చాడు: "గుణాల వలన గొప్పతనం రావాలిగాని, జాతివల్ల రాదు. కాలకూట విషం పాల సముద్రంనుంచి పుట్టింది. అయినప్పుడు అది (సముద్రం) ఏ విధంగా గొప్పదో" చెప్పమన్నాడు. క్షమాగుణం లేకపోతే మానవుడు పశువుతో సమానం అనలేదూ శంకరుడు!

బుధవారం 5 డిసెంబర్, 1990

# ఎడా పెడా - చెడామడా !

"ఆత్మ అనే దీపం వెలిగేందుకు ఆదర్శమనే తైలం" ముఖ్యం కాబట్టి ఆ ఆదర్శం ఆచరణకు దూరంగా ఉన్నా సరిపెట్టుకోవాలి. రాజకీయ ప్రజాస్వామ్యంలో చర్చకు ఎంత ప్రాధాన్యముందో తాడోపేడో తేల్చుకోగల పోటాపోటీలకు కూడా అంతే ప్రాముఖ్యం ఉంది. జనరల్ ఎన్నికల వేడి పెరుగుతున్న కొలదీ పార్టీల తీర్మానాల 'కాక' కూడా రెట్టింపు కావడం సహజమే. అయితే ఇందులో ప్రజా బాహుళ్యానికి ఆచరణలో తోడ్పడగలిగింది ఎంత అన్నది వేరే ముచ్చట. ఉదాహరణకు ఇటీవల ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ ప్రత్యేక సదస్సు చేసిన తీర్మానాలు పరిశీలించినా, గత రెండు రోజులుగా "తెలుగుదేశం" పార్టీ విషయ నిర్ణయ సభ, జనరల్ బాడీ చేసిన తీర్మానాలు చూసినా కలిగే భావన ఒక్కటే – కాంగ్రెస్‌ను మళ్ళీ ఎన్నికల్లో ఓడించడం ఎలా అనీ, టి.డి.పి.ని ఈసారి పదవికి రాకుండా పల్టీ కొట్టించడం ఎలా అనీ జరుగుతున్న చర్చలలో, శషభిషలలో లోపిస్తున్న అంశం - ఉభయపక్షాల నిజాయితీ. ఉభయత్రా పార్టీ ప్రభుత్వాలు నడుస్తున్న తీరుతెన్నులు గురించి చేసుకునే విమర్శలు, పరస్పరం పెట్టుకొనే శాపనార్థాలూ మామూలే. ఉభయత్రా ఉమ్మడిగా సాగుతున్న పల్లవి - "అవినీతి", "కుట్రలు", "కుహకాలు'', "మోసం", పెరుగుతున్న "అధికార దాహం", "స్వార్థచింతన" వగైరా. దారిద్ర్యం, నిరుద్యోగం, అక్రమపాలన, ఆశ్రిత పక్షపాతం, ఆర్థిక అసమానతలు పెరిగిపోవడం, నిధుల మళ్ళింపు - ఈ మాటలకు ఉభయ పక్షాలు పుష్కలంగా "ఉపాధి" కల్పిస్తున్నవే! అలాగే పార్టీలో "ఆంతరంగిక ప్రజాస్వామ్యం" కొరవడిపోయిందన్న విమర్శ కూడా ఉభయ వర్గాలకూ వర్తిస్తున్నదే. నామినేషన్ సంస్కృతి ఏ ఒక్కరి గుత్త సొమ్ము కాదని ఉభయులూ ఆచరణలో నిరూపించారు. కులం, మతం, మైనారిటీలు - ఉభయుల చేతులలోనూ వోట్ల కోసం పెడుతున్న 'ఎర'గా మారిపోయాయి. కమ్యూనల్ అవార్డుకు, పూనా సంధికి కాలం చెల్లిపోయినా వాటిని స్వాతంత్ర్యానంతరం స్వార్థ ప్రయోజనాలకోసం అధికార పక్షాలు ఎప్పటికప్పుడు సంస్థాగతం చేసి కూర్చున్నాయి. ఈ మాట నిజం కాకపోతే, కుల, మత, వర్గ రాహిత్య సమాజాన్ని ఏర్పరచుకోవాల్సిన దశలో ఆ మూడు జాడ్యాలను రిజర్వేషన్లద్వారా పెంచి పోషించాలన్న తహతహ కాంగ్రెస్‌కూ, "దేశం"కూ ఎందుకో అర్థం కావడం లేదు. జనాకర్షక (పాపులిస్టు) నినాదాలకు, పథకాలకు అలవాటు పడడానికి ప్రధాన కారణం - పార్టీ స్వార్థమేగాని దేశ ప్రయోజనం కానీ కాదు. ఈ పాలక పక్షాలకు చిత్తశుద్ధి లేదనడానికి ఒక్కటే ఉదాహరణ. 1962 నాటికల్లా దేశంలో నిర్బంధ ప్రాథమిక ఉచిత విద్యావ్యాప్తి జరగాలన్న రాజ్యాంగం సంకల్పం కాస్తా వికల్పమైపోవటం. ఈ రోజుకీ అది ఎండమావే. అందుకు తగిన వనరులు సమకూర్చలేనివారు, సంకల్పాన్ని సాధ్యం చేసుకోలేనివారు 1990 నాటికి మాత్రం వెనుకబడిన తరగతులకు, లేదా షెడ్యూల్డు కులాలకు, తెగలకు చేసిన వాగ్దానాలను నెరవేర్చి సమాజాన్ని వర్గ రహితం

చేయగలరన్న గ్యారంటీ ఏమిటి? ఇందుకు కావలసింది దేశ వ్యాప్తమైన బృహత్ప్రణాళిక; కుల, మత సంస్థలను రద్దు చేస్తూ రాజ్యాంగ సవరణ; లౌకిక వ్యవస్థకు మనసా, వాచా కర్మణా బద్ధులై నడచుకోగల ప్రవర్తనా నిబంధనావళి; వీటిని మనసుపెట్టి ఆచరించగల కేంద్రం, రాష్ట్ర ప్రభుత్వాలు.

ఆ గ్యారంటీ లేనంతవరకు ఎన్ని తీర్మానాలు చేసినా అవి "కోతలరాయుళ్ళ" తీర్మానాలుగానే మిగిలిపోతాయి. వోట్లు తప్ప మరొక 'చిత్తశుద్ధి' వారికి లేదని ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే - ఉదాహరణకు – ముఖ్యమంత్రి ఎన్.టి.రామారావు పార్టీ మహానాడు జనరల్ బాడీల మాట్లాడుతూ ఈసారి ఎన్నికలలో ఇప్పుడున్న లెజిస్లేటర్లలోనూటికి 50 మందికి సీట్లు ఇవ్వబోమని ఆ మేరకు కొత్త వారికి ఇస్తామని చెప్పడం. నిజానికి లోగడ టి.డి.పి. 'కొత్తరక్తం'తో ప్రారంభమైన పార్టీయే. కాని మధ్యలో పుండుపుట్టి కొంత కుళ్ళిపోయింది. అయితే అందుకు నాయకత్వం ఎంతవరకు, క్యాడర్ ఎంతవరకు కారకులో మనకు తెలియదు. పైగా ఎన్.టి.ఆర్. 50 శాతం కొత్తవారికి సీట్లు ఇవ్వబోవడం తన రాజకీయ అవసరంగా భావించి చేసిన నిర్ణయంగా చెప్పకుండా కొత్త "దరువు" మొదలుపెట్టారు: "బూజుపట్టిన భావాలతో ఉన్నవారు, శక్తియుక్తులు లేనివారు, ఇతర పార్టీలకు నాయకత్వం వహిస్తున్నా"రని ఆయన విచిత్రమైన తృప్తిని ప్రకటించారు. దెయ్యాలు వేదాలు వల్లిస్తాయి. "బూజుపట్టిన భావాల"కు అసలు సిసలు ప్రతినిధి తానేనని రామారావు మరచిపోరాదు. ఒక్క కమండలం మినహా, కర్ణకుండలాలు సహా ఫ్యూడల్ సంస్కృతికి ఆయన పరిపూర్ణమయిన మూర్తి అని చెబితే సత్యం దూరం కాదు. "చెవిలో పూలు పెట్టుకున్న"వారిని నమ్మించవలసిందే - ఆయన 31 మంది మంత్రులను ఒక్క కలం పోటుతో తొలగించి వేసింది వారంతా "బూజుపట్టిన భావాల"తో ఉన్నందుకేనా? వారంతా "శక్తియుక్తులు" లేని వారైనందుననే బర్తరఫ్‌కు నోచుకోవాలసి వచ్చిందా? ఎప్పటికప్పుడు కొత్తవారికి చోటివ్వాలన్న సూత్రం ప్రకారం రెండు పదవులను అనుభవిస్తున్న అగ్రనాయకుని మాటకు మాత్రం విలువుంటుందా? అన్నీ కబుర్లే. తీర్మానాల వల్లనే అన్నీ అయితే కామరాజ్ తీర్మానాన్ని కాంగ్రెస్ ఏనాడో పాటించి పదిమందికీ పరమాదర్శమయ్యేది. ఇప్పుడు అంతో ఇంతో ఆ బాటలోనే "ఆ తానులోని పీలిక"గానే "దేశం"కూడా నడుస్తోంది. ఇది "దేశం''లో కామరాజ్ ప్లాను. కేవలం చేతులెత్తడమే ఎన్నికకుగానీ, తీర్మానం ఆమోదానికిగానీ పరిపూర్ణతను సాధించిపెట్టదు. నామమాత్రపు చర్చను కూడా చంపితే మిగిలేవి జీవచ్ఛవాలు మాత్రమే!.

సోమవారం, మే 29, 1989

## ఎడాపెడా - చెడామడా (2)

జనాకర్షక (పాపులిస్టు) నినాదాలకూ, పథకాలకూ సూత్రధారి ఒకడు ఏనాడో ఖండాంతరాల్లో పుట్టి పెరిగాడు, అతడే హిట్లర్. భారత యూనియన్‌లో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల నేతలకు అతను అనుకోకుండానే ఈ విషయంలో అవసరం కొద్దీ "గురుతుల్యుడు" కావడం ఆశ్చర్యకరం! అతడివ్వని నినాదం లేదు. ప్రకటించని పథకం లేదు. చేయని వాగ్దానం లేదు. యువతను ముందుకు నడపడానికే "నడుంకట్టా"నన్నాడు. నిరుద్యోగం తుడిచిపెడతానన్నాడు. నిప్పూ, నీరూ, గాలి సమంగా పంచుతానన్నాడు. "సమతా సిద్ధాంతం" తన సామవేదం అన్నాడు. ఇంటిల్లిపాదికీ కనీసం ఒకడి చొప్పున అయినా ఉపాధి కల్పిస్తానన్నాడు. నేషనల్ సోషలిజమే తన ధ్యేయమన్నాడు. ఒక్క ముక్కలో - "అరచేతిలోనే వైకుంఠం" అన్నాడు. అలాగే అధికారంలోకి వచ్చాడు. ఎప్పుడు ఎవరిని కాపీ కొడతారో చెప్పలేము. 'ఎమర్జన్సీ'లో ఇందిరాగాంధీ ప్రకటించిన "25 సూత్రాల"కు (ఇందిరవి 20 సూత్రాలు, సంజయ్‌గాంధీవి ఐదు సూత్రాలు) ఆధారం 1925లో మ్యూనిక్‌లో హిట్లర్ నేషనల్ సోషలిజం పేరిట ప్రకటించిన 25 సూత్రాలే అంటే చాలా మంది విస్మయపడతారు!! అందులో లేనిది ఇందులో లేదు. ఈ కాపీకి మూలవిరాట్టు దేవకాంత బారువా. అయినా ఆ క్షణానికి పని కావాలి. క్షణిక ప్రయోజనం, అంటే "పాపులిస్టు" నినాదాలకు కాళ్ళు తేవాలి, తెప్పించారు. అలాగే ఈ రోజున కూడా జరుగుతోంది. పాలకపక్షాలకు దేశం లేదా రాష్ట్రాల ఆర్థిక వనరులతో సంబంధం లేదు. పూటకు 'తికాణా'లేకపోయినా 'బిచాణా'ఎత్తడానికి సిద్ధంగా ఉన్నా అధికారం కోసం ఖజానాలకు 'బొక్క' పొడుస్తూనే ఉన్నారు. చాలకపోతే ప్రజల 'జేబు' కొడుతున్నారు. దొంగలెవరో కారు, దొరలే. 'దేశం' ప్రభుత్వం రాష్ట్రంలో ఏర్పడక ముందు "రెండు రూపాయలకే కె.జి. బియ్యం", జనతా వస్త్రాల పథకాన్ని కాంగ్రెస్ సిద్ధం చేసి ఉంది. దానిని కాపీ కొట్టింది ఎన్టీఆర్. బడిపిల్లలకు ఉచిత మధ్యాహ్న భోజన పథకాన్ని తమిళనాడునుండి కాపీ కొట్టిందీ ఎన్టీఆర్ అయినా మధ్యలోనే మునిగిపోయింది. తిరిగి మండల వ్యవస్థను అరువు తెచ్చుకొన్నది కూడా కర్ణాటకనుంచే. పంచాయితీబిల్లు కర్ణాటకకు అనుకరణే. అందరూ "గురువింద గింజ"లే. అయినా ఆ విషయం చెప్పకుండా ఒకరినొకరు (కేంద్రం రాష్ట్రాన్ని, రాష్ట్రం కేంద్రాన్ని) దెప్పి పొడుచుకుంటున్నారు. అధికారంలో అలసట ఉండదు! తాజాగా కేంద్రం ప్రతిపాదించిన "పంచాయితీ బిల్లు" కూడా జనాకర్షక పథకమే. రాష్ట్రాల అధికారాలను హరించడానికి తోడ్పడే కార్యక్రమమేగాని వాస్తవ పరిస్థితులతో, వనరుల సాధ్యాసాధ్యాలతో, నిమిత్తం లేని చర్య. ఎందుకంటే, ఈ బిల్లులేకపోయినా, పంచాయితీలు, ప్రజలు బ్రతకగలరు గానీ, మంచినీటి సౌకర్యం, కమ్యూనికేషన్ సౌకర్యాలూ లేకపోతే జీవనం కష్టమౌతుంది. భారతదేశంలోని గ్రామాలలో నూటికీ 75 గ్రామాలకు పోస్టాఫీసు కూడా లేదు. అయినా మన మంత్రులు ప్రతి గ్రామానికీ టెలిఫోన్ అమరుస్తామని 'కోసేస్తున్నారు'. బిల్లు లేకపోయినా పంచాయితీలకు ఎన్నికలు

జరుపుకోవచ్చు. కానీ రాజ్యంగపరమైన నిబంధనను చేర్చి కూడా, ఉచిత ప్రాథమిక విద్యావ్యాప్తికి పట్టినగతే దేశంలో భూ సంస్కరణలకూ పట్టింది.

అస్పృశ్యతను నేరంగా పరిగణిస్తూ రాజ్యాంగ బద్ధమైన నిబంధనను తలనెత్తుకున్నా అది పూర్తిగా అమలు జరగడం లేదు. దేవాలయ ప్రవేశాలకు అడ్డు తొలగి ఉండవచ్చునేమో కానీ, సాంఘికమైన అస్పృశ్యత, అమర్యాదా హరిజనులపట్ల, శూద్రులపట్ల ఇంకా యధేచ్ఛగా సాగుతూనే ఉంది. వెట్టిచాకిరీ శాసనంలో తొలగింది. సామాజికంగా ఇంతింతై ప్రబలింది. పిల్లలను గనులలో, పరిశ్రమలలో పనికి పెట్టకూడదన్న శాసనం ఉన్నా మిశ్రమ ఆర్థిక వ్యవస్థ కల్పించిన తీవ్ర ఆర్థిక అసమానతలవల్ల సామాన్య కుటుంబాల బ్రతుకు తెరువుకు మరో మార్గం లేక ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలను చాకిరీకి, బండచాకిరీకి బలవంతంగా పంపవలసి వస్తోంది. ఈ మాలోకాన్ని పరిష్కరించలేకనే దానికి పక్కవాటుగా జరిగిపోయి అధికారం కోసం "ట్రిమ్రీ" రాజకీయాలకు పాలకపక్షాలు దిగాయి. ఈ 'ట్రిమ్రీ'లే 'పంచాయితీ బిల్లులు, కే.జి. రెండు రూపాయల పథకాలూ. ఇవీ అవీ కాకపోతే కళ్ళ తుడుపుగా ఒకటి రెండు చీరలు, ధోవతులూ. వెనుకటికి ఒక అజ్ఞాత కవి రాసిన మాటలు ఈ సందర్భంగా గుర్తుకొస్తున్నాయిః "దానధర్మాలతో తమరు చేసే కుట్ర దాచుకోవచ్చునని కలిగి నోరిచ్చారు బొచ్చా, దాన్ని కలవారి ఇళ్ళకే తెచ్చా."

ఇప్పుడు నడుస్తున్న చరిత్రకూడా అదే. వాగ్దానాల పరంపరలో ఎన్నికల 'అంబులపొది'నుంచి ఎన్.టి.ఆర్. మరొక అస్త్రం మినీ మహానాడు సందర్భంగా జరిగిన బహిరంగసభలో పైకిలాగారు. ప్రభుత్వ రంగంలో 10 వేలమంది యువకులకు ఉద్యోగావకాశాలు కల్పిస్తామనీ, 5000 మంది ఔత్సాహిక యువ పారిశ్రామిక వేత్తలకు పరిశ్రమల స్థాపనకు అవకాశం కల్పిస్తామనీ, తద్వారా ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ మొత్తం 22 వేల మందికి ఉద్యోగాలు కల్పిస్తామనీ హామీ ఇచ్చారు. ఈ విశ్వరూపాన్ని - కాదు, కాదు, ఈ 'విశ్వామిత్ర సృష్టి'ని నిరక్షరాస్యుల సంఖ్య ప్రబలంగా ఉన్న మన సమాజంలో విశ్వసించగలవారుంటే ఉండవచ్చు. కానీ దేశం ప్రభుత్వం ఏర్పడిన తొలిరోజులలో కూడా ఉద్యోగ పదవీ విరమణకు వయఃపరిమితిని (58 నుంచి 55వరకు) తాను తగ్గించినప్పుడు కూడా ఆయన ఇలాంటి వాగ్దానమే చేసారు. పదవీ విరమణ వయస్సును తగ్గించారంటే అర్థం - ఆ మేరకు నిరుద్యోగులుగా ఉన్నయువకులకు ఉద్యోగాలు కల్పించడమేనని అన్నారు. అది ఎంతవరకు నెరవేరింది? ప్రజలకు నివేదిక లేదు.

అలాగే మరొక పాపులిస్టు నినాదం - 'రోజ్‌గార్ యోజన'. ప్రధాని రాజీవ్ మొదట చెప్పిన రు. 2110 కోట్లనే ప్రణాళికా సంఘం అనుమతించలేదు. ఇప్పుడు దానిని రూ. 2660 కోట్లకు పెంచారు. ఇంత మొత్తాన్ని ఎవరి అనుమతితో పెంచినట్లు? అయినా దేశంలో ఈ ఉపాధి పథకం క్రింద నాలుగు కోట్ల మందికి ఈ డబ్బును పంచితే యేడాదికి తలా ఒక్కంటికీ లభించే మొత్తం రు. 660 మాత్రమే. అంతేకాదు. ప్రస్తుతం అమలులో ఉన్న రెండు పథకాలూ (ఎన్.ఆర్.ఇ.పి.; ఆర్.ఎల్.ఇ.జి.పి) కలిపి కొత్త పేరు - "రోజ్‌గార్ యోజన" అని పెట్టినందువల్ల జరిగిన పెద్ద నష్టం - రాష్ట్రాలకు వస్తున్న పాత కేటాయింపులు తారుమారు కావడం. ఉదాహరణకు పాత స్కీముల క్రింద రాష్ట్రాలకు వచ్చే రు. 60.5 కోట్లు ఇప్పుడు "రోజ్‌గార్" క్రింద 50 కోట్లకు పడిపోతుంది. అలాగే ఆంధ్రప్రదేశ్ రు. 43 కోట్లు, తమిళనాడు రు. 22.5 కోట్లు కోల్పోతాయి. అంటే నాన్-కాంగ్రెస్ రాష్ట్రాల నష్టం, ఆ పైన కేంద్రం ప్రతిపాదించే 18 శాతం బోనస్ వెరసి - కాంగ్రెస్ రాష్ట్రాలకు లాభం చేకూర్చుతాయి. ఒకరికి చేదు, వేరొకరికి తీపి. "పాపులిస్టు" పద్ధతుల వలన ఇంతకంటే అభివృద్ధిని ఆశించడం ప్రజల తప్పు. జనతావారి "అంత్యోదయ" పథకం కంటే వీరెవరివీ మించిన జనాకర్షణ పథకాలు కావు!

మంగళవారం, మే 30, 1989

# ఎడా పెడా - చెడామడా !?

ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి.రామారావు 'దేశం' పార్టీ మహానాడు సందర్భంగా 'వేలాది యువకులకు ఉద్యోగావకాశాలు, 1990 వరకూ కొనసాగించదలచిన రిజర్వేషన్లూ ప్రకటించిన ఇరవై నాలుగు గంటలలోనే ఢిల్లీనుంచి మరొక 'పాపులిస్టు' (జనాకర్షక) ప్రకటన వెలువడింది. షెడ్యూల్డు కులాల వారిపై జరుగుతున్న సాంఘిక దురాచారాల గురించి, అక్రమాల గురించి, ఇందుకు సంబంధించిన కమీషన్ నివేదికలు, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ప్రదర్శించిన నిస్పృహాయత గురించీ ఇంతవరకూ అతీగతీ లేదు. కానీ ఇప్పుడు, అంటే ఎన్నికల సంవత్సరంలోనే జూన్-జూలై మాసాలలోగా "ప్రత్యేక రిక్రూట్‌మెంట్ ఉద్యమం" క్రింద గ్రూప్ 'డి', 'సి', 'బి' పోస్టులకు షెడ్యూల్డు కులాల, తెగల అభ్యర్థులను డైరెక్ట్‌గా రిక్రూట్ చేయాలనీ, ప్రమోషన్లు ఇవ్వదగిన ఖాళీలను భర్తీ చేయాలనీ కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. పైగా సిబ్బంది నియామకశాఖా మంత్రి చిదంబరం చెప్పినట్టు ఈ రిక్రూట్‌మెంటూ, ప్రమోషన్లూ ఇప్పటివి కావు. ఆలనాపాలనా లేకుండా "మూడేళ్ళుగా మూలపడి మూలుగుతున్నవే". ఎందుకిలా జరిగింది? ఈ రిజర్వుడు పోస్టులకు అభ్యర్థులను రిక్రూట్ చేసుకొనే విషయమై ఎలాంటి శ్రద్ధా తీసుకోలేదన్నది కూడా చిదంబర రహస్యమే. అయినప్పుడు ఎవరు దానికి కారకులు? ప్రభుత్వమే అయితే మూడేళ్ళ తరువాత ఆ సమస్య ఇప్పుడెందుకు గుర్తుకొచ్చింది? ఎలక్షన్లు గుర్తుచేస్తున్నాయి కాబట్టి అందుకే ఇలాంటి చర్యలను తాత్కాలిక 'చిట్కా' లంటున్నది! మానవశక్తిని సద్వినియోగం చేయడానికీ, అందరికీ పనులు కల్పించి ఉపాధి అవకాశాలను పెంచడానికీ దీర్ఘకాల ప్రణాళికలు అవసరంగానీ రాజకీయ పార్టీలకు క్షణిక ప్రయోజనాలను తెచ్చిపెట్టే ఇలాంటి "చిట్కా"లు కావు. కేంద్ర మండల కమీషన్ వెనుకబడిన తరగతులకు రిజర్వేషన్లు కల్పించాలని చేసిన సూచనను 1987లో సంక్షోభంలో ఉన్నదశలో ఎన్.టి.ఆర్. ప్రభుత్వం ఆమోదించి ఉద్యోగాలలో, విద్యాసంస్థలలో బి.సి.లకు 50 శాతం రిజర్వు చేయాలని నిర్ణయించింది కూడా ఈ పాపులిజం కోసమేగానీ సమస్య శాశ్వత పరిష్కారం కోసం కాదు. అయితే ఎన్.టి.ఆర్ ఉత్తర్వును నాడు హైకోర్టు కొట్టివేసింది. కానీ ఆ తీర్పును సుప్రీంకోర్టులో ప్రభుత్వం సవాలు చేయకుండా తెలివిగా వూరుకుంది. ఎందుకని? బి.సి.లకు దేశం ప్రభుత్వం దూరం కాకూడదు, అదే సమయంలో తాను ఆదేశించినట్టు కనిపించిన రిజర్వేషన్లు అమలులోకి రాకూడదు. గత రెండేళ్ళుగా జరుగుతున్న 'నాటకం' కూడా ఇదే. కానీ ఎన్నికలు తన్నుకొని వస్తున్నాయి కాబట్టి రిజర్వేషన్‌లకు మళ్ళీ రెక్కలొచ్చాయి. ఈసారి పదేళ్ళ వరకూ కనీసం కాగితాల మీదనైనా అలా వుండిపోతాయి. ఈలోగా ఎన్నికలు పూర్తి అవుతాయి. ఎప్పటికప్పుడు రిజర్వేషన్ల పొడిగింపును బి.సి.ల వాస్తవ అవసరాలను బట్టిగాక ఎన్నికలలో పార్టీల జయాపజయాలపై ఆధారపడి ఉండేటట్టు చేస్తున్నారు. కుల మతాలను,

వెనుకబాటుతనాన్ని సంస్థాగతం చేసి, సమాజాన్ని ముక్కలుగా చీల్చి, ఆలోచనలో వెనుకబాటు తనాన్ని ప్రోత్సహిస్తున్నారు. కేవలం రాజకీయ స్వార్థం కోసం పోటాపోటీలుపడి ముందు తరాలను కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు బందీలుగా చేస్తున్నాయి. ఆర్థిక పరిస్థితులు ఆధారంగా నిర్ణయం కావలసిన పౌరుల వెనుకబాటుతనాన్ని కులకుంచంతో కొలిచి నిర్ణయిస్తున్నారు.

అలాగే కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ నాయకులు నిధుల మళ్ళింపు గురించి పరస్పరం చేసుకొంటున్న ఆరోపణలు కూడా 'పాపులిస్టు' నినాదాల కోసమేనని చెప్పాలి. రాష్ట్ర కాంగ్రెస్‌కు చెందిన ఒక ఉపాధ్యక్షుడు "కొన్ని కాంగ్రెస్(ఐ) ప్రభుత్వాలు సహా రాష్ట్ర ప్రభుత్వాలు స్కీములను ఉద్దేశించిన పథకాలకే కాక ఇతర రంగాలకు మళ్ళించిన" అనేక సందర్భాలున్నాయని ప్రకటించగా, అదే పార్టీక చెందిన మరొక ఉపాధ్యక్షుడు కేంద్రప్రభుత్వ మార్గదర్శక సూత్రాలను తెలుగుదేశం ప్రభుత్వం ఉల్లంఘించి, కేంద్ర పథకాలకు ఉద్దేశించిన నిధులను దుర్వినియోగం చేసిందని చెబుతున్నాడు. ఒకే పార్టీకి చెందిన ఇద్దరు నాయకుల ప్రకటనలలో దేన్నినమ్మాలి. అంతేగాదు. ఇతర రంగాలకు ఈ నిధుల మళ్ళింపు గురించి కంప్ట్రోలర్ - ఆడిటర్ జనరల్ వివరించారని తమ వాదనకు అనుకూలంగా ఉదాహరించిన స్థానిక నాయకుడు - అదే కాంట్రోలర్ జనరల్ బోఫోర్స్ శతఘ్నుల కొనుగోలు గురించి, పబ్లిక్ అకౌంట్స్ కమిటీ జనరల్ సబ్ మెరీన్ల కొనుగోళ్ళ కుంభకోణం గురించీ సమర్పించిన నివేదికలలోని అంశాలను కూడా ఎందుకు బయట పెట్టరు? అందుకే ఈ విచిత్ర విన్యాసాలను "పరస్పరాహరణోద్యోగం" అన్నారు. నిజాయితీ, చిత్తశుద్ధి కొరవడినప్పుడు, ఎవరి తప్పులు వారికి తెలియవు. వీరు వోటర్లకు దొరికిపోయేది కూడా అప్పుడే. అయితే వోటర్లలో అక్షరాస్యత పెరగనంత కాలం 'పాపులిస్టు'నినాదాలూ తగ్గవు. మోసపూరిత ప్రకటనలూ తగ్గవు.

అంతేకాదు. కోర్టు తీర్పులను కూడా పాపులిస్టు నినాదాలకే వీరు బలిచేస్తారు. కనీసం 20 సందర్భాలలో న్యాయస్థానాలు చెప్పిన తీర్పులను ముఖ్యమంత్రి శిరసావహించకపోవడం - "ఆరుకోట్ల ప్రజలు" తనకు వద్దని సలహా చెప్పటంవల్ల కాదు. ఆ పేరుతో 'బండి'ని దొర్లించుకుపోవచ్చునని వేసిన చిట్కా! అలాగే గత రెండేళ్ళుగా బోఫోర్స్ చెక్ పిస్టల్స్, జర్మన్ సబ్ మెరీన్స్, ఫెయిర్ ఫాక్స్ ఫాడర్ (దాణా) యంత్రాల దిగుమతులకు చెందిన కుంభకోణాలు దేశాన్ని కుదిపివేసినా, నాయకులకు చీమకుట్టకపోవడం ఈ దేశంలో కాబట్టి సరిపోయింది. 'పాపులిస్టు' నినాదాలు, నిరక్షరాస్యులైన వోటర్లపై ఎంతటి సమ్మోహనాస్త్రాలుగా పనిచేస్తున్నాయో ఢిల్లీనుండి హైదరాబాద్‌వరకు జరుగుతున్న పనులు నిరూపించడం లేదా?

బుధవారం 31 మే, 1989

# జాతీయ ప్రభుత్వ స్థాపన: వి.పి. భావన

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో బ్రిటన్‌లో అన్ని రాజకీయ పక్షాలతో కలిసివున్న జాతీయ ప్రభుత్వం (నేషనల్ గవర్నమెంట్ లేదా నేషనల్ కొయిలిషన్) ఏర్పరచవలసి వచ్చిన సందర్భంగా విన్‌స్టన్ చర్చిల్ అన్నాడు: "ఎంతసేపూ గత ప్రభుత్వం తప్పిదాలను ఆడిపోసుకుంటూ వర్తమానం తీర్పరిగా వ్యవహరించదలచితే, దేశం (బ్రిటన్) రేపటి రోజునే చూడలేదు. భవిష్యత్తు ఉండబోదు." అన్నాడు. అంతేకాదు, రాజకీయ రణగొణధ్వనులలో, ఆర్భాటాలలో మునిగి తేలుతూండేవారికి "రాజకీయ నాటకాలు (పొలిటికల్ డ్రామాస్) చాల ఉద్రేకభరితంగా, ఉల్లాసభరితంగా" ఉంటాయని కూడా ఆయన అన్నారు. నేడు భారతదేశంలో ఆవిష్కరించుకుంటున్న పరిణామం కూడా చర్చిల్ జోస్యాన్ని మరోసారి రుజువు చేసేదిగా ఉంది. నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం నాయకుడూ, ప్రధానమంత్రి వి.పి.సింగ్ మలేసియా పర్యటనానంతరం ఢిల్లీ తిరిగివస్తూ విమానంలో జరిపిన పత్రికా గోష్ఠిలో రానున్న పరిణామాలపై వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలు దేశ రాజకీయాల్లో సరికొత్త సంచలనానికి బీజాలు నాటుతున్నాయి. అటు మిత్రపక్షాలలోనూ, శత్రుపక్షంలోనూ కూడా అవి సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తగలవిగా ఉన్నాయి. జాతినెదుర్కొంటున్న ప్రధాన సమస్యలన్నింటిపైన "స్థూలమైన ఏకాభిప్రాయంతో" (కాన్సెన్‌సస్) ప్రభుత్వం ముందుకు సాగుతుందనీ, తనది మైనారిటీ ప్రభుత్వం అన్న స్పృహ కోల్పోని వి.పి.సింగ్ ఇప్పటివరకూ చెబుతున్నారు. ఇంతవరకూ వి.పి. "కాన్సెన్సస్ థీరీ"వరకే పరిమితం అయ్యారనుకుంటున్నాం. కాని ఆయన దేశానికి "జాతీయ ప్రభుత్వం" ఏర్పాటు అవసరం గురించి ప్రస్తావించడం ఇదే మొదటిసారి, అంతగాదు, తన పదవీ విరమణ జాతీయ ప్రభుత్వ స్థాపనకు దారితీసే పక్షంలో ఆ సదభిప్రాయాన్ని కూడా తాను తలదాల్చుతానని వి.పి. ప్రకటించడం కూడా ఇదే మొదటిసారి. అలాగే "సమస్యలపై అందరి స్థూలాభిప్రాయం" పై అధారపడే ఫ్రంట్ మైనారిటీ ప్రభుత్వం వ్యవహరిస్తుందని ప్రధానిగా పదవీ బాధ్యతలు స్వీకరించినప్పటినుంచీ ఆయన పదే పదే చెబుతున్నప్పటికీ, గత వారం - పది రోజులుగా మాత్రం 'పధవి ముఖ్యం కాదు, సూత్రబద్ధమైన పరిపాలన, ప్రజా సంక్షేమం' ప్రధానమన్న భావనను ఆయన ప్రతిపాదిస్తున్నారు. పైగా ఈ భావాలకు తోడు, జనతాదళ్, కాంగ్రెస్ (ఐ), మార్క్సిస్టు పార్టీలతో కలిసి "జాతీయ ప్రభుత్వాన్ని" ఏర్పరచాలనీ, అందులో బి.జె.పి.ని మినహాయించాలని భారత రాజకీయాలలో "శకుని మామలు"గా ప్రసిద్ధిపొందిన చంద్రశేఖర్, మధులిమాయేలు చేసిన రహస్య ప్రతపాదనను మార్క్సిస్టు పార్టీ పొలిట్ బ్యూరో ప్రముఖుడు హరికృష్ణ సింగ్ సూర్జిత్ మహా ప్రసాదంలా స్వీకరించి పార్టీ కేంద్ర కమిటీ సమావేశానికి ప్రతిపాదించాడనీ, తద్వారా ఇప్పుడున్న నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వాన్ని బద్దలుకొట్టే

పాత్రను మార్క్సిస్టు పార్టీకి అప్పగించడం సబబనీ "శకుని మామలు" తలంచారనీ ఒక వార్త వచ్చింది. ఈ వార్తను చాల ఆలస్యంగా సూర్జిత్ ఖండించినా, బి.జె.పి.ని మినహాయిస్తే జాతీయ ప్రభుత్వంలో మార్క్సిస్టులు చేరడానికి అభ్యంతరం ఉండనక్కరలేదన్న భావనను ఆమోదించినట్టే అయింది. కాని మధులిమాయే మాత్రం తనలాంటి ప్రతిపాదన చేయలేదని ఖండించకపోగా, ఒక ప్రసిద్ధ ఆంగ్ల దినపత్రికలో "జాతీయ ప్రభుత్వ" స్థాపనకు సుముఖత వెలిబుచ్చడంతోపాటు ఇందుకోసం మధ్యంతర ఎన్నికలు (బహుశా వచ్చే ఏడాదిలో) జరపడం భావ్యమనీ, సంభవమనీ ప్రతిపాదించారు. ఇటీవల మేహం సంఘటనలు, కాశ్మీర్, పంజాబ్ సమస్యలపై జనతాదళ్‌లో తలెత్తిన సంక్షోభంవల్లగానీ, ఎన్నికల ప్రణాళికలో వాగ్దానం చేసినట్టు నిత్యావసర సరకుల ధరవరలను అదుపు చేయడంలో ఫ్రంట్ ప్రభుత్వం ఘోరంగా విఫలమవుతున్నందువల్లగానీ, వి.పి.సింగ్ మైనారిటీ ప్రభుత్వం మనుగడ అడుగడుగునా ప్రశ్నార్థకమవుతోంది. మైనారిటీ ప్రభుత్వం పరిమితులు వి.పి.కి తెలిసినందునే, ఇటీవల తరచుగా ఆయన వ్యక్తి నిష్ఠమైన రాజకీయాలకంటే, సమస్యలు పునాదిగా రూపుదిద్దుకొనే రాజకీయాలకే ప్రాధాన్యం ఇవ్వాలని నిర్ణయించుకొని ప్రతిదానికీ "కాన్సెన్సస్" సూత్రాన్ని ప్రతిపాదిస్తూ, సమస్యలతోపాటు పరిష్కారాలను కూడా వాయిదా వేస్తున్నారు. ఈ దాటవేత ఫలితంగానే - హరిజన గిరిజన సమస్యల పరిశీలనా సంఘానికి సాధికారమైన రాజ్యాంగ ప్రతిపత్తి కల్పిస్తూ ఒక బిల్లును, భూ సంస్కరణల చట్టాలను కోర్టు లిటిగేషన్ నుంచి తప్పిస్తూ, రాజ్యాంగం తొమ్మిదవ షెడ్యూల్‌లో చేర్చుతూ ఒక బిల్లునూ ప్రవేశపెట్టి సభవారిచే జయప్రదంగా ఆమోదింప జేసుకొన్నప్పటికీ, వాటి విలువ కన్పించడంలేదు. ఈ పరిస్థితులలో చంద్రశేఖర్ - మధులిమాయే బృందం ఫ్రంట్ ప్రభుత్వ విచ్ఛిత్తికి మార్గం తీస్తూ మరిన్ని ఆటంకాలు కల్పించడానికి ఉద్యుక్తులయిన దశలో, బాధ్యతల నుంచి క్రమంగా దూరం కావడానికి ఒక సాకు కోసం ఎదురుచూస్తున్న వి.పి.కి. "జాతీయ ప్రభుత్వ" స్థాపన ప్రతిపాదనకు సుముఖత వ్యక్తం చేయవలసి వచ్చింది.

"జాతీయ ప్రభుత్వం" ప్రతిపాదనను వ్యక్తం చేయడంలో కూడా వి.పి. కొత్తపుంతలు తొక్కారు. గాంధీజీ సూత్రాలకు ఆయన దగ్గరగా జరుగుతున్నట్టు తోస్తోంది. స్థూలమైన ప్రజా బాహుళ్యపు అభిప్రాయం తప్ప - నేషనల్ కాన్సెన్సస్ తప్ప - వేరే "గాంధీయిజం అంటూ లేద"ని 1936లోనే గాంధీజీ చాటారు. "మనుధర్మశాస్త్రం"లాగా "నేను ప్రత్యేకించి ఓ ధర్మ సూత్రాన్ని" రచించిపోవాలని తనకేమీ లేదని కూడా గాందీజీ పేర్కొన్నారు. అంతేగాదు, దేశ స్వాతంత్ర్యం తర్వాత ఒక ప్రకటన చేస్తూ గాంధీజీ, రాజకీయ స్వాతంత్ర్య సమరంలో అన్ని రాజకీయ పక్షాలూ, అనేక సంస్థలూ భాగస్వాములు కాబట్టి కాంగ్రెస్ పార్టీని రద్దుచేసి, జాతీయ ప్రభుత్వం ఏర్పాటుచేసి సకలపక్ష సమ్మతంగా సంక్షేమ రాజ్య వ్యవస్థను నిర్మించుకోవాలని ప్రతపాదించారు. ఈ సూచనను ఆ తర్వాత దఫదఫాలుగా, నిన్న మొన్నటిదాకా కాంగ్రెస్ సీనియర్ నాయకుడు ప్రొఫెసర్ ఎస్.జి.రంగా కూడా చేస్తూ వచ్చారు. ఎందుకని? ప్రజా బాహుళ్యం సంక్షేమానికి తోడ్పడగలది సర్వోదయ సమాజమేగాని, మెజారిటీ పేరిట అధికారంలోకి వచ్చి నూటికి సగభాగంపైన పెత్తనం చేయజూచే పార్టీ వ్యవస్థ కాదని గాంధీజీ విశ్వాసం. కనుకనే ఆయన రస్కిన్ రాసిన "అన్ టుది లాస్ట్" పుస్తకాన్ని అంత్యోదయ దీపికగా భావించి, గుజరాతీ భాషలోకి అనువదించినప్పుడే భారతదేశానికి కావలసింది ఒక పార్టీ వ్యవస్థ కాదనీ, "జాతీయ ప్రభుత్వం" మాత్రమేనని చాటాడు. లోకనీతికి రాజనీతి లొంగి ఉండాలంటే, రాజకీయాలు కేవలం సేవా సాధనంగానే ఉండాలిగానీ, అధికార సాధనంగా

కొనసాగడానికి వీలులేదు. ఇదీ, ఆయన ఆదర్శం. పార్టీ వ్యవస్థ ప్రజల్లో చీలికలు తెస్తుంది, గ్రూపులను పెంచుతూ కుట్రలకూ, మెజారిటీ నిరంకుశత్వానికీ, మైనారిటీల అణచివేతకు లేదా చిన్న చూపునకూ పునాదులు వేస్తుందని గాంధీజీ విశ్వాసం. బహుశా ఈ ఉద్దేశంతోనే వి.పి. తన పాత ధోరణిని సవరించుకొని, "జమ్ము-కాశ్మీర్, పంజాబ్ సమస్యలకు పాత ప్రభుత్వమే (కాంగ్రెస్-ఐ) కారణమని పదే పదే నిందించాలని తాను వాంఛించలేద"ని చెప్పి ఉంటారు. నిజానికి ఫ్రంట్ ప్రభుత్వం ఏర్పడక ముందే కాదు ఆ తరువా కూడా ఈ సమస్యలు తలెత్తినప్పుడల్లా లేదా వాటిపై కాంగ్రెస్ విమర్శలు చేసినప్పుడల్లా - రాజీవ్ ప్రభుత్వాన్ని వి.పి. ఆడిపోసుకుంటూనే వచ్చారు. అది వేరు సంగతి. కానీ ఇప్పుడు వి.పి. ధోరణి మారింది. అవసరాన్నిబట్టి ఉత్తరోత్తరా దేశంలో ఏర్పడే "జాతీయ ప్రభుత్వం"లో కాంగ్రెస్(ఐ) చేరడానికిగానీ, లేదా రాజీవ్ ఉండడానికిగానీ ఆయన అభ్యంతరం చెప్పడంలేదు. "ఈ దేశం ఏ ఒక్క వ్యక్తి పైననో ఆధారపడి లేదు. దేశ భవిష్యత్తును ఒక వ్యక్తి చేతులలో ఉంచడమంటే దేశానికి తీవ్రమైన నష్టాన్ని చేకూర్చడమే. సంక్షేమ నిబద్ధతతో దేశ సమస్యలపై ఏకాభిప్రాయ సాధన ద్వారా కార్యాచరణకు దిగినప్పుడు కార్యక్రమానికి తప్ప వ్యక్తికి ప్రాధాన్యం ఉండదు. ఆ వ్యక్తి ఉన్నా ఊడినా దేశానికి నష్టం లేదు." ఈ ఘడియలో ఈ నీతి బాగుంది. మరి రేపటి ఆచరణ చూడాలి!

గురువారం 7 జూన్, 1990

# జాతీయ ప్రభుత్వ స్థాపనః వి.పి. భావన (2)

విశ్వనాథ ప్రతాప్‌సింగ్ ప్రధానమంత్రిగా ఉన్న ప్రస్తుతపు "నేషనల్ ఫ్రంట్" ప్రభుత్వం స్థానే బి.జె.పి.ని మినహాయించి "జాతీయ ప్రభుత్వం" ఏర్పరచాలన్న చంద్రశేఖర్ - లిమాయే ప్రతిపాదన అంతటితో సరిపెట్టుకోలేదు. ఏర్పడే "జాతీయ ప్రభుత్వం"లో జనతాదళ్ నాయకుడు వి.పి.సింగ్‌ను, కాంగ్రెస్(ఐ) అధ్యక్షుడు మాజీ ప్రధాని రాజీవ్‌గాంధీని కూడా మినహాయించి, పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి జ్యోతిబసును ప్రధానమంత్రిగా ప్రతిపాదించాలన్నది వారి ఆలోచన. ఇప్పుడున్న ఫ్రంట్ ప్రభుత్వం పైకి మిశ్రమ ప్రభుత్వంగా కన్పించినా, జనతాదళ్‌దే పెత్తనం అంతా. అయితే ఫ్రంట్ భాగస్వామ్య పక్షాలుగా బయటనుంచి వి.పి. ప్రభుత్వానికి మద్దతునిస్తున్న బి.జె.పి.గానీ, మార్క్సిస్టులుగానీ ఇంతవరకు ఫ్రంట్ ప్రభుత్వంలో చేరడానికి సిద్ధపడడం లేదు. తూర్పు యూరప్ పరిణామాలనుంచి కూడా గుణపాఠం నేర్చుకోని మార్క్సిస్టులు, పోలెండ్‌లో చర్చితోనూ, టర్కీలో పచ్చి మితవాదులతోనూ అక్కడి కమ్యూనిస్టు (మార్కిస్టు) పార్టీలు చేతులు కలిపినా సమ్మతిస్తున్న మార్కిస్టులు ఇక్కడ ఫ్రంట్ ప్రభుత్వంలో చేరడానికి జంకుతున్నారు. మరోవైపు నుంచి బి.జె.పి. ఎన్నికల్లో జనతాదళ్ మద్దతుపై అఖండ విజయాలు సాధించినా ఆ వాస్తవాన్ని పక్కకునెట్టి రామ జన్మభూమి - బాబ్రీ మసీదు సమస్యపైన, కాశ్మీర్ గవర్నర్ తొలగింపు సమస్యపైన ఫ్రంట్ ప్రభుత్వంతో అడుగడుగునా పేచీలు పెట్టుకొని, అనుక్షణం వి.పి. మైనారిటీ ప్రభుత్వాన్ని బెదిరిస్తోంది. ఈ పూర్వరంగంలో వచ్చిన "జాతీయ ప్రభుత్వం" ఆవశ్యకత ప్రస్తావన వి.పి. క్కూడా రుచించి ఉండవచ్చు. అంతేకాదు, ఒక ఆంగ్ల దినపత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఉప ప్రధాని దేవీలాల్, ప్రధాని వి.పి.సింగ్‌ను తన పట్ల 'విద్రోహి'గా (మేహంలో బాబూ కొడుకులు కలిసి ప్రజాస్వామ్య విరుద్ధమైన పనులు చేసినా) ప్రకటిస్తూ దండోరా వేయబూనడం కూడా వి.పి. ఆలోచనలో మార్పునకు కారణమై ఉండాలి; అలాగే ప్రతిదీ "కాన్సెన్సస్" పేరిట, సమస్యలకు ఏకైక పరిష్కార మార్గంగా 'వాయిదా' వేయడం వి.పి.కి మైనారిటీ ప్రభుత్వ నాయకునిగా ఉన్న పరిమితులను మరొకసారి గుర్తుచేసినట్టు అవుతోంది. అలాగే, నడుస్తున్న ప్రభుత్వాన్ని కుంటుపడవేయడంలో 'ఉద్దండ పిండాలు' జాతీయ నాయకత్వ స్థానాల్లో ఉండడం దేశ ప్రజల దౌర్భాగ్యం. 1979 'జనతా' ప్రభుత్వాన్ని దించడంలో చరణ్‌సింగ్ పాత్రకు వంతపాడినవారు చంద్రశేఖర్, మధులిమాయేలే. తెప్పదాటేవరకు బోటుమల్లయ్య, ఆ తరువాత బోడి మలయ్య అన్నట్టుగా, అయిదేళ్ళు పాలించి తమకు మంచి పనులు చేయమని ఓటర్లు ఇచ్చిన తీర్పును అగౌరవపరిచే "ప్రజాస్వామ్య" వ్యవస్థలో - మెజారిటీ ప్రభుత్వాలే కాదు, మిశ్రమ మంత్రివర్గాలు కూడా మనజాలవని అనిపిస్తోంది. ప్రపంచ వ్యాపితంగా "ద్విపక్ష వ్యవస్థ" (రెండు పార్టీల) లు కూడా విఫలమవుతున్నాయని బ్రిటన్, అమెరికాల అనుభవం రుజువు చేస్తోంది. ఎవడు ఎన్నికైనా ఆ 50 శాతంలోపు వచ్చే ఓట్లతోనే మెజారిటీ జనం మెడపైన ఎక్కి సవారీ చేయాలి; "దొందు దొందైనా" సరే -

ప్రజలకు మరొక 'ఛాయిస్' లేకుండా ఈ ద్విపక్ష వ్యవస్థే అడ్డుకుంటోంది! అలాగే మిశ్రమ మంత్రివర్గాల విషయం కూడా. బ్రిటన్ ఇందుకు నిదర్శనం. మాజీ ప్రధాని ఆస్క్విత్ తన లిబరల్ పార్టీ పార్లమెంటరీ పక్షం సమావేశంలో ఒకసారి మాట్లాడుతూ - 'మిశ్రమ' మంత్రివర్గంలో ప్రస్తుతానికి ఎవరున్నా, ఆఖరికి పరిస్థితిని అదుపుచేసేది మనమే' నని దండోరా వేశాడు.

జాతీయ సమస్యలపై సంక్షోభకాలంలోనూ, లేదా యుద్ధ కాలంలోనూ ఏర్పడే "జాతీయ ప్రభుత్వాలు" కూడా పడిపోవడం కద్దు. ఎందుకంటే 1931లో లేబర్ ప్రధానిగా మాక్డొనాల్డ్ నాయకత్వాన ఏర్పడిన జాతీయ ప్రభుత్వాన్ని, తనకున్న సంఖ్యాబలంతో కన్సర్వేటివ్ పక్షం అడుగడుగునా శాసించి, ఇబ్బందులపాలు చేసిందని మరువరాదు. బహుశా ఈ అనుభవం దృష్ట్యానే తరువాతి కాలంలో హెరాల్డ్ మాక్మిలన్, డంకన్ శాండీస్ "జాతీయ ప్రభుత్వ" నిర్మాణ పద్ధతిలోనే మార్పు రావాలని సూచించారు. దీని ప్రకారం - రెండు లేదా అంతకుమించిన పక్షాలతో ఏర్పడే సంకీర్ణ ప్రభుత్వానికీ, జాతీయ ప్రభుత్వానికీ స్పష్టమైన తేడాను వారు సూచించారు. సంక్షేమ పథకాలతో కూడిన కనీస కార్యక్రమం ఆధారంగా నిబద్ధతతో పనిచేయగల వివిధ రంగాలలోని ప్రముఖులతో, మచ్చలేని ప్రముఖులతో పార్టీ రాజకీయాలకు అతీతంగా వ్యవహరించగల శక్తులతో జాతీయ ప్రభుత్వం ఏర్పడాలని కోరారు. ఆ పని కొంతమేరకు - వి.పి. క్యాబినెట్ లో ప్రొఫెసర్ ఎమ్.జి.కె.మీనన్, డాక్టర్ రామన్నల నియామకంలాగానే - 1964లో హెరాల్డ్ విల్సన్ క్యాబినెట్ లోనూ, 1970 నాటి హీత్ మంత్రివర్గంలోనూ నెరవేరింది. కాని అది కేవలం పాక్షికం. అది మాక్మిలన్, డంకన్ శాండీస్ ఉద్దేశించిన జాతీయ ప్రభుత్వం కాజాలదు. రెండు పార్టీల వ్యవస్థ మాత్రమే ఉండాలని వాదించే వారికి అమెరికన్ మేధావి మాచింగ్ మరాబ్లే చెప్పినట్టుగా, అమెరికాలో నేడున్నది ద్విపక్ష వ్యవస్థ కాదనీ, కార్మిక వర్గానికి డెమోక్రాట్లు అన్యాయం చేయడంతో కన్సర్వేటివ్‌లు అయిన రిపబ్లికన్‌లే ఇక రంగంలో మిగిలిపోయారు. జాక్సన్ లాంటి నీగ్రో మేధావిని అధ్యక్ష స్థానానికి పోటీ చేయనివ్వకుండా రంగంనుంచి జయప్రదంగా తప్పించగలిగారనీ, ఈ ద్విపక్ష వ్యవస్థ "ప్రజాస్వామ్యా"నికి ఓ పెద్ద అపహాస్య మనీ, వక్రోక్తి అనీ విమర్శించాడు. అందువల్ల ఇక ముందు ముందు వచ్చేవీ, మనగలవీ కనీస కార్యక్రమాన్ని తు.చ. తప్పక అమలుజరపగల బహుళపక్ష ప్రభుత్వాలూ, లేదా జాతీయ ప్రభుత్వాలే గానీ, ఏకపక్ష ప్రభుత్వాలు ప్రజాస్వామ్య వ్యవస్థలకు చేటు తెస్తాయని ప్రపంచ దేశాల అనుభవం రుజువు చేస్తోంది. ఇండియా కూడా ఈ నూతన చరిత్ర రచనకు అంకురార్పణ చేసుకొనక తప్పదనిపిస్తోంది. "బ్రూట్ మెజారిటీ"వల్ల ప్రజాస్వామ్యం నశించి, నియంతృత్వ పోకడలను చవిచూడవలసివస్తే, మైనారిటీ ప్రభుత్వంవల్ల కీలకమైన సమస్యలపై అడుగడుగున ఊగిసలాట వైఖరీ, నిర్ణయాలు చేయలేని 'బృహన్న'ల పాత్ర ఎదురవుతోంది. ఈ అనిశ్చిత వ్యవస్థనూ, సమస్యలను ఎదుర్కొని పరిష్కరించకుండా దాటవేసే తత్వాన్నీ, నిర్ణయాలను వాయిదా వేసుకొనే మనస్తత్వాన్నీ బ్రిటన్‌లో "బట్‌స్కెలిజం" (లేబర్ నాయకులు బట్లర్, గైట్‌స్కెల్ వ్యవహరించిన తీరునుబట్టి ఆ పేరు వచ్చింది) అన్నారు. బ్రిటీష్ రాజ్యాంగాన్ని కాపీకొట్టిన మనకు పాలనా పద్ధతులు కూడా దిగుమతి కావడంలో ఆశ్చర్యం లేదు! అయితే బ్రిటన్‌లో రెండు ప్రపంచ యుద్ధ కాలాలలోనూ లాయిడ్ జార్జి, మాక్డొనాల్డ్, చర్చిల్ నాయకత్వాలలో ఏర్పడిన "జాతీయ ప్రభుత్వాలు" మాత్రం ఒడదుడుకులు లేకుండా దేశ రక్షణకు, ప్రజాబాహుళ్య సంక్షేమ పథకాలకూ న్యాయం చేకూర్చినవేగాని, జాతీయ ప్రయోజనాలకు విరుద్ధంగా నడుచుకున్నవి కావు. భారత ప్రధాని వి.పి. కూడా జాతీయ ప్రభుత్వ స్థాపనకు సుముఖంగానే ఉన్నందున సరిహద్దులలో ఉద్రిక్తతవల్ల, కాశ్మీర్-పంజాబ్ సమస్యలు మరింత జటిలమవుతున్నందువల్ల నింపాదిగానైనా మధ్యంతర ఎన్నికలను అభిలషించవచ్చునేమో!

శుక్రవారం 8 జూన్, 1990

# భారత 'ప్రజాస్వామ్యం' : "మేహ" రోగం!

మేహం నియోజకవర్గంలో సభ్య ప్రపంచానికి తలవంపులు తెచ్చే అరాచక పరిస్థితులు ఏర్పడిన ఫలితంగా హర్యానా ముఖ్యమంత్రి పదవినుంచి ఓమ్ ప్రకాష్ చౌతాలా తప్పుకోవాలని అటు నేషనల్ ఫ్రంట్ మంత్రిమండలి, ఇటు ఫ్రంట్‌లోని ప్రధానపాలక పక్షమైన జనతాదళ్ రాజకీయ వ్యవహారాల మండలి చేసిన నిర్ణయం ఆలస్యంగా జరిగినా, హర్షించదగిన పరిణామం, ఇంత మాత్రాన ప్రజాస్వామిక విలువలపై జనతా దళ్‌కు పూర్తి విశ్వాసమున్నట్లుగా మనం నమ్మలేకపోయినా ఈ నిర్ణయం ఆహ్వానించదగ్గది. భారత ప్రజాస్వామ్య వ్యవస్థను నిర్వీర్య పరచడంలో, నీరసింపజేయడంలో, ప్రజాస్వామ్య విలువలను ధ్వంసం చేయడంలో దాదాపు అన్ని రాజకీయపక్షాలూ తలా ఒక చేయివేసినందువల్లనే ఎన్నికల పేరిట నానాటికీ దౌర్జన్యాలు, హత్యలూ పెరిగిపోతూ వచ్చాయి. 1989 పార్లమెంటరీ ఎన్నికల సందర్భంగా డజన్లకొలదీ కార్యకర్తల, అభ్యర్థుల హత్య, బూత్‌ల అపహరణ, పోలింగ్‌లో హింసాకాండ ఇందుకు పరాకాష్ట. అమేథీ (రాజీవ్ నియోజకవర్గం) పోలింగ్ సందర్భంగా జరిగిన హింసాకాండ, రీపోలింగ్, ఎన్నికలలో మన చిత్తశుద్ధికి సవాలుకాగా, గాయపడిన ప్రజాస్వామ్యానికి అదొక నిదర్శనం కాగా, (సంజయ్‌సింగ్ - నాటి క్షతగాత్రుడు) మేహం నియోజకవర్గం ఉప ఎన్నికలో ఫిబ్రవరినాటి దౌర్జన్యకాండ, అరాచకం ప్రజాస్వామ్యాన్నే హత్య చేసింది. ఒక స్వతంత్ర అభ్యర్థిని మే 16న హతమార్చడంద్వారా అన్నివిలువలనూ కాలదన్ని ఎన్నికలలో "ఘన విజయం" సాధించాలని చూసింది.

ఒకటి ప్రజాస్వామ్యంపై హత్యాప్రయత్నం, రెండవది హత్య. వెరసి - భారత ప్రజాస్వామ్యం ఆత్మహత్య. ఈ హత్యా రాజకీయాలను మార్చడానికి అనువైన సంస్కరణలను భారత రాజ్యాంగ నిర్ణేతలు ఊహించి ఉండలేదు. కాని ఈ రోజుకీ "ఇల్లు కాలుతుండగా బొగ్గులు ఏరుకొనే" బాపతు మన రాజకీయపక్షాలలో ఉన్నందున, "మేహ" రోగంతో ఉడుకెత్తుతున్న భారత ప్రజాస్వామ్యానికి శాశ్వత రక్షణోపాయాలు కనుగొనకుంటే "రాష్ట్రపతి పాలన" కావాలన్న పేరుతో స్వార్థ రాజకీయాలకు మళ్ళీ చోటిస్తున్నారు. తద్వారా ఒక ముఖ్యమంత్రి నిరంకుశుడుగా మారి, ఏలినాటిశనిగా తయారైనప్పుడు అతణ్ణి వదిలించుకునే బదులు మొత్తం ఓటర్లు అందరినీ శిక్షించడానికి, శాసనసభా ప్రతిపత్తిని కించపరచడానికి ప్రయత్నిస్తున్నారు. ఇందుకు అప్పనంగా దొరికిన రాజ్యాంగ "అధికరణ 356"ను స్వేచ్ఛగా వాడకంలోకి తెచ్చి ఓటర్ల పీకనొక్కజూస్తున్నారు. హర్యానాలో "ప్రజాస్వామ్య హత్య"కు సమాధానం రాష్ట్రపతిపాలన కాదు. అపమార్గాలు పట్టిన ముఖ్యమంత్రినీ, అతడి క్యాబినెట్‌నూ రద్దుచేసి, హర్యానా జనతాదళ్ శాసనసభాపక్షం చౌతలా స్థానే మరొక నాయకుణ్ణి ఎంపిక చేసుకోవడానికి అవకాశం కల్పించడం. ఎందుకంటే, కడచిన నలభై ఏళ్ళలో యాభైసార్లకుపైగా ఏదో ఒక మిషపైన రాష్ట్రపతి పాలనను అనేక

రాష్ట్రాలలో విధించి, వోటర్లనూ, ఎన్నికైన శాసన వేదికలనూ అవమానాలపాలుజేస్తూ వచ్చారు. ఇప్పుడు చౌతలా - మేహం, దర్బాకాలన్ నియోజకవర్గాలలో దేనినుంచి ఎన్నిక కావాలా అన్నది సమస్య కాదు. ప్రజలకు సంబంధించినంతవరకు అతను అభ్యర్థి కాదు, ఒక మనిషీ కాదు. అసలు ప్రధాని వి.పి.సింగ్ ఆదినుంచీ సమర్థవంతంగా వ్యవహరించి ఉంటే, ఫిబ్రవరిలో మేహం కల్లోలంనాడే వొట్టి రీపోలింగ్‌కు కాకుండా, చౌతలా రాజీనామాకోసమే వత్తిడిచేసి ఉంటే మే 16న ఇండిపెండెంట్ అభ్యర్థి అమీర్‌సింగ్ హత్యను తప్పించే పని. ఇప్పుడు మేహంలో ప్రజాస్వామ్య విలువల రక్షణ అన్నది - కేవలం న్యాయవిచారణవల్లనే (కాంగ్రెస్-ఐ కూడా కోరింది న్యాయ విచారణే) సమకూడదు. దేశ ఉప ప్రధాని దేవీలాల్ కొడుకూ, హర్యానా ముఖ్యమంత్రి అయిన చౌతలా పదవీచ్యుతుడు కావడమేకాక రాజకీయాలనుంచే నిష్క్రమిస్తే తప్ప కొన్ని విలువలయినా మనకు దక్కవు. ఈ సందర్భంగా వి.పి.సింగ్ చేయవలసింది దమ్ములుంటే 'మేహం' ఉప ఎన్నికలో గెలిచి బయటపడమని చౌతాలాను సవాలు చేయడం కాదు. 'నీవు గద్దెదిగిపో' అని చాటగలగాలి. రాజకీయాల్లో పెద్దమనిషి తనానికి అర్థం అమసమర్థత కాదు. "నాయకుల పబ్లిక్ జీవితం ఏవేవో విచారణలతోనూ, ప్రభుత్వ చర్యలతోనూ ముగిసిపోయే లాంఛనం కాదు, తతంగం కాదు. అంతకంటే విలువైనది పబ్లిక్ జీవితం" అని వి.పి. మాటగా చెబితేనే చాలదు. తప్పు చేసినవాడిని, అరాచకానికి కేంద్ర బిందువుగా వున్నవాడినీ పేరుపెట్టి శరించవలసిన అవసరం ఉంది.

రాష్ట్రపతి పాలనా పద్ధతిలో కాంగ్రెస్ (ఐ) ఆరితేరగా, జనతాదళ్ కూడా రాజకీయంగా తక్కువ తినలేదు. "నైతిక విలువల" గురించి పదే పదే ప్రస్తావిస్తున్న జనతాదళ్ నాయకులు కాంగ్రెస్ పాఠాలనే వొంటిబట్టించుకొని గోవా, నాగాలాండ్‌లలో "ఫిరాయింపుల"ను ప్రోత్సహించి, నడుస్తున్న ప్రభుత్వాలను పడగొట్టడానికి వాతావరణం కల్పించారు. అలాగే ఈ సాంప్రదాయానికి అనుగుణంగా కాంగ్రెస్ (ఐ) ఉద్దేశంలో హర్యానా పరిస్థితులపై గవర్నర్ మంచి నివేదిక కోసం కూడా వేచి ఉండనవసరం లేదు. అవసరమైతే కాంగ్రెస్ (ఐ) "ఆనవాయితీ" ప్రకారం గవర్నర్‌ను వత్తిడిచేసైనా చౌతాలాపై ఒక నివేదిక తెప్పించి, ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయాలి. ఎందుకీ తొందర? ఉభయులదీ - జనతాదళ్, కాంగ్రెస్ (ఐ) - స్వార్థ రాజకీయమే. కేంద్రంలో మైనారిటీలో ఉన్నప్పటికీ తన అధికారాన్ని సంఘటితం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్న దశలో నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం తమ వర్గానికి చెందిన హర్యానా ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసి, రాష్ట్రపతి పాలనను పెట్టజాలదు. అలాగే మేహం ఘటన ఆధారంగా హర్యానాలో కాంగ్రెస్ (ఐ) బలపడగల అవకాశాలను మరింతగా పెంచుకోవాలంటే, రాష్ట్రపతి పాలన విధిగా ఏర్పడాలని కాంగ్రెస్ నాయకుల తొందరపాటు. అంతేకాదు. "నైతిక విలువల" గురించి మాట్లాడే హక్కు ఈ ఉభయ పక్షాలలో ఎవరికీ లేదనడానికి మరొక ఉదాహరణ - హర్యానాలో రాష్ట్రపతి పాలనను కోరుతూ పార్లమెంటు ఉభయ సభలలో నినదిస్తున్న కాంగ్రెస్ (ఐ) సభ్యులకు సమాధానంగా సమాచార శాఖామంత్రి ఉపేంద్ర సహా పలువురు జనతాదళ్ సభ్యులు "అయితే శాంతిభద్రతలు కొరవడ్డ ఆంధ్రప్రదేశ్‌లో కూడా రాష్ట్రపతిపాలన విధించాల' 'ని అరవడం అసందర్భం, అనాలోచితం. వీరు ఒక "తానులోని బట్టల"యినప్పుడు మాత్రమే ఇలాంటి సామ్యాలు మనకు దొరుకుతాయి. ఈ "కొడుకుల" రాజకీయ ప్రవేశానికి, పరిపాలనా చట్రంలో ఈ కొడుకుల బెడదకూ కాంగ్రెస్ (ఐ) ప్రారంభోత్సవం చేసినట్టే జనతాదళ్ కూడా అదే మార్గంలో ప్రయాణిస్తోంది. పైగా ఫ్యూడల్ సంస్కృతికి ప్రతినిధులయినవారూ, వారి కొడుకులూ రాష్ట్రాలకు రాష్ట్రాలనే తమ జాగీర్లుగా, ఈనాములుగా, ఎస్టేట్లుగా మార్చుకోవడమేగాక, మనుమళ్ళనుకూడా ప్రజలపాలిట "మాంధాత"లుగా

మార్పాలని చూడడాన్ని ఇక సహించరాదు. పాలకుడి కుటుంబపాలనాధికారంకోసం సాగించే వేటలో తలెత్తే తగాదాలు హర్యానా మూల్గులను పీల్చేసినట్టే ఇతర చోట్ల కూడా జరుగుతోంది. భివానీ, హిసార్‌లలో "పేరిగాడి రాజ్యం" సృష్టించిన కల్లోల తరంగాలు "మేహం"లో పెనుతుఫానుగా మారాయి. పోలీసుబలగాన్ని తమ సొంత 'పాలేళ్ళు'గా భావించి 1989 పార్లమెంటరీ ఎన్నికల్లో దేవీలాల్ - చౌతాలా వర్గం వినియోగించుకోబట్టే, రోటక్, మధుబన్‌లలో వందలాదిమంది పోలీసు రిక్రూట్లు తిరుగుబాటు జరుపవలసివచ్చింది. వెరసి వీటన్నింటి ఫలితం - మేహంలో కల్లోలం, రిగ్గింగు, ఇండిపెండెంట్ అభ్యర్థి హత్య, పోలింగ్ రద్దూ. ఈ వాతావరణంలో అమీర్‌సింగ్ హత్యకు ఎవరు కారకులంటే, నిజానిజాలు అంత త్వరగా బయటపడవు. అందుకు కారణం - పోటీలో వున్న అభ్యర్థుల ప్రత్యర్థులే కాదు, పోటీలో లేకపోయినా, అరాచకాన్ని సృష్టించడంద్వారా లబ్ధిపొందజూసే ఇతర శక్తులు కూడా కావచ్చు. ఆ శక్తులు కాంగ్రెస్‌తోపాటు జనతాదళ్‌లో కూడా ఉండవచ్చు!

బుధవారం 23 మే, 1990

# భారత 'ప్రజాస్వామ్యం' : "మేహ" రోగం! 2

మేహం నియోజక వర్గంలో హత్యా రాజకీయాల ఫలితంగా ఫిబ్రవరి, మే నెలల్లో ఏర్పడిన అరాచక పరిస్థితుల పర్యవసానంగా ఎట్టకేలకు హర్యానా ముఖ్యమంత్రీ, దేవాలాల్ కుమారరత్నం అయిన ఓం ప్రకాష్ చౌతాలా మంగళవారంనాడు పదవినుంచి తప్పుకోవలసివచ్చింది. మేహంలోఫిబ్రవరి నాటి ఉప ఎన్నిక సందర్భంగా దౌర్జన్యకాండ మధ్య సాగించిన రిగ్గింగ్ ఫలితంగా కల్లోలం చెలరేగిన నాడే కేంద్ర పరిశ్రమల మంత్రి అజిత్‌సింగ్ (చౌదరీ చరణ్‌సింగ్ కుటుంబానికి, దేవీలాల్ వర్గానికి మధ్య తగాదాల దృష్ట్యానే అయినప్పటికీ) ముఖ్యమంత్రి పదవికి చౌతాలా రాజీనామా ఇవ్వాలని కోరారు. అప్పుడే ఈ పని చేసివుంటే ఇపుడు చౌతాలా అనేక వత్తిడుల మధ్య, మేహం ప్రజల ఆగ్రహ జ్వాలల మధ్య రాజీనామా ఇవ్వవలసివచ్చిన తర్వాత చెప్పుకొంటున్నట్టుగా "క్రమశిక్షణ గల పార్టీ కార్యకర్త"గా హర్యానా లెజిస్లేచర్ పార్టీకే గాకుండా మొత్తం జనతాదళ్ పార్టీచే పేరు ప్రతిష్ఠలు తెచ్చిపెట్టినట్టయ్యేది. కాని అందరు పాలకులూ ఆ చొరవ చూపలేరు, ఆ తెగువ ప్రదర్శించలేరు. ఆ తోవలోనే చౌతాలా కూడా ప్రయాణించారు. పల్టీ కొట్టారు. ఫలితం అనుభవించారు. అయితే అజిత్‌సింగ్ అభిప్రాయంపై నాడు ఉపప్రధాని దేవీలాల్ ఒక్కరేగాక, జనతాదళ్‌లో సంక్షోభాన్ని నివారించేందుకు తద్వారా, నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం ఉనికికి రాగల ప్రమాదాన్ని తప్పించేందుకు ప్రధాని వి.పి.సింగ్ కూడా లోలోన ఆగ్రహం వ్యక్తం చేసినవారే. సమస్యలు ఎదురైనప్పుడు తప్పించుకు తిరగడం రాజకీయ లక్షణం కారాదు. వ్యూహం వేరు. ధైర్యంగా ఎదుర్కోవడం వేరు. అప్పటికే వి.పి.సింగ్ జనతాపార్టీ అధ్యక్ష పదవినుంచి తప్పుకొన్నందున, మేహం అల్లర్ల గురించి తాను స్పష్టంగా అభిప్రాయం చెప్పకుండా ఆ సమస్యను, చౌతాలాపై చర్యనూ పార్టీ రాజకీయ వ్యవహారాల పరిశీలనా మండలికి నివేదించి ఊరుకున్నారు. కాని ఉప ప్రధాని దేవిలాల్ దృష్టిలో పొలిటికల్ ఎఫైర్స్ కమిటీకి విలువలేదు. దాని ఉనికినే అతడు గుర్తించడు. ఎందుకని? పార్టీ అధ్యక్ష పదవినుంచి వి.పి. తప్పుకున్న తరువాత ఆ కమిటీ అస్తిత్వం కోల్పోయింది కాబట్టి. అందుకే, ఈ ఒంటెత్తు పోకడ ఫలితంగానే దేవీలాల్ కమిటీ సమావేశాలకు హాజరు కానేలేదు. చివరికి తన కొడుకు చౌతాలా పదవినుంచి తప్పుకోవాలని తీర్మానించిన కేంద్ర మంత్రిమండలి సమావేశానికి కూడా దేవీలాల్ హాజరు కాలేదు. చూడండి. అధికారాన్ని అడ్డుపెట్టుకున్న బాబు, కొడుకులిద్దరూ లోకం ఏమనుకుంటున్నారనేకించిత్తు వెరపులేకుండా పదవీ రాజకీయాలకోసంఒక్క 'మేహం'ను మాత్రమే కాదు, రేపు దర్బాకాలన్ నియోజకవర్గాన్ని కూడా నరమేథ కేంద్రంగా మార్చగలరు. ఆ జాట్ అహంకారం, ఆ "కులక్కు"ల ఆభిజాత్యం, ఆ ఫ్యూడల్ సంస్కృతిలోని ముట్టిపొగరూ ముఖ్యమంత్రి పదవి ఊడిన తర్వాత కూడా చౌతాలాలోనూ తగ్గలేదు, తండ్రి దేవిలాల్‌లోనూ

అణగలేదు. ఈ రోజుకీ ఉభయులు చేస్తున్న పని - భారత ప్రజాస్వామ్య సంస్కృతికి తలవంపులు తెచ్చేదే, జనతాదళ్ పార్టీకి తలనొప్పి కలిగించేదే! అదేమని అంటే - ఇదంతా పత్రికలవాళ్ళు, పెట్టుబడిదారులూ కలిసి తనపైన, తన కుటుంబంపైన పన్నుతున్న కుట్రగా చిత్రీకరిస్తున్నారు ఇద్దరూ! వారసత్వ రాజకీయాలనేగాక కుటుంబ తగాదాలను కూడా రాష్ట్రంపైనా, దేశంపైనా రుద్దజూస్తున్నారు. కుటుంబ వైరుధ్యాలను జాతీయం చేస్తున్నారు. నిజానికి చౌతాలా ముఖ్యమంత్రి పదవినుంచి తొలగిన మరుక్షణమే హర్యానా లెజిల్లేచర్ పార్టీ సమావేశమై కొత్త నాయకుణ్ణి ఎంచుకోవలసింది. అయితే కొంత ఆలస్యమయినా బనారసిదాస్ గుప్తాను కొత్త నాయకునిగా ఎన్నుకున్నారు. అయినా దేవీలాల్, చౌతాలాల "భల్లూకపు పట్టు' 'నుంచి లెజిల్లేచర్ పార్టీ తప్పుకోగల స్థితి లేదు. పైగా ఒక కొడుకు చౌతాలా పక్కకు తప్పుకున్న మరుక్షణం అతనికి విరోధిగా మారిన మరో కొడుకు రంజిత్‌సింగ్‌ను హర్యానా గద్దెపైకి ఎక్కించాలని దేవీలాల్ తాపత్రయ పడుతూ వచ్చారు. కాగా రాజీనామా చేసినన చౌతాలా కూడా "హర్యానా మంత్రివర్గం నాదైనా కాకపోయినా, హర్యానా అధిపతిని నేనే - మే 26 ఎన్నికను చెదరగొట్టాలని కోరుకున్నవారికి గుణపాఠం చెప్పడానికే నేను రాజీనామా చేశాను గానీ ఎప్పటికీ హర్యానా పాలకుణ్ణి నేనే" అని బింకాలు పోతున్నాడు. అంతేగాదు, బొమ్మయ్ జనతాదళ్ అధ్యక్షుడు కావడానికి తాను సాయపడితే, బొమ్మయ్ చేసిన మొదటి పని తన పదవికి ఎసరు తేవడమని చౌతాలా ఎదురు తిరిగాడు. ఈ ఇద్దరి (తండ్రీకొడుకుల) ధోరణీ ప్రజాస్వామ్య విరుద్ధమైనదేగాక, ఏ విలువలను జనతాదళ్ కాపాడగలదని హామీపడి కేంద్రాధిపత్యానికి వచ్చిందో ఆ ప్రాథమిక విలువలనే ధ్వంసం చేస్తుంది. దేవీలాల్ ఉప ప్రధానిగా కూడా ఉన్నందున ఇది ఒక్క హర్యానా సమస్య కాదు, జనతాదళ్ సమస్యా, దేశ సమస్యా అని మరువరాదు.

మరో కొడుకు రంజిత్‌సింగ్‌ను ఢిల్లీలోనో, లేదా హర్యానాలోనో ఏదో ఒక ఉన్నత పదవిలో నిలిపేదాకా దేవీలాల్‌కు నిద్రపట్టదు. జనతాదళ్ అధ్యక్ష పదవిని తనకు అనుకూలమైన వ్యక్తికి మాత్రమే కట్టబెట్టడం కోసం బీజింగ్ (చైనా) నుంచైనాసరే తంతు నడిపించగల దేవీలాల్ ఏ స్థాయికైనా దిగజారగలరని రుజువైంది. హర్యానా ముఖ్యమంత్రిగా రంజిత్‌సింగ్ నియామకం కుటుంబ కలహాల దృష్ట్యా చౌతాలాకు ఇష్టం ఉండదు. చౌతాలా అభిమానించే వ్యక్తులు రంజిత్‌సింగ్‌కూ, తద్వారా దేవీకి నచ్చకపోవచ్చు. పైగా మేహం గొడవలు ఇంతగా జాతీయ స్థాయికి ఎదగడానికి ఒక విధంగా కారకులు వి.పి. సింగ్‌ను ప్రధానమంత్రిగా చూడలేకపోతున్న కొందరు జనతాదళ్ సీనియర్ నాయకులేనంటే అతిశయోక్తికాదు. "శకుని మామలు" మహా భారతంలోనే కాదు, అభినవ భారతంలో కూడా ఉంటారు! జనతాలో సుబ్రహ్మణ్యస్వామి, జనతాదళ్‌లో చంద్రశేఖర్ కొనసాగినంత కాలం జనతాదళ్ దినదినగండం నూరేళ్ళాయుష్షుగా బతకవలసిందే. కేవలం వి.పి. వ్యతిరేకతే ప్రధాన లక్ష్యంగా ఉన్న సీనియర్ చంద్రశేఖర్, కేంద్ర జౌళి పరిశ్రమల మంత్రిగా ఉన్న శరద్ యాదవ్, చాంద్‌రామ్‌లు - దేవీలాల్, చౌతాలా కొమ్ముకాయబట్టే, 'మేహం' ఘటనలవల్ల భారత రాజకీయాలకు పాకిన "మేహ" రోగం ఇంతవరకూ కుదరలేదు. పైగా "మేహం"లో ప్రజాస్వామ్య విలువలు మంటగలిసిపోయి, ఎన్నికల్లో చౌతాలా విజయంకోసం నరమేథం యథేచ్ఛగా సాగుతున్న ఘడియలలో పట్టించుకోని చంద్రశేఖర్, హిమాలయ ప్రాంతమైన నేపాల్‌లో "ప్రజాస్వామ్య ఉద్యమా"నికి మద్దతు ప్రకటించిరాగల సమర్థుడు! చౌతాలా విషయంలో కేంద్ర మంత్రి మండలి, జనతాదళ్ రాజకీయ వ్యవహారాల మండలి చేసిన నిర్ణయాలు దేవీలాల్ వర్గానికి లోపాయకారీగా

మద్దతుగా ఉన్న చంద్రశేఖర్, శరద్‌యాదవ్, మాజీ కేంద్ర మంత్రి చాంద్‌రామ్, కె.కె. దీపక్ ప్రభృతుల వ్యూహానికీ ఎత్తుగడలకు అపజయంగా భావించాలి. అయితే ఇది తాత్కాలికమే. ఎందుకంటే, దేవీలాల్ వర్గానికి కాంగ్రెస్-ఐ నాయకత్వంతో సంధానం నెరపడంలో సుబ్రహ్మణ్యస్వామి, చంద్రశేఖర్‌లు పాటుపడుతున్నారని ఇప్పటికే ఢిల్లీలో వదంతులు వ్యాప్తిలో ఉన్నందున, కేంద్ర రాజకీయాలలో, జనతాదళ్ పార్టీలో మరిన్ని 'రసవత్తర' ఘట్టాలకు ప్రస్తుత పరిణామాలు నాంది పలకవచ్చు. దేవీలాల్, అతని కొడుకులూ మంగళవారం నాటి పరిణామాలను మరిన్ని చవిచూస్తేతప్ప, దెబ్బతిన్న బెబ్బులిలా విరుచుకుపడడానికీ, ఈసారి వి.పి.సింగ్ పైకే విషమాస్త్రాలు సంధించడానికి ఏ మాత్రం వెనుదీయరని గుర్తించాలి. అందుకు తగిన "ట్రోజెన్ హార్సెస్" జనతాదళ్‌లో సిద్ధంగా ఉన్నాయి.

గురువారం 24 మే, 1990

# పంజాబ్ సమస్యకు పరిష్కారమే లేదా?

కేంద్రంలో ఎన్ని ప్రభుత్వాలు మారినా పంజాబ్ సమస్య ఒక కొలిక్కి రావడానికి అసలు కారణం "ఖలిస్తాన్" అవతరణకోసం (ప్రత్యేక సిక్కు రాష్ట్రం) మిలిటెంట్లు సాగిస్తున్న ఉద్యమమొక్కటే కాదు, సమస్యా పరిష్కారానికి నూతన మార్గాలు వెదకాలన్న ఆలోచన దేశ పాలకులకు లేకపోవడం కూడా. పంజాబ్‌లో అసలు పరిస్థితి గురించి "ప్రజా ప్రయోజనాల దృష్ట్యా" అన్న పేరు చాటున ప్రభుత్వం దేశ ప్రజలకు నిజానిజాలు విశ్వాసంతో వెల్లడించడం లేదు. గత ఏడేళ్ళుగా సాగుతున్న "మిలిటెంట్ల" ఉద్యమానికి పరిష్కారం, అరాచకాలను అణచేందుకు ప్రభుత్వ స్థాయిలో ఉధృతం చేయవలసిన శాంతిభద్రతల యంత్రాంగమేగాక, రాజకీయస్థాయిలో అన్ని అకాలీ పక్షాలతోనూ చిత్తశుద్ధితో, వెనులుబాటు దృష్టితో పరిష్కారమార్గం విధిగా వెతకడం. అటు మిలిటెంట్ల చర్యలవల్ల, ఇటు ప్రభుత్వ ప్రతిచర్యలవల్ల నలిగిపోతున్న అసంఖ్యాక సామాన్య మధ్యతరగతి పేదవర్గాల ప్రజలు ప్రాణాలను, ఆస్తిపాస్తులను కోల్పోతున్నారు. హత్యలు, నిర్బంధకాండ (సివిలియన్, పోలీసు అధికారుల హత్యలు సహా) "క్రికెట్ స్కోర్"లా సర్వసాధారణమైపోయి వినడానికి చెవులు కూడా మొద్దుబారిపోయి జనంలో ప్రతిఘటనా చైతన్యం కూడా నశించే స్థితికి మన వ్యవస్థ ఎదిగిపోయింది. ఈ హత్యాకాండ, ఉభయత్రా సాగుతున్న దమనకాండ గత అయిదున్నర మాసాలలో మరీ పెచ్చరిల్లిపోయింది. ఇప్పుడు "పులిమీద పుట్ర"లాగా అద్వానీ "రథయాత్ర" తర్వాత మత వైషమ్యాలు పెచ్చరిల్లి మరింత కల్లోలానికి పంజాబ్‌లోనూ, ఢిల్లీలోనూ బీజాలు పడ్డాయి. ఈ సరికొత్త "వైరస్" క్రిమిని నాశనం చేయడం ఒక్క ప్రభుత్వం వల్లనే కాదు, ప్రజాబాహుళ్యంలో మతసామరస్య భావాన్ని ఒక మహోద్యమంగా మచ్చలేని జాతీయ నాయకులు, యువకులు బలంగా వ్యాపింపచేయాలి; మత శక్తులను, ఆ సంస్థలను వాటికి రాజకీయంగా అండదండలిస్తున్న పార్టీలనూ నిషేధించాలి. అయితే ఈ నిషేధం ఏ ఒక్క గ్రూపునకు మాత్రమే పరిమితం కారాదు. ఈ "వైరస్" క్రిమి ఎంతగా పాకిపోయి, హిందూ-సిక్కు ప్రజాబాహుళ్యం మధ్య సామరస్యాన్ని కూడా దెబ్బతీస్తోందో తెలుసుకోడానికి జలంధర్, అమృతసర్, గురుదాస్‌పూర్‌లలో తాజాగా విధించిన కర్ఫ్యూలే నిదర్శనం. ఈ పరిస్థితులలో - పంజాబ్ సమస్యకు ఖచ్చితమైన పరిష్కారం కోసం పంజాబ్‌లోని అకాలీలు సహా అన్ని పక్షాలనూ ఆహ్వానించి వెంటనే చర్చలు ప్రారంభించేదిపోయి చంద్రశేఖర్ ప్రభుత్వం లోగడ ప్రభుత్వాలు చేసిన తప్పులు చేయడం విచారకరం. "బ్లూస్టార్ ఆపరేషన్" తర్వాత, 1984లో ఇందిరాగాంధీ హత్యానంతరం ఢిల్లీలో ప్రారంభించిన కల్లోలాల ద్వారా 3,000 మంది సిక్కులపై జరిగిన హత్యాకాండ తర్వాత జాగ్రత్తపడవలసిన ప్రభుత్వం - మళ్ళీ "ఆనందపూర్ సాహిబ్" కన్వెన్షన్ పేరిట మొత్తం అకాలీ గ్రూపుల నాయకులనూ, మిలిటెంట్ కార్యకర్తలనూ అరెస్టుచేసి, కన్వెన్షన్‌ను నిషేధించి మిలిటెంట్ల ఉద్యమాన్ని పరోక్షంగా సంఘటితం చేయబూనడం తెలివితక్కువ వ్యూహంగా పరిగణించాలి. ఎందుకంటే,

అకాలీలకు చెందిన బాదల్, లోంగోవాల్, తోహ్రా, మాన్ గ్రూపులన్నీ "ఆనందపూర్ సాహిబ్"లో తలపెట్టిన కన్వెన్షన్ ఏ నిర్ణయాలు చేస్తుందో వేచి ఉండకుండానే మూకుమ్మడిగా నాయకుల అరెస్టులు సాగించి, కన్వెన్షన్‌ను నిషేధించడం తొందరపాటు చర్య. "కొన్ని జాతీయ వ్యతిరేక శక్తులు విద్రోహ కార్యక్రమాన్ని ప్రకటించే ఉద్దేశం"తో ఈ కన్వెన్షన్ జరుపుతున్నారని అది జరక్క ముందే ప్రభుత్వం అభిప్రాయానికి రావడం ఎంతవరకు సబబో ఆలోచించుకోవాలి. ఈ "విద్రోహ చర్యలు" ఈనాటివి కావని తెలిసి, అంతటి పెద్ద స్థాయిలో ఆరేడేళ్ళుగా పంజాబ్‌లో పోలీసు, సైనిక యంత్రాంగాన్ని పటిష్ఠం చేసుకున్నప్పటికీ విద్రోహ చర్యలకు ఆటవిడుపు లేనప్పుడు, పంజాబ్ పరిష్కారం కోసం ప్రభుత్వం ప్రయత్నిస్తున్నదన్న వార్తలు వస్తున్న ఈ తరుణంలో మూకుమ్మడి అరెస్టులు చెడిపోయిన వాతావరణాన్ని చక్కదిద్దజాలవు. అంతేకాదు, కన్వెన్షన్‌ను "నిషేధించి"నా అకాలీ వర్గాలు ఆనందపూర్ సాహిబ్ గురుద్వారాలో సమావేశమై కొన్ని తీర్మానాలు కూడా ఆమోదించడంవల్ల ప్రభుత్వం ప్రతిష్ఠ పెరిగినట్టా? తగ్గినట్టా? అది ప్రత్యక్షమైన సవాలు. జాగ్రత్తగా పరిశీలిస్తే ఆ తీర్మానాలలో అకాలీలు ప్రకటించిన అభిప్రాయాలు కూడా పరిష్కారానికి తోడ్పడేవిగా లేవు. అదే సమయంలో ప్రభుత్వ చర్యలవల్ల అకాలీలు మరింత మొండికెత్తిపోయే ప్రమాదం ఉంది. ఎందుకంటే, ఇంతవరకూ కేంద్ర ప్రభుత్వం పంజాబ్ సమస్య పరిష్కారం రాకుండా ఉండడానికి చెబుతున్న కారణం - సిక్కులలో, అకాలీలలో ఐక్యత లేదని; కాని అదే సమయంలో అకాలీ వర్గాలన్నీ కలిసి పంజాబ్ పరిస్థితిని "సమీక్షించుకోడా"నికి (ముఖ్యంగా రాష్ట్రపతి పాలన పొడిగించినందున, కొలది మాసాలలో ఎన్నికలు నిర్వహించే అవకాశాలు కన్పిస్తున్నందు) ఒకచోట సమావేశం కావడానికి ప్రయత్నిస్తున్న సందర్భంలో ఆ కన్వెన్షన్ జరక్కుండా నిషేధించడం; చివరికి గతంలో బ్రిటీష్‌వాళ్ళు కూడా నిర్బంధంలో ఉన్న మన జాతీయ నాయకులను, భిన్న దృక్పథాలతో ఉన్న నాయకులను ఒకచోట సమావేశం కావడానికి పూర్తి ఏర్పాట్లు చేసిన ఉదాహరణలున్నాయి. ఆగాఖాన్ ప్రాసాదం, అహ్మద్‌నగర్ ఫోర్ట్ చర్చలు ఇందుకు సాక్ష్యం. కాని చంద్రశేఖర్ ప్రభుత్వం చేసిన నిర్ణయం పరిస్థితిని మరింతగా విషమింపచేసింది. "బంద్'కు అన్ని అకాలీ గ్రూపులూ పిలుపిచ్చాయి; అంతేకాదు, ప్రభుత్వం ప్రకటించిన నిషేధాన్ని, నిర్బంధ విధానాన్ని "సమైక్యం"గా ఎదుర్కోవడానికి వీలుగా సిక్కులందరూ "మిలిటెంట్ల"కు పూర్తి మద్దతు ఇవ్వాలనీ, తమకు మరో మార్గం లేదనీ అకాలీ వర్గాలన్నీ "కన్వెన్షన్"లో తీర్మానించాయి!!!

ఇక్కడొక సత్యాన్ని వెల్లడించక తప్పదు. నవంబర్ 14 ముందూ, ఆ తర్వాత దక్షిణ, పశ్చిమ ఢిల్లీలో జరిగిన ఘర్షణలు, మతకల్లోలం కొన్ని శక్తులు మతసామరస్యాన్ని చిందరవందర చేయడంకోసం పనిగట్టుకొని సృష్టించినవని పూర్వాపరాలు పరిశీలిస్తే తేటతెల్లమవుతుంది. సిక్కులు "పవిత్ర గ్రంథం'గా భావించుకునే "గ్రంథ్‌సాహిబ్"ను పనిగట్టుకొని తగులబెట్టిన వాళ్ళెవళ్ళు? అదే ఢిల్లీలో మసీదు ముందు ముస్లిములకు అనిష్టమైన పదార్థాన్ని వెదజల్లినవాళ్ళెవళ్ళు? ఒక "పవిత్ర స్థలా"నికి నిప్పంటించిన వాళ్ళెవళ్ళు? ఈ రెండు చర్యలూ - స్వాతంత్ర్యానంతరం మొట్టమొదటిసారిగా సిక్కులూ - ముస్లిములూ చేతులు కలిపి "మెజారిటీ ఫాసిజాన్ని" నిరసించడానికి దారులు తీసాయి. అరడజను మందికి పైగా కల్లోలంలో హతులయ్యారు. ఇది ఒక్క రోజులో జరిగిన పని కాదు. గత ఏడాదిగా విశ్వహిందూ పరిషత్ పేరిట నిర్వహించిన ర్యాలీలవల్ల భిన్న మతాలకు చెదిన ప్రజల మధ్య ఉద్రిక్తత పెరుగుతూ వచ్చింది. "రథయాత్ర"తో అది పరాకాష్ఠకు చేరుకుంది. వి.హెచ్.పి. తరపున ఉమాభారతి ఉద్రేకపూరిత క్యాసెట్ ప్రసంగాలూ, ఒక అనామక ముస్లిం సంస్థ తరపున ఒక మాస్టర్ నూరుద్దీన్ చేసిన ఉపన్యాసాలు సమాజ శాంతిని భంగపరిచాయి. అయినా ప్రభుత్వం వీటిని నిషేధించలేదు. క్యాసెట్లను స్వాధీనపరచుకోలేదు.

మారాడు! ఈ దశలో ఉన్న "దేశం"తో పొత్తు పెట్టుకున్న మితవాద, అతివాద మిత్ర పక్షాలు కూడా నీట మునగవలసి వచ్చింది! అయితే, ఎన్ని లోపాలున్నా - ఏడేళ్ళనాడు ఎన్టీఆర్ గత 37 ఏళ్ళలో రాష్ట్రంలో స్థిరంగా ఉన్న కాంగ్రెస్ కోటను బద్దలు కొట్టి తొలిసారిగా నాన్-కాంగ్రెస్ ప్రభుత్వాన్ని ఏర్పరచి చరిత్ర సృష్టించాడు. ఢిల్లీనుంచి "నామినేటెడ్" ముఖ్యమంత్రులతో రాష్ట్ర పాలన సాగిస్తున్న కాంగ్రెస్ సంస్కృతినుంచి కొన్నాళ్ళపాటైనా రాష్ట్రాన్ని కాపాడగలిగారు. ఆ చిత్రం తెలుగువారి మనుస్సులనుంచి ఎన్నటికీ చెరిగిపోదు. నేటి నుంచి డాక్టర్ చెన్నారెడ్డి, కాంగ్రెస్ సంస్థ - సాధించుకున్న విజయాలను సంఘటితం చేసుకొని, చెన్నారెడ్డి చెప్పినట్టు "ప్రజల ఆశలను వమ్ముచేయకుండా" రాష్ట్ర భవిష్యత్తును శుభకరంగా, మంగళ ప్రదంగా దిద్దతీర్చగలరని ఆశిద్దాం!

మంగళవారం, నవంబర్ 28, 1989

# పంజాబ్ సమస్యకు పరిష్కారమే లేదా? 2

పంజాబ్, కాశ్మీర్‌లాంటి సమస్యలను "కేవలం చర్చలద్వారానే పరిష్కరించుకోవచ్చు"నని పదే పదే ప్రకటిస్తున్న ప్రధాని చంద్రశేఖర్, పంజాబ్ అకాలీ నాయకులందరి మూకుమ్మడి అరెస్టును ఆదేశించడంద్వారా చర్చలకు గల మరొక అవకాశాన్ని జారవిడుచుకున్నట్లయింది. "ఆనందపూర్ సాహిబ్" తీర్మానం పేరిట అటు మిలిటెంట్లు, "బ్లూస్టార్ ఆపరేషన్" సంస్కృతిలో ఇటు ప్రభుత్వ నిర్బంధ యంత్రాంగమూ సృష్టించిన అరాచక పరిస్థితివల్ల ఆర్థికంగానూ, మానసికంగానూ దెబ్బతినిపోతున్నవారు పంజాబ్ గ్రామ సీమలలోని పేద సిక్కు, హిందూ ప్రజాబాహుళ్యంతప్ప మరొకరు కాదు. పంజాబ్ సమస్యకు అవధులులేని రాష్ట్రపతి పాలన ఎంతమాత్రం పరిష్కారం కాదని తేలిపోయింది. సరికొత్త వ్యూహం, ముందు చూపుతో విశ్వాసంతో కూడిన పథకం, చొరవ, సాహసం కేంద్ర పాలకవర్గం చూపవలసిన అవసరం ఉంది. జనరల్ కృష్ణారావు ఒక సందర్భంలో పేర్కొన్నట్టు రాజకీయ సమస్యలకు పోలీసులూ, మిలిటరీ పరిష్కారం చూపజాలవు. ఆ మెలకువతోనే దేశ నాయకత్వం వ్యవహరించవలసి ఉంటుంది. నేడు మెజారిటీ పంజాబ్ ప్రజలు కోరుకుంటున్నది ప్రశాంతి, ఎన్నికలద్వారా ప్రజాస్వామ్య సంస్థల పునరుద్ధరణ. "పంజాబీ" భాషా సమస్యనుంచి, చండీగఢ్ ప్రతిపత్తివరకూ, నదీజలాల పంపిణీ, వివాదాస్పద ప్రాంతాలపట్ల నిష్పాక్షికమైన వైఖరినే నలభైమూడేళ్ళుగా కోరుకుంటూ, ఒక్కటీ పరిష్కారం కాకుండా ఆందోళనోద్యమాలతో గడపవలసివచ్చిన పంజాబీలకు కేంద్ర నాయకత్వంగానీ, స్థానిక రాజకీయవేత్తలుగానీ మిగిల్చింది - వాగ్దానాలు తప్ప ఆచరణ కాదు. "ప్లెబిసైట్" హామీతో కాశ్మీర్ ముస్లిములలో "అజాద్ కాశ్మీర్" వివాదానికి నారుపోసి నీరుపెట్టిన రాజకీయ నాయకత్వమే దేశ విభజనకు తొందరపడి ఆమోదించి ఉపఖండంలో శాంతిని దూరం చేసుకున్న నాయకత్వమే విభజిత పంజాబ్‌లో "అజాద్ పంజాబ్" లేదా ఖలిస్తాన్ నినాదానికి కూడా కారకురాలు కావడం మన దురదృష్టం. కాగా పేరుకుపోయిన సమస్యల పరిష్కారాన్ని రాష్ట్రపతి పాలనద్వారా పదే పదే వాయిదా వేయడంవల్ల జరుగుతున్న పని - పంజాబ్ ప్రజా బాహుళ్యం ప్రజాస్వామిక హక్కులనే, శాసనసభకు తమ ప్రతినిధులను ఎన్నుకొని వారిద్వారా తమ వాంఛలను ప్రకటించుకొనే ప్రాథమిక హక్కునే నిరాకరించడం. విసిగిపోయిన ప్రజలకు ప్రాతినిధ్యంవహిస్తున్నామన్న పేరిట అజ్ఞాతంగా ఉన్న "మిలిటెంట్లు" ప్రజలనుంచి దూరమై నిస్పృహతో చేస్తున్న అరాచకాలు వాస్తవ పరిస్థితిని ఎలా ప్రతిబింబించవో, అలాగే ప్రజలె ఎన్నుకున్న విధాన సభ లేనప్పుడు ప్రజలకూ, పరిపాలనా యంత్రాంగానికీ మధ్య అగాధం ఏర్పడుతుంది. దాన్ని అంతూపొంతూలేని రాష్ట్రపతి పాలన పూడ్చజాలదు. ఈ విషయంలో తర్వాత ఫలితాలెలాఉన్నా, 1984 లో రాజీవ్ అధికారంలోకి వచ్చిన తర్వాత తెంపుతో పంజాబ్‌లో ఎన్నికలు నిర్వహించడంవల్ల బర్నాలా

మంత్రివర్గం (అకాలీలు) ఏర్పాటుచేయడానికి అవకాశం కలిగింది. అయితే లోంగోవాల్‌తో కుదుర్చుకున్న పంజాబ్ ఒప్పందాన్ని అమలుచేయనందున మరిన్ని చిక్కులు ఏర్పడ్డాయి. గత నలభైయ్యేళ్ళుగా సాగుతున్న తతంగంకూడా పంజాబ్ సమస్యలకు పరిష్కారాన్ని అకాలీలకు లేదా సిక్కు మెజారిటీ ప్రజలకు వెసలుబాటుతో విడిచిపెట్టకుండా అడుగడుగునా కొన్నాళ్ళు కాంగ్రెస్-ఐ, ఇంకొన్నాళ్ళు జనతా, మరికొన్నాళ్ళు జనతాదళ్ వర్గాలు గీసిన గిరిలోనే అకాలీలు సంచరించేటట్టు వత్తిడి తేవటంవల్లకూడా పరిస్థితులు వికటించాయి. దేశ విభజనకు ముందు సిక్కులకు చేసిన వాగ్దానాలను , ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు విషయమై వారికిచ్చిన హామీలను దేశ నాయకత్వం ఏనాడు అమలు జరుపకుండా వంచించిందో, ఆ రోజునుంచీ 'అకాలీలు' తలెత్తారు. అయితే అకాలీలంతా సిక్కులు కాదు. సిక్కులందరూ 'టెర్రరిస్టులు' కారు. కాగా, ఇప్పుడా వ్యత్యాసాన్ని చెరిపివేసి మొత్తం ప్రజలను మిలిటెంట్ల వైపునకు అనాలోచితంగా నెట్టే ప్రయత్నాలన్నీ దేశ సమైక్యతకు ప్రమాదకరమని గుర్తించాలి. చేసిన తప్పులను దిద్దుకోలేని నాయకత్వం, జరిగిన అత్యాచారాలకు క్షమాపణ చెప్పుకోడానికి సాహసించలేని నాయకత్వం దేశానికి సమస్యలను తప్ప పరిష్కార మార్గాలు చూపలేదు, వెతకలేదు. 1958లో అకాలీ నాయకుడు మాస్టర్ తారాసింగ్‌ను శిరోమణి గురుద్వార ప్రబంధక్ కమిటీ అధ్యక్ష పదవినుంచి తప్పించడానికి కొందరు కాంగ్రెస్ నాయకులు ప్రయత్నించినప్పుడు, ఇది "సిక్కు మత విషయాలలో ప్రత్యక్షజోక్యం"గా పరిగణించిన తారాసింగ్ ప్రభుత్వ జోక్యాన్ని నిరసిస్తూ ఆమరణ నిరాహారదీక్ష పట్టాడు. పరిస్థితి విషమించిపోతోంది. అప్పుడు ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ సమయస్ఫూర్తి ప్రదర్శించి, న్యూనత అని భావించకుండా తారాసింగ్‌కు, "మనఃపూర్వకంగా క్షమాపణలు" తెల్పుకున్నారు. గురుద్వార వ్యవహారాలలో, చివరికి ప్రభుత్వ ఆధ్వర్యాన జరిగే ఎన్నికల విషయంలో కూడా ప్రభుత్వం ఎలాంటి జోక్యమూ చేసుకోబోదని ప్రకటించారు. కాని అలాంటి నాయకత్వం ఏదిప్పుడు? 1948లో ఢిల్లీలో జరిగిన వేలాదిమంది హత్యకు దారితీసిన మారణకాండపట్ల విచారమేకాదు, సిక్కులకు బహిరంగంగా క్షమాపణ చెప్పిన నాయకత్వం ఏది మనకు? ఇందిరాగాంధీ హత్యకు ప్రతిఫలంగా హంతకులకు ఉరిశిక్ష పడడంతో ఊరడిల్లిన మనం - ఢిల్లీ ఘోరకలికి కారకులైన రాజకీయవేత్తలకు, విద్రోహ శక్తులకు కనీస శిక్షలు కూడా ఎందుకని వేయలేకపోయాం? ఇది సమరస భావాన్ని చెడగొడుతుందా? పెంచుతుందా? సవరణలు, క్షమాపణలు ఏకపక్షంగా అమలు జరగడానికి వీలులేదు. జాతుల సమస్య పరిష్కారంలో అహంకారం పాలకులకు చేటు తెస్తుంది.

ఇందులో దేశ విభజన సమయంలో జాతీయ నాయకత్వం ఒక సందర్భంలో ముఖ్యంగా "క్యాబినెట్ (క్రిప్స్) మిషన్" ప్రతిపాదనల సందర్భంలో కనబరిచిన వెసలుబాటు వైఖరినుంచి నేటి నాయకత్వం గుణపాఠాలు తీసుకోవచ్చు. కేంద్ర-రాష్ట్ర సంబంధాలు యూనిటరీ రాజ్యాంగంలో కంటే పరిపూర్ణమైన ఫెడరల్ వ్యవస్థలోనే ఎలా అభ్యుదయం సాధించగలవో ఆనాటి కొన్ని ప్రతిపాదనలు పరిశీలిస్తే అర్థమవుతుంది. నేటి పంజాబీల "ఖలిస్తాన్" నినాదానికి పునాదిగా భావిస్తున్న "ఆనందపూర్ సాహిబ్" తీర్మానాల (1978) లోని సారాంశం అంతా 1946 మేలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అనుమతితో కాంగ్రెస్ అధ్యక్షుడు అబుల్ కలాం అజాద్ క్రిప్స్ మిషన్‌కు సమర్పించిన లేఖలోనే, పథకంలోనే ఉంది. అటు వైస్రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లోనూ, ఇటు రాజ్యాంగ నిర్ణయ సభలోనూ జనాభా ప్రాతిపదికపై హిందూ, ముస్లిములకు సమాన ప్రాతినిధ్యం కల్పించే సమస్యపై తలెత్తిన రగడకు పరిష్కారంగా కాంగ్రెస్ ఈ పథకం రూపొందించింది. దేశ విభజనను తప్పించాలన్న సదుద్దేశంతో ఆ పథకం ప్రతిపాదించింది.

ఆ తర్వాతి పరిణామాలెలా ఉన్నప్పటికీ ఆ పథకం సారాంశం - ఈనాడు గోర్బచేవ్ రష్యన్ రిపబ్లిక్‌లకూ, బాల్టిక్ స్టేట్స్‌కూ "యూనియన్ ఆఫ్ రిపబ్లిక్స్" అన్న పేరును ఎలా "యూనియన్ ఆఫ్ సావరీన్ (సర్వసత్తాక) రిపబ్లిక్స్"గా గుర్తించవలసి వచ్చిందో, నాడు కాంగ్రెస్‌కూడా రాష్ట్రాలన్నింటికీ "పూర్తి స్వయం పాలకాధికారాలను దఖలు పరచాలని" సూచించింది; కేంద్రానికి రక్షణ, విదేశాంగ వ్యవహారాలు, కమ్యూనికేషన్స్, కరెన్సీ నిర్వహణాధికారాలు మాత్రమే ఉంచి మిగతా అంశాలన్నింటినీ రాష్ట్రాలకు పూర్తిగా దాఖలుపరచాలని ప్రతిపాదించింది. అలా అయితేనే ముస్లిమ్ ప్రజలలో "మెజారిటీ పెత్తనం" గురించి ఉన్న అనుమానాలు తొలగి, దేశ విభజన తప్పిపోతుందని భావించింది. కాని నాయకత్వంలో కొందరి మొండివైఖరివల్ల అత్యంత ప్రజాస్వామికమూ, ఫెడరల్ వ్యవస్థకు ప్రాణప్రదమూ అయిన ఆనాటి జాతీయ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ (అజాద్) పథకం అమలులోకి రాకుండా పోయింది. మత ప్రాతిపదికపై జరిగిన దేశ విభజనకు ప్రపంచ చరిత్రలో సాటివచ్చే పరిణామం మరొకటి లేదు. మళ్ళీ మరొకసారి పంజాబ్ పేరుతో దేశ సమైక్యతకు విఘాతం రాకుండా చూడాలంటే - మొత్తం కాశ్మీర్, పంజాబ్, కేంద్రం-రాష్ట్రాల సమస్యల పరిష్కారం కోసం కొత్తగా రాజ్యాంగ నిర్ణయ సభను సమావేశపరిచి, ఫెడరల్ వ్యవస్థ రూపురేఖలపై కూలంకషంగా చర్చ జరగవలసి ఉంది. ప్రపంచంలోనే సుప్రసిద్ధమైన ఫెడరల్ రాజ్యాంగాన్ని ప్రసాదించిన అమెరికాలో స్వాతంత్ర్య సమరం తర్వాత 13 కాన్ఫెడరేటెడ్ స్టేట్స్ కలిసి రూపొందించుకున్న ఫెడరల్ రాజ్యాంగం ఎంతో వెసలుబాటు కలదిగా ఉంది. రాష్ట్రాలకు ప్రత్యేక రాజ్యాంగాలను అనుమతించినప్పటికీ అమెరికన్ రాష్ట్రాలు స్వేచ్ఛా పరిధుల్ని ఉల్లంఘించడం లేదు; ఫెడరల్ ప్రభుత్వం (కేంద్రం) రాష్ట్రాల పరిపాలనా వ్యవహారాల్లో తలదూర్చదు. రాష్ట్రాల అధిపతులను "కాపిటల్ హిల్" హుకుమ్‌నామాలతో తొలగించదు. రాష్ట్రాల పథకాలకు కేంద్రం కోత పెట్టదు. పైగా లోటుబడ్జెట్లను నింపడానికే ప్రయత్నిస్తుంది. అంతేగానీ, "రావి"నదిపైన నిర్మించ తలపెట్టిన తీన్‌డామ్‌లాగా ఇరవయ్యేళ్ళుగా "హామీ"లతో నానబెట్టి, ఏళ్ళుపూళ్ళుగా నీటిని వృథాపుచ్చనివ్వదు. ఇంతకూ రాజకీయపక్షాలు (అకాలీలుతప్ప) పంజాబ్‌లో ఎన్నికలను ఎందుకు వ్యతిరేకిస్తున్నట్లు? 1989 ఎన్నికల్లో మిలిటెంట్లు 13 పార్లమెంటరీ స్థానాల్లో 10 సీట్లు గెలుచుకున్నందువల్లనా? లేదా సిక్కుల జనాభా 68 శాతం, హిందువుల జనాభా .32 శాతం అయినందువల్లనా?

బుధవారం 28 నవంబర్, 1990

# భారతదేశాన్ని తాకట్టు పెట్టకండి!

ప శ్చిమాసియాపై తిరిగి తమ పెత్తనాన్ని రుద్దడంకోసం పశ్చిమ రాజ్యాలు (ఆంగ్లో-అమెరికన్ పాలకులు) చేస్తున్న ప్రయత్నమే నేటి పర్షియన్ గల్ఫ్‌లో ప్రారంభించిన యుద్ధం. ఈ యుద్ధంలో అమెరికన్లకు ఇండియా బాసటగా నిలబడరాదు. అమెరికాకు మద్దతు ఇవ్వడం భారత ప్రజల ప్రయోజనాలకు హానికరం. ఎనభైమూడు కోట్లమంది భారత ప్రజలు తమ గొంతెత్తి, ఈ యుద్ధం జరగడానికి వీల్లేదు, యుద్ధాన్ని నిలివేయాలని, పాలస్తీనియన్ల హక్కులను గుర్తించాలనీ, పశ్చిమాసియా సమస్యల పరిష్కారానికి శాంతి సమావేశం ఏర్పాటు చేయాలనీ చాటి చెబితే అమెరికా అంకెకు రాక తప్పదు. సౌదీ అరేబియా రాజు, కువైట్ అమీరు ఆయా ప్రాంతాల ప్రజలపైన ప్రజాభీష్టానికి వ్యతిరేకంగా అమెరికా పెంచి పోషిస్తున్న ఫ్యూడల్ ప్రభువులు. కనుకనే ప్రజాకంటకులు స్వార్థ ప్రయోజనాలకోసం అమెరికా పంచల్లో చేరారు. కాని ఆ ప్రాంతాల ప్రజలు అమెరికా పెత్తనాన్నిగానీ, యుద్ధాన్ని గానీ, ఫ్యూడల్ ప్రభువులనుగానీ ఇష్టపడడం లేదు.'' ఈ మాటలన్నది మార్క్సిస్టు కాదు, కరడుకట్టిన విప్లవకారుడు కాదు, పచ్చి అమెరికా వ్యతిరేకీకాదు, కనీసం ఒక ఫేబియన్ సోషలిస్టుగానీ, ఒక కమ్యూనిస్టుగానీ, ఒక పాలస్తీనా "ఇన్ ఫెడా"గానీ కారు. సాక్షాత్తూ బ్రిటన్‌లో శక్తివంతమైన ప్రతిపక్షంగా ఉన్న లేబర్ పార్టీ నాయకుడు, ప్రసిద్ధ రాజకీయవేత్త టోనీబెన్ చెప్పిన ఈ మాటలు జనవరి 28న లండన్‌లో చేసిన ఈ హెచ్చరిక భారత ప్రజలను, ప్రజాస్వామ్యవాదులను ఆలోచింపజేయాలి. ఒకవైపున పశ్చిమాసియా దేశాలకు 'శాంతి' యాత్రలు కడుతూ, గల్ఫ్ యుద్ధ నివారణకు, కనీసం తాత్కాలికంగానైనా సంబంధిత పక్షాలచే యుద్ధాన్ని విరమింపచేయడానికి చంద్రశేఖర్ ప్రభుత్వం కృషి చేస్తున్నట్టు కన్పిస్తు దశలో - గల్ఫ్ యుద్ధాన్ని ప్రారంభించి, "కువైత్ విమోచన"పేరిట ఇరాక్ రిపబ్లిక్ సర్వనాశనానికి జనావాస ప్రాంతాలపైన, పారిశ్రామిక సంస్థలపైన దారుణమైన దాడులు చేస్తూ యుద్ధాన్ని టర్కీ, ఇరాన్‌లకు కూడా క్రమంగా వ్యాపింపజేస్తున్న అమెరికన్ యుద్ధ విమానాలకు ఇండియాలో పెట్రోల్ నింపుకునే అవకాశాలు కల్పించడం సిగ్గుచేటు. భారత ప్రజలకు అవమానకరం. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట సంప్రదాయాలతో దీపించిన భారత స్వాతంత్ర్య సమర లక్ష్యాలకు, ఆదర్శాలకు చంద్రశేఖర్ ప్రభుత్వం చర్య పరమ విరుద్ధం. టోనీబెన్ చెప్పినట్టి 83 కోట్ల మంది భారత ప్రజలను మభ్యపరచి, దేశ ప్రయోజనాలను పణంగా పెట్టి, దేశం పార్లమెంటుకు మాటమాత్రంగా కూడా తెలియజేయకుండా రహస్యంగా అమెరికాకు కల్పించిన యుద్ధ సౌకర్యం ఇది. గల్ఫ్ యుద్ధంవల్ల పెట్రోలియం కొరతను భర్తీచేసుకొనే పేరుతో ఇండియన్ ఎయిర్ లైన్స్ పైన, ఎయిర్ ఇండియా విమానాలపైన విధించిన 25 శాతం పెట్రోల్ రహస్యంగా సడలించి - ఒక యుద్ధోన్మాదికి చెందిన 41 యుద్ధ రవాణా విమానాలకు బొంబాయి విమానాశ్రయంలో మంచు ముసుగులో

పెట్రోల్ నింపుకోడానికి స్వేచ్ఛగా అనుమతించారు. ఈ పని నెల రోజులకు పైగా జరుగుతున్నదని కొందరు చెప్పగా, కాదు వి.పి.సింగ్ ప్రధానిగా ఉన్న నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం గత సెప్టెంబర్‌లోనే అమెరికాతో కుదుర్చుకున్న "ద్వైపాక్షిక ఒప్పందం" పలితమూ ఈ పరిణామమని కాంగ్రెస్ (ఐ) అధిష్ఠానవర్గం ఆరోపించింది. కాగా అసలలాంటి ఒప్పందమేదీ లేదనీ, ఇది పచ్చి అబద్ధమనీ మాజీ విదేశాంగమంత్రి ఐ.కె. గుజ్రాల్ ఖండించడమేగాక, "కాంగ్రెస్(ఐ) ప్రత్యక్ష, పరోక్ష అనుమతితోనే చంద్రశేఖర్ ప్రభుత్వం అమెరికాకు ఈ అవకాశం కల్పించింద"ని ప్రత్యారోపణ చేశారు. అయితే ఈ పరస్పర ఆరోపణలవల్ల ఒక్క నిజం ప్రజలకు వెల్లడవుతోంది. మొత్తంమీద ఎవరి ప్రమేయంవల్ల, ఎవరి విద్రోహంవల్ల, మరెవరి స్వార్థ ప్రయోజనాలవల్ల ఈ పరిణామం వచ్చినా, గల్ఫ్‌లో అమెరికా తలపెట్టిన యుద్ధాన్ని కనీసం లోపాయికారీగానైనా భారత్ పాలకవర్గాలు సమర్థిస్తున్నాయి. అరబ్బుల స్వాతంత్ర్యోద్యమాల పట్ల, పాలస్తీనా ప్రజల హక్కులపట్ల భారత స్వాతంత్ర్య సంగ్రామం పెంచుకుంటూ వచ్చిన ప్రేమాభిమానాలను ఈ పరిణామం తుంచివేస్తోంది. అయినా అసలు "సెప్టెంబరులో కుదిరిన ఒప్పందం" వి.పి.సింగ్ ప్రభుత్వం కుదుర్చుకున్నదన్న విషయాన్ని బయటపెట్టవలసిందీ, లేదా అమెరికా యుద్ధ విమానాలకు కల్పించిన ఈ సౌకర్యాలతో "మాకెలాంటి సంబంధం లేద"ని నీళ్ళు నమలకుండా బాహాటంగా ఖండించవలసిందీ చంద్రశేఖర్ ప్రభుత్వం కాగా, ఆ విషయాన్ని కాంగ్రెస్ (ఐ) తరపున అక్బరూ, గాడ్గిల్‌లు ఎందుకు భుజాన వేసుకోవలసి వచ్చింది?! ఈ రోజుకీ భారత పాలకవర్గాలు గల్ఫ్ సమస్యపట్ల వ్యవహరిస్తున్న తీరు - "కర్ర విరగకుండా పాము చావకుండా" అన్నట్లుగా ఉంది. పాలక పక్షంగానీ, దానికి బలమైన మద్దతు ప్రకటించిన కాంగ్రెస్(ఐ) గానీ ఈ రోజుకీ గల్ఫ్ యుద్ధాన్ని ప్రారంభించిన ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులను పేరుపెట్టి ఖండించటం లేదు. ఎంతసేపూ సమితిని సమావేశపరచాలనో, లేదా యుద్ధం ఆగిపోవాలనో, శాంతి నెలకొనాలనో కంటితుడుపు ప్రకటనలు మినహాయిస్తే - యుద్ధ కారకుల గురించీ, ఆసియా దేశాలకు వారి తాకిడివల్ల రానున్న పరిణామాల గురించీ స్పష్టంగా పేర్కొనకుండా దాటవేస్తున్నారు. కువైట్‌ను విముక్తి చేయాలంటున్నారేగాని, గల్ఫ్ యుద్ధ కారకులను ప్రకటించడంలేదు; ఇరాక్ చుట్టూ అరబ్ ఫ్యూడల్ ప్రభువులు అమెరికా అండతో అమెరికాకోసం అరబ్ షేక్ డమ్స్‌లో పేర్చిన అమెరికన్ యుద్ధ స్థావరాలను తొలగించమని కోరినవాడు లేడు!.

అందుకే పండిట్ నెహ్రూ ఏనాడో అన్నాడుః ఆర్థికంగా పరాధీనస్థితిలో ఉన్న దేశం స్వతంత్రమైన జాతీయ, అంతర్జాతీయ విధానాలను దిద్దితీర్చుకొనజాలదు, అని! అమెరికా ఆధ్వర్యంలో ఉన్న ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థలనుంచి మనం లక్ష కోట్ల రూపాయల విదేశీ రుణాలు తెచ్చుకున్న పాపానికి లొంగిపోవలసిన దుర్గతి పట్టింది. ఈ పతనం 1966లో రూపాయి మారకం విలువను ప్రపంచ బ్యాంకి విషమ షరతులవల్ల, వత్తిళ్ళవల్ల దిగకోసుకోవలసి వచ్చింది; తర్వాత క్రమంగా మన ప్రధానమంత్రి కార్యాలయం, మన రక్షణ వ్యవస్థ రహస్యాలను యూరోపియన్ దేశాలకు ముఖ్యంగా అమెరికా, రష్యాలకు అందజేసే ఏజెంట్లకు కొలువు కూటమిగా మారింది; కుమూర్ నారాయణ్ ప్రభృతుల, అధికారుల అరెస్టులూ, విచారణలే ఇందుకు నిదర్శనం. అంతేగాదు; ఇండో-పాక్ యుద్ధ సమయాల్లోనూ, ఇండియా-చైనా సరిహద్దు ఘర్షణలప్పుడూ హిందూ మహా సముద్రం విహార కేంద్రంగా ఇండియాకు అమెరికా వైమానిక "రక్షణ గొడుగు" (దీనినే ఆకాశగొడుగు "ఎయిర్ అంబ్రెల్లా" అన్నారు)ను కల్పించవలసిందిగా అడిగిన వాళ్ళు మన పాలకవర్గాలే. అలాగే గత మూడు నాలుగేళ్ళుగా కాశ్మీర్‌లోనూ, పంజాబ్‌లోనూ 'నిజనిర్ధారణ'

పేరిట అమెరికన్ వేగుల వాళ్లకూ, సాలారెజ్ మిషన్‌కూ, ఇండియాలోని అమెరికన్ రాయబారి యాత్రలు జరపడానికీ, రకరకాల వ్యక్తులను కలుసుకొని సమాచారం సేకరించుకోడానికి తలుపులు తెరిచిన వాళ్ళు కూడా మన పాలకవర్గాలే. చివరికి "అమ్నెస్టీ ఇంటర్నేషనల్" సభ్యత్వ హోదాలో భారత రాజకీయవేత్త లెందరో అమెరికా ప్రయోజనాలకు తెలిసో తెలియకో తోడ్పడడాన్ని కాదనలేరు! ఈ అలుసే అమెరికన్లు మనపాలకవర్గాల మెడలు వంచడానికి అవకాశం కల్పించింది. చివరికి కనీసం ఒక దశలోనైనా (1972-1976) హిందూ మహాసముద్రంలో అగ్రరాజ్యాల యుద్ధ నౌకల ప్రవేశాన్ని, నౌకా విన్యాసాలనూ ఇండియా వ్యతిరేకించి, నిరసన తెల్పగలిగింది. ఆ తరువాత నామమాత్రపు నిరసన కూడా లేదు; చివరికి రేపు అమెరికా ప్రవర్తనకు నిరసనగా పెద్ద ఎత్తున ప్రదర్శనలు దేశంలో నిర్వహిస్తున్నప్పుడు, "రుణానుబంధాన్ని" వదలుకోలేక పాలకవర్గాలు స్వజనాన్ని చితకబాదినా, కాల్పులు జరిపినా ఆశ్చర్యపోనక్కరలేదు. ఇప్పటివరకు వెల్లడయిన విషయాలనుబట్టి చూస్తే - గల్ఫ్ యుద్ధాన్ని ప్రారంభించాలన్న నిర్ణయాన్ని అమెరికా సెప్టెంబర్‌లోనే కాదు, ఆగస్టు 1కి ముందే చేసినట్టు స్పష్టం! అట్లాంటిక్ నుంచి అరేబియా సముద్రందాకా, పసిఫిక్ నుంచి హిందూ మహా సముద్రందాకా విస్తరించి ఉన్న అమెరికన్ యుద్ధ యంత్రాంగం మన ఇరుగు పొరుగు మారిషస్‌లోని డీగోగార్సియాను కూడా కేంద్రంగా చేసుకొన్నదని గుర్తించినప్పుడైనా, ఇరాక్‌పై బాంబర్ దాడులకు అది కూడా స్థావరం అయినదని తెలుసుకుప్పుడైనా ఇండియా నిరసన బేషరతుగా ఉండాలి; పాలకులు నంగిమాటలు, దొంగచేతలు కట్టిపెట్టాలి.

గురువారం 31 జనవరి 1991

# 'దేశం' పరాజయం: కేంద్రంలో "కిచిడీ"

దేశంలో కడచిన మూడు జనరల్ ఎన్నికల నుంచీ ఉత్తర-దక్షిణ భారతాలలో ఫలితాలు తారుమారవుతున్నాయి. తొమ్మిదవ సాధారణ ఎన్నికల్లో కూడా ఈసారి లోక్‌సభ - అసెంబ్లీ స్థానాల ఫలితాలు ఇదే బాణీలో ఉన్నాయి. అయితే ఈసారి దక్షిణాదిన ప్రశాంత పవనాలేగాని, ప్రభంజనాలు లేవు. అయినా ఉత్తరాదిన కాంగ్రెస్ (ఐ) ఓడిపోయి, కేంద్రంలో అస్థిర పరిస్థితులు ఏర్పడగా, దక్షిణాదిన కాంగ్రెస్ ఘన విజయం సాధించింది. మరొక మాటలో చెప్పాలంటే, ఎటుచూచినా ఉత్తర-దక్షిణ భారతాలలో జరిగినపని - ఉభయత్రా 'ప్రతిపక్షాలే' నెగ్గడం (ఉత్తరాన నాన్-కాంగ్రెస్, దక్షిణాదిన కాంగ్రెస్)!! ఈ తారుమారు పరిస్థితుల్లో ఆంధ్రప్రదేశ్‌లోకూడా 1983 తిరగబడి, "తెలుగుదేశం" ఘోరపరాజయం, పరాభవం పొందింది. కాంగ్రెస్(ఐ) అనూహ్యమైన విజయాలు సాధించింది. అయితే 1983కీ 1989కీ చాలా దగ్గర పోలికలున్నాయి: 1983లో తెలుగు వోటరు "తెలుగుదేశం" నాయకత్వాన "ఆత్మాభిమాన" నినాదంతో తన తెలుగుదనాన్ని చాటుకొని, "అవమాన భారం"తో కాంగ్రెస్(ఐ)కి 1989లో పట్టం కట్టడంతో చరిత్ర పునరావృత్తమయింది! ఒకసారి "విషాదం"గా వేరొకసారి "పరిహాసం"గా ముగిసింది! ప్రసిద్ధ చలన చిత్ర నటుడుగా జీవితం ప్రారంభించి చివరికి రాజకీయాలలో ప్రవేశించిన ఎన్.టి.రామారావు "దేశం" పార్టీని ఆవిష్కరించిన తొమ్మిది నెలలలోనే నాడు రాజ్యాధికారం చేజిక్కించుకొని చరిత్ర సృష్టించారు నాడు. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్(ఐ) అధ్యక్ష పదవిని స్వీకరించిన తొమ్మిది నెలలోనే డాక్టర్ మర్రి చెన్నారెడ్డి పార్టీని పునర్నిర్మించి, నిర్మాణ కార్యక్రమానికి పార్టీని పునరంకితం చేసి, శిక్షణ కోల్పోయిన సంస్థలో ఒక మేరకైనా క్రమశిక్షణ నెలకొల్పి పార్టీని ఏడేళ్ళ తరువాత తిరిగి అధికారంలోకి తెచ్చారు. అంతేగాదు, 1983లో "దేశం' ' విజయానికి ముందు ముఖ్యమంత్రిగా ఉన్న కోట్ల విజయభాస్కరరెడ్డి పెద్దరికంతో, మంచితనంతో నిమిత్తం లేకుండానే, అప్పటికే రాజకీయ సంస్థగా శిక్షణను కోల్పోయి, ప్రజలకు దూరమైపోయి అంతర్గత కలహాలతో కునారిల్లిపోయిన దశలో కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా ప్రజలు తీర్పు చెప్పారు. "నెగటివ్" వోటుతో ఎన్టీఆర్ ప్రభుత్వం అసమర్థపాలనపైన, పొత్తు పొంతన లేని విధానాలపైన, ఛిద్రమైపోయిన పరిపాలనా వ్యవస్థపైనా, అరాచకంగా మారిన ఆర్థిక విధానాలపైన, అశాంతి పరిస్థితులపైన మరోసారి తెలుగువోటర్లు తీర్పు చెప్పారు! అంటే ప్రజా సమస్యలను పట్టించుకోనప్పుడు, లేదా ప్రజలకు సమస్యలను పాలకులు సృష్టించి పెట్టినప్పుడు, పాలకపక్షాలూ, వాటి నాయకులూ అహకారంతో, అహంభావంతో, అసమర్థతతో లేదా నిరంకుశ పోకడలతో అధికారాన్ని దుర్వినియోగం చేసినప్పుడూ - వారిని ప్రజలు నిర్మొహమాటంగా కాలదన్నుతారని, కాలరాస్తారనీ 1983-1989 ఘట్టాలు భేషరతుగా నిరూపించాయి! ఈ తీర్పు చెప్పే వోటర్లు

సుస్థిరతకు, తొట్రుపాటు లేని పరిపాలనా దక్షతకు ఇచ్చే గౌరవాన్ని, చూపే ఆదరాభిమానాలను 'కె.జి. రెండు రూపాయల" బియ్యంలాంటి సంక్షేమ పథకాలకు కూడా ఇవ్వరని ఈ ఫలితాలు మరొకసారి నిరూపించాయి! అంతేకాదు, అధిక సంఖ్యాక ఓటర్లు ఎంత నిరక్షరాస్యులైనా పాలకుల మాటలకూ చేతలకూ అంతరాన్ని గమనించలేనంత అమాయకులు కారని కూడా ఫలితాలు రుజువు చేశాయి! ఇందిరాగాంధీ "కుటుంబ పాలన" గురించి అధికారానికి రాకముందు ప్రచార యుద్ధం ప్రారంభించిన ఎన్టీఆర్ పరిపాలనలోకి వచ్చిన తరువాత తాను "వంశపారంపర్య" సూత్రానికి విడాకులివ్వలేకపోయారు! అలాగే, అధికారంలోకి వచ్చిన క్షణంనుంచీ పాలనా వ్యవహారాలలో కేంద్ర ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిత్యమూ ధ్వజమెత్తుతూ వచ్చారు. తన "పాజిటివ్" కార్యక్రమాన్ని వదిలి, కాంగ్రెస్ వ్యతిరేకతే ఏక సూత్ర కార్యక్రమంగా "నెగటివ్" ప్రచారంతో ముందుకు సాగారు. తద్వారా కేంద్ర రాష్ట్ర సంబంధాలలో భర్తీ చేసుకొనలేని అంతరాన్ని సృష్టించుకొన్నారు, అగాధాన్ని పెంచుకొన్నారు. 1984లో కేంద్రం నిరంకుశ నిర్ణయంవల్ల "దేశం" ప్రభుత్వానికి ఏర్పడిన అస్థిర పరిస్థితి దృష్ట్యా కేంద్రం పట్ల వ్యతిరేకత ఇనుమడించినా - దానిని ఆ మేరకే పరిమితం చేయకుండా ఎన్టీఆర్ కొనసాగించారు. పరిపాలనా యంత్రాంగాన్ని సంస్కరించుకొనేది పోయి 'సంహరించు'కొనే మార్గాన్ని అనుసరించి, అధికారవర్గంలోను, ప్రభుత్వోద్యోగులలోను పెక్కుమందిని దూరం చేసుకొన్నారు. ఉద్యోగులలోనూ పెక్కుమందిని దూరం చేసుకొన్నారు. ఉద్యోగుల కోర్కెలన్నింటినీ పరిష్కరించలేకపోయినా కనీసం "వినదగు నెవ్వరు చెప్పిన" అన్న సూత్రాన్ని కూడా ఆయన పట్టించుకోకుండా, విన్నా పాటించకుండా "తాడు తెగే" వరకూ లాగుతూ వచ్చారు! ఆకరి క్షణాలలో, ఎన్నికల ముందు ఉద్యోగుల కోర్కెలను సమసమ్మతిస్తూ "మూరెడు ముందుకు వెళ్ళి బారెడు వెనక్కి" జరిగారు!

రాష్ట్రంలో "దేశం" పార్టీగానీ, ప్రభుత్వంగానీ ఇంకా పూర్తిగా స్థిరపడకుండానే "కేంద్ర ప్రభుత్వ" వ్యతిరేక విధానంలో భాగంగా జాతీయ, ప్రాంతీయ ప్రతిపక్షాల నాయకులతో కలిసి సదస్సులు ఎన్టీఆర్ నిర్వహించారు. ఇంతచేసినా తీరా ఈ ఎన్నికల్లో ఒకరిద్దరు ప్రతిపక్ష ప్రభుత్వాల ముఖ్యమంత్రులు మినహా "నేషనల్ ఫ్రంట్" నాయకులెవరూ "తెలుగుదేశం" పటిష్ఠమైన రాజకీయ శక్తిగా నేల కాలూనకముందే "భారతదేశం" పార్టీ స్థాపనకు ప్రయత్నించి, విఫలమై, ఆపద్ధర్మంగా నేషనల్ ఫ్రంట్ ఛైర్మన్‌గా అవతరించారు. కాని ఫ్రంటుకు చెందిన ఉత్తరాది నాయకులలోని ప్రముఖులందరూ ఘనవిజయాలు సాధించగా ఎన్టీఆర్ కల్వకుర్తిలో మునిగిపోయి హిందూపురంలో తేలవలసి వచ్చింది! పార్టీలుగా కాంగ్రెస్(ఐ)కీ "దేశం"కూ ఒక తేడా ఉంది: కాంగ్రెస్‌లో సంస్థాగత ఎన్నికలు పూజ్యమైనా అభిప్రాయభేదాలను ప్రజాస్వామిక పద్ధతులలోనైనా కొంతవరకు వ్యక్తం చేసుకుంటారు. కాగా, "దేశంలో" ఎన్నికలు లేకపోవడంతోపాటు ఆ నామమాత్రపు ప్రజాస్వామ్యం కూడా అంతరించి పార్టీ "కాయిలా" పడి, నిర్వీర్యమైపోయింది! చివరికి మొత్తం క్యాబినెట్‌నే రద్దు చేసుకొనే స్థితికి ఏక వ్యక్తి పాలన, 'స్వామిభక్తి' పాలనా దిగజారిపోయాయి! ఉన్న జీ.వో.లు అమలు జరుగవు, కొత్త జీవోలు ప్రభుత్వానికే తెలియవు! న్యాయస్థానాల వ్యాఖ్యానాలకు విలువ లేదు! లెజిస్లేచర్ తీర్మానాలకూ విలువ లేదు! కొసమెరుపుగా - ఎన్టీఆర్‌కు పరిపాలన కంటె చిత్ర నిర్మాణం ప్రేమాస్పదమై "విశ్వామిత్ర" సృష్టికి దిగారు! అది ప్రతి సృష్టికాదు, అటు "దేశం"పట్ల వక్రదృష్టిగా, వికృత సృష్టిగా మారింది. ఫుల్‌టైమ్ మంత్రి పార్ట్‌టైమ్ ఉద్యోగిగా

మారాడు! ఈ దశలో ఉన్న "దేశం"తో పొత్తు పెట్టుకున్న మితవాద, అతివాద మిత్ర పక్షాలు కూడా నీట మునగవలసి వచ్చింది! అయితే, ఎన్ని లోపాలున్నా - ఏడేళ్ళనాడు ఎన్టీఆర్ గత 37 ఏళ్ళలో రాష్ట్రంలో స్థిరంగా ఉన్న కాంగ్రెస్ కోటను బద్దలు కొట్టి తొలిసారిగా నాన్-కాంగ్రెస్ ప్రభుత్వాన్ని ఏర్పరచి చరిత్ర సృష్టించాడు. ఢిల్లీనుంచి "నామినేటెడ్" ముఖ్యమంత్రులతో రాష్ట్ర పాలన సాగిస్తున్న కాంగ్రెస్ సంస్కృతినుంచి కొన్నాళ్ళపాటైనా రాష్ట్రాన్ని కాపాడగలిగారు. ఆ చిత్రం తెలుగువారి మనుస్సులనుంచి ఎన్నటికీ చెరిగిపోదు. నేటి నుంచి డాక్టర్ చెన్నారెడ్డి, కాంగ్రెస్ సంస్థ - సాధించుకున్న విజయాలను సంఘటితం చేసుకొని, చెన్నారెడ్డి చెప్పినట్టు "ప్రజల ఆశలను వమ్ముచేయకుండా" రాష్ట్ర భవిష్యత్తును శుభకరంగా, మంగళ ప్రదంగా దిద్దతీర్చగలరని ఆశిద్దాం!

మంగళవారం, నవంబర్ 28, 1989

# కేంద్రంలో "కిచిడీ" :2:

కేంద్రంలో సుస్థిర ప్రభుత్వాన్ని ఏర్పరచగల మెజారిటీ అటు కాంగ్రెస్(ఐ)కిగానీ, ఇటు నేషనల్ ఫ్రంటుకుగానీ లేనందున, ఉత్తర భారతంలో ఘోర పరాజయం పొందిన కాంగ్రెస్(ఐ) పాలకపక్షంగా రాజీనామా సమర్పించవలసి వచ్చినందున - మొట్టమొదటిసారిగా భారత పార్లమెంటరీ చరిత్రలో "మిశ్రమ ప్రభుత్వా"ల యుగం ప్రారంభమయ్యే అవకాశాలు కన్పిస్తున్నాయి. రాజీవ్ మంత్రి వర్గ సలహాపై రాష్ట్రపతి వెంకట్రామన్ ఎనిమిదవ లోక్ సభను రద్దు చేయడంతో, తర్వాత పాత మంత్రివర్గం రాజీనామా ఇవ్వడంతో కేంద్రంలో నూతన మార్పులకు అంకురార్పణ జరుగుతోంది. నవంబర్ 30కి నూతన లోకసభ - తొమ్మిదవ లోక్ సభను ఏర్పరచుకోవచ్చునని నోటిఫికేషన్ జారీ చేసేవరకూ ప్రజల కళ్లన్నీ నూతన ప్రభుత్వ నిర్మాణానికి వివిధ పక్షాలు చేసుకొనే ప్రయత్నాలమీదనే ఉంటాయి. పైగా ఈ అనిశ్చిత పరిస్థితులలో, అనుక్షణం మారుతున్న పరిస్థితులలో రాజ్యాంగ సంబంధమైన చిక్కులు కూడా రాష్ట్రపతికి ఎదురుకావడం సహజం. సుప్రసిద్ధ రాజ్యాంగ శాస్త్ర నిపుణులలో ఒకరైన కె.కె. వేణుగోపాల్ ఉద్దేశంలో (26 నాటి ప్రకటన) 8వ లోక్ సభ రద్దు కాకుండా నూతన సభ ఏర్పడకుండా "త్రిశంకుసభ"(హంగ్ పార్లమెంటు) కొనసాగే పక్షంలో వారం లేదా పదిరోజులలోనే రాష్ట్రపతి, మంత్రివర్గం ఏర్పాటు చేయవలసిందిగా కోరుతూ ఏదో ఒక పక్షం నాయకుణ్ణి పిలవవచ్చు. కాని ఇప్పుడు ప్రతిపక్షాల అనుమానాలకు తావులేకుండా 8వ సభ రద్దు అయింది కాబట్టి, ఎలెక్షన్ కమిషన్ నోటిఫికేషన్‌తో తొమ్మిదవ సభ ఏర్పడుతుంది. 8వ సభను రద్దు చేయకపోతే కాంగ్రెస్(ఐ) తనకు నూతన సభలో మెజారిటీ కోసం ప్రతిపక్ష బలాన్ని ఫిరాయింపులద్వారా చీల్చి, ఎన్నికల్లో ఓడిపోయినప్పటికీ తిరగి తానే మెజారిటీ పార్టీగా మంత్రివర్గం ఏర్పరుస్తుందేమోనని ప్రతిపక్షాలు అనుమానించాయి. కాని ఆ శంకలు నిరాధారమని రాష్ట్రపతి తాజా నిర్ణయం రుజువు చేసింది. అయితే, ఇప్పుడు ఎనిమిదవ సభ రద్దు అయిన తరువాత కూడా కాంగ్రెస్(ఐ) పరంగానూ, నేషనల్ ఫ్రంట్ పరంగానూ మిశ్రమ ప్రభుత్వాలు ఏర్పరచడానికి ప్రయత్నాలు సాగుతున్నాయి. రాజకీయాల్లో తుది నిర్ణయం ఉండదు. అవకాశవాదం ఆపద్ధర్మం. ఇందుకు నిదర్శనం పూర్తిమెజారిటీలు లేని రెండు పక్షాల నాయకుల వాదనలు: "వస్తే జనతాదళ్ సభ్యులను ఆహ్వానించడానికి కాంగ్రెస్(ఐ) విముఖం కాదు" అని ఆపార్టీ అధికార ప్రతినిధి ఆనంద శర్మ తెల్పగా, "మిశ్రమ ప్రభుత్వం" ఏర్పాటుకుగల అవకాశాలనూ పరిశీలిస్తున్నాం, చివరికి, గెలిచిన కాంగ్రెస్(ఐ) సభ్యులు కొందరు నేషనల్ ఫ్రంట్‌తో చేతులు కలపడానికి" సిద్ధమవుతున్నారని ఫ్రంట్ ప్రతినిధి ప్రకటించారు. ఈ 'ఆదాన ప్రదానాలు', ఈ "బేరసారాలు" రేపటిలోగా (30వ తేదీలోగా) ముగియకపోతే, తొమ్మిదవ లోక్ సభను ఏర్పాటుచేస్తూ నోటిఫికేషన్ జారీ అయితే - ఫిరాయింపుల నిరోధక చట్టం "శకుని

మామ''లా అడ్డు పడవచ్చు. అందుకే రెండు శిబిరాలలోనూ గజిబిజి, హడావుడి, తొక్కిసలాట! నిజానికి భారతదేశానికి ఎప్పుడో ఒకప్పుడు ఈ ప్రమాదం తప్పదని భావించే ముందు జాగ్రత్తకోసం గాంధీజీ స్వాతంత్ర్యం వచ్చిన మరునాడే దేశానికి ఉండవలసింది కాంగ్రెస్ పార్టీ ప్రభుత్వం కాదనీ, అది రద్దు అయి "జాతీయ ప్రభుత్వం" (అన్ని పక్షాలలోని బుద్ధిమంతులతో, సమర్థులతో ఏర్పడగల నేషనల్ గవర్నమెంట్) ఏర్పడాలనీ మొత్తుకున్నారు. కాంగ్రెస్‌ను "లోక్‌సేవక్ సంఘంగా", స్వచ్ఛంద సేవా సంస్థగా మార్చివేసుకోవాలన్నారు. వల్లభాయ్ పటేల్ అడ్డుపడకపోతే, అంతపనీ జరిగి ఉండేది! అంతేగాదు, ఇందిరాగాంధీ హయాములోనూ, ఆ తరువాత కూడా కాంగ్రెస్ వృద్ధ నాయకులలో ఒకరూ, కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ ఉపనాయకుడుగా ఉన్న ప్రొఫెసర్ ఎన్.జి.రంగా కూడా ఒకటి రెండు సందర్భాలలో కేంద్రంలో "జాతీయ ప్రభుత్వం" అవసరాన్ని నొక్కి చెప్పారు. ఇప్పటికైనా ఏదో ఒక రూపంలో ఆ ప్రతిపాదన ముందుకు తోసుకువస్తూనే ఉంది. రాజీవ్ లేని కాంగ్రెస్(ఐ), నేషనల్ ఫ్రంట్, తదితర నాన్-కాంగ్రెస్(ఐ) పక్షాలతో, శక్తులతో, "జాతీయ సమైక్యతా ప్రభుత్వం"(Government of National Unity) ఏర్పాటుకు కూడా కొందరు ప్రయత్నిస్తున్నారు. అలాంటి ప్రభుత్వం బి.జె.పి.కి కూడా సమ్మతం కావచ్చు!

నేషనల్ ఫ్రంట్ ఏర్పరచదలచిన సంకీర్ణ ప్రభుత్వంలో చేరడానికి "సిద్ధాంతాల" ముసుగులో బి.జె.పి., కమ్యూనిస్టు, మార్క్సిస్టు పార్టీలు పరస్పరం ప్రాతికూల్యం వ్యక్తం చేసుకొంటున్నాయి. ఈ పక్షాలు గుర్తించ నిరాకరిస్తున్న ఒక వాస్తవం - సంకీర్ణ మంత్రివర్గానికి కనీస కార్యక్రమం మాత్రమే మార్గదర్శకంగా ఉంటుందిగాని పార్టీ సిద్ధాంత చాదస్తాలు పునాదిగా ఉండవు! ఎందుకంటే, జనరల్ ఎన్నికలలో ఇంతకు ముందెన్నడూ ఎరుగని స్థాయిలో ఈసారి బలాబలాల్లో మార్పులు స్పష్టమవుతున్నాయి. ఈ బలాబలాలు సమస్యలపై ఆధారపడిన సమీకరణ. సుస్థిర ప్రభుత్వం ఏర్పాటుకు హామీ ఇచ్చిన అన్ని పక్షాలూ ఆ అవసరాన్ని తీర్చడం కోసం కనీస కార్యక్రమాన్ని అంగీకరించి తీరాలి. ప్రజల సమస్యల పరిష్కారానికి కనీస కార్యక్రమంపై ఆధారపడి పనిచేసే మిశ్రమ ప్రభుత్వాలు తమ పూర్తి వ్యవధిని అనుభవించిన ఉదాహరణలు మన దేశంలోనే ఉన్నాయి. అచ్యుత మీనన్ నాయకత్వంలో కేరళలో కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో ఏర్పడిన మిశ్రమ ప్రభుత్వం పూర్తిగా అయిదేళ్ళూ పనిచేసింది; అలాగే గత పదమూడేళ్ళకు పైగా నిరంతరాయంగా పశ్చిమ బెంగాల్‌లో వామపక్ష-ప్రజాస్వామిక ప్రభుత్వం జయప్రదంగా పనిచేస్తోంది. సూక్ష్మార్థంలోకి వెళ్ళాలంటే, మార్క్సిస్టు -బిజెపి సిద్ధాంతాలు ఈ విషయంలో చిలిపిగా ఉన్నాయి. వామపక్షాలు,రాజీవ్ కారణంగా కాంగ్రెస్‌తో కలిసి మిశ్రమ ప్రభుత్వం ఏర్పాటు చేయలేవు; బిజెపి కారణంగా అవి ఫ్రంట్ ప్రభుత్వంలోనూ చేరలేవు! కనీస కార్యక్రమంపై పనిచేయడానికి 'ప్రజాపంథా' తప్ప మరో సిద్ధాంతం అనవసరం. మార్క్సిస్టు పార్టీ ప్రభుత్వం కేరళలో ముస్లిమ్‌లీగ్ కోర్కె ప్రకారం పత్యేక ముస్లిమ్ జిల్లానే ఏర్పాటు చేసినపుడు, అది సెక్యులరిజం ఆదర్శాలకే భిన్నమైనపుడు - ఇంక ఆ పార్టీ మతాతీతంగా ఎక్కడ వ్యవహరించినట్టు? బి.జె.పి. హిందూ ధర్మం పేరిట మరొక కొలిక్కి లాగుతున్నా, జాతీయ శ్రేయస్సు కోసం కనీస కార్యక్రమంపై మిశ్రమ ప్రభుత్వంలో చేరడానికి ముందుకు రావచ్చు. ఆ మాటకొస్తే, రెండో ప్రపంచ యుద్ధం తర్వాత యూరప్‌లో ఏర్పడి సక్రమంగా పనిచేసినవన్నీ మిశ్రమ ప్రభుత్వాలే(Coalition governments)నని మరచిపోరాదు! స్పెయిన్, ఇటలీల్లో, నిన్నగాక మొన్న గ్రీస్‌లో ఆ ప్రయోగం జయప్రదమైంది. ఇంకా తాజాగా వివరించాలంటే - నలభైఏళ్ళ కమ్యూనిస్టు పాలన తర్వాత పోలెండ్‌లో క్రైస్తవ మత ప్రాతిపదికపై బలమైన రాజకీయ శక్తిగా అవతరించిన కమ్యూనిస్టు నాయకత్వాన్ని తోసిపుచ్చి

ప్రభుత్వంలోకి వచ్చిన "సాలిడారిటీ" తో తిరిగి కమ్యూనిస్టులు చేతులు కలపవలసి వచ్చింది! హంగరీలో కమ్యూనిస్టు ముసుగులో ఉన్న సోషల్ డెమొక్రటిక్ పార్టీ అధికారంలోకి రావడానికి చప్పుడు లేకుండా అనుమతించవలసి వచ్చింది; చెకొస్లొవేకియాలో ఉన్న నాయకత్వాన్ని కాదని - రష్యన్ టాంకులు 1968లో అణచి వేసి, బర్తరఫ్ చేసిన "ప్రాగ్ స్ప్రింగ్" ఉద్యమ నాయకుడు డూబెక్‌కు పట్టం కట్టాలని లక్షలాది ప్రజలు ముందుకు దూసుకు వస్తూంటే 'కిమ్మ'నకుండా కమ్యూనిస్టులు, పార్టీ రాజీపడవలసి వచ్చింది! "సివిక్ ఫోరమ్" సవాలును తలదాల్పవలసి వస్తోంది! గోర్బచేవ్ "పెరిస్త్రోయికా" (సంస్కరణ) ఒకచోట సమ్మతమై, మరొకచోట అసమ్మతం కావడానికి వీలులేదు! భారత కమ్యూనిస్టు, మార్క్సిస్టు పార్టీల వ్యూహం, ఎత్తుగడలూ మారాలి! ప్రాగ్మాటిజం రాజకీయాల్లోనూ తప్పనిసరి అవుతోంది.

నవంబర్ ౨౯, ౧౯౮౯

# కేంద్రంలో "కిచిడీ"

కాంగ్రెస్(ఐ) ఏకపక్షపాలనకు చాలా ఏళ్లుగా అలవాటుపడి (ఒక్క కేరళలో మినహాయించి) ఉన్నందున కేంద్రంలో సంకీర్ణ ప్రభుత్వాన్ని కాంగ్రెస్ సర్వసాధారణంగా అభిలషించదు, అభిమానించదు. 1977లో "జనతా" ప్రయోగంవల్ల సంకీర్ణ ప్రభుత్వం నిలవదేమోనన్న నిరాశ ప్రజల్లో కూడా ఉంది. అయితే నేడు దేశంలో మారిన పరిస్థితులలో, అటు తనకూ, ఇటు నేషనల్ ఫ్రంట్‌కూ మెజారిటీ ప్రభుత్వం ఏర్పాటే చేయగల పరిస్థితులు లేనందున, నేషనల్ ఫ్రంట్‌తోపాటు కాంగ్రెస్(ఐ) కూడా మిశ్రమ ప్రభుత్వం ఏర్పాటుకు ప్రయత్నించవచ్చు! అన్నా డి.ఎం.కె., నేషనల్ కాన్ఫరెన్సు, ముస్లిమ్‌లీగ్‌లతో పాటు వామపక్షాలైన సిపిఐ, సిపిఎమ్ పార్టీలను కలుపుకొని కాంగ్రెస్(ఐ) ఈ సంకీర్ణ మంత్రివర్గం ఏర్పాటుకు ప్రయత్నించవచ్చు. ఎందుకంటే, ఉత్తర, దక్షిణ భారతాలలో ఎన్నికల ఫలితాలు 1977 నుంచి తారుమారవుతున్నందున, ప్రజలు మార్పును కోరుతున్నందున ఇకనుంచి భారతదేశంలో - ఏకపక్ష పాలన అసంభవమని, క్రమంగా అన్ని వర్గాల ప్రజల ప్రయోజనాలు ప్రతిబింబించగల మిశ్రమ మంత్రివర్గాల శకం ఆవిష్కరించుకొంటోందనీ గుర్తించాలి. ఈ గుర్తింపు క్రమంగా జాతీయ సమైక్యతా ప్రభుత్వం స్థాపనకు దారితీస్తుంది. కొందరు కాంగ్రెస్(ఐ) నాయకులు ఈ ప్రయత్నాన్ని "కిచిడీ" అని ఈసడించుకున్నా, వంటవాడిని బట్టి కిచిడీ కూడా రుచికరంగానే తయారైనట్లు, 'రాజకీయ పాకశాస్త్ర' నిపుణుల శక్తి సామర్థ్యాలను బట్టి సమర్థవంతంగా నడిచిన సంకీర్ణ మంత్రివర్గాలు ప్రపంచంలో ఉన్నాయి! ఆదిలో కొంత గందరగోళం,తొట్రుపాటు ఉన్నా ప్రజా బాహుళ్యం పెట్టుకొన్న ఆశలను వమ్ము చేయకుండా వారి కనీసావసరాలను తీర్చగల కనీస కార్యక్రమం ఆధారంగా, ఆచరణకు అందని "కుందేటి కొమ్ముల"ను తీసుకువచ్చి అరచేతిలో వైకుంఠాలు చూపని అతి కనీస కార్యక్రమం ఆధారంగా జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోవచ్చు. గురు-శుక్రవారాలలోగాని నేషనల్ ఫ్రంట్, కాంగ్రెస్(ఐ) చేస్తున్న ప్రయత్నాల ఫలితం పూర్తిగా తెలియదు. కాంగ్రెస్(ఐ) సంకీర్ణ మంత్రివర్గం ఏర్పాటుకు ప్రయత్నిస్తుందా? లేక నేషనల్ ఫ్రంట్ మైనారిటీ ప్రభుత్వం ఏర్పాటుకు అవకాశం కల్పించి, తాను బాధ్యతాయుత ప్రతిపక్షంగానే పాత్ర నిర్వహిస్తుందా? నేషనల్ ఫ్రంట్ సుస్థిరమైన మైనారిటీ ప్రభుత్వాన్ని ఏర్పరచడంలో విఫలమైనపుడు మాత్రమే కాంగ్రెస్(ఐ)ని ప్రత్యామ్నాయంగా ప్రభుత్వం ఏర్పాటుకు రాష్ట్రపతి పిలవనంపుతారు. అయితే, జాతీయ ప్రతిపక్షాలలో ఎడమొగం పెడమొగంగా ఉన్న కమ్యూనిస్టు, మార్క్సిస్టు పార్టీ - బిజెపిలకు కాంగ్రెస్(ఐ) "పొడ" గిట్టకపోయినా జనతాదళ్ ప్రధాన విజేతగా, ప్రధాన భాగస్వామిగా ఉన్న నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వంలో చేరడానికి ఇష్టపడడంలేదు. ఫ్రంట్ ఏర్పరచనున్న మైనారిటీ ప్రభుత్వంలో బిజెపి చేరితే, కమ్యూనిస్టు - మార్క్సిస్టు పక్షం ఫ్రంట్‌కు మద్దతు ఉపసంహరిస్తుంది. వామపక్షాలు చేరేపక్షంలో ఫ్రంట్‌కు

బిజెపి మద్దతు రద్దవుతుంది! కావాలంటే బయట నుంచి మద్దతు ఇస్తామని ఉభయులూ ప్రకటించారు. ఇది 'హరకిరి' (ఆత్మహత్యా) రాజకీయం! ప్రజలు వేసిచ్చింది కనీస కార్యక్రమం ఆధారంగా ఒక్క తాటిపై నడిచి తమకు ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పరచమనేగాని, 'ఏటికొకరూ కోటికొకరూ' లాగమనికాదు! 1977 నాటి జనతా ప్రభుత్వం ఏ 'ముగ్గురు మూర్ఖుల'(మురార్జీ, జగ్జీవన్ రామ్, చరణ్ సింగ్) అలౌకిక రాజకీయం వల్ల, పదవీకాంక్షవల్ల, ప్రజలిచ్చిన ఆదేశాన్ని వమ్ము చెయ్యడంవల్ల పతనమైపోయిందో ఒక్క నేషనల్ ఫ్రంట్ మాత్రమే కాదు, దానికి "బయటి నుంచి మద్దతు" ఇస్తామని చెబుతున్న వామపక్షాలూ, బి.జె.పీ కూడా గుర్తుంచుకోవాలి! ప్రపంచంలో ఎక్కడా, సంకీర్ణ మంత్రివర్గాలు కనీస కార్యక్రమంపై నడచినవేగాని, మొండి పట్టుదలలపైన, సిద్ధాంత రాద్ధాంతాల పైన నడవలేదు! పలు పక్షాలతో కూడిన "జాతీయ ప్రభుత్వా' 'నికి అవసరమైనది - సామాన్య ప్రజలకు కనీసం కూడు, గుడ్డ, గూడు, ఉపాధి సమకూర్చి పెట్టేందుకు అవసరమైన కనీస కార్యక్రమమేగాని కంప్యూటర్ టెక్నాలజీలు, మారుతీ కార్లూ, మిట్సుబిషీ వాహనాలూ సమకూర్చడం కాదు. పార్టీల మానిఫెస్టోలన్నింటి లక్ష్యం ఇంతకు మించి ఏముంటుంది? పైగా పెట్టుబడిదారీ మార్గానికి పాలకులు దేశాన్ని ఏనాడో మళ్ళించి కూర్చున్న తరువాత ఆ "ప్రోసెస్"ను తిరిగి "రివర్స్ గేర్"లో పెట్టడం వామపక్షాలకు మాత్రం ఇప్పట్లో సాధ్యమయ్యేపనా? సోషలిస్టు దేశాలే "గేర్" మార్చుకొని అన్ని సడలింపులూ తెచ్చుకొంటూండగా, ఈ దేశంలో వామపక్షాలకు సంకీర్ణ మంత్రివర్గాలలో చేరడానికి ప్రత్యేక దడులూ, ముడులూ దేనికి?

నిన్నగాక మొన్న నిరంకుశ నాయకత్వాల మధ్య, రాజకీయాల మధ్య నలిగిపోయిన గ్రీస్‌లో సంకీర్ణ మంత్రివర్గం ఏర్పాటులో కమ్యూనిస్టులు ప్రముఖ పాత్ర వహించారు. మన దేశంలో ఈ ఎన్నికల్లో ఏర్పడిన పరిస్థితులే అక్కడా ఏర్పడ్డాయి! 1989 జనవరి నుంచి ఇప్పటికి మూడుసార్లు ఎన్నికలు జరగవలసి వచ్చింది- ఏ పార్టీకీ అక్కడ మెజారిటీ రానందువల్ల తీరా సంకీర్ణ మంత్రివర్గం ఏర్పాటు చేయవలసి వచ్చేసరికి కమ్యూనిస్టులు (గ్రీస్‌లో కూడా రెండు కమ్యూనిస్టు పార్టీలు ఉన్నాయి. ఆ రెండూ పక్షాలూ) వచ్చి మితవాద పక్షంతో ("న్యూ డెమోక్రసీ") చేతులు కలిపారు, మంత్రివర్గంలో చేరారు. గ్రీస్ పరిస్థితుల్లో కమ్యూనిస్టులు వద్దు వద్దనుకున్నా అనివార్యంగా అలా నిర్ణయించుకోవలసి వచ్చింది!! "కనీస కార్యక్రమం' 'ఆధారంగా జాతీయ సమైక్యత కోసం ప్రజలిచ్చిన ఆదేశాన్ని మన్నించి సిద్ధాంతాన్ని తాత్కాలికంగా పక్కకు పెట్టవలసి వచ్చింది! బ్రిటన్‌లో 1923-24 సంవత్సరాల్లో 1929-31 సంవత్సరాలలో ఏర్పడిన సంకీర్ణ మంత్రివర్గాలు కూడా కనీస కార్యక్రమం ప్రాతిపదికగా నాటి ప్రత్యేక పరిస్థితులలో నడచుకోవలసి వచ్చింది. ఈ రెండు ఘట్టాలలోనూ మైనారిటీ ప్రభుత్వంగా "లేబర్స్" పార్టీ లిబరల్స్ మద్దతుపైన ఆధారపడక తప్పలేదు. ఒకానొక జాతీయ సమస్యపై లిబరల్స్ మద్దతు ఉపసంహరించుకొన్నపుడు మాత్రమే మైనారిటీ ప్రభుత్వం పడిపోవలసి వచ్చింది. అయితే ఈ శతాబ్దంలో, పార్లమెంటులో కేవలం వోటింగ్‌లో వీగిపోవడంవల్ల ప్రభుత్వం అలా పతనం కావడం అన్నది మళ్ళీ 1979 వరకూ జరగలేదు! అలాగే 1931లో లేబర్స్ క్యాబినెట్‌లో చీలికవచ్చి, లిబరల్స్-కన్సర్వేటివ్స్ కలిసి సంకీర్ణ మంత్రివర్గాన్ని ఏర్పరచినా సవ్యంగానే సాగింది. పైగా ఆ మంత్రివర్గంలో కొందరు లేబర్స్‌ను కూడా చేర్చుకున్నారు! అలాగే 1974-79లో మైనారిటీ ప్రభుత్వం ఏర్పరచిన లేబర్ పార్టీకి, దాని బద్ధ విరోధులైన ప్లాయిడ్ సిమ్రూ, స్కాటిష్ నేషనల్ పార్టీ, లిబరల్ పార్టీలు అండదండలుగా నిలబడ్డాయి. ఇందులో మరో విచిత్రం- పెక్కు శాసన సంబంధమైన సమస్యలపైన ఆ మైనారిటీ ప్రభుత్వం సభలో వోడిపోతూ వచ్చినా, మద్దతు ఇచ్చిన పక్షాలేవీ

ఆ సమస్యలను మంత్రివర్గంపై "అవిశ్వాసం"గా భావించనూ లేదు! ఫలితంగా మంత్రివర్గం కొన్నాళ్ళు నిరాటంకంగా కొనసాగింది. అయిదేళ్ళ తరువాతగాని ఆ మైనారిటీ ప్రభుత్వంపై అవిశ్వాస తీర్మానం నెగ్గలేదు! 1965-75 మధ్య కాలంలో బ్రిటన్‌లోని పార్టీ వ్యవస్థలో కూడా మార్పులు వచ్చాయి. మూడు పార్టీల బదులు ఏడు పార్టీలు అవతరించాయి. ఫలితంగా అక్కడేగాదు, యూరోపియన్ ప్రజాస్వామ్య దేశాలన్నిటా ఈ పరిణామం సంకీర్ణ మంత్రివర్గాల యుగంగా ప్రారంభమైంది! కేంద్రస్థాయిలో సంక్షోభం తలెత్తినప్పుడల్లా "అఖిలపక్ష జాతీయ ప్రభుత్వం" అవసరాన్ని ప్రతిపాదించిన వాడు లిబరల్స్ నాయకుడు హెర్బర్ట్ శామ్యూల్. ఈ సూత్రం ఆధారంగానే పరస్పరం పొంతన లేకపోయినా జాతీయ ప్రయోజనాల దృష్ట్యా మాక్డొనాల్డ్ నాయకత్వాన కన్సర్వేటివ్స్, లిబరల్స్, లేబర్స్ కలిసి సంకీర్ణ మంత్రివర్గం ఏర్పాటు చేశారు! సంప్రదాయాలు, అనుభవాలు పాఠాలూ, గుణపాఠాలూ కావాలి. తప్పితే, వెన్నెముకలేని ప్రతిపక్షాల గతి చీలు బాటలేనని హోరెస్ వాల్ పోల్‌లాగా ప్రజలూ భావించుకోవలసి వస్తుంది.

నవంబర్ 30, 1989

# రాజీవ్ రాజీనామా : సంకీర్ణ మంత్రివర్గం

పార్లమెంటరీ వ్యవస్థలో, పార్టీ ప్రభుత్వ వ్యవస్థల్లో ఏక నాయకత్వం వల్ల నియంతృత్వ ధోరణులు ప్రబలి పార్టీని నిర్వీర్యపరచి, పతనానికి ఎంతగా తోవ చూపుతాయో, బహు నాయకత్వంవల్ల కూడా పార్టీ అంతగానూ ఛిద్రమైపోతుంది. ఈ రెండు పరిణామాలకు ఉదాహరణ కాంగ్రెస్-ఐ, నేషనల్ ఫ్రంట్‌లు. తొమ్మిదవ లోక్‌సభకు జరిగిన ఎన్నికలలో ఏ పార్టీకి తగిన మెజారిటీ రాకపోవడంతో, అంతకుముందు అధికారంలో ఉన్న కాంగ్రెస్-ఐ ఈ ఎన్నికల్లో మెజారిటీ కోల్పోయి "భాద్యతాయుత ప్రతిపక్షంగా" కొనసాగడానికి నిర్ణయించుకున్నందువల్ల - కేంద్రంలో ప్రభుత్వం ఏర్పరచే అవకాశం ఇప్పుడు నేషనల్ ఫ్రంట్‌లోని జనతాదళ్‌కు వచ్చింది. తన ప్రభుత్వం రాజీనామాను రాష్ట్రపతికి సమర్పించిన తరువాత, కాంగ్రెస్-ఐ పార్లమెంటరీ పార్టీ నాయకుడిగా ఏకగ్రీవంగా ఎన్నికైన తరువాత రాజీవ్‌గాంధీ చేసిన పత్రికా ప్రకటన వాస్తవ పరిస్థితులను ప్రతిబింబిస్తోంది. ప్రజల తీర్పును ఆయన నమ్రతతో స్వీకరించడమేగాక, ఏర్పడబోయే నాన్-కాంగ్రెస్ ప్రభుత్వానికి శుభాకాంక్షలు తెలిపారు. "దేశం సాధించిన విజయాలు" ఒక పార్టీ విజయావకాశాలు గా కాకుండా "ప్రజలు సాధించుకున్న విజయాలు"గా మొదటిసారిగా వినమ్రంగా పేర్కొన్నారు. "ఎన్నికల్లో గెలుపు, ఓటములు సహజం. కాని దేశ నిర్మాణ కార్యక్రమానికి ఆటవిడుపు ఉండ"దనీ, నూతన ప్రభుత్వం కూడా దేశ మౌలిక సూత్రాలైన "ప్రజాస్వామ్యం, సోషలిజం, సెక్యులరిజం, అలీన విధానా"లను కొనసాగిస్తుందన్న ఆశాభావాన్ని రాజీవ్ వ్యక్తం చేశారు. దేశంలో మారిన పరిస్థితులకు అనుగుణంగా ఉన్న ఈ ప్రకటన - గతంలో అనేక ఆటుపోటులను కాచివడపోసిన కాంగ్రెస్ సంస్థ మరొకసారి బాధ్యతాయుత ప్రతిపక్షంగా వ్యవహరిస్తూ రానున్న దినాలలో పార్టీని క్రమబద్ధంగా పటిష్టం చేసుకోగల ఆశాభావం కలిగిస్తోంది.

ఇది ఇలా ఉండగా, మరోవైపున కేంద్రంలో మైనారిటీ ప్రభుత్వం ఏర్పరచబోతున్న నేషనల్ ఫ్రంట్‌లోని ప్రధాన భాగస్వామి జనతాదళ్ - బహునాయకత్వ బెడదవల్ల నాయకుని ఎన్నిక సమస్యను ఒక కొలిక్కి తీసుకురాలేక (గురువారం వరకూ) తన రాజకీయ వ్యవహారాల కమిటీ సమావేశాన్ని ఇప్పటికే రెండుసార్లు వాయిదా వేసుకుంది. 1966లో కాంగ్రెస్ శిబిరంలోనూ, 1977లో "జనతా" శిబిరంలోనూ నాయకత్వ నిర్ణయంపై సాగిన రసాభాసనుంచి, అవమానకరమైన పరిణామాలనుంచీ జనతాదళ్ నాయకత్వం ఏమాత్రం గుణపాఠాలు నేర్చుకున్నట్లు కన్పించడంలేదు. 1977 నాటి "ముగ్గురు మూర్ఖుల"కథ మళ్ళీ మొదలయ్యే పక్షంలో త్వరలోనే రాష్ట్రపతి, తొమ్మిదవ లోక్‌సభలో ఏకైక పెద్ద పక్షంగా, ఉన్న (మెజారిటీ లేకపోయినా) కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ నాయకుణ్ణే తిరిగి ప్రభుత్వం ఏర్పరచమని కోరినా కోరవచ్చు. కాని ఆ అవకాశాన్ని నేషనల్ ఫ్రంట్ పక్షాలు ఈసారి కల్పించకపోవచ్చు. అధికారం ఎవరికీ 'చేదు' కాదు కాబట్టి, స్పర్ధలను కదదొక్కుకుని నాయకత్వ సమస్యను పరిష్కరించుకొనే అవకాశాలే ఎక్కువ కన్పిస్తున్నాయి. మార్క్సిస్టు పార్టీ(కమ్యూనిస్టులు కూడా), బిజెపిలు ఫ్రంట్ మైనారిటీ ప్రభుత్వంలో చేరదు. కాని ఫ్రంట్

ప్రభుత్వానికి బేషరతు మద్దతును ఒక పక్షమూ, "విమర్శనాయుతమైన" బేషరతు మద్దతును మరొక పక్షమూ తొలిసారిగా ప్రకటించాయి. అందువల్ల పెక్కు యూరోపియన్ దేశాలలో మాదిరిగానే మన దేశంలో కూడా మొట్టమొదటిసారిగా "హంగ్ పార్లమెంటు (ఎవరికీ పూర్తి మెజారిటీలేని పార్లమెంటు - దానినే "త్రిశంకు సభ"అందాం), మైనారిటీ ప్రభుత్వమూ ఏర్పడబోతోంది. ఈ పరిణామం ఫలితంగా, ఈ "హంగ్' ' పార్లమెంటు గురించీ, తొలి మైనారిటీ ప్రభుత్వం గురించీ ఇంతవరకూ అటు కాంగ్రెస్ వర్గాల్లోనూ, ఇటు నాన్-కాంగ్రెస్ వర్గాల్లోనూ సాగుతున్న రాజ్యాంగ సంబంధమైన శషభిషలు ముగియవలసి వస్తుంది. ఎందుకంటే రాజకీయ శక్తుల బలాబలాల్లో వస్తున్న మార్పులవల్ల, ప్రాంతీయ ధోరణులు, కేంద్ర - రాష్ట్ర సంబంధాల విషయంలో సర్వత్రా ప్రస్ఫుటమవుతున్న దోరణలు, "కో-ఆపరేటివ్ ఫెడరలిజం" వైపు పెరుగుతున్న ఆదరాభిమానాలవల్లా ఉత్తర - దక్షిణ భారతాల మధ్య గండి పెరుగుతోంది. వీటన్నింటి ఫలితమూ ప్రజలు మార్పును కోరడం. ఈ మార్పు ప్రాంతీయ ప్రయోజనాలకోసం కాదు, మొత్తం దేశ ప్రయోజనాలకోసం. కనుకనే ఈసారి ఎన్నికల్లో దక్షిణాదిన ఆంధ్ర, కర్నాటక, తమిళనాడుల్లో విజయం ప్రాంతీయ పక్షాలదే కావడం అందరూ ఆహ్వానించదగ్గ పరిణామం. అయితే ఇది మరొక సత్యాన్ని కూడా నొక్కి చెబుతోంది. ఈ దేశానికి నేత ఏ ఒక్క రాజకీయ పక్షమో కాదనీ, అన్ని పక్షాల విశిష్ట సమాహారమే ఈ ఎన్నికల ఫలితమనీ, ప్రపంచ వ్యాపితంగా వస్తున్న నూతన ధోరణులలో భాగంగానే ప్రజలు "జాతీయ ప్రభుత్వాన్ని" కోరుకుంటున్నారనీ! ఈ జాతీయ ప్రభుత్వానికి ముందు జరుగుతున్న ప్రయోగమే రేపో మాపో ఫ్రంట్ నాయకత్వంలో ఏర్పడనున్న మైనారిటీ ప్రభుత్వం లేదా మిశ్రమ ప్రభుత్వం. బ్రిటన్‌లో రాజకీయ శక్తుల బలాబలాల్లో వస్తున్న తాజా మార్పులను దృష్టిలో పెట్టుకోబట్టే బ్రిటీష్ పరిణామాలపై వ్యాఖ్యానిస్తూ రాజ్యాంగ నిపుణుడు డేవిడ్ బట్లర్ ఇలా చెప్పవలసి వచ్చింది: "1950లలో లాగా, 1960లలో లాగా నిశ్చయాత్మకమైన, నిర్ణయాత్మకమైన మెజారిటీలన్నవి ఇకపైన అసాధ్యమని - 1980లలో బ్రిటన్‌లో వచ్చిన పరిణామాలు నిరూపించాయి" ("Governing without a Majority" P-9). ఈ హంగ్ పార్లమెంటు సంప్రదాయం క్రమంగా మనకి కూడా అబ్బింది. నిజానికీ పరిస్థితి - పార్టీకి పోలైన వోట్ల దామాషానుబట్టి ఆ పార్టీకి సీట్లు పంచే పద్ధతివల్ల వచ్చింది. ఇక్కడ మనకు దామాషా ప్రాతినిధ్య వ్యవస్థ లేకపోయినా, ఈసారి "హంగ్"('balanced' Parlament) పార్లమెంటు తప్పలేదు. ఈ రోజుకీ ఏ అనుమానం వచ్చినా మనం ఎదురుచూచే బ్రిటీష్ (రూల్‌బుక్) సంప్రదాయం ప్రకారం, "సంకీర్ణ ప్రభుత్వానికి పార్లమెంటులో మెజారిటీ సీట్లు విధిగా ఉండవలసిన అవసరం లేదు". అంతేగాదు, ఏ పక్షానికీ పార్లమెంటులో పూర్తి మెజారిటీ లేనపుడు – ఒకటీ, అంతకు మించిన ఇతర పార్టీలు పార్లమెంటరీ వోట్ల ఆదరవుతో "ఏకపక్ష మైనారిటీ" ప్రభుత్వాన్ని కూడా ఏర్పరచవచ్చునని రాజ్యాంగ నిపుణుల అభిప్రాయం (జె.ఎస్.రామస్ ముసెన్: "Who gets Hung In a Hung Parliament?" పే.135). నిజానికి ఈ శతాబ్దంలో మూడింట రెండొంతుల కాలం బ్రిటన్‌లో ఏకపక్ష మెజారిటీ ప్రభుత్వాలే పనిచేశాయి! కానీ, తర్వాత పరిస్థితులు మారి, ఏకపక్ష మైనారిటీ మంత్రివర్గాలు, సంకీర్ణ ప్రభుత్వాలు చాలా తక్కువని మరో నిపుణుడు ఆర్.ఎమ్.పునెట్("British Government & Politics" P-494) రాశాడు! అంతేగాదు, 1910-15, 1974-79 సంవత్సరాలమధ్య మైనారిటీ ప్రభుత్వాలు "కనీస కార్యక్రమం"పై ఆధారపడి ఇబ్బందులమధ్యనే బతికి బట్టకట్టాయి. బాల్డ్ విన్, మాక్డోనాల్డ్, లాయిడ్ జార్జ్, చర్చిల్ - వాటిని సమర్థవంతంగా నిర్వహించుకొన్నారు. కాబట్టి ఇంతకూ అసలు సమస్య - నాయకత్వ సామర్థ్యం. అది బజారులో దొరికే వస్తువు కాదు! వ్యక్తిత్వం వల్ల, మానసిక స్థిమితం వల్ల, సహనంవల్ల, నిర్ణయాత్మక శక్తివల్ల యుక్తి వల్ల లభిస్తుందిగాని అనుక్షణం కీచులాటలవల్ల కాదు.

డిసెంబర్ 1, 1989

# "తడ": పోలీసుల తడాఖా!

మన ప్రజాస్వామ్యం ఓ మేడిపండన్నాడు జార్జి బెర్నార్డ్‌షా. నొక్కితే చాలు తుస్సుమని పోయే బెలూన్ లాంటిది ఈ ప్రజాస్వామ్యం అన్నాడు "యాపిల్‌కార్ట్" నాటకంలో. అంతేకాదు, నీ చట్టాలు అక్రమాలకు, అన్యాయాలకూ ప్రతిబింబాలయినప్పుడు, నీ పోలీసులు నిర్బంధకాండకు ఏజెంట్లుగా మారినప్పుడు వచ్చే ఫలితం - పౌరహక్కుల దారుణ ఉల్లంఘన మాత్రమేనని "మేజర్ బార్బారా" నాటకంలో చెబుతాడు. అందుకని ప్రజారంజకమైన చట్టాలను రూపొందించుకోవాలని సలహా ఇస్తాడు. ఈ సలహా మన పాలకులకు నచ్చినా నచ్చకపోయినా, ఆంధ్రప్రదేశ్ స్పీకర్ జి. నారాయణరావు శాసనసభలో చేసిన ప్రకటన తర్వాతనైనా ముఖ్యమంత్రి ఎన్.టి.రామారావు, హోంమంత్రి మాధవరెడ్డి, పోలీసు ఉన్నతాధికారులూ తగిన జాగ్రత్తలు తీసుకోవలసిన అవసరం ఉంది. కేంద్రంనుంచి రాష్ట్రాలవరకూ నేడు అమలు జరుపుతున్న "టెరరిస్టు, విచ్ఛిన్నకర కార్యకలాపాల నిరోధక చట్టం" (తడ)" అజ్ఞాతంగా టెరరిస్టు చర్యలకు పాల్పడి జననష్టాన్ని, ఆస్తినష్టాన్ని కల్గిస్తున్న ఉగ్రవాదులకు వారి రహస్య కార్యకలాపాల నిరోధానికి ఉద్దేశించినదేగానీ బహిరంగంగా సభలు, సమావేశాలు జరుపుకొనే లీగల్ రాజకీయ కార్యకర్తలను, పౌరులను ఇబ్బందులపాలు చేయడానికి ఉద్దేశించినది కాదు. కానీ పాలకులూ, పోలీసులూ ఈ నియమాలను పాటించడంలో విఫలలు కావడమేగాక, విచక్షణ లేకుండా "తడ" ఆధారంగా నిర్బంధకాండకు దిగడంవల్ల సాధారణ ప్రజా బాహుళ్యం నుంచి ప్రతిఘటనను కొని తెచ్చుకుంటున్నారు. శాసనసభలో కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు - లెనినిస్టు) సభ్యుడు గుమ్మడి నాగేశ్వరరావు చేసిన ఆరోపణలు, విస్పష్టమైన ప్రకటన ఆధారంగా సభాపతి నారాయణరావు "ప్రజలను పోలీసులు భీతావహులను" చేస్తున్నారనీ, ఇలా 'టెర్రరైజ్' చేసే పోలీసులపై కూడా "తడ" చట్ట నిబంధనల ప్రకారం చర్య తీసుకోవడం సబబుగా ఉంటుందనీ" చెప్పవలసి వచ్చింది. అంతేగాదు, ఖమ్మం జిల్లాలో లీగల్‌గా కూడా సభలు, సమావేశాలూ పెట్టుకోనివ్వడం లేదనీ, ప్రజాస్వామ్యయుతంగా జరిపే సభలను కూడా పోలీసులు నిరోధిస్తున్నారని మహ్మద్ రజబలీ సహా సభ్యులు చేసిన ఆరోపణలను వెంటనే విచారించి 15వ తేదీకల్లా తనకు తెలపవలసిందిగా స్పీకర్ కోరారు. కడచిన సంవత్సర కాలంలో "తడ" పేరిట పోలీసులు మోపిన కేసుల్లో మండలాధ్యక్షులు, ఉపాధ్యక్షులు, సర్పంచ్‌లూ ఉన్నారు. లీగల్‌గా పనిచేస్తున్న వారిని పోలీసులు వేధించడంలో ఉద్దేశం, ఆయా లీగల్ పదవులను వదలిపోవలసిందిగా వారిని వత్తిడిచేయడంలో ఉద్దేశం ప్రజాస్వామిక ఆందోళనా పద్ధతులను విడనాడి రహస్య కార్యకలాపాలు చేపట్టమని బాహాటంగా వారిని అజ్ఞాతవాసంలోకి నెట్టడమా? ప్రజాస్వామ్య విలువలను కాపాడగోరే ఏ ప్రభుత్వమూ, ఇంగిత జ్ఞానం కల ఏ పాలకుడూ చేజేతులా అశాంతిని ఇలా సృష్టించుకోడు. టెరరిస్టు నిరోధక చట్టం పేరిట, టెరరిస్టులను

నిర్బంధించడంతోపాటు, సాధారణ లీగల్ ఆందోళనకారులను, అనుమానితుల పేరిట సామాన్య పౌరులను పంజాబ్‌లో ఎలా వేధిస్తున్నదీ, సి.పి.ఐ., కాంగ్రెస్‌లోని ప్రజాస్వామ్యవాదులు సహా ఎలా నిరసన ప్రకటనలు విడుదల చేసిందీ మనకు తెలుసు. పైగా ''జాడ తెలియని'' కొందరు రాడికల్ కార్యకర్తల ఆచూకి గురించి, ''ఎన్‌కౌంటర్ల' పేరిట జరిగిన కాల్పులలో మరణించిన యువకుల గురించి విచారణకు రాష్ట్ర ప్రభుత్వం ఇప్పటికే ఒక జ్యుడిషియల్ కమిషన్‌ను నియమించి ఉన్న సందర్భంగా అసెంబ్లీలో ఈ సరిక్రొత్త ప్రస్తావన వచ్చింది. ఆంధ్రప్రదేశ్ సహా యావద్భారతంలోనూ ముఖ్యంగా పంజాబ్ ఉత్తరప్రదేశ్‌లో, పోలీసు కాల్పులలో చనిపోయిన లేదా ''తడ'' చట్టం చాటున ''జాడతెలియని'' యువకుల గురించి పూర్తి వివరాలు తెలుపవలసిందిగా చివరికి సుప్రసిద్ధ అంతర్జాతీయ క్షమాభిక్ష సంస్థ (ఎమ్నెస్టీ ఇంటర్నేషనల్) ప్రభుత్వాలను కోరింది. ఈ యువకులను పోలీసు ఆఫీసర్లు (వీరిలో కొందరు పౌర దుస్తుల్లో ఉన్న గూఢచారి శాఖ అధికారులు) అపహరించుకుపోయినట్టు తెల్పిన ప్రత్యక్ష సాక్షుల కథనాన్ని కూడా ''ఎమ్నెస్టీ'' సంస్థ ప్రభుత్వాలకు పంపిన లేఖలో జతపరిచింది. అరెస్టుకు కారణాలు తెలుపకుండా, తెలిపిన చోట్ల విచారణ జరపకుండా, ఏళ్ళూ పూళ్ళూగా ''అండర్ ట్రయల్స్''గా జైళ్ళలో మగ్గబెట్టడాన్ని ప్రశ్నిస్తూ ఈ సంస్థ ''సమ్ రీసెంట్ రిపోర్ట్స్ ఆఫ్ డిసప్పియరెన్సెస్'' అన్న పేరిట ఒక మెమొరాండాన్ని విడుదల చేసింది.

ఇలా అపహరించుకుపోయిన వారి ''జాడ తెలియని'' కేసులు మీరట్‌లోకూడా డజన్ల సంఖ్యలో వున్నాయి. విచారణ సంఘాలు నివేదికలు సమర్పించాయి. అయినా ఇంతవరకూ వాటిని పూర్తిగా ప్రకటించనేలేదు. ఆ మెమొరాండంలో ''ఎమ్నెస్టీ'' సంస్థ చేసిన సిఫారసులు అలాంటి ''జాడ తెలియని'' కేసులన్నింటిపైన విధిగా విచారణ జరపాలని ఇండియా సభ్యదేశంగా వున్న ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ ఇచ్చిన ఆదేశానికి అనుగుణంగా ఉన్నాయి. ఆ మెమొరాండం పేర్కొన్నది :

''పౌరుల జాడ తెలియకుండా చేయడంలో లేదా వారిని మాయం చేయడానికి పోలీసులు లేదా భద్రతా దళాల సభ్యులు బాధ్యులని సాక్ష్యం ఉన్న కేసులన్నింటిలోనూ క్రిమినల్ లా ప్రకారం పోలీసులను ప్రభుత్వం శిక్షించేటట్టు చూడాలి. అంతేగాదు, పోలీసులు లేదా భద్రతా దళాల సిబ్బంది అక్రమ ప్రవర్తన వల్ల వ్యక్తులు 'మటుమాయమయ్యా'రని నిర్ధారణ అయిన సందర్భాలలో జాడ తెలియని వారి బంధువులకు తగిన న్యాయమైన నష్టపరిహారాన్ని ప్రభుత్వం చెల్లించాలి.''

''ఎమ్నెస్టీ ఇంటర్నేషనల్'' ప్రకటించిన ఈ విశిష్ట పత్రంలోని అంశాలకు స్పీకర్ నారాయణరావు ఆదేశాలు సరిపోలుతున్నాయి. అంతేగాదు, 1988లో సమితి జనరల్ అసెంబ్లీ, డిటెన్షన్ లేదా జైలులో నిర్బంధం విషయంలో నిర్బంధితుల రక్షణకు సంబంధించిన సూత్రీకరణలను రూపొందించిన సంస్థ సిఫారసులను కూడా ఆమోదించి ఉంది. అరెస్టు అయిన వారి తాలూకు పూర్తి వివరాలున్న రికార్డులను విధిగా కాపాడాలన్నదే ఆ నిర్ణయం. ఇది కూడా మనకు అమలులో లేదని ''ఎన్‌కౌంటర్ల' ' భాగోతం రుజువు చేస్తోంది. స్పీకర్ ఆదేశాన్ని రాష్ట్ర ప్రభుత్వం ఏ మేరకు పాటిస్తుందో వేచి చూడాలి. అన్నట్టు, ''తడ''లాంటి దారుణ చట్టాలను ఉపసంహరించాలని కోరుతూ ఆ అంశాన్ని తమ 14 అంశాల పత్రంలో ఒక భాగంగా చేసిన కులదీప్ నయ్యర్, తార్కుండే సంస్థల సంయుక్త ప్రకటనను ఆమోదించిన ఎన్.టి.ఆర్. - ''తడ''ను ఎప్పుడు తొలగిస్తారు?!

శుక్రవారం 15 సెప్టెంబరు 1989

# కుంభకోణాలు: గాంధీ హెచ్చరికలు!



తీయోద్యమంనాటి లక్ష్యశుద్ధి, ఆదర్శదీక్ష, త్యాగనిరతి - వాటికి దూరమైపోతున్న ఇప్పటివారికి ఏవో కథలుగా అనిపించవచ్చు. అలాగే రాజకీయపక్షాల నీతి, నియమ నిబంధనల విషయంలోనూ అంతే. దేశ స్వాతంత్ర్యం లక్ష్యంగా ఇంట్లో ఉన్నా లేకున్నా, ఒంట్లో శక్తి ఉన్నా ఉడిగినా నాయకులు, ప్రజలు అయినకాడికి ఆస్తులు తెగనమ్మి త్యాగాలు చేశారు. ఇప్పుడో? సంపాదనకోసం దేశాన్నే త్యాగం చేయడం గొప్ప 'ఆదర్శం' అయిపోతోంది. ఆ మాటకొస్తే ఇప్పుడనే కాదు, జాతీయ సమరం కొనసాగి దేశానికి స్వాతంత్ర్యం వచ్చేవరకూ నాయకుల ప్రవర్తన ఒకరకంగానూ, లెజిస్లేచర్స్‌లోకి ప్రవేశించి అధికారం రుచిమరిగిన తరువాత ఒకరకంగానూ ఉండడాన్ని ఆనాడు గాంధీజీ కనిపెట్టేసారు. 1937లో ఎప్పుడైతే కొన్ని రాష్ట్రాల్లో కాంగ్రెస్ అధికారంలోకి వచ్చిందో, అప్పటినుంచి 1948 జనవరి వరకూ కడచిన పరిణామాలను సమీక్షించుకున్న గాంధీజీ ఒక ప్రార్థనా సమావేశంలో గుండె బరువుతో ఒక ప్రకటన చేశారు. అది - కొండా వెంకటప్పయ్య పంతులుకూ, గాంధీజీకి మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాలలోని సారాంశం: "ఆదర్శంలో ఉన్నత సంస్థగా, ఆచరణలో విజయభేరి మోగించిన రాజకీయ పక్షంగా కాంగ్రెస్ సంస్థలో అప్పుడే పుండుపుట్టింది. లెజిస్లేచర్స్‌లో ప్రవేశించిన పార్టీ ప్రతినిధులు అవినీతిపై ధ్వజమెత్తి ఉపన్యాసాలైతే దంచుతున్నారుకాని, వారే కనీవినీ ఎరుగని అవినీతికి పాల్పడుతున్నారు. ప్రజల అమాయకత్వాన్ని అసరా చేసుకొని రకరకాల అవినీతికి (లైసెన్సులు, బ్లాక్ మార్కెటింగ్, అధికారుల ట్రాన్సఫర్ల కోసం ప్రభుత్వ యంత్రాంగాన్ని స్వప్రయోజనానికి వాడుకోవడం) పాల్పడుతున్నారు. న్యాయం జరగకుండా జ్యూడిషియరీని అవినీతి పాల్జేస్తున్నారు" అని ఆ జాబుల్లో నిశితంగా తూర్పారబట్టారు. (1948 జనవరి 11 లేఖ). అంతేగాదు "బ్రూట్ మెజారిటీద్వారా వీరు ఈ అవినీతిని సమర్థించుకుంటూ నెట్టుకొస్తున్నారని సూచన ప్రాయంగా చెబుతూ, ఇంతకంటే ప్రజలను, సమాజాన్ని నాశనం చేసే "ప్లేగువ్యాధి" మరొకటి ఉండబోదని అంటూ ఒక సూచన చేశారు గాంధీజీ: ఈ లెజిస్లేటర్ల సంఖ్య ఎంత తగ్గితే సమాజానికి చెరుపుకూడా ఆ మేరకు తగ్గుతుందనీ, ప్రతి రాష్ట్రంలోనూ విధానసభలో 50 మందికీ, విధాన పరిషత్‌లో 50 మందికీ వీరి సంఖ్య మించరాదనీ, ఆయన ప్రతిపాదించారు. ఈ మేరకు రాజ్యాంగ సవరణ చేయవచ్చునేమో రాజ్యాంగ నిపుణులు పరిశీలించాలని కూడా గాంధీజీ సూచించారు!

నేడు దేశంలో ఎటుచూచినా - కేంద్రంనుంచి రాష్ట్రాలవరకూ - ఆరోపణల రూపంలోనో లేదా స్పష్టమైన అభియోగాల రూపంలోనో పబ్లిక్ జీవితం కలుషితమయిపోతోంది. పలువురు నాయకుల గురించి, పరిపాలకుల, అధికారుల గురించి ఇంతకు ముందెన్నడూ లేనన్ని "కుంభకోణాలు" వినవస్తున్నాయి,

బహిర్గతమవుతున్నాయి; ఇందులో కొన్ని వ్యక్తుల పరువునేగాక పార్లమెంటు, రాష్ట్రాల లెజిస్లేచర్ల ప్రతిష్ఠను కూడా దెబ్బతీసే అభియోగాలు. ఇవన్నీ గాంధీజీ హెచ్చరికను ఇనుమడింపచేసేవిగానే ఉన్నాయిగానీ, ఆయని అభియోగాన్ని సవరించగలవిగా లేవు. ప్రధానమంత్రి కార్యాలయాన్ని ఆసరా చేసుకొని కుమార్ నారాయణ్ వంటి ఆయుధ వ్యాపారులు లేదా మధ్య దళారులు మంత్రులను, అధికారులను అంటకాగి దేశరక్షణ రహస్యాలను విదేశాలకు చేరవేసారు. ఫెయిర్‌ఫాక్స్ విచారణ, బోఫోర్స్ తుపాకుల ఒప్పందాలు మన పబ్లిక్ జీవితానికి మాయని మచ్చలు; "కూమో" ఆయిల్ ఒప్పందం కుంభకోణం, జర్మన్ సబ్-మెరైన్‌ల కొనుగోలు ఒప్పందమూ మన పార్లమెంటరీ వ్యవస్థ తీరుతెన్నులను ప్రశ్నించడమే కాదు, ప్రతినిధులను ఎన్నుకున్న ప్రజల చైతన్యానికే సవాలుగా నిలిచాయి! అంతూలే, అర్జున్‌సింగ్‌లను కోర్టు శరించినా వారికి చీమకుట్టలేదు. ఈ వరసలో చేరిన తాజా "కుంభకోణాలు" - జకోస్లోవేకియాతో కుదుర్చుకున్న "పిస్టల్స్" ఒప్పందమూ, దేశానికి మూడున్నర కోట్ల రూపాయల మేరకు కస్టమ్స్ సుంకాన్ని నష్టపరిచిన "ఫాడర్-మెషీన్ల" దిగుమతులూ. జ్యుడిషియరీ కూడా ఆరోపణలకు అతీతంగా లేదనడానికి భోపాల్ గ్యాస్ కేసులో దాని తొలి తీర్పు నిదర్శనం! వీటికి సంబంధించిన అన్ని దాఖలాలూ దొరక్కపోవచ్చు. కాని దొరికిన దాఖలాలను కూడా ప్రజలు ఎన్నుకున్న లెజిస్లేచర్లకు చూపించకుండా తొక్కిపడుతున్నారు. "అధికార రహస్యాల చట్టం" ఉపయోగపడుతున్నది ఇందుకోసమేగానీ, ఎన్నుకున్న ప్రజలకు తమ "పూచీకత్తు"గా భావించి అమలుచేయడానికి వీలు కాదు! అలాగే కర్ణాటకలో హెగ్డేకు సంబంధించి సుబ్రహ్మణ్యస్వామి లేవనెత్తిన భూముల కుంభకోణం; ఇటు ఆంధ్రప్రదేశ్‌లో ఎన్టీఆర్ ప్రభుత్వంపై వచ్చిన "నాచారం" కుంభకోణమూ. కాని అసలు విశేషం - ఆరోపకులుగానీ, ఆరోపితులుగానీ పూర్తి విచారణకు గజ్జె కట్టకపోవడం! ఎందుకని? "తిలాపాపం తలా పిడికెడు"గా ఈ వ్యవహారాలన్నీ ఉన్నందున ఇదొక "కపట కలహం"గా ఉభయపక్షాలా మారిపోయింది. ప్రజలను ఎంత చాకచక్యంతో మోసపుచ్చవచ్చునో నిరూపించేందుకే మన పార్లమెంటరీ వ్యవస్థ పాటుపడుతున్నట్లుగా ఉంది! అందరూ "గురువింద"లైనచోట ప్రజలకు "ఆదర్శం" అన్నది గాలిమాట, లేదా నీటిమూట. ఇకనైనా మనకు వికట కవుల అవసరం ఎంతైనా ఉందేమో అనిపిస్తుంది. అది శ్రీశ్రీకందంలో దొరకుతుంది : "ఈ రోజులలో ఎవడికి నోరుంటే వాడే రాజు, నూరుచు మిరియాల్ కారాలు, తెగ బుకాయిస్తే రాజ్యాలేలవచ్చు సిరిసిరిమువ్వ!".

శుక్రవారం మే 5, 1989

# అమానుషం, పాశవికం!

మానవుడు కావాలని కోరుకుని శాపగ్రస్తుడైతే చేయగలిగిందేమీ లేదుగానీ, ఒక రకమైన "డెత్‌విష్" ఏదో ఏడిపించకపోతే తన మరణశాసనాన్ని తాను లిఖించుకోడు! పేదలను ఉద్ధరించే పేరిట, సిద్ధాంతం పేరిట ఉగ్రాదులు ఒకవైపునుంచి, నా మతానికి మించింది లేదని కూపస్థమండూకాల్లా జీవిస్తూ తమ ప్రాణాలను మాత్రం కాపాడుకుంటూ సామాన్య ప్రజల ప్రాణాలను గడ్డిపోచలుగా భావించి వీరంగం వేస్తున్న మత దురహంకారులు మరొకవైపునుంచీ దేశ వ్యాపితంగా సృష్టిస్తున్న అరాచకంలో భాగమే ఆంధ్రప్రదేశ్ రాజధానీ నగరంలో (పాతబస్తీలో) కల్లోలాలు కూడా. ప్రజాబాహుళ్యం సంక్షేమానికి సారథ్యం వహించవలసిన రాజకీయాలను నేర ప్రవృత్తి వైపునకు రాజకీయ పక్షాలు మళ్ళించడంవల్ల, ప్రజా ప్రతినిధుల పేరిట కొన్ని చోట్ల రౌడీలను, కేడీలను లెజిస్లేటర్లుగా నిలబెట్టడంవల్ల, రాజకీయాలను మత రాజకీయాలకు దూరంగా ఉంచకుండా స్వార్థ ప్రయోజనాలకోసం వివిధ పార్టీలు వ్యక్తిగత విషయాలైన ప్రజల మత విశ్వాసాలను దుర్వినియోగం చేసినందువల్ల ఈ దౌర్భాగ్యం దేశాన్ని, జంటనగరాలను పట్టి పీడిస్తోంది. వెర్మెట్ట పోలీసుకాల్పుల తర్వాత, ఉగ్రవాదుల, పోలీసుల అరాచకం తర్వాత వారం రోజులు తిరక్కముందే హైదరాబాద్ (పాతబస్తీ)లో మతపరమైన వివిధ ఘర్షణల్లో సోమవారం ఉదయానికి 76 మంది ప్రాణాలు కోల్పవడం - మనం ధర్మాచరణకుగానీ, నాగరిక జీవనానికిగానీ ఎన్ని వందలమైళ్ళు దూరంలో ఉన్నామో తేటతెల్లం చేస్తోంది. 21వ శతాబ్దం చూసి లొట్టలు వేస్తున్న నాయకులు 20వ శతాబ్దం ఆఖరి పాదంలో కూడా చాందసభావాల పేరిట, సంప్రదాయాలపేరిట, మతం పేరిట సాగుతున్న దుర్మార్గాలను పట్టించుకోనంతకాలం - ఆచరణలో మనం మధ్యయుగాలలోనే, అంధ విశ్వాసాలతో అభివృద్ధిని చేజేతులా కుంటుపరుచుకున్న అంధయుగపు మానవులంగానే మిగిలిపోతాం. శాంతి భద్రతలు నెలకొల్పడంలో పోలీసులు విఫలమైన చోట సైన్యం రంగంలోకి దిగవచ్చు. "కనబడితే కాల్చుమని" తాఖీదులు జారీ చేయవచ్చు. కానీ ప్రజా జీవనం ఇలా ఉండాలని శాసించగల నైతిక ధర్మబోధ చేయగల సత్తా ఈనాటి నాయక తరానికి ఎక్కడుంది. మతం పేరిట సాగించే మారణకాండలో గూండాలు తండాలుగా వచ్చి ప్రజల శాంతి భద్రతలను చిందరవందర చేస్తున్నప్పుడు సంఘ విద్రోహశక్తుల ఆట కట్టించడం కేవలం ప్రభుత్వం బాధ్యతే కాదు, మొత్తం పౌరులందరి విధి కూడా. ప్రజలను ఎదుర్కొనే ధైర్యం లేకనే గూండాలు, మత గూండాలు ముసుగు "వీరులు"గా మారవలసివచ్చింది. గుర్తుపట్టకుండా రంగులు పూసుకుని విచ్చలవిడిగా చెలరేగి స్త్రీలు, పురుషులు అన్న వివక్ష లేకుండా ఇరువర్గాలకు చెందిన వందల కుటుంబాలను భయానక పరిస్థితులలోకి నెట్టారు. సందు గొందుల్లో హత్యలకు, మానభంగాలకూ దిగారు. సామూహిక శక్తిని ప్రజలు ప్రదర్శిస్తే ఈ శక్తుల నరాలు తెంచవచ్చు. చివరికి ఈ మత జాడ్యం

గ్రామసీమలకుకూడా పాకడం (ఉత్తరప్రదేశ్, బీహార్‌లలో ఉన్మాదయాత్రవల్ల గొండాజిల్లాలో జరిగినట్టుగా) సర్వమత సద్భావనకు ప్రమాదకర పరిణామంగా భావించాలి. ప్రజలకోసం కళ్ళు తుడుపుగా "పరిస్థితి అదుపులోనే ఉంద"ని చెప్పడంగానీ, "పోలీసుల అజాగ్రత్తవల్లనే" ఘటనలు జరుగుతున్నాయనిగానీ ప్రకటనలు చేయడంవల్ల పరిస్థితి మెరుగుపడదు. కఠినాతి కఠినమైన పాలనా చర్యలు అవసరం. ప్రజాజీవనం కకావికలైపోయిన పాతబస్తీనుంచి, అరాచకాలకు భీతిల్లిపోయిన వందలాది కుటుంబాలు నివాస ప్రాంతాలు విడిచి ఇతర ప్రాంతాలకు వలస వెడుతున్నాయి. రాజకీయ లబ్ధిగానీ, మత రాజకీయ లబ్ధిగానీ పొందగోరే పుండాకోరులూ, నిప్పులలో పప్పులేరుకొనే దుర్మార్గులు ఈ పరిస్థితికి సంతోషించవచ్చునేమోగానీ, కొన్ని రాజకీయ శక్తులూ, మత శక్తులూ కలిసి సృష్టించిన ఈ పాశవిక వాతావరణంలో "పూటబత్తెం పుల్ల వెలుగు"గా సాగవసిన పేదసాదల బతుకు, రోజుకూలీల బతుకు, జీతాలపై ఆధారపడినవారి జీవనమూ దెబ్బతినిపోతుంది. 30 పోలీసుస్టేషన్ల పరిధిలోనూ, రంగారెడ్డి జిల్లాలోని 18 గ్రామాలలోనూ ఉద్రిక్త వాతావరణం అక్కడికే పరిమితం కాదు, ఇతర ప్రాంతాలకు కూడా వ్యాపించే ప్రమాద ఉంది. చివరికి స్థానికంగా పనిచేసే ఒక "శాంతి సంఘం" నాయకులు కొందరు కూడా హింసను ప్రోత్సహించినవారిలో ఉన్నారని ప్రజలు చేస్తున్న పిర్యాదు నిజమే అయితే - సద్భావనకు దోహదం చేయవలసిన శాంతియాత్రలపై విశ్వాసాన్ని కూడా చెదరగొట్టడం మత దురహంకారుల లక్ష్యమై ఉండాలి.

ఈ పరిస్థితులలో ప్రజలలో విశ్వాసం పాదుకొల్పడానికి అన్ని రాజకీయ పక్షాలు కేవల ప్రకటనలతోగాకుండా ఆచరణలో బ్రహ్మాండమైన శాంతియాత్రను ఏకోన్ముఖంగా కల్లోలిత ప్రాంతాలలో వెంటనే తలపెట్టాలి. ఏళ్ళ తరబడి పరిపాలనా యంత్రాంగం పని తీరునూ, పోలీసులకు రౌడీ ముఠాలతో ఉన్న అనుభవాన్నీ, ఆధారం చేసుకొని గూండాగిరిని నామరూపాలు లేకుండా కట్టిపెట్టించే చర్యలను వెంటనే తలపెట్టాలి. ఈ పని అఖిలపక్ష సంఘం నేతృత్వంలో జరగాలి. రౌడీ గ్యాంగులను అదుపు చేయడంలో ఏ రాజకీయవేత్త, మత నాయకులూ పోలీసులకు అడ్డు తగలడంగానీ, జోక్యం చేసుకోవడంగానీ వారిపైన ఎలాంటి వత్తిడిగానీ తేకూడదు. అఖిలపక్ష సంఘం సార్థ్యానికి ఇది మొదటి గ్యారంటీ కావాలి. రెండవది - మత సంస్థలతో సంబంధమున్న రాజకీయ పక్షాన్ని, "సెక్యులరిజం" ధ్యేయాన్ని లిఖితపూర్వకంగా ఎన్నికల కమిషన్ నిబంధనల ప్రకారం పేర్కొనని రాజకీయ పక్షాన్ని ఎన్నికలలో పాల్గొనకుండా చేయాలి. గుర్తింపు రద్దు చేయాలి. ఇప్పుడు జరగవలసింది - కొందరు తలపెట్టినట్టు 'బంద్'లు కావు. బుసకొడుతున్న మత రక్కసిపై ముక్త కంఠంతో బేషరతుగా అన్ని ప్రజాస్వామిక పక్షాలూ, సంస్థలు, విద్యార్థి, యువజన సంఘాలు, ట్రేడ్ యూనియన్లూ దండోరా ప్రకటించడం. పాలపక్షంలోని (కాంగ్రెస్-ఐ) చీలికలు కూడా ఈ సమయంలో అరాచక శక్తులకు అసరా అయ్యాయని మరువరాదు. మొత్తం ఘటనలపై న్యాయవిచారణకు రాష్ట్ర ప్రభుత్వం ఆదేశించడం సరైన చర్యే. ఎందుకంటే ఈ అరాచకానికి, మతం పేరిట సాగించిన ఈ మారణకాండకు ఆర్థిక సహాయం అందించినవారెవరు, ఏ శక్తులు ఈ చర్యలవెనక ఉన్నాయో నిగ్గు తేల్చవలసిన అవసరం కూడా ఉంది. ఎందుకంటే కేంద్ర హోంశాఖ సహాయమంత్రి సుబోధ్‌కాంత్ సహాయ్ హైదరాబాద్‌లో చర్చల అనంతరం పత్రికా గోష్టిలో మాట్లాడుతూ ఒక తీవ్రమైన ఆరోపణ చేశారు: "రాజకీయ తగాదాల ఫలితంగా రెండు గ్రూపుల మధ్య పథకం ప్రకారం సాగిన కొట్లాటలతోనే ఈ సంక్షోభమంతా తలెత్తింద"ని చెప్పారు. అందువల్ల న్యాయవిచారణ అవసరం మరింతగా ఉందని

గమనించాలి. దఫదఫాలుగా జంటనగరాల ప్రజా జీవనాన్ని అస్తవ్యస్తం చేస్తున్న ఈ మతకల్లోలాలకు సమాధానం ప్రభుత్వాలు మారడం కాదు, బుద్ధులు మారడం ప్రధానం. హైదరాబాద్ నగరం మత సామరస్యానికీ, గర్వించదగిన వారసత్వానికీ కాణాచిగా వర్థిల్లిన చారిత్రిక కేంద్రం. అంతేకాదు, మహబూబాలీపాషా, కిషన్ ప్రసాద్, రాజా రామేశ్వర్రావులు ఉమ్మడి సంస్కృతికి వారసులుగా నిలిచిన కేంద్రం కూడా; ఫ్యూడల్ వ్యవస్థనుంచి విడివడి పారిశ్రామిక కేంద్రంగా వర్థిల్లుతున్న ప్రాంతమిది; శాంతి భద్రతలు వ్యక్తిగత 'జమీన్'గా భావించిన పరిపాలనా దశనుంచి ప్రజా సంక్షేమంకోసం శాంతి భద్రతలను, ప్రజాస్వామిక వ్యవస్థను ఆదరించిన కేంద్రం ఇది; నవాబుల, చక్రవర్తుల పాలననుంచి గణతంత్ర వ్యవస్థవైపుగా "స్వతంత్ర సంస్థాన" దశనుంచి బయలుదేరి దేశ స్వాతంత్ర్య సమరంలో అంతర్భాగమై సంస్థాన ప్రజలను ఉత్తేజపరచి నిరంకుశపాలన నుంచి విముక్తిపొందిన కేంద్రం ఇది; వ్యావసాయిక ఆర్థిక స్థితినుంచి పారిశ్రామిక ఆర్థిక వ్యవస్థవైపుగా పురోగమిస్తున్న కేంద్రం ఇది. మానవ పురోగతికి కొన్ని అవకాశాలను కంటిముందు పెట్టుకుని, కానలేకుండా అంధ మత విశ్వాసాలకు బానిసలు కావడం విచారకరం. గాంధీజీలాంటి నాయకులు బోధలకు, అక్బర్, అసఫ్జాహిల పరమత సహనానికీ, స్వామీ వివేకానంద ప్రాక్టికల్ వేదాంతానికీ - మన ప్రవర్తన చీడపురుగు, వేరు పురుగూ!

మంగళవారం ॥ డిసెంబర్, 1990

# వైద్య రాజకీయాలు!

"గాయపడినవారు జబ్బుపడినవారు సైనికులయినా, సాధారణ పౌరులయినా వారి రాకకోసం డాక్టర్లు వేచి ఉండకూడదు. డాక్టర్లే రోగుల వద్దకు వెళ్ళాలి". రెండో ప్రపంచ యుద్ధానికి కొలది సంవత్సరాల ముందు, చైనా స్వాతంత్రోద్యమ కాలంలో జాపనీస్ దురాక్రమణను ఎదుర్కోవడంలో, యుద్ధ రంగంలో క్షతగాత్రులైన సైనికులకు, పౌరులకు ఇతోధికంగా వైద్య చికిత్స అందించడంలో అంతర్జాతీయ వైద్య శాస్త్ర చరిత్రలోనే అమోఘమైన ఆదర్శాన్ని, నీతిని, ధర్మాన్ని ప్రతిష్టించిన మహనీయులు డాక్టర్ ద్వారకానాథ్ కోట్నీస్, డాక్టర్ నార్మన్ బెతూన్. వైద్యవృత్తిలో సేవా ధర్మం గురించి వారు చెప్పిన మాటలవి. కానీ, నేడో! మనదేశంలో ప్రాథమిక విద్యతోపాటు ప్రాథమిక వైద్య చికిత్స కూడా ప్రజా బాహుళ్యానికి దూరంగాన ఉంది. ఇందుకు ఉదాహరణ - ఖమ్మం, ఉభయ గోదావరి జిల్లాలు, కృష్ణా జిల్లాలో ఇటీవల విరుకుచుపడిన మలేరియా వ్యాధి నిర్మూలనలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రలు, ప్రభుత్వ వ్యవస్థ ఘోరంగా విఫలం కావడమే. రాజకీయవేత్తలు, పాలకులు నెలకొల్పే నైతిక విలువలనుబట్టి డాక్టర్లలో సేవాధర్మం వృద్ధి అవుతుంది. పునాది బలంమీదనే భవంతి శక్తి ఆధారపడి ఉంటుంది. జన జీవితానికి సంబంధించిన ఇతర శాఖలను చెడగొడుతున్నట్టే వైద్యరంగాన్ని కూడా రాజకీయాలు భ్రష్టుపట్టిస్తున్నాయి. ఈ పతన దశకు కారకులు రాజకీయవేత్తలేగాదు, సర్వీసు అసోసియేషన్స్‌కు నాయకత్వ స్థానంలో ఉన్న కొందరు డాక్టర్లు కూడా. స్వార్థ ప్రయోజనాలకోసం వైద్య వృత్తిని పడుపు వృత్తికంటే అధ్వాన్నస్థాయికి వీరు దిగజార్చగల సమర్థులు. పైగా, దేశ రాజకీయ స్వాతంత్ర్యం ప్రకటిత లక్ష్యాలకు విరుద్ధంగా దేశంలో "ప్రయివేటీకరణ"కు పెద్ద పీట వేస్తున్న ఈ దశలో ప్రయివేట్ ప్రాక్టీసు పట్ల ఉన్న మోజు ప్రజా బాహుళ్యానికి సేవలు అందజేయడంపైన లేదు. ప్రభుత్వ ఆసుపత్రులను తమ ప్రయివేట్ క్లినిక్స్‌కు రోగులకు సరఫరా చేసే "రిక్రూటింగ్" కేంద్రాలుగా వాడుకొంటున్న కొందరు సర్వీసు అసోసియేషన్స్ నాయకుల్లే ప్రభుత్వ ఆసుపత్రులలో వైద్య ఆరోగ్య ప్రమాణాలు పతనం కావడానికీ, సక్రమంగా నడుస్తున్న సంస్థలలో రాజకీయాలు ప్రవేశపెట్టడానికీ కారకులవుతున్నారు. ఇది ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనేగాదు, దేశంలో పెక్కుచోట్ల విద్యా వ్యాపారంతోపాటు సాగిపోతోంది!! ప్రాథమిక వైద్య సదుపాయాలకు నోచుకోని కోట్లాదిమంది పేద ప్రజలున్న ఈ దేశంలో మందులు మాకులతోపాటు వైద్య సేవకూడా 'ఖరీదైన' సరుకుగా మారిపోయింది. నిత్యావసర ధరల మాదిరే మందుల ధరలూ ఈ ప్రభుత్వాల కంట్రోల్‌లో లేవు; కాని ప్రయివేట్ విద్యాలయాలు, కళాశాలలు తెరవడానికి స్వేచ్ఛగా అనుమతిస్తున్నచోట, డొనేషన్ల విద్యా వ్యవస్థకు ఆశీస్సులు పలుకుతున్నచోట రోగి అస్థిపంజరాలపై వ్యాపారం చేయడానికి స్వేచ్ఛగా అనుమతి లభిస్తోంది! ప్రాథమిక విద్యాభభివృద్ధికీ, దాని వ్యాప్తికీ, పూచీపడలేని వాజమ్మలు

ప్రాథమిక వైద్య చికిత్సను కూడా గాలికి వదలివేశారు. సర్వీస్ అసోసియేషన్స్ ప్రవేశపెడుతున్న రాజకీయాలు కూడా రోగుల పాలిట శాపంగా మరాయి. ఉదాహరణకు కొలది మాసాలనాడు కలకత్తా మెడికల్ కాలేజి, హాస్పిటల్‌లో ప్రభుత్వ శాఖల, సిబ్బంది సర్వీస్ అసోసియేషన్ రాజకీయాల మూలంగా వైద్య సదుపాయం అందించడం ఆలస్యమై, 19మంది పసికందులు సిబ్బంది నిర్లక్ష్యానికి బలికావలసి వచ్చింది. మంత్రి, సర్వీస్ అసోసియేషన్స్, కాంగ్రెస్-ఐ మెడికల్ సెల్ మధ్య కొట్లాటలు ఈ సామూహిక నేరానికి కారణం!

అలాగే, మార్క్సిస్టులు అధికారంలో ఉన్న కేరళలో కూడా రాజకీయ జోక్యంవల్లనే ప్రసిద్ధులైన గాంధీ యూనివర్సిటీ వైస్-ఛాన్సలర్, ఎనర్జీ రూరల్ టెక్నాలజీ ఏజన్సీ డైరెక్టర్ రాజీనామాలు చేయవలసి వచ్చింది. కాలికట్, కేరళ యూనివర్సిటీ వైస్-చాన్సిలర్లు కూడా ఆ మార్గంలోనే ఉన్నారు. ఈ రాజకీయ 'భేతాళ' సంతతి వేలుపెట్టకపోతే విశ్వవిద్యాలయాలు, ఆసుపత్రులూ క్షేమంగా ఉంటాయి.

ఇలాంటి దుర్దశ, దుర్గతీ మన రాష్ట్రానికి కూడా దాపురించింది. ఇందుకు ఉదాహరణ - రాష్ట్రంలోనేగాక గత అయిదేళ్ళలో దక్షిణ భారతంలోనే విశిష్ట సంస్థగా రాణికెక్కిన నిజామ్ వైద్య విజ్ఞాన సంస్థ నిర్వహణ విషయంలో ప్రారంభమైన రాజకీయ రభస. నిజానికి నేడే కాదు, ఆనాడు కూడా ముఖ్యమంత్రిగా ఉన్న డాక్టర్ చెన్నారెడ్డి చొరవవల్ల, ముందుచూపు వల్లనే నిజామ్స్ ఆర్థోపెడిక్స్ (కేవలం నాడది బొక్కల దవఖానా) విస్తృతస్థాయిలో వైద్య విజ్ఞాన సంస్థగా మారింది. అలాగే ఈ సంస్థ ఢిల్లీలోని ఆలిండియా మెడికల్ సైన్సెస్ ఇన్‌స్టిట్యూట్ స్థాయిలో వృద్ధి కావాలని ఆశించినవారు కూడా డాక్టర్ చెన్నారెడ్డే. కాని ఆ తర్వాత ఆయన ముఖ్యమంత్రిగా లేకపోయినా, తెలుగుదేశం ప్రభుత్వ హయాంలోనిజామ్ వైద్య విజ్ఞాన సంస్థ ఆయన ఆశించిన స్థాయికి చేరుకుందని మరువరాదు. లాంఛనంగా మాత్రమే నెలసరి రూపాయి జీతం తీసుకుంటూ డాక్టర్ కాకర్ల సుబ్బారావు నాలుగేళ్ళుగా సంస్థ డైరెక్టర్‌గా చేసిన కృషి ఫలితమే నేటి "నిజామ్స్" ప్రగతి. నిజానికి, అమెరికాలోనే ప్రసిద్ధ రేడియాలజిస్టులలో ఒకరుగా పేరులోవున్న డాక్టర్ సుబ్బారావు పాడికుండలాంటి తన పదవిని వదులుకొని రూపాయి జీతం కొసం హైదరాబాదుకు చేరుకున్నది - సేవా ధర్మాన్ని నిర్వహించడానికేగాని డబ్బులు వడుపుకోడానికీ, రాజకీయాలు నడపడానికీ కాదు. కాదు కనుకనే అతను "దేశం" ప్రభుత్వం ఆహ్వానంపై వచ్చినా ఒక దశలో ఆ ప్రభుత్వంతో కూడా దెబ్బలాడి "నిజామ్స్" పురోగతికి అవసరమైన ఏర్పాట్లు చేయవలసి వచ్చిందన్న సత్యాన్ని ఎవడూ కాదనలేడు. దానిని ప్రజలకు అందుబాటులో ఉండే వైద్య సంస్థగా (అనేకమంది పేదవాళ్ళకు గ్రీన్‌కార్డ్‌పైన ఖరీదైన ఆపరేషన్లు కూడా ఉచితంగా జరిగాయి) ఆ సంస్థ స్థాయిని పెంచితే ఆసుపత్రికి నిధులు కూడా పెరుగుతాయన్న ఉద్దేశ్యంతో డీమ్డ్ యూనివర్సిటీ ప్రతిపత్తిని దెబ్బలాడి సాధించిన వ్యక్తి సుబ్బారావు. అయితే "నిజామ్స్" వైద్య విజ్ఞాన సంస్థను మరింతగా ప్రజలకు సన్నిహితం చేయడానికీ వైద్య చికిత్స, కార్డియాలజీ, ఆర్థోపెడిక్స్ వంటి తొమ్మిది రకాల ప్రత్యేక చికిత్సలతోపాటు అందుకు సహాయకారిగా ఎక్స్-రే, పాథాలజీ, బయోకెమిస్ట్రీ లాంటి సపోర్టింగ్ సర్వీసులు కూడా కలిగిన ఆసుపత్రిగా ఢిల్లీలోని భారత వైద్య విజ్ఞాన సంస్థ స్థాయికి పూర్తిగా చేరుకోవాలంటే - నిధులు అపారంగా అందాలి. ఆసుపత్రి నిర్వహణతోపాటు నిపుణులైన బోధనా సిబ్బంది, శిక్షణగల వైద్య సిబ్బంది అవసరమున్న వైద్య సంస్థను డీమ్ యూనివర్సిటీగా ప్రకటిస్తే తప్ప ఈ సదుపాయాలకు సంస్థ అర్హత పొందజాలదు. కనుకనే డాక్టర్ కాకర్ల నాలుగేళ్ళలో 16 కోట్ల రూపాయలు (8 కోట్లు ప్రభుత్వం ఇస్తే వైద్య చికిత్సద్వారా సంపన్నులైన రోగులనుంచి



## ఎబికె సంపాదకీయాలు



రాబట్టిన ఆదాయము, డొనేషన్లూ కలిపి 8 కోట్లు) సంస్థపై వెచ్చించి సూపర్ స్పెషాలిటీస్ వృద్ధి చేసారు. కాబట్టే దక్షిణ భారతంలో అది, పెద్ద స్థాయిలో కేంద్ర నిధులు పొందుతున్న ఆలిండియా సంస్థకు, చండీఘఢ్‌లోని పి.జి. సంస్థకూ, లక్నోలోని సంజయ్‌గాంధీ సంస్థకూ, దక్షిణాదిన పుదుచ్చేరిలోని నెహ్రూ పి.జి. రిసెర్చి సంస్థకు, తిరువనంతపురంలోని చిత్ర తిరుణాల్ సంస్థకూ దరిదాపుగా దీటు రాగలుగుతోంది. అంతేగాదు, ప్రాథమిక వైద్య కేంద్రాలలో , జిల్లా కేంద్రాలకూ పరిష్కారం కాని కేసులను అనేకం "నిజామ్స్' 'కు రిఫర్ కావడం వల్లనే అది "రిఫరల్ ఇన్‌స్టిట్యూట్"గా కూడా పేరు మోసింది. బహుశా కొందరి ఉద్దేశంలో రిఫరల్ అంటే - జంట నగరాలలోని ఉస్మానియా, గాంధీ ఆసుపత్రులనుంచి వచ్చే కేసులనే "నిజామ్స్' ' పరిశీలనలోకి తీసుకోవాలిగానీ, జిల్లాలనుంచి వచ్చే కేసులను ముట్టరాదని కాబోలు! అదేదో మరి స్పష్టం చేయాలి. నిజానికి అసలు సమస్యల్లా - అమెరికాలో వైద్య సంస్థల నిర్వాహణలో గవర్నింగ్ కౌన్సిల్ అనేది కేవలం పాలసీ నిర్ణేతగానే ఉంటుందిగానీ, దానిని అమలుజరపడంలో జోక్యం చేసుకోదు. మనకు అలా కాదు. ప్రతిదానిలోనూ రాజకీయవేత్త వేలు పెట్టాల్సిందే. అమెరికాలోని మేయోక్లినిక్, క్లీవ్‌లాండ్ వైద్యసంస్థల స్థాయికి "నిజామ్స్" ఎదిగి రావడం మనందరికీ గర్వ కారణం కావాలి. తెలుగువాడు - తన వాడిని తాను గౌరవించుకోలేని 'స్థాయి'కి ఎదిగిపోయాడు. గంధానికీ, దుర్గంధానికీ తేడా తెలుసుకోలేని వాడైపోయాడు. 'దేశభక్తి'ని గురించి చాటుకుంటే చాలదు. 'పూని ఏదైనాను కూర్చి జనులకు చూపవోయ్' అన్నాడు గురజాడ. దానిని 'పూని ప్రతిదీ చెడగొట్టి చూపవోయ్' అని మార్చుకోవద్దని తోటి తెలుగువాడికి మనవి!!

ఆదివారం 12 ఆగస్టు, 1990

# రాజకీయాల్లో గాడ్గిల్ 'ఫార్ములా'!

మన దేశ ప్రజలకు ఇంతవరకూ కేంద్ర-రాష్ట్రాల మధ్య ఆర్థిక వనరుల పంపిణీని నిర్దేశిస్తున్న 'గాడ్గిల్ ఫార్ములా' ఒక్కటే తెలుసు. కాని, ఇటీవల కొన్ని పత్రికలు మోసుకొచ్చిన వార్తలు చూస్తుంటే రాజకీయాలలో కూడా సరికొత్తగా ఒక 'గాడ్గిల్ ఫార్ములా' అవతరించినట్లు కనిపిస్తోంది. పేరుపొందిన నేరస్థులను కాంగ్రెస్(ఐ) పార్టీలో చేర్చుకోవడాన్ని ఎ.ఐ.సి.సి. ప్రధాన కార్యదర్శి వి.ఎన్.గాడ్గిల్ సమర్థించారని, ఒకవార్త. కాంగ్రెస్ పార్టీ, గూండాలకు, స్మగ్లర్లకూ చోటివ్వని 'సాధువుల ఆశ్రమం' కాదనీ, తమ పార్టీ భారత సమాజానికి ప్రతిబింబమనీ అలాంటి వారెవరైనా సరే (గుండాలు, స్మగ్లర్లు) తమ పార్టీ సిద్ధాంతాలు నచ్చితే పార్టీ సభ్యత్వం సుఖంగా తీసుకోవచ్చుననీ, ఆ మాటకొస్తే ప్రతిపక్షంలో కూడా క్రిమినల్స్ ఉన్నారనీ గాడ్గిల్ అన్నారట. కొంత మంది విలేకరులతో అన్న ఈ మాటలు వచ్చి అబద్ధాలు కావాలని ఆశిద్దాం. కానీ గాడ్గిల్ ఒక సీనియర్ నాయకునిగా ఇంతవరకూ ఆ మాటలను ఖండించలేదు కాబట్టి, ఇలాంటి ప్రకటనలు కాంగ్రెస్ సంస్థ ప్రతిష్ఠను మంటగలుపుతాయనీ ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజల విశ్వాసాన్ని వమ్ము చేస్తాయనీ హెచ్చరించక తప్పదు. ఎందుకంటే, "ప్రజలు తమ జాతీయ కార్యకలాపాల్లో ఉత్సాహంతో, తెలివితేటలతో పాలు పంచుకొని వ్యవహారాలను చక్కదిద్దుకొనే తీరు ప్రజాస్వామ్యానికి పునాది" అని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ(1951) స్పష్టం చేశారు. అయితే ఆయన ఉద్దేశంలో "జాతీయ కార్యకలాపాలంటే గూండాయిజమూ, స్మగ్లింగూ కావు! అలాంటి అరాచక ప్రవృత్తులను అణచివేసి, జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాలకు రక్షణ కల్పించుకోవాలన్నదే నెహ్రూ మాటల సారంశం. అంతేగాదు, ఆ వార్త నిజమే అయితే, అవాంఛనీయమైన గాడ్గిల్ 'సూత్రీకరణ' - 1985లో కాంగ్రెస్ ప్రత్యేక సమావేశంలో (బొంబాయి) మాట్లాడుతూ కాంగ్రెస్‌లో బ్రోకర్లకూ, స్మగ్లర్లకూ తావులేదని ప్రధాని రాజీవ్ గాంధీ చేసిన విశిష్టమైన ప్రకటనకు పూర్తి విరుద్ధం కూడా. అలాగే కొలది రోజుల నాడు బెంగుళూరులో ఒక సందర్భంగా మాట్లాడుతూ 'గుండాలూ, క్రిమినల్సూ ఎన్నికలలో పాల్గొనకుండా నిరోధిస్తూ బిల్లు తేబోతున్నామని' రాజీవ్ చేసిన విస్పష్టమైన ప్రకటనకు కూడా గాడ్గిల్ భావన బద్ధ వ్యతిరేకం. దేశం నేడున్న క్లిష్ట పరిస్థితులలో గాడ్గిల్ మాటలు విరుద్ధమైన పరిణామాలను తెచ్చి పెడతాయి. భారత స్వాతంత్ర్య ప్రకటనను పండిట్ నెహ్రూ రేపటి సవాళ్లను ఎదుర్కొనే ముహూర్తంగా (Tryst with destiny) అభివర్ణించింది ఆర్థిక, సాంఘిక సమస్యలతోపాటు అసమానతలను పెంచే సమాజంలో పుట్టి పెరిగే అరాచక శక్తులను కూడా ఎదుర్కొనవలసి వస్తుందన్న అర్థంలోనే! ఈ గుర్తింపు మన రాజకీయ పక్షాలకు లేదు కాబట్టే, స్వాతంత్ర్యానంతరం ప్రకటిత లక్ష్యం పక్కదారులు బట్టి, మిశ్రమ ఆర్థిక వ్యవస్థద్వారా స్వలాభాపేక్షను పెంచే ప్రైవేట్ రంగం ఆచరణలోకి వచ్చింది. కాబట్టే, ఆ అవినీతి భారంలో భాగంగానే "మాఫియా"లు కూడా రంగంలోకి వచ్చారు. (తానూ గౌరవార్హుణ్ణే అనిపించుకోవాలని

బయలుదేరే గుండాను, స్మగ్లర్‌నూ "మాఫియోసో" అంటారుట)! ఇందుకు మొన్నటి ఉదాహరణ- రాజకీయ పక్షాల ఆశీస్సులతో వాటిని అంటకాగుతూవచ్చి, ఆంధ్రకోస్తాకు అగ్గిపెట్టిన విజయవాడ మాఫియాలయితే, నేటి తాజా ఉదాహరణ- రాజకీయ నీడలలో ఒకరినొకరు సాధించుకోడానికి ఇరువురు బొంబాయి పారిశ్రామిక వేత్తలయిన అంబానీ, నస్లీ వాడియాలు పెంచి పోషించుతున్న మాఫియాలు! రాజకీయ నాయకులు, పార్టీలు అధికార తాపత్రయంలో దీర్ఘకాలిక సాంఘిక ప్రయోజనాలను మరచిపోయి, అడ్డదారుల్లో ప్రయాణిస్తారు. ఈ ప్రయాణంలో వినియోగపడేవాళ్ళే మాఫియాలు; రాజు తలచుకొంటే దెబ్బకు కొదవా అంటారు మనవాళ్ళు. కానీ ఆ తలంపేరాదు. ఎందుకని? వారి అవసరం అలాంటిది. కనుకనే అధికారంలో ఉన్నవారూ, అధికారానికి రాగోరేవారూ కొందరు ఆశ్రయించే ఒకే ఒక వర్గ - ఈ మాఫియా. ఇది చాలాకాలంగా బీహార్‌లో పనిచేస్తోంది! ఇటీవల ల్లో అల్హాబాద్ మునిసిపల్ కార్పోరేషన్ ఎన్నికల్లో "గెలిచిన" అభ్యర్థులలో 15 మంది క్రిమినల్సు గెలిచారు! వీరిలో కొందరు ప్రాణాలు తీసే దొంగ సారా వ్యాపారంలో అనేకసార్లు జైళ్ళకు వెళ్లినవారే. ఎన్నడూ కులమతాల ప్రభావానికి కూడా లొంగని లక్నో వోటర్లు క్రిమినల్స్‌కు వోట్లు వేయడం వారి తప్పేకాదు, రాజకీయ పక్షాలు పెడదారులు తొక్కినందువల్ల వచ్చిన ఫలితం కూడా!

రాజకీయాల్లో స్వార్థ ప్రయోజనాలకోసం అడ్డదారులు తొక్కేవారికి దుస్సాహసాలకు పాల్పడగల సత్తా ఉన్న 'అలగా సరకు' (Lumpen) అవసరమవుతూ ఉంటారనీ, వారి ఆర్థిక పునాదులన్నీ ఇలా బలపడుతూ వచ్చినవేనని, ఈ మాఫియా ఒక పోటీ ప్రభుత్వంగానే చలామణీ అవడానికి ప్రయత్నిస్తుందనీ మాక్స్ వీబర్ చెప్పన మాట ("Economy & Society") అక్షరసత్యం. ఇది "భస్మాసుర హస్తం" లాంటిది! మాఫియా మాట వింటే రాజకీయ పార్టీ బతుకుతుంది. ఎదురు తిరిగితే రాజకీయవేత్తకు ప్రమాదం! అందుకని ఇప్పుడు రాజకీయాలను మాఫియాయే నడపగోరుతోంది. మంటాడవద్ద ఎ.పి.సి.సి. అధ్యక్షుడు డాక్టర్ చెన్నారెడ్డి కారుపై 'మాఫియా' దాడి ఇందుకు మరో సాక్ష్యం! క్రమంగా మనకు అమెరికన్, ఇటాలియన్ మాఫియాల వారసత్వం అబ్బుతోంది. రాజకీయ అవినీతి, మాఫియా శక్తీ జమిలిగా ముందుకు సాగుతున్నాయి. ప్రైవేట్ వ్యాపారంలో "పశుప్రవృత్తి" (Animal Spirit) సహజమంటాడు వీబర్. సంపదను కూడబెట్టడం సంపదను ఎలా గొలా పోగుచేసుకొనే భావాన్ని ప్రోత్సహించడం ధనస్వామ్య వ్యవస్థ ఆదర్శం అంటాడు మరొక సామాజిక శాస్త్రవేత్త ("Accumulate, accumulate That is Moses and the Prophets")! అమెరికాలో ఆల్‌కెపోనీ, లాల్ సియానో, కోస్టెల్లో, వలాచీ అలాంటి మాఫియా ముఠాలే. వీళ్లు "అజ్ఞాత శక్తులు"గా రాజకీయ పక్షాలకు తోడ్పడుతూ కొన్ని వందల కోట్ల రూపాయలు సొమ్ము చేసుకొంటారు! "కోస్టానోస్ట్రా" సంస్థ అలా ఏర్పడిందే, రాజకీయ ప్రత్యర్థులను వేధించి హతమార్చడంలో ఈ మాఫియా పాత్ర పవిత్రమైన ప్రజాసేవా వ్యవస్థగా వర్థిల్లవలసిన రాజకీయ విజ్ఞాన శాస్త్రానికే అవమానకరం! ఇటలీలో ఒకప్పుడు కాలబ్రియా, సిసిలీలలకే పరిమితమైన ఈ మాఫియా 1970 నుంచి నేటివరకూ దేశవ్యాప్తంగా అల్లుకుపోయి సామాజిక వ్యవస్థకే సవాలుగా పరిణమించింది. రాజకీయ నాయకులను, న్యాయమూర్తులను హత్య చేయడానికి వెనుకాడడంలేదు. ఈ ముఠాను పరిమార్చడానికి పార్లమెంటులో బిల్లు తెచ్చిన పియోలా టోరేను (కమ్యూనిస్టు), జనరల్ కార్లోను కూడా "మాఫియా"తమ పొట్టన పెట్టుకుంది! చివరికి ఈ మాఫియానే ఇటలీలో క్రమంగా క్రిస్టియన్ డెమోక్రటిక్ శక్తిగా అవతరించడానికి ప్రయత్నించింది. వీళ్ళు మనకు మాత్రం ఏం తక్కువ? ఒక దావూద్ ఖాన్ ఒక బబారియా ఉన్నంతకాలం "గాడ్గిల్ ఫార్ములా" వర్థిల్లుతూనే ఉంటుంది!

మంగళవారం 8 ఆగస్టు, 1989

# ఈ డి-నోటిఫికేషన్ ఎందుకు?

షెడ్యూల్డ్ ప్రాంతాలలో లేదా "నోటిఫైడ్"ఏరియాగా ప్రభుత్వం ప్రకటించిన, గిరిజన జనాభా నివసిస్తున్న ప్రాంతాలలో ఒకవైపు నక్సలైట్ల సమస్య తీవ్ర రూపంలో ఉన్న సమయంలోనే "తెలుగుదేశం' ప్రభుత్వం మరొక తెలివి తక్కువ పనికి పూనుకుంది. "నోటిఫైడ్" ఏరియాగా ప్రకటించిన కొన్ని గిరిజన ప్రాంతాలలో "అసలు గిరిజనులే లేనందున" ఆ ప్రాంతాలన్నిటినీ పునఃపరిశీలించి, వాస్తవంగా ఆ ప్రాంతాల్లో నివసించే గిరిజనులెంతమందో, గిరిజనేతరులెందమందో జనాభా నిష్పత్తిని తేల్చి "రీ నోటిఫై" చేయాలని ఎన్.టి.రామారావు ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని కోరింది. ఈ ప్రాంతాల్లోని పెక్కు గ్రామాలలో గిరిజనులకంటే గిరిజనేతరుల సంఖ్య హెచ్చుగా వున్నందున "నోటిఫైడ్" ప్రాంతాల స్వరూప స్వభావాలను పునః పరిశీలించాలని కేంద్ర హోం శాఖకు ముఖ్యమంత్రి ఒక ఉత్తరం వ్రాశారు. నిజానికి షెడ్యూల్డ్ ప్రాంతాల్లో మోతుబరులైన గిరిజనేతరులు భూములు కొనకుండా పూర్తిగా నిషేధం విధించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించినట్టు జులై 2న ఒక వార్త వచ్చింది. అది మంచి వార్తే కాబోలు అనుకున్నాం. అయితే ప్రకటనలో కొత్తదనమేమీ లేదనీ, గిరిజనుల భూములను గిరిజనేతరులు కొనుగోలు చేయకుండా నిషేధిస్తే, 1949నుంచీ రెగ్యులేషన్స్ ఉన్నాయనీ తెలుసుకొంటే, ఎన్.టి.ఆర్. ప్రభుత్వం ఆ మాట చాటున చేయబోతున్న 'పనే'మిటో తరువాతగాని అనుభవంలోకి రాలేదు.

షెడ్యూల్డ్ ప్రాంతాల్లోని భూముల క్రయవిక్రయాలను నిషేధిస్తున్న 'వన్ ఆఫ్ సెవెంటీ'గా ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డ్ ప్రాంతాల భూముల బదలాయింపులకు సంబంధించి 1970లో వచ్చిన సవరణను సవరించాలని క్యాబినెట్ నిర్ణయించడం గిరిజన ప్రయోజనాలను దెబ్బతీసే చర్య. దీని ప్రకారం, ఒకవైపున గిరిజన భూములను గిరిజనేతరులు కొనడాన్ని పూర్తిగా నిషేధిస్తున్నప్పటికీ, రెండోవైపున జరగబోయే పని - బలవంతంగానో, అన్యాక్రాంతంగానో, చట్టాలలోని అవకతవకల వల్లనో అధికారుల కుమ్మక్కు వల్లనో, ప్రోత్సాహం వల్లనో ఇప్పటికే గిరిజన భూములను పెద్ద స్థాయిలో ఆక్రమించుకుని లేదా కొనుగోలు పేరిట "పట్టాల" పేరిట అనుభవిస్తున్న గిరిజనేతరులు ఆర్థిక కారణాలపైన భూములు అమ్ముకోవచ్చు. "వన్ ఆఫ్ సెవెంటీ" రెగ్యులేషన్‌ను ఇందుకోసం సవరించాలని ప్రభుత్వం నిర్ణయించిన మరుక్షణమే రాష్ట్రంలోని సుమారు 10 ఏజన్సీ జిల్లాల్లోని గిరిజనులలో అశాంతి చెలరేగింది. ఈ పని ఎందుకు చేశారని అడిగినవారికి ప్రభుత్వం చెబుతున్న సమాధానం - రాష్ట్ర గిరిజన సంక్షేమ సలహా మండలి (అడ్వయిజరీ కౌన్సిల్) చేసిన తీర్మానం ప్రకారమే తాము చర్య తీసుకున్నామని! అయితే తీర్మానం కౌన్సిల్‌లోని మెజారిటీ సభ్యుల అంగీకారంతో చేసిందా, లేక "గుడిపూడి జంగాల" గూడుపుఠాణీగా చేసిన తీర్మానమా అన్న ఆలోచనతో నిమిత్తం లేకుండా ప్రభుత్వం ఈ నిర్ణయం చేయడం విచారకరం. ఈమధ్యలో కౌన్సిల్ వ్యవహారాల్లో ఏదో గోల్ మాల్ జరిగిందని అనుమానించడానికి అస్కారం ఉంది. ఎందుకంటే ఇదే "సలహా

మండలి" 1988 మార్చి 29న సమావేశమై గిరిజనేతరులు స్థానికంగా ఉన్న ఇతర గిరజనేతరులకు భూములను బదలాయించుకోడానికి అనుమతివ్వాలన్న గిరజనేతరుల అభ్యర్థనను తిరస్కరించింది. అలాగే 1984లో ఇదే కౌన్సిల్ గిరిజన ప్రాంతాల భూముల క్రయ విక్రయాలను నిషేధించే "వన్ ఆఫ్ సెవెంటీ" రెగ్యులేషన్‌ను మరంత కఠినంగా తీర్చిదిద్దాలని ప్రభుత్వాన్ని కోరింది. తీరా ఇటీవలి కాలంలో ఇదే కౌన్సిల్‌తన వైఖరి మార్చుకొని ఆ రెగ్యులేషన్‌ను గిరిజనేతరులకు అనుకూలంగా మార్చవలసిన అవసరం ఎందుకొచ్చింది? అ ప్రశ్నకు సమాధానం కొన్నాళ్ళుగా రాష్ట్రంలోని గిరిజన సమస్యలను అధ్యయనం చేస్తున్న ప్రొఫెసర్ ఎన్. సుబ్బారెడ్డి మాటల్లో విందాం: "వన్ ఆఫ్ సెవెంటీ రెగ్యులేషన్‌ను సవరించడానికి సమ్మతించిన కౌన్సిల్ సభ్యులకు షెడ్యూల్డ్ ప్రాంతాల్లో తగినన్నిభూములున్నాయి. ఫలితంగా భూముల ధరలు ఉత్తరోత్తరా పెరిగిపోయినప్పుడు లాభించేది వీరే. పైగా, మండలి సభ్యత్వ పదువులు కోల్పోయే అవకాశముందన్న బెదిరింపులవల్ల, ధన ప్రభావం వల్ల కూడా వీరిలో ఈ మార్పు వచ్చి ఉండవచ్చునని భావిస్తున్నారు". బహుశా అందుకనే, 1988 మార్చి సమావేశంలో ఈ సభ్యులు "తమ భూములు అమ్ముకోదలచిన గిరిజనేతరులకు ఎలాంటి ఇబ్బందులు కలగకుండా మార్కెట్ ధరను చెల్లించాల"ని సిఫారసు రూపంలో శాసిస్తూ, ప్రభుత్వంనుంచి పెద్ద పరిహారం పొందాలని ఎత్తువేశారు! ఇందుకు గిరిజనేతర భూస్వాముల ప్రయోజనాలను కాపాడడానికి సిద్ధంగా ఉన్న ప్రభుత్వమూ, కొన్ని వామపక్షాలూ కూడా 'సై' దోడు పలికాయి.

గిరిజనుల ప్రధాన ప్రయోజనాలను దీర్ఘకాలంలో దెబ్బతీసే ఈ సవరణవల్ల రానున్న పరిణామాల గురించి ప్రొఫెసర్ సుబ్బారెడ్డి గవర్నర్‌కు కూడా ఒక మెమోరాండంలో నివేదించారు. రాజ్యాంగంలోని 5వ షెడ్యూల్ ద్వారా లభిస్తున్న ప్రత్యేకాధికారాలను వినియోగించి గవర్నర్ గిరిజనుల దీర్ఘకాల ప్రయోజనాల రక్షణకు వెంటనే కదిలి గిరిజన ప్రాంతాల్లో భూములు మరొకసారి స్వేచ్ఛగా చేతులు మార్చడానికి వీలైన శాసనం రాకుండా జాగ్రత్తపడాలనీ, రాష్ట్రపతి జోక్యం చేసుకోవాలనీ ఆయన కోరారు. ఆ వినతి పత్రాన్ని గవర్నర్ కుముద్‌బెన్ జోషీ ఏంచేశారు? అదే షెడ్యూల్ ప్రకారం గిరిజన ప్రాంతాల పాలనా వ్యవహారాల గురించి కేంద్రానికి ఏటా ఇవ్వవలసిన నివేదికను గవర్నర్ సమర్పించకుండా ఎందుకు "జాగరణ" చేస్తున్నారు?

1949 నాటి హైదరాబాద్ గిరిజన ప్రాంతాల క్రమబద్ధీకరణ (రెగ్యులేషన్) ఉత్తర్వు తరువాత రెగ్యులేషన్స్ అన్నీ అరకొరగానే అమలు జరుపుతూ వచ్చారు. పెక్కు గిరిజన భూములు గిరిజనేతరులకు కౌలు పేరిటనో లేదా తాకట్టు పేరిటనో దఖలుపడ్డాయి. చివరికి ఏదో ఒక పేరుతో యాజమాన్యపు హక్కులను గిరిజనులు వదులుకొనే పరిస్థితులకు దారితీశారు. అదిలాబాద్ జిల్లాలోని గిరిజన ప్రాంతాల భూముల కోసం అక్కడ చొరబడిన మైదాన ప్రాంతాల వారిలో హెచ్చుమంది మహారాష్ట్రియన్లు కాగా, వరంగల్, ఖమ్మం జిల్లాల భూములలో స్థిరపడినవారు కోస్తా ఆంధ్ర ప్రాంతాలకు చెందిన భూస్వాములు. "నోటిఫైడ్" ప్రాంతాల్లోని గిరిజనుల ప్రయోజనాలు కాపాడేందుకు అవసరమైన ఫీల్డ్ స్టాఫ్ 1950 వరకే ఉంది. ఆ తర్వాత నియమితులవుతూ వచ్చిన అధికారులు హెచ్చు భాగం జిల్లా కేంద్రాలకే కట్టుబడిపోయారు. ఆర్ద్రతతో గిరిజనుల మధ్య పనిచేయగల సిబ్బంది లేనందుననే నక్సలైట్స్ లాంటిచట్ట విరుద్ధ సంస్థలు తలెత్తాయని ప్రసిద్ధ మానుష శాస్త్రవేత్త హెమెండార్ఫ్ 1981లో ప్రకటించి వెళ్ళాడు. 1944 నుంచి 1963 వరకు సాధించిన విజయాలు కూడా మట్టిపాలు కావడానికి కారణం ఇదే అనిఆయన హెచ్చరించాడు.

మంగళవారం, జూలై 11, 1989

# ఈ రీ - నోటిఫికేషన్ ఎందుకు? (2)

"చల్లకోసం వచ్చి ముంతదాయడం" అనవసరం. "వన్ ఆఫ్ సెవెంటీ" రెగ్యులేషన్‌ను ఎ.పి.టి.ఆర్. సవరించదలచింది ఇన్నేళ్ళుగా రకరకాల దగాలవల్ల, మోసాలవల్ల భూములు కోల్పోయిన షెడ్యూల్డు ప్రాంతాలలోని గిరిజనుల కోసం కాదు, చట్టం లోపాలవల్ల, ప్రభుత్వాల ప్రోత్సాహంవల్ల మోసానికి పాల్పడిన మైదాన ప్రాంతాలకు చెందిన మోతుబరుల, ఫారెస్టు కాంట్రాక్టర్ల కోసమని స్పష్టమవుతోంది. గిరిజన భూములపై దఫదఫాలుగా, దశాబ్దాలుగా సాగుతున్న ఈ 'దురాక్రమణ' ను అరికట్టడం కోసమే 1917 నాటి ఏజెన్సీ ట్రాక్ట్స్ ఇంటరెస్ట్ అండ్ ల్యాండ్ ట్రాన్స్‌ఫర్ చట్టాన్ని సవరించి 1959లో ఒక రెగ్యులేషనను (ఆంధ్రప్రదేశ్ క్రమబద్ధీకరణ) గవర్నర్ ప్రవేశపెట్టారు. ఈ రెగ్యులేషన్ ఆనాడు జనాభా మదింపు తర్వాతనే శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాల్లోని నోటిఫైడ్ ఏరియాలలో 1959 మార్చి 4 నుంచీ అమలులోకి వచ్చింది. అప్పుడు ఈ పరిధిలో భద్రాచలం ఏరియాను కూడా చేర్చారు. ముఖ్యమంత్రి రామారావు చెప్పినట్టు ఎక్కడైనా ఒకటీ అరా ప్రాంతంలో గిరిజన జనాభాను మించి గిరిజనేతరుల సంఖ్య ఉండవచ్చు, ఆ నిర్దిష్టమైన ప్రాంతానికి పరిమితమై భూముల క్రయ విక్రయాలకు సంబంధించి కొన్ని వెసులుబాట్లు జరుపుకోవచ్చు. కాని ఒకటి రెండు ప్రాంతాల పేరిట లేదా ఒక్క భద్రాచలం ప్రాంతం పేరు చెప్పి గిరిజనుల జీవనానికి కేంద్రంగా ఉన్న మొత్తం "నోటిఫైడ్" ప్రాంతాల ప్రతిపత్తినే రద్దుచేసి వాటిని "రీ - నోటిఫై" చేయమని ఆయన కేంద్రాన్ని కోరడం కొత్త తగాదాకు బీజాలు నాటడమూ, కొరివితో తల గోక్కోవడమూ అవుతుంది. ఎందుకంటే గిరిజనుల సహజమైన జీవన విధానాన్ని చెక్కుచెదిర్చింది మైదాన ప్రాంతాలకు చెందిన భూస్వాములు. వారి జీవన విధానాన్ని కాపాడుతూ క్రమంగా నాగరికం చేయడానికి ఉద్దేశించినట్టు చెప్పిన చట్టాలను లేదా రెగ్యులేషన్స్‌నూ పనిగట్టుకొని ఉల్లంఘించిన వారిని అడ్డుకొనకుండా, శిక్షించకుండా చూస్తూ కూర్చొన్నవి ప్రభుత్వాలు; వడ్డీలతో, చక్రవడ్డీలతో బంధించి వాళ్ళను పిప్పిచేసి, ఆ బకాయికి ముదరాగా గిరిజనుల భూములను అయిన కాడికి సొంతం చేసుకున్నప్పుడు ఇంక మిగిలిందేముంది? ఈ పరిస్థితుల్లో గిరిజనుల జనాభా తగ్గుతూండడం సహజం. అంటే ప్రాంతంకాని ప్రాంతంపై గిరిజనేతరులు 'దురాక్రమించడం' ద్వారా జనాభాలో వచ్చిన మార్పు గిరిజనుల మౌలికమైన ప్రయోజనాలను దెబ్బ తీస్తున్నప్పుడు - దానిని నాగరిక ప్రభుత్వం, ప్రజాస్వామ్య శక్తులూ ఎలా సమర్థిస్తాయి? కనీసం 1949నాటి "నోటిఫైడ్" గిరిజన ప్రాంతాలకు చెందిన రెగ్యులేషన్స్ రూల్స్‌లోని 42వ నిబంధన క్రిందనైనా గిరిజనులకు బలమైన రక్షణ ఉండేది. అంతేకాదు. ఈ "రూల్సు" ప్రకారం గిరిజన ప్రాంతంలో గిరిజనేతరుని నివాసం గిరిజనుల ప్రయోజనాలకు ఏ మాత్రం హానికరం కాదన్న సంతృప్తి ప్రభుత్వం ఏజెంటుకో లేదా కలెక్టరుకో ఉంటే తప్ప గిరిజనేతరుల ప్రవేశాన్ని అనుమతించేవారు కారు.

అలాగే నోటిఫైడ్ ఏరియాలో పటేల్ పట్వారీ వతన్‌లను ఆ రెగ్యులేషన్ రద్దు పరిచింది. గిరిజనేతర అధికారుల స్థానంలో గిరిజన అధికారులను నియమించింది. ఈ పనిని ఆనాడు - గిరిజనేతరులపై ద్వేషం వల్ల చేయలేదు. గిరిజనులలో భీతిని తొలగించి, వారిని మరింత నాగరికం చేసి క్రమంగా జనజీవన స్రవంతిలో ఒక భాగం చేయడానికి ఉద్దేశించిన లౌకిక ప్రయత్నం మాత్రమేనని గమనించాలి. కాని ఇప్పుడో? ఎన్ని రెగ్యులేషన్లు ఉన్నా గిరిజన భూములు గిరిజనేతరులకు బదిలీ అయిపోతున్నాయి. ఎందుకని? ప్రభుత్వాల, అధికారుల అండదండలు లేకుండా ఇంత పెద్ద ఎత్తున భూముల బదిలీలు (ట్రాన్స్‌ఫర్స్) జరగడం అసంభవం. ఫలితంగా గిరిజనులు - గిరికి జనులేగాని 'సిరి'కి దూరమై పోతున్నారు! అయినప్పుడు "నోటిఫైడ్" ఏరియాలో కొన్నిచోట్ల గిరిజన జనాభాకంటే "గిరిజనేతరుల జనాభా ఎక్కువ"గా ముఖ్యమంత్రికి కన్పించడంలో ఆశ్చర్యమేముంది?

1971-81 సంవత్సరాల మధ్య తీసిన లెక్కల ప్రకారం షెడ్యూల్డు ప్రాంతాలలోని గిరిజనేతరుల సంఖ్య 9 లక్షలనుంచి 14 లక్షలకు పెరిగిపోగా అదే కాలంలో గిరిజనుల జనాభా 50 శాతంనుంచి 47 శాతానికి తగ్గిపోయింది. కనుకనే 1984లో ట్రైబల్ అడ్వయిజరీ కౌన్సిల్ ఆంధ్ర ప్రాంతంలో అయితే 1959 రెగ్యులేషన్‌ను 1917నుంచి అమలులో ఉన్నట్టు, తెలంగాణాలో అయితే 1949నుంచీ అమలులో ఉన్నట్టుగాను పరిగణించవలసిందిగా సిఫారసు చేయవలసి వచ్చింది. (ఇప్పుడు ఆ కౌన్సిల్ కూడా గొంతు మార్చింది - అది వేరే విషయం). అందుకే గిరిజనుల ప్రయోజనాలకు కలగబోతున్న ప్రమాదాన్ని గురించి హెచ్చరిస్తూ సుప్రీంకోర్టు కూడా గిరిజనేతరుల అప్పీలును కొట్టివేస్తూ ఒక బరువైన వ్యాఖ్య చేసింది : "ఒంటికాలుతో నడిచే ఒక వికలాంగుడికీ, రెండు కాళ్ళూ బాగున్న ఒక ఆరోగ్యవంతుడికీ మధ్య సాగే పోటీ లాంటిదే - నేడు గిరిజనులకు, గిరిజనేతరులకు మధ్య సాగుతున్న పోటీ. ఈ సత్యాన్ని చూడకుండా సమాజం కళ్ళు మూసుకుని కూర్చోలేదు. అందువల్ల ఆర్థిక నేరాలకు పాల్పడ్డ గిరిజనేతరులకు 'క్షమాభిక్ష' పెట్టడం అసాధ్యం.... అలా చేస్తే దోపిడీని, అన్యాయాన్ని యథేచ్ఛగా అనుమతించడమే అవుతుంది".

ఈ పరిస్థితుల్లో "సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ" ఏం చేస్తోందో మనకు తెలియదు. రాష్ట్రంలోని మొత్తం గిరిజన జనాభా 31 లక్షల 70 వేల మందిలో 13 లక్షల 30 వేల మంది పై చిలుకు జనాభా షెడ్యూల్డు ఏరియాలుగా ప్రకటించిన భౌగోళిక సామీప్యతగల ప్రాంతాల్లో ఉంటున్నారు. వీరి బాగోగులకు పూచీ పడవలసిన సంస్థలు కేంద్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో ఉపప్రణాళికలు (సబ్ ప్లాన్స్) సిద్ధపరిచి అమలు జరపవలసిన సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థలు. అంతేకాదు, ఇటీవల మరొక గమ్మత్తు జరుగుతోంది. 1969 నాటి రైత్వారీ చట్టంలో 'పొసెషన్ ఆర్ కల్టివేషన్" (స్వాధీనం లేదా సాగుచేయడం) అనే క్లాజును అండగా తీసుకొని "ప్రైవేటు ఫారెస్టు" చట్టానికి ఒక సవరణ తెచ్చారు. ఫలితంగా అడవుల్లో గిరిజనేతరులూ, ఫారెస్టు కాంట్రాక్టర్లూ వేలాది ఎకరాల పట్టాలు తెచ్చుకున్నారు. ఈ పట్టాలను రద్దుచేసి ఈ అడవులను "రక్షిత అడవులు"గా (ప్రొటెక్టెడ్ ఫారెస్టు) ప్రకటించకుండా ప్రభుత్వం ఎందుకు జాగు చేస్తున్నట్టు? సమాధానం లేదు.

బుధవారం, జూలై 12, 1989

# పంచాయితీరాజ్ - "గాంధేయ రాజ్యాంగం"

దేశంలో పంచాయితీరాజ్ సంస్థలను "పటిష్ఠం" చేసే ఉద్దేశంతో కేంద్ర ప్రభుత్వం ఈ ఎన్నికల సంవత్సరంలో ఏర్పాటు చేసిన ముఖ్యమంత్రుల సమావేశం, అందులో చేసిన నిర్ణయాలు "కొండను తవ్వి ఎలుక"ను పట్టిన చందంగా వున్నాయి. క్షణికమైన ప్రయోజనాలపై ఉన్న శ్రద్ధ దీర్ఘకాలిక ప్రయోజనాలపై కన్పించలేదు. ఎన్నికలపై ఉన్న అభిమానం ఎన్నికైన బేసిక్ సంస్థల - పంచాయితీల - వాస్తవిక సమస్యలపైన వాటి స్వపరిపాలనా శక్తిపైన ఉన్నట్టు ఈ సమావేశంలో వ్యక్తం కాలేదు. కాంగ్రెస్ (ఐ) పాలిత రాష్ట్రాల, నాన్-కాంగ్రెస్ రాష్ట్రాల ముఖ్యమంత్రులు తీర్చిన ఈ సభ "ఎవరికి వారే యమునా తీరే"గా, ఎవరి గోడును వారు వ్యక్తం చేసుకునే వేదికగా మారింది. అంతేగాని నలభైఏళ్ళ స్వాతంత్ర్యం తర్వాత ఇప్పుడు గుర్తుకొచ్చిన పంచాయితీరాజ్ వ్యవస్థ తీరుతెన్నులను క్షుణ్ణంగా చర్చించి, అధికార వికేంద్రీకరణలో వాటి స్పష్టమైన అధికారాలను గుర్తించి, వాటికి అవసరమైన ఆర్థిక వనరులను నిరంతరాయంగా సమకూర్చవలసిన అవసరం గురించి నిర్ణయాలు చేయలేదు. పైగా ఇండియా భవిష్యత్తును దాని పార్లమెంటరీ, ఫెడరల్ వ్యవస్థలను పురిపుష్టం చేయగల గ్రామీణ పంచాయితీని బేసిక్ ప్రజాస్వామ్యానికి ప్రాణప్రదమైన యూనిట్‌గా భావించిన గాంధీజీ ప్రణాళికకు విరుద్ధంగా, నాన్ కాంగ్రెస్ రాష్ట్రాల ముఖ్యమంత్రుల అభిప్రాయాలకు భిన్నంగా - రాజ్యాంగాన్ని కేంద్రం సవరించడానికే నిర్ణయించింది. పరిపాలనా వ్యవస్థ కింది స్థాయినుంచి పై స్థాయికి ఎదగాలిగాని, పైనుంచి కిందికి కాదని చెప్పిన "గాంధేయ రాజ్యాంగం", భారత రాజ్యాంగం ముసాయిదా తయారవుతున్న సమయంలోనే రూపొందింది.

నిజమైన స్వరాజ్యం కావాలంటే గ్రామీణ భారతంలో పంచాయితీరాజ్ పునః ప్రతిష్ఠాపన జరిగి తీరాలన్నది జాతీయోద్యమ లక్ష్యాలకుపట్టుకొమ్మగా ఉన్న ప్రధాన అంశం. అందుకే గాంధీజీ అన్నారు: "అధికార కేంద్రం ప్రస్తుతానికి న్యూఢిల్లీలోనో, కలకత్తా, బొంబాయి వంటి పెద్ద పెద్ద నగరాలలోనూ ఉండవచ్చుగాక. కాని నేనైతే, స్వపరిపాలన లక్ష్యంగా ఈ అధికారాన్ని దేశంలోని ఏడు లక్షల గ్రామలకూ సమంగా పంచిపెట్టి ఉండేవాణ్ణి". ఈ ఆదర్శం "గుంట పూలు పూచింది" కాబట్టే నలభైఏళ్ళ స్వాతంత్ర్యంలో ఏ కొన్నేళ్ళో మినహాయిస్తే కనీసం పాతిక ముప్పయేళ్ళుగా దేశంలోని పెక్కు రాష్ట్రాలలోని పంచాయితీ రాజ్ సంస్థలకు, మునిసిపాలిటీలకు ఎన్నికలు రద్దయి, స్వార్థ రాజకీయవేత్తల, అధికారుల "పెత్తందారీరాజ్"గా మారిపోయింది! పంచాయితీరాజ్ వ్యవస్థకు ప్రథమ సోపానాలుగా పనిచేసిన రాజస్థాన్, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, గుజరాత్‌లలో కూడా కొన్నేళ్ళపాటు ఈ సంస్థలు "నామినేటెడ్" వ్యక్తుల పెత్తనంలోనో, స్పెషల్ ఆఫీసర్ల అజమాయిషీలోనో ఉంటూ వచ్చాయి. పాత వ్యవస్థ స్థానే, ప్రజలకు పంచాయితీరాజ్ వ్యవస్థ మరింత దగ్గర కావడానికి వీలుగా మండల వ్యవస్థను 1978లోనే అశోక్ మెహతా

కమిటీ సిఫారసు చేసింది. కాని ఆ విషయాన్ని ముఖ్యమంత్రుల సమావేశంలో ప్రస్తావించకుండా దాటవేశారు. ఇప్పుడు కేంద్రం ప్రవేశపెట్టదలచిన రాజ్యాంగ సవరణ బిల్లును ఆ కమిటీయే సూచించినదని కొందరు సమర్థించబోయాడు. కాని, అశోక్ మెహతా కమిటి చేసిన సూచన పంచాయితీరాజ్ పటిష్ఠతకు ఉద్దేశించినదేనని భావించినప్పుడు గత పదకొండేళ్ళుగా నిద్రపోయి, ఈ ఎన్నికల సంవత్సరంలోనే ఎందుకు గుర్తుకొచ్చినట్టు? ఆంధ్ర, కర్ణాటకలు మండల వ్యవస్థను అనుసరించినప్పటికీ, కేంద్రం ఎందుకు మేలుకోలేదు? ఫెడరల్ వ్యవస్థలో రాజ్యాంగం రాష్ట్రాలకు 40వ అధికరణ ద్వారా, ఏడవ షెడ్యూల్‌లోని రాష్ట్రాధికారాలను స్పష్టీకరిస్తున్న జాబితాలోని అయిదవ అంశం ద్వారా పంచాయితీరాజ్ వ్యవస్థ నిర్వహణ పూర్తిగా రాష్ట్రాలకు చెందినదని నిర్దేశించింది. ఇప్పుడీ అంశాన్ని ఉమ్మడి జాబితాలో చేర్చుతూ రాజ్యాంగ సవరణ బిల్లునే తేబోవడం ఇప్పటికే బెడిసి ఉన్న కేంద్రం రాష్ట్రాల సంబంధాలను మరింత చెడగొట్టడానికే తోడ్పడుతుంది. ఈ సవరణ రాజ్యాంగం మౌలిక ఆదర్శాలకు భిన్నంగా ఉండబోదనీ, రాష్ట్రాల ప్రత్యేకాధికారాలను హరించబోదనీ ప్రధానమంత్రి ఈ సమావేశంలో హామీ ఇచ్చినా - ప్రస్తుత దశలో నమ్మించడం కష్టసాధ్యమైన పని. ఎందుకంటే, ఇప్పటికే అభివృద్ధి కార్యక్రమాలను పంచాయితీరాజ్ సంస్థలద్వారా అమలులోకి తేవడానికి బదులు సమితుల, జిల్లా పరిషత్‌ల అజమాయిషీ పరిధులను అతిక్రమించి పెక్కు కేంద్ర పథకాల ద్వారా అమలు పరుస్తున్నారు. ఈ పోటీ పథకాలు రాజ్ సంస్థలను బలహీనపరుస్తున్నాయి. 1989-90 బడ్జెట్‌లో సీజన్‌వారీగా తాత్కాలిక వేతనాలు లభించగల కేంద్ర ఉపాధి పథకాలను (ఎన్.ఆర్.ఇ.పి., ఆర్.ఎల్.ఇ.జి.పి.) అమలు జరిపే అధికారాలను మాత్రమే "వికేంద్రీకరిం" చాలని సూచించారు. అంతేగాని, స్థానిక ప్రత్యేకతలను, ప్రాధాన్యతలనుబట్టి ఈ పథకాలను రూపొదించుకునే అధికారాన్ని మాత్రం 'వికేంద్రీకరిం'చలేదు. రాష్ట్రాలకు దఖలు పరచలేదు. పైగా ఈ కార్యక్రమాల అమలుకు బాధ్యత వహించే కేంద్ర మంత్రిత్వ శాఖ (ప్రోగామ్ ఇంప్లిమెంటేషన్ మినిస్ట్రీ) కూడా పేదరికం భారాన్ని తగ్గించేందుకు అసలే అంతంతమాత్రంగా వున్న ఆర్థిక వనరులను సమర్థవంతంగా ఉపయోగించడానికి అనేక అడ్డంకులున్నాయని చెప్పింది. "నేటికీ ప్రణాళికలూ, పథకాలూ పైనుంచే రూపొందుతున్నాయి. గాని, కిందిస్థాయినుంచి తయారవడం లేదని" కూడా ఆత్మవిమర్శ చేసుకోవలసి వచ్చింది! అయినా రాజ్యాంగ సవరణ బిల్లు ఈ మౌలిక అంతరాన్ని, అస్తవ్యస్తమైన ధోరణిని ఎలా సవరించగల్గుతుంది? పైగా, మూడేళ్ళనాడే జాతీయాభివృద్ధి మండలి నియమించిన సాధికార సంఘం అలాంటి పథకాలను కేంద్రం రూపొందించుకోవడం మానుకోవాలనీ, దానికి బదులుగా పేదరికం నిర్మూలనకు ఉద్దేశించిన నిధులను రాష్ట్రాలకు బేషరతుగా బదిలీ చేయాలనీ, ఇది గ్రామీణ స్థాయిలో స్థానిక ప్రత్యేకతలకు తగినట్టుగా పథకాలు రూపొందించడానికి వీలైన పద్ధతి అనీ తెలిపింది. కమిటీ సిఫారసును ఎందుకు అమలులోకి తేలేదు? సుప్రసిద్ధ సామాజిక శాస్త్రవేత్త ఎల్.సి.జైన్ చెప్పినట్టు "రాష్ట్రాలపై తమకు ఉన్న ఏకైక రాజకీయపట్టు కాస్తా సడలిపోతుంద"ని భావించినట్టే కేంద్ర మంత్రులు దానిని వ్యతిరేకించారు. మనకు చట్టాలు లేకనా? రాజ్యాంగం పదేళ్ళలో ప్రజలకు హామీపడిన (1962 నాటికల్లా) నిర్బంధ ప్రాథమిక విద్యావ్యాప్తి లక్ష్యాన్ని ఈ రోజుకీ పాలకులు ఎందుకు సాధించలేకపోయారు? పంచాయితీల కోసం ఇప్పుడు వేరే రాజ్యాంగ సవరణ బిల్లు దేనికి? లక్ష్యంలో లోపమా, రాజకీయ చైతన్యంలో వచ్చిన మార్పా?

సోమవారం మే 8, 1989

# పంచాయితీరాజ్ - "గాంధేయ రాజ్యాంగం" 2

రిపబ్లిక్ రాజ్యాగం అమలులోకి వచ్చిన తరువాత ముఖ్యంగా గత పాతికేళ్ళుగా "వికేంద్రీకరణ" పేరుతో (డిసెంట్రలైజేషన్) జరుగుతున్న పని మరింతగా అధికరాల "కేంద్రీకరణ" తప్ప మరొకటి కాదు. "తొండముదిరి ఊసరవెల్లి" అయినట్టుగా ఈకేంద్రీకృతాధికారం రాష్ట్రాలపై యూనియన్ ప్రభుత్వం పెత్తనానికి రాచబాటలు వేసింది. అంతేకాదు, ఈ కేంద్రీకృతాధికారం శృతిమించి రాగానపడి రాజ్యాంగం గ్యారంటీ చేసిన పౌరుల హక్కులను, ముఖ్యంగా "జీవించే హక్కు" సహా సప్త స్వాతంత్ర్యాలనూ నిరంకుశంగా స్వాహా చేసే ఎమర్జెన్సీ ప్రకటనకూ కారణమై కూర్చుంది. చివరికి ఆ "ఎమర్జన్సీ"లోనే, అప్పటివరకూ రాజ్యాంగం 7వ షెడ్యూల్ రెండవ జాబితా ప్రకారం రాష్ట్రాల నిర్ణయాధికారానికి వదలిన "విద్య" అంశాన్ని కేంద్రం జోక్యానికి వీలు కల్పించుకుంటూ "ఉమ్మడి జాబితా"లోకి గుంజేశారు. ఇక ఇప్పుడు పంచాయితీలపైరాష్ట్ర ప్రభుత్వాలకు ఉన్న అధికారాన్ని కూడా ఊడబెరకడంకోసమే రాజ్యాంగ సవరణను తలపెట్టారు. ఏడవ షెడ్యూల్‌కు విరుద్ధంగా, లేదా అడ్డంగా ముందుకు సాగి రాజ్యాంగంలోని నామమాత్రపు 40వ (పంచాయితీల ప్రతిపత్తిని కాపాడే అంశం) స్వరూప స్వభావాలను కూడా చెడగొట్టాలని చూస్తున్నారు. పోనీ ముఖ్యమంత్రుల సమావేశానికి ముందు సమస్యను గురించి రాష్ట్ర ప్రభుత్వాలతో కేంద్రం చర్చించిందా? లేదూ, కనీసం ఒక సమాచార పత్రాన్నయినా "నోట్" రూపంలో సర్క్యులేట్ చేశారా? లేదూ "మేం భావిస్తున్న రాజ్యాంగ సవరణ బిల్లు" రూపురేఖా విలాసాలు ఇలా ఉండబోతున్నాయని సూచనప్రాయంగా తెలుపుతూ ఒక ముసాయిదా అయినా సర్క్యులేట్ చేశారా? మొత్తం భారత ప్రజాస్వామ్య, పార్లమెంటరీ వ్యవస్థల ఉనికికే అత్యంత ప్రధానమైన పునాది వ్యవస్థ - పంచాయితీ రాజ్‌లో మార్పులు తేవాలనుకున్నప్పుడు అంత హడావుడిగా, ఇంక ఆరునెలల్లో ఎన్నికలు ఉండగా ఎందుకీ సమావేశం జరుపవలసి వచ్చిందట? రాజ్యాంగ సవరణ అవసరం గురించి చెప్పిన (అమలు జరిపే వారికి మాత్రమే ఆ సిఫారసు అని గుర్తించాలి) అశోక్ మెహతా కమిటీని ఆ ఒక్క అంశంలోనే అరువు తెచ్చుకుంటున్నారుగాని కేంద్రం ప్రతిపాదించిన రాజ్యాంగ సవరణలు ఆ కమిటీయే రూపొందించిన ముసాయిదా సవరణ బిల్లును అనుసరించి ఉంటాయా? లేక 1985 కర్నాటక చట్టాన్ని ఆదర్శంగా తీసుకుంటాయా? ఊహామాత్రంగా కూడా ఎలాంటి భావాన్ని కేంద్రం ఈ విషయంలో వ్యక్తం చేయలేదు. కాని తాను తేదలచుకున్న రాజ్యాంగసవరణ బిల్లులో "పంచాయితీరాజ్"ను ఎలా పరిపాలించబోతున్నారో స్థూలంగా కొన్ని "టుమ్రీ"లు మాత్రం విడిచిపెట్టారు.

ఆ బిల్లును ఎందుకు తెస్తున్నారు? పంచాయితీని రద్దుచేసే అధికారం రాష్ట్ర ప్రభుత్వానికి కాదు, గవర్నర్‌కు దఖలుపడ్తుతుందట. గవర్నర్ చర్యను ఆ తరువాత రాష్ట్ర శాసనసభ ఆమోదానికి నివేదిస్తారట.

(ఈ పని గవర్నర్ హోదాను పెంచుతుందో, తుంచుతుందో వారే చెప్పాలి) స్థానిక సంస్థల లేదా పంచాయితీల నిర్వహణ, దానికి సంబంధించిన సమస్యలపై నిర్ణయాధికారంగానీ, నిర్ణయాలను అమలు జరిపే అధికారం గానీ జిల్లా మెజిస్ట్రేట్‌లకు (కలెక్టర్‌లకు) మాత్రమే ఉంటుంది. పంచాయితీలు కేవలం సలహా సంస్థలుగానే ఉండాలి. పంచాయితీ ఎన్నికలను కేంద్ర ఎన్నికల సంఘానికి అప్పగించేస్తారు. అంటే పంచాయితీలు వాటి నిర్వహణలో మంచి చెడులకు సంబంధించిన నిర్ణయాధికారం రాష్ట్ర శాసనసభలకు ఇక ఉండదు. మరొక మాటలో చెప్పాలంటే - ఈ విషయంలో క్రమంగా రాష్ట్రాల శాసనాధికారానికి 'సున్న' చుట్టడమే ఇంకా వెలుగుచూడని ఈ సవరణ బిల్లు ఉద్దేశ్యంగా కనిపిస్తోంది. పంచాయితీలను క్రమంగా ఇలా కేంద్రంనుంచే అజమాయిషీ చేయాలన్న తలంపు - రాష్ట్రాలలోని జిల్లా కలెక్టర్లతో 1987లో కేంద్రం సరాసరి సంబంధాలు పెట్టుకుని, వారికే సరాసరి (రాష్ట్ర ప్రభుత్వంతో స్థానిక సంస్థల కార్యక్రమాలతో సమన్వయం లేకుండా) నిధులు అందించడంతోనే మొగ్గతొడిగింది. బిల్లు ఉద్దేశంగా మనకు పైకి చెబుతున్నది. - అధకార వికేంద్రీకరణ, అని! కాని ఆచరణలో చేయబోతున్న పని రాష్ట్రాల, స్థానిక సంస్థల ప్రతపత్తికి ఆచరణలో భంగకరమైన పద్ధతిలో అధికార కేంద్రీకరణ! ఈ దెబ్బతో జిల్లా స్థాయిలోగాని, బ్లాక్ స్థాయిలోగాని ప్లానింగ్ కమిటీలూ, స్థానిక పథకాల సమన్వయీకరణకు ఏర్పడిన కౌన్సిళ్ళూ వాటి అధికారాలూ ఊడిపోతాయి.

పంచాయితీలకు విధిగా ఎన్నికలు జరిపించడమే రాజ్యాంగ సవరణ బిల్లు ఉద్దేశమయితే అందుకు ప్రతి ఒక్కరూ సంతోషించవలసిందే. కాని అలాంటి సవరణ లేకుండానే ఆంధ్ర, కర్నాటక, గుజరాత్, పశ్చిమ బెంగాల్‌లలో పంచాయితీరాజ్ ఎన్నికలు ఎలా జరిగాయి, ఇతర చోట్ల ఎందుకు జరగడంలేదు? అందువల్ల బుద్ధి వక్రమార్గం పట్టకూడదుగాని చట్టం ఉన్నా ఎన్ని ఉల్లంఘనలు మన కళ్ళముందు జరగడంలేదు? చట్టబద్ధంగా ఎన్నికైన ప్రభుత్వాలనే కూలదోస్తున్నప్పుడు, లెజిస్లేచర్‌లనే రద్దుచేస్తున్నప్పుడు, "నామినేటెడ్" గవర్నర్లకే పరిపాలనను అప్పనంగా అప్పగిస్తున్నప్పుడు ఏ శాసనం, ఏ రాజ్యాంగ సవరణ పంచాయితీలను మాత్రం నిరంకుశంగా రద్దుచేయకుండా ఆపగలుగుతుంది? అందుకే గాంధీ శిష్యుడు శ్రీమన్నారాయణ్ అగర్వాల్ ఆయన అనుమతితోనే రాసిన "గాంధేయ రాజ్యాంగం"లో ఆర్థిక వనరుల, రాజకీయాధికారాల పూర్తి వికేంద్రీకరణ ద్వారానే గ్రామాలూ, వాటి పంచాయితీలూ స్వయంపోషకం కాగల్గుతాయి, స్వపరిపాలితం కాగల్గుతాయని స్పష్టం చేశాడు. ఈ ఆదర్శానికి ఈ బిల్లు ఎంత దగ్గరలో ఉన్నట్టు?! ఉండబోతున్నట్టు?

మంగళవారం మే ౨, ౧౯౮౯

# పంచాయితీరాజ్ - "గాంధేయ రాజ్యాంగం"

పళ్ళు ఊడగొట్టుకోవడానికి ఏ రాయి అయినా ఒకటే! పంచాయితీరాజ్ సంస్థలు స్థానిక సంస్థల వాస్తవ అధికారాలను, స్వేచ్ఛను హరించడానికి రాష్ట్ర ప్రభుత్వమైనా ఒక్కటే, కేంద్రమైనా ఒకటే. నిజానికి ఇంతవరకూ కేంద్రం - రాష్ట్రాల మధ్య వస్తున్న తగాదా అల్లా పైకి రాజయకీయమైనదిగా కన్పిస్తున్నప్పటికీ, అది ప్రధానంగా ఆర్థిక వనరుల సమీకరణకు, వాటి పంపిణీకి సంబంధించినది. పంచాయితీ స్థానిక వసరులను, మునిసిపల్, రాష్ట్ర ప్రభుత్వాలు లేదా పాలక పక్షంలో ఉన్నవారు తమ ఉనికిని కాపాడుకొనేందుకు రాష్ట్ర ప్రయోజనాల పేరిట ఊడ్చిపెడుతున్నాయి. అలాగే రాష్ట్ర వనరుల పెరుగుదలకు తద్వారా స్థానిక సంస్థల ఆర్థికసౌష్టవానికి తోడ్పడవలసిన ఆదాయపు పన్ను, ఎక్సైజ్ సుంకాలపై వచ్చే రాబడిలో హెచ్చు వాటాను కేంద్రం గుంజుకుపోవడంతో "లోటు" ఏర్పడుతోంది. అందుకే గ్రామాలు స్వయంపోషకం కావడానికి అనువుగా స్థానిక రాబడి వనరులపై అజమాయిషీ రాష్ట్రాలకు ఉంటే తప్ప గాంధీజీ ఆదేశించిన నిజమైన "గ్రామ స్వరాజ్యా"నికి అర్థం ఉండదు. దేశంలో ఈ పరిస్థితికి కారకులు రాజకీయవేత్తలేనని కేంద్రం - రాష్ట్ర సంబంధాలను సమీక్షించిన సర్కారియా కమిషన్ అభిప్రాయపడిందంటే ఎవరూ నొచ్చుకోనక్కరలేదు. గ్రామస్థాయి నుంచి కేంద్రం వరకూ ముప్పై ఏడేళ్ళ అభివృద్ధిని సమీక్షించిన ఈ కమిషన్, ఒకవైపున ఆర్థిక రంగంలోనూ, మరొకవైపున రాజకీయ వ్యవస్థలోనూ పరస్పర విరుద్ధమైన ధోరణులు ఎలా చోటు చేసుకున్నదీ చెప్పింది. పాత వ్యవస్థ విచ్ఛిన్నమైంది. జాతీయ రాజకీయ పక్షాలు చీలిపోయాయి. ప్రణాళికా ప్రాధాన్యతలను బట్టిగాకుండా జనాకర్షకమైన నినాదాల్తో జనాన్ని దోచుకునే పద్ధతులు అమలులోకి వచ్చాయి. ఎన్నికలలో, కులం, మతం, డబ్బు, దౌర్జన్యం చోటు చేసుకున్నాయి - ఇదీ మన వ్యవస్థను దిద్దితీర్చిన రాజకీయవేత్తల ప్రోగెస్ రిపోర్టు అని కమిషన్ శరించవలసి వచ్చింది. అధికారం కోసం వెంపరలాటలో భాగంగానే రాజకీయవేత్తలు గ్రామాలనూ, పంచాయితీలను కూడా 'కరప్ట్' చేశారు. పార్టీలకు అతీతంగా ఎదగవలసిన ప్రజాస్వామిక వ్యవస్థ ప్రాథమిక పునాది అయిన గ్రామీణ వ్యవస్థ - పంచాయితీ రాజకీయ కక్షలకు, కార్పణ్యాలకు "శిక్షణా నిలయం"గా మారింది. ఫలితం- క్రమంగా ఈ ప్రాథమిక ప్రాతినిధ్య వ్యవస్థకు ఎప్పటికప్పుడు అప్పటి పాలకులకు అనుకూలంగా ఉంటే ఎన్నికలు జరిపారు. అవి ప్రతిపక్షం చేతులలో ఉంటే రద్దు చేస్తూ వచ్చారు. ఎన్నికలు నిర్ణీత వ్యవధిలో కాకుండా ఇష్టానిష్టాలపైన, రాజకీయ ప్రయోజనాలను బట్టే జరగడమో వాయిదా పడడమో! ఈ పరిణామానికి కాంగ్రెసూ- నాన్ కాంగ్రెస్ ప్రతిపక్షాలూ బాధ్యులు. 1978 తర్వాత బీహార్‌లోనూ, కొలది సంవత్సరాలు మినహాయిస్తే 1981-82 వరకూ ఆంధ్రప్రదేశ్‌లనూ గ్రామ పంచాయితీలకు ఎన్నికలు జరపనే లేదు. 1977లో తమిళనాడులో రాష్ట్రపతి పాలనలో కేంద్ర ప్రభుత్వం

చేసిన పని - రాష్ట్రంలోని అన్ని పంచాయితీ యూనియన్లను రద్దు చేయడం! ఇతర స్థానికసంస్థల విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా ఎన్నికైన ప్రతిపక్ష సంస్థలను "సూపర్ సీడ్" ఎలా చేయాలా అన్న లక్ష్యంతోనే పనిచేస్తోంది. అందువల్ల ఈ 'జబ్బు'పాలక - ప్రతిపక్షాల మధ్య ఒకరినొకరు సాధించుకునే ప్రయత్నంలో పుడుతోంది. ఒక విధంగా, నాన్ పార్టీ ప్రాతిపదికపైన పంచాయితీరాజ్‌కు ఎన్నికలు జరిపి సుమారు ఇరవయ్యేళ్ళ స్తబ్ధతను తొలగించిన ఘనత ఆనాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అంజయ్యదే. ఫలితాలు వెల్లడైన తరువాత "గెలిచిన వాళ్ళంతా మావాళ్ళే"నని అంజయ్య ప్రకటించారనుకోండి! అది వేరే ముచ్చట. కాని గాంధీజీ ఆదర్శించిన పార్టీ రహిత గ్రామ పంచాయితీ వ్యవస్థకు కొంతమేరకు తాత్కాలికంగానైనా విలువ తెచ్చింది కాంగ్రెస్‌లో కూడా ఒక్క అంజయ్య మాత్రమే!

పంచాయితీరాజ్ సంస్థలకు రెగ్యులర్‌గా ఎన్నికలు జరిగేటట్టు చూడ్డానికి రాజ్యాంగ సవరణ ద్వారా శాసనం చేయాలన్న ఆలోచన కూడా మనస్ఫూర్తిగా చేసినట్టు కన్పించదు. ఎందుకంటే ఇందుకు సంబంధించిన బిల్లును సమర్థిస్తున్నవారిలో జిల్లా పరిషత్ ఎన్నికలను మరో ఏడాదిపాటు వాయిదా వేసిన మహారాష్ట్ర ప్రభుత్వమూ ఉంది, పంజాబ్‌లో మరో ఆరు నెలలపాటు రాష్ట్రపతి పాలనను పొడిగించాలని మొన్ననే సిఫారసు చేసిన గవర్నర్ సిద్ధార్థ శంకర్‌రే కూడా ఉన్నారు.

నిజమైన అధికార వికేంద్రీకరణకు, ముఖ్యంగా గ్రామ స్వపరిపాలన లేదా "గ్రామీణ గణతంత్ర" వ్యవస్థ పునాదిగా వికేంద్రీకరణకు 1946-49 మధ్య రాజ్యాంగ నిర్ణయ సభలోనే గండిపడిందని చెప్పాలి. గ్రామస్థాయి వరకు మనఃపూర్వకంగా ఈ వికేంద్రీకరణ జరిగితే, కేంద్రాధికారం దెబ్బతింటుందనీ తద్వారా దేశ సమైక్యతకూ, సమగ్రతకూ విఘాతం కలుగుతుందనీ భావించి అధికార కేంద్రీకరణకే ప్రాధాన్యం కల్పించారు. దాని ఫలితం - అతి కేంద్రీకరణ (Over-Centralisation) అయింది. ఈ ఉద్దేశ్యంతోనే గ్రామ స్వపరిపాలన భావానికిగాని, గ్రామ స్వరాజ్య స్థాపనకుగాని ఆనాటి రాజ్యాంగ నిర్ణయ సభ్యులు పెక్కుమంది సుముఖత వ్యక్తం చేయలేదు. ఆ సభా చర్చలను, వాదోపవాదాల రికార్డ్సును పరిశీలిస్తే గ్రామ పంచాయితీ వ్యవస్థ ప్రస్తావన నామమాత్రంగా ఉండడమేగాక, రాజ్యాంగ చట్టంలో ఇందుకు సంబంధించిన 40వ అధికరణను కూడా మొక్కుబడిగా మాత్రమే చొప్పించారని తెలుస్తుంది. ఇది నిజమా, కాదా? ప్రస్తుతపు 40వ అధికరణకూ, ఆనాడు ప్రసిద్ధ సభ్యులు ఎమ్.ఎ. అయ్యంగార్, ఎన్.జి. రంగా ప్రతిపాదించిన సవరణకూ తేడా ఎక్కడుంది? చూద్దాం.

బుధవారం మే 10, 1989

# పంచాయితీరాజ్ - "గాంధేయ రాజ్యాంగం" 4

"గ్రామ స్వరాజ్యం" లక్ష్యానికి పునాది అయిన స్వయం పోషక భావాన్ని పంచాయితీలలో పెంచిన కొలదీ, కేంద్రాధికారం పట్టు సడలిపోతుందని ఆలోచించబట్టే - రాజ్యాంగ నిర్ణయ సభలోనే కొందరు 'పెద్దలు' కొన్ని జాగ్రత్తలు తీసుకున్నారు. ఆ సమయంలోనే గ్రామాలకు, ఇతర స్థానిక సంస్థలకు హెచ్చుగా స్వపరిపాలనాధికారం దఖలు పరచాలన్న "గాంధేయ రాజ్యాంగం" కూడా వెలువడినందున, 'పెద్దలు' మరింతగా జాగ్రత్తపడవలసి వచ్చింది. కేంద్రం చేతులలో అధికారాల "అతికేంద్రీకరణ"ను అడ్డుకుంటున్న ఈ "గాంధేయ రాజ్యంగా"న్ని వీరు ఆనాడే ప్రక్కకు నెట్టివేశారు. ప్రజలకు అనుకూలంగా అధికారాల వికేంద్రీకరణ జరగకుండా ఉండేదుకే వీరీ పని చేశారు. నాడు ముసాయిదా రాజ్యాంగ రచనకు తోడ్పడేందుకు ఏర్పడిన రెండు ప్రధానమైన కమిటీలు - యూనియన్, ప్రొవిన్షియల్ కాన్స్టిట్యూషన్ కమిటీలు - 1935 చట్టాన్ని 'కాపీ' కొట్టినప్పటికీ భావి భారతదేశానికి పునాది అయిన గ్రామీణ పంచాయితీ స్వయం ప్రతిపత్తిని కాపాడేందుకు ఏ మాత్రమూ తోడ్పడలేదు. ఈ కమిటీల సమావేశాల తాలూకు "మినిట్స్"లో ఎక్కడా "గాంధేయ స్వరాజ్యం" గురించిగానీ, కనీసం పంచాయితీ గురించి గానీ ప్రస్తావన లేదు. ఎంతసేపూ అధికార వికేంద్రీకరణ భావన యూరప్ - అమెరికా రాజ్యాంగ సంప్రదాయాల నేపథ్యంలోనే మొగ్గ తొడిగి పూవు పూసింది గాని, నేల తల్లితో ఎదిగివచ్చిన మన పంచాయితీ వ్యవస్థ మంచి చెడుల పునాదిపై ఎదిగి రాలేదు. కనుకనే వారు గాంధేయ ప్రతిపాదనలను ప్రక్కకు తోసిపెట్టారు.

అంతేకాదు, చివరకు 1947 జులై - అగస్టులో జరిగిన రాజ్యాంగ నిర్ణయ సభ సమావేశాలలో ఈ రెండు కమిటీల నివేదికలు చర్చకు వచ్చినప్పుడు కూడా, పంచాయితీల ప్రస్తావన లేదని కనిపెట్టిన సభ్యులు బహు కొద్ది మంది మాత్రమేనని మరచిపోరాదు. ప్రస్తావించిన వ్యక్తీ, ఈ విషయమై విమర్శనాత్మక దృక్పథంతో తరచి చూచిన వ్యక్తీ ఎవరైనా ఉంటే ఆయన గాంధీ శిష్యుడు రామనారాయణ్ సింగ్; "ప్రభుత్వానికి ప్రాధమిక యూనిట్లు గ్రామాలలో నెలకొనాలి. అధికారంలో హెచ్చు వాటా గ్రామీణ రిపబ్లిక్‌లకే చెందాలి, ఆ తరువాతనే కేంద్ర ప్రభుత్వానికి దక్కాలి" అని ఆయన స్పష్టం చేశాడు. అంటే, అధికారం పంపిణీ కావలసింది కిందిస్థాయినుంచిగాని పైస్థాయినుంచి కాదన్నాడు. ఇప్పుడు జరుగుతున్న పని ఇందుకు విరుద్ధంగా ఉంది! ఫలితంగా పెద్దలు "పార్లమెంటరీ సూత్రాల"లో కూరుకుపోయారు. ముసాయిదా రాజ్యాంగలో అసలు "పంచాయితీ" పదమే ఒక్కసారికూడా ప్రస్తావనకు నోచుకోలేదు. అయితే కొందరి అభ్యంతరంపైన చివరికి "పంచాయితీల అభివృద్ధి ప్రభుత్వం బాధ్యత" అని మొక్కుబడిగా ఆదేశ సూత్రాలలో చేర్చారు. కేంద్రం అధికారాలు క్రమంగా ఎక్కడ చేజారిపోతాయోనన్న భయంతో

వత్తిడివల్ల చేసిన ఈ నిర్ణయం ఫలితమే రాజ్యాంగంలో ఒకే ఒక వాక్యంగా మాత్రమే చోటుచేసుకున్న 40వ అధికరణ! గ్రామ పంచాయితీలను ఏర్పాటుచేసి, అవి స్వపరిపాలనా శాఖలుగా వృద్ధికాగల విధంగా అధికారాలను వాటికి సంక్రమింప చేయాలని మాత్రమే ఈ అధికరణ చెప్పిందిగానీ, వాటి ఆర్థిక వనరుల గురించి లేదా సమకూడవలసిన నిధుల గురించీ ప్రస్తావించలేదు. కాని, నాడు కె. సంతానం ప్రతిపాదించిన ఈ అధికార సవరణకు మారుగా ఎంతో మెరుగైన సవరణను ఎం. ఎ. అయ్యంగార్, ఎన్.జి.రంగా ప్రతిపాదించారుగాని, లాభం లేకపోయింది. ఈ సవరణ ప్రకారం ప్రజాస్వామిక పునాదుల పటిష్ఠతకోసం గ్రామీణ ప్రజలకు యువతరానికి శిక్షణ ఇచ్చేందుకు స్వపరిపాలిత పంచాయితీలను ఏర్పరచి, వాటికి తగినన్ని నిదులు సమకూర్చాలి; తద్వారా రాజకీయ, ఆర్థికాధికారాలను ఆచరణలో వికేంద్రీకరించుకోవాలి. ఇదీ ఆచార్య రంగా ప్రభృతుల విలువైన సవరణ. దీనికి విలువ నాడూ లేదు, నేడూ లేదు.

తీరా ఇప్పుడు పంచాయితీరాజ్ సంస్థలకు ఎన్నికలను రెగ్యులరైజ్ చేస్తూ పటిష్ఠతకోసం, వికేంద్రీకరణ పేరిట కేంద్రం తేదలచిన రాజ్యాంగ సవరణ బిల్లు కూడా గవర్నర్ల వ్యవస్థద్వారా ఢిల్లీనుంచి గ్రామ పంచాయితీలను ప్రత్యక్షంగా నడిపించాలని చూస్తోంది. పంచాయితీని రద్దుచేసే అధికారం పొందుతున్న గవర్నర్ చర్యను రాష్ట్ర శాసనసభ ఆమోదించాలేగాని తిరస్కరించకూడదు. పంచాయితీరాజ్ సంస్థల ఆర్థిక వనరులను చూసేందుకు ఏర్పడే రాష్ట్ర ఫైనాన్స్ కమిషన్ కేంద్రం కమిషన్ కనుసన్నల్లో మెలగాలిగాని, రాష్ట్ర ప్రభుత్వ అజమాయిషీలో లేదా లెజిస్లేచర్ అదుపులో వ్యవహరించకూడదు. అలాగే పంచాయితీ ఎన్నికల నిర్వహణకు ఏర్పడే స్టేట్ ఎలెక్షన్ కమిషన్ కేంద్రం కమిషన్ మాటపై నడుచుకోవలిగాని, రాష్ట్ర లెజిస్లేచర్ పరిధులలో నడుచుకోరాదు!! ఒక్కముక్కలో చెప్పాలంటే - రాజ్యాంగంలోని ఏడవ షెడ్యూల్‌లోని రెండవ జాబితా ప్రకారం పంచాయితీరాజ్ సంస్థలకు చెందిన లెజిస్లేటివ్ అధికారమూ, రాష్ట్ర ప్రతిపత్తీ కొత్త బిల్లుతో పురావస్తుశాలకు వెళ్ళవలసిందే! ఇకనుంచి రాష్ట్రాలు శిస్తు వసూలు చేసి పెట్టే 'ఏజెంట్ గిరీ' పుచ్చుకోవాలి లేదా "నిగామానులు"గా మాత్రమే వ్యవహరించాలి. రాజ్యాంగ నిర్మాతలు ఆశించిన భారత ఫెడరల్ వ్యవస్థ ఇదేనా? గోపాలకృష్ణ గోఖలే తన పొలిటికల్ టెస్ట్‌మెంట్‌లో (1914) ఆశించిన రాష్ట్రీయ స్వపరిపాలనకు అర్థం ఇదేనా? 1916లో మదన్ మోహన్ మాలవీయా, జిన్నా, సప్రూ సహా పందొమ్మిది మంది ప్రముఖులు రాష్ట్ర ప్రభుత్వాల స్వపరిపాలనా హక్కు గురించి విడుదల చేసిన ప్రత్యేక పత్రం సారాంశం ఇదేనా? ఆలోచించాలి, బాగా ఆలోచించాలి.

గురువారం మే 11, 1989

రెగ్యులర్‌గా జరిగేటట్టు చూడడానికీ, మూడు అంచెలలో ఆ వ్యవస్థను ('త్రీ - టైర్') దిద్దితీర్చడానికీ ఎవరూ అభ్యంతరం చెప్పరు. కాని జరుగుతున్న ఫార్సు - ప్రధానమంత్రే అంగీకరించినట్టుగా, పంచాయితీరాజ్ వ్యవస్థ మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్, కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లలో "చక్కగా అమలు జరుగుతున్నప్పుడు' ' చేయవలసిన పనేమిటి? ఈ నాన్-కాంగ్రెస్ రాష్ట్రాలను ఆదర్శంగా తీసుకుని కాంగ్రెస్ రాష్ట్రాలు కూడా స్థానికంగా శాసనాలు చేసుకోమని సలహా ఇవ్వాలి, వత్తిడి చేయాలి. అది లేదు. పైగా ఎ.ఐ.సి.సి. చర్చలో సవరణ బిల్లుకు సమర్థనగా ఒకరు అశోక్ మెహతా కమిటీని ఉదాహరిస్తే, ఇంకొకరు జయప్రకాశ్ నారాయణ్ పుస్తకంనుంచి ఉటంకిస్తే, వేరొకరు ఎన్.టి.రామారావు కరపత్రంనుంచి ఉదాహరించారు. యుద్ధంలో మొదట బలి అయ్యేది సత్యం అన్నారు! ఇక్కడ కూడా అదే జరిగింది. 'కాపీ' కొట్టినా అందంగా కొట్టాలిగాని ఇంత బాహాటంగా కొట్టకూడదు. మెహతా కమిటీ ప్రతిపాదించిన మండల వ్యవస్థను అనుసరించిన రాష్ట్రాలు కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లు; మొదటి రిజర్వేషన్లకు (పంచాయితీరాజ్ సంస్థల్లో) అవకాశం కల్పించినవి కూడా ఈ రెండు రాష్ట్రాలే. పైన ఉదాహరించిన కమిటీలన్నీ ఇందుకోసం రాజ్యాంగ సవరణ చేయమన్నాయేగానీ, పంచాయితీరాజ్ వ్యవస్థపై రాష్ట్రాలకు ఉన్న అధికారాలను కాస్తా కేంద్ర ప్రతినిధులైన, నామినేటెడ్ ప్రతినిధులైన గవర్నర్ల చేతులలో పెట్టమని అవి ఎక్కడా సిఫారసు చేయలేదు.

ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాలనూ, లెజిస్లేచర్‌లను విస్మరించేందుకు రాజ్యాంగ సవరణ తేవాలని ఆ కమిటీలు ఎక్కడా సూచించలేదు. గవర్నర్ నియమించే ఎన్నికల కమిషన్ మాత్రమే కావాలని అవి కోరలేదు. పంచాయితీరాజ్ సంస్థలలో స్థానిక నాయకత్వాన్ని ఎదిగి రానివ్వకుండా వారిపైన శాసనసభ్యులను, పార్లమెంటు సభ్యులను ఎక్స్-అఫిషియో సభ్యులుగా వారి మెడలకు గుదిబండలుగా ఉంచాలని ఆ కమిటీలేవీ సిఫారసు చేయలేదు. చివరికి, కొలది సంవత్సరాల క్రితం న్యూఢిల్లీలో "సామాజిక శాస్త్రాల అధ్యయన సంస్థ" పంచాయితీరాజ్‌పై నిర్వహించిన విశిష్ట సదస్సు కూడా - రాజ్యాంగ సవరణ కేవలం పంచాయితీరాజ్ ఎన్నికలను రెగ్యులరైజ్ చేయడానికే పరిమితం కావాలని సూచించింది. ఎన్ని అంతస్తుల (టైర్స్) వ్యవస్థ కావాలన్నది నిర్ణయించుకునే అధికారం వాటి నిర్వహణ అధికారం, స్థానిక పరిస్థితులనుబట్టి నిర్ధారణ చేసుకునే బాధ్యతను రాష్ట్ర ప్రభుత్వాలకే వదలాలని స్పష్టం చేసింది. అలాగే ఒక్క ఆంధ్రప్రదేశ్ తప్ప, అన్ని రాష్ట్రాలూ ఈ బిల్లును సమర్థించాయని చెప్పడం కూడా పచ్చి అబద్ధం. పశ్చిమబెంగాల్, హర్యానా నాయకులు కూడా పంచాయితీ ఎన్నికలు నిర్ణీత గడువులో జరుపుతూ రెగ్యులరైజ్ చేసేంతవరకే సవరణకు ఆమోదం తెలిపారు. ఆ పనిని రాష్ట్రాలే చేసుకోవచ్చునని చెప్పారు. బిల్లును వ్యతిరేకించారు. వారే కాదు, బెంగాల్ కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ నాయకుడు అబూ సత్తార్ కూడా "పంచాయితీరాజ్ రాష్ట్రాల వ్యవహారం, పైనుంచి అజమాయిషీ పనికిరాద" ప్రకటించలేదా? ఈ బిల్లు ఒక్కటే కాదు, మునిసిపాలిటీలను, కార్పోరేషన్‌లను, ఆఖరికి సహకార సంఘాలను కూడా చుట్టబెడుతూ- రాష్ట్ర ప్రభుత్వాలను "వాజమ్మ"లుగా మార్చుతూ ఫెడరల్ వ్యవస్థ రూపును మరింతగా చెడగొట్టే బిల్లులు కూడా రాబోతున్నాయి. ఇది బ్రూట్ మెజారిటీ విశ్వరూపం!! "ప్రజలకు అధికారం" దఖలు పర్చడం కాదు, ఆ పేరుతో గవర్నర్లకు అధికారం, వారిని నియమించే కేంద్ర ప్రభుత్వానికి అసాధారణ అధికారం. "యూనియన్ ఆఫ్ ఇండియా" నిన్నటి మాట! రాష్ట్రాలూ, రాష్ట్ర ప్రభుత్వాలు సర్వతంత్ర "సామంతులు"గా మారటం రేపటి బాట!

శుక్రవారం మే 12, 1989

# పంచాయితీరాజ్ - "గాంధేయ రాజ్యాంగం" (6)



ధీజీ అనుమతితో శ్రీమన్నారాయణ్ అగర్వాల్ ప్రకటించిన "గాంధేయ రాజ్యాంగం ఉద్దేశించిన అధికార వికేంద్రీకరణ, రాబోతున్న 64వ రాజ్యాంగ సవరణ బిల్లు ప్రతిపాదన లక్ష్యానికి విరుద్ధమైనది. పంచాయితీలన్నవి నిజమైన ప్రభుత్వ ప్రతినిధులు కావాలంటే వాటి అధికారాలు స్వపరిపాలన లక్ష్యంగా వాటికి, వాటిని నిర్వహించే రాష్ట్రాలకు ఉండాలిగాని, కేంద్రంవద్ద కేంద్రీకరించుకోరాదని గాంధేయ రాజ్యాంగం చెప్పింది. భారత తొలి ముసాయిదా రాజ్యాంగం ఢిల్లీలో అధికార కేంద్రీకరణకు అవకాశమిస్తున్న పత్రం అయినందున సక్రమమైనది కాదని రాజ్యాంగ నిర్ణయ సభ సభ్యులు ఆనాడే నిర్మొహమాటంగా చెప్పారు. పైగా "ఈ అతి కేంద్రీకృతాధికారం ప్రజాస్వామ్య విరుద్ధమే గాక, ఫాసిజానికి కూడా దారితీస్తుంద"ని హెచ్చరించారు. ఆ అనుమానం ఇప్పుడు పెనుభూతం అయ్యింది. "డీ సెంట్రలైజేషన్" - అంటే పంచాయితీలకు అధికారాల వికేంద్రీకరణ లేదా రాష్ట్రాలకు అధికారాల దఖలు అనిగాకుండా కేంద్ర ప్రభుత్వానికి మరింతగా అధికారాలు సంక్రమించడంగా అర్థం మారిపోయింది. గాంధీజీ ఆశించిన వికేంద్రీకరణ "సంపూర్ణ స్వరాజ్యానికి నాలుగు ముఖాలు పేర్కొంది. (1) రాజకీయ స్వాతంత్ర్యం, (2) ఆర్థిక స్వాతంత్ర్యం, (3) నైతిక, సాంఘిక విప్లవం (4) న్యాయం, ధర్మస్థాపన. ఈ నాల్గింటిలో ఏది 'గాడి' తప్పినా, అసత్యంగా మారినా "స్వరాజ్యం" రూపురేఖలన్నీ చెదరిపోతాయన్నారు. తానాశించిన "స్వరాజ్"లో వ్యక్తికి బహువచనం 'శక్తి' అవుతుందన్నాడు. అంటే ఆ సమష్టి గ్రామీణ స్వరాజ్యంనుంచే కేంద్రనికి అధికారం పంపిణీ కావాలిగాని పైనుంచి కిందిస్థాయికి కాదని చెప్పాడు. 'గ్రామ స్వరాజ్యం'కోసం వ్యక్తి ఏ త్యాగమైనా చేయాలని ఆయన ప్రబోధించాడు. కాని ఇప్పుడు 'కేంద్ర స్వరాజ్యం'కోసం రాష్ట్రాల అధికారాలను కేంద్రమూ, స్థానిక సంస్థల అధికారాలను రాష్ట్ర ప్రభుత్వాలూ హరించి అల్లరిపెడుతున్నాయి!

కేంద్రం తేనున్న కొత్త బిల్లులోని 243-ఎ, 243ఎఫ్, సెక్షన్‌ల ప్రకారం రాష్ట్ర లెజిస్లేచర్‌తో సంబంధం లేకుండా పంచాయితీలను గవర్నర్ ఆటపట్టించవచ్చు. పంచాయితీని తన అభీష్టానుసారం రద్దు చేయవచ్చు. బిల్లుకు పార్లమెంటు ఆమోద ముద్ర వేసిన దరిమిలా చట్టంగా మారిన ఏడాదిలోపు ఆ చట్టాన్ని రాష్ట్రాల లెజిస్లేచర్‌లు ఆమోదించి అమలులోకి తేవాలి. అలా తేకుండా 'మొరాయించి'న ప్రభుత్వాలను రాజ్యాంగ సంక్షోభంలోకి నెడతారు. ఒకవేళ ఈ చట్టాన్ని ఆమోదించిన పక్షంలో, నిన్నగాక మొన్ననే అయిదేళ్ళ గడువుతో ఏర్పాటయిన మండల, జిల్లా ప్రజాపరిషత్‌లు (లేదా బ్లాక్, జిల్లా పరిషత్‌లు) రద్దు కావలసి వస్తుంది. అప్పుడైనా మళ్ళీ ఎన్నికల ఖర్చూ, అట్టహాసాలూ తప్పవు. ముందు గొయ్యి, వెనక నుయ్యి! ఇక స్థానిక పరిస్థితులతో, ప్రజల అవసరాలతో నిమిత్తం లేని స్కీములను కేంద్రం అమలు

జరుపదలచినప్పుడు కూడా ఇవి మా పరిస్థితులకు అనుగుణంగా లేవని మాటమాత్రంగా చెప్పగల సత్తా కూడా రాష్ట్రాలు కోల్పోతాయి. గవర్నర్ ద్వారా, లేదా గవర్నర్ ఆసరాగా జిల్లా అధికార్ల ద్వారా అమలు జరిపే పథకాలపై రాష్ట్ర ప్రభుత్వాల అజమాయిషీ ఉండదు! జమిందారీలు, వాటిని అంటిపెట్టుకున్న 'దివాన్' గిరీలూ పోయాయి. కాని కొత్త 'జమిందారీ' కేంద్ర ప్రతినిధి గవర్నర్ అవుతాడు. సరికొత్త 'దివాన్' రాష్ట్ర ప్రభుత్వం అవుతుంది. ఈ 'దివాన్' పనల్లా పన్నులు, డ్యూటీలు ఫీజులు వసూలు చేసిపెట్టడమే.

పోనీ ఇంత "ప్రజాస్వామికం"గా కన్పించే ఈ బిల్లు "త్రీ-టైర్" వ్యవస్థలో బ్లాక్, మండల, జిల్లా పరిషత్ చైర్మన్ పదవులకు ప్రత్యక్ష ఎన్నికలు జరపాలని శాసించిందా? లేదు. పరోక్ష ఎన్నికల ద్వారా మళ్ళీ నైతిక విలువలు లేని "నామినేటెడ్" పెద్ద మనుషులను లేదా మోతుబరులను తెచ్చి జనం నెత్తిమీద రుద్దడానికి బిల్లు తలుపులు తెరిచింది. మండల వ్యవస్థలో ఉన్న మంచిని కాస్తా ఈ బిల్లు మంటగలుపుతుంది. నిజానికి ఒకవైపున పంచాయితీరాజ్ వ్యవస్థ పునర్ వ్యవస్థీకరణ పేరిట బిల్లును ఏ.ఐ.సి.సి. లో ప్రస్తావిస్తున్న సమయంలోనే అందుకు విరుద్ధమైన పరిణామం గుజరాత్ కాంగ్రెస్ ఆధ్వర్యంలో ఉన్న రాజ్‌కోట జిల్లా పంచాయితీని ముమ్మరించింది. అధికారం ఉన్నా, లేకపోయినా ముఠా తగాదాలతో కునారిల్లుతున్న పి.సి.సి.లను ఈ బిల్లు అజమాయిషీ చేయలేదనీ, గదమాయించలేదనీ, రాజ్‌కోట ఘటన నిరూపించుతోంది. రాజ్‌కోట పంచాయితీకి కాంగ్రెస్ ప్రెసిడెంట్ అయిన రామ్‌జీ మవానీని కాంగ్రెస్‌వారే ఓడించారు; ఏ.ఐ.సి.సి. అధ్యక్షుడు ఆదేశించినాగాని ఈ పని జరిగిపోయింది. అంతటితో ఆగక దాని ప్రభావం బరోడా, అమ్రేలీ జిల్లా పంచాయితీలకు కూడా పాకి కాంగ్రెస్ ముఠాలనుంచే కాంగ్రెస్ పంచాయితీ అధ్యక్షులపై అవిశ్వాస తీర్మానాల పరంపర ప్రారంభమైంది. కాంగ్రెస్ టికెట్‌పైన ఎన్నికైన సభ్యులే పి.సి.సి. ప్రెసిడెంట్ ఆదేశాలను తోసిరాజనడం పంచాయితీరాజ్ వ్యవస్థ తప్పు కాదు, నైతిక విలువలకు, సిద్ధాంతాలకు, ఆదర్శాలకు దూరమవుతున్న వ్యక్తుల, పార్టీల తప్పు. ఏ.ఐ.సి.సి.లో పార్టీ అధ్యక్షుడు "పార్టీలో బ్రోకర్ల, స్వప్రయోజనపరుల" గురించి మాట్లాడుతున్న సందర్భంలోనే ఈ మాలోకం అంతా జరిగింది. కబుర్లు ఎన్నైనాచెప్పవచ్చు. కార్యక్రమాల అమలు కబుర్లకు అతీతమైన కార్యాచరణ. అన్నట్టు ఏళ్ళుపూళ్ళుగా కాంగ్రెస్ పార్టీలో ఆర్గనైజేషన్ ఎన్నికలు జరగడం లేదు ఎందుకని? ఈ ప్రాథమిక కర్తవ్యాన్ని నిర్వహించలేని వారు పంచాయితీ ఎన్నికల సంస్కరణలు తలపెట్టడం - నైతిక ధర్మమా? ఇతర్లకు బోధించడమే పాండిత్యం, అంటే ఇదేనేమో!.

శనివారం మే 13, 1989

# "విశ్వామిత్ర" విజయం!!



రాజ్యాంగ సంబంధమైన ఉన్నత పదవిని నిర్వహిస్తున్న ముఖ్యమంత్రి ఎన్.టి.రామారావు "బ్రహ్మర్షి విశ్వామిత్ర" చలన చిత్రంలో నటించకుండా నిరోధించాలనీ, చిత్ర నిర్మాణంలో, నటనలో పాల్గొంటున్నందుకు ఆయనను ముఖ్యమంత్రి పదవినుంచి తొలగించాలని కోరుతూ దాఖలయిన రెండు రిట్ పిటిషన్‌లనూ విచారణ తరువాత ఆంధ్రప్రదేశ్ హైకోర్టు చెప్పిన తీర్పువల్ల 'విశ్వామిత్ర' సంగతీ, ఎన్టీఆర్ విషయమూ అలా ఉంచి - రాజకీయ నాయకులు ఎంచుకున్న కొన్ని పద్ధతులవల్ల, ప్రవర్తనవల్లా ఈ దేశంలో రాజ్యాంగానికీ, న్యాయస్థానాలకూ ఉన్న పరిమితులు ఏమిటో చాలా స్పష్టంగా బయటపడ్డాయి. పబ్లిక్ జీవితంలో ప్రవేశించిన వ్యక్తులకు "ప్రవర్తనా నిబంధనావళి"ని (కోడ్ ఆఫ్ కాండక్ట్) చట్టబద్ధం చేయనంత కాలం, మంత్రి లేదా ముఖ్యమంత్రి, లేదా ప్రధానమంత్రి లేదా లెజిస్లేటర్ ప్రవర్తనను శాసిస్తూ రాజ్యాంగం పూచీ పడినంత కాలం న్యాయస్థానాలు తమ ముందుకు వచ్చిన అభ్యర్థుల విషయంలో స్పష్టమైన తీర్పులు ఇవ్వజాలవని కూడా మన హైకోర్టు నిర్ణయం రుజువు చేస్తోంది. కనుకనే ఎన్టీఆర్ కేసులో వచ్చిన రెండు రిట్‌లనూ తోసిపుచ్చుతూ ధర్మాసనం ప్రధానంగా మూడు అంశాలను వెల్లడించింది. (1) మంత్రి (మంత్రి అంటే ముఖ్యమంత్రి సహా అని) ప్రవర్తనను క్రమబద్ధం చేసే రాజ్యాంగ నిబంధనగానీ, చట్టంగానీ లేదు; (2) మంత్రి తన పదవితోపాటు మరొక వృత్తిలోగానీ, వ్యాపకంగాలోనీ, వ్యాపారంలోగానీ ఉండరాదని లేదా స్వప్రయోజనం కోసం పనిచేయరాదనీ శాసించే రాజ్యాంగ నిబంధన ఏదీ లేదు; (3) అయితే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రూపొందించుకున్న మంత్రుల ప్రవర్తనా నిబంధనావళికి "చాలా ప్రాధాన్యముంది"; మంచి ప్రభుత్వాన్ని, నిష్కళంకమైన పరిపాలనను అందించాలన్న లక్ష్యంతో కోడ్‌ను రూపొదించారు; ఇది మంత్రులందరికీ వర్తించాలి; ఈ నిబంధనావళిని పాటించేవారికి ఆ అధికారం ఉంటుంది; అయితే ఎలా దానిని అమలు తెచ్చుకోవాలి, ఎలా ఆచరించాలన్నది మంత్రి స్వచ్ఛందంగా నిర్ణయించుకోవలసిన విషయం. కాని, ఇన్ని కారణాలవల్ల "ఈ కోడ్‌ను కోర్టుద్వారా పిటీషనర్లు అమలు జరిపించుకోడానికి" ప్రయత్నించలేదు. అంతేకాదు, ఈ నిబంధనావళిలో ప్రశంసనీయమైన కొన్ని నిర్బంధాలు (పరిమితులు) కూడా విధించారనీ, అయితే ఈ పరిమితులను రాజ్యాంగంలోని కొన్ని క్లాజుల పరిధిలో కోర్టు అమలులోకి తేజాలదనీ (అవి ప్రాథమిక హక్కుల పేరిట చలామణి అవుతున్న నిబంధనలు) ధర్మాసనం చెప్పింది. అందువల్ల చివరికి పరోక్షంగా కూడా పరిమితులను ఆచరణలోకి తేవడం కష్టమని తేల్చింది. నిజానికి ధర్మాసనం తన పరిధులలో వ్యవహరించడమేగాక, కోడ్ ఆఫ్ కాండక్ట్‌ను అమలు జరిపించడంలో తనకు ఎదురవుతున్న విపరీత పరిమితులపట్ల, దిగజారుతున్న విలువలపట్లా తన మూగ ఆవేదనను కూడా పరోక్షంగా వ్యక్తం చేసింది.

ఎందుకని ? ఆ ఉన్నత పదవి రాజకీయ సృష్టి కాబట్టీ, ఆ పదవిలో వచ్చేవారు రూపొందించే నిబంధనావళి వారి ప్రయోజనాల రక్షణకు అనుకూలంగా ఉంటుంది కాబట్టీ, రూపొందించిన నిబంధనావళికి చట్ట రూపం ఇవ్వకపోవడానికి కూడా స్పష్టమైన కారణం ఉంటుంది కాబట్టీ!!. 1971లో సుప్రీంకోర్టు ఒక సందర్భంగా పేర్కొన్నట్టు "సంప్రదాయాల"ను పాటించవలసివస్తే మంచి సంప్రదాయాలనే అనుసరించాలి. మనకన్నీ విరుద్ధమైన క్లాజులూ, నిబంధనలూ. అవి మనిషికొక్క తీరున అమలు జరిగే ఈ అసమ సమాజంలో, ఈ వ్యత్యాస భారతంలో, కలవాడిదే 'కాండక్టు', కలవాడికే కాంట్రాక్టూ, ఉన్నవాడిదే రూలూ, ఉన్నవాడికే ట్రస్టులూ! అవి చెదరకుండా ఉండే ఏర్పాట్లు చేసేవాళ్ళూ వాళ్ళే. మామూలు వాడికి వర్తించే క్రిమినల్, సివిల్ కేసుల కామాటం అత్యున్నత స్థానంలో ఉన్నవాడికి మన దేశంలో వర్తించకుండా చేసే ప్రయత్నం ఎమర్జన్సీలోనే జరిగింది. రాజ్యాంగానికి ఇందిరాగాంధీ 1976లో తెచ్చిన 42వ సవరణ అలాంటిదే (దానిని తర్వాత జనతా ప్రభుత్వం మరొక సవరణ ద్వారా తొలగించేసింది). ఆస్తి హక్కును ఒక ప్రాథమిక హక్కుగా రాజ్యాంగంనుంచి తొలగించారేగాని, లీగల్ హక్కుగా భద్రంగానే ఉంచారని మరువరాదు. అలాగే ఆస్తిహక్కును ప్రాథమిక హక్కుగా తొలగించినా, "బిజినెస్" చేసుకోవడాన్ని ప్రాథమిక హక్కుగానే ఉంచారని కూడా మరవరాదు. అందువల్ల ఈ మౌలిక విషయంలో కూడా రాజ్యాంగపరంగా మౌలికమైన మార్పులు, సవరణలూ వచ్చేవరకూ "ఇందిరా ప్రతిష్ఠాన్"వంటి అంతులే ట్రస్టులూ మనకు తప్పవు, "విశ్వామిత్ర" సృష్టిలో భాగంగా ఎన్.టి.ఆర్. పబ్లిక్ చారిటబుల్ ట్రస్టులూ తప్పవు. ఆ మార్పులు వచ్చేదాకా, ఉన్న రాజ్యాంగమూ, ప్రజా ప్రతినిధ్య చట్టమూ, అవినీతి కార్యకలాపాల నిరోధక చట్టమూ అలంకార ప్రాయాలుగానే మిగిలిపోతాయి. నిజానికి "కోడ్ ఆఫ్ కాండక్ట్" పరిధిలోకి ఈ ట్రస్టులూ, చారిటబుల్ ఫండ్సూ కూడా వస్తాయి. ఆంధ్రప్రదేశ్ కోడ్‌లోని క్లాజ్ (బి), అలాటి వాటితో మంత్రి అన్నవాడు తెగతెంపులు చేసుకోవాలని ఉందిగాని 'బ్రహ్మముడి' వేసుకోమని చెప్పలేదు. అయినా రాజ్యాంగబద్ధమైన నిబంధన కొరవడింది కాబట్టి, ఆ కోడ్‌కు చట్ట రూపం లేదు కాబట్టి (రానివ్వరు కూడా) కోడ్‌ను స్వచ్ఛందంగా అమలు జరిపే ప్రసక్తి లేదు.

ఎందుకంటే, మనకు 'భూ సంస్కరణల చట్టా'ల అనుభవం ఉంది. చట్ట రూపం కల్పించినాగాని, భూముల అన్యాక్రాంతాలూ, బినామీ ట్రాన్స్‌ఫర్లూ చాపకింద నీరులా సాగిపోయి అసలు చట్టానికే ఎసరు ఎలా వచ్చిందో లోకానికి తెలుసు. చివరికి పంచడానికి వచ్చేసరికి పేదలకు హళ్ళికి హళ్ళి, సున్నాకు సున్నా చేశారు పాలకులు. అలాగే ఈ మంత్రుల కోడ్ కూడా. అందుకనే కోర్టు కూడా పబ్లిక్ సర్వెంట్‌గా వున్న వ్యక్తి లేదా మంత్రి "ఇంగిత జ్ఞానంతో, ఆత్మసాక్షిగా వ్యవహరించవలసిన సమస్యగా" దీనిని పరిగణించి, ప్రవర్తించాలని మందకొడిగానే అయినా మనస్సుకు ఎక్కేటట్టుగానే మందలించవలసి వచ్చింది. రాజ్యాంగ విలువలు పాటించి, క్రమశిక్షణతో, ప్రజా తంత్రబద్ధంగా నడుచుకోవాలని పరోక్షంగా అంటించింది. అంతేకాదు. "విశ్వామిత్ర" సృష్టిద్వారా, ఓట్ల కోసం మతపరంగా విజ్ఞప్తి చేసినట్టవుతుందన్న పిటీషనర్ల వాదనపై వ్యాఖ్యానిస్తూ ధర్మాసనం "ఈ దశలో ఇది పరిశీలనార్హం కాద"నీ, ఆ సమయం ఇంకా రాలేదని చెప్పడం - రాగల భావి పరిణామాలకు సూచనగా భావించాలి! అంతవరకూ -

"అన్నిట మంచివారు, విమలాత్ములు, హాస్యకళా ధురంధురల్, సన్నుత నీతి పాలకులు, జాణలు, నైపుణుల్" ఎక్కడ దొరుకుతారో అని ఎదురు చూడవలసిందే. వాళ్ళు పద్యాల్లో దొరుకుతారు, లేదా సర్కారీ స్తోత్ర పాఠాల్లో కనిపిస్తారు!!

శనివారం సెప్టెంబర్ 2, 1989

# గవర్నర్ల వ్యవస్థ

కేంద్రంలో ప్రభుత్వం మారినప్పుడల్లా, రాజకీయ పరిణామాలకు అనుగుణంగా ఎప్పటికప్పుడు రాష్ట్రాలలోని గవర్నర్లను మార్చుతూ వుండడం అధికారంలో వున్న రాజకీయ పక్షాలకు బాగా అలవాటైపోయింది. కేంద్రంలో కాంగ్రెస్ పాలకపక్షంగా ఉండి, రాష్ట్రాలలో నాన్-కాంగ్రెస్ పక్షాలు అధికారంలో ఉన్నప్పుడూ, లేదా కేంద్రంలో నాన్-కాంగ్రెస్ పక్షం పాలకులుగా ఉండి రాష్ట్రాలలో కాంగ్రెస్ (ఐ) అధికారంలో ఉన్నప్పుడూ - తరచుగా గవర్నర్ల మార్పులు జరుగుతున్నాయి. తద్వారా గవర్నర్ల పదవులను రాజకీయ పదవులుగా మార్చిన మొదటి ఘనత కాంగ్రెస్ (ఐ) కే దక్కింది! అది 1969నుంచి పెద్దగానే ప్రారంభమైంది. నాన్-కాంగ్రెస్ ప్రభుత్వాలు దేశంలో తలెత్తినప్పటినుంచీ ఈ పద్ధతి పెచ్చరిల్లిపోయింది. ఈ తప్పుడు ఆనవాయితీని సవరించేదిపోయి 1977లో కేంద్రంలో అధికారంలోకి వచ్చిన "జనతా"పార్టీ కూడా దానినే కొనసాగించింది. కాంగ్రెస్, రాష్ట్రాలలోని గవర్నర్లను మార్చి తనకు అనుకూలమైన ("రాజకీయ") గవర్నర్లను నియమించుకుంది. ఇదే పరిస్థితి 1980లో తిరిగి ఇందిరాగాంధీ అధికారంలోకి వచ్చిన తరువాత నాన్-కాంగ్రెస్ ప్రభుత్వాలున్న రాష్ట్రాలలో గవర్నర్ల 'గీతలు' మారవలసి వచ్చింది! ఇప్పుడు కేంద్రంలో నేషనల్ ఫ్రంట్ అధికారంలోకి వచ్చిన తరువత కూడా ఈ పరిస్థితిలో పెద్ద మార్పు లేదు. పాత సంప్రదాయమే కొనసాగుతోంది. గవర్నర్లను మార్చుతున్నారు. రాష్ట్రాల పరిపాలనా వ్యవహారాలలో జోక్యానికీ, అడ్డుపుల్లలు పెట్టడంలో లేదా నాన్ కాంగ్రెస్ ప్రభుత్వాలను పడగొట్టడానికి జరిగే ప్రయత్నాలలో కొందరు గవర్నర్లను తొలగించితే, "వివక్ష"తో ఆ పని చేసారని లోకం ఎక్కడనుకుంటుందోనని భావించి, రాష్ట్రపతి సలహాపైన గవర్నర్లు అందరినీ రాజీనామా చేయమని కేంద్రం కోరింది. అలా అయితే, రాజీవ్ ప్రభుత్వం లోగడ కాంగ్రెస్ (ఐ) రాజకీయాలనుబట్టి నడుచుకోగల గవర్నర్లను నియమించింది. కాబట్టి అలాంటి "రాజకీయ గవర్నర్ల"ను ఇప్పుడు తొలగించడానికి ఫ్రంట్ ప్రభుత్వానికి అవకాశం ఉంటుంది. ఈ ఉద్దేశం ప్రకారమే ఆంధ్రప్రదేశ్, కర్నాటక, హర్యానా, కేరళ గవర్నర్లు రాజీనామాలు సమర్పించవలసి వచ్చింది. మరికొందరు రాష్ట్రపతి జనరల్ తాఖీదు అందకపోయినా, కేంద్రంలో ప్రభుత్వం మారినందున "నైతిక బాధ్యత"గా భావించి తామూ రాజీనామాలు చేస్తున్నారు. అసలు గవర్నర్ల వ్యవస్థనే రద్దు చేయాలని నేషనల్ ఫ్రంట్ భాగస్వామ్యపక్షాలలో ఒక్క "తెలుగుదేశం" తప్ప మరే పక్షమూ కోరడం లేదు. ఈ వాదనపైన ఆధారపడే గతంలో "దేశం" పార్టీ సర్కారియా కమిషన్‌కు కూడా ఒక నివేదికను సమర్పించింది. 1969 తర్వాత దేశ రాజకీయ చరిత్రలో పెద్ద మచ్చ ఏర్పడింది. కేంద్ర ప్రభుత్వాన్ని నిర్వహిస్తున్న రాజకీయ పక్షానికి భిన్నమైన పార్టీ రాష్ట్రాలలో అధికారంలో ఉన్నప్పుడు గవర్నర్లను ఆయా ప్రభుత్వాల పాలనా రథాలకు "బ్రేకులు" వేసి, రాజ్యాంగ సంక్షోభాన్ని సృష్టించిన వ్యవస్థగా ఈ గవర్నర్ల పోస్టులు తయారయ్యాయి. ఈ పరిణామం, అసలు గవర్నర్ల వ్యవస్థనే రద్దు చేయాలన్నవాదనకి దారితీసింది. అంతేగాని కేంద్రం, రాష్ట్ర ప్రభుత్వాలకు మధ్య రాజ్యాంగ సంబంధమైన అనుసంధాన కర్తగా, సమస్యలు తలెత్తినప్పుడు వాస్తవ పరిస్థితులను వక్రీకరించకుండా యథాతథంగా నివేదించగల తటస్థ శక్తిగా ఎవరుండాలన్న ఆలోచన

రాలేదు. పరిపాలనా విధానాన్ని అధికారపక్షం రూపొందించి అమలు జరపాలి కాబట్టి, గవర్నర్ల నియామ కాలు కూడా 'అరాజకీయం'గా ఉండడానికి వీలులేదు. కాని విచిత్రమేమంటే - ఫ్రంట్ ప్రభుత్వం కొందరు గవర్నర్లను మార్చడం "గవర్నర్ వ్యవస్థను రాజకీయం" చేయడంగా కాంగ్రెస్ (ఐ) ప్రధాన కార్యదర్శి శ్రీ గాడ్గిల్ విమర్శించడం! "గవర్నర్ల పదవులను రాజకీయాలకు అతీతంగా ఉంచాల"ని ఆయన చెప్పడం దెయ్యాలు వేదాలు వర్లించడం! ఆ గౌరవం, ఆ ప్రతిష్ఠ. ఆ నైతిక విలువలూ ఏనాడో మట్టి కలిసిపోయాయి. ఆంధ్రప్రదేశ్, కర్నాటకలలో ప్రతిపక్షాలు అధికారంలో ఉన్నప్పుడు కాంగ్రెస్ (ఐ) చేసిన పనులూ, కాంగ్రెస్ (ఐ) అధికారంలో ఉన్నచోట్ల కేంద్రంలోని "జనతా" చేసిన పనులూ - అందరికీ తలవంపులు తెచ్చినవే! కర్నాటకలో 1989లో కాంగ్రెస్ (ఐ) గవర్నర్ పెండేకంటి వెంకటసుబ్బయ్య చేసిన నిర్వాకానికీ, 1978లో జనతా గవర్నర్ గోవింద నారాయణ్ చేసిన పనికీ చెప్పుకోదగిన వ్యత్యాసం లేదు. ఆంధ్రప్రదేశ్‌లో "దేశం' ' అధికారంలో వున్నప్పుడు రామ్‌లాల్, కుముద్‌బెన్ జోషిలద్వారా కేంద్రంలోని కాంగ్రెస్ (ఐ) ఆడిన నాటకాలు "రాజకీయాలకు అతీతమైనవి" కానే కావు. చివరికి కర్నాటక వ్యవహారంలో ఎంతో హుందాగా ఆచితూచి వ్యవహరించవలసిన రాష్ట్రపతి కూడా అనుకున్నంతగా "రాజకీయాలకు అతీతంగా ఉండలేకపోయారు". రాష్ట్రపతి ఈనాడు చేసిన పనిని ఆనాడే కర్నాటకలో (1989) చేసి ఉంటే గవర్నర్ల వ్యవస్థపైన, ప్రజాస్వామ్యంపైన విశ్వాసం కొంతైనా మిగిలి ఉండేది. చివరికి కాంగ్రెస్ (ఐ) అధికార పక్ష హోదాలో ఏ స్థాయికి దిగజారిందంటే - తన చరిత్రను తానే మరచిపోయి వ్యవహరిస్తూ వచ్చింది.

ఎందుకంటే 1935నాటి ఇండియా చట్టం ఆధారంగా రాష్ట్రాలలో 1937 తర్వాత మంత్రివర్గాలు ఏర్పాటు చేయడనికి అంగీకరించిన కాంగ్రెస్ - గవర్నర్ల విషయంలో ఒక షరతు పెట్టింది. రాష్ట్ర పాలనా వ్యవహారాలలో, రాజ్యాంగ కార్యకలాపాల్లో గవర్నర్లు ఏ మాత్రం జోక్యం చేసుకోరనీ, అందుకు సంబంధించి తమ ప్రత్యేకాధికారాలు వినియోగించబోరనీ, మంత్రిమండలి సలహాను తోసిరాజనబోరనీ హామీపడితే తప్ప - మంత్రివర్గాలు ఏర్పాటు చేయబోమని కాంగ్రెస్ స్పష్టం చేసింది. ఆ మేరకు ఎ.ఐ.సి.సి. 1937 మార్చిలో ఒక తీర్మానం కూడా చేసింది. ఆ తీర్మానాన్ని కాస్తా గాలికి వదిలేసి, గవర్నర్ల వ్యవస్థను ప్రతిపక్ష ప్రభుత్వాలను ఎలాగోలా పడగొట్టడానికి సాధనంగా మార్చిన దాని ఫలితమే ఇన్ని పరిణామాలని గుర్తించాలి! అస్తుబిస్తుగా ప్రతిపక్ష ప్రభుత్వాలున్నచోట తాను ఫిరాయింపులు ఆసరాగా అధికారంలోకి రావడానికో, లేదా తనలోని గ్రూపు తగాదాలద్వారా తమ ప్రభుత్వాల అస్తిత్వానికి ప్రమాదం వచ్చినప్పుడు ఉన్న ప్రభుత్వాన్ని నిలుపుకోడానికో కాంగ్రెస్ ఆయా రాష్ట్ర శాసన సభలను రద్దు చేయకుండా కేవలం "సస్పెండ్" చేస్తూ వచ్చింది. కాని అదే సూత్రాన్ని ప్రతిపక్షాలు ప్రభుత్వంలో ఉన్నచోట వర్తింప చేయకుండా, సరాసరి శాసనసభలను రద్దు చేస్తూ వచ్చింది. ఇలా 1967-80 మధ్యకాలంలో రాజస్థాన్, పంజాబ్, బీహార్, ఉత్తరప్రదేశ్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, గుజరాత్, మణిపూర్, అస్సామ్, కేరళ, కాశ్మీర్‌లలో జరిగింది!! ఫిరాయింపుదార్ల పని పట్టవలసినవాడు స్పీకర్‌కాగా, ఆ బాధ్యతను రాష్ట్ర గవర్నరే స్వీకరించి, కేంద్రంలో అధికార పక్షానికి తైనాతీగా మారి రాజ్యాంగానికి గుడ్‌బై చెప్పి 'చరిత్ర' సృష్టిస్తున్నాడు. లేదా ఒక పార్టీనుంచి ఫిరాయించిన వారితో కలిసి కాంగ్రెస్ (ఐ) అనుకూల ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి అవకాశం లేనప్పుడు మాత్రమే శాసనసభను గవర్నర్ రద్దు చేస్తున్నాడు. ఈ తతంగానికి స్వస్తి చెప్పాలంటే, ముఖ్య మంత్రులతో సంప్రతింపులు జరిపిన తరువాతనే గవర్నర్లను కేంద్రం నియమించాలి. 1948లో రాజ్యాంగ నిర్ణయ సభ పెద్దలు ఎందుకు నిరాకరించారో తెలియదుగాని గవర్నర్ల 'సత్తరకాయ' పెత్తనాన్ని అదుపు చేస్తూ డాక్టర్ అంబేద్కర్ రాజ్యాంగంలో "ఆదేశిక సాధనాలను" చొప్పిస్తూ ఒక మంచి సవరణ తెచ్చారు. అది గవర్నర్ల ప్రవర్తనా నిబంధనావళి. కాని అది మన చేజారిపోవడం దురదృష్టం!

గురువారం జనవరి 18, 1990

# విషయసూచిక


| | |
|---|---|
| కృష్ణజలాల పంపిణీ: "మైసూరు" పాకం! | 1-3 |
| "గంగ" ప్రాజెక్టు: కృష్ణజలాలపై కొత్త వాదన | 4-6 |
| జంటనగరాలు: కృష్ణ జలాలు (1) | 7-9 |
| జంటనగరాలు: కృష్ణ జలాలు (2) | 10-12 |
| డ్రైనేజి సెస్సు | 13-15 |
| వరదలకూ 'ముగుదాళ్లు' రిజర్వాయర్లే | 16-17 |
| వ్యవసాయ ఋణాల మాఫీ: లాభించేదెవరు? | 18-20 |
| డెల్టాలో డ్రైనేజి వ్యవస్థ ఆధునీకరణ | 21-22 |
| నర్మదా ప్రాజెక్టు: నాగరిక జీవనం | 23-25 |
| పంట ప్రజలది-పోరు పాలకులదా?! | 26-27 |
| సహాయ కార్యక్రమాలు: శాశ్వత పథకాలు (1) | 28-30 |
| సహాయ కార్యక్రమాలు: శాశ్వత పథకాలు (2) | 31-33 |
| "గోదావరి' కొలిమి! | 34-36 |
| పరిశ్రమల మూతవల్ల కాలుష్యం పోతుందా?! | 37-39 |
| రోశయ్య పత్రం (1) | 40-41 |
| రోశయ్య పత్రం (2) | 42-43 |
| రోశయ్య పత్రం (3) | 44-45 |
| "సూపర్ 301": ప్రమాదంలో ఇండియా (1) | 46-48 |
| "సూపర్ 301": ప్రమాదంలో ఇండియా (2) | 49-51 |

# కృష్ణజలాల పంపిణీ : "మైసూరు" పాకం!

రుచికి "మైసూర్‌పాక్" బాగుండవచ్చునేమోగానీ, కృష్ణాజలాల పంపిణీ సమస్యపై బచావత్ ట్రిబ్యునల్ కేటాయింపులపై "తెలుగుగంగ"కు సర్దవలసిన నీటిపంపిణీపై ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మహారాష్ట్ర ముఖ్యమంత్రులు మైసూరు సమావేశంలో తేల్చి చెప్పింది తక్కువా, గందరగోళ పరుస్తున్న అంశాలు ఎక్కువా. "మైసూర్‌పాక్" అందించబోయి, అదేదో 'నలభీమ'పాకంగా తయారు చేశారు. "తెలుగుగంగ"కు కృష్ణజలాల పంపిణీ సమస్యపై తిరుపతిలో తొలివిడత చర్చలు ప్రారంభించిన ఈ ముగ్గురు ముఖ్యమంత్రులు మైసూర్ సమావేశం ట్రిబ్యునల్ అవార్డు పేరిట, ఆ ట్రిబ్యునల్ నివేదిక తేల్చి చెప్పిన అంశాలను కూడా తిరగదోడి, మొత్తం కృష్ణజలాల పంపిణీ సమస్యను మరింత జటిలం చేసినట్టు కనిపిస్తుంది. మైసూర్ సమావేశంలో కృష్ణజలాల పంపిణీకి సంబంధించి స్థూలంగా మూడు రాష్ట్రాల మధ్య అవగాహన కుదిరినట్టు చెబుతున్న "నాలుగు కొత్త ప్రతిపాదన"లు సూచనలేగానీ, నిర్ణయాలు కావు. ఈ ప్రతిపాదనలను మూడు రాష్ట్రాల శాసనసభలలోను, ప్రతిపక్షాలతోను చర్చలు జరిపిన తరువాత ఒక అభిప్రాయానికి వచ్చిన తరువాత, నవంబర్‌లో మరోసారి ముగ్గురు ముఖ్యమంత్రులు సమావేశమై ఆమోదిస్తారు. నిజానికి పైకి చెబుతున్నట్టుగా మైసూర్ సమావేశ ప్రతిపాదనలు "కొత్త"వేమీ కావు. ఎందుకంటే బచావత్ ట్రిబ్యునల్ కృష్ణ జలాల పంపిణీ సమస్యపై చేసి కొద్దిపాటి సవరణలతో "మైసూర్ సమావేశ" ప్రతిపాదనలుగా అవతరించాయి. అంటే జలాల పంపిణీ వివాదం మళ్ళీ మొదటికే వచ్చినట్టు అవుతుంది. "తెలుగుగంగ"ను ఎలాగోలా సాధ్యం చేసుకోవాలన్న తహతహ ఆంధ్రప్రదేశ్‌ది కాగా, బచావత్ పంచిన జలాలకు తోడు కృష్ణలోని అదనపు జలాలను ఆంధ్రప్రదేశ్ వాడుకోకుండా తమకు దక్కేటట్టు ఎలా కాపాడుకోవాలా అన్న తహతహలో కర్ణాటక, మహారాష్ట్రలు ఉన్నాయి. మైసూర్ సమావేశ ప్రతిపాదనలలోని రెండవ, మూడవ ప్రతిపాదనల ద్వారా కర్ణాటక, మహారాష్ట్రల ఉద్దేశం స్పష్టమవుతోంది! ఎందుకంటే, 2001వ సంవత్సరానికి అదనపు జలాలను "హక్కు"గా కాకుండా అవసరంకొద్దీ వినియోగించుకొనే స్వేచ్ఛ ఆంధ్రప్రదేశ్‌కు ఉందని బచావత్ అవార్డు (5వ క్లాజు 'సి') చేసిన నిర్ణయాన్ని "మైసూర్" సభ నిర్ణయాల్లోని రెండవ ప్రతిపాదన తారుమారు చేయదలచింది. ఇప్పటికీ ట్రిబ్యునల్ ఇచ్చిన నీటివాటాను (కర్ణాటకకు 700 శతకోటి ఘనపుటడుగులు, మహారాష్ట్రకు 560 టి.ఎం.సిలు) పూర్తిగా వాడుకోలేని ఆ రెండు రాష్ట్రాలూ కృష్ణలోపారే అదనపు జలాలలో ఇప్పుడే తామూ ఆంధ్రప్రదేశ్‌తోపాటు ఆ దామాషాలో పంచుకునే హక్కునుగుర్తించే పక్షంలోనే "తెలుగుగంగ" ప్రాజెక్టుకు అవసరమైన 29 టి.ఎం.సి. నీటిని వాడుకోడానికి ఆంధ్రప్రదేశ్‌కు అనుమతిస్తారట. పైగా, ఇందుకు కర్ణాటక, మహారాష్ట్రలు ట్రిబ్యునల్ నివేదికలోని "పథకం బి" చాటున దాగి, ఈ మెలిక పెట్టాయి!

నిజానికి కృష్ణలో నమ్మకంగా లభించే జలాలను మూడు రాష్ట్రాలకు కేటాయించగా మిగిలిన నీటినంతటినీ ఆంధ్రప్రదేశ్ వాడుకోవచ్చుననీ (దిగువన ఉన్న రాష్ట్రం కాబట్టి) ట్రిబ్యునల్ స్పష్టం చేయడమే కాక "పథకం - ఎ" ప్రకారం ఎలాంటి వైఖరి అనుసరించాలో సూచనప్రాయంగా స్పష్టం చేసింది. కాని "మైసూర్" ప్రతిపాదనలు ఈ సత్యాన్ని దాటవేసి, "పథకం - బి" చాటున ఆంధ్రప్రదేశ్ ప్రయోజనాలను విస్మరించినట్లు కనిపిస్తుంది. ఏమంటే, ట్రిబ్యునల్ నివేదికలోని 14వ అధ్యాయంలో ఇలా పేర్కొని ఉంది : "పథకం - ఎ" ప్రకారం మూడు రాష్ట్రాలకు కేటాయింపులు చేసేటప్పుడు లోటు ఏర్పడ్డ సమయాలలో, ఆ నీటి కేటాయింపులకు మేము స్పష్టంగా ఎటువంటి ఏర్పాటు చేయలేదు.

***అయితే, ఒక 100 సంవత్సరాల కాలంలో 25 సంవత్సరాలలో ఇటువంటి లోట్లు సంభవించవచ్చుననీ, ఈ 25 సంవత్సరాలలో మహారాష్ట్ర, మైసూర్ (కర్ణాటక)లకన్నా ఎక్కువ ఇబ్బందులకు గరికావచ్చుననే విషయాన్ని మేము దృష్టిలో పెట్టుకున్నాము".***

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

అందుకనే మిగులు జలాల వాడకంపై దిగువ రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్‌కు ఏర్పడిన సహజమైన ఈ అవకాశం గురించి కర్ణాటక ప్రభుత్వం లేవదీసిన సందేహానికి కూడా ట్రిబ్యునల్ స్పష్టమైన సమాధానం చెప్పింది : "మిగిలిపోయిన జలాలను ఆంధ్రప్రదేశ్‌కు వినియోగించుకొనడంపై పరిమితి విధించడంలో మాకు ఎట్టి ఆధారమూ కనిపించడంలేదు. ఎందుకంటే మిగులు జలాలను ఆంధ్రప్రదేశ్ వినియోగించుకోకపోతే అవి వృథాగా సముద్రంలో కలిసిపోతాయి".

అలాగే మిగులు జలాల పంపిణీకి (2060 టి.ఎం.సిల కంటే ఎక్కువ నీరున్నప్పుడు) ట్రిబ్యునల్ ప్రత్యేక ఏర్పాట్లు చేయకపోయినా, నివేదికలో అందుకు ప్రత్యామ్నాయంగా "పథకం బి"ని సూచిస్తూ ఈ పథకం అమలు కావాలంటే "కృష్ణావ్యాలీ అథారిటీ" పేరిట ఒక కేంద్ర సంస్థను నెలకొల్పాలని చర్చించింది. కానీ, అలాంటి జలనియంత్రణ సంస్థను మూడు రాష్ట్రాలూ వ్యతిరేకించినందుననే ఆ ప్రతిపాదనను ట్రిబ్యునల్ ఉపసంహరించుకుంది. అయినప్పుడు, మైసూర్ ప్రతిపాదనలు ఈ "పథకం-బి"ని ఎందుకు తిరగదోడుతున్నట్లు? పైగా, ట్రిబ్యునల్ తుది ఉత్తర్వులో అంతిమంగా పొందుపరిచిన "పథకం - ఎ" ప్రకారం ఆయా రాష్ట్రాల మధ్య వాస్తవంగా చేసిన జలాల కేటాయింపులకూ, నివేదికలోని "పథకం-బి"లో చర్చించి వదిలేసిన నిబంధనలకూ ఏ మాత్రం సంబంధం లేనప్పుడు, మైసూర్ ప్రతిపాదనల్లో మళ్ళీ ఆ "బి" ప్రస్తావన ఎందుకు తెచ్చినట్టు? ఇది సమస్య పరిష్కారానికి తోడ్పడుతుందా? ఇంకా క్లిష్టం కావడానికి తోడ్పడుతుందా? అంతేకాదు, కృష్ణలో నీరు సగటు పారుదలను (ఉన్నది 2060 టి.ఎం.సిలు అయితే) ఊహతో 2390 శతకోటి ఘనపుటడుగులుగా అంచనావేసి, 2000 సంవత్సరందాకా వేచి ఉండేకంటే, ఇప్పుడే ఈ క్షణంలోనే మూడు రాష్ట్రాల మధ్య మిగులు నీటి కేటాయింపులు జరగాలన్నది మైసూర్ ప్రతిపాదనల్లో తొలి ప్రతిపాదన సారాంశం. అలాగే, ట్రిబ్యునల్ అవార్డు ప్రకారం మూడు రాష్ట్రాలకు కేటాయించిన కృష్ణ జలాల వాటాలను ఖాయపరిచి, అవే తుదితీర్పుగా భావించడమేగాక, 2000 సంవత్సరం తర్వాత పున:పరిశీలనకు అవకాశం లేకుండా చేయాలని "మైసూర్" సమావేశం మూడో ప్రతిపాదన! అంటే, దీని ప్రకారం కూడా అదనపు జలాలను వాడుకొనే స్వేచ్ఛను ఆంధ్రప్రదేశ్‌కు ట్రిబ్యునల్ కల్పించినా, మైసూర్ సమావేశం పరోక్షంగా అడ్డుకొంటున్నట్టు కాదా? అయినా, ట్రిబ్యునల్ పంపిణీలను,

## ఎబికె సంపాదకీయాలు

కృష్ణజలాల్లో మిగులు నీటిని అవసరంకొద్దీ వాడుకోవడానికి ఆంధ్రప్రదేశ్ ఏనాడూ అభ్యంతరం చెప్పలేదు. ఇక ముందూ చెప్పదు. అయినప్పుడు ఈ రసాభావ, అయోమయం దేనికి? అసలు మూడు రాష్ట్రాలు నేర్చుకోవల్సిన పాఠం - ఇరిగేషన్, మంచినీటి వనరుల విషయంలో పరస్పరం ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో వ్యవహరించడం. మైసూర్ ప్రతిపాదనల్లో నాల్గవది మాత్రమే ఈ సదవకాశాన్ని కలిగిస్తున్నందున, తగాదాలు ముదరబోవని ఆశిద్దాం. అయితే గుర్తించవలసిన అసలు మతలబు ఏ రాష్ట్రం ఏ ప్రాజెక్టులు కట్టుకున్నా ఎదురవుతున్నది నిధులు సమస్య; కేంద్రం ఎంతవరకు ఇస్తుంది? మనం ఎంత భరించుకోగలం? ప్రపంచ బ్యాంకును ఎంతవరకు అడుక్కోవాలి, ఇచ్చిన నిధులు ఏ మేరకు సద్వినియోగం అవుతాయి? ఇవి ముందు తేలవలసిన సమస్యలు, అంతేగాదు, నీటి కేటాయింపులకోసం ఇంతగా కొట్లాడుకునే మన పాలకులు ప్రతి ఏటా సముద్రం పాలవుతున్న వర్షపునీటిని, వరద నీటిని ఇరిగేషన్‌కోసం వినియోగించుకోగల బ్యాలెన్సింగ్ రిజర్వాయర్ల నిర్మాణంకోసం ఎందుకు పట్టుదల చూపరో అర్థంకాదు. భవిష్యత్తులో అదనపు జలాల వాడకంపై తలెత్తగల వివాదాలను కూడా దృష్టిలో పెట్టుకుని ఈ రిజర్వాయర్ల నిర్మాణానికి త్వరపడాలి. సర్ ఆర్థర్ కాటన్ జ్ఞాననేత్రంలో ఓ పాతికవంతైనా మన పాలకులకు అవసరం.

శుక్రవారం 24, ఆగస్టు 1990

# "గంగ" ప్రాజెక్టు: కృష్ణ జలాలపై కొత్త వాదన

తెలుగుగంగ ప్రాజెక్టు గురించి, కృష్ణానదీ జలాల పంపిణీ సమస్యపై బచావత్ ట్రిబ్యునల్ తీర్పునకు సంబంధించిన కొన్ని అంశాలపైన ఈ నెల 21న తిరుపతిలో ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, కర్ణాటక ముఖ్యమంత్రుల మధ్య జరిగిన ప్రత్యేక సమావేశం వివరాలను ముఖ్యమంత్రులు పూర్తిగా వివరించకపోయినా, దాచినా దాగని సత్యాలు కొన్ని బయటపడక తప్పలేదు. పైగా ఈ మూడు రాష్ట్రాలూ కాంగ్రెస్ (ఐ) పాలనలోనే ఉన్నందున ఏళ్ళుపూళ్ళుగా నలుగుతున్న కృష్ణాజలాల పంపిణీ సమస్యకు పరిష్కారం బహు తేలికగా కుదిరి ఉండవలసింది. అయినా లోగడమాదిరే ఇప్పుడు కూడా పంపిణీ సమస్య ఇంకా త్రిశంకుస్వర్గంలోనే ఉంది. బచావత్ అవార్డు వచ్చిన తరువాత చాలా సంవత్సరాల అనంతరం మొదటిసారిగా ముగ్గురు కాంగ్రెస్ ముఖ్యమంత్రులు ఈ సమస్యపై సమావేశం కావడమే, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చెన్నారెడ్డి చెప్పినట్టు విశిష్ట పరిణామం. కాని ఈ సమావేశంలో "గంగ ప్రాజెక్టు'కు సంబంధించిన ప్రధాన భాగస్వామి అయిన తమిళనాడు పాల్గొనకపోవడం కూడా ఒక "విశేషం"గానే పరిగణించాలి. "చర్చలు సుహృద్భావ" వాతావరణంలో జరిగాయని ముగ్గురు ముఖ్యమంత్రులు ప్రకటించడం మినహా, నదీజలాల పంపిణీ విషయంలో స్పష్టమైన అవగాహనకు వారు ఇప్పటికీ వచ్చినట్టు కన్పించదు. వివరాలు తెల్పడానికి ప్రధానంగా కర్ణాటక, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రులు వీరేంద్రపాటిల్, చెన్నారెడ్డి మొదట నిరాకరించినప్పటికీ, చర్చల అనంతరం బెంగుళూరులో పాటిల్ (22న), ఆంధ్రప్రదేశ్ శాసనసభలో చెన్నారెడ్డి (23న) తిరుపతి చర్చల ఫలితం గురించి చేసిన ప్రకటనల్లో ఒక ప్రధాన విషయం కాస్తా వెల్లడయింది. "ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ వైఖరిలో మార్పు వచ్చింది, మెరుగైంది" అని వీరేంద్రపాటిల్ ప్రకటించుతూ, కృష్ణాజలాల వాటాలో తనకు బచావత్ కేటాయించిన 800 శతకోటి ఘనపుటడుగుల (టి.ఎం.సి.) నీటికి మించి కేవలం 29 టి.ఎం.సి. నీటిని మాత్రమే వాడుకోవడానికి ఆంధ్రప్రదేశ్ హామీ పడిందని వెల్లడించారు. అలాగే, చెన్నారెడ్డి కూడా ఈ ప్రకటనను కాదనలేదు సరిగదా, పాటిల్ వాదననే కరారు చేసారు! బహుశా అందుకనే ఇంతకుమించి వివరాలను వెల్లడించడానికి ఉభయులూ నిరాకరించి ఉంటారు! కృష్ణానదిలో నికరంగా 75 శాతం నీరు ఉండగలదన్న అంచనాపైన ఆధారపడి 2000వ సంవత్సరం నాటికి 2060 టి.ఎం.సి. పైనే నీరు అదనంగా లభ్యం కాగలదని లెక్కతేల్చి, ఆ లెక్క ఆధారంగా బచావత్ ట్రిబ్యునల్ కృష్ణజలరాశిని ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మహారాష్ట్రలకు కేటాయించింది. నదీజలాల వాడకంలో దిగువన ఉన్న ఆంధ్రప్రదేశ్ మిగులు జలాలను వాడుకోవచ్చునని ట్రిబ్యునల్ తీర్పు చెప్పినప్పటికీ ఆంధ్రప్రదేశ్ (గంగపేరిట) కేవలం 29 శతకోటి ఘనపుటడుగులు నీటిని మాత్రమే అదనంగా వాడుకొంటుందని ఇప్పుడు ఎందుకు మాట ఇవ్వవలసివచ్చింది? పైగా లిఖితపూర్వకంగా (ఫిబ్రవరి 17న

పాటిల్‌కు రాసినలేఖ) ఈ కమిట్‌మెంట్ ఇచ్చారు. మనం అనుకొంటున్నట్లుగా ఈ ప్రతిపాదన ఆంధ్రప్రదేశ్ ప్రయోజనాలను కాపాడగలుగుతుందా? ట్రిబ్యునల్ తీర్పు ప్రకారం అదనపు జలాలను వాడుకొనే అవకాశం ('హక్కు'గా కాకపోయినా) ఉన్నప్పటికీ 29 టి.ఎం.సి.కే మనం ఎందుకు కట్టుబడి ఉండాలి? ఏ అంచనాపై ఈ నిర్ణయానికొచ్చారు? వీరేంద్రపాటిల్ బెంగుళూరు ప్రకటనలో మరి రెండు అంశాల్ని కూడా వెల్లడించారు. వరదల సమయాల్లో మాత్రమే "తెలుగుగంగ" కాల్వను వినియోగంలోకి తెస్తారు. మరి మిగతా సమయాల్లో సహజపారుదలకు గ్యారంటీ ఎందుకు ఇవ్వరు? సమాధానం లేదు. అలాగే 2000వ సంవత్సరందాకా "వేచి ఉండకుండా మిగులు జలాలను మూడు రాష్ట్రాల మధ్య పంపిణీ చేసుకోవచ్చునని" చెబుతూనే మరొకవైపున ఈ అదనపు జలాలను ట్రిబ్యునల్ పేర్కొన్న "షెడ్యూల్ "బి" తరగతి స్కీముల"కు మాత్రమే పంచుకోవాలని పాటిల్ ఓ పేచీ పెట్టారు. నిజానికి "అదనపు జలాల పంపిణీ" పేరుతో జరిగే పంపిణీ ప్రధానంగా కర్ణాటక లాంటి ఎగువన ఉన్న రాష్ట్రాలకే ప్రయోజనకరం; ఆ పేరిట ప్రాజెక్టుల నిర్మాణాన్ని వారు యధేచ్ఛగా కొనసాగించవచ్చు. అదే విధంగా పాటిల్ పేర్కొంటున్న కొన్ని "షెడ్యూల్ స్కీములు' ' ఆంధ్రప్రదేశ్ అవసరాలను తీర్చవు. ఎందుకంటే, ఇన్నాళ్ళుగా మనం ట్రిబ్యునల్ తీర్పులో పేర్కొన్న షెడ్యూల్ "ఎ" స్కీములకు ప్రాధాన్యం ఇవ్వాలని కోరుతుండగా ఆ ఊసెత్తడం మానేసి "షెడ్యూల్ "బి' ' స్కీములవైపు పాటిల్ దృష్టి మరల్చజూస్తున్నారు!

నిజానికి బచావత్ ట్రిబ్యునల్ వివరణను బట్టి చూచినా మూడు రాష్ట్రాలకు కృష్ణాజలాలను షెడ్యూల్ "ఎ" కింద పథకాలకోసం కేటాయించడంలో ఆయా రాష్ట్రాల నీటికొరతను ట్రిబ్యునల్ పరిగణనలోకి తీసుకోలేదు. అయితే, 100 ఏళ్ళ వ్యవధిని ఉజ్జాయింపుగా గణనలోకి తీసుకొంటూ అందులో 25 సంవత్సరాలను "నీటికొరత సంవత్సరాలు"గా పరిగణించవచ్చుననీ, ఈ దృష్ట్యా ఈ పాతికేళ్ళలో మహారాష్ట్ర, కర్ణాటక (మైసూర్)లకంటే ఎక్కువ ఇబ్బందులకు గురికాగల రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ మాత్రమే అవుతుందనీ ట్రిబ్యునల్ స్పష్టంగా పేర్కొంది. కనుకనే ట్రిబ్యునల్ తుది ఉత్తర్వులోని అయిదవ క్లాజు (సి) ప్రకారం తమకు "కేటాయించిన నీటికంటే ఎక్కువ మొత్తాన్ని మహారాష్ట్ర, మైసూర్ (కర్నాటక) వాడుకోరాద"ని ఖచ్చితంగా శాసించవలసి వచ్చింది! అయితే అంతమాత్రాన కృష్ణాబేసిన్ "వెలుపలి అవసరాలకు లేదా కొత్త ప్రాజెక్టుల నిర్మాణాని"కి ఈ నదీజలాలను "మళ్ళించే హక్కు" మన రాష్ట్రానికి లేదని కూడా ట్రిబ్యునల్ చెప్పింది. కాని ట్రిబ్యునల్ తదుపరి నివేదికలోని (నాల్గవ అధ్యాయం) ఎనిమిదవ వివరణలో "ఆంధ్రప్రదేశ్ ప్రస్తుత జల వినియోగశక్తికి అనుగుణంగా మిగులు జలాలను ఆ రాష్ట్రం వాడుకోకుండా పరిమితి విధించవలసిన అగత్యం లేద"నీ, మిగులు జలాలను కర్నాటక దిగువన ఉన్న ఆంధ్రప్రదేశ్ "వినియోగించుకొనకపోతే ఆ నీరు కాస్తా వృధాగా సముద్రంపాలు కావలసివస్తుంద"ని కూడా స్పష్టం చేసింది. అయినప్పుడు ట్రిబ్యునల్ కేటాయింపునకు మించి 29 టి.ఎం.సి. నీటిని మాత్రమే వాడుకొంటామని, అనుపానులు చూసుకోకుండా అదరాబాదరా ఎందుకు హామీ పడవలసి వచ్చింది? అలాగే పాటిల్ పేర్కొంటున్న షెడ్యూల్ "బి" స్కీముల వ్యవహారం ఓ ప్రత్యేక ప్రహసనం. ఎందుకంటే, ప్రతి ఏటా నదిలో మిగులు నీరో లేదా నీటి కొరతో ఉండవచ్చు. అప్పుడు ఎలా ఈ నీటిని మూడు రాష్ట్రాలమధ్య పంపిణీ చేయాలన్న విషయమై ఈ స్కీముకింద ట్రిబ్యునల్ చర్చించింది. అయితే ఈ "బి" స్కీమును అమలుపరచాలంటే తమాషా కాదనీ, అందుకు కృష్ణాబేసిన్‌లోని అన్ని ప్రాంతాల సమగ్రమైన అభివృద్ధికి పూచీపడే "కృష్ణా వ్యాలీ అథారిటీ"ని నెలకొల్పాలనీ ట్రిబ్యునల్ సూచించింది; అది కొందరికి రుచించనందున

ఆ ప్రతిపాదనను 'బూజు'పట్టించారు. కాని పాటిల్ ఈ విషయం ప్రస్తావించకుండా షెడ్యూల్ 'బి' స్కీముల కింద అదనపు జలాల పంపిణీ గురించి మాట్లడబోవడం ఎండమావులను చూపించి దప్పిక తీర్చుకోమనడం తప్ప మరొకటి కాదు. అమెరికాలోని ప్రసిద్ధమైన టెన్నిసీవ్యాలీ అథారిటీ, ఇండియాలోని దామోదరవ్యాలీ కార్పొరేషన్‌ల అపారమైన అనుభవం దృష్ట్యానే బచావత్ కృష్ణావ్యాలీ అథారిటీని సిఫారసు చేశాడని మరచిపోరాదు. అందువల్ల, ఫైనల్ అర్డర్‌లో ట్రిబ్యునల్ చేర్చిన "స్కీము-ఎ" కింద రాష్ట్రాల మధ్య జరిగే నదీజలాల వాస్తవ కేటాయింపులకూ, "స్కీము-బి"లో చర్చించిన అంశాలకు పొత్తూ పొంతనా లేదని గమనించాలి. ప్రపంచ దేశాల అనుభవం కూడా ట్రిబ్యునల్ వాదననే సమర్థిస్తోంది. "రియోగ్రాండీ" నదీజలాల పంపిణీ విషయంలో అమెరికా-మెక్సికోల మధ్య తలెత్తిన వివాదం దిగువ రాష్ట్రాల అవసరాలను గుర్తించడంద్వానే పరిష్కారం కాగలిగింది. అలాగే మన దేశంలో మైసూర్ కేసులో కూడా (1961లో) ఎగువన ఉన్నవారు దిగువన ఉన్నవారి నీటి పారుదల సౌకర్యాన్ని అడ్డుకోరాదని కోర్టు తీర్పు చెప్పింది. ఈ సూత్రాన్ని బొంబాయి కోర్టు 1960లోనే పాటించింది. అలాగే అంతర్జాతీయంగా తలెత్తిన నదీ జలాల వివాదాలు కూడా ప్రధానంగా దిగువన ఉన్న దేశాలు, రాష్ట్రాల ప్రయోజనాలకు అనుగుణంగానే పరిష్కారమయ్యాయని గుర్తించాలి.

గురువారం 26 ఏప్రిల్ 1990

# జంటనగరాలు: కృష్ణ జలాలు

ప్రకృతి ప్రసాదించిన నీటి వనరులు మానవుని అవసరాలకోసంగాని రాజకీయాలు అడుకోవడంకోసం కాదు. అసలు తగినంత నీరు అంటూ నదులలో ప్రవహించాలేగానీ, అన్ని ప్రాంతాల అవసరాలకు అనువైన విధంగా, వీలైన మార్గంలో నదీ జలాలను మళ్ళించుకోవచ్చు. స్వార్థబుద్ధికి, రాజకీయ ప్రయోజనాలకు చోటివ్వకపోతే ఇందులో కక్షలకు, కార్పణ్యాలకు, చీకాకులకు, చిర్రుబుర్రులకూ తావులేదు. కాని దురదృష్టవశాత్తు ఆంధ్రప్రదేశ్‌లో ఎవరికి వారు తమ ప్రాంతం ప్రయోజనాలు కాపాడుతున్నామన్న మిషపైన (నిజానికి అదొక ముసుగు మాత్రమే, అసలు రాజకీయం వేరు) నదీ జలాల వాడకం విషయంలో కాంగ్రెస్-ఐ, "తెలుగుదేశం" సహా దాదాపు అన్ని రాజకీయపక్షాలూ వాదోపవాదాలకు దిగుతున్నాయి. ఈ వివాదాల మధ్యనే రాష్ట్ర ప్రభుత్వం జంట నగరాల మంచినీటి సమస్యకు పరిష్కారంగా కృష్ణా నదీజలాలను నాగార్జున సాగర్‌నుంచి మళ్ళించాలని నిర్ణయించింది. నల్గొండ జిల్లాలోని అక్కంపల్లివద్ద ఇందుకు ఎన్.టి.ఆర్. ప్రభుత్వం లోగడనే శంకుస్థాపన జరిపింది. దానినిప్పుడు ఆచరణ సాధ్యం చేయాలని డాక్టర్ చెన్నారెడ్డి మంత్రివర్గం నిర్ణయించింది. జంటనగరాల మంచినీటి కొరతను తీర్చే ఉద్దేశంతో తలపెట్టిన 'కృష్ణా పథకం'ద్వారా మొదటిదశలో 5.5 శతకోటి ఘనపుటడుగుల (టి.ఎమ్.సి.) నీరు సరఫరా అయితే, రెండవ, మూడవ, దశల్లో అదనంగా మరి 11 టి.ఎమ్.సి. నీరు అందుతుంది. ఢిల్లీకి చెందిన వాటర్ అండ్ పవర్ కన్సల్టెన్సీ సర్వీసెస్ కంపెనీ ("వాప్‌కోస్") మార్చి 30న సమర్పించిన నివేదికను పరిశీలించిన దరిమిలా రాష్ట్ర ప్రభుత్వం తుది నిర్ణయం చేసింది. ఈ బృహత్ పథకం అమలు చేయడానికి అయ్యే ఖర్చు గురించి, అసలు కృష్ణా నదినుంచి ఏ మేరకు నమ్మకంగా జంట నగరాలకు మళ్ళించగల జలరాశి ఎంత పరిమాణంలో లభ్యం కాగలదు, ఇత్యాది సమస్యల గురించి ఈ కంపెనీ ప్రజా ప్రతినిధులతోనూ, ఇంజనీర్లతోనూ సంప్రదించి నివేదిక సమర్పించింది. ఈ కంపెనీ పరిశీలనకు ముందు కొందరు రాజకీయవేత్తలు గోదావరి జలాలను మాత్రమే జంటనగరాలకు మళ్ళించాలని కోరగా, మరికొందరు కృష్ణాజలాలను మాత్రమే తీసుకురావాలని వాదులాడారు. టెక్నికల్ సమస్యపైన, జల ప్రవాహ గతి తీరుతెన్నులు తెలిసిన నిపుణుల స్థానంలో రాజకీయవేత్తలు తీర్పరులుగా అవతరించబోవడం మన పతనావస్థకు నిదర్శనం. ఒక ప్రాంతం ఎమ్.ఎల్.ఏలు ఒక మెమొరాండాన్నీ, మరొక ప్రాంతం ఎమ్.ఎల్.ఏలు వేరొక మెమొరాండాన్నీ, ముఖ్యమంత్రికి సమర్పించారు. కేవలం జంటనగరాల అవసరాల పేరిట జిల్లాల ప్రయోజనాలను రాజకీయవేత్తలు విస్మరిస్తున్నారని చెప్పితీరాలి. 1969లో కేంద్రం నియమించిన ఇరిగేషన్ కమిషన్ 750 మిల్లీలీటర్ల వర్షపాతం కన్నా తక్కువ వర్షం పడే ప్రాంతాలను కరవు ప్రాంతాలుగా ప్రకటించిన సంగతిని మనం మరువరాదు. ఈ దృష్ట్యా రాష్ట్రంలోని ఏడు

జిల్లాల్లోని 60 తాలూకాలను ఆనాటికి (20 ఏళ్ళనాడు) కరవు ప్రాంతాలుగా ప్రకటించింది. వాటిలో నల్గొండ జిల్లా ఒకటి. ఆ తర్వాత కరవు ప్రాంతాల జాబితా పెరిగిందేగానీ తరగలేదు. అదే సమయంలో మరొక వాస్తవాన్ని కూడా మరవరాదు. 1934 నాటి రాయలసీమ మహాసభ, 1937 నాటి ఆంధ్ర మహాసభ రజతోత్సవ సభలూ, "శ్రీ భాగ్ ఒడంబడిక" ఫలితంగా రాష్ట్రంలో అన్ని ప్రాంతాలకంటే నిరంతర కరవు కాటకాలకు కాణాచిగా మారిన రాయలసీమ భూములకు నీటి పారుదల సౌకర్యాలు పెంచడం రాష్ట్రంలోని భావి ప్రభుత్వాల బాధ్యతగా తీర్మానించాయి. రాష్ట్ర భవితవ్యాన్ని దృష్టిలో పెట్టుకున్నందుననే నాడు రాయలసీమ పెద్దలు రాయలసీమకు ఉపయోగించే "కృష్ణ-పెన్నా"రును వదలుకున్నారని కూడా మరవరాదు. ఎందుకంటే, ఈ సభలు జరిగిన ముప్పయ్యేళ్ళ తరువాత కూడా కేంద్రం ఇరిగేషన్ కమిషన్ రాష్ట్రంలో, ముఖ్యంగా రాయలసీమ, తెలంగాణాలలో కరవు ప్రాంతాలను ప్రత్యేకించి పేర్కొని ఏకరువుపెట్టవలసి వచ్చిందంటే జల వనరుల పంపిణీ విషయంలో ఎంతగా రాజకీయాలకు అతీతంగా వ్యవహరించాల్సి ఉంటుందో బోధపడుతుంది.

నిజానికి హైదరాబాద్-సికిందరాబాద్ జంటనగరాల మంచినీటి అవసరాలను తీర్చడానికి ఏది అనువైన పథకం అన్న మీమాంస ఈనాటిది కాదు, ఇరవై ఏళ్ళుగా నలుగుతున్న సమస్య. కృష్ణ, గోదావరి నదులలోని జలరాశిని జంటనగరాలకు మళ్ళించడానికి ఏది దగ్గరమార్గం, ఏది అనుకూల పద్ధతి అని సుదీర్ఘ చర్చలు జరిగాయి. 1972లోనే ఇరిగేషన్ శాఖ రిటైర్డ్ ఇంజనీర్ కె.వి. శ్రీనివాసరావు అధ్యక్షతన ఏర్పడిన కమిటీ విశేష పరిశోధన తర్వాత అ సమస్యకు ముగింపు తీసకువచ్చింది. కాని రాజకీయాల మూలంగా ఆనాటి ప్రభుత్వం ఆ కమిటీ నివేదికను మూలకు నెట్టింది. శ్రీశైలం ప్రాజెక్టునుంచి రెండు దశలలో కృష్ణ జలాలను రూ. 130.41 కోట్ల ఖర్చుతో జంటనగరాల మంచినీటికోసం మళ్ళించుకోవచ్చునని చెబుతూ, గోదావరి జలాల మళ్ళింపువల్ల ఎదురుకాగల ఇబ్బందులేమిటో కూడా చర్చించింది. ఆ నివేదికను ఆమోదించి నాడు ఆచరణలోకి దిగివుంటే కొన్ని వందల కోట్లు రాష్ట్రానికి నేడు ఆదా అయి ఉండేవి. పొదుపునకూ రాజకీయానికీ పొత్తు కుదరదు! అదే శ్రీనివాసరావు కమిటీ నివేదిక విషయంలో కూడా జరిగింది. శ్రీరామ్‌సాగర్ (పోచంపాడు) వద్ద గోదావరి నుంచి జంటనగరాల అవసరాలకు నీరు తరలించుకోవచ్చునని అంగీకరిస్తూనే, ఇరిగేషన్ అవసరాలను తీర్చగలిగినంత నీరు పోచంపాడువద్ద ఉండదనీ, అందువల్ల జంటనగరాల అవసరాలను ఆదుకోవడానికి పోచంపాడునుంచి నీరు తరలించడం సాధ్యపడే పని కాదనీ కమిటీ స్పష్టం చేసింది. అయితే కృష్ణాజలాలను జంటనగరాలకు తరలించే సందర్భంగా రాయలసీమ ప్రయోజనాలకు సంబంధించిన కీలకమైన కొన్ని అంశాలను కూడా విస్మరించడానికి వీలులేదు. సంవత్సరంలో తరచుగా దుర్భిక్షానికి గురి అయ్యే రాయలసీమ ప్రాంతాలకు ఏకైక జలాధారం కృష్ణానది. తెలంగాణా, కోస్తాలకు రెండేసి వనరులున్నాయి - కృష్ణ, గోదావరులు. అయినప్పుడుశ్రీశైలం కుడికాల్వ తెలుగుగంగ ప్రాజెక్టుద్వారా కొంత భాగానికి సేద్యధారలు అందించగలిగినా శ్రీశైలం లెఫ్ట్ బ్యాంకి కెనాల్‌ద్వారా ఇటు తెలంగాణాలోని నల్గొండ జిల్లాలోని దేవరకొండ, నల్గొండ, నిడమనూరు, నాంపల్లి, చందూరు, మిర్యాలగూడ తాలూకాల్లో, మహబూబ్‌నగర్ అచ్చంపేట తాలూకాలో మొత్తం రెండు లక్షల ఎకరాలు కృష్ణా జలాలతో సేద్యయోగ్యం చేయవచ్చు. ఆ మేరకు కృష్ణజలాలను కోల్పోతున్న రాయలసీమలో కొత్తగా నిర్మాణం కావలసిన "గాలేరు-నగరి", హంద్రి - నీవా సేద్యపు నీటి పథకాల ప్రయోజనాలను కూడా పట్టించుకోవలి. కడప, నెల్లూరు, చిత్తూరు జిల్లాలకు ప్రత్యక్షంగా ప్రయోజనం కలిగించే ఈ పథకాలు

రానున్న రోజుల్లో రాయలసీమకు ప్రాణధారలు. అందువల్ల జంటనగరాల మంచినీటి ప్రయోజనాలగురించి జాగ్రత్తపడేముందు రాయలసీమ ప్రజల ఈ ప్రాథమిక అవసరాలను కూడా విధిగా గణనలోకి తీసుకోవాలి. అందులోనూ ముఖ్యంగా కర్ణాటక ప్రభుత్వం "అప్పర్ కృష్ణా" ప్రాజెక్టు పథకంతో రెండు రిజర్వాయర్లను కొత్తగా తలపెట్టి, ముందుకు దూసుకు వెడుతున్నందున కృష్ణాజలరాశి ఏ మేరకు మనకు మిగులు తేలుతుందో కూడా పరిశీలించి మరీ ముందడుగు వేయాలి.

జంటనగరాల అవసరాలు తీర్చగలవని దఫదఫాలుగా పేర్కొంటూ వచ్చిన పథకాలు మూడు రకాలుగా ఉన్నాయి. 1. కృష్ణ-గోదావరి జలాలు; 2. ఎల్లంపల్లి (రామగుండంవద్ద) బరాజ్‌నుంచి రూ. 500 కోట్లతో "ఎత్తిపోతల" పథకం ద్వారా నీరు సరఫరా చేయడం; 3. ఎల్లంపల్లి స్కీముకు బదులుగా "లక్ష్మీకాల్వ"కు కొనసాగింపు పథకంగా "నల్గొండ వరద కాల్వ" పథకాన్ని అమలులోకి తెచ్చుకొని జంటనగరాల నీటి కొరతను తీర్చడం. వీటన్నింటిలోకి శ్రేష్ఠమైన పథకంగా శ్రీశైలం రిజర్వాయర్‌నుంచి "గ్రావిటీ" పద్ధతి ఆధారంగా సొరంగ మార్గంద్వారా కృష్ణ జలాలను తరలించుకోవాలని నిర్ణయించారు. శ్రీశైలం లెఫ్ట్ కెనాల్‌నుంచి "లిఫ్టు"ద్వారా నీరు సరఫరాచేసే పథకానికి స్వస్తి చెప్పి, అదనంగా రూ. 150 కోట్లు ఖర్చు అయినా సరే "టన్నెల్" పథకాన్నే వరించవలసి వచ్చింది. 2001 సంవత్సరానికి 'మంజీర' ప్రాజెక్టు మూడవ దశ (అదే సింగూర్) వల్లకూడా జంటనగరాల ప్రజల, పరిశ్రమల నీటి అవసరాలు తీరవుకాబట్టే ఈ ప్రత్యామ్నాయం అవతరించింది.

గురువారం 3 మే 1990

# జంటనగరాలు: కృష్ణ జలాలు 2

కర్ణాటకలోని నారాయణపూర్‌వద్ద, అల్మట్టీవద్ద కర్ణాటక ప్రభుత్వం కృష్ణపై తలపెట్టిన రెండు పెద్ద రిజర్వాయర్ల నిర్మాణం - బచావత్ ట్రిబ్యునల్ కర్నాటకకు కేటాయించిన జల వనరుల పరిమాణాన్ని ఉల్లఘించి జరుగుతోంది. కాని అదే సమయంలో దిగువన ఉన్న ఆంధ్రప్రదేశ్, వృధాపోయే కృష్ణాజలాలను ట్రిబ్యునల్ కేటాయింపులతో నిమిత్తం లేకుండానే వినియోగించుకోవచ్చునని స్పష్టంగా తీర్పులో పేర్కొన్నప్పటికీ అందుకు కర్ణాటక అభ్యంతరం చెబుతూ వస్తోంది. కర్ణాటక ప్రభుత్వం ప్రవర్తనవల్ల అది కొత్తగా తలపెట్టిన "అప్పర్ కృష్ణా" ప్రాజెక్టువల్ల కృష్ణా జలరాశి వినియోగంలో ఆంధ్రప్రదేశ్ తరుగు రాష్ట్రం కాగల ప్రమాదం ఉంది. ఇందువల్ల రాయలసీమ ప్రయోజనాలకు హెచ్చు నష్టం వాటిల్లుతుంది. ఇప్పటికే రాయలసీమలోని ఏ ప్రాజెక్టూ పూర్తిస్థాయిలో వినియోగంలోకి రాలేదు. పైగా "లోకలైజ్" చేసిన వేలాది ఎకరాలు కూడా బీడుభూములుగానే పడి ఉంటున్నాయి. ఈ దశలో కృష్ణా జలాలను జంటనగరాలకు తరలించితే రాయలసీమలో నూతనంగా సేద్యపు నీటిపారుదల అవకాశాల సంగతి అలా ఉంచి, అసలు ప్రాజెక్టుల కింద భూములకే ముప్పు రావచ్చునేమో మరొక్కసారి పరిశీలించవలసి వస్తుంది. ఈ దృష్ట్యా కూడా జంటనగరాలకు కృష్ణ జలాల తరలింపు సమస్య గురించి ఒకటికి పదిమార్లు నిష్పాక్షికంగా సమీక్షించుకోవలసి రావచ్చు. చివరికి కర్ణాటక ప్రభుత్వం ఎత్తుగడలతో నిమిత్తం లేకుండానే మనం ముసాయిదాలో వున్న పులిచింతల ప్రాజెక్టుకు అప్పుడే (ఇది నల్గొండ, గుంటూరు, కృష్ణా జిల్లా భూములకు అదనపు సేద్యపు వనరులు అందించగల పథకం) తిలోదకాలు ఇచ్చుకున్నాం! ఈ పరిస్థితుల్లో కొందరు 'పెద్ద మనుషులు' మరొక విచిత్రమైన వాదాన్ని ముందుకు నెడుతున్నారు - కేంద్రం అనుమతి లేకుండా 'తెలుగుగంగ' ప్రాజెక్టును తలపెట్టి ఆంధ్రప్రదేశ్ అమలు జరిపినందుననే కర్నాటక ప్రభుత్వం "అప్పర్ కృష్ణా" ప్రాజెక్టు పథకాన్ని ధాటీగా అమలులోకి తెచ్చుకోగలిగిందని! ఈ వాదన చేసేవారు నాటి ప్రధానమంత్రి హోదాలో ఇందిరాగాంధీయే ఈ పథకానికి ఆశీస్సులు పలికి, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర ముఖ్యమంత్రుల మధ్య సంఘీభావానికి మార్గంవేసిన సంగతిని మరిచిపోరాదు! ఇందిరాగాంధీ చొరవ ఫలితంగానే రాయలసీమ జిల్లాలకు, నెల్లూరు జిల్లాకు ప్రయోజనకరమైన 'గంగ' రూపుదిద్దుకున్నదని గమనించాలి. ఇప్పుడు కర్నాటక పేరుచెప్పి రాష్ట్రంలో స్థిరపడిన ఆయకట్టును కూడా చెదరగొట్టేందుకు కొందరు స్వార్థపరులు పనిచేస్తున్నారు. దీనికి అనుగుణంగా వివిధ ప్రాజెక్టులకు కృష్ణాజలాల పంపిణీని తిరగదోడించే ప్రయత్నంలో కూడా వీరున్నారు. ఈ పద్ధతి రాష్ట్రం ఉమ్మడి ప్రయోజనాలకు హానికరం. అలాంటి పున:పంపిణీ ప్రతిపాదనను

రాష్ట్ర ప్రభుత్వం పరిశీలించడానికి కూడా సమ్మతించరాదు.

ఇంతకుముందు శ్రీశైలం లెఫ్ట్ బ్యాంక్ కెనాల్‌ద్వారా "టన్నెల్" స్కీముకింద నల్గొండ జిల్లాలోని ఆరేడు తాలూకాలకు మహబూబ్‌నగర్‌లోని ఒక తాలూకాకు నీరందించడానికి ఉద్దేశించిన పథకంవల్ల మూసీనదికి కుడితట్టున నాగార్జునసాగర్ లెఫ్ట్‌కెనాల్ కింద నీటిపారుదల మార్గంలో ఉన్న "ఫ్లోరైడ్" వ్యాధిపీడిత ప్రాంతాలకు మంచినీరు కూడా అందించవచ్చు. అయితే "ఎల్లంపల్లి బరాజ్"నుంచి లిఫ్ట్ పథకం ద్వారా జంట నగరాలకు మంచినీరు సరఫరా చేయగల ప్రతిపాదన ఏమయిందో తెలియదు. కాని ఎల్లంపల్లి పథకానికి మారుగా వచ్చిన "నల్గొండ వరద కాల్వ" పథకం కూడా ఎక్కడ మూలుగుతోందో తెలియదు! జంటనగరాలకు మంచినీరు అందించడం కూడా ఈ పథకంలో ఒక భాగం. గోదావరి ఉపనది మంజీరపైన సింగూర్‌వద్ద మూడు దశలుగా తలపెట్టిన ప్రాజెక్టుకూడా పధ్నాలుగేళ్ళనాటిది. ఇందులో జంటనగరాలకు నీటి సరఫరా కోసం ఉద్దేశించినదే మంజీర మూడవదశ. 2011వ సంవత్సరం నాటికి ఇది కూడా జంటనగరాల అవసరాలను తీర్చలేదని భావించబట్టే ప్రత్యామ్నాయ వనరులను కృష్ణనుండి తోడాలా లేక గోదావరినుంచి మళ్ళించాలా అన్న ఆలోచన చేయవలసి వచ్చింది. 1991 నాటికి మంజీర ప్రాజెక్టు మూడవ దశ పూర్తికాగల పక్షంలో - ప్రస్తుతం ఉస్మాన్‌సాగర్, హిమాయత్‌సాగర్, మంజీరా రెండు దశల కింద జంటనగరాలకు ప్రతిరోజూ అందించగలుగుతున్న 6-8 కోట్ల గ్యాలన్ల నీరు మంజీర మూడవ దశతో రోజుకి 15 కోట్ల గ్యాలన్లకు పెరగగలదని అంచనా. 1991 నాటికి నగర జనాభా 30 లక్షల పైచిలుకు కాగలదనుకుంటే రోజుకి తలసరి నీటి అవసరం (పరిశ్రమలు, మంచినీటి అవసరాలు) 37 గ్యాలన్లు అని అంచనావేశారు. ఈ లెక్క 1991 వరకే. కాని ఆ తర్వాత జనాభా పెరుగుదల దృష్ట్యా నీటి అవసరాలు కూడా పెరుగుతాయి. కాబట్టి 2011 నాటికి పథకం వేయవలసివచ్చింది. అప్పటికి నీటి అవసరాలు రోజుకి 25 కోట్ల గ్యాలన్లు అని కూడా ముదింపు చేశారు. అయితే అంత ప్రాజెక్టు పూర్తి కావాలంటే సాంకేతిక నివేదిక తయారీ దశనుంచి డిజైనింగ్, నిర్మాణ దశవరకూ 15 ఏళ్లు పడుతుందని కూడా భావించారు. 1972లోనే ఈ పథకాన్ని అమలులోకి తెచ్చుకొని ఉంటే (శ్రీనివాసరావు నివేదిక) ఈ 15 ఏళ్ళలో సమస్య పరిష్కారమై ఉండేది కాదా?

పోనీ, ఆ పథకం ఆచరణలోకి రానప్పుడు కనీసం "నల్గొండ వరదకాల్వ" పథకాన్నైనా చేపట్టి ఉండవలసింది. ఎందుకంటే ఈ "వరదకాల్వ" పథకం బహుళార్థ సాధకమైన ప్రాజెక్టు. పైగా ఈ స్కీముద్వారా జంటనగరాలకు చాలా తక్కువదూరంనుంచి - ఆలేరు నుంచి 70 కిలోమీటర్ల దూరం - "లిఫ్ట్"ద్వారా (ఎత్తిపోతలు) పైప్‌లైన్ సాయంతో మంచినీరు అందించవచ్చు. అంటే ఒక పథకంద్వారా అంతే ఖర్చుతో, తక్కువ దూరం నుంచి గోదావరి నీటిని అటు తెలంగాణా కరవు పీడిత ప్రాంతాలకు, ఇటు జంటనగరాలకు, మిగులు నీటిని నాగార్జునసాగర్‌కూ అందించగల బహుళ ప్రయోజనకారిగా ఈ "వరదకాల్వ" పథకం పేరుపొందింది. అంటే, ఈ "వరదకాల్వ" వల్ల కరీంనగర్, వరంగల్, నల్గొండ జిల్లాలలో ఆరులక్షల ఎకరాల భూమి సాగులోకి రావడమేగాక, మిగతా వనరులు కూడా ఏకకాలంలో సమకూరుతాయన్నమాట. సముద్రంలోకి వృథాగా పారే వరదనీటిలో (జూలైనుంచి నవంబర్‌దాకా) 60 శతకోటి ఘనపుటడుగుల నీటిని "వరదకాల్వకు" మళ్ళించుకుంటే అనేక ప్రాంతాలు కరవునుంచి శాశ్వతంగా తేరుకోగలుగుతాయి. వృథాగాపోయే ఇలాంటి వరదనీటి మళ్ళింపు పథకాలను ఎన్నింటినో

కాటన్ మహాశయుడు తలపెట్టి రూపకల్పన చేసిపోయాడు. సలహాలిచ్చాడు. అలాగే అనేక బ్యాలెన్సింగ్ రిజర్వాయర్లను సూచించాడు. ఇంతవరకూ మనం పట్టించుకోలేదు. సమస్య వచ్చినప్పుడు 'అద్దద్దా' అనడం తప్ప ఆ తరువాత మన ప్రభుత్వాలు దీర్ఘకాలిక పథకాలను తలపెట్టుకోలేకపోతున్నాయి. అంతేగాదు, ఎంతసేపూ పరిశ్రమాభివృద్ధికి జంటనగరాల చుట్టూనే కేంద్రీకరించడం జరుగుతోంది. జల వనరులకు పడుతున్న ఇబ్బందిని కళ్ళారా చూస్తూ కూడా పరిశ్రమల మళ్ళింపును ఆశీర్వదించలేకపోతున్నారు. జల, విద్యుత్ వనరులకు అతి సమీపంగా ఉన్న నాగార్జునసాగర్, శ్రీశైలం, శ్రీరామ్‌సాగర్, రామగుండంలాంటి ప్రాంతాలచుట్టూ కొత్త టవున్‌షిప్స్ పెరుగుదలను ఎందుకు ప్రోత్సహించరు? దృష్టి మారాలి, ఆలోచనలో మార్పు రావాలి!

శుక్రవారం 4 మే 1990

# డ్రైనేజి సెస్సు

రైతాంగం వాస్తవ ప్రయోజనాలకు ఉద్దేశించిన సంక్షేమ పథకాలను వాటిని అమలు జరిపించుకొనే దృష్టితో విమర్శనాయుతంగా పరిశీలించడంలో తప్పులేదుగానీ, ప్రతీ పథకాన్నీ అనుమానించే వైఖరిని మాత్రం ఖండించక తప్పదు. మన మిశ్రమ ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వ రంగం సత్తాను కాస్తా ప్రయివేట్ రంగం కొంత, ప్రభుత్వ రంగం నిర్వహణ లోపాలవల్ల కొంత పిండుకొంటున్నందున, అనేక ప్రాజెక్టులకు, చివరికి మురుగు నీటి పారుదల ప్రాజెక్టులకు, ఇరిగేషన్ ప్రాజెక్టులకు, విద్యుత్ పథకాలకు కూడా ప్రపంచ బ్యాంకినీ, లేదా ఆసియా డెవలప్‌మెంట్ బ్యాంకినీ, లేదా ఇతర పెక్కు అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థలనూ దేబిరించవలసి వస్తోంది. కృష్ణ, గోదావరి ఆనకట్టల నిర్మాణాన్ని సర్ ఆర్థర్ కాటన్ మహాశయుడు చేపట్టి జయప్రదంగా పూర్తి చేయగలిగింది విదేశీ రుణాలతో కాదు, ఆయా డెల్టా ప్రజల కాయకష్టంపైన, శ్రమదానంపైన, వసూళ్ళపైన ఆధారపడి మాత్రమేనన్న సత్యాన్ని గుర్తుంచుకుంటే - నేటి తొక్కిసలాటకు సమాధానం దొరక్కపోదు. ప్రపంచంలోనే అతి తక్కువ ఖర్చుతో, హెచ్చు ఫలితాలను రైతాంగానికి అనితర సాధ్యమైన సామర్థ్యంతో అందజేసిన కాటన్ యువకుడుగా ఉన్నప్పుడు, "రొట్టెతోనూ, పాలతోనూ" ఆడుకొంటున్నప్పుడు ఏం చేస్తున్నావురా అబ్బాయి అంటే కర్రతో "కాల్వలు తీస్తున్నా" అనేవాడట. వాన నీటిని ఎలా వినియోగించుకోవాలో, నీరులేని సమయాల్లో స్టోరేజి వాటర్‌ను ఎలా ఉపయోగించుకోవాలో, మురుగనుఎలా పారించాలో తెలిసిన వాడు కాటన్. కరప్షన్‌కు దూరంగా వున్న కాటన్‌కు ప్రజలూ అనుకూలించారు, చేపట్టిన పనులూ సానుకూలమయ్యాయి. ఎంత ప్రశస్తమైన లోహంకూడా నీటి బంగారానికి లొచ్చేనని భావించిన పాలకులూ, ఇంజనీర్లు మాత్రమే రైతాంగం డ్రైనేజి పారుదల అవసరాలను, ఇరిగేషన్ అవసరాలను పట్టించుకోగలుగుతారు. రాష్ట్ర ప్రభుత్వం ఇటీవల రైతాంగం కోసం రెండు ముఖ్యమైన పనులు చేపట్టింది. 1. రాష్ట్రంలోని తొమ్మిది తుఫాను పీడిత జిల్లాలలో దెబ్బతిన్న డ్రైనేజి (మురుగు నీటి పారుదల) వ్యవస్థను, ఇరిగేషన్ కెనాల్స్‌ను బాగు చేయడం; 2. ఇందుకయ్యే ఖర్చులో కొంతభాగం రైతాంగంనుంచి వసూలు చేసేందుకు డ్రైనేజి సెస్సును రెట్టింపు చేయాలని నిర్ణయించడం. పైగా ఈ పనులు ప్రభుత్వం ఎందుకు చేపట్టింది? రోడ్ల నిర్మాణానికీ, రహదార్ల బాగు చేతలకు, డ్రైనేజి పనులకు, ఇరిగేషన్ కాల్వల నిర్మాణానికి, వాటి రిపైర్లకు, తుఫాను పీడితులకు షెల్టర్ల నిర్మాణానికి ఇత్యాది కార్యక్రమాలకు ప్రపంచ బ్యాంకి నుంచి మూడు దశలలో ఖర్చు చేయడానికి రూ. 720 కోట్లు హామీ లభించిందని ప్రభుత్వం ప్రకటించింది. ఈ ప్రకటన వెలువడిన కొలది రోజులకే రైతాంగంనుంచి వసూలుచేసే డ్రేనేజిసెస్సును రెట్టింపు చేయాలని (ప్రస్తుతం ఏడాదికి 4.10 కోట్లు ఉన్న సెస్సు రూ. 9 కోట్లకు పెంచుతారు) నిర్ణయించారు. అలాగే దీనికి తోడుగా ప్రపంచ బ్యాంకు ఆర్థిక

సహాయంతో కృష్ణ, తూర్పు, పశ్చిమ గోదావరి, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలలో డ్రైనేజి వ్యవస్థ బాగుచేతలకు వీలుగా రెండోపంట (దాళ్వా)ను కొన్నాళ్ళపాటు వాయిదావేసుకోవాలని ప్రభుత్వం ప్రతిపాదించింది. డ్రైనేజిసెస్సు చెల్లించడానికైనా కొందరు ముందుకొస్తారేమోగాని, డ్రైనేజి బాగుచేతలు తమకు ప్రయోజనం కలిగించేవే అయినా ఆర్థికంగా లాభసాటిగా కన్పిస్తున్న రెండోపంటను రిపైర్లు పూర్తి అయ్యేదాకా ఆపడానికి రైతాంగం పేరిట కొందరు స్థానిక లెజిస్లేటర్లు అభ్యంతరం తెల్పడం దురదృష్టకరం. ఇరిగేషన్ వ్యవస్థకు, డ్రైనేజి వ్యవస్థ నిర్మాణానికి పనుల అవసరం గురించి రైతాంగానికి లెజిస్లేటర్లు నచ్చజెప్పి, దీర్ఘకాల ప్రయోజనాలను వారిచే గుర్తింపచేయడానికి ప్రయత్నించకపోవడం విచారకరం. ఎందుకంటే, ఏటా వచ్చే తుఫానులవల్ల, ఉప్పెనలవల్ల, ఉప ద్రవాలవల్ల వందలకోట్ల రూపాయల కిమ్మతుగల పంటలను మురుగునీటి పారుదల సౌకర్యాలు మృగ్యమైనందున కోల్పోవలసివస్తున్న సంగతి మన రైతాంగానికి తెలియనిది కాదు. "తాడు తెగిన గాలిపటం"లా పంట, ఆ పంటకు నాథుడైన రైతుబతుకూ దెబ్బతినడం కళ్ళారా చూస్తూ కూడా రిపైర్లకోసం తాత్కాలికంగా రెండో పంటను వదలుకోవడానికి రైతాంగం ఇష్టపడకపోవడం అంటూ ఉండదు. రాజకీయాలు ముదిరినందున కొందరు లెజిస్లేటర్లలో రైతాంగాన్నిఒప్పించగల సామర్థ్యం కొరవడడమే ఈ సమస్యకు కారణం. రైతు లెక్కచూస్తే నాగలి కూడా మిగలదు. కాని వ్యవసాయ భూములపై ఆదాయపు పన్ను లేనందున, గతంకంటే పంట ధరవరలు బాగా పలుకుతున్నందున రెండేసి, మూడేసి పంటలు కూడా తీయగలుగుతున్నందున - తమకు దీర్ఘకాలంలో శాశ్వత ప్రయోజనం కల్గించగల రిపైర్లకోసం ఒకటి రెండు సార్లకు రెండో పంటను నిలుపు చేసుకొంటే రైతులు ఏమీ నష్టపోరు. విషయం విడమరిచి చెబితే అర్థం చేసుకోని రైతు ఉండడు. నిజానికి ప్రపంచ బ్యాంకు షరతులలో ఒకటి - రెండో పంటను కొలది కాలంపాటు ఆపి, రిపైర్లకు అనుమతిస్తేనే సహాయం అందచేస్తామని. అందువల్ల ఈ షరతును ఆమోదించిన కోస్తా జిల్లాల ఇరిగేషన్ డెవలప్‌మెంట్ బోర్డులు తమ సమ్మతిని బ్యాంకి అధికారులకు లిఖితపూర్వకంగా తెల్పినందున ఆ మేరకు రైతాంగం సహకరించడం ధర్మం. ఈ ధర్మాన్ని రైతాంగంచే గుర్తింపచేయడంలో తూర్పు గోదావరికి చెందిన కొందరు లెజిస్లేటర్లు, ఒక మంత్రీ విఫలమైనందున జిల్లాలోని కొన్ని ప్రాంతాలలో రెండో పంటకు అనుమతించవలసి వచ్చింది. అదే పరిస్థితి కృష్ణాలో కొన్నిచోట్ల ఏళ్ళు పూళ్ళుగా బాధపడుతున్నా, వచ్చిన అవకాశాన్ని వినియోగించుకోలేకపోతే తర్వాత బాధపడి లాభం లేదు.

ఇప్పటికే మనకు అనేక ప్రాజెక్టులకు మంజూరైన ప్రపంచ బ్యాంకి నిధులను సక్రమంగా వినియోగించుకోలేదనీ, నిధులను మురగబెడుతున్నామనీ పేరొచ్చింది. ఉదాహరణకు శ్రీరామ్‌సాగర్ ప్రాజెక్టుకు వచ్చిన నిధులలో అయిదుశాతం డబ్బును కూడా మనం ఉపయోగించుకోలేదు. ఆ డబ్బును అలా వదిలేసి, మళ్ళీ మంజీర నాల్గవ దశకు డబ్బులు కావాలని ప్రపంచ బ్యాంకును అడుక్కుంటున్నాం. ఈ సందర్భంగా మహారాష్ట్ర అనుభవం కూడా మనకు గుణపాఠం కావాలి. 1984 నాటికి పూర్తికావలసిన బొంబాయి నగర మురుగునీటి పారుదల బృహత్ పథకం 1993 నాటికి కూడా ప్రభుత్వం పూర్తి చేయగ స్థితిలో లేదన్న సంగతి తెలిసి, స్థానిక రాజకీయ కుమ్ములాటల తతంగాన్ని గమనించిన ప్రపంచబ్యాంకు ఆ ప్రాజెక్టును మధ్యలో సస్పెండ్ చేసేందుకు సిద్ధమవుతోంది! బ్యాంకి ఇచ్చిన నిర్వహణ ఆదేశాలు ఎక్కడ పాటించకపోయినా మధ్యలోనే నిధులు ఆగిపోయే ప్రమాదం ఉంది. మన రాష్ట్రంలో మూడు దశలలో బ్యాంకి సహాయంతో తలపెట్టిన 2000 నిర్మాణ పనులకు కూడా ఈ సూత్రమే వర్తించబోతోంది. తలా ఒకడు

తలకొక ప్రకటన చేసే తప్పుడు సంస్కారాన్ని అధికారులూ, ప్రజా ప్రతినిధులూ విడనాడాలి. కొన్ని పనులు ఏక ముఖంగా, ఏక వాక్యతతో సాగితేనే వాటికి విలువా, సార్థక్యమూ. డ్రైనేజి సెస్సు విషయంలో ప్రభుత్వం కూడా మంకుపట్టుకు పోకుండానే మధ్యేమార్గంగా వ్యవహరించవచ్చు. సరకుల ధరలపైన అదుపులేని ప్రభుత్వం ఇరిగేషన్ ప్రాజెక్టుల నిర్మాణ ఖర్చు అంచనాలను మించి పెరుగిపోతున్నప్పుడు అందుకు బాధ్యత వహించవలసింది కూడా తానే కాబట్టి సెస్సుల పెంపుదలలో హేతుబద్ధంగా ఉండాలి. ఇంతకుముందు వసూలు చేసిన సెస్సును సక్రమంగా వినియోగించలేదన్న వివరణకు సమాధానం చెప్పాలి. పైగా రూ. 15 కోట్లకు పైగా డెల్టా రైతులనుంచి డ్రైనేజి సెస్సు పాత బకాయిలున్నాయి. వాటిని మాత్రం వసూలు చేస్తూ అదే సమయంలో ప్రభుత్వం మాచింగ్ గ్రాంటును విడుదల చేయాలి; రైతాంగాన్ని పెద్ద సంఖ్యలో రిపైర్ల కార్యక్రమాలలోకి ప్రోత్సహించి సహకారం పొందాలి. ఇది మచ్చలేని రైతు నాయకులవల్ల అయ్యేపనిగాని, కబుర్ల రాయుళ్ళ వల్ల కాదు. రిపైర్లు పూర్తయిన తరువాత పంట దిగుబడి పాతికవంతులు పెరుగుతుందన్న విశ్వాసం మన రైతుకు కలగాలి.

బుధవారం 21 నవంబర్ 1990

# వరదలకూ 'ముగుదాళ్లు' రిజర్వాయర్లే

కృతి వైపరీత్యాలు వచ్చినప్పుడల్లా మన ప్రభుత్వాల వైఖరి "జనన మరణాల" రిజిస్ట్రార్ తంతుగా ఉంటోంది! అది ప్రకృతి విలయతాండం కాబట్టి మనం ఏమీ చేయలేమన్న నిరాసక్త ధోరణినో లేదా తాత్కాలిక చిట్కాలనో ఆశ్రయిస్తున్నాంగానీ, కొన్ని శాశ్వత నివారణ చర్యలు ఆలోచించడంలేదు. కొలది రోజులనాడు కడప, ప్రకాశం, వరంగల్, ఖమ్మం జిల్లాలను ఊపివేసిన వరద భీభత్సం రెండు రోజుల ఉప్పెన ఫలితంగా వచ్చిన పెను వరదలు మరి ఏడెనిమిది జిల్లాలను చుట్టబెట్టాయి. లక్షల ఎకరాలకు ముంపు ఏర్పడింది. వేలాది కుటుంబాలు నిరాశ్రయమయ్యాయి. ఇప్పటికి మొత్తం వందమంది చనిపోయారు, పెక్కు చెరువులకు గండ్లుపడ్డాయి. కృష్ణ, గోదావరులు పొంగడంతోపాటు, పెద్ద కాల్వలు, పిల్లకాల్వలేగాక చివరికి వాగులూ, వంకలూ, మురుగుకాల్వలు కూడా తమ 'ప్రతాపాన్ని' చూపించుకున్నాయి. అసలుకంటే కొసరెక్కువ అన్నట్టుగా కృష్ణ, ఉభయ గోదావరులు, ఖమ్మం జిల్లాలలో బీభత్సకాండకు ప్రధాన కారణం - తమ్మిలేరు, బుడమేరు, ఎనమదుర్రు మురుగుకాల్వ, మున్నేరు, వైర, మేరేడు, కిన్నెసారని ప్రధాన నదుల పొంగుతో పోటీపడడం! ఈ అన్ని ప్రాంతాలలోను అనావృష్టివల్ల ఏ వర్గాలు (పేద వర్గాలు) ప్రధానంగా దెబ్బతింటాయో, ఈ అతివృష్టివల్ల కూడా ఆ వర్గాలే కష్టనష్టాలకు గురికావలసి వచ్చింది. రాష్ట్ర రాజధాని జంటనగరాలూ, విజయవాడలలో పల్లపు ప్రాంతాలు మునిగిపోయాయి. వేలది కుటుంబాలు నిరాశ్రయమయ్యాయి. ఈ పల్లపు ప్రాంతాల గాథ ఈ రోజుదికాదు, ఈ తరంవారికి ఊహతెలిసినప్పటినుంచీ ఆ గాథలో మార్పులేదు. పేదలకు గత్యంతరంలేక ఆశ్రయంగా ఉన్న ఈ ప్రాంతాల విషాద చరిత్రలో మరొక సంవత్సరం గడిచిపోతుంది. అంతే. బహుశా 1984 వరదల తర్వాత ఇంత పెద్ద 'సద్దు'గత అయిదేళ్ళలో రాలేదు. అయితే నాడు ఆగస్టు-నవంబర్ల మధ్య రెండుసార్లుగా వచ్చిన ఉప్పెనలో ప్రాణాలు కోల్పోయినవారు 625మంది. ఒక్క చిత్తూరు జిల్లాలోనే నాడు 100 చెర్వులకు గండ్లు పడ్డాయి. కె.సి కెనాల్‌కు, నాగార్జునసాగర్‌కు, రాజోలిబండ కాల్వకు కూడా గండ్లుపడ్డాయి. ఆస్తి నష్టం సుమారు రు. 850 కోట్లని అంచనావేశారు. నేటి వరద భీభత్సకాండవల్ల రాష్ట్రానికి ఎంత నష్టమో కొన్ని రోజుల తర్వాతగాని తెలియరాదు.

ఈ "సోది" మనం ప్రతియేట చెప్పుకొనేదే, రాసుకొనేదే. కాని ఈ పెనుభీభత్సంనుంచి పెద్ద నష్టాలు వాటిల్లకుండా ఎలాంటి శాశ్వత చర్యలు తీసుకోవాలన్నది ప్రధానమైన అంశం. అంతర్రాష్ట్ర తగాదాలవల్ల తగినన్ని రిజర్వాయర్ల నిర్మాణానికి అవాంతరాలు ఏర్పడుతున్నాయని మనం ఇప్పటికైనా గమనించాలి. ఎందుకంటే కె.ఎల్.రావు చెప్పినట్టుగా మనకు జలవనరుల వినియోగ పథకంతోపాటు జాతీయ వరద నిరోధక పథకాలు కూడా అవసరం, ఆ రెండింటికీ విడదీయరాని సంబంధం ఉంది. 'తుఫానులవల్ల,

వాయుగుండాలవల్ల వచ్చిపడే వరదలను అదుపుచేయడానికి ఒకే ఒక మార్గం - రిజర్వాయర్ల నిర్మాణంఅన్నాడాయన. ఇది ఒక్క దక్షిణ భారతదేశానికేగాక యావద్భారతానికే పరిష్కారంగా ఆయన పేర్కొన్నారు. వీటిని సాధారణ ఇరిగేషన్ ప్రాజెక్టులతో పోల్చవద్దనీ, కేవలం వరద నిరోధక పథకాలుగా తలపెట్టి "స్టోరేజి ప్రాజెక్టులు"గా మాత్రమే నిర్మించుకోవాలన్నారు. స్టోరేజి అవకాశాలు లేని ప్రాంతాలలో విస్తృతంగా డ్రెయినేజి పారుదలకు ఏర్పాట్లు చేసుకోవాలన్నారు. ఈ ప్రాజెక్టులు ఇరిగేషన్‌కి రెండవ ప్రాధాన్యత కల్పిస్తాయి. మొదటి ప్రాధాన్యం జల విద్యుత్ కర్మాగారాలకు లభిస్తుంది. మనకి శ్రీశైలం, నాగార్జునసాగర్, కృష్ణ గోదావరి బరాజ్‌లు, పోచంపాడు ఒకటవ దశ ఇప్పటికి ప్రధాన ప్రాజెక్టులుగా ఉన్నప్పటికీ, ఒక్క శ్రీశైలం మినహా ఇలాంటి "స్టోరేజి ప్రాజెక్టులు" తక్కువ. అటు అనావృష్టి బెడదను, ఇటు అతివృష్టి పీడనూ తట్టుకోవాలంటే, ప్రస్తుతం నిర్మాణంలో ఉన్న ప్రాజెక్టులకేగాక, వంశధార రెండవదశ, శ్రీరామ్‌సాగర్ రెండవదశ, పాలేర, జూరాల ప్రాజెక్టుల రెండు దశలూ కొత్తగా ప్రారంభించి పూర్తి చేసుకోవాలంటే రు. 2000 కోట్లు కావాలని అంచనా. ధరలపైన అదుపులేని మన ప్రభుత్వాల ఆధ్వర్యంలో ఈ నిర్మాణ ఖర్చు ప్రాజెక్టులకు అనుమతి లభించి, ప్రారంభమయ్యేనాటికి రెండింతలూ, మూడింతలూ పెరిగిపోతుంది. ఈ జోస్యానికి వేరే జ్యోతిష్కుడు అవసరం! సర్ ఆర్థర్ కాటన్, కె.ఎల్.రావులు బ్రహ్మపుత్ర - గోదావరి అనుసంధానాన్నీ, గంగ-కావేరి అనుసంధానాన్ని ఊహించి పథకం వేసుకున్నది, భారాన్ని ఏ దేవుని మీదకో ప్రకృతిమీదకో నెట్టి కూర్చునేందుకు కాదు. ఆచరణ సాధ్యం చేయడంకోసమే. తాను నిర్మించిన గోదావరి ఆనకట్ట కాలపరిమితి వందేళ్ళని కాటన్ మహూర్తం నిర్ణయిస్తే అది 105 సంవత్సరాలకుగానీ బీటలివ్వలేదు. కాని అవినీతి భారతంలో నిర్మించుతున్న కొన్ని ప్రాజెక్టులు, రిజర్వాయర్లు నిన్నకట్టినవైనా నేడు బీటలిస్తున్నాయి! నీటిని బంగారంకంటే ఎక్కువగా భావించి, దానిని ద్రవరూపంలో ఉన్న బంగారంగా భావించినవాడు కాటన్ మహాశయుడు. అనావృష్టినంటే అతివృష్టి వుంటుందని గ్రహించి, వర్షం పడిందని సంతోషిస్తే చాలదనీ, వర్షం పడింది కాబట్టి ఇరిగేషన్ అవసరం లేదనుకోరాదనీ ఈ అపారమైన జలసంపద సముద్రం పాలుకాకుండా ఎక్కడికక్కడ రిజర్వాయర్లు నిర్మించుకోవాలనీ, ఈ సందపను అలా భద్రంచేసుకుని సక్రమంగా ప్రాంతాలవారిగా పంపిణీ చేసుకొనకపోతే ఎంత వర్షపాతం ఉన్నా అనావృష్టి పరిస్థితులను తప్పించుకోజాలదనీ ఆ మహానుభావుడు హెచ్చరించాడు. ఇవాళ మనం రెండో పంట గురించి మాట్లాడుకొంటున్నాం. కాటన్ వందేళ్ళనాడే రెండు, మూడు పంటలు సాధ్యమని, చెప్పింది - "జాతీయ జలమాలిక" అవసరాన్ని దృష్టిలో పెట్టుకునే. వృధాగా సముద్రం పాలవుతున్న ఈ జలసంపదను, ఈ "అపురూప ద్రవ పదార్థాన్నీ" సద్వినియోగంలోకి తెచ్చుకొనకపోతే ప్రజల ప్రాణాలకు కూడా ఎంత నష్టం వాటిల్లగలదో ఆయన హెచ్చరించాడు. అమావాస్యకో, పౌర్ణమికో మేలుకోవడం కాదు, చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకోవడం కాదు, వరదలొచ్చినప్పుడు జాగ్రత్తపడడంకాదు, చెర్వులకు నిరంతరం బాగుచేతలు చూసుకొంటూ ఉండాలన్నాడు కాటన్. ఇన్ని జాగ్రత్తలు తీసుకోబట్టే - ప్రపంచంలోని అన్ని దేశాలకూ ఆదర్శప్రాయంగా ఉన్నాయి. కొలంబియా నదిపై నిర్మించిన డాములూ, ఎగువన, దిగువన నిర్మించుకున్న రిజర్వాయర్లూ. ఒక ఒప్పందంద్వారా అమెరికా, కెనడాలు ఈ బృహత్ పథకాలు అమలు జరిపాయి. ఒకరు హైడెల్ ప్రాజెక్టులు నిర్మిస్తే మరొకరు వరద నిరోధక పథకాలు అమలుజరిపి, రెండు దేశాలనూ వరద బీభత్సానికి దూరం చేస్తున్నారు.

గురువారం జూలై 27, 1989

# వ్యవసాయ ఋణాల మాఫీ: లాభించేదెవరు?



1989 ఎన్నికల సందర్భంగా నేషనల్ ఫ్రంట్ ప్రజలకు హామీపడి, ప్రభుత్వం ఏర్పరచిన తరువాత అమలు జరపాలని నిశ్చయించిన ప్రతిపాదనల్లో రూ. 10,000ల లోపు జాతీయం బ్యాంకులనుంచి వ్యవసాయ ఋణాలు తీసుకున్న రైతులకు ఆ ఋణాల్ని మాఫీ చేయడం ఒకటి. ఈ మంచి నిర్ణయాన్ని అమలులోకి తేవడానికి మంచి బుద్ధికూడా ఉండాలి. కాని ఫ్రంట్ ప్రభుత్వం ఏర్పడి ఆరు మాసాలు గడిచాయి. రుణాల మాఫీ వాగ్దానం చేసి, ఈ పథకాన్ని ప్రకటించి కూడా ఆరు మాసాలు కడచాయి. కాని కేంద్రం బడ్జెట్ ప్రతిపాదనలు మొదలు ఆ రోజువరకూ ఆ 'ఋణ విమోచన' పథకాన్ని అమలులోకి తేవడంలో కేంద్ర ప్రభుత్వమూ, రాష్ట్రాలలోని కాంగ్రెస్, నాన్-కాంగ్రెస్ ప్రభుత్వాలు కూడా వాచా ప్రదర్శించిన ఆర్భాటాన్ని ఆచరణలో ప్రదర్శించలేకపోతున్నాయి. కడచిన కొన్ని మాసాలుగా ఈ ఋణాల మాఫీవల్ల బ్యాంకులకు పడే బకాయిలను ఎవరు తీర్చాలి (కేంద్రమా, రాష్ట్రాలా?) అన్న విషయమై పదే పదే మల్లగుల్లాలు పడుతున్నారు, జుట్లు పీక్కుంటున్నారు. పిల్లిమెడలో గంటకట్టేదెవరని తర్జన భర్జన లాడుతున్నారు. ఎవరికి పుట్టిన బిడ్డరా వెక్కి వెక్కి ఏడ్వను అన్నట్టుగా ఈ భారం 'నువ్వంటే నువ్వే' మోయాలని కేంద్రమూ, రాష్ట్ర ప్రభుత్వాలు మాసాల తరబడి వాదులాడుకొంటున్నాయి. అసలింతకూ ఈ ఋణ విమోచన పథకం అమలులోకి వస్తుందా రాదా అనుకుంటున్న సమయంలో కేంద్రం ఒక మంచి ప్రతిపాదన చేసింది; ఋణాల మాఫీని సగభాగం కేంద్రమూ, సగభాగం రాష్ట్రాలూ భరించాలని. ఈ పథకాన్ని ప్రతిపాదించింది కేంద్రమే.కాబట్టి ఆ భారాన్ని కేంద్రమే మొత్తంగా మీద వేసుకోవాలని కాంగ్రెస్ ప్రభుత్వాల వాదన. కాగా ఋణాల మాఫీ పథకాన్ని అమలులోకి తెస్తున్నామని రాష్ట్రాలకు వర్తమానం పంపుతూ కేంద్ర ప్రభుత్వం జూన్ 6వ తేదీన ఋణాల మాఫీకి ఉద్దేశించిన మొదటి పథకాన్ని తిరగదోడుతూ కొత్త ఆదేశాలు జారీచేసింది. తొలి పథకం ప్రకారం - పదివేల రూపాయల మేర ఋణాలు చేసిన రైతులకు, లేదా గ్రామీణ చేతివృత్తులవారికి ఆ మొత్తం మేరకు మాఫీకావాలి. కాని ఇప్పుడు సవరించిన పథకం మాత్రం పేద, సన్నకారు వర్గాలకంటే ఋణాల మాఫీ పేరిట మోతుబరులకు హెచ్చు ప్రయోజనం కల్గించేదిగా ఉంది. దాని ప్రకారం రైతు స్థాయితో నిమిత్తం లేకుండా, ధనికుడైనా సరే చేసిన బ్యాంకి ఋణాన్ని మాఫీ చేయించుకోడానికి అర్హుడౌతాడు. అంటే, ఉదాహరణకు మొదటి స్కీము కింద రూ. 12,000 రుణం చేసిన వ్యక్తి ఈ రాయితీకి అర్హుడు కాడు; కాని సవరించిన పథకం కింద అతనికి కూడా మాఫీ అర్హత రూ. 10,000 వరకూ ఉంటుంది. ఒక మోతుబరి బ్యాంకికి ఇచ్చుకోవలసింది రూ. 2000 మాత్రమే అవుతుంది. విశ్వనాథ ప్రతాప్‌సింగ్ ప్రభుత్వం ఎందుకీపని చేసింది? ప్రధానంగా పేద రైతులకు,

నిరుపేద వృత్తిదారులకు వర్తించవలసిన తొలి పథకాన్ని సవరించవలసిన అవసరం ఏమి వచ్చింది? ఆ రహస్యం మనెవరికంటే కూడా ఉప ప్రధాని దేవీలాల్‌కు తెలుసు; ఆయనను అడ్డం పెట్టుకొని చరణ్‌సింగ్ వర్థంతి సభను చాటుచేసుకున్న భారతీయ "కిసాన్ యూనియన్" నాయకుడు తికాయత్‌కు తెలుసు! దేవీలాల్, తికాయత్‌ల దృష్టిలో రైతాంగం అంటే పేద, మధ్యతరగతి రైతులు కారు, మోతుబరులైన జాట్‌వర్గమే రైతులు! ఏడాదికి సగం రోజులు పనులులేక, అర్థాకలితోనూ, పాక్షిక నిరుద్యోగంతోనూ కుటుంబాలు ఈడ్చుకు వస్తున్న భూములులేని, లక్షలాది వ్యవసాయ కార్మికులు వీరి దృష్టికి ఆనరు; వీరు చేసే ప్రతి ప్రతిపాదన ప్రధానంగా రైతాంగంలోని 'కర్రపెత్తందారీ' మోతుబరులకేగానీ, పేద, మధ్యతరగతి రైతులకు, వ్యవసాయ కార్మికులకు ప్రయోజనం చేకూర్చదు. దేవీలాల్ దృష్టిలో తమ "జాట్స్" (మోతుబరి రైతు) అంటే వెనుకబడినవారు కాబట్టి, వారిని 'బి.సి."ల జాబితాలో చేర్చాలని సూచించాడంటే - అతను ఎంతకైనా సమర్థుడేనని అర్థమవడంలేదా?!

కాగా, సవరించిన ఋణాల మాఫీ పథకాన్ని అమలు జరపడానికి ప్రకటించిన ఆదేశిక సూత్రాలలో ముఖ్యమైనది - మాఫీ అయిన ఋణాలలో 50 శాతం కేంద్రం భరిస్తే, మిగతా సగం రాష్ట్రాలు భరించాల్సి ఉండడం; అయితే ఈ సగ భాగాన్ని కూడా తీర్చలేని ఆర్థిక ఇబ్బందులలో ఉన్న రాష్ట్ర ప్రభుత్వాలకు ఆ మొత్తాన్ని ఋణంగా ఇచ్చి వాయిదాలపై తీర్చుకునే అవకాశాన్ని కేంద్రం కల్పించాలని నిర్ణయించింది. 8వ ప్రణాళిక "పరిశీలన పత్రం"లో, 1990-91 కేంద్రం బడ్జెట్‌లో నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం మొత్తం ఆర్థిక వనరులలో 50 శాతం వ్యవసాయ, గ్రామీణాభివృద్ధికి కేటాయించాలని నిర్ణయించి ఉంది. అందుకు అనుగుణంగానే ప్రణాళికా పెట్టుబడి వ్యయంలో 49 శాతం వ్యవసాయానికి కేటాయించడంతో పాటు రైతుల ఋణ మాఫీ కింద బడ్జెట్‌లో రూ. 1,000 కోట్లు కేటాయించారు. కాని సవరించిన మాఫీ పథకం ప్రకారం బ్యాంకులకు ప్రభుత్వం ఇవ్వదేలే బకాయి రూ. 2,000 కోట్లని ప్రభుత్వ వర్గాల అంచనా. వాస్తవంలో ఈ మొత్తం రూ. 2800 కోట్లకు తక్కువ లేదని బ్యాంకింగ్ వర్గాల అంచనా. ఈ మిగులు తేలిన బకాయికి పూచీకత్తు ఎవరిదో ఎవరూ చెప్పరు. ఋణాల మాఫీ పథకంవల్ల బ్యాంకులు "కోల్పోయే రూ. 2,800 కోట్ల' 'నూ జాతీయ బ్యాంకులలో, వ్యవసాయ పరపతి బ్యాంకులలో డిపాజిట్ చేయవలసిందిగా రిజర్వు బ్యాంకికి కేంద్ర ప్రభుత్వం ఆదేశం ఇచ్చినప్పటికీ, బడ్జెట్ లోటును మరింతగా పెంచి, ద్రవ్యోల్బణ స్థితికి దోహదం చేసే పరిస్థితిని ప్రభుత్వం ఎలా చక్కదిద్దుతుందో తెలియదు. ఋణాల మాఫీ పథకం ప్రకారం సన్నకారు రైతులు, బీద వృత్తిదారులు పొందవలసిన ప్రయోజనాలను మోతుబరులు గుంజేసుకోబోతున్నందుకే మన ప్రాతికూల్యం. రాజకీయ వత్తిడులవల్ల, ప్రభుత్వంలో గుత్తాధిపతుల 'లాబీ' మాదిరే భూస్వాముల లాబీ కూడా బలంగా ఉన్నందువల్ల, వారి వత్తిడి వల్లనే మొదటి మాఫీ పథకాన్ని ఫ్రంట్ ప్రభుత్వం సవరించవలసి వచ్చింది. హెవీ డ్యూటీ చెల్లించి కొనుగోలు చేసే పంపుసెట్లకు, ట్రాక్టర్ల కోసం (మోతుబరులు మాత్రమే వీటిని భరించగలరు) తీసుకున్న ఋణాలను మాఫీ చేయడానికి మొదటి పథకం ఉద్దేశించలేదు. లోగడకంటే ఈ పథకంవల్ల దొంగ సర్టిఫికేట్‌దార్ల సంఖ్య కూడా పెరిగే ప్రమాదం ఉంది. ఎందుకంటే, సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకాల క్రింద సన్నకారు రైతులకు, పేద వృత్తిదారులకు ఉద్దేశించిన మొత్తాలను బినామీల ద్వారా ధనికరైతులు ఎలా గుంజుకున్నదీ పథకాల అమలు తీరును సమీక్షించిన పబ్లిక్ అక్కౌంట్స్ కమిటీ నివేదిక లోగడనే వెల్లడించి, హెచ్చరించింది. సన్నకారు రైతులపైన, చేతివృత్తులవారిపైన ఈ

పథకాల కింద పెట్టే పెట్టుబడి కూడా ఏడాదికి చాలీచాలనిదిగా (రూ. 7,000 - రూ. 9,000) ఉందని చెబుతూ, ఏడవ ప్రణాళికా కాలంలో గ్రామీణ ప్రాంతాల్లో ఈ వర్గాలకు చెందిన ఒక్కొక్క కుటుంబంపైన సగటున ఏడాదికి వెచ్చించిన మొత్తం రూ. 4,500 అనుకుంటే అందువల్ల అదనంగా సృష్టిఅయిన ఆదాయం ఏడాదికి రూ. 1,665 మాత్రమేనని తేలింది. అంచేత ఈ వర్గాలను దారిద్ర్య రేఖను దాటించాలంటే ఐ.ఆర్.డి.పి. పథకాలకు ఎంత పెట్టుబడి అవసరమవుతుందో ఎవరికి వారే ఊహించుకోవచ్చు. ఎంత పెట్టినా, ఉద్దేశించిన వర్గాలను వదిలి బలసిన వాడినే పెంచే మార్గాలు అవలంబిస్తున్నప్పుడు దేశాన్ని తాకట్టుపెట్టుకున్నా "దారిద్ర్య రేఖ"ను దాటలేము. కనుకనే గ్రామీణ కుటుంబాలలో కేవలం 12 శాతం కుటుంబాలు మాత్రమే "దారిద్ర్య రేఖ"ను దాటగలిగాయని 1985-86నాటి ఎవాల్యుయేషన్ రిపోర్టు వెల్లడించింది.

బుధవారం 13 జూన్ 1990

# డెల్టాలో డ్రైనేజి వ్యవస్థ ఆధునీకరణ

చేతిలో లేనిది చేతిలోకి రాదట. అలాగే చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకున్నా ఫలితం ఉండదు. కనుకనే ఇటీవలకాలంలో ఒక్క రెండువారాల వ్యవధిలో (జూలై23/24) కోస్తా ఆంధ్రను ముఖ్యంగా కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాలలోని డెల్టా ప్రాంతాలను కకావికలు చేసిన వరద బీభత్సంవల్ల చేలో వున్నది కూడా ఊడిపోయింది; చేతికొచ్చిన పంట నాశనమవడమేగాక, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కడచిన నలభై రెండేళ్ళుగా డెల్టా ప్రాంతాల్లో సువ్యవస్థితమైన డ్రైనేజి వ్యవస్థను (మురుగునీటి పారుదలకు అనువైన ఏర్పాట్లు) ప్రభుత్వాలు నెలకొల్పనందున పంట పొలాలతోపాటు వందలాది గ్రామాలు వరదనీటిలో మునగడమూ, తద్వారా అనేక రోగాలకు, రొష్టులకూ లక్షలాది ప్రజలు గురికావడమూ జరిగింది. పరిస్థితిలో ఇప్పటికీ మార్పులేదు. డెల్టాలో డ్రైనేజి వ్యవస్థ నిర్మాణానికి బృహత్తర పథకం అవసరం గురించి ఈ నెల 11వ తేదీన రాష్ట్ర శాసనసభలో ప్రస్తావించిన సభ్యులు విషయంలో ప్రభుత్వ నిస్సహాయతను నిశితంగా విమర్శించవలసి వచ్చింది. ఈ రోజుకి కూడా, వచ్చిన నష్టం భారీ వర్షాలవల్లనేగానీ, ఇందుకు డ్రైనేజి వ్యవస్థ లోపం ప్రధాన కారణమన్న గుర్తింపు లేకపోవడం విచారకరం. ఎందుకంటే డెల్టాలో డ్రైనేజి స్కీమును విస్తరించిన దశలో లోగడ కృష్ణా-గోదావరి జిల్లాల్లో సాగులో వున్న భూమి 10 లక్షల ఎకరాలు మాత్రమే కాగా ఇప్పుడు సాగులో వున్న పంటభూమి విస్తీర్ణం 22.5 లక్షల ఎకరాలు. అయినప్పుడు సగానికిపైగా విస్తీర్ణం పెరిగినప్పుడు ఆ మేరకు డ్రైనేజి వ్యవస్థను ఎప్పటికప్పుడు ఆధునికం చేసుకోవద్దూ? అయితే ఎస్. సంతానం అధ్యక్షతన ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం ఇప్పటికైనా డ్రైనేజి వ్యవస్థ ఆధునీకరణ సమస్యలను అధ్యయనం చేసి, నెలరోజుల్లోగా నివేదికను సమర్పించమని కోరుతూ ఒక ఉన్నతాధికార సంఘాన్ని నియమించింది. నిజానికి ఇలాంటి సంఘాల కొరత మనకు ఏనాడూ లేదు. ఎందుకంటే, డెల్టాలో డ్రైనేజి వ్యవస్థను పటిష్టం చేసి మురుగు నివారణకు, వరద బెడదను నిరోధించడానికి తగిన సూచలను లోగడనే మిత్రా కమిటీ, శ్రీరామమూర్తి కమిటీలు చేశాయి. ఇది ఇరవై ఏళ్ళనాటి చరిత్ర. అయినా రాష్ట్ర ప్రభుత్వాలకు చీమ కుట్టలేదు. ఈ రోజుకీ పెక్కు సిఫారసులు అలా కాగితాల్లో పడి మూలుగుతున్నాయి. డెల్టాలో భారీ వర్షాలు, వరదలు ఎప్పుడు వచ్చినా అంత తీవ్ర స్థాయిలో పంటలూ, గ్రామాలూ, ప్రజలూ నష్టపోవడానికి ప్రధాన కారణం - నదులకంటే, జిల్లాలలోని కాల్వలూ, పిల్లకాల్వలమురుగునీటి పథకాలు అసమగ్రంగా, అసంపూర్ణంగా పడి వుండడమే. మహానదుల గమనాలనే మళ్ళించగల ఇంజనీరింగ్ శాస్త్రం కూడా డెల్టా భూములకు, గ్రామాలకు వరద సమయంలో బెడదగా పరిణమిస్తున్న బుడమేరు, తమ్మిలేరు, గుండేరు, మున్నేరు, ఉప్పుటేరు కాల్వలకూ, వాగులకూ 'ముగుదాడు' వేయగల డ్రైనేజి వ్యవస్థను దిద్దితీర్చలేకపోయింది. అంతేగాదు, ఈ జిల్లాలలోని మురుగు

కాల్వలన్నీ కలిసేది కొల్లేరులో. అందుకే అది "ముంపు కొల్లేరుగా, కొంప కొల్లేరు"గా పేరుపొందింది. డెల్టా ప్రాంతాల్లో డ్రైనేజి వ్యవస్థను అభివృద్ధి చేసి, ఆధునికం చేయడానికి ముందు తక్షణం చేపట్టవలసిన కార్యక్రమం కొల్లేరు సమస్యకు పరిష్కారం. కొల్లేరుకు "చానలైజేషన్ స్కీము" లోగడ ఒకటి ఉండాలి. దాని అతీగతీ తెలియదు. ఎంతసేపు ఎవడికి వాడు అయిదేళ్ళ అధికారం ఎప్పుడు చెలాయిద్దామా అన్న రంధి తప్ప అయిదువేళ్ళనూ నోట్లోకి పంపే పంటభూముల యోగక్షేమాలను గురించి ఆలోచించే నాథుడు లేకపోబట్టే ప్రజలు దురవస్థల్లో గడపవలసివస్తోంది. ఇటీవల డెల్టాలో ముఖ్యమంత్రి పర్యటించినప్పుడు ఆయనా, అన్ని రాజకీయపక్షాల నాయకులూ కనీసం ఈ విషయంలోనైనా ఏకవాక్యత ప్రకటించడం సంతోషకరం. అవసరమైతే మిత్రా కమిటీ సిఫారసులకు సవరణలు చేసుకోవచ్చుననీ, అవసరాన్నిబట్టి ప్రపంచ బ్యాంకును కూడా అర్థించి డ్రైనేజీ వ్యవస్థ ఆధునీకరణను పూర్తి చేసుకోవాలనీ, వరదలప్పుడు కట్టలకు గండ్లు పడకుండా టాంక్‌బండ్స్‌పై చెట్లు నాటాలనీ, కాల్వకట్టలపైన భూముల ఆక్రమణలను తొలగించాలనీ, బలవంతంగానైనా ఈ కార్యక్రమాన్ని పూర్తి చేయాలనీ దాదాపు అన్ని పక్షాల ప్రతినిధులూ సమ్మతించడం శుభసూచన.

డెల్టాలో డ్రైనేజి వ్యవస్థ ఆధునీకరణను రెండు దశలలో పూర్తి చేయడానికి అవసరమైన నిధుల సేకరణలో ప్రభుత్వంతోపాటు లబ్దిదారులు కూడా భాగస్వాములు కావడం ధర్మం. సర్ ఆర్థర్ కాటన్ చెప్పినట్టు స్థానిక ప్రజలు కలసివచ్చిననాడు ఇరిగేషన్, డ్రైనేజీ వ్యవస్థలు నిర్ణీత కాలంలో పూర్తికావడమేగాక, పటిష్టమవుతాయి. శాశ్వత ప్రాతిపదికపై తలపెట్టే ఈ కార్యక్రమానికి అయ్యే ఖర్చుకు వెలగట్టలేమన్నాడు కాటన్. ఈ సమస్య మనకే కాదు, ప్రపంచంలోని దాదాపు అన్ని సారవంతమైన మైదాన ప్రాంతాల భూముల విషయంలోనూ ఆయా దేశాలు ఎదుర్కొంటున్నదే. నీరు వృథాగా ప్రవహిస్తూ సముద్రం పాలవుతూ మధ్యలో మానవుల ప్రాణాలను కూడా తీస్తోంది. ఈ ప్రాణ నష్టాన్ని, ఆస్తి నష్టాన్ని సాధ్యమైనంత మేరకు తగ్గించడానికి నదుల గమనాలను మళ్ళించగల వ్యవస్థల నిర్మాణం అవసరం జల ప్రవాహాన్ని అదుపుచేసుకోలేకపోతే అందుకు తగిన పథకాలకు అమలులోకి తెచ్చుకొనకపోతే నదులు తమ గతులను కూడా మార్చుకుని మరింత నష్టాన్ని ప్రజలకు తెచ్చిపెడతాయి. డాక్టర్ కె.ఎల్.రావు అన్నట్టుగా అన్ని జలవనరులనూ ఉపయోగంలోకి తెచ్చుకున్న తర్వాత కూడా గంగ, బ్రహ్మపుత్ర, మహానది, గోదావరి, కృష్ణా నదుల నీరు అగణిత పరిమాణంలో సముద్రాలపాలవుతూనే వుంటుంది. కనుకనే నీటి రెగ్యులేషన్‌కూ, వరదల సమయంలో వాటి ప్రతాపాన్ని తగ్గించి, మళ్ళించడానికీ డెల్టాలలో డ్రైనేజి వ్యవస్థలను సుస్థిరం చేయడానికీ మిసిసిపీ రివర్ కమిషన్ స్థాయిలో గంగా కమిషన్, బ్రహ్మపుత్ర కమిషన్ వెలిశాయి. అలాగే కృష్ణ, గోదావరుకు కూడా రివర్ కమిషన్స్ వుంటే డ్రైనేజ్ వ్యవస్థల ఆధునీకరణను కూడా ఆ పరిధిలోకి తెచ్చుకుని శాశ్వత ప్రతిపత్తి కల్పించవచ్చు.

గురువారం సెప్టెంబరు 14 1989

# నర్మదా ప్రాజెక్టు : నాగరిక జీవనం

ఇక్కడ చిందు సరిగా పడకముందే పాశ్చాత్య నాగరికతను అలవరచుకోడానికి జరిగిన ప్రయత్నం కొన్ని అనర్థాలకు ఎలా దారితీసిందో, పరిసరాల రక్షణ పేరిట కాలుష్య నివారణ పేరిట కొత్తగా పాశ్చాత్య దేశాల్లో తలెత్తిన పర్యావరణ రక్షణ ఉద్యమాలు, "గ్రీన్స్" పేరిట వారు సాగిస్తున్న ఆందోళనలూ ఇప్పుడు మన దేశంలో కూడా ప్రతిధ్వనిస్తున్నాయి. ఏ ప్రాజెక్టును ఎవరు తలపెట్టినా, దాని నిర్మాణంవల్ల జనజీవనానికి, పొలాలకు కలుగనున్న ఇబ్బందులను దృష్టిలో పెట్టుకుని నిర్మించాలనీ, ప్రాజెక్టువల్ల లేదా డాము నిర్మాణంవల్ల ముంపునకు గురయ్యే ప్రాంతాలకు,నిర్వాసితులు కాగల జనాభాకు సరైన పునరావాస కార్యక్రమాలు అమలు జరగాలనీ కోరడంవేరు. అసలు ప్రాజెక్టులే వద్దని వాటి నిర్మాణాన్ని ఆటంకపరుస్తూ ఉద్యమాలు లేవదీయడం వేరు! అయితే ఏ ప్రభుత్వం ఏ ప్రాజెక్టు కట్టినా, అందువల్ల కలిగే ప్రయోజనం కొలదిమంది సంపన్నులకే ఉద్దేశించినదా లేక ప్రజా బాహుళ్యానికి ఉద్దేశించినదా అని కూడా ఆలోచించవలసివస్తుంది. ఎందుకంటే నలభై మూడేళ్ళ స్వాతంత్ర్యం తరువాత ఇండియాలో ప్రబలిపోతున్న జబ్బులలో ఒకటి - ప్రాజెక్టులలో కొన్ని "రాజకీయ ప్రాజెక్టులు"గా అవతరించడమూ, ఎన్నికల ముందు మాత్రమే శంకుస్థాపనోత్సవాలకూ, ప్రారంభోత్సవాలకూ నోచుకోవడమూ! బహుశా ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకునే ప్రసిద్ధ సంఘసేవకుడు, టెంపుల్టన్ అవార్డు గ్రహీత నెల్సన్ మండేలా ఆహ్వానసంఘం సభ్యుడూ అయిన బాబా ఆంప్టే నాయకత్వాన సుప్రసిద్ధ నర్మదా ప్రాజెక్టు (సర్దార్ సరోవర్ ప్రాజెక్టు)కు ప్రతికూలంగా పెద్ద ఎత్తున కొందరు ఆందోళన ప్రారంభించారు. కాని ఆంప్టే ఎంత గొప్పవారైనా తన పరిమితులను కూడా గుర్తెరిగి వ్యవహరించవలసి ఉంటుంది. సంఘ సేవకుని ఆందోళన శ్రుతిమించి రాగాన పడకూడదు. సమస్యను రాజకీయం చేయడానికి ప్రయత్నించకూడదు. ప్రాజెక్టు నిర్మాణంలోని లోపాలను ఎత్తి చూపడం, నిర్వాసితుల పునరావాసానికి శతధా ప్రయత్నించడం, అందుకు పట్టుబట్టడంవేరు; కాని గుజరాత్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, మహారాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వమూ, ప్రపంచ బ్యాంకు ఉమ్మడిగా తలపెట్టి, "నర్మదా వ్యాలీ డెవలప్‌మెంట్ అథారిటీ"ని నెలకొల్పి ఇప్పటికే ఎంతో ఖర్చుపెట్టిన ప్రాజెక్టును మొత్తం ఉపసంహరించుకోవాలని కోరడమూ, అది జరక్కపోతే ఉద్యమిస్తామని భీష్మించడమూ వేరు. కాలుష్య నివారణ ఆందోళనకర్తలుగానీ, పర్యావరణ సంక్షేమప్రియులైన ఇకోలాజిస్టులుగానీ నేడు దేశంలో ప్రత్యామ్నాయాలు చూపకుండా జనాభా అవసరాలు తీర్చడానికి, అధికాధికంగా పడావు భూములను సాగులోకి తెచ్చుకోవడానికి (మనం సాగులోకి తెచ్చుకున్నది సాగులోకి రాగల భూమిలో 30 శాతం కూడా లేదు) చిన్నతరహా మధ్యతరహా నీటి పారుదల వనరులను ఇతోధికం చేసుకోవలసిన అవసరం ఉంది. 1990 "ప్రపంచ జనాభా నివేదిక" ప్రకారం 2030వ సంవత్సరంనాటికి

ఇండియా జనాభా చైనా జనాభాను మించిపోతుంది. 2025వ సంవత్సరంనాటికే మన జనాభా 144 కోట్లు కాగలదని, ఇది మనం ఆనాటికి పెరగగలదని అనుకున్న జనాభాకంటే 21 కోట్ల 60 లక్షలు పెచ్చు అనీ అంచనా. అందువల్ల బాబా ఆంప్టే, సుందరలాల్ బహుగుణలాంటివారు కేంద్రీకరించవలసిన దృష్టి పర్యావరణ సంక్షేమంతోపాటు ఈ జనాభా పెరుగుదలను నిరోధించడంపైన, అందుకు అవసరమైన ఉద్యమ నిర్మాణంపైనా. తానెంత గొప్పవాడైనా ఆంప్టే, ప్రధానమంత్రి తన వద్దకు కదిలి వచ్చేవరకూ సమస్యను విడిచి పెట్టేది లేదని చెప్పడం సంఘ సేవకుని హూందాతనానికి చేటు. అంతేగాదు, తన నిరసన "ప్రపంచంలో ఉన్న అన్ని పెద్ద డాములకు వ్యతిరేకంగా ఉద్దేశించినదేగాక, సైద్ధాంతిక, మానసిక దౌర్బల్యానికి కూడా నిరసనగా ఉద్దేశించినద"ని ఆంప్టే చెబుతూ పెద్ద డాముల నిర్మాణాన్ని ప్రధానమంత్రి నిలిపివేస్తూ నిర్ణయం చేసేదాకా నిద్రపోనని చెప్పడం తన సాంఘిక హోదాను దుర్వినియోగం చేయడమే తప్ప మరొకటి కాదు.

అయితే నర్మదా డామ్ నిర్మాణానికి వ్యతిరేకంగా ఆంప్టే తలపెట్టిన ఉద్యమానికి కొన్ని ఆధారాలులేకపోలేదు. 'ఓ! నర్మదానదీ! గొంతెత్తి అరువమ్మా!' అంటూ నర్మదాడామ్ నిర్మాణాన్ని తాను ఎందుకు వ్యతిరేకిస్తున్నారో తాను రాసిన వ్యాసాల, చేసిన ప్రకటన సంకలనాన్ని ఆంప్టే విడుదల చేశారు. సర్దార్ సరోవర్ ప్రాజెక్టు అనే ఈ నర్మదా ప్రాజెక్టు గుజరాత్‌కు జీవనాడి అనీ, సౌరాష్ట్ర, కచ్ ప్రాంతాల నీటి సమస్యకు శాశ్వత పరిష్కారమనీ, గుజరాత్‌లోని దుర్భిక్ష ప్రాంతాలకు, గిరిజన ప్రాంతాలకూ దప్పిక తీర్చే "ఏడుగడ" అనీ భావించారు. కాని 1980లో ప్లానింగ్ కమిషన్ అంచనాల ప్రకారం రు. 6404 కోట్ల వ్యయంతో ప్రారంభమైన ఈ ప్రాజెక్టు ఖర్చు గుజరాత్ ప్రభుత్వ అంచనాల ప్రకారం నేడు రు. 11,154 కోట్లకు చేరినందున ప్రభుత్వ బొక్కసానికి అది దుర్భరంగా పరిణమించడమేగాక ప్రాజెక్టువల్ల పొందే ప్రయోజనం కంటే జనానికి, పంటలకు నష్టం ఎక్కువ అని ఆంప్టే వర్గీయుల వాదన. ఎందుకని? నీటికొరత ఉన్న సౌరాష్ట్రలోని 69 తాలూకాల్లో 59 తాలూకాలకు అనుకొన్నట్టుగా ఈ ప్రాజెక్టునుంచి నీరు అందదు! గుజరాత్‌లోని మూడింట రెండొంతుల దుర్భిక్ష ప్రాంతాలకు నీరందదు! 47 గిరిజన తాలూకాల్లో, 42 తాలూకాలకు కూడా ఈ ప్రాజెక్టువల్ల చుక్క నీరెక్కదు! ఇక మధ్యప్రదేశ్‌లో దీనికి అండగా నర్మదపై నెలకొల్పనున్న నర్మదాసాగర్ రిజర్వాయర్‌వల్ల సాగయ్యే భూమి విస్తీర్ణంకన్నా, మునిగిపోయే భూమి విస్తీర్ణం ఎక్కువ. అందువల్ల మొత్తం ప్రాజెక్టును రద్దు చేయాలి - అదీ ఆంప్టే వర్గీయుల విచారణ. మరో మాటలో చెప్పాలంటే, నర్మద ప్రాజెక్టువల్ల హెచ్చు ప్రయోజనం గుజరాత్‌కు వనగూడుతుందనీ, కాగా మధ్యప్రదేశ్‌లో ఎక్కువ భూములకు మునక, హెచ్చు జనాభాకు నిరాశ్రయం కలుగుతుంది కాబట్టి ప్రాజెక్టును నిలిపివేయాలనీ వారి ఆందోళన. కాని, ఈ విషయమైకూడా ఆంప్టే ఉద్యమంలో అభిప్రాయ బేధాలు తలెత్తాయి. ప్రాజెక్టుకు వ్యతిరేకంగా ఉద్యమం గాకుండా, నిర్వాసితుల పునరావాసం కోసం బలమైన ఉద్యమం నడపాలని ఆంప్టే వర్గీయులలో ఒక వర్గం ముందుకొస్తోంది. నిజానికి ఈ ధోరణే సరైనదని చెప్పాలి. ఎందుకంటే - అటు దక్షిణ బీహార్‌లో ఛోటా నాగపూర్ పీఠభూమిలో నెలకొన్న ఔరంగా డామ్ ప్రాజెక్టు విషయంలో జరుగుతున్న ఆందోళన ఆంప్టే ఉద్యమానికి భిన్నంగా ఉంది. మేజర్ డామ్‌గా ప్రసిద్ధికెక్కిన ఔరంగా నదిపై వెలిసే ఈ ప్రాజెక్టు కింద నిర్వాసితులైన వేలాదిమందికి ప్రత్యామ్నాయంగా ఎలాంటి ఇబ్బంది లేకుండా పునరావాసం కల్పించాలని "విస్థాపిత సంఘం"ఒక ఉద్యమాన్ని నడిపి జయప్రదం అవుతోంది. ఈ సంఘ సభ్యులలో నూటికి 90 మంది గ్రామీణులేనని మరిచిపోరాదు. వారి ఏకైక కోర్కె - "తగిన పునరావాస సౌకర్యం".

అయితే అదే సంఘం తన ఇతర కోర్కెలను విడనాడిందా? లేదు. ప్రాజెక్టు వ్యయాన్ని పెంచవద్దనీ, ప్రయోజనానికి, వ్యయానికీ, మధ్య తీవ్ర అంతరం కూడదనీ, ధనిక రైతాంగం ప్రయోజనాలను మాత్రమే కాపాడే విధంగా ప్రాజెక్టు నిర్మాణం జరిగి తద్వారా రాజకీయ లబ్ధిపొందరాదనీ ఈ సంఘం పాలకులను హెచ్చరిస్తోంది.

ఈ హెచ్చరికను అటు ప్రభుత్వమేకాదు, ఇటు ఆంప్టే వంటి ఆందోళనకారులు కూడా సరిగా అర్థం చేసుకోవలసి ఉంది. తరతరాలుగా పేదరికం కోరల్లో చిక్కి అభివృద్ధికి నోచుకోని నర్మదా నదీలోయ ప్రాంతాల ప్రజల సంపూర్ణ పునరావాసానికి తోడ్పడ్డమే కాకుండా సరోవర్ ప్రాజెక్టు సత్ఫలితాలు వారికి కూడా న్యాయంగా అందేట్టు చూడవలసిన బాధ్యత అందరిమీద ఉంటుంది. ప్రాజెక్టు నిర్మాణానికి అడ్డువేయడంకంటే ఆంప్టే వంటి సంఘసేవకులు, పర్యావరణ పరిరక్షకులు నిరుపేద జీవితాలలో వెలుగు రేఖలు నింపడానికి సహాయం చేస్తే బాగుంటుంది.

ఆదివారం 20 మే 1990

# పంట ప్రజలది - పోరు పాలకులదా?!


జకీయ శాస్త్రంలో "బోనాపార్టిస్ట్ - డెమోక్రసీ" అనే పద్ధతి ఒకటుంది. అంటే వేరే ఏమీ లేదు - రాజుగారు కూడా తరచుగా "ప్రజాస్వామ్యం" గురించి మాట్లాడుతుంటాడట! అతని డెమోక్రసీ ప్రకారం 'ప్రజల' తరపున మాట్లాడే హక్కు అతని కొక్కడికే వుంటుంది. తాను గీసుకున్న గిరికీ, తాను తీసుకున్న దారికీ ఎవరూ అడ్డు రాకూడదు ("NO ONE CAN STAND IN THE WAY OF ME SERVING MY PEOPLE"). అదే రాచరిక దృష్టి. అదే బోనపార్టిస్ట్ - డెమోక్రసీ! నెపోలియన్ కాలంలో పుట్టిన ఈ పద్ధతి సరిహద్దులను దాటి మనల్ని కూడా ఇప్పటికీ పీడిస్తూనే ఉంది. మన రాజకీయాలను కూడా ప్రభావితం చేస్తున్నట్టుగా ఉంది. కనుకనే ఎన్నుకున్న ప్రజలను మళ్ళీ ఎన్నికల వరకూ మరచిపోయి ఒక పాలకుడు మరొక పాలకుణ్ణి "ప్రజలను నీవు మోసగిస్తున్నావ"ని అంటే, "ఆ మాట నన్నెన్నుకున్న ఆరుకోట్ల ప్రజలనే అవమానించడం"గా ఆ పాలకుడు భావిస్తున్నాడు. గోపాలకులైనా, భూపాలకులైనా ఈ 'భూమి పుత్రులే'. కాబట్టి అవేశకావేశాలు మానుకొని ఇప్పటికైనా ఆలోచనతో మెలగడం అవసరం. జనరల్ ఎన్నికలు దగ్గరపడుతున్న కొలదీ సవాళ్ళు, ఎదురు సవాళ్ళు మామూలే కావచ్చు. కానీ ఈ సవాళ్ళ మధ్య సత్యం బలికాకూడదు. ఎందుకంటే ఎన్నికలు తాత్కాలికం. ఎన్నికలను శాసించే ఆదర్శాలు, విలువలు శాశ్వతం. ప్రజల దీర్ఘకాలిక ప్రయోజనాలకు "దిక్సూచి"గా పనికి వచ్చేవి. అందుకే రాజకీయవేత్త వచ్చే ఎన్నికలలో జయాపజయాల గురించి మాత్రమే ఆలోచిస్తాడనీ, కానీ రాజనీతిజ్ఞుడు భావితరాల మంచి చెడుల గురించి దూరదృష్టితో ఆలోచిస్తాడనీ అంటారు. ఈ దృష్ట్యా ప్రధాని రాజీవ్‌గాంధీ కడప, తిరుపతి ప్రసంగాలు, ఆ వ్యాఖ్యానాలపై రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావులో వచ్చిన ప్రతిస్పందన - క్షణికోద్రేకాలకూ రాజకీయ స్వార్థ ప్రయోజనాలకూ తోడ్పడేవిగా ఉన్నాయేగాని భావితరాలకు ఆదర్శ వచనాలుగా లేవు. మునిసిపల్ పంపులవద్ద "కుండల రాద్ధాంతా"నికీ, వారి పరస్పర ఆరోపణలకూ తేడాలేకుండా పోయింది. గిరిజనులకు కేంద్రం ప్రభుత్వం అందజేస్తున్న బియ్యంలో ప్రతి గ్రాములో 20 పైసలు కాజేసి ఎన్.టి.ఆర్. "మోసం" చేస్తున్నారని రాజీవ్ అంటే, ప్రధాని ఆడినవన్నీ "అబద్దాలు, అభూత కల్పనలు, బాధ్యతారహితం అగౌరవప్రదం" అని ఎన్.టి.ఆర్. వర్ణించారు. ఇంతకూ అసలు విషయం - "అత్త సొమ్ము అల్లుడు దానం" చేసాడన్నట్టుగా పంట ప్రజలది, ఆ ఫల సాయాన్ని ప్రజలకు తిరిగి అందిచడంలో కేవలం ఏజెంట్లుగానే వ్యవహరించవలసిన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తామేదో ఉద్ధరించేస్తున్నట్టు పరస్పరం కీచులాటలకు దిగజారడం, మధ్యలో పండించిన ధాన్యరాసులకు అధిపతులైనరైతులు, కాయకష్టం చేసే వ్యవసాయ కార్మికుల "అజాపజా" తలంచక పోవడం. నాయకులు ఎంతో స్పృహతో, మెళకువతో సాగించుకుంటున్న రాజకీయ 'కపట కలహాలు' నిస్పృహలో వున్న కష్టజీవులకు పట్టవు. నిజానికి ధాన్యోత్పత్తులు అధికమైనప్పుడు ధరలు అదుపులోకి రావాలి. అలా జరిగినప్పుడు "బిచ్చం" పెట్టినట్టుగా సబ్సిడీలు ఇవ్వవలసిన అవసరం ప్రభుత్వాలకూ ఉండదు. ఈ

సత్యాన్ని మరుగుపరుస్తున్నారు. ఈ రెండింటిపైనా ప్రభుత్వాలకు కంట్రోల్ లేకనే జనం నోరు మూయించడానికి 'సబ్సిడీ'లు, వాటిని చాటుచేసుకొని రాజకీయాలూ ఆడుతున్నాయి. కాకపోతే ఏమిటి చెప్పండి? ప్రతి ఏటా లక్షల టన్నుల బియ్యం 'సెంట్రల్ పూల్‌కు (కేంద్రం నిల్వలకు) రాష్ట్రం నుంచి తీసుకుపోతూనే వున్నారు. తీరా ప్రొక్యూర్ చేసిన మొత్తంలో తిరిగి రాష్ట్రావసరాలకు కావలసిన బియ్యాన్ని అందించడానికి రాష్ట్ర బొక్కసం నుంచి కేంద్రం వసూలు చేసుకుపోతున్న ధర ఒకటి, గిరిజనులకు అదే బియ్యాన్ని అందిండానికి రాష్ట్ర ప్రభుత్వాన్ని శాసిస్తున్న ధర వేరొకటీ. 'ముతకబియ్యం' కాబట్టి సబ్సిడీ భరించి కె.జి. రెండు రూపాయలకు రాష్ట్ర ప్రభుత్వం నాణ్యమైన బియ్యాన్ని గిరిజనులకు అందిస్తుంటే - కాదు, ముతక బియ్యాన్నే ఇవ్వాలనడం సబబుకాదు. అందుకే ఎన్.టి.ఆర్. "గిరిజనులు రాజీవ్ బియ్యం ఉచితంగా ఇచ్చినా తీసుకోర"నడంలో వ్యంగ్యార్థం! కె.జి.కి మూడు రూపాయలుచొప్పున రాష్ట్రంనుండి వసూలు చేసి, తిరిగి బియ్యం సప్లై చేస్తున్న కేంద్రం ప్రత్యేక సబ్సిడీ ప్రకటించి, అదే కె.జి. బియ్యాన్ని మొదటినుండి రూ. 1.80కి అమ్మించవచ్చు కదా? కానీ అలా చేస్తే 'రాజకీయం' కుదరదు. సరాసరి పంచాయితీలకే సరఫరా చేస్తేగానీ కె.జి. రెండు రూపాయల బియ్యానికి "రామయ్య" ముద్ర మాదిరిగా కె.జి. రూపాయిన్నర బియ్యానికి "రాజయ్య" ముద్ర పడదు! వెనుక పి.యల్. 480 పథకం క్రింద అమెరికా భారతదేశానికి సరఫరా చేసిన ప్రతి బియ్యం బస్తాపైన తన 'ధర్మ ముద్ర' వేసుకొని భారత ప్రజల ఆత్మగౌరవాన్ని అవమానపరచింది. గాయపరచింది. "అన్నం పరబ్రహ్మం" కాబట్టి అవమానం జీర్ణమైపోయింది. అదే పద్ధతిలో ఇప్పుడు జనం డబ్బుమీద, జనం పండించిన ధాన్యం పైనా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ, సబ్సిడీల పేరిటా, గిరిజనుల పేరిటా జూదమాడుతున్నాయి. గత నాలుగేళ్లలో రెండుసార్లు కేంద్రం ఫుడ్ కార్పోరేషన్ బియ్యం పంపిణీ ధరను పెంచి, అతి నాణ్యం, నాణ్యం, ముతక రకం పేరిట బియ్యం రేటును తారుమారు చేసింది. రాష్ట్ర ప్రభుత్వం గిరిజనులకు సబ్సిడీని భరించి, అంటే ఆ మేరకు ఇతర ప్రజా కార్యక్రమాలను పస్తులు పెట్టి ముతక రకం కాకుండా నాణ్యమైన బియ్యాన్ని కె.జి. రెండు రూపాయలకు అందజేస్తోంది. ఈ సౌకర్యం పొందుతున్న కోటి 20 లక్షల జనాభాలో 142 మండలాలలో 27 లక్షల మంది గిరిజనులు కూడా ఉన్నారు. ఇదంతా - మిగతా పథకాలను పక్కనపెట్టి రాష్ట్ర బొక్కసానికి ఇబ్బంది ఏర్పడినాసరే, ఎన్.టి.ఆర్. ప్రభుత్వం పేదలకోసం పట్టుదలతో చేస్తున్న కనీస పని. అయినా సబ్సిడీలను నాన్ - కాంగ్రెస్ ప్రభుత్వాలు వచ్చిన తరువాత ఎత్తివేయడానికి జరిగిన ప్రయత్నం కూడా మరచిపోరానిది. అయితే ఎన్నికలు దగ్గర పడుతున్నందున పరిపాలనా యంత్రాంగం నిలువునా రెండుగా చీలినా సరే - ఎవరికి వారుగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు రెండు వ్యవస్థలను సృష్టించి పోటీ ప్రభుత్వాలుగా రెండు దుకాణాలను తెరుచుకు కూర్చున్నాయి. ఇది పరిపాలన కాదు. ప్రజలను అవమానించడం. రాష్ట్ర బొక్కసానికి నష్టం వస్తున్న స్కీములను రాష్ట్ర ప్రభుత్వం వదులుకోదు. రాష్ట్రంలో ప్రజా పంపిణీ వ్యవస్థ సజావుగా అమలు జరుగుతోందని కేంద్ర పౌర సరఫరాల మంత్రి ప్రశంసించినా, లేదా ఇందిరాగాంధీ '20 సూత్రాల కార్యక్రమం' అమలు జరపడంలో ఆంధ్రప్రదేశ్ రెండవ స్థానంలో (మొదటిది సిక్కిం) ఉందని కేంద్ర కార్యక్రమాల నిర్వహణా మంత్రిత్వశాఖ స్వయంగా కితాబు ఇచ్చినా కేంద్ర ప్రభుత్వం వినే స్థితిలో లేదు. "మూగా చెవిటివారి ముచ్చట"గా ఈ పనులు తయారయి కూర్చున్నాయి. ప్రజాస్వామ్యంలో 'పాప్యులిస్టు' పథకాలు మెడకు గుదిబండలుగా మారినా, తప్పవు. ఈ పాప్యులిజమే నాయకులకు 'రాజకీయం'గా వున్నంతకాలం ఈ తగాదాలూ తప్పవు! అయినా ప్రజల సొమ్ము తిరిగి ప్రజలకే పెట్టడానికి ఈ "గుంపు చింపులు" దేనికి? ఇన్ని బింకాలు ధర్మాలూ ఎందుకూ? "అతడు మాయోద్యోగి, ఇతడు ఉపాయోద్యోగి" అన్న తెలుగు చాటువులో ఎంత నిజముందో!!

ఆదివారం 18 జూన్ 1989

# సహాయ కార్యక్రమాలు: శాశ్వత పథకాలు

ఆంధ్రప్రదేశ్ పరిస్థితి రాను రాను "వానకంటే ముందు వరదవచ్చి" పడినట్టు అయింది. గత ఇరవై ఏళ్ళలో ఆరుసార్లుగా (ఈ ఏడాది మేలో తుఫాను సహా) రాష్ట్రాన్ని ముప్పిరగొన్న తుఫానులు, పెనుతుఫానులు, పెను ఉప్పెనలూ రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను అస్తవ్యస్తం చేసి వదిలాయి. ఈసారి వేసవికాలం పట్టుమని పదిరోజులు కూడా లేదు. "రోహిణిలో రాళ్ళు పగల"లేదు. సరికదా మండు వేసవిలోనే అకాలంగా వచ్చిన పెను తుఫాను, భారీవర్షాలు, పెనుగాలుల ఫలితంగా కోస్తా అంతటా వ్యవసాయం, వ్యవసాయాధార పరిశ్రమలు, ఇళ్ళు, వాకిళ్ళు, వాణిజ్య పంటలు దెబ్బతిన్నాయి. ఈ బీభత్సం నుంచి రాష్ట్రం ఇంకా తేరుకోకముందే, నైరుతి రుతుపవనాలు వచ్చిపడ్డాయి. జూన్-సెప్టెంబర్‌ల మధ్య కేవలం వంద రోజుల వ్యవధిలో పడే మొత్తం వర్షపాతంలో 85 శాతం దేశ వ్యాప్తంగా సర్దుకుంటుంది. ఎంత లేదనుకొన్నా మే నెలలో పెనుతుపానువల్ల రాష్ట్రానికి వాటిల్లిన నష్టం రు. 1000 కోట్లకు పైబడే ఉంటుంది కాని తగ్గదని అధికార, అనధికార అంచనాలు ధృవపరుస్తున్నాయి. 800 మదికి పైబడిన ప్రాణనష్టం, సుమారు 14 లక్షల ఎకరాలలో పంట నష్టం, సుమారు 400 మండలాలలో 5,200కు పైగా గ్రామాలకు ఏర్పడిన నష్టం, ఆరుకోట్ల ఎజనాభాలో దాదాపు సగం మంది ప్రజలకు కలిగిన ఇబ్బందుల దృష్ట్యా రాష్ట్రానికి ఏర్పడిన మొత్తం నష్టం విశ్వరూపం అర్థమైపోయింది. ఈ నష్టాన్ని భర్తీ చేయడం ఏ ఒక్కరివల్లనో సాధ్యపడదు; కనుకనే దీనిని "జాతీయ నష్టంగా" రాష్ట్ర ప్రభుత్వమే కాదు, నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం, ప్రధానమంత్రి వి.పి.సింగ్ కూడా గుర్తించవలసి వచ్చింది; ప్రపంచ బ్యాంకు నిపుణుల బృందం కదిలి రావలసి వచ్చింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సహాయానికి కూడా అతీతమైన "ఉపద్రవం"గా పరిణమించిన ఈ బీభత్సానికి పరిష్కారమార్గం వెదకవలసిన అవసరం ఏర్పడింది. ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి అమెరికా బృందాన్ని ఇక్కడ కలుసుకోవడమేగాక, తన అమెరికా పర్యటనలో బ్యాంకు ఉన్నతాధికారులతో సంప్రదించి, దాదాపుగా నిత్య తుపాను పీడిత ప్రాంతంగానే స్థిరపడిపోయిన ఆంధ్రప్రదేశ్‌లో తాత్కాలిక ప్రాతిపదికపైగాక శాశ్వత ప్రాతిపదికపైనే సహాయక కార్యక్రమాలు చేపడట్టడానికి తగిన నిధులను రాబట్టడానికి ప్రయత్నించనున్నారని అధికార ప్రకటనలో తెలిపారు. నైరుతి రుతుపవనాలు కూడా ప్రారంభమైనందున, "మే" నెల కల్లోల పరిస్థితి తట్టుకోడానికి అటు ప్రభుత్వమూ, ఇటు స్వచ్ఛంద సంస్థలూ తుపాను బాధిత ప్రాంతాల్లో ప్రారంభించి, ముమ్మరం చేసిన సహాయక కార్యక్రమాలకు తరచుగా అంతరాయం కలిగే ప్రమాదం లేకపోలేదు. జరిగిన నష్టంతో పోల్చితే, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అందజేసే సహాయం "సముద్రంలో నీటి బొట్టు" మాత్రమే. ప్రజలలో కూడా నిజాయితీ చచ్చిపోయింది. దారిద్ర్యంవల్ల

కొంత, ఆబలవల్ల కొంత, రాజకీయ రంగంలో నిత్యం గమనిస్తున్న అవినీతివల్ల ఇంకొంత - ఈ నిజాయితీ కునారిల్లిపోయింది. ఫలితంగా సహాయం పొందవలసిన వారి సంఖ్యంటే అవసరంతో నిమిత్తంలేకుండా ఎగబడేవారి సంఖ్య ఎక్కువయింది. విజయవాడ, మచిలీపట్నం, గుంటూరు తదితర ప్రాంతాలలో గత కొన్ని రోజులుగా సాగుతున్న తతంగం ఇదే! ఈ బీభత్స సమయంలో రాజకీయాలకు అతీతంగా అన్ని రాజకీయ పక్షాలూ ఏకవాక్యతతో నడుంకట్టి ముందడుగు వేసి కార్డుల స్థాయిలో స్థానికంగా ఎక్కడిక్కడ జాగరూకులై తమ ప్రభావంతో ప్రజలకు క్రమశిక్షణతో సమీకరించి సహాయ పడకపోతే - ఆ నష్టం రాష్ట్రానిదీ, అందరిదీ. అలాగే సహాయక కార్యక్రమాల నిర్వహణలో పబ్లిక్ వర్క్స్, నీటిపారుల, భవనాలు, రహదారుల శాఖ, పౌరసరఫరాల శాఖల మధ్య అపూర్వమైన సమన్వయం ఉంటే తప్ప ఈ ఉపద్రవాన్ని గడచి గట్టెక్కలేదు. రేషన్ కార్డుల విషయంలోనే కాదు, సబ్సిడీ బియ్యాన్ని కూడా దొంగచాటుగా దోచుకుని లాభించే వాళ్లున్న రాష్ట్రంలోసహాయ కార్యక్రమాలపై అనుక్షణం నిఘావేసి ఉంచవలసిన ప్రత్యేక బృందం అవసరం. నోరు మంచిదైతే, ఊరు మంచిదవుతుందన్నట్టుగా ఇంట్లో అవినీతికరమైన "ఈగలమోత"ను కట్టిపెట్టనిదే, ప్రపంచ బ్యాంకులాంటి అంతర్జాతీయ సంస్థలు ఎన్ని వందల కోట్లు అప్పు ఇచ్చినా అది "బయటి పల్లకీ మోత"గానే ముగియవలసి వస్తుంది! అయినా బ్యాంకు బృందం సభ్యులు వైనార్డ్‌గానీ, బాక్సటర్‌గానీ "ప్రభుత్వం బాగానే కార్యక్రమాలు నిర్వహిస్తోంద"ని మెచ్చుకొన్నప్పటికీ కితాబుకు తగినట్టుగా, ఏ మేరకు వారు ఆంధ్రప్రదేశ్‌కు సహాయం అందించగలరో చెప్పడానికి మాత్రం నిరాకరించారు. తగిన సాయం రాగలదని మనమూ ఆశించడం తప్ప చేయగల్గింది లేదు. ఈ పరిస్థితులలో మానవ సంపదను రంగంలోకి ఉరికించడం తక్షణ కర్తవ్యం.

తుఫాను పీడిత ప్రాంతాలలో, లేదా భారీవర్షాలవల్ల వరద బీభత్సానికి లోనయ్యే ప్రాంతాలలో శాశ్వత సహాయక చర్యలను తలపెట్టాలన్న ఆలోచన కొత్తదికాదు. ఎద్దడి వచ్చినప్పుడు మాత్రమే మేలుకొనే మనకు ఆ ఆలోచన ఒక తాత్కాలిక ఊరడింపుగా మాత్రమే పనికివస్తోంది. ఆచరణ పూజ్యం. సుమారు గత ముప్ఫయ్యేళ్లుగా ఈ వాగ్దానాలను కోస్తా ప్రజలు వింటున్నారు. కాని పనులు జరగడంలేదు. పెన్నానుంచి పెన్నంగ దాకా రాష్ట్రంలో మురుగునీటి పారుదల వ్యవస్థ (డ్రైనేజీ సిస్టమ్) దెబ్బతినిపోయి వుంది. 1960ల నుంచి 1990 దాకా రాష్ట్రాన్ని ఏలిన ఏ రాజకీయ పక్షమూ ఈ వ్యవస్థపట్ల శ్రద్ధ వహించలేదు. దాని ఫలితం రాష్ట్రానికేగాంక యావద్భారతానికే ప్రధాన ధాన్యాగారాలలో ఒకటిగా ఉంటున్న కోస్తా ప్రాంతం బాగా నష్టపోతూ వచ్చింది. 1969లో, 1977లో, 1984లో, 1986లో, 1988-1989లో, 1990 మేలో వచ్చిన తుపానులు వరదలూ మన ప్రభుత్వాల కళ్లు తెరవలేకపోతున్నాయి. డెల్టా డ్రైనేజీ వ్యవస్థను పటిష్ఠం చేయవలసిన అవరాన్ని చెన్నారెడ్డి గుర్తించారు. అయినా మిత్రా కమిటీ, శ్రీ రామకృష్ణయ్య కమిటీలు కృష్ణ, గోదావరి, పెన్నా డెల్టాల్లో డ్రైనేజీ వ్యవస్థను మెరుగుపరచడానికి శాశ్వత ప్రాతిపదికపై సిఫారసు చేసిన ప్రతిపాదనలు ఏళ్లూ పూళ్లుగా మురిగిపోతున్నాయి!

ఈ అలసత్వం ఫలితంగా ప్రతి సంవత్సరమూ ఎంతో నష్టానికి గురవుతున్నాం. 130 సంవత్సరాలనాడు సర్ ఆర్థర్ కాటన్ రూపొందించిన డెల్టా వ్యవస్థను అనుభవిస్తున్నామేగాని, ఆ వ్యవస్థ బలపడడానికి, తద్వారా సవ్యమైన డ్రైనేజీ వ్యవస్థను రూపుదిద్దడానికి గానీ మనం ప్రయత్నించలేదు. కాటన్ అభివర్ణించిన "స్వర్ణద్రవం" (నీటిని ఆయన ద్రవరూపంలో ఉన్న బంగారం అన్నాడు మనిషే బంగారం అన్నట్టుగా) కోస్తా

## ఎబికె సంపాదకీయాలు

అక్కరకు రాకుండా పోతోంది. తగినన్ని రిజర్వాయర్లు నిర్మించుకోనందున ఎంతో నీరు వరదల సమయంలో వృధాగా సముద్రం పాలవుతోంది. ఉదాహరణకు ధవళేశ్వరానికి ఎగువన ఇచ్చంపల్లి, పోలవరం లాంటి ప్రాజెక్టులు ఉంటే, వరదల మూలంగా వృధాఅయ్యే 1500 శతకోటి ఘనపుటడుగుల నీరు ఆదా కావడమేగాక, మరి కోటి ఎకరాలకు అదనంగా నీరు అందడమేగాక, 500 మెగవాట్ల విద్యుత్ లభిస్తుంది. కాని శాశ్వత ప్రాతిపదికపై ఈ పనులు చేయనందున 1986 వరదల్లో రోజుకు 35 లక్షల క్యూసెక్కుల నీరు సముద్రం పాలయిందని మరువరాదు! ఇది మానవుని నిర్లక్ష్యం, ప్రభుత్వాల ఆలసత్వం తప్ప మరొకటి కాదు. డెల్టా వ్యవస్థను ఆధునీకరించకుండా, పూడికలు తీయకుండా, మేజర్ డాములు బాగు చేతల పేరిట ఎకరానికి రు. 15-30లు మాత్రం వసూలు చేయడంలో ఎంతో 'శ్రద్ధ' చూపారు పాలకులు!

మంగళవారం 29 మే 1990

# సహాయ కార్యక్రమాలు: శాశ్వత పథకాలు :2:

కేవలం వాతావరణ మార్పులనే నిందించుకుని లాభంలేదు. హిమానీ యుగాలు (ఐస్ ఏజెస్) కడచివచ్చిన మానవుడికి మహానదుల గమనాన్ని మళ్ళించి కరకట్టలు, ఆనకట్టలు, జలాశయాలు, సేద్యపు నీటి పారుదల వనరుల వంటి మహానిర్మాణాలు జయప్రదంగా చేసుకున్నాడు. కనుకనే దక్షిణ భారతంలో ప్రధాన జలవ్యవస్థలకు ముఖద్వారంగా భాసిల్లిన తూర్పు కోస్తా కేంద్రంగా సర్ ఆర్థర్‌కాటన్ మహనీయుడు ప్రాచీన భారతీయ జలవ్యవస్థలను పునరుద్ధరించడమే గాదు, ఆధునీకరించి 130 ఏళ్ళనాడే మద్రాసు ప్రెసెడెన్సీలోని కావేరి, కొలెరూన్, కృష్ణ, గోదావరి నదీ వ్యవస్థలను సద్వినియోగంలోకి తెచ్చాడు. బీడువారి, కరవు కాటకాలకు, వరద బీభత్సాలకు, ఉప్పెనలకు ఆలవాలమైన అనేక ప్రాంతాలను సస్యశ్యామలం చేసి, మోడువారిన ప్రజల జీవితాలలో ఆశలను మోసులెత్తించేందుకు చేసిన పని - డెల్టా ప్రాంతాల్లో లక్షలాది ఎకరాలను సేద్యంయోగ్యం చేస్తూ ఆనకట్టలు నిర్మించడమే గాదు, వరదనీటిని వృథా పోనివ్వకుండా ఆనాటికి ఉన్నంతలో మురుగునీటి పారుదలకు కూడా కొన్ని ఏర్పాట్లు చేసినవాడు కాటన్. భారీ వర్షాలు కురిసినంత మాత్రాన అంతా 'సుభిక్షం' అనుకోరాదని గుర్తించి, ఆ నీరు వృథాగా సముద్రం పాలు కాకుండా ఆదా చేసుకోగల రిజర్వాయర్లు, చెరువుల నిర్మాణం అవసరాన్ని గుర్తించిన తొలి ఇంజనీర్. ఆనీటిని సక్రమంగా పొదుపుచేసి, పంపిణీ చేసుకొనకపోతే ఎన్ని భారీ వర్షాలు కురిసినా కరువు తీరకపోగా, అది పంటలకు, ప్రాణాలకూ ఎంత నష్టదాయకమో గుర్తుచేసిన వాడు కాటన్. అందువల్ల మన ప్రభుత్వాలకు కావలసింది - మనస్సుపెట్టి పని చేయడం. ఆ మనస్సు లేకపోతే రేపు ప్రపంచ బ్యాంక్ ఇచ్చే ఋణం కూడా వృథా అవుతుంది. శాశ్వత పథకాలకు రెండువేల కోట్ల రూపాయలు అవసరమైనప్పుడు అందుకు తగిన విధంగా కార్యాచరణ ప్రణాళికను, ప్రాధాన్యతలు ఆధారంగా వెంటనే సిద్ధపరచుకోవాలి. ప్రపంచ బ్యాంకు బృందానికి రాష్ట్ర ప్రభుత్వం సమర్పించిన "పత్రం" (నోట్)లో కోస్తాలో మొత్తం 10 లక్షల 6వేల హెక్టార్లలోని ఆయకట్టు అవసరాలను ఈడేర్చగల కృష్ణ, గోదావరి, పెన్నా డెల్టా డ్రైనేజీ వ్యవస్థ ఆధునీకరణ గురించి పేర్కొన్నారు. మురుగునీటి పారుదల సౌకర్యాలను మెరుగుపరచగల ఈ బృహత్ వ్యవస్థలో 1675 కిలోమీటర్ల నిడివైన పెద్ద మురుగుకాల్వలు, 1725 కిలోమీటర్ల నిడివైన మైనర్ డ్రైన్స్ ఉన్నాయి. అయితే అసలు సమస్య - డెల్టాలో ఇంతవరకూ డ్రైనేజీ వ్యవస్థను ఆధునీకరిచంక పోవడం. నేడున్న కెనాల్ సిస్టమ్ నూట ముప్పయ్యేళ్ళ నాటిది. సరైన బాగుచేతలు లేవు, చిన్న వర్షానికే కొట్టుకుపోయే రోడ్లపైన కళ్ళతుడుపుగా 'తారు' పోసిపోయినట్టే, ఈ డ్రైనేజీ వ్యవస్థనూ అప్పుడప్పుడూ "మాట్లు" వేయడంతప్ప పకడ్బందీగా పునర్వ్యవస్థీకరించలేదు. ఫలితంగా పెనుతుపానుల్లోనూ, భారీ

వర్షాలు, వరదలు వచ్చినప్పుడూ, కాల్వలు, పిల్ల కాల్వలతో కూడిన మురుగునీటి పారుదల వనరులన్నీ గండ్లుపడి, పంట పొలాలను ముంచెత్తి అపారమైన నష్టం కలిగిస్తున్నాయి. కృష్ణ, గోదావరి డెల్టాలోనేగాక, శారదా నదికి వరదవచ్చిన ఫలితంగా ఆ నదీ వ్యవస్థలో భాగంగా ఉన్న అనేక కాల్వలకు గండ్లుపడి యేలేరు కాల్వ ప్రాజెక్టు నిర్మాణానికి అంతరాయం ఏర్పడింది.

అలాగే శ్రీకాకుళం జిల్లాలోని నాగావళి కరకట్టల నిర్మాణం విషయంలో కూడా. అలాగే పెక్కు కాల్వలకు కట్టలు పకడ్బందీగా లేవు; శాశ్వతమైన డ్రైన్స్ నిర్మాణం లేదు. ఫలితంగా మురుగునీరు పారుతదలకు మధ్యలో అనేక అవాంతరాలు ఏర్పడుతున్నాయి; కాల్వ కట్టలకు సిమెంట్ లైనింగ్ లేనందున పక్కల నుంచి వరదనీరు కోసుకుపోయి ప్రళయం సృష్టిస్తోంది; చివరికి కొన్ని చోట్ల కాల్వలకు ఉన్న షట్టర్లను కూడా బాగుచేసుకోడంలేదు. ఈ పనులను శాశ్వత ప్రాతిపదికపైన, నిరంతర జాగరూకతతో నిర్వహించుకొన్నప్పుడు, భారీ వర్షాలు, వరదల సమయంలో వొడ్డులు ఒరుసుకొని పారే అదనపు జలరాశిని సముద్రంలోకి వదలడం కూడా తేలికవుతుంది. నిజానికి ఈ ప్రధానమైన బాగుచేతలను ఇంతకాలంగా వాయిదాలు వేస్తూ వచ్చింది డబ్బు కొరతవల్ల కాదు, "వ్యవధి చాలక" అని కొందరు వాదించడం బాధ్యతల ఎగవేతగా పేర్కొనవలసి వస్తుంది.

ప్రతిఏటా కాల్వలను ఏప్రిల్‌లో మూసి జూన్ ఆఖరిలో తెరుస్తారు. మాసం రోజుల వ్యవధి చాలీచాలనిది, కనుక స్వల్పమైన రిపేర్లు మాత్రమే సాధ్యమన్న వాదన కూడా పసలేనిది. ఎందుకంటే ప్రజా ప్రతినిధులు, రైతులు కూడా ఎద్దడి వచ్చినప్పుడు మాత్రమే గాకుండా మూడు వందల అరవైఐదు రోజులూ ప్రభుత్వంమీద వత్తిడి తెస్తుంటే తప్ప ఈశాశ్వత పథకాలు అమలులోకి రావు. అలాగే డ్రైనేజీ వ్యవస్థను మెరుగుపరచడానికి అయ్యే ఖర్చు విషయంలో కూడా రైతాంగం ప్రభుత్వానికి సహకరించాలి. ప్రతి ఐదేళ్ళపంటలో ఒక ఏడాది పంటను వదులు కోడానికి రైతు సిద్ధపడితే ఈ బాగుచేతలను నిర్వహించుకోవచ్చు; అర్థిక వ్యవస్థ ఎక్కువగా ఋణాలపాలు కాకుండా ఉండాలంటే రైతులు కూడా ఈ కనీస బరువు మోయక తప్పదు. అయితే అవినీతికరవ్యవస్థలోనిధుల వినియోగంపై నిఘా అవసరమని రైతాంగం పెడుతున్న షరతు. రెండు, మూడు పంటలు తీస్తున్న కోస్తా రైతుకు, 1924 నాటికే సంపన్న ప్రాంతంగా రాయల్ కమిషన్ ప్రకటించిన కోస్తా ప్రాంతానికి; పంజాబ్ కంటే ఏ మాత్రం అధికోత్పత్తిలో తీసిపోని కోస్తా రైతాంగానికి ఈ బాగుచేతల విషయంలో శాశ్వతమైన డ్రైనేజీ పథకాల ఆధునీకరణ వ్యయాన్ని కొంత భరించడం ఇబ్బందికరం కాకపోవచ్చు. కడచిన కొన్నేండ్లుగా భారీవర్షాలవల్ల, వరదలవల్ల ముంపు ఫలితంగా ప్రస్తుతపు డ్రైనేజీ వ్యవస్థ నిరుపయోగంగా మారిపోయింది. పంటలకు అపారమైన నష్టం కలగజేస్తోంది. పైగా అధిక దిగుబడికి ఉద్దేశించిన వంగడాలవల్ల వచ్చే పంట పట్టుమని వారం రోజులు కూడా ముంపును తట్టుకుని నిలబడలేకపోతోంది. ఫలితంగా డెల్టాలో ఈసారి వరదలవల్ల డ్రైనేజీవ్యవస్థ కుప్పకూలినందువల్ల వచ్చిన నష్టమే రు. 80 కోట్లు అని అంచనా కనుక ఇప్పటికైనా మిత్రా కమిటీ, రామకృష్ణయ్య నివేదికలలోని సిఫారుసులు ఆధారంగా డ్రైనేజీ వ్యవస్థను పటిష్టం చేయడానికి ప్రభుత్వం నడుంకట్టాలి. రైతాంగం సహకరించాలి. బహుశా ఇలాంటి శాశ్వత పథకాల అవసరం ఉంది కనుకనే దూరదృష్టితో కాటన్‌తోపాటు ఇటీవలికాలంలో డాక్టర్ కె.ఎల్.రావు కూడా "గంగ - కావేరి" అనుసంధానానికి రూపకల్పన చేశారు. వరదల

## ఎబికె సంపాదకీయాలు

నుంచి, కరవు కాటకాల నుంచి రక్షణకూ, మురుగునీటి పారుదల వనరుల పటిష్టతకూ ఈ బృహన్నిర్మాణం శ్రీ రామరక్ష. ఇంతమాత్రాన మొత్తం జలరాశిని సముద్రం పాలు కాకుండా ఆపగలమా అంటే అది వేరే విషయం. కె.ఎల్.రావు అన్నట్టు "వినియోగంలోకి తెచ్చుకొనగల జలరాశి నంతనూ అనేక కరువు ప్రాంతాలున్న మన దేశం ఇలా జలరాశిని అనేక కరువు ప్రాంతాలున్న మన దేశం ఇలా జలరాశిని వృధా పుచ్చుకోలేదు కనుకనే "గంగ - కావేది" పథకం అవసరమని అన్నాడాయన. అంతేగాదు, మనకు అపారమైన జలరాశి ఉందిగానీ, దీని పంపిణీ అసమంగా, అసమజసంగా ఉందన్నాడు. పంపిణీ వ్యవస్థ సరిగానిదే వంటసిరి నృత్యం కూడా రక్తికట్టదు! శాశ్వతమైన షెల్టర్ల నిర్మాణం, తీరంవెంట గాలుల ఉధృతిని అటకాయించే సరుగుడు చెట్ల పెంపకం ఒక ఎత్తు. ఈ డ్రైనేజీ వ్యవస్థ ఆధునీకరణ మరో ఎత్తు.

బుధవారం, 30 మే 1990

# "గోదావరి" కొలిమి!

భారతదేశంలో సర్వ సమగ్రమైన భారీ ఉక్కు కర్మాగారాలలో ఆరవదిగా, దేశంలోకెల్లా సముద్రతీర ప్రాంతంలో నెలకొల్పిన తొలి కర్మాగారంగా విశాఖపట్నం ఉక్కు ఫ్యాక్టరీ మొట్టమొదటి కొలిమి ("గోదావరి") బుధవారంనాడు జయప్రదంగా ప్రజ్వరిల్లడంతో - భారత ఉక్కు పరిశ్రమాభివృద్ధి చరిత్రలో మరొక అధ్యాయం ప్రారంభమైంది. వర్ధమాన దేశాలు పారిశ్రామికంగానూ, వ్యావసాయికంగానూ, పెరుగుతున్న జనాభా అవసరాలను తీర్చడానికి శరవేగాన సాధించదలచిన స్వయం పోషక ఆర్థిక వ్యవస్థలకు ఆయువుపట్టుగా ఉక్కు పరిశ్రమ అవతరించింది. సుమారు ఇరవయ్యేళ్ళనాడు "విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు" అన్న ప్రాంతీయాభిమానంతో ప్రజలు ఉద్యమించినప్పుడు దానినొక రాజకీయ ప్రాజెక్టుగా ఆనాటి పాలకులు పరిగణించి నాటికి "పైలాన్" స్థాపనతో సరిపెట్టుకున్నప్పటికీ, నేటికది మహా కర్మాగారంగా అవతరించడం తెలుగువారికే కాదు, యావద్భారతానికే గర్వకారణంగా చెప్పి తీరాలి. భిలాయ్ ఉక్కు, రూర్కెలా, దుర్గాపూర్, బొకారో, "ఇస్కో" ఉక్కు ఎలా ప్రాంతీయం కాదో, మన "విశాఖ ఉక్కు" కూడా ప్రాంతాయం కాదు. అది జాతీయ లోహం 'మే' నెల మొదటివారంలో జాతికి అంకితం కాబోతున్న విశిష్ట లోహం! ఈ కర్మాగార సాధనకోసం నడిచిన "ఉక్కు ఉద్యమం"లో డజన్ల కొలది యువకులు ప్రాణాలు బలిపెట్టుకున్న ఫలితంగా, ఆ రక్తతర్పణకు పరాకాష్టగా వెలసిన ఆశాజ్యోతి - విశాఖ లోహం! కర్మాగారం రెండు దశల నిర్మాణ వ్యయం రూ. 5000 కోట్లకు మించదనుకున్న "విశాఖ స్టీల్' తొలిదశకే రూ. 5000 కోట్లు చాలీచాలని స్థితిలో, రెండవ దశ పూర్తి కావడానికి ఎలా లేదన్నా సుమారు మరో రూ. 5000 కోట్లు అయినా కావచ్చు. రెండవ దశ కూడా పూర్తి కాగానే ఏడాదికి ముక్కు ఉక్కు 30 లక్షల టన్నులనూ, అమ్మకాలకు ఉద్దేశించినన ఉక్కు 20 లక్షల 65 వేల టన్నులను ఉత్పత్తిచేసే ఈ కర్మాగారం తొలిదశలో అంటుకున్న భారీ కొలిమి (బ్లాస్ట్ ఫర్నేస్) రోజుకు 4,860 టన్నుల చొప్పున హాట్ మెటల్‌ను ఉత్పత్తి చేస్తుంది. రోజుకు 12,500 టన్నుల ముడిసరుకు పడుతుంది. ఇండో - సోవియెట్ సహకార ఒప్పందంలో భాగంగా ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో నిర్మించిన ఈ కర్మాగారం సముద్ర తీరంలో నెలకొన్నా నీటికొరతతోపాటు విద్యుచ్ఛక్తి కొరతను, కొన్ని ప్రధానమైన ముడిసరుకుల సరఫరాలో కూడా ఎదురయ్యే అవాంతరాలనూ తొలగించుకోవలసి ఉంది. "ఆక్సిజన్ ఫర్నేస్" టెక్నిక్‌తో సంప్రదాయ సిద్ధంగా నడిచే బ్లాస్ట్ ఫర్నేస్ ఆధారంగా పనిచేసే ఉక్కు కర్మాగాలకు విధిగా అవసరమైన ముడిసరుకు కోకింగ్ కోల్, కాకిరాయి. కేవలం బ్లాస్ట్ ఫర్నేస్‌కు మాత్రమే వినియోగించే ఫర్నేస్ గ్రేడ్ సున్నపురాయి, ఉక్కు తయారీకి అవసరమైన సున్నపురాయి. అయితే బేసిక్ ఆక్సిజన్ ఫర్నేస్‌లకు "సిలికా" పదార్థం హెచ్చుపాళ్ళలో ఉన్న ఖనిజం ఉక్కు తయారీలో పనికిరాదు. అందువల్ల "సిలికా" తక్కువ పాళ్ళలో ఉన్న ముడిపదార్థం

కోసం అన్వేషణ చేసుకోవాల్సి ఉంటుంది. అయితే ప్రస్తుతానికి తక్కువ పరిమాణంలోనే అయినప్పటికీ మేలురకమైన ఫర్నేస్ గ్రేడ్ సున్నపురాయి విశాఖ కర్మాగారం అవసరాలకు సరిపడా బైలదిలాలో లభిస్తోంది. "డోలమైట్" ముడి ఖనిజం జగ్గయ్యపేట, ఖమ్మంవద్ద లభిస్తోంది. అయినా కర్మాగారానికి అవసరమైన మొత్తం కోకింగ్ కోల్‌లో 15 శాతం ఉక్కు తయారీలో ఉపయోగించే గ్రేడ్ లైమ్‌స్టోన్ కావాలి. దీనిని విదేశాల నుంచే దిగుమతి చేసుకోవలసి ఉంటుంది. ఇప్పటికే మన కాకిరాయి నిధులను జపాన్‌కూ, విశాఖ బాక్సయిట్ నిధులను చాలావరకు రష్యాకూ ఎగుమతి చేసుకుని కూర్చున్నాం. భారత ఉక్కు పరిశ్రమ సాంకేతిక రంగంలో ఇటీవల సాధించిన కొన్ని ఘన విజయాలలో ఒకటి "స్పాంజి ఐరన్" సృష్టి. ఉక్కు ఉత్పత్తికోసం బేసిక్ ఆక్సిజన్ ఫర్నేస్ టెక్నాలజీ ఖర్చుతో కూడుకున్నది కాబట్టి, సరికొత్త ఆధునిక పద్ధతిగా ఎలక్ట్రిక్ ఆర్క్ ఫర్నేస్ టెక్నాలజీని అమలులోకి తెస్తున్నారు. ఈ ఆర్క్‌ఫర్నేస్ టెక్నాలజీయే చిన్న చిన్న ఉక్కు కర్మాగారాల నిర్మాణానికి (మినీ స్టీల్ ప్లాంట్స్) నేడు ఆధారమైంది. ఈ కర్మాగారాలకు అవసరమైన 'మెల్టింగ్ స్క్రాప్ తగినంతగా స్థానికంగా దొరకనందున, విదేశీల నుంచి దిగుమతి చేసుకోవలసి వస్తోంది. ఈ పరాధార పరిస్థితిని తగ్గించుకునేందుకు సకాలంలో అవతరించిన టెక్నాలజీయే "స్పాంజ్ ఐరన్". ఉక్కు తయారీలో ఈ టెక్నాలజీ ఉపయోగం అనంతం. స్టీల్ టెక్నాలజీలో వచ్చిన తాజా ప్రగతిని సమీక్షించుకున్నప్పుడు "స్పాంజ్ ఐరన్" భావనకు నారుపోసి నీరు పెట్టిన శాస్త్రవేత్త శ్రీ వంగలను మరచిపోలేము. నిర్మాణ ఖర్చులు విపరీతంగా పెరిగిపోతున్నందున, పరిమిత ఆర్థిక వనరుల దృష్ట్యా భారీ కర్మాగారాలకంటే, బ్లాస్ట్ ఫర్నేస్ టెక్నాలజీకి ప్రత్యామ్నాయంగా వచ్చిన ఆర్క్ ఫర్నేస్ టెక్నాలజీపై ఆధారపడి ముందుముందు మినీ స్టీల్ ప్లాంట్స్ నిర్మించుకోవడం శ్రేయస్కరం కాదా? ఎందుకంటే విశాఖ కర్మాగారం నమూనా కాగితాలలోకి ఎక్కే సమయానికి కర్మాగారం నీటి అవసరాలు తీర్చే ఏలేరు ప్రాజెక్టు ఆలోచన కూడా వచ్చింది. కానీ, అదీ దశబ్దాంపైగా ఆచరణలోకి రానందున విశాఖ జిల్లా వ్యవసాయావసారాలు, నగర మంచినీటి అవసరాలు తీర్చవలసిన తాండవ రిజర్వాయర్‌కు తాకిడి పెరిగిపోయింది; ఈ లోగా స్టీల్‌ప్లాంట్ ఖర్చు పెరిగింది. ఏలేరు రిజర్వాయర్ నిర్మాణ ఖర్చూ తడిసి మోపెడైంది.

దేశానికి స్వాతంత్ర్య వచ్చేనాటికి కేవలం 10 లక్షల టన్నుల ముడి ఉక్కుతో, తలసరి ఉక్కు వాడకం 3 కిలోగ్రాములతో ప్రారంభించిన భారత ఉక్కు పరిశ్రమ నేటి ఆరు కర్మాగారాలతో 1 కోటీ 75 లక్షల టన్నులకు "క్రూడ్‌స్టీల్" (లిక్విడ్ స్టీల్) ఉత్పత్తిని సాధించబోతోంది! అయితే 2,000వ సంవత్సరం నాటికి దేశంలో అయ్యే ఉక్కు ఉత్పత్తికీ, ప్రజల, పరిశ్రమల, వ్యావసాయక అవసరాలకు మధ్య అంతరం 50 లక్షల టన్నులకు మించుతుందని ప్రణాళికా సంఘం అధ్యయన బృందం అంచనా! అంతేగాదు, దేశంలో తలసరి ఉక్కు వాడకం 43 ఏళ్ళలో 3 కె.జీల నుంచి 17 కె.జీలకు మాత్రమే పెరిగింది. కానీ, సంపన్న దేశాలలో ఈ వాడకం తలసరి 500 - 600 కె.జీలు చేరుకోవాలంటే ఇంకా వందేళ్ళు పడుతుందన్నమాట! అలాగే సంపన్న దేశాల్లో టన్నేజి స్టీల్ అవసరాలు క్రమంగా తగ్గిపోతున్నాయి; కాగా ఈ శతాబ్దాంతానికి దేశంలో కార్బన్ స్టీల్ ఉత్పత్తి 2 కోట్ల 50 లక్షలకూ, స్టెయిన్‌లెస్ స్టీల్ 6 లక్షల టన్నులకు, మిశ్రమ లోహం, స్పెషల్‌స్టీల్స్ ఉత్పత్తి 20 లక్షలకూ పెరగవచ్చునని ఒక అంచనా!

మానవుడు తలచుకుంటే కానిదేదీలేదు. ఆ సంకల్ప బలమే ముడిలోహాన్ని కమ్మెచ్చులాగి ఉక్కుగా మలచింది; అదే సంకల్పం మానవుణ్ణి "ఉక్కు మనిషి"గాను దిద్దితీర్చుతోంది. ఒకనాడు ఏడాదికి 20 వేల టన్నుల ఇనుమును మాత్రమే ఉత్పత్తి చేసుకోగలిగిన బ్రిటన్ 200 ఏళ్ళలో అదే మొత్తాన్ని ఒక

పూటలోనే తయారుచేసుకోగల స్థాయికి ఎదిగింది. ప్రపంచానికి ఇంగ్లాండ్ ఆవిష్కరించి పెట్టిన పారిశ్రామిక విప్లవాన్ని విశ్వవ్యాపితం చేసిన "లోహరాక్షసి" ఐరన్ అండ్ స్టీల్! విశ్వాశాంతికీ, విలయానికీ సంకేతాలు తొలి లోహాలు ఇనుము, కంచు. బంగారం, వెండి - "కులీన లోహాలు"గా, ఇనుము, సీసం, తుత్తునాగం (టిన్), ఆధార లోహాలుగాను ప్రసిద్ధికెక్కాయి. కాని ఈ ఆధార లోహాలు లేకుండా బంగారానికీ, వెండికి కూడా విలువలేదు. బంగారపు పళ్ళెరానికి కూడా "గోడవార్పు" అవసరం అన్నది అందుకే! ఈ "లోహ రాక్షసుల పదఘట్టన" ఆధునిక జీవితానికి, దేశాభ్యుదయానికి ఆహ్వానగీతిక. కాదామరి? చార్లెస్ సీమన్స్ లేకపోతే ఓపెన్ హార్త్ ఫర్నేస్ లేదు; బెసీమెర్ లేకపోతే మనకు స్టీల్ కన్వర్టర్ లేదు; హార్వే పుట్టకపోతే మిశ్రమ లోహం లేదు. వైట్ టేలర్ అవతరించకపోతే హైస్పీడ్ స్టీల్ మిశ్రమ లోహం లేదు; హెరోల్ట్ ప్రభవించకపోతే ఎలెక్ట్రిక్ స్టీల్ లేదు; హాడీఫీల్డ్ కళ్ళు విప్పకపోతే మాంగనీస్ స్టీలూ, డాక్టర్ బ్రియర్లీ కాళ్ళు కదపకపోతే స్టెయిన్ లెస్‌స్టీలూ సూర్యోదయం చూసి ఉండేవికావు!! అన్ని రకాల "స్టీల్స్"కు మాతృమూర్తి "స్టీల్". అందుకే, చివరికి కవులు "ఉక్కు"ను కూడా తమ కవితా వస్తువుగా చేసుకొని 'లోహనదులు' పారిస్తున్నారు!

శనివారం, 31 మార్చి 1990

# పరిశ్రమల మూతవల్ల కాలుష్యం పోతుందా?!

మన పెద్దవాళ్ళు "పెంటకొద్దీ పంట" అన్నారు. అలాగే కాలుష్యానికి కూడా సవాలక్ష కారణాలున్నాయి. వాయు, జల కాలుష్యం, ధ్వని కాలుష్యం వగైరా. ఇవన్నీ ఎందుకు తలెత్తుతున్నాయి? పెరుగుతున్న జనాభా ఉపాధి అవసరాలను తీర్చడానికి, పారిశ్రామికంగా దేశాన్ని పరాధార స్థితినుంచి విముక్తి చేసేందుకు వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో అభివృద్ధి సాధించడానికి. కాని ప్రకృతిలో ఉన్న ద్వైధీభావాన్ని అర్థం చేసుకోవాలి. ఒక మంచి - ఒక చెడు జమిలిగా కలిసే ప్రయాణిస్తుంటాయి. ఇది అనివార్యం. కాకపోతే మన తెలివితేటలు ఎక్కడ అక్కరకు రావాలంటే - మానవుని అవసరాలను తీర్చుకుంటూనే మానవుని ఉనికికే ప్రమాదకరంగా పరిణమించే అవాంఛనీయమైన పరిణామాలను తొలగించుకోవడంలో. ఇందుకోసం ప్రభుత్వ పరంగానూ, న్యాయస్థానాల పరంగానూ తయారయ్యే చట్టాలనూ, ఇచ్చే తీర్పులనూ పరిశ్రమాధిపతులు సకాలంలో గౌరవించి పాటించక తప్పదు. అమెరికాలో "త్రీమైల్స్ ఐలంట్", రష్యాలో చర్నోబిల్ ఉపద్రవాలు, భోపాల్ విషాదం మానవుని చైతన్యానికి, నిర్లిప్తతకు ప్రత్యక్షంగా ఎదురవుతున్న సవాళ్ళు. అంతమాత్రాన తిరిగి ఆ ప్రాంతాల్లో మానవ సంచలనం ఆగిపోలేదు, మోడుబారిన జీవితాలు తిరిగి చిగుళ్ళెత్తకుండానూ పోలేదు. మానవుని వైజ్ఞానిక ప్రస్థానంలో ఈ ఒడిదుడుకులు తప్పవని చెబుతూ సుప్రసిద్ధ రచయిత జేమ్స్ జాయిస్ అన్నాడుః "చరిత్ర అనేది ఒక పీడకల, ఆ కలనుంచి ఎప్పటికప్పుడు మనం జాగృతం కావడానికి ప్రయత్నిస్తుంటాం."

చూరులో ఎలుక దూరిందని మొత్తం ఇంటికే నిప్పంటించుకోము. అలాగే జంట నగరాల పరిధిలో, చుట్టుపట్ల, అనేక పరిశ్రమలు విడుదలచేసే వ్యర్థ, విష పదార్థాలను శుద్ధిచేసి మాత్రమే జలరాశిలోకి వదలాలన్న ప్రభుత్వ ఆదేశాన్నిగానీ, న్యాయస్థానం ఉత్తర్వునుగానీ ఖచ్చితంగా పాటించేటట్టు వత్తిడి తేవాలిగాని - మొత్తం పరిశ్రమలకూ, తద్వారా వాటిపై ఆధారపడిన వేలాదిమంది కార్మికుల ఉపాధికి చేటుతెచ్చే నిర్ణయాలు తగవు. సాంకేతిక నిపుణుల సలహాలను పాటించని పారిశ్రామికులకూ, పాటించే వారికీ మధ్య వ్యత్యాసం చూడకుండా పరిశ్రమల మూకుమ్మడి మూతకు దారితీసే ప్రభుత్వ ఉత్తర్వులు మంచికంటే చెరుపు తెచ్చిపెడతాయి. పరిశ్రమలవల్ల వచ్చే జల, వాయు కాలుష్యాలను అదుపుచేసేందుకు అవసరమైతే పరిసరాల రక్షణ చట్టాన్ని సవరిస్తామనీ, ఆ విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించి నిర్ణయాలు చేస్తామనీ ముఖ్యమంత్రి చెన్నారెడ్డి రాష్ట్ర శాసనసభలో ఈ నెల 20న చేసిన ప్రకటనకు హర్షించని వారుండరు. అలాగే మానవులు ప్రాణ రక్షణావసరాల దృష్ట్యా ఈ నెల 10వ తేదీన హైకోర్టు బెంచి కాలుష్య సమస్యపై ఒక రిట్ పిటిషన్‌పై తాత్కాలిక ఉత్తర్వు జారీచేస్తూ వెలిబుచ్చిన అభిప్రాయాలతో కూడా ఎవరికీ పేచీ ఉండకూడదుః "పరిశ్రమల అభివృద్ధి ముఖ్యం, నిజమే. కాని మానవు జీవితం మరింత

ప్రధానమైనది. మనం మానవ జీవితాలను పణంపెట్టే పరిశ్రమాభివృద్ధిని అభిలషించం" అని కోర్టు చెప్పింది. లోగడ ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వులను అమలు జరిపించే కార్యక్రమంలో భాగంగానే న్యాయస్థానం ఈ తాత్కాలిక ఆర్డర్ జారీ చేసింది. ఇందువల్ల బొలారం ఏరియాలోని పది పరిశ్రమలు (మందులు, ఇంజనీరింగ్ పరిశ్రమలు వగైరా) మూతపడవలసి వస్తుంది. పరిశ్రమలు ఉత్పత్తి క్రమంలో వదిలిపెట్టే వ్యర్థ, విష పదార్థాలను నిర్వీర్యపరచి శుద్ధిచేసి, విడుదల చేసే "ప్లాంట్"ను నెలకొల్పని పరిశ్రమలకు మాత్రమే ఈ ఉత్తర్వు వర్తించాలి. ఆ "ప్లాంట్" నెలకొని అమలులోకి వచ్చేదాకా ఈ పది యూనిట్లు మూతపడవలసిన ఉంటుంది. ఈ "ప్లాంటు" నెలకొనడానికి మార్చి 31 వరకూ వ్యవధి ఇచ్చారు. ఈలోగా ప్రత్యామ్నాయ ఏర్పాటు చేసి జలకాలుష్యానికి గురవుతున్న ప్రజలకు మంచినీటికి ఇబ్బంది లేకుండా చూడాలని ఆదేశించారు. మానవ రక్షణ కోసం ఈ జాగ్రత్త అవసరమే. కాని "ఎఫ్లుయెంట్స్ ట్రీట్‌మెంట్ ప్లాంట్" (ఇ.టి.పి) నెలకొనడానికి తొమ్మిది మాసాల నుంచి సంవత్సరం వరకు వ్యవధి పడుతుందని నిపుణుల అంచనా, అయితే ఇక్కడ గమనించవలసిన విషయం - న్యాయస్థానం అదే ఉత్తర్వులో పేర్కొన్న మరి 15 పరిశ్రమల విషయంలో ప్రభుత్వ ఉత్తర్వులను అవి పాటిస్తున్నదీ లేనిదీ పరిశీలించి నివేదిక సమర్పించడానికి ఒక ఉన్నత స్థాయి నిపుణుల సంఘాన్ని నియమించింది. ఈ నిర్ణయాన్ని బొలారంలోని పరిశ్రమలకు కూడా వర్తింపచేసి ఉంటే ఇటు ప్రజలకూ, అటు పరిశ్రమలకూ ప్రయోజనకరంగా ఉండేది. కాని ఇక్కడ మరొక సత్యాన్ని విస్మరించరాదుః బొలారం ఏరియాలోని కొన్ని పరిశ్రమలు ఇప్పటికే జీడిమెట్లలోని "ట్రీట్‌మెంట్ ప్లాంట్"లో సభ్యులుగా ఉన్నాయి. తమ యూనిట్లు విడుదలచేసే వ్యర్థ పదార్థాలను ఆ "ప్లాంట్"లో శుద్ధి పరచడానికి ఏర్పాట్లు చేసుకొని ఉన్నాయి. మరికొన్ని యూనిట్లు ఆ ప్లాంట్‌లో సభ్యులుగా చేరుతున్న దశలోనే బొలారంలో స్థానిక పరిశ్రమలన్నీ కలిసి సమిష్టిగా మరొక "ఇ.టి.పి" (ప్లాంట్)ని నెలకొల్పుకోడానికి అన్ని ఏర్పాట్లు పూర్తి అయ్యాయి. మనదేశంలో షెడ్యూల్ ప్రకారం నిర్మాణం పూర్తి చేసుకున్న చేసుకొన్న పరిశ్రమలు చాలా తక్కువ! అలాగే ఈ "ప్లాంట్లు" కూడా. అయితే బొలారం శుద్ధి కర్మాగారం నిర్మాణం తాలూకు ప్రాథమిక ఏర్పాట్లన్నీ (బ్లూప్రింట్స్, ప్రాజెక్టు రిపోర్టు, ఫైనాన్షియల్ కార్పొరేషన్‌కు దరఖాస్తులు, చివరికి కార్పొరేషన్ అడిగిన ఆఖరి సమాచారాన్ని కూడా సమకూర్చడం, టెండర్లు వగైరా) ఈ నెల 18కి పూర్తి అయిపోయాయి, కాని నిర్మాణానికి ఉత్తర్వులో పెట్టిన వ్యవధి 1990 మార్చి 31. "ప్లాంట్లు" నిర్మాణానికి అవసరమైన వ్యవధి తొమ్మిది మాసాల నుంచి ఏడాదివరకూ!

ఈ సందర్భంగా ఒక సాదృశ్యాన్ని గుర్తు చేయదలచాంః కాన్పూర్‌లోని ఒక తోళ్ళ పరిశ్రమ విడుదల చేసే వ్యర్థ, విష పదార్థలవల్ల గంగానది జలాలు కలుషితమవుతున్నాయని పౌరులు కొందరు పెట్టుకొన్న పిటిషన్‌పై సుప్రీమ్‌కోర్టు బెంచి 1987లో ఆ పరిశ్రమ మూసివేయాలని తీర్పు ఇచ్చింది. అయితే నాలుగేళ్ళుగా హెచ్చరికలు చేసిన దరిమిలా, హెచ్చరికలను పరిశ్రమ ఖాతరు చేయనప్పుడు ఆఖరికి కోర్టు ఆ నిర్ణయం చేసింది. పైగా జంటనగరాల పరిశ్రమల విషయంలో కాలుష్య నివారణ ఉత్తర్వులను ఖచ్చితంగా అమలు జరిపించే బాధ్యతను ప్రభుత్వమే చేపట్టవలసి ఉంది. ఎందుకంటే, సుమారు పదిహేను పారిశ్రామిక వాడలలో సుమారు 500 యూనిట్లుదాకా రకరకాల పరిశ్రమలు ఉన్నాయి. వాటన్నింటి వ్యర్థ పదార్థల శుద్ధికి తగిన ఏర్పాట్లు ఉన్నట్లు ఎక్కడా దాఖలాలు లేవు! అంతేగాదు, చివరికి నాన్-రెసిడెంట్ ఇండియన్స్ పెట్టుబడి-సాయంతో ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కార్పొరేషన్

అభివృద్ధి చేసిన "ఎన్‌రిచ్" పారిశ్రామిక వాడకి కూడా ఈ వ్యర్థ పదార్థల శుద్ధి కర్మాగారం లేదన్న సంగతి మరచిపోరాదు! జీడిమెట్ల తరువాత, బొలారంలో కూడా ఎలాగూ "ప్లాంట్" నిర్మాణానికి అన్ని ఏర్పాట్లు పూర్తి కావచ్చినందున, కొలది రోజులలో నిర్మాణం ప్రారంభం కానున్నందున "ఎఫ్లుయెంట్స్" విడుదలకు తాత్కాలికంగానైనా ప్రత్యేకంగా ప్రత్యామ్నాయపు ఏర్పాట్లు ప్రభుత్వమూ, పరిశ్రమలూ కలిసి చేయాలి. ఈలోగా జీడిమెట్ల "ప్లాంట్"ను పూర్తిగా సద్వినియోగం చేసుకోవాలి; బొలారమ్ "ప్లాంట్" నిర్మాణాన్ని త్వరితం చేయాలి; కావాలని ఉత్తర్వులను ఉల్లంఘించే వారిని శిక్షించాలి, నిబంధనల మేరకు ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేసుకోని లేదా జీడిమెట్ల ప్లాంట్ సహకారంతో శుద్ధి కార్యక్రమాలు నిర్వహిస్తున్న పరిశ్రమలకు రక్షణ కల్పించి, తిరిగి పనిచేసేందుకు వెంటనే ఆదేశాలు జారీ చేయాలి, లేదా ఆంక్షలు ఎత్తివేయాలి.

మనస్సుంటే మార్గం లేకపోలేదు. ప్రకృతిలోని జీవరాశినే వినియోగించి తిరిగి కాలుష్యాన్ని పసికట్టడానికి చేపలను వినియోగిస్తున్నారు; వెన్నెముకలేని జలచరాల సహాయంతో (benthic fana) జల కాలుష్యాన్ని తెలుసురుంటున్నారు; కాన్పూర్‌లోని పాడి పరిశ్రమాభివృద్ధి సంస్థ నెలకొల్పిన శుద్ధి కర్మాగారం సాయంతో నెయ్యి, పాలనుంచి వచ్చే వ్యర్థ జలాలలో ఆయిల్‌ను, గ్రీజ్‌ను విడదీసి చెట్లకు నీటి సదుపాయం కల్గిస్తున్నారు. వ్యర్థ పదార్థాలలోని పోషకాలను, నీటినీ పీల్చుకోడంలో ఆ చెట్లు "బయో పంప్స్"గా తోడ్పడుతున్నాయి. వ్యర్థపదార్థన్ని వినియోగించడం తెలిస్తే - ఇంత గందరగోళమే అనవసరం! విషవాయువును, మరఫిరంగినీ సృష్టించగల చేయి, ఆరితేరిన యంత్రమానవుణ్ణి సృష్టించటం లేదూ?!

బుధవారం 25 ఏప్రిల్ 1990

# రోశయ్య పత్రం

కేంద్ర ప్రభుత్వంనుంచి రాష్ట్ర ప్రభుత్వాలదాకా తమ 'ఖజానా'లు దివాళా తీశాయని చెప్పుకోవడంలో పొందుతున్న తృప్తిని, పడుతున్న పోటాపోటీలనూ ఆర్థిక వ్యవస్థను మౌళికంగా సంస్కరించడంలో అవి ప్రదర్శించలేకపోతున్నాయి. "దివాళా" అన్న పదాన్ని కొత్త ప్రభుత్వాలు చాలా తేలికగా వాడేస్తున్నాయి. నిజానికి 'దివాళా' అన్నది స్థూలంగా ఆర్థిక వ్యవస్థ పడుతున్న ఇబ్బందులకు భాషాపరంగా కల్పించే 'తొడుగే'గాని అసలు బతుకు తెరువుకీ, జరుగుబాటుకూ ప్రమాదం వచ్చిపడిందని అర్థం కాదు! అటు కేంద్రంలోని నేషనల్ ఫ్రంట్ నాయకులు, ఇటు రాష్ట్రంలోని కాంగ్రెస్(ఐ) ప్రభుత్వ నాయకులూ తమ పూర్వ ప్రభుత్వాల ఆర్థిక విధానాల గురించి, అందులోని మంచి చెడుల గురించీ వ్యాఖ్యానించేటప్పుడు ఈ జాగ్రత్తలు తీసుకోకపోతే "దివాళా పరిస్థితుల"ను ఎదుర్కొనగల మనో ధైర్యాన్ని కోల్పోవలసి వస్తుంది. పార్లమెంటరీ వ్యవస్థలో గ్రీన్ పేపర్స్, బ్లూ పేపర్స్, వైట్ పేపర్స్ (శ్వేతపత్రం) ఇత్యాది పత్రాలను ప్రభుత్వాలు శాసనవేదికలకు సమర్పించేది సభ్యులకు, ప్రజలకూ విషయాలను తొక్కిపట్టకుండా పూర్తి సమాచారాన్ని అందించడంకోసమే. కానీ, ఈ పనిని రాష్ట్ర ఆర్థిక మంత్రి శ్రీ రోశయ్య "తెలుగుదేశం" పాలనలో రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ గురించి, ద్రవ్య పరిస్థితి గురించి బుధవారంనాడు అసెంబ్లీలో ప్రవేశపెట్టిన "శ్వేతపత్రం"ద్వారా సాధించగలిగారా అన్నది ప్రశ్న. "దేశం" హయాములో ఎన్నైనా పిచ్చిపనులు జరగవచ్చు. మరెన్నైనా అవకతవక నిర్ణయాలు, తొందరపాటు చర్యలూ ఉండి ఉండవచ్చు. కానీ అదే పరిపాలనను కొనసాగించవలసిన ఉత్తరాధికారాలు, కాంగ్రెస్ (ఐ) పాలకులు ఉన్న వాస్తవాలను ఉన్నట్టు తెలిపి, "దేశం" హయాములోని లోటుపాట్లను 'ఇదిగో ఈ విధంగా సవరించదలచాం' అని స్పష్టీకరించాలి. ఈ సందర్భంగా "శ్వేతపత్రాన్ని" వాస్తవాల వక్రీకరణగా చిత్రించిన ప్రతిపక్షం వాదనను మేము పూర్తిగా సమర్థించకపోయినా, కొందరు వ్యక్తులు చేసిన ఒక సూచనను మాత్రం ప్రస్తావించక తప్పదు. "శ్వేతపత్రం" అంటేనే పబ్లిక్ డాక్యుమెంటు ఎలా అవుతుందో, శాసన సభలో ప్రవేశపెట్టిన శ్వేతపత్రం కూడా అంతే. కానీ, సభ్యులు చర్చించేదాకా, తద్వారా ప్రజలు సమగ్రంగా తెలుసుకొనేదాకా ఈ శ్వేతపత్రాన్ని పత్రికలు ప్రచురించకుండా వచ్చింది. సూచనను సభాపతి నిరాకరించినందున "శ్వేతపత్రా'న్ని మరింత జాగ్రత్తగా పరిశీలించవలసి ఉంటుంది. రోశయ్య "శ్వేతపత్రం"లో ప్రధానమైన విమర్శః రాష్ట్ర ఆర్థిక పరిస్థితి దారుణంగా ఉంది, రాబడి పద్దులో లోటు పెరిగిపోతోంది. ప్రణాళికా పెట్టుబడులు తరిగిపోతూ వచ్చాయి; రాష్ట్రంలో వస్తూత్పత్తి రంగంలో పెరుగుదలరేటు తక్కువగా ఉంది; తలసరి ప్రణాళికా పెట్టుబడి వ్యయం తగింది. అప్పు పెరిగింది. అభివృద్ధి తిరోగమనంలో ఉంది. వాస్తవానికి, అధికారంలో ఎవరు ఉన్నా పెరుగుదలలో ఉన్న ఆర్థిక వ్యవస్థకు రెవిన్యూ పద్దులూ, ఖర్చు పద్దులూ కూడా పెరుగుతూ ఉంటాయని మనకు నాయకులు లోగడ అనేకమార్లు బోధించడానికి ప్రయత్నించిన వాళ్ళే! అంతేగాదు, పెరుగుతునన ఆర్థిక వ్యవస్థ "ఆరోగ్యానికి" నోట్ల ముమ్మరమూ (ఇన్‌ఫ్లేషనూ), లోటు బడ్జెట్లూ

కూడా ఆనవాళ్ళని స్వర్గీయ ఇందిరాగాంధీ అనేకసార్లు సెలవిచ్చిన సంగతినీ ఈ సందర్భంగా మరువరాదు. "శ్వేతపత్రాన్ని" పరిశీలించినప్పుడు అటు కేంద్రంలో అంతగా ఆందోళన పడవలసిన అవసరం ఎలా లేదో, ఇక్కడ రాష్ట్రంలో కూడా ఆర్థిక పరిస్థితి పట్ల అంతగా బెంగపడిపోవలసిన పనిలేదని అర్థమవుతోంది. పైగా శ్రీ రోశయ్య ఈ పత్రంలో చేసిన పని - సుఖమయ చక్రవర్తి అధ్యక్షతన దేశ వర్తమాన ఆర్థిక పరిస్థితి గురించి, కార్యాచరణకు అవసరమైన ప్రాధాన్యతల ఎంపిక గురించీ నివేదిక సమర్పించిన కేంద్ర ఆర్థిక సలహా మండలి వెల్లడించిన అంశాలపై ఆధారపడడం. అది దేశ వ్యాపితపటం. దేశీయోత్పత్తులు ఏడాదికి అయిదుశాతం అభివృద్ధి రేటును సాధించగా, ఆంధ్రప్రదేశ్‌లో ఈ వస్తూత్పత్తి అభివృద్ధి రేటు రెండు శాతమే ఉందని, అందులో పేర్కొన్నాడు. కానీ, దేశీయ పారిశ్రామికోత్పత్తి 3.9 శాతానికి దిగజారిపోయిందని కూడా సుఖమయ చక్రవర్తి నివేదించిన సత్యాన్ని మాత్రమే తీసుకున్నారు. కానీ ఇక్కడ గమనించవలసిన అసలు విషయంః మొత్తం వస్తూత్పత్తుల పెరుగుదల గణనీయంగా ఉండాలంటే, తలసరి ప్రణాళికా పెట్టుబడి వ్యయం పెరగాలి; తలసరి ఆదాయం రేటూ పెరగాలి. కానీ ఈ రెండూ పదిహేనేళ్ళుగా ఆంధ్రప్రదేశ్ విషయంలో తరుగుతూ వచ్చాయని మరువరాదు. "వస్తూత్పత్తిలో అఖిల భారత స్థాయి రేటు ప్రోత్సాహకరంగా ఉండగా" ఆంధ్రప్రదేశ్‌లో ఈ రేటు పడిపోవడానికి ప్రధాన కారణంగా ద్రవ్య, ఆర్థిక సంబంధాలలో కేంద్రానికి రాష్ట్రాలకూ మధ్య బెడుస్తూ వచ్చిన సంబంధాలను కూడా దృష్టిలో పెట్టుకోవాలి. "శ్వేతపత్రం"లోని చిత్రపటంలో అటు అఖిలభారత స్థాయికి చెందిన వాస్తవాన్ని, ఇటు రాష్ట్రస్థాయి పరిస్థితినీ కూడా వాస్తవంగా చూపడం లేదనడానికి ఒక ఉదాహరణ : ఏ ప్రభుత్వ పాలనకైనా గీటురాయి దాని ఆదాయమూ, ఆదాయ వనరుల సేకరణా అయినప్పుడు ఐదవ ప్రణాళికా కాలంలో (1974-79) జాతీయ స్థాయిలో తలసరి ప్రణాళికా పెట్టుబడి కేటాయింపు రూ. 262 కాగా ఆంధ్రప్రదేశ్‌లో రూ. 236లు మాత్రమే. ఆరవ ప్రణాళికలో (1982-85) అఖిల భారత తలసరి ప్రణాళికా పెట్టుబడి కేటాయింపు రూ. 687 ఉండగా, మన రాష్ట్రంలో రూ. 584 మాత్రమే ఉంది. అలాగే ఏడవ ప్రణాళికలో (1985-90) జాతీయ స్థాయిలో ఈ తలసరి కేటాయింపు రూ. 1.026 కాగా, మన రాష్ట్రంలో రూ. 841 మాత్రమే ఉంది. అయినప్పుడు ఈ పరిస్థితిని ఒక్క "తెలుగుదేశం" పరిపాలనకే ఆపాదించవలసిన అవసరం ఏమొచ్చింది?

అంతేగాదు, ఆదాయవనరులు పెంచడం తప్పా? వాటిని ఖర్చు చేయడం తప్పా? చేసిన ఖర్చు ఏ మేరకు ఏ రూపంలో, ఎక్కడ ఎలా వృధా అయిందో, దుర్వినియోగమైందో చూపి చీల్చిచెండాడాలిగానీ, ఈ శ్వేతపత్రాన్ని సమర్థించడం కోసం రాబడినీ, ఖర్చునూ వక్రీకరించి చూపడానికి ప్రయత్నించరాదు. ఏ పనీ చేయనివాడు ఏ తప్పూ చేయనట్టే. పనిచేసేవాడే ఖర్చుకూడా పెట్టవలసి వస్తుంది. కొన్ని విషయాలను మభ్యపరడానికి ప్రయత్నించినా, ఈ సత్యాన్ని శ్వేతపత్రం కూడా దాచుకోలేకపోయింది. ఈ విషయంలో "శ్వేతపత్రా" నిది వక్రీకరణ అని ఎంతగా ప్రతిపక్షం ముద్రవేయజూచినా, అదే పత్రంలో నోటితో ఫలానా ప్రభుత్వం హయాములో 'ఈ మంచి పని జరిగింద'ని పైకి చెప్పలేకపోయినా, కొన్ని తప్పించుకోడానికి వీలులేని వాస్తవాలను అంగీకరించవలసివస్తుంది. ఆ పత్రం - గత ఏడేళ్ళలో రాష్ట్రం ఆదాయం పెరగలేదని చెప్పలేకపోయింది, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలపై పెద్ద ఎత్తున చేసిన ఖర్చును కాదనలేకపోయింది. అయితే ఈ పత్రం ఆధారంగా ప్రస్తుత పాలకులు పడుతున్న తగాదా అల్లా - 1989-90 బడ్జెట్‌లో "దేశం" ప్రభుత్వం రూ. 184 కోట్లు లోటు తేల్చిపోయారనీ, కాగా ఎన్నిక ముందు చేసిన నిర్ణయాలు, మంజూరైన పథకాలవల్ల అదనంగా రాష్ట్రం రూ. 300 కోట్ల మేరకు వనరులు చూడవలసి వచ్చిందనీ, ఇవన్నీ వెరసి మొత్తం లోటు రూ. 500 కోట్లకు పెరుగుతుందనీ కాబట్టి ఇంత లోటు మూలంగా, పాత ప్రభుత్వం వార్షిక ప్రణాళికా పెట్టుబడి వ్యయంగా ఉద్దేశించిన రూ. 1400 కోట్లు అక్కరకు వచ్చే మార్గం కనపడడం లేదనీ చెబుతున్నారు.

శుక్రవారం 12 జనవరి, 1990

# రోశయ్య "పత్రం" :2:

స్వచ్ఛమైన పత్రాన్నే (తెల్లదని) శ్వేతపత్రం అని చెప్పవలసివస్తే ఆ స్వచ్ఛత ఇందులో కనిపించదు. ఇంతకు ముందెన్నడూ లేని ఓ కొత్త సంప్రదాయాన్ని ఈ సారి శ్వేతపత్ర రచనలో ప్రవేశపెట్టారు. సుఖమయ చక్రవర్తి కేంద్ర ఆర్థిక సలహా మండలి నివేదిక దేశ పరిస్థితికి సంబంధించిన ఆర్థిక చిత్రపటం. కాగా దానితో రాష్ట్ర పరిస్థితిని పోల్చి ఇక్కడ అభివృద్ధి రేటుతగ్గినదని చెప్పడం తగని పని. ఒక వేళ ఏదైనా పోలిక తేవలసి వస్తే, అది రాష్ట్రాన్ని పాలించిన రెండు ప్రభుత్వాలు తమ కాలంలో సాధించిన ప్రగతి మధ్య పోలికగానే చూపాలి. అంటే, "తెలుగుదేశం" ఏడేళ్ళ పాలనలో సాధించిన ప్రగతిని అంతకుముందు ఏడేళ్ళ కాంగ్రెస్(ఐ) పాలనలో జరిగిన అభ్యుదయంతో పోల్చి "శ్వేతపత్రం"లో బేరీజు వేయడం ధర్మంగా ఉండేది. ఇందుకోసం మనం "చిత్రగుప్తుణ్ణి" ఆశ్రయించనక్కరలేదు. పైగా అదే కేంద్ర సలహా మండలి 1989తో పూర్తయిన దశాబ్దంలో దేశీయోత్పత్తులలో సాధించిన 5 శాతం ప్రగతి అయినా, దేశీయంగా స్వయం పోషకంద్వారా కాకుండా అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థల సహాయంతోను, ఇతర అసాధారణ ద్రవ్య మార్గాలద్వారాను సాధించవలసి వచ్చినదన్న హెచ్చరికను రోశయ్య "శ్వేతపత్రం" దాటవేసింది. వస్తూత్పత్తిలో అభివృద్ధి రాష్ట్రంలో ఏడాదికి రెండు శాతం మాత్రమేనని బాధపడుతున్న ఆర్థికమంత్రి దృష్టిని కేంద్రమండలి ఇచ్చిన ఇతర సలహాలు ఎలా తప్పించుకోగలిగాయో అర్థం కావడం లేదు. కేంద్ర ఆర్థిక మండలి మరికొన్ని విషయాలపై కూడా ప్రభుత్వాన్ని హెచ్చరించింది. కేంద్రం ద్రవ్య పరిస్థితి అస్తవ్యస్తంగా ఉంది. బడ్జెట్ లోటు పెరిగిపోతోంది. వ్యవసాయోత్పత్తి అస్థిరంగా ఉంది, ప్రణాళికేతర వ్యయం పెరిగిపోతోంది. దానిపై అదుపు అవసరం, రక్షణ వ్యయాన్ని తగ్గించుకోవాలి. తప్పితే ఆర్థిక వ్యవస్థ మరిన్ని చిక్కులకు లోనవుతుందన్న మండలి సలహాలను కూడా రోశయ్య ఈ పత్రంలో ఎందుకు ఉదాహరించలేకపోయారు?! అలాగే, రాష్ట్రంలో గత ఏడేళ్ళలో సంక్షేమ పథకాలకు వెచ్చించిన ధనం సంగతి విస్మరించి, ఇరిగేషన్, విద్యుచ్ఛక్తి రంగాలకు బడ్జెట్ కేటాయింపులు తరిగిపోయాయన్న "శ్వేతపత్రా"నికి - దారిద్ర్య నిర్మూలన కార్యక్రమంలో భాగంగా ఉద్దేశించిన సంక్షేమ పథకాలకు, సబ్సిడీలకు, వ్యవసాయ కార్యక్రమాలకు, విద్యకు ఎక్కువ కేటాయింపులు జరగాలన్న కేంద్ర మండలి సలహా ఎలా కనిపించకుండా పోయింది? ఒకచోట, సమయానికి అక్కరకు వచ్చినట్టు కనిపించిన కేంద్ర సలహా మండలి నివేదిక, మరోచోట ఎందుకు పనికిరాలేదు!? అంతేగాదు, 1980లలో "దేశ ఆర్థికాభివృద్ధికి పన్నిన వ్యూహంలో అంతర్గంతగానే ఎన్నో వైరుధ్యాలున్నాయ"నీ, పారిశ్రామిక పెట్టుబడులకు, ఎగుమతుల పెరుగుదలకు అనుకూలమైన వాతావరణం ఇప్పటికి కనిపించినా, కొన్ని రంగాలలో పెరిగినా "ఈ ప్రగతి, ద్రవ్యోల్బణాన్ని (ఇన్‌ఫ్లేషన్) పెంచకుండా లేదా విదేశీ వాణిజ్య సమస్థితిని చెదరగొట్టకుండా, ఇకముందు కూడా కొనసాగడానికి ఈ మాత్రపు చర్యలు చాలవ"నీ ఆ మండలి చెప్పింది. ఇన్ని వాస్తవాలను కప్పిపెట్టి,

మరేదేదో ఆ పత్రం చెప్పబూనడం ఎంతమాత్రం గౌరవప్రదమైన విన్యాసం కాదు!

అలాగే ఆ పత్రంలో ఎంతసేపూ 1989-90 లోటు బడ్జెట్ గురించిన ప్రస్తావనేగానీ, కొన్ని సందర్భాలలో "జరుగుబాటుకు" కొంత ఇబ్బందిగా ఉన్న సంవత్సరాలలో కూడా, కేంద్రం వత్తిడిని తట్టుకుని కూడా, ఈ ఏడేళ్ళలో "ఓవర్ డ్రాఫ్ట్"ను రాష్ట్రం తీరుమానం చేసుకున్న సంగతిని మరువరాదు. అంతేకాదు. 1989-90 ప్రణాళికలో పెట్టుబడి కేటాయింపు లోటుబడ్జెట్‌వల్ల అనుభవంలోకి రాదనీ, ఖర్చుపెట్టడం అసాధ్యమనీ చెబుతున్న పత్రం ఈ ఏడేళ్ళలో ప్రణాళికా పెట్టుబడి వ్యయం రు. 556 కోట్లు నుంచి (1983) రు. 1350 కోట్లకు పైగా (1988-89) పెరిగిందని స్పష్టంగా గుర్తించలేకపోయింది. అయినా, నేటి కొత్త ప్రభుత్వం 1990-91 వార్షిక ప్రణాళికను "వనరుల పరిమితుల దృష్ట్యా"ను, పాత ప్రభుత్వం తాను "ప్రకటించిన అన్ని కార్యక్రమాలకు, పథకాల అమలుకు తగిన నిధులు సమకూర్చడంలో పొందిన వైఫల్యం" దృష్ట్యాను జాగ్రత్తగా రూపొందిస్తామని ఆ పత్రం చెప్పడం సబబుగా ఉంది. అలాగే వనరులకు ఉన్న పరిమితులను, పథకాల అమలులో సాధ్యాసాధ్యాలను పరిగణలోకి తీసుకోనందున ఇబ్బందులు ఎలా ఎదురయ్యాయో చెప్పింది. అయితే "దేశం" అయినా, కాంగ్రెస్ అయినా ఎన్నికల యజ్ఞంలో వోటర్లకు రకరకాల వాగ్దానాలు చేయడం సహజం. ఉదాహరణకు 18 ఏళ్ళ యువతను ఆకర్షించడానికి అందరూ ఉపాధి ఎరచూపినవారే! కాని ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజిలకు తాళాలు వేస్తే తప్ప ప్రస్తుతపు 30 లక్షల మంది నిరుద్యోగులకు ఏడాదికి లక్షమందికి ఉపాధి కల్పించగలమని అనుకున్నప్పటికీ ఈ ముప్పయిలక్షల మందికీ ఉపాధి కుదర్చడానికి కనీసం మరి ముప్ఫయేళ్ళు ఆగాలి! ఈలోగా పెరిగే నిరుద్యోగుల సంఖ్యను ఒకవేళ గణించకపోయినా! వాస్తవాలు, అవాస్తవాల కలగాపులగమే ఎన్నికల వాగ్దానాలు! ఆ కళలో "దేశం" 'వారు ఆరితేరారని అనుకుంటే, దానిని కాంగ్రెస్ అనుసరించకుండా జాగ్రత్తపడితే చాలు!

అంతేగాని, రాష్ట్ర ఆదాయ వనరులలో మిగులు సగుళ్ళ విషయంలో, ఖర్చు విషయంలో లేదా పన్నుల ద్వారా పొందే రాబడి విషయంలో, కేంద్రం రాష్ట్రంనుంచి వసూలు చేసే పన్నులలో రాష్ట్రానికి రావలసిన వాటాల విషయంలో "శ్వేతపత్రం" వాస్తవ పరిస్థితిని వక్రంగా చిత్రించకూడదు. 1982-83 వరకూ రెవిన్యూ (ఆదాయం)లో మిగులు ఉంటూ వచ్చిందిగాని ఆ తర్వాత ఒక్క 1987-88లో తప్ప ప్రతి సంవత్సరమూ లోటులోనే ఉందని పత్రంలో పేర్కొన్నారు. 1986-87లో రెవిన్యూ ఖాతాలో గరిష్ఠలోటు రు. 188 కోట్లు. కాబట్టి, రెవిన్యూ ఖాతాలో లోటుకి అర్థం - రెవిన్యూ ఖాతా కింద పెట్టే ఖర్చులో కొంత భాగాన్ని రుణాలద్వారా ప్రభుత్వం పూడ్చుతూ వచ్చిందనీ, ఇది "రాష్ట్ర ఆర్థిక రంగం సౌష్టవానికి తగని పరిణామ' 'మని అర్థమనీ ఆ పత్రం వివరించజూచింది. కాని అసలు విషయం - ఈ ఏడేళ్ళలోనూ రాబడికన్నా ఖర్చు పెరుగుదల రేటు అధికంగా ఉండడం. ఇదెందుకు జరిగింది? అక్కడక్కడా ఖర్చుపద్దులో కొన్ని పిచ్చి ఖాతాలు ఉన్నా, సంక్షేమ కార్యక్రమాలనూ, వాటిపై ఖర్చును కూడా ఉధృతం చేయడమే దానికి కారణం. అలాగే రెవిన్యూ ఖాతాలో జరిగిన ఈ ఖర్చు పెరుగుదల ప్రధానంగా ప్రణాళిక పెట్టుబడి పద్దుకిందనే జరిగాయని గమనించాలి. అంతేకాదు, రెవిన్యూఖాతాలో వచ్చే లోటును రుణాల సేకరణద్వారా కొంతమేరకు పూడ్చడానికి చేసే ప్రయత్నం "ప్రభుత్వాల ఆర్థిక సౌష్టవానికి తగద"న్న రోశయ్య శ్వేతపత్ర సూత్రాన్ని ఆచరణలోకి తెస్తే మంచిదేగాని - ఇంతవరకూ దేశవ్యాప్తంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మార్కెట్‌లో జోలి కట్టుకుని ఈ రుణ సేకరణ కోసం పదేపదే ఎందుకు పోటీపడవలసి వచ్చిందో కూడా కాస్త వివరిస్తే బాగుండేది!

శనివారం 13 జనవరి, 1990

# రోశయ్య "పత్రం" :౩



క్కసారే అంతా నమిలి మింగుదామనుకొనేవాడి పరిస్థితి ఎలా ఉంటుంది? వికటించి, 'వాంతి' అవుతుంది. ఆర్థిక శాస్త్రంలో ఈ "లా ఆఫ్ డిమినిషింగ్ రిటర్న్సు" అదే పరిస్థితికి దారితీస్తుంది. ఒక్కసారే ఎన్నో పనులు చేయాలన్న ఎన్.టి.రామారావు ప్రభుత్వం 'ఆబ', అత్యాశ అవధులు దాటడంవల్లనే ఏది ముందు తలపెట్టాలి, ఏది ఆలస్యంగా ప్రారంభించుకోవచ్చు అని తర్కించుకోనందుననే, ప్రాధాన్యతల ఎంపిక కొంతవరకు వక్రమార్గం పట్టింది. అయితే ఏ మాటకు ఆ మాటే చెప్పుకోవాలి. రాష్ట్ర రాబడిని పెంచడానికి, రాబడి వనరుల పునాదిని పటిష్ఠం చేయడానికి పాత ప్రభుత్వం చేసిన కృషిని ఎవరూ కాదనలేరు. ఒక్క 1987-88లో తప్ప 1983 తర్వాత రెవెన్యూఖాతాలో లోటు తప్ప మిగులు ఉండడం లేదని శ్వేతపత్రం చెప్పిందిగాని - 1988-89 బడ్జెట్ తుది లెక్కలు అందేవరకూ వేచి ఉండవలసింది. ఎలాగూ రేపు మార్చినాటికి బడ్జెట్ ప్రవేశపెట్టినప్పుడైనా ఈ తుదిలెక్కలు వెల్లడించక తప్పదు. నిజానికి ఈ పాటికే ఆ లెక్క ప్రభుత్వం వద్ద ఉండి ఉండాలి. 1988-89లో వ్యవసాయరంగం కూడా సుభిక్షంగానే ఉన్నందున ఆ సంవత్సరం బడ్జెట్‌కూడా మిగులులోనే ఉండక తప్పదు. 1989-90 సవరించిన అంచనాలు కూడా అందవలసి ఉంది. కాబట్టి రాష్ట్ర ఆర్థిక పరిస్థితి కొందరు భావిస్తున్నట్టు "చిప్పచేతికి" వచ్చినట్టుగా భావించనక్కరలేదు. కనీసం కేంద్ర ఆర్థిక మండలి నివేదికను కూడా కేంద్ర ప్రభుత్వం "శ్వేతపత్రం" అనకుండా "రిపోర్టు"గా మాత్రమే సభకు సమర్పించి ఊరుకుంది. కాని ఇక్కడ జమా ఖర్చుల తాలూకు పూర్తి వివరాలను వెల్లడించకుండానే, రేపు కొత్త ప్రభుత్వం తలపెట్టదలచిన పూర్తి కార్యక్రమాల వివరాలు లేకుండానే ఈ "శ్వేతపత్రం" తలపెట్టారు. 1980-86 మధ్యకాలంలో పన్నులద్వారా రాబడి పెరుగుదలకు సంతోషించిన శ్వేతపత్రమే మరోవైపున 1986-90 మధ్యకాలంలో అమ్మకంపై పన్ను, ఎక్సైజ్‌వంటి ప్రధాన వనరుల అభివృద్ధి రేటు తగ్గినందుకు బాధపడింది. కాని అదే సమయంలో 1989-90 బడ్జెట్ అంచనాల ప్రకారం సొంత వనరులద్వారా, పన్నులతో సంబంధంలేని (నాన్-టాక్స్ రెవిన్యూ) రాబడిద్వారా, కేంద్రం వసూలు చేసుకొనే పన్నులలో వచ్చే వాటాద్వారా, ప్రణాళికేతర పద్దుకింద లభించే గ్రాంట్ల ద్వారా రెవిన్యూ పద్దుకింద రాష్ట్రానికి సమకూడిన మొత్తం ఆదాయం సుమారు రు. 3900 కోట్లు. ఇందులో కేవలం రాష్ట్ర వనరుల, నాన్-టాక్స్ (అటవీశాఖ, గనులు, ఖనిజాల తాలూకు ఆదాయం) రాబడీ సుమారు 78 శాతం ఉంది. శ్వేతపత్రం చెబుతున్నట్టు, నిజానికి పన్నులవల్ల రాబడిలో వృద్ధి శాతం తరగలేదు. కానీ, తరిగినట్టు చెబుతున్న వృద్ధిశాతం ఎప్పటికప్పుడు పెరుగుతూ వచ్చిన రాబడితో పోల్చినందువల్ల కనిపించే దృశ్యం మాత్రమేనని మరవరాదు. కడచిన పదేళ్ళ కాలంలో రాష్ట్రంలో సొంత పన్నులద్వారా లభించిన ఆదాయం మొత్తం వృద్ధిరేటు 16.36 శాతం కాగా, కేంద్రం వసూలు చేసుకువెళ్ళే పన్నులలో రాష్ట్రం పొందవలసిన వాటావల్ల వచ్చిన రాబడి 12.30 శాతం, నాన్-టాక్స్ రంగాల రాబడి 13.60

శాతం అని గమనించాలి. ఇందులో కూడా రాష్ట్రంలో ప్రధానమైన నాలుగు రకాల పన్నులద్వారా (స్టాంప్ డ్యూటీ - రిజిస్ట్రేషన్, ఎక్సైజ్, అమ్మకం పన్ను, మోటారు వాహనాల పన్ను) రాబడి మొత్తం 1980-81లో 89 శాతం ఉండగా అది 1989-90నాటికి 93 శాతానికి పెరిగింది. అయినప్పుడు పన్నుల వృద్ధిరేటు మొత్తంమీద తగ్గిందెక్కడ?!

అలాగే కేంద్రం రాష్ట్రంనుంచి వసూలు చేసుకుపోయే పన్నులలో (ఆదాయపుపన్ను, సెంట్రల్ ఎక్సైజ్ డ్యూటీలు) ఆంధ్రప్రదేశ్ విషయంలోనే రావలసిన వాటా ఎందుకు తరిగిపోయిందో శ్వేతపత్రం చెప్పదు. కాని 1989-90 సంవత్సరానికి తొమ్మిదవ ఫైనాన్స్ కమిషన్ తొలి నివేదిక సిఫారసుల ప్రకారం, కేంద్రం పన్నులనుంచి రావలసిన వాటా ఒక్క ఆంధ్రప్రదేశ్‌కే గాక, బీహార్, గుజరాత్, మధ్యప్రదేశ్, ఒరిస్సాల వాటా కూడా పడిపోయిందని సమర్థించుకోజూచింది. ఇది ఆత్మ వంచన. ఎందుకంటే తొమ్మిదవ ఫైనాన్స్ కమిషన్ (సాల్వే కమిషన్)కు ముందు పనిచేసిన కమిషన్లన్నీ, ముఖ్యంగా అయిదవ కమిషన్‌నుంచి ఎనిమిదవ కమిషన్‌దాకా కేంద్రం పన్నులలో రాష్ట్రాల వాటాను పెంచడానికి వీలుగానే సిఫారసులు చేసాయి. కాని ఈ తొమ్మిదో కమిషన్ ధోరణే వేరుగా ఉంది. సిఫారసులు పోయి విధిగా అమలుజరిపే ఖచ్చితమైన "ప్రమాణాలు" కొన్ని పెట్టి, ఆ గిరిలోనే రాష్ట్రాలు తిరగాలని ఆ కమిషన్ కోరిక. అంటే, కేవలం కేంద్రం వనరుల ప్రయోజనం దృష్ట్యానే అది రాష్ట్రల ప్రయోజనాలకు ఎసరు తెచ్చేదిగా వ్యవహరించినట్టయింది. కేంద్రం-రాష్ట్రాల మధ్య ఆర్థిక వనరుల పంపిణీ విషయంలో 8వ కమిషన్‌కూ, 9వ కమిషన్‌కూ దృక్పథంలోనే తేడా వచ్చేసింది. ఎందుకని? తొమ్మిదో కమిషన్ పరిశీలనార్థం నిర్ణయించిన అంశాలలోనే ఈ మౌలికమైన మార్పు వచ్చింది. దీని ప్రకారం, కమిషన్ 1989 మార్చి నాటికి రాష్ట్రాల రుణ పరిస్థితిని అంచనా వేసుకున్న తరువాత "కేంద్రం ఆర్థికావసరాలను దృష్టిలో పెట్టుకుని" మాత్రమే అవసరమైన చేర్పులూ మార్పులూ చేయాల్సివచ్చింది. (నివేదిక: పేరా 8) ఆర్థిక వనరుల పంపిణీకి సంబంధించిన సమదృష్టితో వ్యవహరించవలసిన ఫైనాన్స్ కమిషన్ ధోరణి ఇలా ఉంటే, ఇంక రాష్ట్రాల స్వతంత్ర ప్రతిపత్తికి విలువెక్కడ? ఈ విషయాన్ని రోశయ్య శ్వేతపత్రం ఎందుకని దాపరికం లేకుండా చెప్పలేకపోయింది? కేంద్రంలో ఏ పార్టీ అధికారంలో ఉన్నా రాష్ట్ర ప్రయోజనాల దృష్ట్యా అయినా తొమ్మిదవ కమిషన్ వైఖరిని ఖండించాలి కదా?! పైగా 8వ కమిషన్ నిర్ణయాలు కొన్నింటిని రాష్ట్రాలకు అనుకూలంగా అమలు జరగకుండా 9వ కమిషన్ 'పాటు' పడిందంటే మనం సిగ్గుపడవద్దా? ఉదాహరణకు, ఆదాయపుపన్ను వసూళ్ళపై విధించే సర్-చార్జి రాబడిని రాష్ట్రాలకు కూడా పంచాలని 8వ కమిషన్ సూచించగా, 9వ కమిషన్ దానిని దాటవేసింది. అలాగే కార్పొరేషన్ టాక్స్‌వసూళ్ళలో కూడా రాష్ట్రాలకు వాటా వెళ్ళాలని 8వకమిషన్ సూచిస్తే, అందుకు ఆంధ్రప్రదేశ్ కోరితే, దానినీ 9వ కమిషన్ తిరస్కరించింది. జనాభా ప్రాతిపదికపై పన్నుల రాబడిలో వాటా సూత్రం ఇంతవరకూ ఎలాగూ సక్రమమంగా అమలులోకి రానేలేదు. కనుకనే చట్టరీత్యా ఈ వనరుల పంపిణీకి తగిన సూత్రీకరణ రూపొందించాలని రాష్ట్రాలు కోరుతున్నాయి. అంతేగానీ, "నా యిష్టానుసారమే గ్రాంట్లు యిస్తాన"ని కేంద్రం అనకూడదు. అప్పుడే ఫెడరల్ ద్రవ్య వనరుల పంపిణీ క్రమబద్ధీకరణ సుసాధ్యమవుతుందని గమనించాలి. ఈ విషయాన్ని బహుశా రోశయ్య, ఇప్పుడు కేంద్రంలో ప్రభుత్వం మారినందున ముందు ముందు పదే పదే ప్రస్తావించవచ్చు. ఎందుకంటే, 1981-82లో కేంద్రం పన్నులో రాష్ట్రం వాటా 23 శాతం ఉండగా 1988-89లో అది 18 శాతానికి పడిపోయింది. విభజించుకోదగిన వనరులలో ఆ మాత్రపు వెసులుబాటు ఉండితీరాలని సర్కారియా కమిషన్ కూడా చెప్పింది. కనుక శ్వేతపత్రం ఎప్పుడూ అమలిన పత్రంగానే ఉండాలిగాని మలిన పత్రంగా ఉండకూడదు!.

ఆదివారం జనవరి 14, 1990

# "సూపర్ ౩౦౧": ప్రమాదంలో ఇండియా


డియా - స్వాతంత్ర్యానంతరం దేశ పరిశ్రమాభివృద్ధికి ప్రభుత్వ రంగమే నాయకత్వం వహించాలన్న 1956 నాటి "పారిశ్రామిక తీర్మానా"నికి ఏనాడైతే తిలోదకాలు ఇచ్చుకుందో ఆనాడే విదేశీ పెట్టుబడులకు దారులు తెరుచుకున్నాయి. ఈ దారులు ముందు డొంకదారులుగానూ, ఆ తరువాత 'ట్రంకు' దారులుగానూ మారాయి. దేశ ఆర్థిక వ్యవస్థను ఈ నలభైమూడేళ్ళుగానూ జారుడు బండపైకి నాయకులు ఎక్కించిన దాని ఫలితాలు నేడు మనకు తెలిసొస్తున్నాయి. ప్రధాని వి.పి.సింగ్ ఇటీవల ఒక ప్రకటనలో తెలిపినట్టుగా, విదేశీ పెట్టుబడులపై దేశీయ పరిశ్రమాధిపతులు హెచ్చుగా ఆధారపడుతూ వచ్చినందుననే ప్రపంచ మార్కెట్‌లో ఇంతకాలంగా వారు పోటీని తట్టుకోగల శక్తిని పొందలేకపోయారు, పెంచుకోలేకపోయారు. అందుకనే, ఇన్నాళ్ళుగా ఎలాగూ రాయితీలు అనుభవించారు, ఇప్పుడు మీ సత్తా చూపించి, దేశీయ ఎగుమతులను ఇతోధికం చేయడంతో పాటు సరకుల నాణ్యతలోకూడా ప్రపంచ మార్కెట్‌తో పోటీపడాలనిఆయన హెచ్చరించవలసి వచ్చింది. నిజానికి ఆ పోటీపడగల సత్తాను ఇంకా దేశవాళీ పరిశ్రమాధిపతులు పెంచుకోడానికి సిద్ధంగాకముందే విదేశీ వర్తక వాణిజ్య ప్రయోజనాలను మన వ్యవస్థ జవజీవాలను కుంగదీసే నిర్ణయం అమెరికా చేసింది. దేశం ప్రధానంగా విదేశీ పెట్టుబడులపైన బహుళజాతి గుత్త సంస్కృతిపైన అధికాధికంగా ఆధారపడడానికి అలవాటుపడితే ఏ దుస్థితికి దిగజారిపోవలసి వస్తుందో అమెరికా రాక్షస వాణిజ్య చట్టం "సూపర్ 301" సూచిస్తోంది. అంతేకాదు, ఈ ఒక్క చట్టం కిందనే గాకుండా పరిశోధనలు, పరిశ్రమాభివృద్ధికి సంబంధించిన మేధా సంబంధమైన ప్రత్యేక హక్కుల (ఇంటులెక్చువల్ ప్రాపర్టీ రైట్స్) విషయంలో - పేటెంట్స్, ట్రేడ్ మార్క్స్, కాపీరైట్ వగైరా - కూడా ఇండియాను నిరాశ్రయం చేయడానికి అమెరికా ఆర్థికపరమైన దురాగతాలకు పాల్పడబోతోంది. ఈ పేటెంట్ హక్కుల పేరిట సాగబోతున్న వాణిజ్య యుద్ధం కూడా ప్రధానంగా వర్ధమాన దేశంగా ఇప్పుడిప్పుడే ఇండియా అభివృద్ధి చేసుకుంటున్న రసాయన పరిశ్రమలకు, మందుల పరిశ్రమలకు, ఆహార పదార్థాల ప్రోసెసింగ్ పరిశ్రమలకు వర్తించబోతోంది. ఇది పెట్టుబడిదారీ వ్యవస్థ "గుప్త" సామ్రాజ్యం! సర్వ మానవ సంక్షేమంకంటే వ్యక్తి స్వార్థ ప్రయోజనాన్ని పోషించే సర్వ సంక్షోభం దాని జీవధాతువు. మానవుని అవసరాలు చూడమంటే మార్కెట్ ప్రయోజనాల పేరిట సంతదోపిడీని చూపిస్తానంటుంది. రేవులోనూ, చావులోనూ కూడా దాని లక్ష్యం - లాభాల వేట. అదే అమెరికావారి "సూపర్ 301" చట్టం. ఏ దేశమైతే స్వేచ్ఛా వర్తక వాణిజ్యాలకు ఆహ్వానం తెలపదో, ఏ దేశం విదేశీ పెట్టుబడుల చొరబాటుకు తలుపులు బాహాటంగా తెరవదో, ఈ షరతులకు లోబడి ఏ దేశం ఏడాదిలోగా అమెరికా దగ్గరకొచ్చి

సంప్రతింపులు ప్రారంభించటో - ఆయా దేశాలపైన వర్తక, వాణిజ్య సంబంధమైన అన్ని రకాల ఆంక్షలనూ విధించి, చర్యలు తీసుకునే హక్కును అమెరికాకు కల్పించేదే ఈ "సూపర్ 301" చట్టం!! "సంప్రతింపులకు రాకపోతే ఇండియాపై చర్య తీసుకుంటాన"న్న అమెరికా వాణిజ్య ప్రతినిధి మిసెస్ కార్లాహిల్స్ బరితెగించిన ప్రకటన ఈ బెదిరింపులలో భాగమే. 1989 జూన్‌లోనే అమెరికా ఈ "బ్రహ్మాస్త్రా"న్ని జపాన్, బ్రెజిల్‌పైనే గాక ఇండియా పైన కూడా ప్రయోగించింది. వచ్చేనెలతో ఈ బెదిరింపు గడువు ముగియడమేగాదు, ఆంక్షలు కూడా ప్రారంభంకానున్నాయి. "సూపర్ 301" కింద తనపై తీసుకొనే చర్యలకుగాని, బెదిరింపులకుగాని ఇండియా లొంగబోదని పార్లమెంటులో వాణిజ్యమంత్రి అరుణ్ నెహ్రూ చేసిన ప్రకటనను అన్ని పక్షాల సభ్యులు హర్షించారు. అయితే అరుణ్ హెచ్చరిక కొన్ని వాస్తవాలను తొక్కిపడుతోంది. ఎందుకంటే, మన అభివృద్ధికంటే వేగాతి వేగంగా పారిశ్రామిక పురోభివృద్ధి సాధించి ప్రపంచంలో అమెరికాకు అన్నిటా పోటీగా తయారైన జపాన్‌నూ, మనమాదిరే అప్పుల పర్వంలో పండిపోయిన బ్రెజిల్‌నూ "సూపర్ 301" ఆంక్షలనుంచి మినహాయించి, ఇండియాను మాత్రమే శిక్షించాలన్న ఉద్దేశం అమెరికాకు ఎందుకు కలిగిందో అరుణ్ నెహ్రూ సవివరంగా తెల్పలేదు. ఆ సత్యాన్ని బయటపెట్టనంతవరకు మనది అరణ్యరోదనగానే ఉంటుంది. ఎందుకంటే, వద్దువద్దనుకుంటూనే, లోగడ రాజీవ్ ప్రభుత్వం ఆశీస్సులు పలికి దేశంలోకి ఆహ్వానించిన "పెప్సీకోలా"లాంటి బహుళ జాతి గుత్త సంస్థల వ్యాప్తిని నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం ఎందుకని అరికట్టడంలేదు?

జపాన్ మాదిరిగా అమెరికాలో ఇండియా జరిపే వాణిజ్యం మిగులు ఖాతాలోది కాదు కదా? అయినా మనపైన ఈ ఆంక్షలు దేనికి? పైగా అరుణ్ చెప్పినట్టు ఇండియాలో అమెరికా పెట్టుబడులు బాగానే విస్తరించి ఉన్నప్పుడు, అందులోనూ "అమెరికా కంపెనీల వ్యాపారం సజావుగా"నే కొనసాగుతున్నప్పుడు ఇండియాపై ఈ "సూపర్ 301" భేతాళుని కత్తి దేనికి?! నిజానికి గుత్త పెట్టుబడి ఎప్పుడూ అర్థాధికారంతోనూ, అరకొర దణ్ణాలతోనూ, సగం సగం లొంగుబాటుతోనూ తృప్తిపడదు. దానికి రుణ గ్రహీత పూర్తిగా లొంగిపోవాలి. అదే ఇప్పుడు ఇండియా విషయంలో అమెరికా ప్రయోగిస్తున్న సన్నాయి నొక్కుళ్ళూ, ఆర్థిక దురాక్రమణపు ఆంక్షలూ. పైగా ఈ పనిని అమెరికా ఎలా చేస్తోంది? "స్వేచ్ఛా వాణిజ్యం' ' పేరిట. కానీ, ఇది తన వర్తక వాణిజ్యాలకు స్వేచ్ఛగానీ, ఇతర దేశాలకు కాదు. యూరోపియన్ ఆర్థిక వ్యవస్థలోని దేశాల పట్లనే గాక ప్రపంచంలోని మరి 12 దేశాలపట్ల కూడా దాని ధోరణి ఇలాగే ఉంది. లోకసభలో చర్చ సందర్భంగా కాంగ్రెస్(ఐ) సభ్యుడు, మాజీ మంత్రి చిదంబరం స్థూలంగా అరుణ్ నెహ్రూ ప్రకటనకు మద్దతుప్రకటిస్తూనే కొన్ని అవాకులు ప్రేలారు. జపాన్, బ్రెజిల్‌లు తమ విధానాన్ని స్పష్టంగా ప్రకటించాయి, కాబట్టి వాటిపైన అమెరికా ఆంక్షలు రద్దు చేసిందనీ. కానీ ఫ్రంట్ ప్రభుత్వం కూడా "సూపర్ 301"కి లొంగిపోయిందీ, లేనిదీ చెప్పలేకపోయిందని గమనించాలి. పైగా జపాన్, బ్రెజిల్‌లు చేసిన పని వాటి వాటి స్థాయిలో అమెరికా ముందు మోకరిల్లడమే. అయితే ఆ మోకరింపు - ఇరువురి సమ ఉజ్జీల మధ్య ఉభయ తారక రాయితీలు, ప్రపంచ వర్తకంపై పెత్తనం కోసం కుదిరిన పరస్పర రాయితీలు. ఈ కుట్రలో భాగంగానే పన్నెండు షరతులను జపాన్ అంగీకరించింది. 11,500 కోట్ల డాలర్ల రుణ భారంలో ఉన్న బ్రెజిల్ ఆర్థిక వ్యవస్థ నడుం కాస్తా కుంగిపోబట్టి, అదీ లొంగిపోయింది. అలాగే గత 43 ఏళ్ళలోనూ లక్ష కోట్ల రూపాయలకు పెరిగిపోయిన రుణభారం మూలంగా ఇండియా కూడా ఏం చేయాలో, ఏం

చేద్దామని ఈ రుణాన్ని పెంచుకుంటూ పోయారో దేశ ప్రజలకు వి.పి.సింగ్, అరుణ్ నెహ్రూలే కాదు. రాజీవ్, దినేష్‌సింగ్, చిదంబరంలు కూడా సమాధానం చెప్పాలి. ఏం చేయాలో వారు చెప్పకపోతే, ''సూపర్ 301'' ద్వారా అమెరికా అయినా చెప్పి తీరుతుంది. ఏం చేయాలట - దేశంలోని విదేశీ జీవిత భీమా కంపెనీలను జాతీయం చేయరాదు, విదేశీ పెట్టుబడులపై ఆటంకాలను తొలగించాలి. స్థానికంగా తయారయ్యే దేశవాళీ పనిముట్లకు ప్రాధాన్యం ఇవ్వరాదు. ఎగుమతులపై ఆంక్షలు తొలగాలి. ఈ చర్యలు తీసుకున్నప్పుడు భారత ఆర్థిక వ్యవస్థ కుప్పకూలే పక్షంలో ఆ భారాన్ని అమెరికా ఆదుకొంటుందట!! ముందు గొయ్యి, వెనుక నుయ్యి అంటే ఇదే!!.

బుధవారం 9, మే 1990

# “సూపర్ 301”: ప్రమాదంలో ఇండియా (2)

అమెరికా ఏ పరిస్థితులలో ఇండియాను వాణిజ్య ఆంక్షలకు, రాజకీయపరమైన సన్నాయి నొక్కుళ్ళకూ గురిచేస్తోంది? ఆర్థికంగా, ముఖ్యంగా వాణిజ్యం లోటు పెరిగిపోతున్న సందర్భంగా, విదేశీ రుణభారం తడిసి మోపెడై ఉన్న దశలో, అంతర్జాతీయ మార్కెట్‌లోని డాలర్‌తోనేగాదు, బహుళదేశాల కరెన్సీ "కలగూరగంప"తో కూడా రూపాయి మారకం విలువ బాగా దిగజారిపోయిన దశలో ఈ వత్తిళ్ళకు ఇండియా గురి అవుతోంది. అంతేగాదు, విదేశాలకు ఇవ్వదేలిన మన రుణాల మొత్తం మార్చి 21 నాటికి లక్షకోట్ల రూపాయలకు చేరుకోవడమేగాక దేశీయ బడ్జెట్లను కేంద్ర ప్రభుత్వాలు అలవికాని లోటు పద్దులుగా మార్చి, దేశీయంగా ఇంతకు ముందెన్నడూ లేని స్థాయిలో మార్కెట్‌లో మరికొన్నివేల కోట్ల రూపాయల రుణాల కోసం ఎగబడినందునా, ప్రణాళికాబద్ధమైన విధానానికి విరుద్ధంగా ఖర్చులు పెంచేసినందునా దేశం నేడీ దుస్థితికి చేరుకోవలసి వచ్చింది. నిత్యావసర సరకుల పంపిణీ వ్యవస్థను పటిష్ఠం చేయడంలో విఫలమైన దశలో, నిరుద్యోగ రాక్షసి కోరలు చాచి నర్తిస్తున్న దశలో ఈ వత్తిళ్ళు వస్తున్నాయి. ఇండియాకు వ్యతిరేకంగా దాని ఇరుగు పొరుగుకు సైనిక, ఆర్థిక సహాయం ముమ్మరం చేయడంవల్ల కూడా దేశం ఈ వత్తిళ్ళకు లోను కావలసి వస్తోంది. అలాగే విదేశాలకు ఇండియా చెల్లించవలసిన రుణాలలో 40 శాతం పైగా పన్నులవల్ల వచ్చే రాబడి ద్వారా చెల్లించుకోవలసి వస్తున్న దశలో, ఏటేటా రాబడిలో 25 శాతం పైగా కేవలం రుణాలపై వడ్డీలు చెల్లించవలసి రావడం వల్ల, ఉన్న విదేశీ మారకద్రవ్యం కాస్తా కర్పూరంలా కరిగిపోతున్న పరిస్థితులలో ఈ వత్తిళ్ళు ఎక్కువయ్యాయి.

ఇలా మన ఖర్చుకూ, నికర జాతీయాదాయానికి పొత్తు పొంతన లేకుండా ఉంది. ఈ పరిణామాలను గమనించబట్టే బిలియనీర్లకు పడగలెత్తిన ప్రపంచ కోటీశ్వరులకు, వర్తక వాణిజ్య వర్గాలకు 'ఆచార్యత్వం' వహిస్తున్న అమెరికా దానికి నాయకత్వం వహించే గుత్త పెట్టుబడి సంస్థలూ అమెరికాలోని కొందరు సెనేటర్ల అభిప్రాయాలను కూడా ఖాతరు చేయకుండా “సూపర్ 301” చట్టాన్ని అమలులోకి తేవాలని నిర్ణయించాయి. వర్ధమాన దేశాలు సాధించాలని తలపెట్టుకునే స్వయం పోషక ఆర్థిక వ్యవస్థ ప్రయోజనాలను మూలముట్టుగా దెబ్బతీసే ఈ చట్టం అమలులోకి రాకముందునుంచే ఇండియాపైన అమెరికా ఇతర మార్గాలద్వారా వత్తిడి తీసుకు వచ్చింది. అది వివిధ వస్తువులను తయారు చేసేవారి 'పేటెంట్' హక్కులకు సంబంధించింది. అంతర్జాతీయ వాణిజ్య సభల తీర్మానాలకు విరుద్ధంగా కూడా దేశవాళీ “పేటెంట్ల”ను, వర్ధమాన దేశాల ఉత్పత్తి దారుల హక్కులను హరించివేసే పద్ధతులను అమెరికా అమలులోకి తెస్తోంది. దేశం ఆర్థిక,

పారిశ్రామిక, సాంకేతిక అభివృద్ధి దశలనుబట్టి ఈ పేటెంట్ హక్కులను నిర్వచించాలి తప్ప, వర్ధమానదేశాల రిసెర్చి-డెవలప్మెంట్ వ్యవస్థలను బాల్యదశలోనే పీకనులిమివేయడానికి ఏ సంపన్న దేశమూ ప్రయత్నించరాదు. ఆ మాటకొస్తే, సంపన్న దేశాలన్నీ తమ వర్ధమాన దశలలో ఈ స్వేచ్ఛను అనుభవించినవే. ఎటు తిరిగీ అవి వృద్ధిలోకి వచ్చిన తరువాతనే పితపబుద్ధులవల్ల నేడు వర్ధమాన దేశాల అభివృద్ధిని కుంటుపరిచే విధంగా "పేటెంట్" వ్యవస్థలో మార్పులు చేస్తున్నారు! ధనిక-పేద దేశాల ఆర్థిక వ్యవస్థలలోని తేడాపాడాలను గమనించకుండా వర్ధమాన దేశాలలో "స్వేచ్ఛా వ్యాపారం" పేరిట తమ గుత్త సంస్థల "పేటెంట్" హక్కులను పూర్తి రక్షణ కావాలని సంపన్న దేశాలు బలవంతం చేయడానికి వీలులేదు. వస్తువుల ప్రమాణాల పేరిట, సూత్రాల పేరిట ఈ గుత్తాధిపత్యాన్ని ఇండియా అనుమతించరాదు. పైగా ఇండియాలాంటి వర్ధమాన దేశంలో దేశవాళీ పరిశోధనలను (రీసెర్చి అండ్ డెవలప్ మెంట్) పణంగాబెట్టి ప్రత్యేకించి విదేశీ గుత్త సంస్థల "పేటెంట్" హక్కులకు సర్వరక్షణలూ కల్పించడం అనర్థదాయకం. ఇక్కడ సమస్య "పేటెంట్దారు" హక్కు ఒక్కటేకాదు. అనేక రంగాలలో అమలులో ఉన్న కార్యక్రమాలపైన (ఫుడ్ ప్రోసెసింగ్, దారిద్ర్య నిర్మూలన, పోషకాహారోత్పత్తులు, ఆరోగ్య రక్షణ, రోగాల నివారణ ఇత్యాది పథకాలు - సాంఘికంగానూ, ఆర్థికంగానూ చాల చెడు ప్రభావం పడుతుంది. ఈ కార్యక్రమాలకు చెందిన పరిశోధనా రంగంలో కొన్నివిజయాలు సాధిస్తున్న భారత పారిశ్రామికుల "పేటెంట్" హక్కులు దెబ్బతింటాయి. విదేశీ "పేటెంట్ల" దిగుమతిపై కేంద్రీకరించిననాడు దేశీయ పరిశోధనా శాలలకు తాళాలు వేసుకోవలసి వస్తుంది. ఎందుకని? దేశవాళీ వస్తూత్పత్తికి ప్రాణప్రదమైన దేశవాళీ సాంకేతిక పరిజ్ఞానాభివృద్ధికి ఈ ప్రత్యేక రక్షణలు బద్ధశత్రువులని మరవరాదు! విదేశీ "ట్రేడ్మార్క్"లు దేశసాంఘిక, అర్థికాభివృద్ధిని నైతికంగా ఎంత దెబ్బతీస్తాయో ఒక్కసారి ఆలోచించుకోవాలి!

ఈ విదేశీ "ట్రేడ్మార్క్"ల కొనసాగింపే అమెరికా "సూపర్ 301" చట్టం. ఇది ఇండియాపై విధించబోయే ఆంక్షల మూలంగా (స్వతంత్ర ఆర్థికాభివృద్ధికి కళ్ళాలువేసే చట్టం ఇది)భారత విదేశీ వాణిజ్య చెల్లింపుల పరిస్థితి మరింత అధ్వాన్నమవుతుంది. ఉదాహరణకు జౌళి వస్తువులు, వస్త్రాలు, చక్కెర, ఆటోమొబైల్స్, పరిశ్రమల అభివృద్ధి ప్రమాదంలో పడుతుంది. అమెరికా చెప్పే స్వేచ్ఛా వాణిజ్యం "స్వేచ్ఛ'గా దోచుకోవడానికే మార్గం వేస్తుంది. ఈ "సూపర్ 301"వల్ల అంతకన్నా పెద్ద ప్రమాదం - ఇండియా రాజకీయ స్వాతంత్ర్యానికే వస్తుంది. ఇండో - అమెరికన్ ఆర్థిక, వాణిజ్య ఉపసంఘం సమావేశాలు రోజుల తరబడి జరిగినా ఈ చట్టం విషఫలితాలను బేరీజు వేయడంలో భారత ప్రతినిధి వర్గం విఫలమైంది. అమెరికా లోగడమాదిరిగా కాశ్మీర్లో "ప్లెబిసైట్" ప్రతిపాదనను బలపర్చడంలేదనీ, ఈ వైఖరి ఇండియాకు తోడ్పడగలదనీ ప్రధాని వి.పి.సింగ్ అల్పసంతోషం ప్రకటిస్తున్నారేగానీ, రానున్న అసలు ప్రమాదాన్ని ఆయన గమనించినట్టు కనపడడంలేదు. జమ్మూ-కాశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్కు అమెరికా మద్దతు ఇవ్వడమేగాక, "స్వతంత్ర కాశ్మీర్" అవతరణకు బీజాలు నాటుతోందని గమనించాలి! అందుకే అది లిబరేషన్ ఫ్రంట్ అధ్యక్షుడు అమానుల్లాఖాన్ను అమెరికా పర్యటించడానికి అనుమతించింది.పైగా, ఒక వైపున "సిమ్లా ఒప్పందం" పరిధిలో కాశ్మీర్ సమస్యను ఇండియా-పాకిస్తాన్లు ముఖాముఖి పరిష్కరించుకోమని చెబుతూనే అమెరికా ఇంకొకవైపునుంచి కాశ్మీర్ సమస్య గురించి చర్చించడానికి ఇండియా పాకిస్తాన్లతో పాటు, అమెరికా, రష్యా విదేశాంగమంత్రులను కూడా ఆహ్వానించాలని పరోక్షంగా ప్రతిపాదించింది. అలాగేమనకు

సంబంధం లేకుండానే అమెరికా విదేశాంగమంత్రి జేమ్స్‌బేకర్, సోవియెట్ మంత్రి షెవర్డనాజే కాశ్మీర్ సమస్యపై మాస్కోలో మంతనాలాడారు. అమెరికా విదేశాంగ శాఖ సహాయమంత్రి జాన్‌కెల్లీ, రష్యా సహాయమంత్రీ వేరుగా చర్చలు జరుపుతున్నారు. ఇలా ఒకవైపునుంచి దేశానికి జీవనాడైన విదేశీ వాణిజ్యాన్ని దెబ్బతీసే చట్టాన్ని మనపై అమెరికా రుద్దడానికి ప్రయత్నిస్తూనే ఇంకొక వైపునుంచి మిలిటరీ విమానాల తయారీకి (టి.ఎఫ్-5) సాంకేతిక పరిజ్ఞానాన్ని అందజేస్తామని చెప్పి బులిపింపచేస్తోంది. అదేమంటే, చెడిపోయిన తూర్పుయూరప్ దేశాలను చూసైనా ఇండియా నేర్చుకోవాలంటే, అన్ని రకాల ఆంక్షలను, కంట్రోళ్లను విదేశీ పెట్టుబడులపై ఆటంకాలను వెంటనే తొలగించాలని అమెరికా కోరుతోంది! ప్రెసిడెంట్ జార్జిబుష్ దాచుకోకుండా చెక్కేశాడు: "మా విధానం గురించి ఎవరూ పొరబడొద్దు. మాకు కావలసింది ఓపెన్ మార్కెట్టు; మా సరకులకు, సర్వీసులకు పెట్టుబడులకు, మా భావాలకూ స్వేచ్ఛ, ఆదరణా"!

గురువారం १०, మే १९९०

# విషయసూచిక

"దేశద్రోహం" జాతీయమైన వేళ...

గాంధీ భావనలో 'మతం'

విషమ ఘడియలలో-వివేకానందుడే శరణ్యం

హైందవ ధర్మ ప్రతినిధి వివేకానంద మాత్రమే

# "దేశ ద్రోహం" జాతీయమైనవేళ...

మానవునిలోని సగం రాక్షసాంశ, సగం మానవాంశ, మంచి చెడుల పూర్ణ కుంభం. అలాంటి వాడు లెజిస్లేటర్ అయినా, మంత్రి అయినా, అంతకుమించి ఉన్నత పదవులలో ఉన్నా అప్పుడప్పుడూ వారి నుంచి వెకిలి మాటలూ, వెలికి చేష్టలూ పుడుతూవుంటాయి. వీటిని ఏ ప్రవర్తనా నిబంధనావళీ నియంత్రించలేదు. ఎన్నికలు ఇంకా దగ్గరపడనేలేదు, ఎన్నికల ప్రచారోద్యమం ప్రారంభమే కాలేదు. అయినా కేంద్ర రాష్ట్ర నాయకులు అప్పుడే సాధారణ ప్రసంగాల్లో కూడా తమ పరిధులకు మించి, అవధులు దాటి, దేశ, రాష్ట్ర గౌరవ ప్రతిష్ఠలకు భంగకరమైన మాటలను 'ఉచితంగా' దొర్లించేస్తున్నారు. రాజకీయ వేత్తలు ఆత్మ నిగ్రహం లేకుండా చేసే ఈ ప్రసంగాల వల్ల నష్టం వారికి కాదు - దేశం యువతరానికి మాత్రమే. రాజకీయాలంటే బజారు తిట్లూ, రాజకీయ వేత్తలంటే 'బజారు మనుషులు' కాబోలునన్న దురభిప్రాయం యువతరం మనస్సుల్లో నిలిచిపోయే ప్రమాదం ఉంది. వంచనకు, అబద్ధాలకు బీజాలు పడేది కూడా ఈ సందర్భంలోనేనని మరవరాదు. గత వారం రోజులుగా పాలక పక్షం, ప్రతిపక్షాల నాయకులు చేస్తున్న ప్రకటనలూ, ప్రసంగాలూ, వారు చెబుతున్న మాటలూ ఏమాత్రమూ గౌరవ ప్రదంగా లేవు. లెజిస్లేచర్లలోనే కాదు, బయట కూడా "ప్రజా ప్రతినిధుల"మని భావించుకుంటున్నవారు హుందాగానే వ్యవహరించాలి. లెజిస్లేచర్ నిండు పేరోలగంలో వాచాలత వల్ల నోరు జారినా అది సభాపతుల సంస్కారాన్ని బట్టి, పార్లమెంటరీ పరిభాషకు భిన్నమన్న పేరుతో రికార్డుల నుంచి తొలగించుకోవచ్చు. కాని పత్రికా ప్రకటనలలో, గోష్ఠులలో, సభాముఖంగా వచ్చే తిట్లనూ, బూతులనూ, రికార్డుల నుంచి తొలగించడంకష్టం - ప్రజలలోకి పాకిపోతాయి కాబట్టి. ఈ జాగ్రత్త లేనందుననే మన నాయకులు హద్దులు తప్పిపోతున్నారు. 'సినిమాల్లో వేషాలు వేయడం తప్ప మరొక కీర్తిలేని వ్యక్తి ఎన్టీఆర్'' అనీ, అతనొక "చీట్" (మోసగాడు) అని ప్రధాని రాజీవ్ అంటే, అదే మోతాదులో నిగ్రహం కోల్పోయిన ముఖ్యమంత్రి ఎన్టీఆర్ - దేశ ప్రధానిని "దేశద్రోహి" అని నోరుపారేసుకున్నారు. వీరిని 'ఆదర్శం' చేసుకొని రాజకీయ ఛోటాలంతా అదే బాణీలో భారతీయ 'సంస్కృతి'ని పెంచడానికి ప్రకటనల వర్షం కురిపిస్తున్నారు. ఇంతకంటే రెండాకులు ఎక్కువ చదివిన కేంద్ర మంత్రి జలగం వెంగళరావు ఎన్టీఆర్‌ను సరాసరి "సి.ఐ.ఎ." ఏజెంటు అని నోరుజారారు. అంటే, ఏతావాతా మనం ఎవరి పాలనలో ఉన్నట్లు అర్థం వస్తుంది? "సి.ఐ.ఎ." ఏజెంట్ల, "మోసగాళ్ళ", "దేశ ద్రోహుల" పాలనలో మనం ఉన్నట్లు వీళ్ళు మనల్ని నమ్మమంటున్నారు. ఈ పదాలు ఇవాళ కాదు, చాలా ఏళ్లుగా వింటున్నాం. రాజకీయ నాయకుల్లో ఎవరికివారు తన ప్రత్యర్థులను పిలుచుకుంటున్న 'నాగరికమైన' తీరు అది! రెండేళ్ళనాడు వెంగళ్రావు విశాఖ సభలో సభ్యత కోల్పోయి 'ఎన్టీఆర్‌ను ఫుట్‌బాల్ తన్నినట్టు ఇక్కడ తంతే మద్రాసులో వెళ్ళి పడతాడు. అతనితోపాటు అతని అధికారులకు'' కూడా అదే గతి పడుతుందన్నారు. ఆ మధ్య కాలంలో మండల ఎన్నికల సందర్భంలో కూడా ఆయన చాలాసార్లు నోరుజారారు. ఫలితంగా ఇంకా మెరుగుపడవలసిన కాంగ్రెస్ విజయావకాశాలు

కొంతవరకు దెబ్బతిన్నాయి. మళ్ళీ ఇప్పుడు నిరాధారమైన నీలాపనిందలకు ఈ రాజకీయవేత్తలు ఏ మేరకు పాల్పడతారో, ఆ మేరకు వచ్చే ఎన్నికల్లో ఆయా పార్టీ విజయావకాశాలు దెబ్బతింటాయి; ప్రత్యర్థులను ఓడించమని చెప్పండి, చిత్తుచిత్తుగా ఓడించమనండి, ఎన్నికల కోసం చెప్పే మాటలను నమ్మవద్దని చెప్పండి - అంతేగాని, అక్కరకు రాని అపనిందలూ, ఇంకా ప్రజల తీర్పు కోసం వేచి వున్న వివాదాస్పద సమస్యలపై ఉద్రేకాలకు పోయి "నీవు శుంఠవంటే, నీవే పదింతలు శుంఠ"వని బజారు కెక్కడం రాజకీయం కాదు, అరాచకం. రాజ్య సభలో అయితే పాలపక్షానికి చెందిన ఒక సీనియర్ నాయకుణ్ణి అదే పక్షానికి చెందిన సభ్యుడు కొట్టాడు! అయినా ఎవరికీ పట్టలేదు. ఇంతకాలం ఏ సి.ఐ.ఏ.తోనూ, కె.జి.బీ.తోనూ ఎలాంటి సంబంధాల్లేకుండానే మన రక్షణ రహస్యాలు కట్టగట్టుకుని కుమూర్ నారాయణ్ ద్వారా అమెరికా, రష్యా, ఫ్రాన్స్‌లకు చేరలేదూ? ఏరోజు చూచినా మనరక్షణ పాటవం పెంపునకు ఏదో ఒక విదేశంతో మంతనాలాడు కోవడం లేదా? ఒక పాలక పక్షానికి గతంలో రెండుసార్లు అమెరికా నిధులను (రాజకీయ ప్రయోజనం కోసం) అందజేసిందని భారతదేశంలో మాజీ రాయబారి రాబర్ట్ మోనిహాన్ తన గ్రంథంలో చేసిన తీవ్ర ఆరోపణను ఇంతవరకూ ఖండిచించిన నాథుడు లేడు, మొనగాడు లేడు. ఎందుకని? ఇవన్నీ గాంధీ, నెహ్రూ, పటేల్ ఆశించిన రాజకీయ సంస్కృతికి భిన్నమైన 'సంకర సంస్కృతి'! ఎన్టీఆర్ వచ్చిన తరువాత"డ్రామా"కు విలువొచ్చింది! ఎందుకంటే "నాటకం" రాజకీయవేత్తలాడించే జగన్నాటకానికి రూప కల్పనే కాబట్టి! అందుకనే ఎన్టీఆర్‌ను తూర్పారబట్టబోయి నాటకాలనే అపహాస్యం చేయకూడదు. రాజకీయ భాగోతాలను, ఎత్తుకు పైఎత్తులను కాచివడపోసిన రచన'ముద్రారాక్షసం'.రాజకీయం కోసం ఎన్ని నాటకాలాడవలసి వస్తుందో, ఎన్ని మాయ మాటలు చెప్పవలసి వస్తుందో ఆచార్య చాణక్యుణ్ణి అడిగితే చెబుతాడు!

రాజ్యాంగ శాస్త్ర రచనలో మాదిరే, రాజకీయ పరమైన అవాకులకూ, చవాకులకూ కూడా మనకు గురుత్వం బ్రిటన్ నుంచే లభించినట్టు కనబడుతుంది! వెనక "రిఫార్మ్స్ బిల్లు" కామన్స్ సభలో చర్చకు వచ్చినపుడు ప్రత్యర్థులను మోర్లీ "వాళ్ళను మలిస్తే మలవండి, లేదా మట్టు పెట్టండి" ("Mend them or end them") అన్నాడు. నైతిక విలువలకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చిన బ్రిటిష్ పాలకుల్లో అగ్రగణ్యుడు బాల్డ్విన్. అయినా నాడు టోరీ పార్టీ చైర్మన్‌గా ఉన్న జోన్సన్ హిక్స్‌ను "అథమ స్థాయి సారాబట్టీవాడ"నీ, "గంజికి గతిలేని గుడిసెల వాడ"నీ ప్రేలాడట! ఇక ప్రధానులలో ఉద్దండుడుగా ప్రశస్తికెక్కిన లాయిడ్ జార్జి కూడా ఎగువ సభలో జీవిత సభ్యులైన (Life Peers) లార్డ్స్‌ను "సాలెగూళ్ళు, మడ్డి మూకలు, రాచపుండ్లు"గా వర్ణించాడు. (Cobwebby, dusty, muddy, sour)! పదకొండేళ్ళు పార్లమెంటు సభ్యుడుగా ఉన్న డేవిడ్ మార్కండ్ లెజిస్లేటర్లను "జూదగాళ్ళ"తో పోల్చుతూ ఈ లక్షణం "రాజకీయ వృత్తికీ, ప్రవృత్తికీ తొలిపాఠం" అన్నాడు (a prerequisite for a political career)! వాళ్ళవాళ్ళ ప్రవర్తనను బట్టి, అనుభవసారంగా ఆయన ఈ ఘాటైన విమర్శ చేయవలసి వచ్చింది. అలాగే, 1963లో ప్రొఫ్యూమో స్కాండల్ బయట పడినపుడు, మాక్మిలన్ ప్రభుత్వం కూలిపోవడానికి ప్రధాన కారణం - క్రిస్టియన్ కీలర్‌తో సెక్సు సంబంధం కాదు, అలాంటి సంబంధమేలేదని (రుజువైనప్పటికీ) పార్లమెంటులో ఆడిన పచ్చి అబద్ధం. ఆనాడు కన్సర్వేటివ్ సభ్యుడు ఫెల్, కవి బ్రేనింగ్ కవితను ఉదహరిస్తూ ఇప్పటికీ మాక్మిలన్ తన పదవికి అంటిపెట్టుకొని ఉండే పక్షంలో "విశ్వసించదగిన ఆ మహోదయాన్ని మళ్ళీ" మనం చూడలేకపోవచ్చు" అన్నాడు! (there could not be "glad confident morning again") మన వడ్డాది సుబ్బరాయ కవి చాటువు కూడా లోక రీతిని అక్షరబద్ధం చేసింది: "భువి మూఢ, మూర్ఖ జన, గార్ధభముల్, ముగురేక రాశియే" అన్నాడు. ఈ దేశానికి వట్టి కూతలవల్ల లాభంలేదు. 'దేశ ద్రోహం' జాతీయం కాకుండా ఉండాలంటే చేతలు కావాలి, చవాకులు కాదు!!.

ఆగస్టు 2, 1989

# గాంధీ భావనలో 'మతం'

ప్రవక్తల అది బోధలకు తూట్లు పొడిచే హక్కును కొందరు వంచకులకు ఎవరు కల్పించారో తెలియదు! కాని నేడు భారత జాతి సమైక్యతకు, సమభావనకు, సహజీవనానికీ హని కలిగించే మత శక్తులు తలెత్తి తాండవించ జూస్తున్నాయి. అన్ని మతాలలోని అజ్ఞానులైన చాంధసులకు అర్థంకాని విషయమూ, అర్థమయినా జనబాహుళ్యాన్ని ఇంకా అజ్ఞానంలోనే అట్టి పెట్టడానికీ ప్రధాన కారణం స్వార్థ ప్రయోజనాలతోపాటు, కొన్ని ప్రాథమిక సత్యాలు కూడా వారికి తెలియకపోవడమే! ప్రవక్తలు భావించిన 'మతం' వేరు, నేడు మనం కొందరి వక్రభాష్యాల ద్వారా వింటున్న 'మతం' వేరు. ప్రవక్తలకు 'ధర్మనిష్ఠ'ను మతం పేరు చెప్పకుండా పాటించడం పరిపాటి. ఆ మాటకొస్తే అన్యాయంపై, అక్రమాలపై, అరాచక రాచరికాలపైన, దుర్మార్గపు ప్రభు వర్గాలపైనా ధ్వజమెత్తి పేదల బతుకును చక్కదిద్దడం కోసం ఉద్యమించిన వారే ప్రవక్తలు. మోజెస్ - ఫారో చక్రవర్తులను సవాలు చేసి వారి దోపిడీ వ్యవస్థను కూలదోశాడు; క్రీస్తు ధనిక వర్గంపై తిరగబడి, దోపిడీని సమర్థించిన వారిపై కత్తికట్టాడు; బుద్ధుడు దోపిడీ వ్యవస్థకు బాసటగా నిలిచిన పురోహిత వర్గంపై ధ్వజమెత్తాడు; మహమ్మద్ మెక్కాలోని ధనిక వర్తక వర్గాలకు ఎదురుతిరిగి సమాజంపై వారి పెత్తనాన్ని అంతం చేశాడు; గురునానక్ కపట నాటకాలపైన, దొంగ కరుణ నటించేవారిపైనా విరగబడ్డాడు. ఈ చరిత్రంతా బోధిస్తున్నది భిన్న జాతుల మధ్య కేవల సహనాన్నే కాదు, ధనిక వ్యవస్థకూ, దోపిడీ వ్యవస్థకూ, పేద సాదల విముక్తి కోసం ఉద్యమించని 'ధర్మం' ధర్మం కాదనీ, మతం కాదనీ. కాని మధ్యలో - ఈ మతాలలో, వాటిని ఆశ్రయించిన మతాభిలాషులలో జన బాహుళ్యం ప్రయోజనాలకు విరుద్ధంగా కాయకష్టం చేసుకుని జీవించే ప్రజలపైన పెత్తనం చెలాయించే ధోరణి ఎందుకు చోటు చేసుకుంది? దీనికి జవాబు నిరక్షరాస్యతలో దొరుకుతుంది! అక్షర కుక్షులలో స్వార్థపరులు ఒక వర్గంగా బయలుదేరి, పోజులు పెట్టి, తప్పుడు భావాలు మెజారిటీ ప్రజలపై రుద్దడానికి చేసిన ప్రయత్నమే మానవతకు బదులు 'పెత్తన సంస్కృతి'కి దారితీసింది. ఇదే 'దోపిడీ సంస్కృతి'. ఒక సామాజిక శాస్త్రవేత్త చెప్పినట్టుగా మతవ్యవస్థలోని మానవతారాధకులు కారుచీకట్లలో కనుమరుగు కావలసి వచ్చింది. కనుకనే గాంధీజీ స్వాతంత్ర్య సమరంలో వివేకానందుని హేతువాద తాత్త్విక చింతనకు మరింతగా నారు పోసి నీరు పెట్టవలసి వచ్చింది. బ్రిటీష్ వాడు ఇండియాపై తన పెత్తనం మరి కొన్నేళ్ళు కొనసాగించడానికి చేసిన మొదటి పని - స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం వహిస్తున్న గాంధీజిని జనబాహుళ్యం నుంచి వేరు చేయడం కోసం ఒక తప్పుడు ప్రచారం ప్రారంభించడం! గాంధీజీ రాజకీయాల్లో మతాన్ని ప్రవేశ పెడుతున్నాడని ఒక బ్రిటీష్ పత్రిక చేసిన ఆరోపణకు 1920 మే 12న "యంగ్ ఇండియా"లో గాంధీజీ ఇచ్చిన సమాధానం నేటి మత చాంధసుల నోళ్లు కట్టించేదిగా ఉంది. తాను భావిస్తున్న మతం హిందూ మతం అని కాదనీ, హిందూ మతాన్ని తాను అభిమానించినా తాను

కోరుకుంటున్న మతం - హైందవ మత సరిహద్దులను కూడా అధిగమించి మానవుని స్వభావా మర్చాగలిగేదిగా ఉండాలనీ, నైతిక ధర్మానికి కట్టుబడేదిగా ఉండాలనీ, మానవునిలో శాశ్వత స్థానం నైతి ధర్మానికే గాని, మతానికి కాదనీ గాంధీజీ చెప్పారు. అంతే కాదు, "మతం లేకుండా రాజకీయాలు" లేవ మాటకు కొందరు దురర్థాలు తీస్తున్నారనీ, కాని తాను కోరుకుంటున్న మతం పరస్పరం ద్వేషించుకోడాని కొట్టాడుకోడానికీ ఉద్దేశించిన ధర్మం కాదనీ, తాను తలపోసిన మతం మానవతా మతమనీ అ విశ్వజనీనమైన సహజీవన మతమనీ గాంధీజీ 1940 ఫిబ్రవరిలో స్పష్టం చేశారు. ("Not the religio that hates and fights, but the universal Religion of Toleration")!!

అంటే దీనర్థం - తానాశించిన మతం నైతిక ధర్మమనీ, వసుధైక వ్యవస్థకు అవసరమైన నైతి ప్రభుత్వం అని కూడా వివరించాడు. అంతేగాదు, తానాశించిన 'మత' వ్యవస్థలో (నైతిక ధర్మంలో పిడివాదాలకూ, యజ్ఞయాగాదులు మొదలైన కర్మకాండలకూ, మూఢవిశ్వాసాలకూ, మత వైరాలకూ స్వమత దురభిమానాలకూ తావులేదనీ చెప్పాడు. పైగా తన మతం హిందూ, ఇస్లామ్, క్రైస్తవ ఇత్యాది మత సరిహద్దులకు అతీతం పొమ్మన్నాడు! ఈ మహా సత్యాన్ని ప్రపంచ మత సమ్మేళనంలో ఏనాడ వివేకానందుడు చాటి చెప్పాడు. అయినా మనకు బుద్ధి రావడం లేదు. ఈ ప్రవక్తల మాటలకు వక్రభాష్యాలు చెప్పి, వారు వివరించని, నినదించని భావాలను వ్యాప్తం చేస్తూ, ఊహా లోకాలలో విహరిస్తూ ఊహా చిత్రాలు రచిస్తూ జనబాహుళ్యాన్ని తప్పుమార్గం పట్టిస్తున్నారు. పాలకుల విధానాలు కూడా వక్రమార్గాలు పట్టాయి. రాజ్యాంగ నిర్ణయ సభ రాజకీయాలనుంచి మత సంస్థలను దూరం చేయాలని తీర్మానిస్తే - అందుకు కట్టుబడి ఉండకుండా రాజకీయ పార్టీలు స్వాతంత్ర్యానంతరం స్వార్థ ప్రయోజనాల కోసం ఏదో ఒక రూపంలో - మైనారిటీల పేరిట మత సంస్థలను అంటకాగుతూ, అక్కరకు రాని హామీలు ప్రకటిస్తూ వచ్చాయి. అధికారం కోసం, అధికారంలో ఉన్న రాజకీయ పక్షం ఆడే ఈ నాటకం చివరకి - ప్రధాని రాజీవ్ గాంధీ చెప్పినట్టు హిందూ రాష్ట్ర వాదానికీ, సిక్కు రాష్ట్రం, ముస్లిం రాష్ట్రం, క్రిస్టియన్ రాష్ట్ర, వాదాలకు దారితీస్తుంది. నిజానికి సెక్యులరిజం మాతాతీతమైన లైకిక రాజ్యాంగ వ్యవస్థగా చెలామణీ కావడానికి పునాది వేసింది కూడా - గాంధీయేనని మరవరాదు. ఒక మతాధిపతితో మాట్లాడుతూ గాంధీజీ 'సెక్యులర్ సంక్షేమానికి, ఆరోగ్యానికి, కమ్యూనికేషన్స్‌కు, కరెన్సీకి ఇత్యాదులకు ప్రభుత్వం పూచి పడుతుందేగాని మీ వ్యక్తిగత' మత విశ్వాసాలకు, నా వ్యక్తిగత విశ్వాసాలకు పూచీ పడదు. ఆ విశ్వాసాలు కేవలం వ్యక్తిగతమైనవి' అన్నాడు. ప్రాథమిక హక్కుల విషయమై 1931లో కరాచీ కాంగ్రెస్ చేసిన తీర్మానంలో కూడా మత స్వేచ్ఛ గురించి స్పష్టం చేసిన ప్రకటన కూడా గాంధీజీ ఆశీస్సులతో చేసినదేనని మరవరాదు! దేశానికి 'రామరాజ్యం' కావాలని గాంధీజీ అన్నాడు కాబట్టి, ఆయనకు రామునిలో విశ్వాసం ఉందికాబట్టి, ఆయన "రఘుపతి రాఘవ రాజారామ్" అని పాడుకున్నాడు కాబట్టి - ఉపఖండంలోని అన్ని భూములనూ 'రామజన్మ భూములుగా' మార్చివేయాలన్న కొందరి తలంపు నిరర్థకం, నిర్హేతుకం. అందుకే గాంధీజీ మత విశ్వాసం - కేవలం వ్యక్తిగతం అని చాటవలసి వచ్చింది. అందుకే, మతోన్మాదానికి మహాత్ముడు కూడా బలికావలసి వచ్చింది. అయితే భారత చరిత్రలో ఎన్నటికీ చెరగని మచ్చ - సహనం కోల్పోయిన పరమతావలంబకుని చేతిలో కాకుండా, పరమత ద్వేషిగా మారిన తన హిందూ మత చాంధసుని ఉన్మాదమే గాంధీజీ ఉసురును తీసుకోవడం!!

అక్టోబర్ 13, 1989

# విషమ ఘడియలలో - వివేకానందుడే శరణ్యం

వాల్మీకి రాముని ఆదర్శాలతో సంబంధం లేకుండా మానవీయమైన ఆత్మ చైతన్యాన్ని మాత్రమే ప్రబోధించిన రామాయణ కథతోకూడా సంబంధం లేకుండా, చారిత్రికంగానూ, సాహిత్యపరంగానూ వివాదస్పదంగా ఉన్న "అయోధ్య" కేంద్రంగా సాగుతున్న "రామజన్మభూమి-బాబ్రీమసీదు" తగాదా నేడు జాతీయ సమైక్యతకు, దేశ సమగ్రతకూ హానికరంగా పరిణమించింది. పరమత సహనానికి పేరుమోసిన భారతదేశం ప్రయోజనాలకూ, ప్రపంచానికి జ్ఞానభిక్ష పెట్టామని చెప్పుకొంటున్న మన ధర్మశాస్త్రాలకూ విరుద్ధంగా బి.జె.పి.-వి.హెచ్.పి., ఆర్.ఎస్.ఎస్., భజ్రంగ్‌దళ్‌లు వ్యవహరించడం దురదృష్టకరం. ఈ సందర్భంగా అక్టోబర్ 21న కన్యాకుమారినుంచి రాష్ట్రపతి శ్రీ వెంకట్రామన్ ప్రకటించిన ఆవేదన, 22వ తేదీన (సోమవారం) దేశ ప్రజలనుద్దేశించి ప్రధాని శ్రీ వి.పి.సింగ్ చేసిన హెచ్చరిక - ఒకే నాణానికి రెండు ముఖాలు. అయోధ్య వివాదం పేరిట వివాదాస్పదమైన భూమిలో రామాలయ నిర్మాణానికి, బాబ్రీమసీదు తొలగింపునకూ కొందరు ఛాందసులు నిర్ణయించుకున్న సందర్భంగానే ఉభయ నాయకులూ చేసిన ప్రకటనలకు యావద్భారత ప్రజలూ విలువ ఇవ్వవలసి ఉంది. వివాదంలో ఉన్న భూమి తగాదాను ఉన్నత న్యాయస్థానం తేల్చేదాకా, లేదా హిందూ-ముస్లిమ్ వర్గాల ప్రతినిధుల మధ్య స్థానికంగానే చర్చలద్వారా పరిష్కారం అయ్యేదాకా దేవాలయ నిర్మాణాన్ని వాయిదా వేసుకోని పక్షంలో దేశంలో మత ప్రాతిపదికపై జనసమీకరణ జరుగుతుందనీ, తద్వారా దేశ సమైక్యతకూ, సమగ్రతకూ ప్రమాదం ఏర్పడగలదనీ ప్రధాని హెచ్చరించారు. రాజ్యాంగం మతాతీతమైన లౌకిక వ్యవస్థను దేశ ప్రజలకు గ్యారంటీ చేసింది కాబట్టీ, ఆ రాజ్యాంగ సూత్ర రక్షణ, శాంతి భద్రతల రక్షణా తన బాధ్యత అనీ, ఇలాగే ఈ వివాదం కొనసాగి చర్చలు అసాధ్యమయ్యేపక్షంలో తాను పదవిని త్యజించడానికి సిద్ధంగా ఉన్నానీ ప్రధాని ప్రకటించారు. సందేశం అర్థం స్పష్టం. ఈ ప్రకటన వెలువడిన పన్నెండు గంటలలో అయోధ్యకు "రథయాత్ర"నడుపుతున్న ఆ పార్టీ అధ్యక్షుడు ఎల్.కె. అధ్వానీ కూడా మధ్యలో అరెస్టుఅయ్యారు. దేశ జనాభాలో కటిక దారిద్ర్యంలో ఉన్న 40 కోట్లమంది ప్రజల భౌతికావసరాలను, వారి శ్రేయస్సును, ప్రజా సమస్యలనూ పట్టించుకోని వారు "మసీదు - మందిర" వివాదంలోకి లక్షలాదిమంది ప్రజలను బలవంతంగా దించి వారి జీవితాలతో చెలగాటమాడుతున్నారు. వందలాదిమంది బలిదానానికి (గోండా జిల్లాలో) రథయాత్ర కారణం కావడం అత్యంత విచారకరం. ఈసందర్భంలో భారతీయ దార్శనిక - దేశ భక్తులలో అగ్రగణ్యుడైన స్వామి వివేకానంద బోధలను ఈ అవివేక పరిణామం మధ్య గుర్తు చేసుకోవడం ఎంతైనా అవసరం.

కన్యాకుమారివద్ద వివేకానంద స్మారకస్థూపాన్ని సందర్శించినప్పుడు రాష్ట్రపతి నేటి పరిస్థితులను

తలంచుకుంటూ స్వామి వివేకానందలాంటి మహనీయులు బోధించిన విశ్వమానవ సౌభ్రాతృత్వం నేడు కొరవడినందుకు విచారం ప్రకటించారు. నిజానికి భారతీయ దర్శనాలలోని మానవీయ దృక్పథానికి ఈ దేశంలో వక్రభాష్యాలు చెప్పి, మూఢత్వాన్ని పెంచినవారేగానీ, వివేకానందునిలా వేదాల, ఉపనిషత్తుల భావాన్ని అర్థవంతంగా వివరించి చెప్పిన విజ్ఞులు తక్కువ! వివేకానందుడు మాధవసేవనే మానవసేవ అనలేదు. ఆ మాట మనిషిని కర్మయోగిగా మలచలేదని భావించి "మానవసేవే - మాధవసేవ" అని చెప్పి, భారతీయ దార్శనిక దృక్పథాన్ని దేశంలోనేగాక యావత్ప్రపంచంలోనూ విస్తరింపచేశాడు. సంఘం వనరులపైన విద్యావంతుడవుతున్న ప్రతి ఒక్క భారతీయుడూ సంఘానికి రుణపడి ఉంటాడనీ, అతను పేదవర్గాల విమోచన సిద్ధించేదాకా ఆ ప్రజలకు తన విజ్ఞానాన్ని, సేవలను పంచిపెట్టి, చైతన్యవంతులను చేయమన్నాడేగానీ క్షుద్రమైన రాజకీయ ప్రయోజనాలకోసం మత ధర్మాలను వినియోగించుకోమని వివేకానందుడు బోధించలేదు. ఈనాడు కొందరు పేరుమోసిన కుహనా స్వాముల మాదిరిగా ఆయన "రామాలయ నిర్మాణం ఇటుకలతో కాకపోతే మానవ అస్థిపంజరాలతో" కొనసాగిస్తామని ఏనాడూ చొల్లుమాటలు, పొల్లుమాటలు పలకలేదు! "బ్రహ్మం" అంటే "జ్ఞానం" అనీ, సత్యమనీ మానవుడే దేవుడనీ, అంతకు మించినవాడనీ చెప్పినవాడు వివేకానందుడు. అంతేకాదు, "ఏ ప్రజలనుంచి అయితే పాలకులు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తమ అధికారం పొందుతున్నారో ఆ ప్రజలనే (పార్టీలు) పాలకవర్గాలు విస్మరిస్తూండడం" ఖండనార్హమని చెప్పాడు. త్యాగం చేయమన్నాడేగానీ, అది పేదసాదల సముద్ధరణకోసం, జాతి స్వాతంత్ర్యంకోసం మాత్రమే జరగాలన్నాడు. ఈ మాటలు ఉటంకిస్తున్నప్పుడు చీరాల "రామదండు' ' నేత దుగ్గిరాల గోపాలకృష్ణయ్య 'రామ' శబ్దానికిచ్చిన నిర్వచనం మరువరాదు; "రా" అంటే రాజ్యం అనీ, "మ" అంటే మనదే అనీ (రాజ్యం మనదే) చెప్పాడాయన. ఆయన తలపెట్టిన 'రామదండు' పన్నుల నిరాకరణోద్యమానికి నాయకత్వం వహించిన దండు మాత్రమేగాని మైనారిటీలను రెచ్చగొట్టే దండయాత్ర కాదు! ఉప్పు సత్యాగ్రహానికి గాంధీజీ సమకూర్చింది "దండియాత్రే"గాని దండయాత్ర కాదు!

అంతేకాదు, సహనం ప్రధానమన్న వివేకానందుడు ఆధునిక భారతం అలవరచుకోదగిన మంచి లక్షణాలను కూడా ప్రబోధించాడు; "సంస్కృతీ విభవంద్వారా ఈ కులవ్యవస్థ నుంచి సోషలిజం వైపుగా" మనం పురోగమించాలన్నాడు. విద్య మనిషికి ఆత్మవికాసానికి మార్గం కాబట్టి విద్యను అందరికీ అందుబాటులో ఉంచాలనీ, ఆత్మ వికాసం ద్వారానే సమాజసేవ సాధ్యమనీ, దైవ చింతనలో కూడా వ్యక్తి తన ఆత్మ ఔన్నత్యాన్ని విస్మరించకూడదనీ చెప్పినవాడు వివేకానందుడే! ఎటుచూసినా, అతను మానవుని ఔన్నత్యానికే బ్రహ్మరథం పట్టాడే గానీ, 'అహంకార బ్రహ్మ'కు మాత్రం పట్టలేదు. వివేకానందుని మానస సరోవరంలో విహరించేవి కేవలం భారతీయ దర్శనాలే కాదు; అర్థసత్యాలకూ, అసత్యాలకూ, వక్రభాష్యాలకూ దూరంగా నిలిచిన వివేకానందుడు విజ్ఞానవాది కావడంవల్ల అనార్కిజం, నిహిలిజం, సోషలిజం, కమ్యూనిజం వంటి పాశ్చాత్య భావజాలాన్ని కూడా అవగతం చేసుకొన్న పిమ్మటనే కేవలం హైందవాచారునిగా ఉండకుండా విశ్వమానవతా దృక్పథానికి ప్రాతినిధ్యం వహించగలిగాడు. అన్ని మతాల సారం మానవ శ్రేయస్సే అయినప్పుడు "హైందవం" సహా తుదకు అన్ని మతాలూ (ఇస్లామ్, క్రైస్తవం, బౌద్ధం, జొరాస్ట్రియనిజం) ఉనికిని కోల్పోక తప్పదని కూడా ఏనాడో జోస్యం చెప్పాడు! గీతావాక్యం ఉదాహరిస్తూ ఆయన "ఎవరి ప్రవర్తనవల్ల ఈ ప్రపంచానికి ఆందోళన ఉండదో అలాంటివాడే నా దృష్టిలో నిజమైన భక్తుడు" అన్నాడు. అంతేగాని వందలాదిమంది అమాయకులను బలితీసుకునే ఉద్యమాలకు దేవుని

పేరిట సారథ్యం వహించే మత రాజకీయశక్తులకు ఆయన ఆశీస్సులు పలకలేదు! ఇంతటి విశిష్ట దార్శనికుడైన స్వామి వివేకానంద చివరికి మూఢ విశ్వాసాలను కూడా శరించాడు. భక్తికీ, మూఢత్వానికీ, తేడాను చూడమన్నాడు: "మౌఢ్యం బుర్రలోకి చొరబారిందంటే, ఆ బుర్ర మెత్తబడిపోతోందంటే, ఇక వ్యక్తి జీవితంలో పతన దశ ప్రారంభమైనదన్నమాటే. మర్మం, మౌఢ్యం - బలహీనతకు నిరంతర చిహ్నాలు" అని చెప్పాడు.

అందుకే మన వాళ్ళు నిజమైన భక్తికి నివాళి పత్రం, పుష్పం, ఫలం అన్నారుగాని విగ్రహం అనలేదు! ఆత్మ ఉన్నది చైతన్యం కోసమే గాని ఆగ్రహం కోసం కాదు! మనస్సును అదుపాజ్ఞలలోపెట్టుకోగలిగిందే "యోగం" అన్నారు. కనుకనే భారతీయ దర్శనాల్లోని నాలుగు యోగాలలో (కర్మ, రాజ, భక్తి, జ్ఞాన యోగాలు) ఏ ఒక్కటీ హేతువుకూ, హేతువాద దృష్టికీ విరుద్ధంగా వ్యవహరించడానికి వీలులేదన్నాడు వివేకానందుడు! మోసగించడానికి, మోసానికి గురికావడానికి ఇవి ప్రాతికూల్యమన్నాడు. కనుకనే ఎవరి తృప్తికోసమో అని చెప్పి ఆత్మను చంపేసుకొని ఎగబడి వెంటపోవద్దన్నాడు! భారత దార్శనిక రత్నాలు అజ్ఞానులూ, మూఢులైన కొందరి భాష్యకారుల చేతులలోపడి హేతుదృష్టికి చేటు తెచ్చుకున్నాయని బాధపడ్డాడు! ఇప్పటి రామజన్మ భూమి - బాబ్రీ తగాదాకు బీజంకూడా ఇదేనని మరువరాదు!!

బుధవారం అక్టోబర్ 24, 1990

# హైందవ ధర్మ ప్రతినిధి వివేకానంద మాత్రమే




ణగణాలకు అర్థం మనిషిలో పునరావృతమవుతూండే లక్షణాలు, అలవాట్లేనని, ఇలా కాలక్రమంలో "రిపీట్" అయ్యే అలవాట్లవల్ల పొందే అనుభవాలే తిరిగి మనిషి గుణాలను వ్యక్తిత్వాన్ని సంస్కరించి, దిద్ది తీర్చుతూ ఉంటాయనీ హైందవ ధర్మంలోని మేలిమిగుణాలన్నింటికీ సరైన వారసుడూ, దేశభక్తి మూర్తీభవించిన ఏకైక ధర్మప్రవక్త వివేకానంద అన్నాడు. కానీ, మన 'గుణం గుడిసేటి'దైనప్పుడు వివేకానందుడు కూడా చేయగలిగింది లేదని రామజన్మభూమి - బాబ్రీమసీదు సమస్యపై భారతీయ సామాజికులతోనూ, ప్రభుత్వంతోనూ తగాదాలుపడి, వాటిని పెంచి, భిన్నమతాలతో కూడిన వ్యవస్థను ఛిన్నాభిన్నంచేస్తున్న విశ్వహిందూ పరిషత్తు, బి.జె.పి. శివసేన, భజ్రంగ్‌దళ్ వర్గాలు ఆచరణలో నిరూపిస్తున్నాయి. నాయకులు చెక్కుచెదరలేదు, కానీ, మసీదు-మందిర సమస్యపేరుతో సాంఘిక, ఆర్థిక న్యాయం కోసం సమతా వ్యవస్థకోసం జరపవలసినపోరాటంలో అగ్రభాగాన నిలబడవలసిన యువకులు కొందరిని బలిగొన్నారు. ఈ "కరసేవ"కు, ఆ పేరిట జరిగే "యజ్ఞ"యాగాదులకు ఇప్పటికైనా దేశంలోని సెక్యులర్ శక్తులన్నీ విజ్ఞాన ప్రచారం ద్వారా స్వస్తి చెప్పించకపోతే దేశం అధోగతిపాలు అవుతుంది. రథయాత్రవల్ల, ఉన్మాదపూరితమైన మత ప్రచారంవల్ల రెండు వర్గాల్లోని దురహంకారులు రెచ్చిపోయి, ప్రజలమధ్య దేశవ్యాపితంగానే కాకుండా విదేశాలలోని హిందూ మైనారిటీల ప్రయోజనాలకు కూడా ఇప్పటికే ఎంతో నష్టం చేకూర్చారు. ఇది గమనించ నిరాకరిస్తున్న ఈ మత శక్తులుమళ్ళీ "కరసేవ" పేరిట యజ్ఞయాగాదులకూ, వివాదాస్పద భూమిలోనే (వేరేస్థలం ఇస్తామన్నా) రామమందిర నిర్మాణం పూర్తిఅయ్యేదాకా ఈ "సేవ"ను కొనసాగించడానికే తలపడుతున్నారు. సంప్రతింపులను ఆదినుంచి వ్యతిరేకిస్తున్న ఈ వర్గాలు "మెజారిటీ పేరిట"సాగిస్తున్న కార్యకలాపాలన్నీ భారత ప్రజాబాహుళ్యం ప్రాథమిక ప్రయోజనాలకు, సమధర్మ సంస్కృతికీ, పరమత సహనాన్ని ప్రబోధించిన క్రియాశీలమైన సెక్యులర్ హైందవానికీ పూర్తి విరుద్ధం. కేవలం బి.జె.పి. రాజకీయ శక్తిగా బలంపుంజుకోవడానికి ఒకవేదికగా విశ్వహిందూపరిషత్, ఆర్.ఎస్.ఎస్ సంస్థలు ఈ "కరసేవ" తలపెట్టాయనడానికి, వాస్తవంలో వారు నిజమైన హైందవ మతధర్మాలన్నిటికీ విరోధులని చెప్పడానికీ నిదర్శనం - వి.పి.సింగ్ ప్రభుత్వంపై విశ్వాస ప్రకటన నవంబర్ 7న వీగిపోయేదాకా, "నవంబర్ 7"ను విమోచన దినంగా ప్రకటించుకోవడం! ఆ తరువాత బి.జె.పి. తప్ప మిగతా రాజకీయ పక్షాలన్నీ మధ్యంతర ఎన్నికలకు ప్రాతికూల్యం తెల్పడం, తద్వారా ఉన్మాద ఉద్యమంపై ఆధారపడి "నిప్పులలో పప్పులు" ఏరుకునే ఉద్దేశ్యంతో ఉన్న శక్తులు కాస్తా 'డీలా'పడిపోయి, మళ్ళీ 'డిసెంబర్ 6"న కరసేవ" ప్రకటించడమూ! అంటే, ఈ బెదిరింపులూ, సంఘ శాంతికి భంగకరమైన ఈ చర్యలూ చంద్రశేఖర్ ప్రభుత్వంపైనా, కాంగ్రెస్-ఐ పైనా రాజకీయవత్తిళ్ళు

స్వామీ వివేకానంద. మానవుడే దేవుడని భావించే లౌకికమైన వాస్తవ హైందవానికి ఏకైక ప్రతినిధిగా మనకు వివేకానందుడొక్కడు చాలు, మిగతా అమాంబాపతు సరకూ అనవసరం! ఎందుకంటే, ఆత్మ చైతన్యాన్ని దైవంగా భావించి విగ్రహారాధనను నిరసించి, పెక్కు సంస్కరణోద్యమాలకు పునాదులు వేసిన తొలి ఆర్య సమాజ భావాలతో ఉద్దీపితుడైన వివేకానంద 30 ఏళ్ళకే భిన్నమతాలు కొలువుచేసిన ప్రపంచ మహాసభ (చికాగో)లో చేసిన ప్రసంగం - అన్ని మతాల సారం మానవుని సముద్ధరణ మాత్రమేనని స్పష్టం చేసింది! "మానవుని బాగోగులకు నిర్ణేత మానవుడేనని" చెప్పినవాడు వివేకానంద; కొందరు మత నాయకులు "జాతీయ దృక్పథం" అవసరం గురించి పదేపదే కొత్తగా ప్రస్తావిస్తున్నారు. దానికి కూడా వివేకానంద తిరుగులేని జవాబిచ్చాడు. ఏది జాతీయ దృక్పథం? ప్రజల సమస్యలను విస్మరించి ప్రక్కదారులు తొక్కించడమా? కాదు, కాదు, "ప్రజాబాహుళ్యాన్ని (వారి ప్రయోజనాలను) విస్మరించడమే జాతీయతగా తలపెట్టిన ఘోరమైన పాపం. మన పతనానికి అదో కారణం. ప్రజలను విద్యావంతులను, చైతన్యవంతులను చేసి, తిండి, వసతి, తదితర సౌకర్యాలతో వారి సంక్షేమానికి పూచీపడకుండా రాజకీయాలెన్ని ఆడినా లాభంలేదు. మన విద్యకూ, మన దేవాలయాలకూ ఖర్చుచేస్తున్నవాళ్ళు మన ప్రజలు. కానీ, తిరిగి మనవాళ్ళకి ముట్టజెబుతున్న ప్రతిఫలం - తన్నులు. ప్రజల్ని మనం బానిసలుగా మార్చాం. భారతదేశం పునరుజ్జీవనం పొందాలంటే, ప్రజలకోసం మనం పాటుపడాలి" అన్నాడాయన. ఇందుకోసం ఆయన అన్నిరకాల కుల, మత దురహంకారాలను చీల్చి చెండాడుతూ చివరికి మతాధిపతులను కూడా "దేశ అభ్యుదయానికి వ్యతిరేకులు"గా భావించి అసలా వృత్తినే రద్దు చేయమన్నాడు! దైన్యస్థితిలో ఉన్నవారిపట్ల ప్రేమానురాగాలు, సానుభూతి ప్రదర్శించి, అన్నార్తుల క్షుద్బాధ బాపడానికీ, తద్వారా మట్టినుంచి మాణిక్యాలను సృష్టించడానికీ, బుద్ధి జీవులైన కనీసం ఓ వెయ్యిమంది యువకిశోరాలు ఇండియాకు అవసరమన్నాడు వివేకానందుడు! అదీ జాతీయ పునరుజ్జీవనమన్నా, పునర్వికాస ఉద్యమం అన్నా!

బుధవారం నవంబర్ 14, 1990

# విషయసూచిక


| | |
|---|---|
| గల్ఫ్ సంక్షోభానికి బుష్-గోర్బీ 'గోలీ' (1) | 1-3 |
| గల్ఫ్ సంక్షోభానికి బుష్-గోర్బీ 'గోలీ' (2) | 4-6 |
| ఇరాక్‌పై అణ్వస్త్ర దాడికి సన్నాహం?! | 7-9 |
| బుష్ యుద్ధోన్మాదం | 10-12 |
| ఈ యుద్ధం అన్యాయం, అక్రమం (1) | 13-14 |
| ఈ యుద్ధం అన్యాయం, అక్రమం (2) | 15-17 |
| ఈ యుద్ధం అన్యాయం, అక్రమం (3) | 18-20 |
| బుష్ మొండిపట్టు-సద్దామ్ మంకుపట్టు (1) | 21-23 |
| బుష్ మొండిపట్టు-సద్దామ్ మంకుపట్టు (2) | 24-25 |
| "ఝుడనోవ్ అరకు"! సఖరోవ్ సరకు!! | 26-28 |
| జోడు పదవులలో గోర్బచేవ్ జోరు! | 29-31 |
| కాలజ్ఞాని గ్రోమిగ్ | 32-34 |
| "దశాబ్ది మనీషి" గోర్బీ! | 35-37 |
| సోషలిజానికి 'మంగళహారతి'?! | 38-40 |
| అగ్నిధార | 41-42 |
| ఈ రోజు మళ్ళీ రాకూడదు | 43-45 |

# గల్ఫ్ సంక్షోభానికి బుష్ - గోర్బీ 'గోలీ'



శ్చిమాసియాలోని గల్ఫ్ ప్రాంతంలోని కువైత్‌పైన ఇరాక్ చర్యలవల్ల తలెత్తిన సంక్షోభాన్ని పరిష్కరించేందుకు హెల్సెంకీ (ఫిన్లాండ్)లో అమెరికా, సోవియట్ అధినేతలు జార్జి బుష్ - మిఖాయిల్ గోర్బచేవ్ జరిపిన శిఖరాగ్ర సమావేశం కొత్తగా సాధించింది ఏమీ లేదు. ఆసియావాసులు తమ సమస్యలను తాముగా, అరబ్ దేశాలు తమ తగాదాలను తాముగా పరిష్కరించుకోడానికి వీలులేకుండా ఇతరుల ఆంతరంగిక విషయాలలో వాటా వీలూ చూసుకుని జోక్యం చేసుకునే అగ్రరాజ్య నీతికి హెల్సెంకీ సమావేశం మరోసారి ముద్రవేసినట్టయింది. "గల్ఫ్ సంక్షోభం" పేరిట ఈ రెండు అగ్ర రాజ్యాలూ తమ ప్రభావ ప్రాంతాలుగా అరబ్ దేశాలను మార్చుకొనేందుకు మాత్రమే - ఈ సమావేశం తోడ్పడేదిగా ఉంది. బ్రిటీష్ సామ్రాజ్యవాదులు విభజించి పాలించే రాజనీతిలో భాగంగా జోర్డాన్‌నూ, ఇరాక్‌నూ ఎలా చీల్చి, నేటి కువైట్ సమస్యను సృష్టించి పెట్టారో ఇప్పుడు గల్ఫ్ సంక్షోభం ఆధారంగా మరోసారి అరబ్‌లీగ్‌నూ, అరబ్ దేశాలనూ అగ్రరాజ్యాలు చీల్చి తమ పుబ్బం గడుపుకోచూస్తున్నాయి. కువైట్‌లో ఇరాక్ దుందుడుకు చర్యను ఖండించడం వేరు, ఖండన పేరిట అరబ్ దేశాలలో మతాతీతమైన లౌకిక రాజ్య (సెక్యులర్) వ్యవస్థగా, బలమైన రాజకీయశక్తిగా అవతరించిన ఇరాక్ ఆర్థిక వ్యవస్థ నవనాడులనూ దిగ్బంధనం చేయడం వేరు; తన ఆర్థిక వ్యవస్థను రక్షించుకోడానికి, ఉమ్మడిగా ప్రయోజనం పొందవలసిన సరిహద్దులలోని పెట్రోలియం వనరులను ఉత్పత్తి కేంద్రాలనూ కువైత్ అమీర్‌లు ఏకపక్షంగా వాడుకొంటున్నందుకు నిరసనగా దానిపైన ఇరాక్ చేసిన దాడిని ఎలా సమర్థించలేమో, అరబ్ దేశాల వ్యవహారాలలో ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల కూటమి ప్రత్యక్ష జోక్యాన్ని కూడా మనం సమర్థించలేము. అందులోనూ అన్ని అగ్రరాజ్యాలూ ఏదో ఒక సమయంలో సరిహద్దు 'వివాదాల' పేరిటనో, ఇరుగు పొరుగు 'ప్రమాదం' పేరిటనో, నియంతృత్వ పాలనకు 'ప్రతిఘటన' పేరిటనో, స్వజాతీయుల 'రక్షణ' పేరిటనో, దాడులు చేసి దురాక్రమణలకు పాల్పడినవే అయినందున హెల్సెంకీ నిర్ణయాలకు నైతిక విలువ లేదు.

ఇరాక్, కువైత్‌లలో ఉద్యోగాలు, వ్యాపారాలు నిర్వహించుకుంటున్న లక్షలాదిమంది విదేశీయుల పరిస్థితులను, అధికారుల యోగక్షేమాలను గురించి ఈషణ్మాత్రం కూడా ఆలోచించకుండా ఆంగ్లో-అమెరికన్‌లు తమ ఆర్థిక బందిఖానాలో ఉన్న ఐక్యరాజ్య సమితి భద్రతామండలి ద్వారా ఇరాక్‌పై ఆర్థిక దిగ్బంధనంకోసం తీర్మానాలు పెడితే, ఇరాక్‌పై అవసరాన్నిబట్టి బల ప్రయోగం చేయాలన్న తీర్మానం పెడితే - వాటికి రష్యా, చైనాలు 'డూడూ' బసవన్నలు కావడం దురదృష్టకరం, పతన రాజకీయం. ఇది ఏ పరిస్థితికి దారి తీసింది? భద్రతామండలి తనపైన విధించిన ఆర్థిక దిగ్బంధన చర్యలకు, ఆహారం,

మందుల సరఫరాలకై విధించిన ఆంక్షలకూ ఇరాక్ ప్రతిస్పందిస్తూ అవే నిబంధనలను ఇరాక్, కువైత్‌లలోని విదేశస్తులపైన, అధికారులపైనా విధించింది. వీరు ఇరాక్ విడిచివెళ్ళాలంటే అమెరికా, బ్రిటన్‌లలోని ఇరాకీలపైఆంక్షలు రద్దుకావాలన్నది; వీరికి మందులూ, ఆహారం అందాలంటే, ఇరాక్ ప్రజలకు కూడా అవి అందేలా అన్నిరకాల ఆంక్షలు రద్దు చేయాలని షరతు విధించింది. ఒక్క ముక్కలో చెప్పాలంటే - ఆంగ్లో అమెరికన్లు సాగిస్తున్న ఈ రాజకీయం అమెరికా, బ్రిటన్ భూభాగాలలో కాదు, వేలమైళ్ళ దూరాన వున్న గల్ఫ్‌లో అని మరచిపోరాదు. వియత్నాం ఊబిలో పాతికేళ్ళు చిక్కుకొని చెట్టుకొకరు, పుట్టకొకరుగా అనాథలై తోకముడుచుకోవలసి వచ్చిన ఫ్రాన్స్, అమెరికాలు ఇప్పటికీ గుణపాఠం నేర్చుకోకపోతే - ఆసియన్లు, అరబ్‌లూ కలిసి మరొకసారి నేర్పవలసి వస్తుంది. ఏడు గంటలసేపు ఆదివారంనాడు హెల్సెంకీలో సభ తీర్చిన బుష్-గోర్బీలు తమ సంయుక్త ప్రకటనలో "ఇరాకీ దురాక్రమణను సహించరాదు. పెద్ద దేశాలు ఇరుగుపొరుగు చిన్న దేశాలను మింగేస్తే ప్రపంచ శాంతి భద్రతలు అసాధ్యం" అని చెప్పారు. ఈ ప్రకటన చేస్తున్నప్పుడు తమ మాటలను ఇతర సభ్య ప్రపంచం - దెయ్యాలు వేదాలు వల్లించినట్లుగా భావిస్తాయన్న ఇంగితజ్ఞానం కూడా వారికి లేదు. ఇంతవరకూ ఏ అగ్రరాజ్యాల చర్యలవల్ల ప్రపంచ శాంతికి భంగం కలుగుతూ వచ్చిందో వారు ఆ చర్యల జాబితాను ప్రకటించి, అందుకు ప్రపంచ దేశాల ముందు బహిరంగంగా క్షమాపణ చెప్పి, ఆ తరువాత ఇరాక్ చర్యలను ఖండించి ఉంటే - ఓహో, ఎట్టకేలకు మానవజాతికి 'శాంతిశకం' ప్రారంభమైనదని అందరూ సంతోషించేవారు. అయితే ఇంత కపటనాటకంలో అయినా గుడ్డిలో మెల్లగా చేసిన నిర్ణయం - ఇరాక్, కువైత్‌లలో చిక్కుపడిపోయిన విదేశీయులకు ఆహారం, మందుల సరఫరాలపై "మానవతా విలువల' ' దృష్ట్యా ఆంక్షలు తొలగించాలన్నది!

అయితే ఈ ప్రత్యేక ఆంక్షను సడలించడంలో కూడా అగ్రరాజ్యాల భాష్యం ఎటు తిరుగుతుందో చెప్పలేం. సమితి భద్రతామండలి ఇరాక్‌పై ఇంతకు ముందు విధించిన ఆర్థిక దిగ్బంధనంలో ఆహారం, మందుల సరఫరాలు భాగం కారాదని తీర్మానం చెబుతున్నప్పటికీ, కాదు, వీలులేదు, దిగ్బంధనం అంటే అన్ని రకాలకు వర్తిస్తుందని సొంత పైత్యంతో బలవంతంగా ఇంతవరకూ ఇరాక్ ప్రజలనూ, ఇరాక్, కువైత్‌లోని ఆసియన్లనూ బాధలు పెట్టింది అమెరికా. ఇప్పుడు కూడా హెల్సెంకీ ప్రకటన ద్వారా అమెరికా చేయబోతున్నపని - మరొక మడతపేచీ పెట్టడం, దానికి గోర్బచేవ్ 'సై' అనడమూ. "మానవతా పరిస్థితులంటే ఏమిటో పరిశీలించి, నిర్ణయించి సమితి శాంక్షన్స్ కమిటీ, భద్రతా మండలికి సిఫార్సు చేస్తుంద"ట. మరో మాటలో చెప్పాలంటే, ఇరాక్, కువైత్ పౌరులను, అక్కడివారి పిల్లా జెల్లాను మినహాయించి, చిక్కుబడిపోయిన విదేశీ పౌరులకు మాత్రమే ఈ మందులు, ఆహారం అందేలా జాగ్రత్తపడాలని బుష్-గోర్బీ సారాంశం. ఇది సాధ్యమయ్యే పనేనా? ఇది గల్ఫ్‌లో శాంతి పునరుద్ధరణకుగానీ, కనీసం ఇరాక్‌ను చర్చలకు ప్రోద్బలం చేయడానికిగానీ తోడ్పడుతుందా? ఒకవేళ కువైత్‌నుంచి కొన్ని షరతులపైనైనా సద్దామ్ హుస్సేన్ (ఇరాక్) వైదొలగాలన్నా ఈ వైఖరి తోడ్పడుతుందా? ఒకవైపున తమ "ఉద్దేశం శాంతియుత పరిష్కారమే" నంటూనే సంక్షోభం ఉన్నంతకాలం ఇరాక్‌పై అమెరికా, రష్యాలు కలిసే ధ్వజమెత్తుతాయని బుష్-గోర్బీలు బెదిరించడం ప్రపంచ పోలీసు బాధ్యతలను అయాచితంగా నెత్తినెత్తుకోడం తప్ప మరొకటి కాదు. యూరప్‌లో రాజకీయ పరిణామాల దృష్ట్యా, రష్యా మెతకదనం ఆధారంగా తూర్పు యూరప్‌లో కల్లోలం సృష్టించడంలో జయప్రదమైన అమెరికా - ఆయిల్

సంపదకోసం ఇరాక్ చర్యను ఆసరాగా చేసుకొని గల్ఫ్‌లో స్థిరనివాసం ఏర్పరచుకోడానికి లక్షన్నర సైన్యాన్ని, యుద్ధ విమానాలను తమపై ఆర్థికంగా ఆధారపడుతున్న సౌదీ అరేబియా, తదితర దేశాల 'అమీరు"ల మెడలు వంచి దించింది. ఇండియాలో "గరీబీ హటావో" నినాదానికి అలవాటుపడిన మన పాలకులు, నేపాల్‌లో ప్రజాస్వామ్య పునరుద్ధరకు రాచరికం రద్దుకూ అన్ని రకాల సహాయం అందజేస్తున్న మనం, అరబ్ దేశాలలో "అమీరు"ల పతనాన్ని హర్షించలేకపోవడం, ప్రజల ఆత్మ విశ్వాసం కోల్పోయిన "ప్రవాస' ' పాలకులకు భరోసా చెప్పబోవడమూ హాస్యాస్పదం. ఆయుధ వ్యాపారంలో "అగ్రరాజ్యాల పోటాపోటీల ఫలితమే గల్ఫ్ సంక్షోభం కూడా. నాలుగేళ్ళుగా ఇజ్రాయేల్ దురాక్రమించిన ఆరబ్ (జోర్డాన్, సిరియా) భూభాగాల నుంచి దానిని ఖాళీ చేయించలేని అగ్రరాజ్యాలు ఒక్క ఇరాక్ పట్లనే ఎందుకింత దురాగ్రహం ప్రదర్శిస్తున్నట్టు? "దురాక్రమణ చెల్లదు, చెల్లనేరదని ప్రపంచానికి రుజువు చేయాలన్న" బుష్-గోర్బీ నిర్ణయం ఆచరణ సాధ్యం కావడానికి ముందు షరతుగా - తమ పలుకుబడిలోనో, ఆధీనంలోనో ఉన్న పనామా, నికరాగ్వా, ఎల్‌సాల్వడార్, ఫిలిప్పీన్స్‌లనుంచీ, అఫ్ఘనిస్తాన్‌నుంచీ, సఖాలిన్ దీవులనుంచీ ఈ రెండు అగ్రరాజ్యాలూ పూర్తిగా వైదొలగ వద్దా?! వాదనను ఏకపక్షం చేయడం దౌత్యనీతికి పరమ విరుద్ధం కాదా?!

మంగళవారం ॥ సెప్టెంబర్ ।౨౨౦

# గల్ఫ్ సంక్షోభానికి బుష్ - గోర్బీ 'గోలీ' (2)



రాక్ ఒక అరబ్ దేశంగా, తమ అరబ్ భూభాగంలో ఎన్ని తప్పులైనా చేసి ఉండవచ్చు. సరిహద్దు వివాదాలు, దేశ విభజనలు అరబ్బుల ఆంతరంగిక విషయాలు, ఇరుగు పొరుగు సమస్యలు. కాని ఖండంకాని ఖండంలో ప్రవేశించి తానొక తీర్పరిగా అశాంతిని మరొంత రెచ్చగొట్టి స్థానిక యుద్ధాలనేగాక, ప్రపంచ యుద్ధావకాశాలను కూడా పెంచే అంతర్జాతీయ పోలీసు గిరీని ఆంగ్లో-అమెరికన్లకు ఎవరిచ్చారు? ఈ సమస్యలపట్ల ఆసియా, ఆఫ్రికా, అరబ్ దేశాలన్నిటా నిశ్చితాభిప్రాయం వెల్లడికాకపోతే ప్రతిచోటా సామ్రాజ్యవాదులు ఏదో కుంపటి పెడుతూనే ఉంటారు. "101 జిల్లాలకు నేనే అందగాడిన"ని డబ్బా కొట్టుకున్నట్టుగానే అమెరికా కూడా అయిదు మహా సముద్రాలనూ తన యుద్ధ విహార కేంద్రాలుగా మార్చుకోవాలనుకుంటోంది. ఇప్పటికే మధ్యధరా సముద్రానికీ, గల్ఫ్ (సింధుశాఖ)కూ మధ్య సరిహద్దులను అది చెరిపివేస్తోంది. సద్దామ్‌ను హత్య చేయించడానికి బుష్ సి.ఐ.ఎ.ని పురమాయించినట్టు కూడా వార్తలు వచ్చాయి. కాని వాటిని బుష్ ఖండించలేదు. 1950లలో సూయెజ్ సంక్షోభం ఆసరాగా బ్రిటీష్‌వాడు అరబ్ దేశాల ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి ఎన్ని కుయుక్తులు పన్నాడో, నేడు గల్ఫ్ సంక్షోభంలో కూడా అమెరికా అన్ని ఎత్తులూ పన్నుతోంది. అయిల్ కోసం ఆరాటం అగ్రరాజ్యాలను దురాక్రమణకు పురిగొల్పుతోంది. గల్ఫ్ సంక్షోభంలో కువైత్‌లో ఇరాక్ చేసిన పని సొంత ఇంటికి నిప్పు పెట్టుకోవడమైతే, సౌదీ అరేబియాలోకి అమెరికా సైన్యాన్ని, యుద్ధ విమానాలను దించడం పరాయి దేశంపై పట్టపగలు సాగించిన బందిపోటు చర్యగా పరిగణించాలి. అమెరికా అరబ్ లీగ్‌ను చీల్చింది; గల్ఫ్ కో ఆపరేటివ్ కౌన్సిల్‌ను చీల్చింది. అయినా అరబ్ జాతీయతను అమెరికా జయించలేకపోతోంది. ఏ రోజుకైనా ఇరాక్ నేత సద్దామ్ హుస్సేన్ విజ్ఞప్తులను పాటించినంతగా అరబ్బులు అమెరికా మాట వినబోరన్నది తేలిపోయింది. సమితి భద్రతామండలి ఎన్ని తీర్మానాలు చేసినా, ఎన్ని ఆంక్షలు విధించినా, ఇరాక్‌ను ఎన్ని ఇబ్బందులు పెట్టజూచినా అరబ్ దేశాలలో, చివరకు ప్రజా వ్యతిరేకులుగా అరబ్బులలో ముద్రపడిపోయిన సౌదీ అరేబియా, కువైత్ "అమీర్"లు ఉన్న దేశాలలో కూడా అమెరికా వ్యతిరేక ప్రదర్శనలు జరుగుతున్నాయి. గల్ఫ్‌నుంచి అమెరికా వైదొలగిపోవాలని కోరుతున్నారు. కువైత్‌లో సద్దామ్ చర్యనూ, గల్ఫ్‌లో అమెరికా దురాక్రమణననూ ఒక్క గాటనుకట్టి చూడడానికి అరబ్బు ప్రజా బాహుళ్యం ఇష్టపడదు, సమ్మతించదు. పైగా ఇరాన్‌తో సఖ్యతకు రావడం ద్వారా అమెరికా వ్యతిరేక అరబ్ ఐక్య సంఘటనను సద్దామ్ మరింత పటిష్ఠం చేసుకొంటున్నాడు. ప్రజలలో అభాసుపాలై కేవలం అమెరికా ఆర్థిక, సైనిక సహాయంతోనే బతుకులీడుస్తున్న సౌదీ, ఒమన్, మస్కాట్, బాహ్రీన్, కత్తార్ "అమీర్"లనుంచి తప్ప మిగతా అరబ్ దేశాల మైత్రిని అమెరికా కోల్పోతోంది. కయిరోలో జరిగిన అరబ్

దేశాల శిఖరాగ్ర సభలో ఈ సత్యం మరింతగా వెల్లడైపోయింది. ఇరాక్ చర్యను పూర్తిగా బలపరచకపోయినా, కువైత్‌నుంచి ఇరాక్ సేనలు ఉపహరించడం మంచిదని చెబుతూ, సరిహద్దు వివాదాలను, భూభాగాల విలీనీకరణ సమస్యను చర్చలద్వారా పరిష్కరించుకోవాలని కోరిన ట్యునీషియా, సూడాన్, ఆల్జీరియా, లిబియా, మారిటానియా, జోర్డాన్, ఎమెన్, పాలస్తీనా విమోచన సంఘటన ఇరాక్‌పై అయిదు దేశాలు ప్రతిపాదించిన తీర్మానాన్ని వ్యతిరేకించాయి; గల్ఫ్‌నుంచి అమెరికా వైదొలగాలని కోరుతున్నాయి. ఈ పరిస్థితులలో, అమెరికా పరిస్థితి కుడితిలో పడిన ఎలుకలా తయారైంది. ఈ సంకటంనుంచి దానిని బయటపడవేయగల శక్తి ఇరాక్‌తో ఇంకా సంబంధాలు బెడిసిపోని రష్యా ఒక్కటేనని భావించింది అమెరికా. ఆ ఉభయ తారక సహకారమే హెల్సెంకీలో బుష్-గోర్బీల సమావేశం! అగ్రరాజ్యాలు ఆయుధ వ్యాపారం కోసం స్థానిక యుద్ధాలు రెచ్చగొడతాయి, యుద్ధాలకోసం ఆయుధ వ్యాపారం చేస్తాయి. ఈ బంధాన్ని శాశ్వతంగా తెగగొట్టగల రాజకీయ చైతన్యం ఆసియన్లకూ, అరబ్‌లకూ లేదా?

అంతేగాదు, గల్ఫ్ యుద్ధాన్ని 6 బిలియన్ డాలర్లు ఖర్చు చేసైనా సరే సాగలాగడానికి అమెరికా చేసే ప్రయత్నం వియత్నాంలో తనకు తానై కట్టించుకున్న "గోరీ"ని అమెరికాకే గుర్తుచేయవలసి వస్తుంది. అంతేకాదు, గల్ఫ్‌లో అమెరికా మోహరింపును పశ్చిమ యూరప్‌లో పెక్కు దేశాలు వ్యతిరేకించడమేగాక, గల్ఫ్ సంక్షోభంవల్ల యూరప్ ఆర్థిక వ్యవస్థ కూడా ఆయిల్ ధరలు పెరిగి తీవ్రమైన ఇన్‌ఫ్లేషన్‌లో ఈదులాడుతోంది. యూరోపియన్ సోషలిస్టులు, కమ్యూనిస్టులు, గ్రీన్స్ పార్టీ, బ్రిటన్‌లో లేబర్ పార్టీ నాయకులు (టోరోబెన్), పశ్చిమ జర్మనీలో ప్రధాన ప్రతిపక్షాలైన సోషల్ డెమోక్రాట్లు గల్ఫ్‌లో అమెరికా యుద్ధ ప్రయత్నాలను నిరసిస్తున్నారు. అమెరికా వైదొలగాలని కోరుతున్నారు. అంతేగాదు, "అమెరికా ప్రపంచాన్ని యుద్ధంవైపు నెడుతోంది, దాని తలబిరుసుతనాన్ని, కజ్జాకోరు వైఖరిని" ఖండించాలని యూరపియన్ దేశాల ప్రజలు కూడా నినాదాలిస్తున్నారు. అమెరికాకు ఫ్రాన్స్ మద్దతు ఉపసంహరిస్తోంది. ఇదే సందర్భంగా, 1992లో యూరోపియన్ యూనియన్ పశ్చిమ జర్మనీ నాయకత్వాన అవతరించనున్నందున, రేపు ఐక్య జర్మనీ ఒక వాస్తవిక భౌగోళిక సత్యం కాబోతున్నందున కూడా - అమెరికా బ్రిటన్‌లు యూరప్‌లో తమ నాయకత్వ స్థానానికి తిలోదకాలిచ్చుకోవలసి వచ్చింది. అందుకే ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు యూరప్‌లో రష్యా మెతకతనంవల్ల, వార్సా సంధి కుంటుపడి పోయినందున వెసులుబాటు చిక్కిన తమ సైన్యాలను పశ్చిమాసియాలో చిచ్చును పెంచడానికి తరలించగలిగారు. ఈ పరిస్థితులలో, యూరప్‌లో కూడా ప్రజాభిప్రాయం చుక్కెదురు అవుతున్నందున అమెరికాను గౌరవంగా బయట పడవేయడానికి రష్యా సహాయం బుష్‌కు అవసరమయింది. అయితే హెల్సెంకీ సభ "శాంతి" పునరుద్ధరణ పేరుతో తలపెడుతున్న వ్యూహం అరబ్బుల గౌరవాన్ని కాపాడేది కాదు. బలాధిక్యతా ధోరణినుంచి మాత్రమే ఆ ప్రకటన చేసింది. ఆ అహంకారం బుష్-గోర్బీలు తగ్గించుకోగలిగితే సద్దాం అభిజాత్యం కూడా తగ్గడానికి అవకాశం ఉంటుంది. పంజాబ్ సందర్శించే హక్కు తనకు ఉందనీ, రాజకీయ షరతులను భారత ప్రభుత్వానికి డిక్టేట్ చేయడానికి అమెరికా రాయబారి విలియమ్ క్లార్క్ జంకని పరిస్థితులలో ఇరాక్, కువైత్‌లలో చిక్కుపడిపోయిన ఇండియన్లకు ఆహార సరఫరాలను కూడా పంపనివ్వకుండా అడ్డుకోగలదు అమెరికా!! బుష్-గోర్బీ సమావేశం తరువాత కూడా, హెల్సెంకీ సభ నిర్ణయానికి కూడా విరుద్ధంగా అమెరికా సోమవారంనాడు చేసిన పని ఇండియా స్వతంత్ర ప్రతిపత్తికి సవాలుగా భావించాలి. కువైత్‌లో దిగబడిపోయిన భారతీయ పౌరులను ఇండియా

తరలించుకుపోవడానికి ఇరాక్ అనుమతించినా, అమెరికన్ సామ్రాజ్యవాదులు కువైత్‌లోకి భారతీయ నౌకలు "టిప్పుసుల్తాన్", "అక్బర్"లు ప్రవేశించకుండా అడ్డుకుంటున్నారు. ఈచర్యను భారత ప్రజలు ఖండించాలి, గల్ఫ్‌నుంచి "అంకుల్‌శామ్" వైదొలగిపోవాలని కోరాలి. భారత ప్రభుత్వం ఈ విషయంలో ఏ మాత్రం లొంగుబాటు ప్రదర్శించరాదు. ఇరాక్ ఛార్టర్డ్ విమానాలతో తమ జాతీయులను స్వేచ్ఛగా తరలించుకుంటున్న ఆంగ్లో-అమెరికన్ పాలకులు ఇండియాపట్ల ఈ వివక్ష ఎందుకు చూపవలసి వచ్చింది? "స్వావలంబన కృషి"కి సున్న చుట్టుకోమని ప్రపంచ బ్యాంకుద్వారా మనల్ని ఆదేశించగల దమ్ములు పొందిన అమెరికా ప్రవర్తన మనలో లజ్జాభిమానాలను పెంచవద్దూ? అరేబియా సముద్ర జలాలు కల్లోలంగా ఉన్నంతకాల హిందూ మహాసముద్రజలాలు కూడా ఉడుకెత్తిపోవలసి వస్తుంది. గల్ఫ్ దేశాలతోపాటు దక్షిణాసియా ఉనికి కూడా గల్ఫ్‌లో అమెరికా తిష్ఠ ప్రమాదకరం. వాడవాడలా అమెరికా ఉపసంహరణ కోరడం ప్రజాస్వామ్యవాదుల కర్తవ్యం.

బుధవారం 12, సెప్టెంబర్ 1990

# ఇరాక్‌పై అణ్వస్త్ర దాడికి సన్నాహం?!

కువైట్ సమస్యను చాటుచేసుకొని తనకు వేల మైళ్ళ దూరంలో వున్న పర్షియన్ గల్ఫ్‌లో అమెరికా, దాని వందిమాగధ సామ్రాజ్యవాద దేశాలు, గల్ఫ్‌లోని కొందరు షేకులూ, అమీరులూ కలిసి సైన్యాన్ని మోహరించి స్వతంత్ర ఇరాక్ రిపబ్లిక్ ఆర్థిక, పారిశ్రామిక సైనిక శక్తిని పూర్తిగా ధ్వంసం చేయడానికి సర్వశక్తులూ వొడ్డుతున్నారని గత వారం రోజుల గల్ఫ్ యుద్ధతంత్రం వల్ల బోధపడిపోయింది. ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీకి ముఖం చాటుచేసి, దొంగతనంగా సెక్యూరిటీ కౌన్సిల్ ముసుగులో "కువైట్‌నుంచి ఇరాకీ సేవల ఉపసంహరణ"కోసమే సేనలు మోహరిస్తున్నామని చెప్పిన ఆంగ్లో - అమెరికన్ దురాక్రమణ కూటమి ఇప్పుడు చేస్తున్న పని - "కువైట్ విమోచనం" కానేకాదు. ఆ లక్ష్యాన్ని పక్కకునెట్టి, అసలు అరబ్ దేశాలలో, పశ్చిమాసియాలో సైనికంగా, స్వతంత్ర ఆర్థిక శక్తిగా బలమైన రాజకీయ శక్తిగా ఉన్న ఇరాక్‌ను పశ్చిమాసియా పటంనుంచే తుడిచివేయడం బాగ్దాద్, బాస్రా, దక్షిణ ఇరాక్ నగరాలపైన ఎలక్ట్రానిక్ యుద్ధ తంత్రంద్వారా 18 వేల సార్లు "మిత్రమండలి" ఆధునిక మిస్సైల్స్, బాంబర్లు దాడులు జరిపి పౌరులకు, పారిశ్రామిక వాడలకు, సైనిక కేంద్రాలకు నష్టం తలపెడుతున్నాయి. అయితే ఇందుకు ప్రతిగా ఇరాక్ చేస్తున్న పని తన ఆర్థిక వ్యవస్థను చిన్నాభిన్నం చేయడానికీ, స్వతంత్ర రిపబ్లిక్‌గా తన మనుగడను నాశనం చేసి, గల్ఫ్ ఆయిల్ సంపదను ప్రజావ్యతిరేకులయిన కొందరు షేకుల అమీరుల అండతో కాజేయడానికి దక్షిణ గల్ఫ్ ప్రాంతాలలో సైనిక స్థావరాలు తెరచుకున్న అమెరికన్ దురాక్రమణదారులపైన, వారికి అండగా నిలిచిన సౌదీ అరేబియా, మస్కాట్, ఓమన్‌లపైన తన మిస్సైల్స్‌ను ఎక్కుపెట్టవలసి రావడం! చారిత్రికంగా ఇరాక్‌లో అంతర్భాగమైన "కువైత్"ను ఇరాక్ ఇప్పుడే తొందరపడి తన స్వాధీనం చేసుకొని ఉండకపోను. కాని తనకు గల్ఫ్‌లోని వర్తక వాణిజ్య మార్గాలను బంద్ చేసి, కువైత్ అమీరుల (కువైత్‌లో ఉన్న వాళ్ళు కువైట్లు కారు, వ్యాపారాలు చేసుకుంటున్నవారు నాన్-కువైట్స్ మాత్రమే) అండతో ఉమ్మడి ఆయిల్ ఫీల్డ్స్‌లో ఉత్పత్తి అయ్యే ఆయిల్‌ను దొంగచాటుగా సౌదీకి, ఆంగ్లో-అమెరికన్లకు తరలిస్తున్నందున, గల్ఫ్‌లోని దక్షిణ ప్రాంతాలనూ, అరబ్‌లకు వ్యతిరేకంగా ఇజ్రాయేల్‌నూ అమెరికాకు యుద్ధ స్థావరాలుగా మార్చినందునా, ఇరాక్ సహజంగానే తన రక్షణ సన్నాహాలు చేసుకోక తప్పదు. అయినా ఎంత ఆధునిక యుద్ధంలో కూడా, ఎంతగా బాంబింగ్ జరిగినా, భూతల యుద్ధాన్ని తప్పించుకోజాలదు. ఆ విషయం కొరియా, వియత్నామ్‌లలో రుజువైంది. ఒకవేళ అణ్వస్త్రాలను వినియోగించాలన్నా వాటిని విస్తారమైన ప్రాంతంలో, శత్రు జనావాస ప్రాంతంలో వేయాలే తప్ప, ముఖాముఖీ భూతల యుద్ధంలో ఉభయుల మధ్య సాగే పోరుమధ్య వాటిని వినియోగించలేరు. ఇది సాధ్యపడక కాదు. ఉభయత్రా నష్టం దారుణంగా ఉంటుంది. అందువల్ల, ఏరియల్ బాంబింగ్‌ను అంత

దృఢంగానూ ఎదుర్కొంటున్న ఇరాక్ ("స్కడ్స్"ద్వారా) వైమానిక శక్తిని సర్వనాశనం చేసేదాకా భూతల యుద్ధాన్ని పెద్దపెట్టున సాగించడానికి ఆంగ్లో-అమెరికన్లు సాహసించడంలేదు. అయిదే దుష్టుడికి ఆలోచనలకేమీ కొదవ ఉండదు. ఈ నెల 14వ తేదీ "న్యూస్‌వీక్" అనే ప్రసిద్ధ అమెరికన్ వారపత్రికలో వచ్చిన "విశ్వసనీయమైన సమాచారం" ప్రకారం ఇరాక్‌పైన "అణ్వస్త్ర" (న్యూక్లియర్ డివైస్) ప్రయోగానికి అమెరికా వ్యూహరచన చేస్తున్నట్టు అనుమానించవలసివస్తున్నది. గల్ఫ్‌లో అమెరికా సేనాపతి జనరల్ నార్టన్ స్కావర్జ్‌కాఫ్ ఇరాక్‌పై మిత్రమండలి యుద్ధం ప్రకటించిన తొలి ఘడియలోనే ఈ "అణ్వస్త్ర ప్రయోగానికి అనుమతివ్వవలసింది"గా ప్రెసిడెంట్ బుష్‌ను కోరినట్టూ, అయితే బుష్ ఇరాక్‌పై 'దయతలచి' అందుకు అనుమతించలేదనీ ఆ పత్రిక వెల్లడిచింది. అలా అని చెప్పి, ప్రెసిడెంట్‌కు లేని దురాలోచన జనరల్‌కు మాత్రమే కలిగి ఉంటుందని పొరపాటున కూడా భావించరాదు. ఎందుకంటే, నేడు గల్ఫ్‌ను ఆంగ్లో-అమెరికన్ దురాక్రమణదారులూ, వారి వ్యూహాలకు శాస్త్ర సాంకేతిక మారణ యంత్రాంగం ద్వారా సాయపడుతున్న శాస్త్రవేత్తలూ, సరికొత్త మానవ వినాశకర మారణాస్త్రాలను, మిస్సైల్స్‌ను, రసాయన ఆయుధాలను కొత్తగా పరీక్షించుకోడానికి మొదటిసారిగా ఇరాక్‌ను ప్రయోగ స్థావరంగా ఉపయోగించుకుంటున్నారు. గల్ఫ్ యుద్ధం ఆరంభమైన మొదటి రెండు రోజులలో పశ్చిమ రాజ్యాల 'కామెర్ల' పత్రికా లోకం యుద్ధరంగంనుంచి పంపించిన వార్తలలో వర్ణన అంతా - పరిస్థితులగురించీ కాదు, పాడూ కాదు. కొత్త మారణాస్త్రాలు, మిస్సైల్స్ ఎన్నెన్ని రంగులు విరజిమ్ముకుంటూ, ఫ్లాష్‌పాయింట్స్‌తో విజృంభిస్తూ ఇరాక్ స్థావరాలపై దాడి చేశాయో చెప్పడానికే ఆ వర్ణన సరిపోయింది.

అణ్వస్త్రాన్ని ఇరాక్‌పైన బాగా ఎత్తునుంచి వదలాలన్న ఆలోచన బుష్‌ది కాదు, జనరల్ ది అని ఆ పత్రిక మర్యాదకోసం చెప్పిందేగాని, ఉన్నత స్థాయిలో "పెంటగన్" సైనికాధివర్గ పరిశోధనాశాలలో చర్చల అనంతరం వచ్చిన ఆలోచనగానే పరిగణించాలి. పైగా ఆసియా, ఆఫ్రికాలలో రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత, వియత్నాంలో హోచిమిన్ తర్వాత, ఒక స్వతంత్ర రిపబ్లిక్ అధ్యక్షునిగా ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల్ని సద్దామ్ హుస్సేన్‌లా ఎదురొడ్డి నిలుస్తున్న రాజకీయ శక్తిలేదు. ఈ వాస్తవాన్ని ఆంగ్లో-అమెరికన్లు భరించలేరు; గల్ఫ్‌లో అవమాన భారాన్ని మోయలేరు. అందువల్ల ఆఖరి తురుపుగా అణ్వస్త్రాన్ని ప్రయోగించడానికి కూడా అమెరికన్ సామ్రాజ్యవాదులు వెనుకాడరు. ఎందుకంటే - రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ప్రజా శత్రువు అయిన నియంత హిట్లర్ కూడా సాహసించలేని పనికి దిగింది అమెరికా. పెరల్ హార్బర్‌పై జపాన్ దాడిని మిషగా చూపి, అమెరికా తన తొలి అణుబాంబును హిరోషిమా, నాగసాకీ నగరాలపై అర్ధాంతరంగా విడిచి, లక్షలాదిమందిని క్షణాలలో పొట్టన పెట్టుకున్నది. ఇది చరిత్ర. ఈ అణుబాంబు పాటవ పరీక్షను జరిపినవాడు జనరల్ లీస్లీ రిచర్డ్ గ్రోవ్స్ కాగా, జరిపించినవాడు ప్రెసిడెంట్ ట్రూమన్ అని మరచిపోరాదు. అణుశాస్త్రవేత్తలు, మానవతావాదులైన ఐన్‌స్టీన్, ఫ్రాంక్, స్టీన్, సిలార్డ్, రాబినోవిచ్ 'వద్దు వద్ద'ని నెత్తిన నోరుబెట్టుకుని అరిచినా వినకుండా ఈ దారుణానికి వొడిగట్టారు! తరతరాలుగా బిడ్డల్ని అంగవికలులు చేశారు. మానవ వినాశకరమైన ఆ అణుబాంబును తయారు చేయవద్దన్నందుకు బెర్లిన్ సుప్రసిద్ధ రచయిత ఆల్‌ఫ్రెడ్ డోబ్లిన్‌ను జర్మనీనుంచి ఉద్వాసన చెప్పించాడు హిట్లర్. 1919లోనే డోబ్లిన్ ఒక (1919లో) ప్రకటన చేశాడుః "రానున్న కాలంలో మానవజాతిపై జరిపే తిరుగులేని దాడులన్నీ నేటినుంచే డ్రాయింగ్ బోర్డులు, పరిశోధనా గారాలనుంచే జరుగబోతున్నాయి"! ఈ ప్రకటనలోని సత్యాసత్యాలను విడమర్చి చెబుతూ అణుబాంబు ప్రయోగాన్ని ప్రతిఘటించిన అమెరికన్

## ఎబికె సంపాదకీయాలు

శాస్త్రవేత్త లియోసిలార్డ్ దేశాల భవిష్యత్తు గురించి ఇలా స్పష్టం చేశాడుః- "1943-1944 మధ్యకాలంలో మమ్మల్ని బాగా కలతపెట్టిన అంశం - యూరప్‌పైకి దాడి వెడలే నాటికి జర్మనీ అణుబాంబును సిద్ధం చేసుకోగల్గుతుందా అని!.... కాని ఇక జర్మన్‌లు మాకు (అమెరికాకు) ఎలాంటి హాని తలపెడతారోనని అనుమానించడమూ, బాధపడ్డమూ 1945లో మానేశాం. కాని హిరోషిమా ప్రయోగం తర్వాత ఇతర దేశాలకు అమెరికా ప్రభుత్వం ఏలాంటి ఉపద్రవం తలపెడుతుందోనని మాత్రమే ఇక బాధపడసాగాం". ఇప్పుడు ఇరాక్ రసాయన, విష క్రిమి ఆయుధాలను ఎక్కడ తమ సేనలపైన ప్రయోగిస్తుందోనని బాదపడుతున్నట్టు నటిస్తున్న అమెరికా తాను వియత్నాంలో చేసిన మారణహోమాన్నీ విష క్రిముల, రసాయనాల ప్రయోగాన్నీ మరచిపొమ్మని మనల్ని కోరుతోంది! 1945 తర్వాత యూరప్, ఆఫ్రికా, పశ్చిమాసియా, ఆసియా, లాటిన్ అమెరికాలలో యుద్ధ సైనిక స్థావరాలను నెలకొల్పడమేగాక, కనీసం కోటిమంది ప్రజల ప్రాణాలు తీసుకున్న ఘర్షణలకు, స్థానిక యుద్ధాలకు అమెరికా కారకురాలయింది, లేదా వాటిలో పాత్రధారిగా ఉంది! ఇది ఆసియా ప్రజలందరికి కనువిప్పు కావాలి. గల్ఫ్‌నుంచి, హిందూ మహాసముద్రంనుంచీ విదేశీ సేనలు వైదొలగేదాకా విశ్రమించరాదు.

శుక్రవారం 25 జనవరి, 1991

# బుష్ యుద్ధోన్మాదం

ఆరోపించడానికి వేరే కారణం దొరకని ఒక మూఢుడు, ఒ కజ్జాకోరు "వెనక మీ తాత పొగచుట్టలు తాగాడ"ని నేరం ఆరోపించాడట!! ఇప్పుడు పర్షియన్ గల్ఫ్‌లో అమెరికా, తదితర అగ్రరాజ్యాల పాత్ర కూడా అలాగే తయారైంది. రోజు కడచినకొలదీ ఇరాక్‌లో ఒకనాటి అంతర్భాగమైన కువైత్‌ను తనలో కలుపుకోడానికి ఇరాక్ అధ్యక్షుడు సద్దామ్ హుస్సేన్ ఆగస్టు 2న కువైత్‌పై తలపెట్టిన దాడికంటే, సద్దామ్ చర్యను సాకుగా చేసుకొని గల్ఫ్‌లో అమెరికా తలపెడుతున్న యుద్ధ చర్యలకు ప్రాముఖ్యం వచ్చింది. గల్ఫ్ యుద్ధం ప్రారంభయమ్యే పక్షంలో అది ఆ ప్రాంతానికే కాదు, యావత్తు ప్రపంచాన్ని కలవరపరిచే పరిణామాలకు దారితీస్తుంది. కువైత్‌లో ఇరాక్ చర్య ఆసరాగా అమెరికా, తదితర అగ్రరాజ్యాలు ఐక్యరాజ్యసమితి భద్రతా మండలిద్వారా, దాని అనుబంధ సంస్థ అయిన ఆంక్షల నిర్వహణ సంఘం ద్వారా ఇరాక్‌పై తలపెట్టిన చర్యలన్నీ పాక్షికంగానే ఉన్నాయి. ఆంగ్లో-అమెరికన్ పత్రికలు గల్ఫ్‌నుంచి మోసుకొస్తున్న వార్తలన్నీ వాస్తవాలు కాదనడానికీ, ఎలాగోలా ఇరాక్‌పైన దురాక్రమణకూ, ప్రెసిడెంట్ సద్దామ్ హుస్సేన్‌ను (చిలీలో అలెండీని పొట్టన పెట్టుకున్నట్టే) హతమార్చడంకోసం అనుక్షణం ఏదో ఒక సాకు కోసం పశ్చిమ రాజ్యాలు ముఖ్యంగా ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు గుంటనక్కల్లా ఎదురు చూడడమే సాక్ష్యం. ఉదాహరణకు పరిమిత సరిహద్దు తగాదాలు ఆధారంగా కువైత్‌పై ఇరాక్ తొందరపాటుతో తీసుకున్న చర్యకు ఆంగ్లో-అమెరికన్లు వక్రభాష్యాలు చెప్పారు; సౌదీ అరేబియాను కూడా ఇరాక్ ఆక్రమించడానికి సిద్ధమవుతోందనీ, జోర్డాన్‌వైపుగా ఇరాక్ సైన్యాన్ని నడుపిస్తోందనీ వ్యాప్తిలోకి తెచ్చిన కట్టుకథలు గల్ఫ్‌ను ఆక్రమించుకొని గల్ఫ్ సంపదను దోచుకోడానికి ఆంగ్లో-అమెరికన్లు పన్నిన దీర్ఘకాలిక పథకం. ఇది నిజం కాకపోతే, ఈజిప్టుకు రు. 2,000 కోట్లు, సౌదీ అరేబియాకు రు. 4 లక్షల కోట్లు విలువగల ఆయుధాలను అమెరికన్లు అమ్మజూపారు. అలాగే కువైత్‌లో విదేశీ రాయబార కార్యాలయాలలో చొరబడి ఇరాక్ సైనికులు ఆగడం చేస్తున్నారన్న ఆరోపణను, దౌత్య వ్యవహారాలను లేదా అక్కడ శరణుకోరిన విదేశీయులను ఎక్కడికో తరలిస్తున్నారన్న ఆరోపణలను కూడా వాటి పూర్వాపరాల దృష్ట్యానే పరిశీలించాలి. అయితే కువైత్‌లో పశ్చిమ రాజ్యాలు స్వచ్ఛందంగా తమ దౌత్య కార్యాలయాలు మూయడానికి ముందు నిరాకరించినందున ఇరాక్‌తో ప్రత్యక్ష యుద్ధానికి ఆ రాజ్యాలు కాలుదువ్వుతున్నందున, ఇంతవరకూ కువైత్‌లోని పశ్చిమ రాజ్యాల దౌత్య కార్యాలయాలను రక్షిత ప్రాంతంగా ఇరాక్ ప్రకటించలేదు. అయినా ఫ్రాన్స్, కెనడా, బంగ్లాదేశ్ వగైరా (ఆంగ్లో అమెరికన్ల చర్యలకు మద్దతునిస్తున్న) దేశాల పిర్యాదుపై ఆధారపడి సమితి భద్రతామండలి మరో తీర్మానం ద్వారా ఇరాక్‌పై సరికొత్త ఆంక్షలు విధించింది; వాస్తవ పరిస్థితులను విశ్లేషించకుండా ఖండిస్తూ తీర్మానించింది; క్రమంగా ఇరాక్‌తో దౌత్య సంబంధాలను కూడా

తెగతెంపులు చేసుకునేవైపుగా తీర్మానాన్ని రూపొందించింది; తద్వారా సమితి ప్రణాళిక చాటున భద్రతామండలి క్రమంగా "ప్రపంచ శాంతి భద్రతల" పేరిట ఆంగ్లో-అమెరికన్లు ఇరాక్‌పైన "నౌకా, విమాన, సైనిక దాడులను" ముమ్మరం చేయడానికి అనువైన వాతావరణం సృష్టించి పెడుతోంది. లీగ్ ఆఫ్ నేషన్స్ పతనమైనది కూడా ఇలాగేనని మరువరాదు. నిజానికి అరబ్‌ల అంతరంగిక వివాదాల్లో, సరిహద్దు తగాదాల్లో తలదూర్చడంద్వారా గల్ఫ్‌ను యుద్ధ కేంద్రంగా మార్చడానికి ఆంగ్లో-అమెరికన్లు చేస్తున్న ప్రయత్నాలను మూకుమ్మడిగా అరబ్ దేశాల ప్రజలేకాదు, పెక్కు ఇతర ఖండాల ప్రజలు కూడా ఏవగించుకుంటున్నారు. కనుకనే భద్రతామండలి "ఇరాక్‌పై తలపెట్టిన ఆంక్షలను అన్ని దేశాలు తు.చ. తప్పకుండా పాటించాల"ని తాజాగా మరొకసారి విజ్ఞప్తి చేయవలసి వచ్చింది. ఇందుకోసం, "దౌత్యనీతి' ' పరంగా వియన్నా కన్వెన్షన్‌ను ఏకరువు పెట్టింది; ఇందుకోసం "విదేశీయులకు విధిగా ఆహార పదార్థాలు అందేలా చూడడం" దేశాల బాధ్యత అని గుర్తుచేస్తున్న 1949 నాటి జెనీవా కన్వెన్షన్‌నూ గుర్తు చేసింది. కాని మండలి మరచిపోయిన అసలు వాస్తవం – తన ఆంక్షలు తనకే బెడిసికొడతాయన్న విషయం. ఈ ఆంక్షలు విఫలమయ్యాయని చెప్పి ఇరాక్‌పై ప్రత్యక్ష దురాక్రమణకు దిగడం ఆంగ్లో-అమెరికన్ల అసలు లక్ష్యం; అందుకోసం "ఆంక్షలు" సక్రమంగా అమలు జరుగకుండా అడ్డుపుల్లలు వేసే కార్యక్రమాన్ని కూడా అవి చేపట్టాయి. ఒకవైపున ఇరాక్, కువైత్‌లలో చిక్కుబడిపోయిన విదేశ శక్తులలో తమ సైనిక చర్యలకు మద్దతు ప్రకటించిన దేశాల వారికి మాత్రమే సహాయం అందజేయడంద్వారా అమెరికా, బ్రిటన్‌లు వివక్ష చూపుతూ, మరోవైపున చిక్కుబడిపోయిన ఆసియన్లకు సరఫరాలు అందకుండా కుట్ర పన్నుతూ వచ్చాయి.

అంటే భద్రతామండలి ఆంక్షల పేరిట ఇరాక్ నవనాడులు బంధించడంద్వారా, ఇరాక్ ప్రజలను ఎగుమతి దిగుమతి వ్యాపారానికీ నిత్యావసర సరకుల సరఫరాలకూ దూరం చేసిన ఆంగ్లో-అమెరికన్లు, ఇందుకు ప్రతీకారంగా సద్దామ్ ఏ చర్యా తీసుకోకూడదని భావించారు. ఇరాక్ ప్రజలు తిండిలేక మాడాలి, అదే సమయంలో ఇరాక్, కువైత్‌లలో చిక్కుబడిపోయిన విదేశస్థులకు మాత్రం ఇరాక్ ప్రభుత్వం ఆహారం, మందులూ ఇచ్చి సాకాలి; ఆంక్షల మధ్య ఇరాక్ అలా ఇవ్వలేని పక్షంలో తమ దేశీయుల్ని రక్షించుకునే పేరుతో ఇరాక్‌పై యుద్ధాన్ని ప్రకటించాలన్నది ఆంగ్లో-అమెరికన్ల కుట్ర! ఈ కుట్రలో భాగంగానే ఇండియా తన జాతీయులను తరలించుకోడానికి నానా ఇబ్బందులు పడవలసి వచ్చింది. విదేశీయుల్ని తరలించడానికి ఇరాక్‌కు వచ్చే నౌకలుగానీ, విమానాలుగానీ వెంట ఆహారం, మందులూ కూడా తేవాలన్న షరతును సద్దామ్ విధించింది, ఇరాక్ ప్రజలను రక్షించుకొనేందుకే కాదు, విదేశీయులను రక్షించడానికి కూడా. ఈ పరిస్థితులలో కొలది రోజులనాడు భద్రతామండలి చేసిన తీర్మానం విధించిన షరతులు స్వతంత్ర రిపబ్లిక్‌గా ఇరాక్ సార్వభౌమాధికారానికి, సర్వసత్తాక ప్రతిపత్తికీ అవమానకరం. ఇరాక్‌కు వచ్చే ఆహారం ఇరాక్ ప్రభుత్వంతో నిమిత్తం లేకుండా సమితి ఏజన్సీలద్వారా లేదా ఇతర ప్రపంచ సంస్థలద్వారా అందులోనూ "ఉద్దేశించిన విదేశీలయులకు మాత్రమే" అందేలా చూడాలనీ, లేకపోతే నౌకలను వెనక్కి పంపవలసి వస్తుందనీ ఆ షరతులో బెదిరింపు ఉంది. అంటే సరకు పంపిణీలో ఇరాక్ ప్రభుత్వం సహకారం పొందకపోతే ఒక చిక్కు, పొందితే తర్వాత సరఫరాలను అమెరికా అడ్డుకుంటుంది. అది మరో చిక్కు. దీ మన ఇండియా సంకటం! ఆసియన్లను ఆసియన్లపైకి, అరబ్బులను అరబ్బులపైకి, అరబ్బులను సియన్లపైకి రెచ్చగొట్టి తమ పబ్బం గడుపుకోడం, ఆయుధ వ్యాపారం సాగిచడం, స్థానిక యుద్ధాలద్వారా భాలు తీయడం. ఆంగ్లో-అమెరికన్ల ప్రెసిడెంట్ బుష్ "సందేశం" పేరిట చేసిన ప్రసంగం ఇరాక్‌పై

అనధికార యుద్ధంగానే, అప్రకటిత యుద్ధంగానే భావించాలి; అలాగే యుద్ధంలో ఇరాక్ రాజధాని బాగ్దాద్‌ను "సర్వనాశనం చేయడం ఖాయమ"ని అమెరికా సైనిక సిబ్బంది ప్రధానాధికారుల ఉమ్మడి నిర్ణయంగా అమెరికన్ జనరల్ మైఖేల్ డూగన్ చేసిన ప్రకటన రానున్న ప్రమాదాన్ని సూచిస్తోంది. లక్షలాది అరబ్బులు తమ దేశాలలోనూ, ఇరాక్‌లోనూ, ఇరాన్‌లోనూ సద్దామ్ స్వతంత్ర ప్రతిపత్తిని హర్షిస్తూ మద్దతుగా బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరుపుతూ గల్ఫ్‌నుంచి అమెరికన్ సామ్రాజ్యవాదులు వైదొలగిపోవాలని నినదిస్తున్న సందర్భంలో అమెరికన్ బుష్, జనరల్ డూగన్ ప్రకటనలు వెలువడ్డాయి. ఇంతకూ చాలామందికి తెలియని అసలు రహస్యం - కువైత్‌లో ఇరాక్ ప్రెసిడెంట్ సద్దామ్ ఆగస్టు 2 నాటి "ఆపరేషన్"కు సుమారు రెండు మాసాలముందే ఇరాక్‌పై అణ్వాస్త్రాలు కూడా ప్రయోగించాలని వ్యూహ రచన జరిగినట్టు లండన్ "సండే టైమ్స్" వెల్లడించింది. అంతేగాదు, జూన్‌లో బ్రిటీష్ ప్రధాని థాచర్ ఒక ప్రకటన చేస్తూ "పశ్చిమాసియా ఒక సమస్యగా తయారైనందున ఉత్తర అట్లాంటిక్ సంధిరాజ్యాల సైన్యం తరలింపు అవసరం అవుతుంది" అని వాపోయింది. ఇందుకోసం అణ్వాస్త్రాలు బ్రిటన్‌కు అవసరం అన్నది. సరిగ్గా అదే జూన్‌లో కాన్సాస్‌లోని "లీవెన్‌వర్త్ ఫోర్ట్"లో అమెరికన్ సైన్యం రహస్య విన్యాసాలు జరిపి, ఒక వేళ సౌదీ అరేబియాపై ఇరాక్ దాడి జరిపితే ఎలా అమెరికా సైన్యం బరిలోకి దూకాలో ప్రయోగాలు చేశారు. బహుశా ఇందుకే ముందు జాగ్రత్తగా సద్దామ్ కువైత్‌లో త్వరపడి చర్యలు తలపెట్టి ఉండాలి. లెబనాన్‌పై ఇజ్రాయేల్ దాడి తర్వాత, గ్రెనెడా, పనామాలపై అమెరికా దురాక్రమణ తర్వాత, అంగోలా భూభాగాలపై దక్షిణాఫ్రికా పదఘట్టన తర్వాత ఐక్యరాజ్యసమితి భద్రతామండలి ఆమోదించిన తీర్మానాలతో - ఇరాక్‌పై చేసిన తాజా తీర్మానాలను పోల్చినప్పుడు ఆ మండలి వేరొక తెల్లవాడి కూటమిగా తయారైందని భావించవలసి వస్తూంది. మొదటి ప్రపంచ యుద్ధంలో మిత్రమండలి జర్మనీని దోచుకొంది; దక్షిణాఫ్రికా నమీబియాను నంజుకుంది; ఇజ్రాయేల్ సినయ్‌ను పిండుకుంది. ఇక తనదే అయిన కువైత్‌ను ఇరాక్ దోచుకోవడానికి ఎందుకు హక్కులేదు? సమితి తీర్మానాలు కాంగో, కొరియాల్లో ఎందుకు విఫలమయ్యాయి?!.

మంగళవారం, సెప్టెంబర్ 18, 1990

# ఈ యుద్ధం అన్యాయం, అక్రమం

ఏ యుద్ధంలోనైనా మొదటగా బలి అయ్యేది సత్యం అంటారు! విన్‌స్టన్ చర్చిల్ రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైనపుడు "ఇది అనవసరమైన పోరు" అన్నాడు; రెండో ప్రపంచ యుద్ధానంతరం అగ్రరాజ్యాలు పీకమొయ్యా అణ్వాయుధ ధారులైనప్పుడు బహుశా ఒక మూడు ప్రపంచ యుద్ధం అమెరికా రష్యాల మధ్య తప్పదేమోనని ఊహించారు. కాని, ఆ మూడో యుద్ధానికి ప్రారంభ సూచనగా ఈసారి ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు - పర్షియన్ గల్ఫ్‌లో భౌగోళికంగా, చారిత్రకంగా తన దేశంలో భాగమైన కువైత్‌ను ఇరాక్ తిరిగి స్వాధీన పరచుకుంటున్నదన్న మిషపైన మొత్తం గల్ఫ్‌లోనే యుద్ధం ప్రకటించడం దారుణం. పైగా గల్ఫ్‌లో, అరబ్ దేశాలలో శక్తిమంతవైన సెక్యులర్ రిపబ్లిక్‌గా ఉంటున్న ఇరాక్ ముందుచర్యలకు తలపడకుండానే బహుళ రాజ్యాల సైన్యం అమెరికా నాయకత్వాన అక్రమించుని ఉన్న సౌదీ అరేబియా కేంద్రంగా బాగ్దాద్ నగరంపై బాంబుదాడులు ప్రారంభించింది. ఈ "మల్టీ నేషనల్ ఫోర్స్" పేరుకు మాత్రమే బహుళజాతి సైన్యం. మొత్తం 6 లక్షలమంది సైనికులలో 4.5 లక్షల మంది అమెరికన్లు కాగా, మిగతా సైనికులంతా బ్రిటన్, ఫ్రాన్స్ తదితర యూరోపియన్ దేశాలవీ, ఆసియాలో అమెరికా మోచేతినీళ్ళు తాగుతూ కాలం వెళ్ళబుచ్చుకుంటున్న పాకిస్తాన్, బంగ్లాదేశ్ ప్రభుత్వాలు పంపించిన కిరాయి సైనికులూ!

ఈ యుద్ధం న్యాయా న్యాయాలను తేల్చబోయేముందు ఒకే ఒక్క ప్రశ్నకు సమాధానం కావాలిః దురాక్రమణ దారు ఎవరైనా, యుద్ధోన్మాది మరెవడైనా, వాడిని పేరు పేరునా ఖండించి, సభ్య ప్రపంచం నుంచి వెలివేయడం ఇంటా బయటా కూడా ఒకే సూత్రం కావాలికదా? అరబ్‌లకు చెందిన గల్ఫ్ ప్రాంతంలో చారిత్రికంగా ఒక దేశంగానే స్థిరపడి, అరబ్ పెనిన్సులాలో వలస పెత్తనం కోసం బ్రిటిష్ సామ్రాజ్యవాదులుప్రారంభించిన "విభజించి-పాలించు" సూత్రంలో బాగంగానే తన నుంచి విడిపోయిన కువైత్‌ను ఇరాక్ తిరిగి స్వాధీనం చేసుకోవచ్చుగాక. ఇది గల్ఫ్‌కు వెలుపల జరిగిన పనికాదు; ఇరుగుపొరుగు సమస్య. అది అరబ్‌ల మధ్య సమస్య; వాళ్లుగా తేల్చుకోవలసిన సమస్య. కానీ, ఏ కువైట్‌ను "అక్రమించుకున్నందుకు" ఇరాక్‌ను ఏ ఆంగ్లో-అమెరికన్లు గల్ఫ్ ఆయిల్‌ను దోచుకోవడంలో భాగంగా విమర్శించి ఇరాక్‌పైకాలు దువ్వారో - ఆ ఆంగ్లో-అమెరికన్లు నేడు సౌదీ అరేబియాను అక్రమించుకొని గల్ఫ్ 'ంతాన్ని చేజిక్కించుకొని మొత్తం ఆసియా-ఆఫ్రికా, అరబ్ ప్రజల స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను హరించడానికి రోసారి సిద్ధమవుతున్నారని గుర్తించాలి. ఆధునిక మారణాస్త్రాలున్నాయి గదా అని చిన్నదేశాలను దిరించి, ముడిసరకులను, ఆయిల్‌ను ఆసియా నుంచి (పశ్చిమాసియా నుంచి) అయినకాడికి దోచుకుని వాలన్న దుర్బుద్ధితోనే ఆంగ్లో-అమెరికన్లు శాంతి మార్గాన్ని విడిచి, సంప్రతింపుల పంధానుంచి మళ్ళిపోయి కపక్షంగా ఇరాక్‌పై యుద్ధం ప్రకటించారు. కనీసం - కువైట్‌పైన ఇరాక్‌కులేని హక్కు, లేదా గల్ఫ్ ఆయిల్

సంపదపైన ఆఫ్రో-ఆసియన్ ప్రజలకులేని హక్కు అమెరికన్ పాలకులకు, యూరోపియన్ రాజ్యాలకు ఎక్కడిది? అన్ని పద్దతులూ విఫలమైన తర్వాత ఆఖరి తురుపు యుద్ధమే కావచ్చు; కానీ శాంతి స్థాపనకోసం ఒక గడువును నిర్ణయించి, ఆ గడువు ముగియడంతోనే యుద్ధంజరపాలన్న ఆలోచనే అరాచకం, ఆటవికం. ఆంగ్లో-అమెరికన్లు ఆటవికులు, బర్బరులు. ప్రపంచ వ్యాపితంగానే ఒకటికి పదిమార్లు ఆ విషయాన్ని రుజువుపరచుకొన్న పరమ దుర్మార్గులు. తమకు బేషరతుగా లొంగి పోయిన వలస దేశాలనో, లేదా అర్ధవలస, లేదా పరాధార స్థితిలోవున్న కొన్ని స్వతంత్ర దేశాలనో మినహాయిస్తే, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్య వాదులు ప్రపంచ చరిత్రలో ఏ వలస సమస్యను, ఏ ప్రజల సమస్యను శాంతిగా పరిష్కరించారో ఉదాహరించగలరా? ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలన్నిటా ఈనాడు ఎదుర్కొంటున్న ఆర్థిక సమస్యలూ, సరిహద్దు తగాదాలూ, జాతుల సమస్యలూ ఈ పుండకోరుల సృష్టితప్ప మరొకటి కాదు.

''జనవరి 15''లోగా కువైట్ నుంచి ఇరాక్ వైదొలగిపోవాలని ఐక్యరాజ్యసమితి ''భద్రతా మండలి' ' తీర్మానించిందట. ఆ గడువులోగా ఇరాక్ వైదొలగపోతే తిరిగి ఆ (అ) భద్రతా మండలి ఏమి చేస్తుందో చెప్పకుండా, బలసంపన్నమైన అమెరికన్ సామ్రాజ్యవాదికి కాగల కార్యం తీర్చే బాధ్యతను తీర్మానం రూపంలో అప్పగించకుండా, లోపాయికారీగా అప్పగించింది!! మరి, ప్రపంచ దేశాలన్నీ కలసి ఒక యుద్ధ సమస్యను తేల్చవలసిన ఘడియలో కేవలం 15మంది (ప్రపంచదేశాల సంఖ్యతో పోల్చితే ఇది అతి ఘోరమైన అసమ సంఖ్యకాదూ!) సభ్యులున్న సెక్యూరిటీ కౌన్సిల్ కేవలం బెదిరింపుల మీద, తెల్లజాతి దురహంకారం మీద బతకజూస్తున్న అమెరికన్ పాలకవర్గాలకు నిర్ణయాధికారం అప్పగించడం ఎంత దారుణం? భారత ప్రదాని చంద్రశేఖర్, మాజీ ప్రధానులు రాజీవ్‌గంధీ, వి.పి.సింగ్ వ్యక్తంచేసినట్లుగా - శాంతి చర్చలను ఇంత త్వరగా ముగించకుండా ఉవండవలసింది, పరిష్కారం కుదిరేదాకా కొనసాగించవలసింది! ఇంతకూ ఆదరా బాదరాగా ఆంగ్లో-అమెరికన్లు ఇంత వరకూ తాము ఆక్రమించుకొని తిష్ఠవేసిన దేశాల నుంచి ఎన్నాళ్ళకు వైదొలగారు? సైప్రస్‌లో, పనామాలో, నికరాగ్వాలో, ఎల్‌సాల్వెడార్‌లో, గ్రెనెడాలో వీళ్ళ బతుకు ఎవరికి తెలియనిది? అప్పుడేమైంది ఈ సెక్యూరిటీ కౌన్సిల్? అప్పుడేమైంది ఈ పనికిమాలిన గడువు? కాని ''జనవరి 15'' అన్నది ఒక మిష మాత్రమే. అరబ్ పెనిన్స్యులాలోని షేక్‌డమ్స్‌కు (చక్రవర్తిత్వాలకు, నియంతృత్వ పాలనకూ), అరబ్ దేశాల మధ్య రావణకాష్ఠంలా ఆంగ్లో-అమెరికన్లు తెచ్చిపెట్టిన ఇజ్రాయిల్‌కూ సింహ స్వప్నంగా ఉన్న ఇరాక్ స్వతంత్ర సైనిక, రాజకీయ శక్తిని సర్వనాశనం చేస్తే తప్ప గల్ఫ్ ఆయిల్ దక్కదు, గల్ఫ్ దక్కదు, తద్వారా ఆఫ్రో- ఆసియా దేశాలపై రాజకీయ పెత్తనం మరొకసారి దక్కదు! అందుకే, కువైట్‌పై చర్యలో ఇరాక్ ప్రెసిడెంట్ సద్దామ్ దుడుకుతనం కంటే, ప్రపంచదేశాలకు అమెరికన్ ప్రెసిడెంట్ జార్జిబుష్ ప్రదర్శించిన దురహంకారమే ఎక్కువ ప్రమాదకరమని గుర్తించాలి. నిజానికి-ఐక్యరాజ్యసమితికీ, తద్వారా ప్రపంచ దేశాలకూ పరిపూర్ణ ప్రాతినిధ్యం వహించగలిగింది సమితి జనరల్ అసెంబ్లీ మాత్రమే! కానీ, గల్ఫ్ వివాదంలో అసెంబ్లీకి పాత్రలేకుండా చేయడానికి కారణం అమెరికా ధనహాయంపై (అ) భద్రతామండలి బతకవలసి రావడమే. కనీసం మండలిలో కొత్తగా తాత్కాలిక సభ్యదేశమైన ఇండియా ప్రతినిధి అయినా మండలి అమెరికా కోసం చేసిన 678వ తీర్మానపు లీగల్ సత్తాను ప్రశ్నిస్తూ సవాలుచేసి ఉండవలసింది. సమష్టి భద్రతకు బాధ్యతవహించ వలసిన ఈ మండలి దురాక్రమణకు పేరుమోసిన అమెరికాకు ఆ బాధ్యతను అప్పగించడం - నానాజాతి సమితి పతనం ఈ సమితికి కూడా తప్పదా అని ప్రశ్నించుకోవలసి వస్తోంది! ప్రపంచ దేశాలన్నిటా గల్ఫ్‌లో అమెరికా జోక్యాన్ని నిరసిస్తూ ప్రదర్శనలు జరుగుతూంటే 84 కోట్ల భారతదేశానికి ఇంక మత్తు వదలకపోవడం ఎంత సిగ్గుచేటు!

శుక్రవారం 18, జనవరి 1991

# ఈ యుద్ధం అన్యాయం, అక్రమం (2)

"తాడిచెట్టు ఎందుకు ఎక్కావురా" అంటే వెనకటికొకడు "దూడమేతకోసం" అన్నాడట. వచ్చింది కల్లుకోసం, చెప్పింది పొల్లుమాట! పర్షియన్ గల్ఫ్‌లో ముందుగా నిర్హేతుకంగా యుద్ధాన్ని ప్రారంభించి అది కువైట్ నుంచి ఇరాక్‌ను సాగనపండం కోసమేననీ. సౌదీ అరేబియాను రక్షించడం కోసమేననీ, ఇరాక్ సైనిక శక్తినీ, పౌరకేంద్రాలను నాశనం చేయడానికి ఆదేశించిన అమెరికన్ సామ్రాజ్యవాది జార్జిబుష్ యుద్ధానికి చెబుతున్న సమర్థనకూడా అలాగే ఉంది; పశ్చిమాసియా సమస్య పరిష్కారంలో భాగంగా, జోర్డాన్ పశ్చిమప్రాంతన్నీ గాజా ప్రాంతాన్నీ పాతికేళ్ళుగా ఆక్రమించుకొని పాలస్తీనీయులను నిరాశ్రయుల్ని చేసి అమెరికా సహాయంపై బతుకుతున్న ఇజ్రాయెల్ నుంచి పాలస్తీనా సంపూర్ణ విముక్తి జరిగేవరకూ కువైట్‌నుంచి వైదొలగబోనని ఇరాక్ ప్రెసిడెంట్ సద్దామ్ హుస్సేన్ ప్రకటించాడు. నిజానికి ఈ ఇరువురు అధ్యక్షుల ప్రకటనలూ అర్థ సత్యాలే! కువైట్ విమోచన, పాలెస్తీనా విముక్తి, ఉభయులకూ మిషమాత్రమే. పర్షియన్ గల్ఫ్‌లోని ఆయిల్ "సంపద విముక్తి" లేదా, ఆయిల్ వనరులపై పెత్తనం ఎవరిది అన్నదే అమెరికా-ఇరాక్‌ల మధ్య ప్రదాన సమస్య. అయితే అమెరికా సైనిక శక్తితో పోల్చినప్పుడు ఇరాక్ శక్తిసామర్థ్యాలు సరితూగవు. కాని ప్రపంచ దేశాల తరపున, తన తరపున పోలీసుపాత్రను అయాచితంగానే నిర్వహిస్తున్న ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల జోక్యాన్ని ఆఫ్రో-ఆసియన్ దేశాలు, లాటిన్ అమెరికన్ దేశాలు ససేమిరా అనుమతించకూడదు. "ప్రజాస్వామ్యం రక్షణ" పేరిట, "బే ఆఫ్ పిగ్స్" ముసుగుచాటున తన ఇరుగుపొరుగైన క్యూబాపై దాడి వెడలినప్పుడు, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల పట్టునుంచి ఇండో-చైనా విమోచన పేరిట ముందుకు సాగి తొమ్మిదివేల మైళ్లనుంచి "టోంకిన్ జలసంధి తీర్మానం"చాటున దాగి వియత్నామ్‌లో కాలుమోపినప్పుడూ అమెరికా చెప్పిన మాటలకూ నేడు గల్ఫ్‌లో యుద్ధం ప్రారంభించడానికి అది చెప్పే శ్రీరంగనీతులకూ తేడాలేదు! వియత్నాం ఆక్రమణ తన లక్ష్యంకాదనీ యుద్ధం ప్రారంభించిననాడు చెప్పిన అమెరికా, పాతికేళ్ళపాటు వియత్నాం జాతిని అష్టకష్టాలకు గురిచేసి, తన 50 వేలమంది సైనికులను ఆహుతి చేసుకొని చేతులుకాలి, అమెరికన్ ప్రజల శాపనార్థలమధ్య అవమానభారంతో తలవంచుకొని తోకముడుచుకోవలసి వచ్చింది. అదేమంటే నేటిగల్ఫ్ యుద్ధాన్నీ, చారిత్రికంగా తనకు చెందిన కువైట్‌ను తిరిగి తన స్వాధీనంలోకి తెచ్చుకోడానికి ఇరాక్ తీసుకున్న చర్యలనూ పెరల్ హార్బర్‌పై 1941లో జపాన్ జరిపిన దాడితో అమెరికన్లు పోల్చుతూ గల్ఫ్‌లో తమ యుద్ధాన్ని సమర్థించుకోజూస్తున్నారు. కానీ, ఆనాడు ఆసియాలో, ఆసియా-పసిఫిక్ ప్రాంతంలో సామ్రాజ్యవాద రాజ్యాంగా ఉన్న జపాన్ స్థానంలో కొత్త సామ్రాజ్యవాదిగా తాను కాలూనడం కోసం అమెరికా, పెరల్ హార్బర్‌పై జపాన్ దాడి పేరిట - హిరోషిమా, నాగసాకీ నగరాలపై తొలి అణుబాంబులువేసి లక్షలాది

మంది ప్రజలను పొట్టనబెట్టుకోడాన్ని సమర్థించుకోవాలని కూడా ప్రయత్నిస్తోంది! ఈ అగ్రరాజ్య దురహంకారం వల్లనే ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు మరొకసారి గల్ఫ్‌యుద్ధంలో "కువైట్ విమోచన ' పేరిట, "పరిమితయుద్ధం" చాటునా చేస్తున్న పని - అరబ్ దేశాలలో తన తైనాతీలుగా, అసెంబ్లీలతో, ప్రజాస్వామ్యంతో, ప్రాతినిధ్య పరిపాలనతో ఏమాత్రం నిమిత్తంలేకుండా చక్రవర్తిత్వాలను తన కన్నుసన్నలలో వెలగబెడుతున్న సౌదీ అరేబియా, మస్కట్, ఒమన్, బాహ్రీన్‌లను స్థావరాలుగా చేసుకొని స్వతంత్ర రాజ్యమైన ఇరాక్ రిపబ్లిక్‌పై మారణాస్త్రాలతో విధ్వంసకాండకు దిగడం. యూరప్‌లో శాంతి కావాలి, అమెరికాలో శాంతి ఉండాలి! కాని ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో స్థానిక యుద్ధాల ద్వారా కాష్ఠం రాజుతూనే ఉండాలి - ఇదీ ఈ తెల్లజాతి ప్రభువుల కుట్ర, జాత్యహంకారం, అందులో భాగమే "యురోపియన్ హౌస్"పేరిట, యూరప్ సమైక్యత పేరిట ఒకనాడు మిలిటెంట్ జాతీయ వాదశక్తులకు, దేశాలకు అండదండలుగా, గుండెలలో గుడిగా మెలిగిన రష్యా కాస్తా యూరోపియన్ సామ్రాజ్యవాద పాలకులకూ, అమెరికన్ నయావలస పాలకులకూ "ప్రచ్ఛన్న యుద్ధపరిసమాప్తి" పేరుతో లొంగిపోవడం; అస్త్రసన్యాసం చేసిన సోవియెట్ తూర్పుయూరప్ దేశాలను యూరోపియన్ కాపిటలిస్టు శక్తులకు పాదాక్రాంతం చేసింది; తద్వారా యూరప్‌లో "శాంతి"ని ఆసియాలో "అశాంతి"గా బదిలీచేసింది; ఒక నాడు సెక్యూరిటీ కౌన్సిల్‌లోని కొన్ని అగ్రరాజ్యాల దురహంకార ధోరణులను అడ్డుకోడానికి, వారు దురాక్రమణ చర్యలకు పాల్పడకుండా నిలవరించడానికి బలమైన ఆయుధంగా వాడుకొన్న తన "వీటో" హక్కును కాస్తా నేడు రష్యా "నాటో" కూటమికి తాకట్టుపెట్టి కూర్చింది! అమెరికా "ఆర్థిక సహాయంకోసం" చివరికి చైనాకూడా తన "వీటో" హక్కును ఇరాక్ సమస్యపై అమెరికా వ్యూహాన్ని ఛేదించడానికి వినియోగించ లేకపోయింది; ఎటు తిరిగీ క్యూబా, ఎమెన్‌లు, మరికొన్ని సాధారణ సభ్య (కౌన్సిల్‌లో) దేశాలు మాత్రమే సెక్యూరిటీ కౌన్సిల్ తీర్మానాలను వ్యతిరేకించగలిగాయి.

ఇరాక్‌పై ఆంగ్లో-అమెరికన్ కూటమి 27 దేశాల సేనలతో సంయుక్తంగా ఆధునిక ఎలెక్ట్రానిక్ ఆయుధాలతో తలపెట్టిన పాశవికమైన దాడులకు, దురాక్రమణకూ ఆయాదేశాలలోని ప్రజలమద్దతు అంతంతమాత్రమే. యుద్ధంలో పాల్గొంటున్న అన్ని దేశాలలోనూ అమెరికా జోక్యాన్ని నిరసిస్తూ, పెద్దఎత్తున ప్రదర్శనలు జరుగుతున్నాయి; "ప్రజా స్వామ్యం" పేరిట అమెరికా ఆడుతున్న నాటకాన్ని అమెరికాలోని ప్రజా సంస్థలూ, సెనెటర్లే బహిర్గతం చేస్తున్నారు. అంతేగాదు, జార్జిబుష్ యుద్ధ ప్రకటనకు మద్దతునివ్వడంలో అమెరికన్ పార్లమెంటు సభ్యులలో తీవ్రవిభేదాలువచ్చి (ప్రతినిధుల సభలోనూ, సెనెట్‌లోనూ) స్వల్పమైన మెజారిటీని మాత్రమే అమెరికన్ కాంగ్రెస్ ప్రకటించగా, ఇరాకీ పార్లమెంటు ప్రెసిడెంట్ సద్దామ్ చర్యలకు ఏకగ్రీవంగా ఆమోదం తెలిసింది. కువైట్‌నుంచి ఇరాక్ ఏక్షణాన్నైనా వైదొలగుతుంది గానీ, ముందు పాలెస్తీనా విమోచన - ఎజెండలో ప్రధానాంశం కావాలని కోరింది. అయిదు నెలలుగా ఇరాక్‌తో చర్చలు విఫలమైన తర్వాతనే తాను ఇరాక్‌పై దాడులు ప్రారంభించవలసి వచ్చిందని బుష్ చెప్పే మాటలన్నీ పచ్చి అబద్ధాలు. ఎందుకంటే - చర్చలలో పాల్గొనబోయే ప్రతిసారీ, పాల్గొన్న ప్రతి దఫా చర్చలు బేషరతుగా సాగితేనే పరిష్కారం సాధ్యమని ఇరాక్ చేస్తూ వచ్చిన ప్రకటనలను విస్మరించరాదు. చివరికి ఫ్రాన్స్, జర్మనీలు చేసిన రాజీ ప్రతిపాదనను కూడా అమెరికన్లు తిరస్కరించారు. పాలెస్తీనా సమస్య పరిష్కారానికి ప్రపంచ సమావేశాన్ని ఏర్పాటుచేయడానికి సమ్మతించడం ద్వారా కువైట్ నుంచి ఇరాక్ వైదొలగడానికి మార్గం సుగమం చేయాలన్న ప్రతిపాదనను కూడా ఆంగ్లో-అమెరికన్లు తిరస్కరించి ఈ యుద్ధాన్ని

ఇరాక్‌పైన బలవంతంగా రుద్దారని గుర్తించాలి. అసలు కువైట్‌పై ఇరాక్ చర్యకు కొన్ని మాసాల ముందుగానే అమెరికన్ "పెంటగన్" తుంటరులు ఇరాక్ విధ్వంసానికి ఎలా పథకాలు సిద్ధంచేసి ఉంచిందీ బయట పెట్టినందుకు జనరల్ డూగాన్‌ను నేటి యుద్ధకారకులలో ఒకడైన అమెరికా రక్షణ మంత్రి రిచర్డ్‌సన్ బర్తరఫ్ చేశాడు. బాగ్దాద్‌ను సర్వనాశనం చేయడానికి సిద్ధంగా ఉన్నామని ఆగస్టు రెండవ తేదీకి ముందు డూగాన్ మాత్రమే కాదు, అమెరికన్ యుద్ధనావికాదళాల అధిపతి రాయల్‌మూర్‌కూడా ప్రకటించాడు. ఇవన్నీ రికార్డయిన సత్యాలు! ఈ సైనిక నాయకుల ప్రకటనలను లోగడ వియత్నామ్ పేపర్స్‌ను, వాటర్‌గేట్ కుంభకోణాన్ని బయట పెట్టిన "వాషింగ్టన్ పోస్టు" బాహాటంగానే నైతిక ప్రాతిపదికపైన ఖండించవలసి వచ్చిందని సభ్య ప్రపంచం మరవరాదు! అంతేగాదు, గల్ఫ్‌లో అమెరికా లక్ష్యాన్ని - "ఆయిల్ కోసమే గల్ఫ్‌లోకి దిగుతున్నాం" అని రిపబ్లికన్ సెనెటర్ బాబ్‌డోల్, "మా యువకులకు, ఉద్యోగాలకోసం, సైనికులకు పని కల్పించేందుకు గల్ఫ్‌లో దిగాం" అని విదేశాంగ మంత్రి జేమ్స్‌బేకర్, "మన ఆర్థిక ప్రయోజనాల రక్షణకోసం చేస్తున్న ప్రయత్నాలకు సిగ్గుపడలవసిన పనిలేద"ని క్షమాపణ చెప్పవలసిన అవసరంలేదనీ, "మన ఆయిల్ జీవనాడులను సద్దామ్ బంధించడాన్ని అనుమతించేది లేదనీ పదవీచ్యుతుడైన మాజీ ప్రెసిడెంట్ నిక్సన్ బాహాటంగానే ప్రకటించారు!! ఇదీ "తెల్ల" జెర్రిగొడ్డుల దురహంకారం!

శనివారం 19, జనవరి 1991

# ఈ యుద్ధం అన్యాయం, అక్రమం :3:

భస్మాసురహస్తాన్ని పెంచుకున్న "ఈ స్టార్ వార్స్" యుగంలో, మానవునిపై విశ్వాసాన్ని కోల్పోయి మరణాస్త్రాలపైన మాత్రమే మమకారం పెంచుకున్న ఈ అణ్వస్త్రయుగంలో, భూతలంపైన సుదూర శత్రులక్ష్యాలను సహితం కాంతివేగాన్ని మించిన 'లేజరా"యుధాలైన సౌరస్త్రాలను సంధించుకుంటున్న ఈ రాకాసి యుగంలో - పశ్చిమాసియాలో కువైట్ పేరిట గల్ఫ్ సింధుశాఖలో అరబ్బులు - అమెరికన్ సామ్రాజ్యవాదులు తలపెట్టిన ఈ దారుణ, యుద్ధానికి శాశ్వత పరిసమాప్తి, ఎప్పుడన్నది ఇపుడే చెప్పలేము. 'టోమీహక్' విధ్వంసక మిస్సైల్స్‌తో ఇరాక్‌పై బహుళజాతి దుష్ట కూటమి ప్రారంభించిన దాడిన తిప్పికొడుతూ ఇరాక్ మొత్తం పశ్చిమాసియా సమస్యను అమెరికా అండజూసుకుని ఇన్నేళ్ళుగా సమస్యను క్లిష్టతరంచేసి, అరబ్ భూభాగాలనుంచి అరబ్బులనే నిరాశ్రయులను చేసిన ఇజ్రాయిల్‌పై "స్కడ్" మారణాస్త్రాలను వదిలిపెట్టింది. "జియోనిజం" పైన ఇరాక్ ప్రారంభించిన ఈ తాజా దాడితో యావత్తు పశ్చిమాసియా పరిణామాలే మరో మలుపు తిరుగుతాయి.

ఇంతవరకూ పరిమితంగా ఉంటున్న స్థానిక యుద్ధాలు మరో ప్రపంచ సంగ్రామానికి అంకురార్పణ జరగడానికి తగిన అవకాశాలన్నీ గల్ఫ్ పరిణామాలు సూచిస్తున్నాయని గమనించాలి. గల్ఫ్ యుద్ధం కువైట్ సమస్యకు మాత్రమే పరిమితమైనది కాదనీ, మొత్తం పాలస్తీనా సమస్య పరిష్కారంలో అది అంతర్భాగం అనీ ఆదినుంచీ ప్రెసిడెంట్ సద్దామ్ చేస్తూన్న ప్రకటనలకు శుక్రవారంనాడు ఇజ్రాయేల్ జరిపిన దాడే నిదర్శనం! ఉభయత్రా సాగుతున్న యుద్ధ చర్యలను ఖండించడానికే సభ్య దేశాల శక్తియుక్తులు పరిమితం కారాదు. ఐక్యరాజ్య సమితి లక్ష్యం శాంతి స్థాపనేగానీ, అందుకు సానుకూలమైన వాతావరణాన్ని ఓపికతో కల్పించడమేగాని, యుద్ధాలను పరోక్షంగాగానీ ప్రత్యక్షంగాగానీ ప్రోత్సహించడంకాదు. ఈ విషయంలో ఎన్నడూ సమితి జనరల్ అసెంబ్లీని సమావేశపరచనని అమెరికా, తన ముఖం చాటుచేసి కేవలం 15 మంది సభ్యులుగల సెక్యూరిటీ కౌన్సిల్ ద్వారా 'గుడిగుడి గుంచం గుళ్ళో రాగం'గా ఇరాక్‌పై ఆర్థిక ఆంక్షలనేగాక "అవసరమైన అన్ని చర్యలూ" తీసుకోవాలన్న తీర్మాన భాగాన్ని ఆసరా చేసుకొన్నది అమెరికా. భద్రతా మండలి "బలప్రయోగం చేసే హక్కు"ను అన్ని దేశాలకు కల్పించకపోయినా - దురాక్రమణ చరిత్రలు సృష్టించడంలో అగ్రభాగాన ఏ అమెరికా నిలిచిందో, ఆ అమెరికాను, దాని తరపు దుష్టు కూటమినీ, సమితి జనరల్ అసెంబ్లీకి లాగాలి! ఈ పరిస్థితుల్లో పిల్లిమెడలో గంట కట్టగల ఆఫ్రో - ఆసియన్‌దేశమే లేదా? అలీన ఉద్యమానికి ఒకనాడు అగ్రగామిగా ఉన్న ఇండియా ఏం చేస్తున్నట్టు? సామ్రాజ్య వాద విస్తరణకు, దురాక్రమణలకు వ్యతిరేకంగా నాడు శక్తివంతమైన నిరసనోద్యమం సాగించిన ఈ అలీనోద్యమం ఎందుకిలా నీరసించిపోయింది? జనాభాకు రెండవ పెద్ద దేశంగా పేరొందిన ఈ భారతం

తన గొంతును తానే ఎందుకు నొక్కి వేసుకుంటున్నట్టు? తన వాణిని నీళ్ళు నమలకు
తడబడకుండా ఎందుకని ప్రపంచానికి వినిపింపచేయడంలేదు? కాశ్మీర్ సమస్యపై భా
సర్వదా సమర్థించిన ఇకార్‌పట్ల, చరిత్రలో లక్షన్నరమంది భారతీయ పౌరులను ఇరాకీ ప
సురక్షితంగా మన దేశానికి తరలించుకోడంలో అన్నివిధాలా మనకు సహకరించిన ఇరా
వైఖరేమిటో కౌన్సిల్‌లో భారతదేశానికి సాధారణ సభ్యురాలుగా ఎన్నిక కాకుండా చేయాల
ఇటీవల పన్నుగడ పన్నిన తరువాతనైనా - అమెరికన్ సామ్రాజ్యవాద పాలకులపట్ల భారత ప్రః
మారి ఉండవలసింది. భారత స్వాతంత్ర్య సంగ్రామానికీ, జాతీయ కాంగ్రెస్‌కూ ఒక దశవరకు
సామ్రాజ్యవాద శక్తుల కుట్రలను, కుహకాలనూ ఖండించి, ప్రజలను అప్రమత్తం చేసిన సం
ఉంది. కాని అది మనకు నేడు కొరవడింది. నాయకత్వాలు, పాలకవర్గాలు "మన్నుతిన్న ః
యి పోయారు. "ఇది అవాంఛనీయం, ఈ పరిణామం దురదృష్టకరం" అని తప్ప వీరెు
పరిణామాలకు కారణాలను ప్రజలకు వివరించి చెప్పడానికి వెనుకాడుతున్నారు. దానికి కారణం
నెహ్రూ చెప్పినట్టుగా, ఆర్థికంగా పరాధీన స్థితిలో ఉన్నంతకాలం భారతదేశం జాతీం
అంతర్జాతీయంగానూ స్వతంత్రమైన విధానాలను అనుసరించలేదు, నిర్ణయించలేదు. ఈ
అమెరికాకు తెలుసు, మనకు తెలుసు; "గాట్" వాణిజ్య చర్చలలో మన వర్తకాన్ని దెబ్బతీసే ః
అమెరికా చేసినా, మనం పల్లెత్తుమాట అనకూడదు; "సూపర్ 301" చట్టం ప్రకారం మ
స్వాతంత్ర్యాన్ని, పేటెంట్ హక్కులనూ అమెరికా అవమానపరిచినా మనం నోరు మెదప
భద్రతామండలిలో గల్ఫ్ యుద్ధానికి తాను చేసే సన్నాహాలకు మనం అనుకూలంగా తలాడిం
అమెరికా ఊరుకోదు. తన బొక్కసం మీద ఆధారపడిన అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ మనకివ్వ
రుణాలను నిలిపివేస్తుంది. లక్ష కోట్ల రూపాయల పైచిలుకు విదేశీ రుణభారంతో తీసుకుంట
భారతానికి, లేదా దేశాన్ని నలభైమూడేళ్ళలో ఈ దుస్థితికి, ఈ దుర్గతికి దిగజార్చిన నాయకమ్మ
నాలుక తడపడకుండా అభిప్రాయ ప్రకటన ఎలా సాధ్యపడుతుంది?

జాతీయ కాంగ్రెస్ విశిష్ట అధ్యక్షురాలిగా ఉన్నప్పుడు సరోజినీదేవి ఒక హెచ్చరిక ప
చేస్తుండేది; "స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలకోసం పోరాడుతున్న వలస, అర్ధవలస దేశాల ప్రజలకు భా
ఎంతగా అండదండలందించితే భారత రాజకీయ స్వాతంత్ర్యం, స్వేచ్ఛ అంత ఘనంగా దీపిస్తుంది
బ్రస్సెల్స్‌లో 1927లో జరిగిన సామ్రాజ్యవాద వ్యతిరేక మహా సభలో భారతదేశ ప్రతినిధిగా ప
జవహర్‌లాల్ నెహ్రూ వల్లనే జాతీయ కాంగ్రెస్‌కు విశ్వజనీన దృష్టి కొంతవరకైనా అబ్బిందని మరు
కాని ఇప్పుడా స్ఫూర్తి ఏమైపోయింది? గల్ఫ్ యుద్ధాన్ని నిరసిస్తూ కాంగ్రెస్ ఎందుకని దేశవ్యాపి
ప్రదర్శనలు నిర్వహించలేకపోతోంది? రూజ్‌వెల్ట్ మాటల్లో చెప్పాలంటే "అంతర్జాతీయ పోలీసు పా
ఏకపక్షంగా, అయాచితంగా తలెత్తుకున్న అమెరికా విస్తరణవాదాన్ని కట్టిపెట్టించకపోతే - పి
మహాసముద్ర జలాలు త్వరలోనే "ఉష్ణరక్తకాసారం"గా మారిపోనున్నాయని గల్ఫ్ పరిణామాలు మర
రుజువు చేస్తున్నాయి. పసిఫిక్ నుంచి అట్లాంటిక్ మహాసముద్రం దాకా, మధ్యధరానుంచి, హిందూ
సముద్రం దాకా సకల సాగరాలనూ అమెరికా తన యుద్ధ వ్యూహ, విన్యాస, విహార సరస్సు
మార్చుకున్నందుననే ఈ జాగరూకత అవసరం. హిందూ మహాసముద్రంలోని డీగోగార్సియా
స్థావరాన్ని బ్రిటన్ ఖాళీ చేస్తూ అమెరికాకు అప్పగిస్తే, మనం గుడ్లు అప్పగించి చూస్తూ కూర్చున్నాం.

## ఎబికె సంపాదకీయాలు

ఇప్పుడా స్థావరంనుంచే బి-52 బాంబర్ విమానాలను మన మిత్రదేశమైన ఇరాక్‌పైకి అమెరికా పంపించి, విధ్వంసకాండకు దిగింది. జాతీయ సమస్యలు, సరిహద్దు తగాదాలు స్థానిక యుద్ధాలూ చారిత్రకంగా సామ్రాజ్యవాదుల సృష్టి. మనకు కాశ్మీర్, ఖలిస్తాన్, "ఉల్ఫా" సమస్యలు ఎలాగో, ఇరాక్‌కు కుర్దిష్ సమస్య, కువైత్‌తో సరిహద్దు వివాదాలు అలాంటివి; సిక్కిమ్‌ను 23వ రాష్ట్రంగా ఇండియాలో చేర్చుకోవడం మనకు సమర్థనీయమైతే, చారిత్రికంగా తనదైన కువైట్‌ను 19వ రాష్ట్రంగా తనలో చేర్చుకోవడం ఇరాక్‌కు సమర్థనీయం. 'అలస్కా' తనదికాకపోయినా, దానిని అమెరికా 49వ రాష్ట్రంగా గుంజుకొని కలుపుకొంది. కాగా ఈ పరిణామాన్ని ఏవగించుకున్న బ్రిటీష్ ప్రజలు కునారిల్లి పోతున్న బ్రిటన్ ప్రతిపత్తిని వ్యంగ్యంగా వర్ణిస్తూ "అమెరికాలో బ్రిటన్ 50వ రాష్ట్రమా?" అని ఎత్తి పొడవవలసి వచ్చింది. చివరికి "బుష్‌ను అరెస్టు చేయాలి" అని నినిదాలిచ్చేదాకా అమెరికా ప్రజలు ఇప్పటికి ఎదగగలిగారు. గల్ఫ్ మరొక వియత్నాం కాబోతోంది. నిన్న చిత్తడినేలల్లో చిత్తు చిత్తయిన అమెరికా రేపో మాపో ఎడారి ధూళిలో దుమ్ము కొట్టుకుపోవలసి వస్తుంది!! స్థానిక యుద్ధాలలో - పదాతిదళాలు పరస్పరం తారసిల్లకుండా, మోహరించిన వాళ్ళు ముగ్గులోకి దిగకుండా కేవలం విమాన, నౌకా యుద్ధాలవల్లనే అంతిమ ఫలితాలను నిర్ణయించలేము. ఆ ముహూర్తం కోసం ఎదురు చూస్తోంది ఇరాక్, దాన్ని తప్పించుకోజూస్తున్నది అమెరికా. కాని యుద్ధానికి ప్రధానం ప్రారంభదశ కాదు, ముగింపు దశ. అది ఎడారి దెబ్బ. అది ఇరాక్ చేతుల్లోనే ఉంది. హిట్లర్ ప్రారంభించిన యుద్ధానికి అఖండమైన ముగింపు తెచ్చి చరితార్థుడైనవాడు స్టాలిన్!

శుక్రవారం 20, జనవరి 1991

# బుష్ మొండిపట్టు - సద్దామ్ మంకు పట్టు

ఎన్నికలలో స్వార్థ ప్రయోజనాలను ఈడేర్చుకునేందుకు బి.జె.పి. నాయకులు మందిర్-మసీదు' తగాదాను ముగించడానికి ఇష్టపడకుండా, ఎన్నికలు జరిపే దాకా ప్రజలను "రథ" చక్రాలకు కట్టి బలవంతంగా ఈడ్చడానికి ఎలా ప్రయత్నిస్తారో - అలాంటి ప్రయత్నాన్నే అమెరికా అధ్యక్షుడు జార్జిబుష్ కూడా గల్ఫ్ 'సంక్షోభం' పేరిట, కువైత్‌లో ఇరాక్ చర్య చాటున దాగి పశ్చిమాసియాలో చిచ్చు పెడుతున్నాడు! కాని తన నీడ చూచుకొని తానే భయపడుతున్నాడు. అమెరికన్ ప్రసిడెన్షియల్ ఎన్నికల్లో తిరిగి తన గెలుపునకు సానుకూలంగా గల్ఫ్ సంక్షోభాన్ని మలచుకోవాలని తంటాలు పడుతున్నాడు. అందులోభాగమే - అమెరికా, ఇరాక్ ప్రతినిధులు జినీవాలో సమావేశం కావాలన్న తాజాప్రతిపాదన. ఇంతకూ తగాదాకు కక్షిదారైన కువైత్ ప్రతిపత్తి కాస్తా పక్కకు తప్పుకొంది. అయితే అమెరికా తరపున విదేశాంగ మంత్రి జేమ్స్ బేకర్, ఇరాక్ తరపున తరీక్ అజీజ్‌లు రేపు జరిపే చర్చలలో ఎజెండా స్పష్టం కాకపోగా, సమావేశం జరిగినా సాధించబోయే ఫలితం నామమాత్రమేనని కూడా అమెరికన్ ప్రతినిధుల ప్రకటనలే రుజువు చేస్తున్నాయి. పరిష్కారానికి వీలైన పద్ధతులను ఉభయ పక్షాలూ అనుసరించడం లేదు. జనవరి 15 కల్లా 'ఆక్రమించిన' కువైత్‌నుంచి ఇరాక్ వైదొలగిపోవాలని, లేని పక్షంలో అమెరికా, దాని మిత్ర రాజ్యాల సైన్యం ఇరాక్‌పైన యుద్ధం ప్రకటించవలసి వస్తుందనీ అమెరికా ప్రేరణతో ఐక్యరాజ్యసమితి భద్రతామండలి ఆమోదించిన తీర్మానం గడువు పూర్తికావడానికి వారం రోజుల వ్యవధి మాత్రమే ఉంది.

అరబ్ భూభాగాలపైన అరబ్‌ల మధ్య తలెత్తిన తగాదాలలో తలదూర్చే హక్కు అరబ్‌లలో ఎవరికి ఉన్నా లేకపోయినా అమెరికాకు మాత్రం లేదన్నది స్పష్టం! అయినా మొత్తం 12 తీర్మానాలనూ ఏకపక్షంగా పరిశీలించేందుకు, ఆలోచించేందుకు సాధనంగా అయిదు అగ్రరాజ్యాలకున్న 'వీటో' హక్కు కూడా ఈసారి భద్రతా మండలిలో ఎందుకూ పనికి రాకుండా పోయింది. భద్రతా మండలి మరోసారి 'తెల్లవాడి క్లబ్'గా మారిపోయింది; వీటో హక్కు ఉన్న అయిదు అగ్రరాజ్యాలలో మూడు దేశాలు (అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్) పాత, కొత్త సామ్రాజ్యవాద వలస పెత్తందారీ రాజ్యాలు. మిగతా రెండింటిలో (రష్యా, చైనా) ఒకటి'ప్రచ్ఛన్నయుద్ధం' అంతం చేసే పేరిట తూర్పు యూరప్ సోషలిస్టు దేశాలను యూరోపియన్ పెట్టుబడికి ప్రత్యక్షంగానే తాకట్టుపెట్టింది! మరొకటి ఆర్థిక సహాయం కోసం వాషింగ్టన్ విధానాలకు తలొగ్గింది! ఎటు తిరిగీ తమకున్న స్తోమతులో పశ్చిమాసియాలో (గల్ఫ్‌లో) సామాన్య అరబ్ ప్రజాబాహుళ్యం ప్రయోజనాలకు 'షేక్'ల, 'అమీర్'ల ప్రజా వ్యతిరేక పాలనకు వ్యతిరేకంగా అరబ్ షేక్‌డమ్స్‌లో చెలరేగుతున్న ఆందోళనోద్యమాలకు దన్నుగా మండలిలో గొంతెత్తి వినిపించి, ఇరాక్‌పై మండలి ఆర్థిక దిగ్బంధనను, గల్ఫ్‌లో జోక్యాన్ని నిరసించిన చిన్న దేశాలు - క్యూబా, మలేషియా, కొలంబియా, ఎమెన్. అంతేగాదు,

ఇరాక్‌పై దుగ్ధకొద్దీ గల్ఫ్‌యుద్ధాన్ని ఆసియా ప్రజలపై రుద్దడానికి ఉవ్విళ్లూరుతున్న అమెరికాకు తోడుగా తమ సైనికులను కూడా ఉడతాభక్తిగా పంపుతున్న బ్రిటన్‌లోని ప్రధాన ప్రసార సంస్థ బి.బి.సి అమెరికాను వెక్కిరిస్తున్నట్టుగా "1990వ సంవత్సరంలో గణించదగిన వ్యక్తి"గా ఇరాక్ నేత సద్దామ్ హుస్సేన్‌కు పురస్కారం ప్రకటించి కూర్చుంది! ఈ సమయంలో జరుగుతున్న జెనీవా చర్చల్లో "సంప్రదింపులు ఉండవు, రాజీ బేరాలుండవు, మొగ మాటాలుండవు, దురాక్రమణకు రాయితీలుండవు" అంటూ అమెరికా అధ్యక్ష భవనం సమాచార శాఖ మంత్రి మార్లిన్ షిట్జ్‌వాటర్ ప్రకటించగా ప్రెసిడెంట్ బుష్ "జనవరి 15 కల్లా కువైత్ నుంచి ఇరాక్ వెళ్లి పోకపోతే" సద్దామ్‌నూ, ఇరాక్‌నూ ధ్వంసం చేస్తామని బెదిరించాడు! అలాంటప్పుడు జెనీవా చర్చలు ఎందుకు జరపాలో మనకు అర్థం కాదు! ఇరాక్‌పై "ఆర్థిక దిగ్బంధన"కు భద్రతా మండలి ఆమోదించిన తీర్మానాలవల్ల ప్రయోజనం చేకూరలేదు; అయిదు మాసాలుగా యుద్ధ బెదిరింపువల్ల ఇరాక్‌ను అమెరికా దాని మిత్ర రాజ్యాలు లొంగదీయలేకపోయాయి; ఇప్పుడు జెనీవా సమావేశం సందర్భంగా విడుదలవుతున్న బెదిరింపుల బాంబులు కూడా పేలజాలవు. ఎందుకంటే - అరేబియన్ పెనిన్స్యులాలో అరబ్బుల జాతీయతను, సమైక్యతను చెదరగొట్టి, భూభాగాలను తలకొక ముక్కగా పంచి, రాజకీయ, భౌగోళిక, సాంస్కృతిక రంగాలలో వారిని చిన్నాభిన్నం చేసి వదిలిన ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల చరిత్ర అరబ్బులకు తెలుసు. కువైత్‌లో ఇరాక్ ఆక్రమణ వెనక చరిత్ర అరబ్ షేక్‌డమ్స్‌లోని ప్రజలకు మాత్రమే తెలుసు; తెలుసు కాబట్టే ఇరాక్ చర్యను సహించి అయినా, గల్ఫ్ నుంచి ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులకు దేవిడీమన్నా చెప్పించాలన్న పట్టుదలలో ఉన్నారు. ఇరాక్ చర్యపైన కొన్ని అరబ్ దేశాలలో భిన్నాభిప్రాయాలున్నప్పటికీ, ముందు గల్ఫ్‌లోని విదేశీ సేనల ఉనికిని అరబ్బులు సహించలేరు. ఎంతలేదన్నా ఇరాక్, తోటి అరబ్‌దేశం, ఒకే జాతి కుటుంబం! అలాగే గల్ఫ్‌లో బహుళ జాతి సేనల జోక్యానికీ, ప్రాంతం కాని ప్రాంతంలో యుద్ధానికి తలపడడానికీ పెక్కు యూరోపియన్ దేశాలు కూడా సిద్ధపడడంలేదు. పైగా అమెరికన్ పార్లమెంటులోనే బుష్ పనులను ఏవగించుకోవడం ప్రారంభమైంది.

ఫ్రాన్స్, జర్మనీలేగాక మరి పది యూరప్ దేశాలు కూడా కువైత్ సమస్యతోపాటు ఒకే సమయంలో పాలస్తీనా సమస్య పరిష్కారంకూడా సాధ్యపడాలన్న సద్దామ్‌హుస్సేన్ ప్రతిపాదనతో ఏకీభవించడం అమెరికా ద్వంద్వనీతిని మరింత బహిర్గతం చేయడానికి, అమెరికాను బలహీనం చేయడానికే తోడ్పడుతుంది. యూరప్‌లోనూ, అమెరికాలోనూ స్త్రీ, పురుష బాలాదిగా గల్ఫ్‌నుంచి అమెరికన్ సైనికులను వెనక్కి రప్పించాలని కోరుతూ పెద్దఎత్తున ప్రదర్శనలు జరుపుతున్నారు. ఇటు పెక్కు అరబ్ దేశాలలో ఇరాక్‌పై దాడికి జరిగే ప్రయత్నాలనూ, గల్ఫ్‌లో విదేశీసేనలను నిరసిస్తూ ప్రజలు ప్రదర్శనలు నిర్వహిస్తున్నారు. "వేలాదిమంది సైనికులను ఎడారిలో యుద్ధానికి పంపిన జార్జి బుష్ తాను మాత్రం విశ్రాంతిగా గాల్ఫ్ ఆడుకోవడం చూచి మనస్సు వికలమై మానవ మారణకాండలో నేను భాగస్వామిని కాదలచక ఇంటిముఖం పడుతున్నాను" అని ప్రకటించిన ఆస్ట్రేలియన్ సైనికుడు టెరిజోన్స్ నేడు సమిధలు కాబోతున్న అమెరికన్ సైనికులకు కూడా ఆదర్శమయితే ఆశ్చర్యపోనక్కరలేదు. సర్వసేనాపతిగా యుద్ధాన్ని ప్రకటంచే అంతిమ హక్కు ప్రెసిడెంట్ బుష్‌కు ఉన్నా ఆ ఉన్మాదానికి ముగుదాడు వేసేందుకు అమెరికన్ కాంగ్రెస్ కూడా సభ్యులను అందుబాటులో ఉండమని హెచ్చరించవలసివచ్చింది. సరిగ్గా ఈ సమయంలోనే ఇరాక్ ప్రెసిడెంట్ సద్దామ్ ఆదివారంనాడు ఇరాక్ సైన్యం 70వ వార్షికోత్సవం సందర్భంగా ప్రసంగిస్తూ "ప్రజలు

దీర్ఘకాల పోరాటానికి సంసిద్ధం" కావాలనీ, అమెరికా అధ్యక్షతన సాగుతున్న నిరంకుశ ధోరణులపై ఈ సమరం జరగక తప్పదని హెచ్చరించాడు. కువైత్ చారిత్రికంగా ఇరాక్‌లో భాగమనీ, "మాతృభూమిలో కువైత్ విలీనీకరణ ఒక వాస్తవమనీ, అది కువైత్‌లో 19వ రాష్ట్రమనీ" మరోసారి తెగేసి చెప్పడంవల్ల ఆక్రమించిన అరబ్ భూభాగాలనుంచి ఇజ్రాయేల్ తొలగిపోవడానికీ కువైత్ పరిష్కారానికీ అవినాభావ సంబంధం ఉందనీ చెప్పడంవల్ల - ఇరాక్ వైఖరిలో మార్పులేదని అర్థమయింది. పైగా "ఇది పాలస్తీనాకోసం సాగుతున్న పోరాటం" అని సద్దామ్ నిర్మొహమాటంగా ప్రకటించడంవల్ల పశ్చిమాసియా సమస్యకు శాశ్వత పరిష్కారం కనుగొనవలసిన అవసరాన్ని ముందుకు నెట్టినట్టయింది. కువైత్‌లో ఇరాక్ చర్యను "ప్రపంచ శాంతికి భంగకరం"గా ప్రచారం చేస్తున్న అమెరికా, సరిహద్దుల స్థిరత్వం అంతర్జాతీయ శాంతికి "ఏడుగడ"గా భావిస్తున్న అమెరికా - గాజా మండలాన్ని, జోర్డాన్ పశ్చిమ మండలాన్నీ (వెస్ట్ బ్యాంక్) ఆక్రమించుకొని పాలెస్తీనీయులను నిరాశ్రయుల్ని చేసిన ఇజ్రాయేల్ చర్య, రష్యా సహా పెక్కు యూరోపియన్ దేశాలలోని యూదులందరినీ తెచ్చి అరబ్ భూభాగాల్లో తిష్టవేయిస్తున్న ఇజ్రాయేల్ చర్య ఎలా "శాంతి"కి అనుకూలమో అమెరికా సమాధానం చెప్పాలి. "జనవరి 15" గడువును "30"కి పెంచుకొనకా తప్పదు. తప్పితే, వియత్నామ్‌లో మాదిరిగా మాడు పగలగొట్టించుకొనకా తప్పదు!!

మంగళవారం 8, జనవరి 1991

# బుష్ పెంపీపట్టు - సద్దామ్ మంకు పట్టు :2

 యుధ వ్యాపారం కోసం, లాభాలకోసం, గల్ఫ్ ఆయిల్‌ను దోచుకోవడం కోసం అగ్రరాజ్యాలు ఇంతవరకూ ఇరాక్ ఆర్థిక, సైనిక శక్తిని పెంచి పోషిస్తూ వచ్చినవే. రెండో ప్రపంచ యుద్ధానంతరం మొదటిసారిగా ఇప్పుడు 'ప్రచ్ఛన్న యుద్ధం' కాస్తా అంతమైపోయినట్టు ఇతరులను సంబరపడమని బోధించే అమెరికా-రష్యాలు ప్రపంచంలో ఏదో ఒక మూల అనుక్షణం ఘర్షణలనో, స్థానిక యుద్ధాలనో రెచ్చగొడుతూ ఉన్నవేనని మరువరాదు; ఇది ప్రపంచాన్ని స్వార్థంకోసం అగ్రరాజ్యాలు తమ ప్రభావిత ప్రాంతాలుగా పంచుకొనడంగాక మరేమనాలి? బాత్ సోషలిస్టుపార్టీ నాయకత్వంలో సద్దామ్ ఇరాక్‌లో ఏర్పాటుచేసిన ప్రభుత్వానికి ఆదినుంచీ అగ్రరాజ్యాలన్నీ గల్ఫ్‌లో తమ ఆయిల్ ప్రయోజనాలకోసం అన్నిరకాలుగాను మద్దతు ఇచ్చి పోషించినవే. ఇరాక్ సైనిక శక్తిని పెంచింది రష్యా, ఆధునిక యుద్ధాలు సమకూర్చింది ఫ్రాన్స్, రసాయనిక ఆయుధాలిచ్చి ఇరాక్ మిస్సైల్స్‌ను ఆధునికం చేయడంలో సాయపడింది పశ్చిమ జర్మనీ. సద్దామ్ అంగరక్షకులకు ప్రత్యేక శిక్షణ ఇచ్చి సాకింది బ్రిటన్, సుమారు రు. 4000 వేల కోట్ల ఆర్థిక సహాయం అందజేసి బుజ్జగించుతూ వచ్చింది అమెరికా!

కాని ఎవడెన్ని ఇచ్చినా, స్వతంత్రుడైన సద్దామ్ ఒకరికి సలాముకొట్టి గులాము కాదలచుకోలేదు. కాబట్టే - అగ్రరాజ్యాలన్నీ అతనిపై కత్తికట్టి అరబ్ సామాన్య ప్రజల మనస్సును దోచుకున్న ఆ ఇరాక్ నేతను తొలగిస్తే తప్ప, ఇరాక్‌లో ఎవరో ఒక 'డూడూ బసవన్న'ను గద్దెనెక్కిస్తే తప్ప గల్ఫ్ ఆయిల్‌ని దోచుకోలేవు! కనుకనే రాజకీయంగా అరబ్ ప్రజలకు క్రమంగా దూరమైపోతున్న షేకులనూ, అమీరులనూ కూడా మరికొన్నాళ్ళపాటు వంశపారంపర్యపు సింహాసనాలపై నిలబెడదామని చూస్తున్నాయి. అయినా, ఇరాక్-కువైత్ సరిహద్దు తగాదాలపట్ల ఈ జోక్యం దేనికి? లేదా రాజకీయ పటంనుంచి కువైత్ వైదొలగేందుకు అమెరికా నేతలు ఎందుకింతగా అమెరికాలోని ఒక రాష్ట్రమే ఎగిరిపోయినట్టు భావిస్తున్నారు? ప్రపంచ వ్యాపితంగా 'ప్రజాస్వామ్యం' కోసం అంతగా తపించే అమెరికా అకస్మాత్తుగా కువైత్‌లోని అల్‌సబా ప్రజా వ్యతిరేక రాచరిక పాలన పోతున్నందుకు ఎందుకు కుమిలిపోతున్నట్టు? గల్ఫ్ షేకులు, అమీరులూ అంతా సామ్రాజ్యవాదులు పెంచి పోషించిన 'దత్తు'ళ్ళేనని మరువరాదు. అరబ్ సామాన్య ప్రజా బాహుళ్యానికి వాళ్ళంటే ఏవగింపు. సామ్రాజ్యవాదుల సైనిక శక్తి అండదండలతో ప్రజల హక్కులన్నింటినీ కాలరాచి సంపదను మేటవేసుకొని ప్రజల అస్థిపంజరాలపై రాజ్యాలు చెలాయిస్తున్న రాజవంశాలుగా వాళ్ళు అవతరించారు. అమీరులను వదిలించుకునే ముహూర్తంకోసం ఇన్నాళ్ళు ఎదురు చూస్తున్న అరబ్ షేక్‌డమ్స్‌లోని ప్రజా బాహుళ్యం మాత్రం సద్దామ్ హుస్సేన్ చర్యపట్ల హర్షం ప్రకటించినవాళ్ళే. సద్దామ్ పరిపాలనా విధానాలతో విబేధించేవారు కూడా సోషలిస్టు బాత్ పార్టీ నాయకునిగా సద్దామ్ చర్యను సమర్థించడం గమనార్హం కాదా? కళ్ళు మూసుకోలేము.

సద్దామ్ ఒకటి రెండు దీవులకోసమో, లేదా పెట్రోలియం కోసమో, లేదా పెట్రోల్ ధరలను తనకు

అనుకూలంగా మార్చుకోవడంకోసమో కువైత్‌నుంచి ఆల్‌సాబా రాజవంశాన్ని సాగనంపి ఉంటాడనుకోవడం పొరపాటు. అసలు కువైత్ నిర్మాణం - ఇతర "షేక్ డమ్స్" మాదిరే వలస వాదుల సృష్టి. అరబ్ ప్రాంతాల భౌగోళిక స్వరూపాన్ని నాశనం చేసి, విడగొట్టి, ఆయా ప్రాంతాల్లోని జనాభాలను మాతృభూములనుంచి గెంటివేసి, అరబ్ సమష్టి సంస్కృతిని ప్రజలు అనుభవించకుండా చేసిన కుట్రలో అంతర్భాగం కువైత్ అవతరణ! అందుకే కువైత్‌లో ఉండేవారు కువైట్స్ కారు, నాన్-కువైట్స్. ఇతర చోట్లనుంచి వ్యాపారాలకోసం వ్యవహారాలు చక్కబెట్టుకునేందుకు వీళ్ళు "బెల్లం చుట్టూ చేరిన చీమల్లా" సంపదల కాణాచి అయిన కువైత్‌లో తిష్ఠవేశారు. వాళ్ళంతా కూడా ఆల్‌సబా రాజవంశానికి వ్యతిరేకులే. ఆ మాటకొస్తే కువైత్ సైన్యంలో హెచ్చుభాగం ఇరాక్ సైన్యంతో కలవబట్టే ఇరాక్‌లో "ఆగస్టు 2"నాటి విలీనీకరణ సాధ్యమయింది. కాని, అమెరికా బాధకు అసలు కారణం - గల్ఫ్‌లో ఒక "నమ్మిన బంటు"ను (ఆల్ సబా) తాను కోల్పోవడం! ఎందుకని? పాత ప్రెసిడెంట్ రేగన్ ఆప్తమిత్రుడు పెరాన్. ఈ కాలిఫోర్నియా పారిశ్రామికవేత్త కువైత్‌లో ఒక పెద్ద ఆయిల్ ఏజెంటు కావడం వల్ల - కువైత్ చేజారకుండా చూచేందుకు జార్జిబుష్ కంటే ముందుగానే రేగాన్ ఇరాక్ పైన 'రాంబో" యాక్షన్‌కు వ్యూహం పన్నాడు. ఈ లోగా పదవీచ్యుతుడైన రేగాన్ స్థానంలో వచ్చిన బుష్‌కి కూడా ఒక పారిశ్రామికవేత్తతో "సౌదీ కనెక్షన్" వుంది. ఒకరికి కాలిఫోర్నియా గుత్తాధిపతి మద్దతు ఉంటే, వేరొకరికి టెక్సాస్ గుత్తాధిపతి ఆశీర్వాదాలున్నాయి! టెక్సాస్ కంపెనీల ఆయిల్ ప్రయోజనాలన్నీ సౌదీ అరేబియాలోనూ, కువైత్‌లోనూ కేంద్రీకరించి ఉన్నాయి.

సైనిక పారిశ్రామిక వ్యవస్థ రథ చక్రాల ఇరుసులలో పడి నలిగిపోతున్నది అమెరికా ఒక్కటే కాదు, దానిని నమ్ముకున్న గల్ఫ్‌లోని షేక్‌లూ, అమీర్‌లూ కూడా. వాళ్ళు సాంఘిక సంక్షేమ, రాజకీయ ప్రజాస్వామ్య వ్యవస్థలకు బద్ధ శత్రువులు. కనుకనే ఒక విధంగా సోషలిస్టు సద్దామ్ చర్య ఇరుగుపొరుగు సౌదీ అరేబియా, ఓమన్, యునైటెడ్ అరబ్ ఎమిరైట్స్‌లలోని ప్రజా శత్రువులైన రాచరికపు వ్యవస్థలలో ప్రజాస్వామిక సంస్కరణలకు బీజాలు నాటి నట్టయింది; కమాల్‌పాషాలాంటి సంస్కర్త సద్దామ్. సద్దామ్ చర్య సౌదీలో బురఖా తొలగించుకొని ఆధునికం కావడానికి అరబ్ మహిళలలో చైతన్య జ్యోతులు వెలిగించింది; దశాబ్దాలుగా సౌదీ రాజు ఫాద్‌కు గుర్తుకురాని "షురా" (సంప్రతింపుల మండలి) గుర్తుకొచ్చి దానిని వెంటనే ఏర్పాటు చేయవలసి వచ్చింది. సౌదీ అరేబియాలో ఇప్పుడు తలదాచుకుంటున్న కువైత్ యువరాజు మొదటిసారిగా ఆదరాబాదరా కువైత్ ప్రజలకోసం "పీపుల్స్ అసెంబ్లీ"ని ఏర్పాటు చేస్తున్నట్టు ప్రకటించుకోవలసి వచ్చింది. సౌదీ అరేబియాలో 1932 తర్వాత రిపబ్లిక్ రద్దుకావడంతో శాసనసభే లేదు; రాజకీయ పార్టీలను నిషేధించారు. పౌరహక్కులు మృగ్యం - రాజు చెప్పిందెల్ల ధర్మం! అంతేగాదు, అరబ్ భూభాగాలను చీల్చి కువైత్‌ను ఏర్పాటుచేసింది వలస సామ్రాజ్యవాదులే అయినా, దానిని ఇరాక్‌నుంచి చీల్చింది వారే అయినా, ఇప్పుడు దానిని తిరిగి స్వాధీనపరచుకొన్నది ఇరాక్ అయినా - అసలు కువైత్‌కు చెందిన భూభాగంలో మూడింట రెండు వంతుల భాగాన్ని స్వాహాచేసి కూర్చున్నది సౌదీ అరేబియా అని మరువరాదు!! సౌదీ "ఆక్రమణ" విషయం ప్రస్తావించకుండా ఇరాక్ "ఆక్రమణ" గురించి అమెరికా ప్రస్తావించడం - ఆక్రమణదారులంతా అమెరికానుండి అబూదాబీ వరకూ ఒకటే సరుకు అని గుర్తుచేయడం కాదా? అలాగే ఓమన్‌లో కాబస్‌సుల్తాన్ కూడా ఏదేదో హంగామా చేసేస్తున్నాడు - కువైత్‌లో ఇరాక్ చర్య తర్వాత. అలాగే అరబ్ ఎమిరైట్స్‌లో కూడా "సంస్కరణల"వైపు హడావిడి కనిపిస్తోంది. ఇదంతా గమనిస్తే - మొత్తంమీద గల్ఫ్‌లో అమెరికా దాని మిత్రరాజ్యాల సేనల మోహరింపు ప్రభావంకన్నా అరబ్ షేక్‌డమ్స్‌లో ఇరాక్ చర్యవల్లనే ప్రజాస్వామిక వ్యవస్థల అవతరణకు మార్గం మరింత సుగమం కాగలదని ఆశించవచ్చు!

బుధవారం 9, జనవరి 1991

# "ఝ'పనోవ్ అరకు"! సఖరోవ్ సరకు!!

పెట్టుబడిదారీ వ్యవస్థ (కాపిటలిజం) అంటే ఉన్న భయంవల్ల సోషలిజం తన వ్యవస్థలో స్వేచ్ఛా పరిధులను విస్తరింపజేయవలసి వచ్చింది, అలాగే సోషలిజం అంటే భీతిల్లిన కాపిటలిజం సమానత్వ పరిధులను మరింతగా పెంచుకోవలసి వచ్చింది. ఏతావాతా ఫలితం - ప్రాగ్దిశ పశ్చిమంగా, పశ్చిమం ప్రాగ్దిశగా మారుతున్నాయి. ఇప్పటిదాకా ఎడమొగం పెడమొగంగా ఉన్న తూర్పు-పడమరలు రెండూ తర్వలోనే కలుసుకుంటాయి" అని ప్రపంచ మానవ నాగరికతా చరిత్రను పది సంపుటాలుగా వెలువరించి చరితార్థులైన విల్‌డూరాండ్, ఏరియల్ డూరాండ్ దంపతులు "చరిత్ర పాఠాలు'' రచనలో ఓ జోస్యం చెప్పారు!! ఆ మాటలు వారు ఇప్పటికి 21 సంవత్సరాలనాడే చెప్పారు. ఆ 'జోస్యం' సత్యాసత్యాలలోకి, సైద్ధాంతిక నిరూపణలోకి మనం వెళ్ళకపోయినా, నేడు రష్యాలో, తూర్పు యూరప్ సోషలిస్టు దేశాలలో వస్తున్న పరిణామాలు ఆ జోస్యానికి విలువ తెచ్చేవిగా ఉన్నాయి. సోషలిస్టు సామాజిక వ్యవస్థలను దిద్దితీర్చడంలో విప్లవానంతరం కూడా కమ్యూనిస్టు పార్టీ అగ్రగామిగా నాయకత్వ స్థానంలో ఉండాలని నిర్దేశించిన సోషలిస్టు దేశాల రాజ్యాంగాలను తిరగదోడి, ఆ పాత్రను తోసిపుచ్చాలనీ, బహుళపక్ష రాజకీయ వ్యవస్థలుగా వాటిని తీర్చిదిద్దాలనీ సోవియెట్‌లోనూ, బాల్టిక్ రిపబ్లిక్ సహా రష్యన్ రిపబ్లిక్స్ అన్నిటా ఉద్యమాలు సాగుతున్నాయి. ఏదో ఒక మిషమైన సమ్మెలు నడుస్తున్నాయి. సోవియెట్ ప్రభుత్వాధినేత, పార్టీ ప్రధాన కార్యదర్శి గోర్బచేవ్ పార్టీని, ప్రభుత్వాన్నీ సమాజాన్ని మంచివైపుగా "సంస్కరించా"లని చేసిన "ప్రయత్నాలు" ఇలా వికృత రూపం దాల్చుతున్నాయి. మానవుడు తోటి మానవుణ్ణి, ఒక వర్గం మరొక వర్గాన్ని దోచుకునే సాంఘిక ఆర్థిక వ్యవస్థను మొదటిసారిగా కూలదోసి, తొలి సోషలిస్టు వ్యవస్థను ఆవిష్కరించిన మహాప్రయోగంలో విశ్వాసం పెంచుకున్న వారందరికీ ఈ పరిణామాలు సవాలుగా వచ్చిపడ్డాయి. కానీ -

మానవీయ పునాదులపైన, సాంఘిక ఆర్థిక న్యాయంపైన ఆధారపడిన ఆ సోషలిజం చరిత్రకారులు ఛాయామాత్రంగా మనకు చూపించి మభ్యపెట్టజూచే క్రీస్తుపూర్వం 2100 నాటి సుమేరియన్ 'సోషలిజం' కాదు.

ఆ సోషలిజం బాబిలోనియాలో, మందు మాత్రంగా "లా కోడ్" ద్వారా హమూరాబీ మురిపింపజూచిన సోషలిజం కాదు.

ఆ సోషలిజం కేవలం భూములను, వ్యవసాయాన్ని దత్తం చేసుకొని కొన్నాళ్ళు నాటకమాడజూచిన ఈజిప్షియన్ టోలమీల సోషలిజం కాదు.

ఆసోషలిజం చుక్కలంటుతున్న ధరలను అదుపు చేయడానికి తాత్కాలికంగా గుత్తాధిపతులపైన

బ్లాక్ మార్కెటీర్లపైన పట్టుదల చెప్పి రాజీతో సరిపెట్టుకున్న డయాక్లిటాన్ (ఇటలీ) 'డిక్రీ సోషలిజం' కాదు.

ఆ సోషలిజం క్రీస్తుపూర్వం 145వ సంవత్సరంలో సంపదను మరింతగా పోగుచేసుకోకుండా సంపన్నులను ఒక మేరకు అదుపుచేయడానికి ప్రయత్నించిన సుమాచీన్ (చైనా) 'స్టేట్ సోషలిజం'కాదు.

చివరికి ఆ సోషలిజం పెరూలో ఇంకాస్, దక్షిణ అమెరికాలోని ఉరుగ్వేనదీ మండలంలో ఇండియన్ల అండతో ఏసుక్రీస్తు అనుయాయులు కొందరు స్థాపించడానికి ప్రయత్నించిన కల్తీ 'సోషలిజం' కాదు. అది రాబర్ట్ ఓవెన్ సహకార సోషలిజాన్ని నెలకొల్పడానికి చేసిన విఫలయత్నం అంతకంటే కాదు.

ఆ సోషలిజం ప్రత్యక్షర సాక్ష్యంగా, నిత్యసత్యంగా ఉత్పత్తి సాధనాలన్నింటినీ (భూములు, పరిశ్రమలు, గనులు, బ్యాంకులు) సమాజపరం చేసి, అంతవరకూ ఉన్న దోపిడీ వ్యవస్థను రద్దుచేసి ఆచరణసాధ్యం చేసి విప్లవాన్ని జయప్రదం చేయడమేగాక, సామ్రాజ్యవాద, ఫాసిస్టు దురాక్రమణను రెండవ ప్రపంచ యుద్ధంలో తిప్పికొట్టి ప్రపంచ మానవాళి రక్షకురాలుగా నిలదొక్కుకున్న డెబ్బైయ్యేళ్ళ సోషలిజం - రష్యాది.

ఇప్పుడక్కడ స్టాలిన్‌ను తెగనాడే కృషిలో మొత్తం మౌలికమైన ఆదర్శాలకే చిచ్చుతెచ్చుకుంటున్నారు. స్టాలిన్‌ను ఆడిపోసుకోడానికి మికోయన్‌ను శిఖండిగా పెట్టుకున్నాడు కృశ్చేవ్, అది చాలక నేడు మరింతగా "డీ - స్టాలినిజం" కోసం ఒక లిగచేవ్‌ను అడ్డం పెట్టుకున్నాడు గోర్బచేవ్!

ఈ దూపులో మధ్యలో తలదూర్చి "కొత్తదాసరికి పంగనామాలు పెచ్చు" అన్నట్టుగా సోవియెట్ సుప్రీం సోవియెట్ సభ్యుడూ, ప్రముఖ శాస్త్రవేత్త, రష్యన్ హైడ్రోజన్ బాంబు జనకుడూ అయిన ఆండ్రేసఖరోవ్ అసలు సోవియెట్ కమ్యూనిస్టు పార్టీ అగ్రగామి పాత్రను కాస్తా రద్దు చేస్తూ రష్యన్ రాజ్యాంగాన్నే సవరించాలనీ, ఆ విషయమై చర్చ సాగాలనీ ప్రతిపాదించాడు.. తన అస్తమయానికి ముందురోజు (14వ తేదీన) పార్లమెంటులో ప్రొఫెసర్ సఖరోవ్ నడిపించదలచిన 'దుకాణం' అంతా ఇదే. గ్లాస్‌నాస్త్, పెరిస్త్రోయికా (భావౌతసం, పునర్నిర్మాణం) నాయకుడు గోర్బచేవ్ 1980లలో గోర్కీలో ప్రవాస జీవితం గడపవలసి వచ్చిన ప్రొఫెసర్ సఖరోవ్ దంపతులకు మాస్కోలో పునరావాసం, స్వేచ్ఛ కల్పించినప్పటికీ, సఖరోవ్ ఉదారవాద ధోరణులు కొన్నింటితో గోర్బచేవ్ కూడా 'సఖ్యత' ప్రకటించుకున్నప్పటికీ - కమ్యూనిస్టుపార్టీ అగ్రగామిపాత్రను వదలుకోవాలన్న సఖరోవ్ ప్రతిపాదనను మాత్రం గోర్బీ తాత్కాలికంగా తిరస్కరించాడు. నిజానికి వెర్రితలలన్నీ 'డీ స్టాలినిజం' (స్టాలిన్ దూషణ)తో పుట్టినవే. ఎందుకంటే, సోవియెట్‌లో నూతన పరిణామాలను ఆహ్వానిస్తున్న ప్రసిద్ధ రచయితలలో ఒకరైన చింఘిజ్ అతమతోవ్ కూడా "వ్యక్తి పూజను అందరూ నిరసిస్తున్న వారేగానీ, దాన్ని మానుకున్నవారుగానీ లేదా ఆ పూజా ప్రభావంనుంచి తేరుకున్నవారుకానీ లేర"ని ప్రకటించవలసి వచ్చింది.

నిజానికి 68 ఏళ్ళ వయస్సుగల ప్రొఫెసర్ సఖరోవ్ బాధలన్నీ ప్రారంభమైంది స్టాలిన్ కాలంలో కాదు, కృశ్చేవ్ హయాములోనూ, బ్రెజ్నేవ్ - చెర్నెంకోల 'జమానా'లోనూ అని మరవరాదు. మానవతా వాదిగా సఖరోవ్ "మానవ హక్కుల" ఉద్యమాన్ని నిర్మించి, సంఘాన్ని నెలకొల్పింది కృశ్చేవ్ కాలంలోనే. అశోకుడు కళింగ యుద్ధానంతరం మాత్రమే అహింసను, శాంతిని బోధించినట్టుగా సఖరోవ్ హైడ్రోజన్ బాంబును తయారుచేసిన తరువాత ఇరవయ్యేళ్ళకు అణ్వస్త్రాల ఉత్పత్తిని నిరసిస్తూ, నిషేధాన్ని కోరుతూ కృశ్చేవ్‌కు ఒక మెమొరాండం సమర్పించవలసి వచ్చింది. నిజానికి అతమతోవ్ అన్నట్టు "వెనుకటి తరం నాటి పరిస్థితులు వేరు. నేటి పరిస్థితులు వేరు, పరిస్థితులు మారాయి" అని సరిపెట్టుకుంటే పరవాలేదు. కాని గతమంతా

చెడు అనేసరికి - అసలు సోషలిజం మీదనే విశ్వాసం సడలిపోయే ప్రమాదం దాపురించింది. జరిగిన తప్పులకు సవరణ వేరు, ఉన్నమంచిని కూడా ఊడ్చిపెట్టుకోవడం వేరు! గతం లేనిదే, వర్తమానం, భవిష్యత్తూ అనుకున్నంత సుందరంగా ఉండవు, ఉండజాలవు. మిగిలేది అంతా వెర్రిబాగులతనమే!

ప్రసిద్ధ రష్యన్ నవలాకారుడు దాస్తవెస్కీ "ది ఇడియెట్" నవలలో 19వ శతాబ్దంలో రష్యాలో ప్రచారంలో ఉన్న ఒక అరకును గురించి పేర్కొంటూ కుళ్ళిపోతున్న శవాల కంపును మాపుచేసే "అరకిది' ' అని చెప్పాడట. ఇంకేముంది, వ్యంగ్యమైన ఆ సాదృశ్యాన్ని వరసా వావీ లేకుండా కొందరు ఆధునిక రచయితలు "గ్లాస్ నాస్త్" మత్తులో పడి రష్యన్ విప్లవకారులైన స్టాలిన్, యాగదోవ్, ఝుడనోవ్, విషన్స్కీ వగైరాలకు అంటకడుతూ - ఎవరైనా స్టాలిన్ మంచిపనులను సమర్థించినా వారందరినీ కుళ్ళిపోయిన శవాలతో పోల్చుతూ " ఈ కుళ్ళిన శవాల కంపును దాచడానికి ఇక 'ఝుడనోవ్ అరకు'ను వాడండి" అని రాస్తున్నారు!! వారిలో ప్రసిద్ధుడు విప్లవానంతర సరుకు - తత్వశాస్త్రవేత్త యూరీ కార్యాకిన్ ఒకరు. రష్యాలో వస్తున్న మార్పులను కొన్నింటిని ఆహ్వానిస్తూనే, ఈ సందర్భంగా స్టాలిన్ కాలంలో సాహిత్య, కళాది రంగాలలో పరిస్థితిని గురించి మాస్కోలో భారత రాయబారిగా పనిచేసిన కె.పి.యస్. మీనన్ ఇచ్చిన అంచనాను కూడా పరిశీలించడం మంచిదిః "ఒక విధంగా చూస్తే కళా సాహిత్యాలపట్ల సోవియెట్ వైఖరి ప్రపంచంలోని ఇతర దేశాల్లోకంటే ఆరోగ్యకరంగా ఉంది. అక్కడ అశ్లీలం లేదు, మానవ ద్వేషం (శాడిజం) లేదు, అవధులు దాటిన సెక్స్ ప్రదర్శన లేదు. రంగస్థలంపైనా, వెండితెరపైనా సెక్స్ పరిమితం. ప్రేక్షకుని అభిరుచినిబట్టి అతనికి అదే ఘనంగానూ లేదా వివేచనతో కూడిన ప్రదర్శనగానూ తోచవచ్చు. భీతావహమైన (హర్రర్) కామిక్స్ లేవు, 'పీపాలో శవం'లాంటి మర్డర్ త్రిల్లర్స్ లేవు. మానవునిలో అజ్ఞాతంగా ఉండే చౌకబారు వాంఛలను ప్రకోపింపచేసి నాలుగు డబ్బులు వొడుపుకొనే 'కలం' దుండగులూ, 'కుంచె' పుండాకోరులూ ("Gangsters of pen and brush") అక్కడ లేరు. రచన, గ్రంథకర్తృత్వం అన్నది అక్కడ అత్యంత గౌరవనీయమైన వృత్తి".

ఆదివారం, డిసెంబర్ 24, 1989

# జోడు పదవులలో గోర్బచేవ్ జోరు !

**1986** ఫిబ్రవరిలో జరిగిన సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 27వ మహాసభ (కాంగ్రెస్)కు, ఈ నెల రెండవ తేదీన ప్రారంభమై పదిరోజుల పాటు కొనసాగిన 28వ పార్టీ కాంగ్రెస్‌కూ పెద్ద తేడాలేదు. ఉన్న తేడా అల్లా - 1986 నాటి కాంగ్రెస్‌లో నాడు పార్టీ జనరల్ సెక్రటరీ హోదాలో మహాసభలకు పార్టీ కేంద్ర కమిటీ తరపున గోర్బచేవ్ సమర్పించిన నివేదికలో చేసిన "సూత్రీకరణ" గ్లాస్‌నోస్త్, పెరిస్త్రోయికాల పేరిట ఈసారి పార్టీ మహాసభ నాటికి పూర్తిగా అమలులోకి వచ్చినట్టే భావించాలి! "కమ్యూనిస్టులకు అగ్రగామి పాత్ర అంటూ ఏదీలేదు" అని ఆనాటి గోర్బీ సూత్రీకరణ ఈసారి పార్టీ కాంగ్రెస్ నిర్ణయాలు ప్రథమ సోషలిస్టు రాజ్యానికి, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి ఒకనాడు అగ్రస్థానంలో ఉన్న ఈనాటి రష్యన్ పార్టీ పతనావస్థకు నిదర్శనం. 1985లో పార్టీ నాయకత్వ బాధ్యతలను స్వీకరించిన తరువాత కడచిన అయిదేళ్ళలో గోర్బీ ఆధ్వర్యంలో అటు పార్టీలోనూ, ఇటు సాంఘిక, ఆర్థిక రంగాలలోనూ తలెత్తిన సంక్షోభాలు ఆ పార్టీ ఉనికిని సర్వనాశనం చేసేవిగా ఉన్నాయని ఎవరు చెబితేనో చెవిని పెట్టనక్కరలేదు, సాక్షాత్తూ 28వ పార్టీ కాంగ్రెస్‌లో పలు సెంట్రల్ ఆసియన్, బాల్టిక్ రిపబ్లిక్స్ ప్రతినిధులు చేసిన ప్రసంగాలే నిరూపింస్తున్నాయి. అయితే మరి ఇంత "సంక్షోభా"నికి కారకుడైన గోర్బచేవ్‌ను మెజారిటీ ప్రతినిధులు మళ్ళీ పార్టీ ప్రధాన కార్యదర్శిగా ఎలా ఎంపిక చేశారన్న ప్రశ్న ఉదయిస్తుంది! ఇందుకు సమాధానం ఒక్కడే కనిపిస్తుంది! గ్లాస్‌నాస్త్, పెరిస్త్రోయికా గోర్బీ లౌక్యానికి, ఆయన రాజకీయ ఎత్తుగడలకు తోడ్పడినంతగా సోవియట్ ప్రజలకు సమాజానికీ తోడ్పడలేదు; అలాగే పార్టీలోని అత్యున్నత పదవికి వెంటనే తగిన ప్రత్యామ్నాయం లేనందువల్ల అలా లేకుండా పరోక్షపు ఎన్నికల పద్ధతి ద్వారా గోర్బీ అభ్యర్థిత్వాన్ని మాత్రం సమర్థించక తప్పలేదు. గోర్బీ పైకి భోళాగా కన్పించినా అధికారం దగ్గరకు వచ్చేసరికి తాను వ్యతిరేకిన" ని లోగడ ప్రకటించిన గోర్బీ ఇప్పుడు సోవియట్ యూనియన్‌కు ప్రసిడెంట్‌గానే గాక, పా్ట ప్రధాన కార్యదర్శి ఎలా అయ్యాడు? నియంతృత్వాన్ని విమర్శిస్తూనే, గ్లాస్‌నాస్త్‌ను ప్రేమిస్తూనే జోడు పదవుల "ప్రజాస్వామ్యా' 'న్ని ముందుకు నెడుతున్నాడు! తేడా అల్లా నాడు ప్రధాన కార్యదర్శి పదవీ, ఆ తరువాత ప్రెసిడెంట్ పదవీ సెంట్రల్ కమిటీ నామినేషన్ సంస్కృతి వల్ల దక్కాయి. నేడూ, ప్రత్యక్ష ఎన్నిక ద్వారా కాకుండా (గ్లాస్‌నాస్త్ ఉన్నా) పరోక్షపు ఎన్నిక ద్వారానే పదవీ స్వీకారం జరిగింది! మెజారిటీ వోట్లు లభించినా ప్రతికూలంగా 1116 వోట్లు పడటం - రానున్న సంవత్సరాల్లో సోవియట్ పార్టీ నాయకత్వం అస్తిత్వానికి ఎదురుకానున్న అటుపోట్లకు దిక్సూచిగా భావించాలి! గత అయిదేళ్ళుగా తాను దేశీయంగానూ, అంతర్దేశీయంగానూ అనుసరిస్తున్న రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సైనిక విధానాలపై పార్టీ కాంగ్రెస్‌లో అనుకూల, ప్రతికూల వాదనలు విన్న తరువాత గోర్బీ అటు "అతివాదులకూ", ఇటు "మితవాదుల"కూ దూరంగా 'సెంట్రిస్టు'

' విధానాన్ని లౌక్యంగా పాటించగలిగాడు! లిబరలిజం పేరిట, గ్లాస్‌నాస్త్, పెరిస్త్రోయికాల పేరిట పార్టీ క్రమశిక్షణను, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ బిగువునూ సడలించి, రక్షణ వ్యవస్థను నిర్వీర్య పరచినందుకు పార్టీ ప్రతినిధులు వందలాదిమంది చేసిన విమర్శలకు లిగచేవ్ ప్రాతినిధ్యం వహించగా, పార్టీని మొత్తంగా రాజకీయాలకు దూరంచేసి డెమోక్రాటిక్ సోషలిస్టు పార్టీగా పేరుమార్చేసి, రెడార్మీని అరాజకీయ శక్తిగా దిగజార్చేసి, బహుళ పక్ష వ్యవస్థకు దారులు తెరిచి, అఖిలపక్ష ప్రభుత్వాన్ని నెలకొల్పాలన్న వర్గానికి ఎల్సిన్ ప్రాతినిధ్యం వహించాడు. నిజానికి ఎల్సిన్ పేరుకేగాని, అమలు జరుపుతున్న విధానాలన్నీ గోర్బీవి! అయితే గోర్బీ దృష్టిలో లిగచేవ్ "కన్సర్వేటివ్" (మితవాది), ఎల్సిన్ "రాడికల్" అయిపోయారు! ఈ పరిస్థితులలో ఉభయవర్గాల మధ్య "సయోధ్య" సాధించి తన పదవీ భద్రతకు ఇబ్బందిలేని "సెంట్రిస్టు' ' మార్గాన్ని ఎంచుకోడానికి గోర్బీ పార్టీ కాంగ్రెస్‌కు ముందు ఒకరకంగానూ, కాంగ్రెస్ తరువాత మరొక రకంగానూ విరుద్ధ ప్రకటనలకు పాల్పడ్డారంటే అత్యుక్తి కాజాలదు. తిరిగి ప్రధాన కార్యదర్శి పదవికి ఎన్నిక కావడంకోసం ఆయన "లెఫ్ - సెంటర్" మధ్యే మార్గాన్ని తొక్కబోయేముందు - కాంగ్రెస్ ప్రారంభ సమావేశంలో నివేదిక సమర్పించుతూ సోషలిస్టు ఆర్థిక వ్యవస్థస్థానంలో కాపిటలిస్టు మార్కెట్ ఎకానిమీని సమర్థించారు; పరిశ్రమలలో, వ్యవసాయంలో ప్రైవేటైజేషన్‌ను, సొంత ఆస్తులను, పబ్లిక్ రంగం పరిశ్రమలను ప్రైవేట్ వ్యక్తులకు అమ్మివేయడాన్ని లేదా కౌలుకివ్వడాన్ని సమర్థించారు. కాని కాంగ్రెస్‌లో వచ్చిన విమర్శల తర్వాత "ప్లేటు" మార్చేసి మార్కెట్ ఎకానమీకి మళ్ళాలని అంతకుముందు తన నాయకత్వంలో సోవియట్ ప్రభుత్వం చేసిన విధాన నిర్ణయాన్ని గోర్బీ విమర్శించాడు; పైగా సెంట్రల్ కమిటీ సీనియర్ సభ్యుడైన యాకొలోవ్‌తో కలిసి తాను రూపొందించిన "మార్కెట్ ఎకానమీ" ప్రతిపాదనకు ఇంకెవరో బాధ్యులన్నట్లుగా పోజుపెట్టి, సంస్కరణల్లో మొదటి చర్యగా నిత్యావసర సరకుల ధరలను పెంచడం చాలా "దారుణం"అని మళ్ళీ 'నలుగురితో గోవింద'గా, గురువిందగా మాట్లాడాడు!!

అలాగే,ఒక వైపున "సోషలిస్టు మార్గం నుంచి మళ్ళేది లేద"ని అంటూనే మరోవైపున అందుకు విరుద్ధమైన స్వేచ్ఛా మార్కెట్‌ను ఆహ్వానించాడు గోర్బీ; రష్యన్ ఆర్థిక వ్యవస్థను మార్కెట్ ఎకానమీలోకి పరివర్తన చెందించడానికి "అధికారికంగా, పెద్ద ఎత్తున ప్రైవేట్ పెట్టుబడులకు" ఆహ్వానం పలికాడు. ఇదే సోషలిజం అనుకోమంటున్నాడు; "ఐక్య యూరప్"పేరిట, ఘర్షణ స్థానే "పరస్పర అవగాహన" కోసం, ఆధిపత్య రాజకీయాల్లో "భాగస్వామ్యం" పెరిగి సోవియట్ పార్టీని అంతర్జాతీయ కార్మికోద్యమ ఐక్యతా మార్గం నుంచి మరింత దూరం చేస్తూ వచ్చాడు. బాగు చేతలు వేరు, అసలు పునాదులనే పెకిలించడం వేరు! నిజానికి సంస్కరణలనూ, మార్పులనూ ఏ కార్యకర్తా వ్యతిరేకించడు. కానీ కార్మిక వర్గవాణిగా దాని సునిశిత రాజకీయ శక్తిగా ఆ పార్టీ వ్యక్తిత్వాన్ని, విశిష్టతను, అగ్రగామి పాత్రనూ దిగజార్చకుండా కాపాడగల పరిధులలోనే ఈ సర్దుబాట్లను, సంస్కరణలను పెక్కుమంది ప్రతినిధులు అభిలషించారంటే మనం అనుకున్నదానికంటే సోవియట్ పార్టీలో సంక్షోభం తీవ్రస్థాయిలో ఉందని అర్థమవుతుంది. అంతేగాదు, తూర్పుయూరప్‌లో పరిణామాలకు రష్యన్ పార్టీ నాయకత్వం బాధ్యురాలు కాదని గతంలో గోర్బచేవ్ చెబితే, అందుకు భిన్నంగా ఆయన అంతేవాసి అయిన విదేశాంగమంత్రి షెవర్ధనాజి "తూర్పు యూరప్ పరిణామాలు మాకు ముందుగానే తెలుసున"ని పార్టీ కాంగ్రెస్‌లో ప్రకటించడం - కార్మికోద్యమ ఐక్యతను విమర్శ- ఆత్మవిమర్శల ద్వారా పటిష్టంచేసుకోవడానికి గాకుండా, విచ్ఛిన్నం చేయడానికి ఆ పార్టీ గజ్జెకట్టడం తప్ప మరొకటి గాదు. బహుశా ఈ అనుభవం దృష్ట్యానే పార్టీ కాంగ్రెస్‌కు హాజరైన సెంట్రల్

## ఎబికె సంపాదకీయాలు

ఏషియన్ రిపబ్లిక్స్‌లోని పార్టీల అధినేతలు పెక్కుమంది, పార్టీని, సోషలిస్టు పంథానూ గాడితప్పించి అంతర్జాతీయంగా సోవియెట్‌ను అభాసుపాలుచేసిన నాయకత్వాన్ని, పాలిట్‌బ్యూరోను, కేంద్ర కమిటీని మూకుమ్మడిగా పార్టీనుంచి బర్తరప్ చేయాలని కోరి ఉంటారు. చివరికి రిపబ్లిక్స్ లోని జాతుల మధ్య తగాదాలకు స్టాలిన్ పాలనకంటే గోర్బీ నాయకత్వానిదే ప్రధాన బాధ్యత అని కూడా ఆరోపించారు; "సంస్కరణల ముసుగుచాటున ప్రజాజీవితంనుంచే పార్టీని వెలివేస్తున్నారని" ఒకాయన విమర్శిస్తే, సమష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో నెలకొన్న పార్టీ సెల్స్‌ను కాస్తా రద్దుచేసి, శాశ్వతంగా అధికారాన్ని చేజిక్కించుకోడానికి మార్గం సుగమం చేస్తున్నారని మరొకాయన ఆరోపించవలసి వచ్చింది! సాధారణంగా బూర్జువా ప్రజాస్వామ్య దేశాల్లో నాయకులిచ్చే వాగ్దానాల మాదిరే గోర్బీకూడా కాంగ్రెస్‌లో తన ఎంపికకు ముందుచేసిన ప్రసంగంలో (జూలై 5వ) "రాబోయే రెండేళ్ళలో దేశ ఆర్థిక పరిస్థితులు మెరుగుగాని పక్షంలో నాయకత్వం ధైర్యంతో రాజీనామా చేస్తుంద"ని వాగ్దానం చేశారు!

12 జూలై, 1989

# కాలజ్ఞాని గ్రోమికో

పట్టువిడుపులు దూతకృత్యంలో తొలిపాఠం. దౌత్యనీతిలో మొండిపట్టు ఆత్మహత్యా సదృశం. చూచిరమ్మంటే కాల్చి వచ్చేవాడు ఈ నీతిలో ఇమడలేడు. అమితమైన ఓర్మి, కార్యసాధనలో దీక్ష, సామర్థ్యంలో దక్షత, అవసరాన్ని బట్టీ అవకాశాన్ని బట్టీ కరుకుతనం, వీలూవాలునుబట్టి రాజీ - ఇన్ని లక్షణాలు మూర్తీభవించినవాడే దౌత్య వ్యవహర్తగా రాణిస్తాడు. మరో మాటలో చెప్పాలంటే 'విదురనీతి'కి ఎదురులేదని నిరూపించగలవాడూ 'శ్రీకృష్ణ' - 'సంజయ' రాయబారాల మేలుకలయికను సాధించగల కాలజ్ఞానీ దౌత్యవ్యవహర్త. ఇన్ని లక్షణాలు మూటగట్టు కున్నవాడు, సోమవారం నాడు కన్నుమూసిన సోవియట్ మాజీ ప్రెసిడెంట్, మాజీ విదేశాంగమంత్రి, మాజీ రాయబారి ఆంద్రీగ్రోమికో. 1986 వరకూ రష్యా నూతన విదేశాంగ మంత్రిగా షెవర్దనజ్డె పదవీ బాధ్యతలు తన నుంచి స్వీకరించేదాకా కడచిన సుమారు ముప్పయ్యేళ్ళుగా దేశానికి తిరుగులేని విదేశాంగ మంత్రిగా పనిచేశాడు గ్రోమిగో. అంతకుముందు రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో అమెరికాలో రష్యారాయబారిగా, ఆ తరువాత ఐక్య రాజ్య సమితి నిర్మాతలలో ఒకరుగా పనిచేసి దౌత్య రంగంలో అపారమైన అనుభవాలతో తలనెరసిన నాయకుడు గ్రోమికో. అలాంటి వ్యక్తి కాలం చేసినపుడు ఇతర సభ్య ప్రపంచం లోలోపల ఏమనకున్నా కనీసం లోకం కోసమన్నా వెరచి, విశిష్ట వ్యక్తికి నివాళులర్పించడం సహజం. కాని సోవియట్ పార్లమెంట్‌లో గ్రోమికో మరణవార్తను ఏదో ఒక 'విధాన ప్రకటన'లా ప్రెసిడెంట్ గోర్బచెవ్ చదవడం మినహా అతడు నాలుగున్నర దశాబ్దాలుగా చేసిన కృషి గురించి నాలుగు ముక్కలు కూడా ప్రశంసగా కాకపోయినా సాధారణ ప్రస్తావన కూడా చేయక పోవడం విచారకరం.

దౌత్య వ్యవహర్తగా ఆంద్రీగ్రోమికో నిర్వహించిన కార్యకలాపాలు ప్రధానంగా రెండో ప్రపంచ యుద్ధ సమయంలోనే జరిగాయి. అది ఒక్క రష్యాకే కాదు, యావత్ ప్రపంచానికే పరీక్షా సమయం, ప్రథమ సోషలిస్ట్ రాజ్యమైన సోవియట్ రిపబ్లిక్ ఉనికికే ప్రమాద భరితంగా పరిణమించిన కాలం అది. ప్రపంచ దేశాలకు ఒకవైపున ఆదర్శంగా నిలుస్తూనే, మరొకవైపున సామ్రాజ్యవాద రాజ్యాల కుట్రలపట్ల నిరంతరం జాగరూకతతో కరకుదనంతో తొలి సోషలిస్ట్ రిపబ్లిక్ మెలగవలసి వచ్చిన దినాలవి. యుద్ధం మధ్యనే శాంతి ప్రతిపాదనలు, ఆశయాలూ సంఘర్షిస్తున్నవేళ, ఎవరికి వారు ఆయుధాలు నూరుకుంటున్న వేళ, మరొకవైపునుంచి ప్రపంచ శాంతికోసం శాశ్వత నిరాయుధీకరణకు, రష్యా నిరంతరం ప్రతిపాదనలు చేస్తున్న ఘడియలూ. ఈ ఆటుపోటులన్నింటినీ కళ్ళారా చూసి కార్యరంగంలో అడుగడుగునా అనుభవించిన గ్రోమికొ ఆనాటి పరిస్థితి గురించి ఒక సందర్భంలో ఇలా అంచనా వేశాడు : 'సోవియెట్ విదేశాంగ విధాన

చరిత్ర - సోవియెట్ దౌత్య వ్యవహర్తల ధైర్య సాహసాలతో, నిర్భీతితో కరకుదనంతో కూడిన కార్యవాదుల అద్భుత చరిత్ర'. ఈ మాటలు అక్షర లక్షలుగా ఆయనకు వర్తిస్తాయి. "యుద్ధకాలంలో 'రౌనో' "(నాజీ మూకలు ఆక్రమించిన పట్టణం) ప్రాసాదంలో ప్రారంభమైన కుట్రలు, కుహకాల నుంచీ శాంతి కాలంలో నిన్న మొన్న "రెక్జవిక్" శిఖరాగ్ర సభవరకూ జరిగిన పరిణామాలు గ్రోమికోకు తెలియనివి కావు. రూజ్‌వెల్ట్ - ట్రూమన్‌ల నుంచి రేగన్ దాకా నడచిన రాజకీయాలకు అతను కర్మసాక్షి. చర్చిల్ నుంచి జిమ్మి కార్టర్ వరకూ సాగిన ప్రపంచ దౌత్యానికి అతను ప్రత్యక్ష సాక్షి. స్టాలిన్ నుంచి గోర్బచెవ్ కాలం వరకూ అతను వైదేశిక నీతిలో సలహాదారుడు. ప్రపంచ చరిత్రలో వీటన్నింటికీ మించిన ఒక ప్రధాన ఘట్టానికి గ్రోమికో కర్ణధారి : డంబర్టన్ ఓక్స్(వాషింగ్టన్ డి.సి) లో ఐక్యరాజ్య సమితి నిర్మాణానికి "రాళ్ళెత్తిన కూలీలలో" అగ్రశ్రేణి కార్మికుడు" గ్రోమికో! "నానాజాతి సమితి" (లీగ్ ఆఫ్ నేషన్స్) ఏ బలహీనతవల్ల పతనమైందో తిరిగి ఆ మెతకతనం ఆ బలహీనత నూతన సంస్థలకు అబ్బకుండా నిబంధనావళి రచనలో తన శాయశక్తులా తోడ్పడి, ఐక్యరాజ్య సమితి ప్రణాళికను దిద్ది తీర్చిన వారిలో అగ్రజుడు గ్రోమికో! అంతేకాదు, తాము రూపకల్పన చేసిన సమితి 'చార్టర్'పై చేవ్రాలు చేసి తనువుల చాలించిన ప్రముఖుల్లో ఆఖరివాడు గ్రోమికో! మన కాశ్మీర్ సమస్య సహా పెక్కు అంతర్జాతీయ సమస్యలపై వర్ధమాన దేశాలకూ, సోషలిస్టు దేశాల ప్రయోజనాలకూ హానికరంగా సమితి భద్రతా మండలిలో ఆంగ్లో-అమెరికన్ కూటమి దేశాలు ప్రవేశపెట్టిన పెక్కు తీర్మానాలను 'వీటో'చేసి పక్కకు నెట్టించినవాడు గ్రోమికో. ఇలా రెండేళ్ళలో ఆయన ఇరవై సార్లు ఆ 'వీటో' హక్కుని వినియోగించాడు!

అంతేగాదు, శాన్‌ఫ్రాన్సిస్కోలో సమితి చార్టర్ సిద్ధమైన తరువాత, రెండో ప్రపంచ యుద్ధానంతరం ప్రపంచ వ్యాప్తంగా నిరాయుధీకరణ సాధనకోసం, తద్వారా శాంతి స్థాపన కోసం సోవియెట్ నాయకత్వం చేసిన నిర్విరామ కృషిలో శక్తి వంచన లేకుండా చేదోడు వాదోడైన వ్యక్తి గ్రోమికో. చివరికి అణ్వాస్త్రాలలో వ్యూహరీత్యా కీలకమైన ఆయుధాలను పరిమితం చేసి, క్రమేణా రద్దు పరచడానికి అనువైన చర్చలకు ('సాల్ట్' చర్చలు) అగ్రరాజ్యాలను జనీవాకు నడిపించిన ఘనత కూడా గ్రోమికోదే. ఇండో - సోవియెట్ శాంతి - మైత్రీ సహకార ఒప్పందానికి సహకర్తృత్వం వహించిన ఖ్యాతి కూడా గ్రోమిగోదే. చనిపోయే నాటికి కొలది మాసాలనాడు గ్రోమికో 'స్మృతుల'పేరిట రాసిన ఆత్మకథను లండన్ టైమ్స్, అబ్జర్వర్ పత్రికలు ధారావాహికంగా ప్రకటించాయి. అందులో ఆయన స్టాలిన్ కాలం నాటి విశేషాలను, స్టాలిన్‌తో సంబంధాలను గురించి కొన్ని వివరణలు అందించాడు. బెరియా కాలంలో జరిగిన కొన్ని అమానుషాలను వెలుగులోకి తెచ్చాడు.

సమితి 'చార్టర్' ప్రదాతలలో ఒకరుగా గ్రోమిగో లీగ్ ఆఫ్ నేషన్స్ అనుభవం దృష్ట్యా 'దురాక్రమణ' పదానికి స్పష్టమైన నిర్వచనం చెప్పాలని, అంతవరకూ సమితి శాంతి ప్రయత్నాలకు విఘాతం కలుగుతూనే వుంటుందని హెచ్చరించిన మొదటి దౌత్యవేత్త. రెండు దేశాలు యుద్ధకాలంలోకి దిగినపుడు ఎవరు 'దురాక్రమణదారో' తేల్చడం కష్టమని తప్పించుకోజూచిన అమెరికా, బ్రిటన్ ప్రతినిధులు క్లెమెంట్‌డన్, అలగ్జాండర్ కడొగన్‌లను భద్రతా మండలిలో పూర్వపక్షం చేసిన ఘనుడు గ్రోమికో. "మనం మనసువిప్పి భోళాగా మాట్లాడకపోతే బరితెగి వ్యవహరించి దురాక్రమణాదారు" పనిని సులభం చేసిన వారమవుతామని హెచ్చరించాడు. అలాగే రెండో ప్రపంచ యుద్ధకాలంలో రష్యాతోబాటు నాజీ హిట్లర్ మూకలకు వ్యతిరేకంగా యూరోప్‌లో రెండో యుద్ధరంగాన్ని తెరవడం కోసం రూజ్‌వెల్ట్ - చర్చిల్ - స్టాలిన్ మధ్య టెహరాన్,

## ఎబికె సంపాదకీయాలు

పోర్ట్స్‌డామ్ యాల్టా సమావేశాలను ఏర్పాటుచేయడంలో సరిజోడు అమెరికా రాయబారి హారిమన్, బ్రిటీష్ దౌత్య వ్యవహర్త హాప్కిన్స్. 1918 నాటి బ్రెస్ట్‌లీటోవెస్క్ సంధి తర్వాత రష్యా పెద్దఎత్తున మిత్రమండలితో కలిసి యుద్ధకాలంలో అనేక వడిదుడుకుల మధ్య కష్టనష్టాల మధ్య సమష్టి వ్యూహరచనకు జయప్రదంగా ముందడుగువేసిన కాలం అది. అణ్వస్త్రాలతో అమెరికాది పైచేయిగా వుండేందుకు వాషింగ్టన్ తలపెట్టిన రహస్య పథకం "బరూక్ ప్లాన్" లో దుర్మార్గాన్ని పసికట్టిన వాడు గ్రోమికో. రష్యాను కాదని ట్రూమన్- అట్లీ మెకంజికింగ్‌లు నిరాయుధీకరణ పేరిట జరిపిన రహస్య సమావేశం గురించిన సమాచారం తెలుసుకుని తన దేశాన్ని హెచ్చరించాడు గ్రోమికో. బాల్టిక్ దేశాలకూ, మొత్తం యూరప్‌కూ అణ్వస్త్ర రహిత మండలం ఏర్పాటుకు, బాల్కన్స్ నించి అడ్రియాటిక్ ప్రాంతం వరకూ శాంతిమండలం సృష్టికీ కృషిచేసిన శాంతి కాముకుడు గ్రోమికో.

5 జూలై, 1989

# “దశాబ్ది మనీషి” గోర్బీ!

జా నాయకుణ్ణని అనిపించుకోదలచినవాడు చేయవలసిన పని - తన తరానికి నాయకత్వం వహించాలిగాని ముందుతరానికి కాదు అన్నాడు - ఉడ్రోవిల్సన్.

హేతువాద దృక్పథం, ఆచితూచిన తీర్పరితనం నాయకత్వ లక్షణాలన్నాడు టాసిటస్!

సమర్థవంతమైన నాయకత్వానికి ఎంతో కొంత వాగాడంబరత కూడా అవసరం అన్నాడు ఎరిక్ హాఫర్!

1989వ సంవత్సరం నేటితో ముగిసిన సందర్భంగా సుప్రసిద్ధ అమెరికన్ పత్రిక “టైమ్” ప్రపంచ రాజకీయరంగంలో ఈ ఏడాది గణనీయమైన వ్యక్తిగా, లబ్ద ప్రతిష్ఠుడిగా కాకుండా ఈ ఏడాదితో ప్రారంభం కాబోతున్న రానున్న దశాబ్దానికే ఉత్తమ వ్యక్తిగా సోవియెట్ యూనియన్ అధినేత మైఖేల్ గోర్బచేవ్‌ను ఎంపిక చేసింది. నిజానికి ‘మాన్ ఆఫ్‌ది మ్యాచ్’లాంటి ఈ పురస్కారానికి రెండు దఫాలు అమెరికా అధ్యక్ష పదవికి అర్హుడైన రెనాల్డ్ రేగన్‌ను నూతనాధ్యక్షుడు జార్జిబుష్‌ను కాకుండా గోర్బచేవ్‌ను తగిన వ్యక్తిగా ఎన్నుకోవడానికి తగిన కారణాలున్నాయి! గాంధీజీని “ఫకీర్” అని దూషించి, రాజ్యాధికారానికి ఇండియన్లు అనర్హులని ఇండియాకు స్వాతంత్ర్యం ప్రకటించడానికి మొరాయించి, నిరాకరించిన బ్రిటీష్ సామ్రాజ్యవాద ప్రతినిధి విన్‌స్టన్ చర్చిల్‌ను రెండవ ప్రపంచ యుద్ధానంతరం “అర్థ శతాబ్ది మనీషి”గా ప్రకటించిన ఇదే “టైమ్” పత్రిక నేడు గోర్బచేవ్‌ను “దశాబ్ది మానవు”నిగా ప్రకటించడానికిగల ఆ బలమైన కారణాలను ఇలా పేర్కొన్నది. రష్యాలో ప్రజాస్వామ్య చైతన్యదీప్తి, చైనాలో విద్యార్థి ఉద్యమం తూర్పు యూరప్‌లోని సోషలిస్టు దేశాలలో తిరుగుబాట్లు పరంపర; 1989కి ముందే ఆవిష్కరించుకున్న ఈ పరిణామాలు 1989తో ముగిసిపోకుండా వచ్చే దశాబ్దంలోకి కూడా వాటి ప్రభావం ఆనలుతొడిగి కొనలు సాగుతుంది కాబట్టి, “దశాబ్ది మనీషి”గా గోర్బచేవ్‌ను ఆ పత్రిక నిర్ణయించింది. ప్రపంచంలో ప్రథమ సోషలిస్టు రాజ్య నిర్మాతగా లెనిన్‌కూ, ఆ రాజ్య నిర్మాణంలో, అంతర్యుద్ధం మధ్య పధ్నాలుగు పెట్టుబడి రాజ్యాలు కట్టుకట్టి కుట్రలతో పొంచివున్న దశలో, యుద్ధకాలంలో, యుద్ధానంతరదశలో, దేశ పునర్నిర్మాణ భారాన్ని ప్రజలతోపాటు మోసి ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఆదర్శానికి రష్యానొక ఆనవాలుగా మలిచిన స్టాలిన్‌కూ ఏనాడూ దక్కని ఇంతటి పురస్కారం ఈనాడు గోర్బచేవ్‌కు లభించినందుకు అందరూ సంతోషిస్తారు. స్టాలిన్, కృశ్చేవ్‌ల తరువాత నేడు రష్యాలో రాజకీయ, ఆర్థిక, సాంఘిక రంగాలలో ప్రవేశపెడుతున్న మార్పులద్వారా ప్రపంచ దేశాల దృష్టిని అమితంగా ఆకర్షిస్తున్న నాయకుడు గోర్బచేవ్. తొలి సోషలిస్టు రాజ్యంగా రష్యా నిర్మాణ దశలో, దాని చుట్టూ ఏర్పడి ఉన్న భయంకరమైన కాపిటలిస్టు - మిలిటరీ వలయంద్వారానే పంచవర్ష ప్రణాళికలతో ఉత్పత్తిని ఇతోధికం చేసేందుకు తద్వారా పెట్టుబడిదారీ దేశాలతో పారిశ్రామిక, వ్యావసాయిక, సాంకేతిక

రంగాలలో పోటీపడి మించిపోయి తన ఉసురునూ, శ్రామిక రాజ్య ప్రతిపత్తినీ నిలబెట్టుకొనేందుకు లెనిన్-స్టాలిన్‌లు ఇచ్చిన నినాదం "శరవేగాన అవిశ్రాంతంగా ముందుకు సాగిపోవాలి, లేదా మనకు పుట్టగతులుండవు'' అని కంపునోటివాడు సంపాదిస్తే, కమ్మనినోటివాడు అనుభవించాడని మనకో సామెత. ఆనాటి పరిస్థితులు వేరు. వాటిన్నింటికి తగ్గట్టుగా రష్యన్ కమ్యూనిస్టు పార్టీ నిర్మాణమూ, క్రమశిక్షణా అలా అమరాయి; ఆ అమరికా బతుకంతా, పొంచి ఉన్న శత్రు రాజ్యాలకుయుక్తులపైన కన్నువేసి ఉంచడంతోనే సరిపోయింది. ఇంటి దొంగలను ఈశ్వరుడైనా పట్టలేడని భావించిన ఆనాటి నాయకత్వం ఇంట్లోనే అతివేలంగా, అతి జాగ్రత్తకోసం కానివాళ్ళను ఇబ్బందులు పెట్టడంతోపాటు అయినవాళ్ళకు కూడా అన్యాయాలు, ఘోర అన్యాయాలు కూడా జరిగి ఉండవచ్చు. కాని అదంతా - ప్రథమ సోషలిస్టు రాజ్య వ్యవస్థను కంటి పాపలా కాపాడుకొనేందుకు జరిగిన మహాయజ్ఞం ఫలితం.

సమాజ శ్రేయస్సుకోసం, పేదసాదలకు మొదటిసారిగా దారీతెన్నూ చూపి, దోపిడీ వ్యవస్థను రద్దు చేయడానికి అపారమైన విలువలూ, తెలిసినవారు మరొకరుండరు. ఈ వాస్తవాన్ని గమనించబట్టే గోర్బచేవ్ 1985లో రష్యన్ పార్టీ ప్రధాన కార్యదర్శి పదవిని చేపట్టిన తరువాత దేశంలో, పార్టీలో నూతన సంస్కరణలకు, సంచలనానికీ కారకుడయ్యాడు. సాంఘిక పరిణామంలోనూ, జాతీయ స్థాయిలోనూ పార్టీ అన్ని శాఖలనూ పునర్నిర్మాణ కార్యక్రమానికి చేదోడువాదోడయ్యేలా మలచడానికి ప్రయత్నించాడు. రాజకీయ, ఆర్థిక, సామాజిక, కళాది రంగాలు ప్రజలకు మరింత సన్నిహితంగా మానవీయం కావాలన్న దృష్టితో కలుపుగోలుతనాన్ని (గ్లాస్‌నాస్త్), పునర్నిర్మాణ దృక్పథాన్ని (పెరిస్త్రోయికా) ప్రవేశపెట్టి ముందుకు సాగుతున్నాడు. ఇందుకు 1986లో రష్యన్ పార్టీ 27వ మహాసభను వేదిక చేసుకొని నవ్య సంస్కరణ వాదానికి నాందిపలికాడు. రాజకీయ, ఆర్థిక, సాంఘిక వ్యవస్థను "మూలముట్టుగానే సంస్కరించి", "సోషలిస్టు ప్రజాస్వామ్యా"న్ని, ప్రజల "స్వయం పాలనాధికారాన్ని విస్తృతం చేయడం" లక్ష్యంగా, ఇప్పుడున్నదానికన్నా గుణాత్మకమైన "నవ్య సమాజ" వ్యవస్థగా దానిన దిద్దితీర్చాలనీ సంకల్పించాడు. ఇందుకు అనుగుణంగానే ప్రపంచ రాజకీయంలో కూడా భోళాతనానికి దారులు తెరిచాడు. ప్రపంచ సమస్యలపైన ముఖ్యంగా నిరాయుధీకరణ సమస్యపైన రేగన్‌తో రెక్‌జావిక్‌లో, బుష్‌తో మాల్టాదీవిలో, పోప్‌తో రోమ్‌లో చర్చలు జరిపి అగ్రరాజ్యాల మధ్య ఉద్రిక్తతను సడలించడానికీ, తద్వారా శాంతి అవకాశాలను పెంచడానికీ ప్రయత్నించాడు. గోర్బచేవ్ ప్రాపంచిక విధానంలో 1986 ఫిబ్రవరి నాటి పార్టీ మహాసభ ఒక ఎత్తుకాగా, 1986 జూలైలో ఆయన వ్లాడివోస్తక్‌లో సోవియట్ తూర్పాసియా, ఆసియా పసిఫిక్ ప్రాంత భద్రతకు సంబంధించి చేసిన ప్రకటన మరో ఎత్తు. సమస్యల పరిష్కారానికి సంప్రతింపులు మినహా మరో మార్గం లేదని చెప్పి ప్రపంచ దౌత్య చరిత్రలోనే "డైలాగ్"కు పెద్ద పీట వేసినవాడు గోర్బీ. ఇవన్నీ ఒక ఎత్తు, ఇప్పుడు తన కళ్ళెదుటనే రష్యన్ రిపబ్లిక్స్‌లోనూ, తూర్పు యూరప్ దేశాలోనూ వచ్చిన పరిణామాలు మరొక ఎత్తు. కమ్యూనిస్టు పార్టీ నిర్మాతలుగా, పోషకులుగానేగాక, పార్టీని చాపచుట్టి రద్దుచేసుకునే విధానానికి లెనిన్ - స్టాలిన్‌లు ఎన్నడూ దిగలేదు. గోర్బచేవ్ ఎంత మొత్తుకుంటున్నా బాల్టిక్ స్టేట్స్‌లోనూ, కొన్ని సోవియెట్ రిపబ్లిక్స్‌లోనూ, తూర్పు యూరప్‌లోనూ పార్టీ "అగ్రగామి పాత్ర"ను చాలించుకొని బహుళపక్ష రాజకీయ వ్యవస్థలుగా మారడానికి క్రమంగా ఏర్పాట్లు చేసుకొంటున్నారు. దానికి "సోషలిస్టు ప్లూరలిజం" అని ముద్దు పేరు తగిలించుకున్నారు. చివరికి రష్యన్ పార్టీ నుంచే రిపబ్లిక్స్‌లోని పార్టీలు విడిపోతూ స్వతంత్రంగా వ్యవహరించుకుంటామని చేసిన తీర్మానాలను గోర్బచేవ్ "రష్యన్

ఫెడరేషన్ విచ్ఛిత్తి''కి బీజాలుగా భావించవలసివస్తోంది. కమ్యూనిస్టు పార్టీ "అగ్రగామిపాత్ర"ను రద్దుచేస్తూ సోవియెట్ రాజ్యాంగాన్ని సవరించాలన్న సకరోవ్‌పై గోర్బచేవ్ ఎంతగా కొరకొరలాడినా, ఆ ప్రాతిపాదనకు అసలు బీజం గోర్బచేవ్ రాజకీయ నివేదికలోనే (1986) ఉందని గుర్తించాలి("There is no such thing as the communists, vanguard role in general"). దీని ఆధారంగానే తూర్పు యూరప్‌లోకూడా కమ్యూనిస్టు పార్టీలు, సోషలిస్టు పార్టీలుగానూ, క్రిష్టయన్ డెమోక్రాట్ పార్టీలుగానూ అవతారమెత్తుతున్నాయి. మొదటిసారిగా క్రిస్టియన్ చర్చి పార్టీలు ఏర్పడుతున్నాయి. గోర్బీ ఎంత 'పెరిస్త్రోయికా' పెట్టినా 70 ఏళ్ళలో రష్యన్ ఆర్థిక వ్యవస్థలో ప్రజల అవసరాలనుబట్టిగాక, కాపిటలిస్ట్ వ్యవస్థను పోషించి శాసించే సరకుల సప్లయి - డిమాండ్ సూత్రాలు మార్కెట్‌ను ఏలడం ప్రారంభించిన తరువాత - మొదటిసారిగా రష్యన్ కరెన్సీ రూబుల్ మారకం విలువను దిగకోసుకోవసి వచ్చింది. కాపిటలిస్టు దేశాలు కాపిటలిజాన్ని "పీపుల్స్ కాపిటలిజం''గా ముద్దుగా పిలుచుకున్నట్టే, ఇప్పుడు రష్యన్ ఆర్థిక వేత్తలు కొత్తగా "ప్రజాస్వామ్య పెట్టుబడి' ' సూత్రాన్ని ముందుకు నెడుతున్నారు. ఈ కొత్త బిచ్చగాళ్ళ ఊపులో లెనిన్ భౌతికకాయంకూడా మాస్కో మసోలియం నుంచి రేపో మాపో తరలిపోతుంది. కొన్ని మార్పుల మధ్య రేపటినుంచి గోర్బీ ఏడు దశాబ్దాల సోషలిస్టు వ్యవస్థను ఏటిలో ముంచుతున్న "దశాబ్ది మనీషి" కాబోతున్నాడు!

ఆదివారం, డిసెంబర్ 31, 1989

# సోషలిజానికి 'మంగళహారతి'?!

మా ర్క్సిజాన్ని తిరగదోడి నామరూపాలు లేకుండా చేసే "రివిజనిజం" వర్గ పునాదులు ఆధునిక సమాజంలో ఉన్నాయి. ఆ పునాదులే రివిజనిజం మళ్లీ మళ్ళీ పుట్టిపెరగడానికి అవకాశం కల్పించుతాయి" అని లెనిన్ అన్నాడు. ప్రెసిడెంట్ గోర్బచేవ్ నాయకత్వంలో, ప్రథమ సోషలిస్టు రాజ్యమైన సోవియెట్ యూనియన్‌లో రాజకీయ ఆర్థిక, సామాజిక రంగాలలో 'గ్లాస్ నాస్త్' పేరిట, 'పెరిస్త్రాయికా' పేరిట సంస్కరణల నామధేయం చాటునా వస్తున్న మార్పులు - గోర్బీని అనుసరించిన తూర్పు యూరప్ సోషలిస్టు రాజ్యాల పతనానికే కాదు, అసలు తొలి సోషలిస్టు రాజ్యాం ఉనికికే ప్రమాదంగా పరిణమిస్తున్నటు పరిణామాలు హెచ్చరిస్తున్నాయి. మరీ ముఖ్యంగా, సోవియెట్ యూనియన్‌లోని రిపబ్లిక్స్‌లోకెల్లా పెద్దదైన రష్యన్ ఫెడరేషన్‌కు నూతనాధ్యక్షుడుగా ఎన్నికైన గోర్బీ ప్రత్యర్థి సంస్కరణవాద "కొత్తదాసరి" బోరిస్ ఎల్సిన్ చేస్తున్న రాజకీయ, ఆర్థికపరమైన నిర్ణయాలు గోర్బచేవ్ అధికారానికి అన్నివిధాలా చిచ్చుపెట్టేవిగా ఉన్నాయి. జాతుల సమస్య చిలికి చిలికి గాలివానగా మారడమేగాక, రష్యన్ ఆర్థిక రంగంలో మొట్టమొదటిసారిగా సరకుల ధరవరలను ప్రభుత్వం అజమాయిషీనుంచి తప్పించి ప్రయివేట్ శక్తులు నిర్ణయించగల మార్కెట్ ఎకానమీకి మార్గం తెరవడం జరిగింది. ఫలితంగా నేడు సోవియెట్ నాయకత్వమూ, దేశమూ సర్వవ్యాపిత సంక్షోభదశలో ప్రవేశించింది. మార్కెట్ శక్తులకే ధరవరల నిర్ణయాన్ని విడిచిపెట్టాలన్న విధానానికి రూపకల్పన చేసిన వారు గోర్బీ, ప్రధాని రైకోవ్. ఆర్థిక 'సంస్కరణల' పేరిట తలపెట్టిన ఈ సోషలిస్టు ప్రతికూల విధానాన్ని సుప్రీమ్ సోవియెట్ కూడా పూర్తిగా ఆమోదించకపోవచ్చు. ఈ అనుమానం వచ్చినందుననే గోర్బచేవ్ ఆఘమేఘాలమీద దేశంలోని కమ్యూనిస్టు పార్టీ నాయకులందరినీ సమావేశపరచి, సమస్యలను సమీక్షించాలని నిర్ణయించవలసి వచ్చింది.

సోషలిస్టు రాజ్యాలలో (కొన్నిట్లో అయినా) ఆర్థిక, రాజకీయ రంగాలలో దఫదఫాలుగా (1960లలో) సంస్కరణోద్యమాలు లేదా 'క్షాళనోద్యమాలు' రాకపోలేదు. ఒక దశలో హంగరీలో, ఇంకొక దశలో చైనాలో, వేరొక సందర్భంలో క్యూబాలో ఈ ఉద్యమాలు వచ్చి తప్పొప్పుల సమీక్ష జరిగి, సవరణలతో వ్యవస్థలు ముందుకు సాగి లబ్ధిపొందాయి. అయితే ఈ దేశాలు ప్రణాళికాబద్ధమైన కేంద్రీకృత ఆర్థిక సూత్రాల పరిధిలో సంస్కరణలు తలపెట్టారేగాని, లాభాపేక్షకోసం దేశంలోనే పోటీ ఆర్థిక వ్యవస్థల అవతరణకోసం, ప్రయివేట్ స్వప్రయోజనాలను ముందకు నెట్టే మనస్తత్వాన్ని పెంచే మార్కెట్ ఎకానమీని అవి ప్రవేశపెట్టలేదు. ఆధునిక రష్యన్ ఆర్థికవేత్తలయిన నికోలాయ్‌స్మెలోవ్, అలెగ్జాండర్ యాకలోవ్ ఒకవైపున రష్యన్ కరెన్సీ అయిన రూబుల్ మారకం విలువ పటిష్టం కానంతవరకూ 'మార్కెట్ శక్తులు' కూడా పుంజుకొని

ముందడుగు వేయజాలవని చెబుతున్నారు. కాని మరో వైపున అదే రూబుల్ మారకం రూపాయి విలువను మొదటిసారిగా గోర్బీ నాయకత్వాన రష్యా దిగకోసుకోవలసి వచ్చింది. ఈ సత్యాన్ని మభ్యపెట్టి 1920లలో 'నెప్' ఆర్థిక విధానం అమలులో ఉన్నప్పుడు రూబుల్ చాలా విలువైన కరెన్సీగా పటిష్టత పొందినదని చెప్పి, స్టాలిన్ హయాము ప్రతి తప్పిదానికీ బాధ్యత చేసే ప్రయత్నంలో నాయకత్వం "పప్పులో కాలు" వేస్తోంది. స్టాలిన్ చేసిన తప్పిదాలను సవరించకుండా ఆ తర్వాత నలభై ఏళ్ళు రాజ్యాన్ని ఏలిన కృశ్చేవ్, బ్రెజ్నేవ్, ఆంద్రపోవ్‌లు కాలక్షేపం చేశారు. తీరా గోర్బీ, ముందు రష్యన్ పార్టీ ప్రధాన కార్యదర్శిగా, ఆ తర్వాత రష్యా ప్రెసిడెంట్‌గా అవతరించి చేస్తున్న పని సోషలిస్టు ఆర్థిక సూత్రాల పరిధికి లోబడిన సంస్కరణలు కావు, పరిధి దాటి రేగన్, జార్జిబుష్‌లు మనసారా సంతోషించదగిన "సంస్కరణలు". అందుకే రేగన్ చాలా బాహాటంగా ప్రకటించగలిగాడు. "సోవియెట్ యూనియన్‌ను స్వేచ్ఛా మార్కెట్‌కు అనుకూలమైన ప్రజాస్వామ్య రాజ్యంగా మార్పు చేయడానికే గోర్బచేవ్ కృతనిశ్చయుడై ఉన్నాడని నేను పూర్తిగా నమ్ముతున్నాను". ఇందుకు తొలి బలి రష్యన్ కరెన్సీ. అంతర్జాతీయ కరెన్సీగా చెలామణిలో ఉన్న అమెరికన్ డాలర్ మారకం విలువను పెంచుతూ రూబుల్ విలువను కోత కోశారు. అంతేగాదు, రష్యాకి ఇప్పుడు ధాన్యం దిగుమతులు అవసరంలేదని ఎల్సిన్ అంటూంటే, పెద్దఎత్తున గోధుమ దిగుమతులకు ఒప్పందమై వచ్చాడు గోర్బీ! "ప్రచ్ఛన్న యుద్ధం" అంతమైనందుకు గోర్బీ సంతోషిస్తున్న సమయంలో అంతమాత్రాన "మా రక్షణ శ్రేణులను రద్దుచేసుకొంటామ"ని అర్థం కాదని రేగన్, బుష్‌లు ప్రకటిస్తున్నారు. కాగా గోర్బీ ఆయుధాల "పాక్షిక నియంత్రణ" లోనే "అమోఘమైన ఫలితాలు" చూడగలుగుతున్నాడు! కాని ఈ ప్రచ్ఛన్నయుద్ధం పరిసమాప్తి స్థానిక యుద్ధాలను రద్దు చేయగలిగేదీ లేనిదీ ఎవరూ పూచీ పడలేకపోతున్నారు.

అలాగే జాతుల సమస్యను పరిష్కరించి, ప్రపంచానికి ఆదర్శంగా ఉందనుకొన్న సోవియెట్ యూనియన్‌లో వస్తున్న పరిణామాలు సోషలిస్టు వ్యవస్థను ఏవగించుకునే స్థాయికి గోర్బచేవ్ పెంచి కూర్చున్నాడు. పడకపోతే విడిపోయే హక్కు సహా, సమానత్వ సూత్రాలతో బంధాలు పెంచుకున్న జాతీయ మైనారిటీ రిపబ్లిక్స్ అన్నీ నేడు సోవియెట్ ప్రభుత్వంపైన తిరగబడుతున్నాయి. గోర్బీ, ముందు స్వయం నిర్ణయ హక్కును వ్యతిరేకించాడు, తర్వాత విడిపోయే హక్కు అసలు రాజ్యాంగంలోనే లేదన్నాడు, ఆ పిమ్మట ఇప్పుడు వాతావరణం బెడిసికొట్టిన తరువాత, బాల్టిక్ రిపబ్లిక్స్‌కు (ముఖ్యంగా లిథూనియా) స్వతంత్ర సార్వభౌమాధికారాన్ని గుర్తించడమే గాక, వాటి ఆర్థిక, రాజకీయ స్వతంత్ర ప్రతిపత్తిని కూడా గుర్తించవలసి వచ్చింది. ఫలితంగా ఎల్సిన్ రష్యన్ ఫెడరేషన్‌ను "సర్వసత్తాక" (సావరీన్) రిపబ్లిక్‌గా ప్రకటించడంతో సోవియెట్ ఫెడరేషన్ కౌన్సిల్ కాస్తా సోవియెట్ సోషలిస్టు రిపబ్లిక్స్ యూనియన్‌ను "యూనియన్ ఆఫ్ సావరీన్ సోషలిస్టు స్టేట్స్"గా ప్రకటిస్తూ నూతన ముసాయిదా సిద్ధం చేయవలసి వచ్చింది. ఆర్థిక రంగంలో ప్రవేశపెట్టిన "మార్కెట్ ఎకనామీ" విధానం, రాజకీయ రంగంలో మిలిటెంట్ శక్తిగా కమ్యూనిస్టు పార్టీ అగ్రగామి పాత్రను కాస్తా రద్దుచేసి, బహుళపక్ష రాజకీయ వ్యవస్థ తలెత్తడానికి కావలసిన వాతావరణం సృష్టి కావడం - అన్ని రిపబ్లిక్స్‌లోనూ, యావత్తు రష్యాలోనూ ఈ విచిత్ర పరిణామాలకు, విరుద్ధ ఫలితాలకూ కారణమైంది. చివరికి నేటి రష్యన్ వ్యవస్థ - చలామణీలో ఉన్న కరెన్సీకి అండగా ఉండవలసిన బంగారం, వెండి నిల్వలను కూడా కోల్పోతోంది. రక్షణావసరాలకు ఉండవలసిన పరిమిత బంగారం, వెండి నిల్వలను కూడా ప్రభుత్వం హరించవలసి వస్తోంది. లెనిన్ ఏనాడో అన్నాడుః "తోడేళ్ళ మధ్య నివసిస్తున్నంత కాలం దేశం తన బంగారం నిల్వలను భద్రంగా

ఉంచుకోవాలి. యావత్ప్రపంచం సోషలిజానికి పరివర్తన చెందిన రోజున - బంగారాన్ని వీలునుబట్టి మరుగుదొడ్లకు కూడా ఉపయోగించుకోవచ్చు. కాని అంతవరకూ అప్రమత్తత అవసరం''. అన్నాడు. అయినా ఆయుధీకరణ విషయంలో ఆయన మాటలు ఎంతవరకు అమలు జరిగాయో, ఆర్థిక రంగంలో బంగారం లోహంపట్ల కూడా నాయకులు ఆయని మాటలను అలాగే వక్రీకరిస్తున్నారు. చివరికి ఈనాడు మొత్తం తూర్పు యూరప్ దేశాలన్నిటా వందల సంఖ్యలో ప్రభుత్వ పరిశ్రమలు ప్రయివేట్ పెట్టుబడిదారులకు అప్పగించేస్తున్నారు. స్టీఫెన్ గ్రీన్‌హౌస్ లెక్క ప్రకారం (బుడాపెస్టు) 2000వ సంవత్సరానికి సగం పరిశ్రమలు ఇలా చేతులు మారిపోతాయి. ఇందుకు రష్యాలో ప్రారంభోత్సవం చేసిన వ్యక్తి గోర్బీ! ప్రయివేట్ వ్యాపారులకు, పరిశ్రమలకు ప్రభుత్వ సంస్థల హోదా కల్పించడమేగాక, ప్రయివేట్ లాభాలపైన విధించాలనుకున్న 55 శాతం పన్నును 35 శాతానికి తగ్గిస్తూ కూడా నిన్నగాక మొన్ననే రష్యాన్ పార్లమెంటు చట్టం చేసింది. మరోవైపునుంచి ఎల్సిన్ సొంత ''సంస్కరణలు'' ప్రకటిస్తున్నాడు.

రష్యన్ చట్టాలను ధిక్కరిస్తూ, తన రష్యన్ ఫెడరేషన్‌కు విడిపోయే హక్కుందని చాటుతున్నాడు. ఇది రివల్యూషనా?! లెనిన్ దృష్టిలో ఇలాంటి దాని పేరు ''కౌంటర్ రివల్యూషనరీ లిబరలిజం'' (విప్లవ ప్రతీఘాత ఉదారవాదం). అందుకే లెనిన్ విగ్రహాల్ని కూడా పోలెండ్, చెకోస్లోవేకియా, బల్గేరియాల్లో పడగొట్టేశారు. రేపో మాపో మాస్కో మసోలియమ్ నుంచి కూడా లెనిన్ ఎగిరిపోవచ్చు. అందాకా జాన్ కెల్లీ అనే ఓ బ్రిటీష్ యువకవి ''లెనిన్ మసోలియమ్'' పేరిట రాసిన కవితా పంక్తుల్ని గుర్తు చేసుకొందాం: "In Moscow, I pass through, respectfull/Check the hands for rosary beads/ Alert in case he moves. And out the back/I offer my condollence with the only words I know-Glasnost, Vodka, Kalashinkov". రష్యన్ విప్లవం విజయవంతమైన తొలిరోజుల్లో లెనిన్ ప్రకటించిన ''భూమి, రొట్టె, శాంతి'' అన్న నినాద త్రయాన్ని ఇప్పుడీ మూడు సూత్రాలూ (గ్లాస్‌నాస్ట్, వోడ్కా, ఎకె-47 రైఫిల్) తోసి రాజంటున్నాయన్నమాట!

ఆదివారం 17, జూన్ 1990

# 'అగ్ని' ధార

సాగరమధ్యస్తమైన ఛాందీపూర్ ప్రయోగ కేంద్రం నుంచి సోమవారంనాడు ఇండియా జయప్రదంగా జరిపిన తొలి మధ్యంతర రక్షణ క్షిపణి ప్రయోగం - ఎన్నో అనుమానాలకు సమాధానం, మరెన్నో అభియోగాలకు జవాబు. "పోక్రాన్" అణుశక్తి ప్రయోగం తరువాత అంతటి ప్రాముఖ్యంగల ఘట్టం చాందీపూర్ పరిణామం. రాకెట్ టెక్నాలజీలో అగ్రరాజ్యాలు మనకంటే అగ్రభాగంలో ఉండవచ్చుగాక, కానీ వర్ధమానదేశాల అభివృద్ధి వేగంతో పోల్చుకున్నప్పుడు, వలసాధిపత్యంనుండి విడివడి స్వయం పోషకం కావడానికి ప్రయత్నిస్తున్న ఒక స్వతంత్ర దేశంగా మనం సాధించిన ఈ విజయం సాంకేతికంగా "జాంబవంతుని అంగ"గానే పరిగణించాలి. భారత ఉపఖండం చుట్టూ మూడు అగ్ర రాజ్యాలు (రష్యా, అమెరికా, చైనాలు) అణ్వాయుధాలు పేర్చుకొని కూర్చున్న సమయంలో, పాకిస్తాన్‌ను కొన్ని రాజ్యాలు మరణాస్త్రాలతో "పీకమొయ్యా" సాయుధం చేయడానికి సంకల్పించుకున్న దశలో - 'అగ్ని' పరీక్ష విజయవంతం భారత రక్షణ వ్యవస్థకు కొండంత బలం. అంతేకాదు, నిర్ణీత గడువులోగా ఒకవైపు మిస్సైల్ (క్షిపణి) టెక్నాలజీలోనూ, మరొకవైపు "మెటీరియల్ (ఇంధనం ముడిసరుకు తదితర సంభారాలు) టెక్నాలజీ" లోనూ స్వయం పోషకం కావడానికి, రక్షణ వ్యవస్థకు అవసరమైన కీలకమైన ఆయుధాలకోసం ఇతరులపై ఆధారపడే దుస్థితినుంచి బయటపడడానికీ మనం చేసుకుంటున్న ప్రయత్నాలకు ఈ పరీక్ష శుభాశీస్సులందజేసింది. అంతేకాదు, అమెరికాలోని 'కేప్ కెనడీ'లా, రష్యాలోని బైకనూర్ కాస్మోడ్రోమ్‌లా రూపుదిద్దాలని ప్రారంభించిన కేంద్రం బలియాపాల్ (ఒరిస్సా) క్షిపణి ప్రయోగ వేదిక. అయితే దాని సమీపాన వున్న జనావాస ప్రాంతాలకు ఈ కేంద్రంవల్ల రక్షణ ఉండదన్న అనుమానాలు కూడా ఈ ప్రయోగంతో తీరిపోయినట్టే భావించాలి. ఈ కేంద్రం నెలకొని ఉన్న సుమారు 50 కిలోమీటర్ల విస్తీర్ణంలోని 125 గ్రామాల రక్షణకు, నిర్వాసితులు కానున్న లక్షమంధి రైతాంగానికి మానవతా దృష్టితో అండదండలుగా నిలిచిన "ఉత్తర బాలసూర్ క్షిపణాస్త్రఘాటి ప్రతిరోధ్ కమిటీ"కూడా ఈ ప్రయోగ విజయానికి లోలోన గర్వించకపోదు. క్షిపణి కేంద్రం అనగానే శత్రుదాడికి ముందుగా గురిఅయ్యే ప్రాంతం తమదే అవుతుందన్న సహజమైన ప్రజల ఆందోళనలవల్లనే కేంద్రాన్ని ఏ అండమాన్ నికోబార్ దీవులకో, సాగర ద్వీపానికో, థార్ ఎడారికో మార్చమని వారు కోరడం అన్యాయం కాదు. నిజానికి అందుకు ఒక దశలో ప్రధాని రాజీవ్ కూడా సమ్మతించినవారే. అయినా ఈ ప్రయోగ విజయం కూడా తాత్కాలికంగానైనా ఈ అనుమానాలను నివృత్తి చేస్తుంది.

అయితే 'అగ్ని' ప్రయోగం జయప్రదం కాకుండా చూడడానికి ప్రయత్నించిన విదేశీ శక్తులనుంచి ముందు ముందు ఇండియాపై రాగల ఇతరేతర వత్తిడుల గురించి మనం చాలా జాగరూకతతో ఉండాలి.

ఎందుకంటే 1983లో ఇందిరాగాంధీ నేతృత్వంలో దేశ 'సమగ్ర క్షిపణి కార్యక్రమానికి' అంకురార్పణ జరిగిన క్షణంనుంచీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానే బయటినుంచి మనపై ఈ వత్తిడులు వస్తూనే వున్నాయి. అయినా లేజర్ కిరణాల తోడ్పాటుతో శతృశతఘ్నులు అడ్డుకోగల క్షిపణి "నాగ్", భూమి ఉపరితలంనుండి ఆకాశమార్గంలో వెళ్ళే లక్ష్యాలను ఛేదించగల "త్రిశూల్", "ఆకాశ్", ఉపరితలంనుండి ఉపరితలంమీదనే ఉన్న శతృలక్ష్యాలను దెబ్బతీయగల "పృథ్వీ", నిన్నటి మధ్యంతర క్షిపణి "అగ్ని" పాటవ పరీక్షలను జరుపకుండా ఎవరూ అడ్డుకోలేకపోయారు. నిజానికి తొమ్మిది కిలోమీటర్ల దూరంలోగల లక్ష్యాన్ని ఛేదించగల "త్రిశూల్" పాటవశక్తి నిరూపణ దశనుంచి సుమారు 800-2000 కిలోమీటర్ల దూరంలోని లక్ష్యాన్ని నిరుత్తరంచేసి రాగల ఈ 'అగ్ని'ధార వరకు భారత టెక్నాలజీ ఎదిగి రావడానికి కారకులైన - రోదసీ పరిశోధనా కేంద్రం, రక్షణ పరిశోధన అభివృద్ధి ప్రయోగశాల, ఈ ప్రయోగ విజయానికి తోడ్పడిన వేయిమంది శాస్త్రవేత్తలూ ఎంతో అభినందనీయులు. ముఖ్యంగా రాకెట్ డిజైనింగ్‌లో, క్షిపణుల సాంకేతిక పరిజ్ఞానంతో ప్రభాపుంజాలు వెదజల్లుతున్న డాక్టర్ అబ్దుల్ కలామ్, వి. ఎస్. అరుణాచలం ప్రజల ఆశీస్సులకు అర్హులు.

అమెరికా ప్రభుత్వ వ్యవస్థలో 'పెంటగాన్'లో కొందరికి ఇండియా 'అగ్ని' అభివృద్ధి గిట్టకపోవచ్చుగానీ ఉపఖండంలో, ఆసియాలో చైనా - పాకిస్తాన్‌లు రక్షణ వ్యవస్థను బలపరచుకోవడానికి అమెరికా ఎందుకని అభ్యంతరం చెప్పదు? సాంప్రదాయిక ఆయుధాలను మోసుకుపోగల క్షిపణుల తయారీ యూరప్‌లో యధేచ్చగా సాగుతున్నా ఎందుకు నోరు మెదపదు? 'ఎస్.ఎ-2 గైడ్‌లైన్' క్షిపణులను రష్యా వార్సాకూటమిని దాటి ఇతర దేశాలకు విక్రయించుకుంటే ఎలా వూరుకుంటున్నారు? చైనా సి.ఎస్.ఎస్.-3 మధ్యంతర క్షిపణులను తయారుచేసి, సౌదీ అరేబియాకు అమ్మినప్పుడు ఈ గొణుగుడు ఏమయింది? క్షిపణుల ఉత్పత్తి, వాటి పరివ్యాప్తి ఇప్పుడు ఎవరి గుత్త సొమ్మూ కాదు. అణ్వస్త్ర వ్యాప్తి నిరోధం ఏకపక్షం కాదు. ఎవరి జాతీయ ప్రయోజనాలు వారివి. వాటిని వదులుకోలేరు గనుకనే అమెరికా, రష్యా, చైనా, ఫ్రాన్స్‌లు మారణాస్త్రాలను కవచాలుగా ధరించి కూర్చున్నాయి. అణ్వస్త్రాల ఉత్పత్తిలో గుత్తాధిపత్యాన్ని నిరసించి మరీ బద్దలుకొట్టిన దేశం చైనా. ఇండియా వాటి సరసనే చేరడానికి ముస్తాబు అవుతున్నపుడు ఈ 'ముటముటలు' దేనికి, అభ్యంతరాలు ఎందుకు? ఈ కారణంగా ఇండియాతో జరిపే వర్తక వాణిజ్యాలపైన, చేస్తున్న ఆర్థిక సహాయంపైన ఆంక్షలు విధించాలన్న బెదిరింపు ఆలోచన అమెరికాకు తాత్కాలికంగా ఎందుకు కలగాలి? ఆర్థిక పరాధీనత ఏ పరిస్థితికి దారితీస్తుందో మల్టీ నేషనల్స్‌కు ద్వారాలు తెరిచిన కేంద్ర ప్రభుత్వం ఇప్పటికైనా గుర్తించవద్దా?

బుధవారం మే 24, 1989

# ఈ రోజు మళ్ళీ రాకూడదు......!

అలా అని మనం అనుకుంటే సరిపోతుందా? అలా దిగాలుపడితే అచేతనశక్తికీ, చైతన్యమూర్తి అయిన మానవునికీ ఇంక భేదమెక్కడ? నిజంగా ఆ రోజు మళ్లీ రాకుండా ఉండాలని కోరుకుంటే, సంకల్పం ప్రకటించుకుంటే, మానవశక్తి ఒక్క తాటిపై విజృంభిస్తే, పదిమందితో చావు పెళ్ళితో సమానమనుకుంటే, యావత్తు మానవాళి ఒక్క వ్యక్తిగా, శక్తికి బహువచనంగా తిరగబడితే - ఆ రోజు మళ్లీ రాకుండా చేసుకోవచ్చు. అదే ఈ రోజు. అదే ఆగస్టు 6వ తేదీ, ప్రపంచ నాగరికతా చరిత్రను అపహసించిన రోజు. మానవ మేధస్సును ప్రశ్నించి ఛీదరించుకోవలసి వచ్చిన దుర్దినం. తన స్వార్థ ప్రయోజనాలకోసం, తన సైనిక - గుత్త పారిశ్రామిక, నరమాంస భక్షక దోపిడీ వ్యవస్థ రక్షణకోసం అమెరికా, జాపనీస్ నగరాలైన హిరోషిమా, నాగసాకీలపై తొలి అణుబాంబును ప్రయోగించి, 20 లక్షల మంది ప్రాణులను బలిగొన్నది. మానవజాతి ఉనికిని ప్రశ్నిస్తూ జీవరాశి ప్రాణాలను తృణప్రాయంగా ఎంచిన ఆ క్షణంనుంచీ ఈ క్షణం వరకూ ప్రజలు భీతావహులయ్యే ఉన్నారు. లాస్ అలమోస్ పరిశోధనాగారాలలో బీజాలుపడి, "అలమోగార్డో"లో తొలి పాటవ పరీక్ష ముగించుకొని రెండవ ప్రపంచ యుద్ధానికి 'కొసమెరుపు'గా, రాక్షస ముగింపుగా హిరోషిమాలో పండించిన ఈ అణుబాంబు ఫలితాలు భావి ప్రపంచ నాగరికతకు తొలి పాఠాలే కాదు, శాశ్వత గుణపాఠాలు కావాలి. శాస్త్రవేత్త మానవాళి శాంతి కాల ప్రయోజనాలకోసం చేసే ప్రతీ ప్రయోగం సందర్భంగా "పానకంలో పుడక"లాగా కొన్ని వినాశకర సూత్రీకరణలు కూడా బయటపడవచ్చు. కాని మానవుని ఆరోగ్య భాగాన్ని, సంపదను పెంచే ప్రయోగ ఫలితాలను పక్కకునెట్టి, రాజ్యం వీరభోజ్యంగా భావించే పాలకుల, సామ్రాజ్యకాంక్షాపరుల చేతులకు ఈ వినాశకర సూత్రీకరణలు చిక్కితే ఎలాంటి ఫలితముంటుందో హిరోషిమా ఉపద్రవమే కాదు, ఆ తరువాత అగ్రరాజ్యాలు కుప్పలుగా పేర్చుకుంటూ వచ్చిన అణ్వాయుధ సంపత్తి కూడా నిరూపించింది. అణ్వస్త్రాల ఉత్పత్తికి తోడ్పడే "ఫార్ములా"కు ఆద్యులైన ఒపెన్ హేమర్, ఐన్‌స్టీన్,నీల్‌బోర్‌లు మానవాళి వినాశాన్నీ, నాగరికత విధ్వంసాన్నీ కోరుకోలేదు, ఊహించలేదు. ఈ కర్మకాండలో దుష్టపాత్ర రాజకీయవేత్తలది. అందుకే 17-18వ శతాబ్దాపు శాస్త్రవేత్తలు భౌతిక విజ్ఞానశాస్త్ర ప్రపంచం తాను జరిపే ప్రయోగాల సందర్భంగా భౌతిక సంపదకు, నైతిక విలువలకు వాటిల్లగల ప్రమాదకర ఫలితాలను కూడా ఊహించగలిగారని అణుశాస్త్రవేత్తల చరిత్రను "బ్రయిటర్ దేన్ ఎ తౌసెండ్ సన్స్" అన్న గ్రంథంలో నిక్షిప్తం చేసిన రాబర్ట్ జంక్ ఉదాహరించాడు; "మన ప్రయోగశాలల్లోకి పాలకవర్గాలనూ, వారి సైనిక వర్గాలనూ తలదూర్చనివ్వకండి. ఎందుకంటే, పవిత్రమైన ప్రకృతి రహస్యాలను వీళ్ళు తమ అధికారం కోసం దుర్వినియోగం చేస్తార"ని ఏనాడో హెచ్చరించాడు. అంతేకాదు, నేటినుంచీ మానవాళిపై నిశ్చయాత్మకమైన దాడులు డ్రాయింగ్

బోర్డులనుంచీ, లేబరేటరీలనుంచీ ప్రారంభం కాబోతున్నాయని 1919లోనే ఆల్‌ఫ్రెడ్ డోబ్లిన్ 'జోస్యం' చెప్పాడు. అలాగే హిరోషిమాపై బాంబు ప్రయోగానికి ఇరవై రోజుల ముందు "అలమోగార్డో"లో జరిగిన పాటవ పరీక్షను కూడా కళ్ళారా చూడ్డానికి కొన్ని నిముషాలముందు ఓపెన్ హేమర్‌కు గుర్తుకువచ్చింది ఏ బైబిల్ సూక్తో కాదు, సాక్షాత్తూ మన "భగవద్గీత". "దివిలో వేయిన్నొక్క సూర్యులొక్కసారిగా ఉదయిస్తే ఆ కాంతి ఆ మహాత్ముడి తేజస్సుకు సమానం కావచ్చు"నన్న సంజయుని గీతా వాక్యాన్ని తలచుకొని ఆనందపడుతున్న ఘడియల్లోనే అతనికి శ్రీకృష్ణుడి హెచ్చరిక కూడా గుర్తుకొచ్చిందటః "ప్రాణుల్ని అంతం చెయ్యడం నా ప్రవృత్తి. నేను లోక సంహారానికై విజృంభించిన కాలుణ్ణి". అంతే, ఆ తర్వాత అంతపనీ అమెరికా చేసింది! హిరోషిమా, నాగసాకీలు బుగ్గిపాలయ్యాయి. అగ్నిపర్వతాలు బద్దలయినప్పుడు 'లావా' వెదజల్లే రేడియేషన్ వల్ల జరిగే జనుల మారణహోమానికీ, అణ్వాయుధాలను ఉన్మాదులు ప్రయోగించినప్పుడు జరిగే ప్రపంచ విలయానికీ ఎంత దగ్గర సంబంధం ఉంటుందో ఊహించుకోడానికి హిరోషిమా దురంతానికి డెబ్బయ్యేళ్ళముందు 1816లో బైరన్ మహాకవి "కారుచీకటి' అన్న కవితలో చేసిన హెచ్చరిక చాలుః "ప్రకాశవంతమైన భానుడు కాస్తా అంతరించాడు. నిశిలో నక్షత్రరాశి అనంత రోదసీలో దారీ తెన్నూ కానక, కాంతులీనలేక తచ్చాడుతోంది. శీతలం కమ్ముకున్న భూమాత కళ్ళులేని కబోధిలా, వెన్నెల కాంతుల్లేని మలయమారుతంలో పొగసూరుకుపోయింది. ఉదయం రావడానికి వచ్చింది - పోయింది. మళ్ళీ వచ్చింది. కానీ ఎంతకూ పగలు కానే కాదు, ఆ పగలు రానే లేదు"

అలాంటి దారుణ పరిస్థితి అణుయుద్ధంవల్ల ఎలా సంభవిస్తుందో ఇప్పటివరకూ జరిగిన శాస్త్ర పరిశోధనల సారాంశంగా ఇటీవల వెలువడిన చలనచిత్రం "ది డే ఆఫ్టర్". ఆ తరువాత 1981లో ప్రపంచ శాస్త్రవేత్తలు కొందరు తమ పరిశోధనానుభవాలను రంగరించి ప్రపంచ ప్రజలలో ఆలోచన రేకెత్తించడానికి చేసిన ప్రయత్నంగా వెలువడింది "ది నైట్ ఆఫ్టర్" గ్రంథం. అణుయుద్ధంవల్ల అనేక జీవన రంగాలలో సంభవించే అనర్థాలను గురించి "హిరోషిమా " తర్వాత జనరల్ ఫారెల్ కూడా ఆందోళన వ్యక్తం చేశాడుః "అణుబాంబు ప్రయోగ ఫలితాలను ప్రత్యక్షంగా చూడనివారికి ఆ దారుణ ప్రయోగంవల్ల భౌతికంగా, మానసికంగా, నైతికంగా కలిగే నష్టాల గురించి చెప్పడానికి మాటలు చాలవు" అన్నాడు. కాని అణు యుద్ధంవల్ల ప్రపంచం నెత్తిపైకి వచ్చిపడే ఆ మిత్తవ సత్తువ ఏమిటో, "అణుశీతలం"వల్ల కలిగే ఆ విభ్రాంతి ఏమిటో ఇప్పటికే శాస్త్రవేత్తలుహెచ్చరిస్తున్నారు. ఈ భూతలంపై జీవరాశి మనుగడ అంతా సూర్యునిపై ఆధారపడి ఉన్నంత కాలం మానవకోటి అణ్వాయుధాల రద్దుకూ, సంపూర్ణ నిరాయుధీకరణకూ ఆందోళన చేయక తప్పదు. ప్రతి సెకండుకూ సూర్యుణ్ణించి భూమికి 30 మెగాటన్నుల శక్తి విడుదలవుతూంటుంది. ఇది ఒక్క అణ్వాయుధం విడుదల చేసే తాపశక్తికి సమానం. ఇలా సూర్యుడినుంచి భూమికి ప్రతి 10-15 నిమిషాలకు విడుదలయ్యే సౌరశక్తికి, ఇప్పటి వరకూ ప్రపంచంలో మేట వేసుకున్న అన్ని రకాల అణ్వస్త్రాల వినాశకర శక్తికీ సరిసమానం. మరో మాటలో చెప్పాలంటే, నిప్పుముడితే చాలు భగ్గుమనే "కంబశ్చబుల్స్" ("రంజకాలు" - అంటే బొగ్గు, చెత్త, కాగితాలు వగైరా) నిల్వలు అణ్వాయుధ నిల్వల శక్తిని మించి ఉన్నాయట. పారిశ్రామిక వాడల్లో ప్రతి సెంటీమీటర్ స్థలంలో 4 గ్రాముల చొప్పున ఈ రంజకాలు పేరుకున్నాయి. క్షిపణులు పడిన మరుక్షణమే క్రకటోవా, తాంబోరా అగ్నిపరర్వతాల స్థాయికి అనేక రెట్లు ఎక్కువగా రేడియేషన్ (తాపం) విడుదలయి, భూమి వాతావరణాన్ని, పరిసరాలనూ చెదరగొడుతుంది. అణుయుద్ధంవల్ల మొత్తం వాతావరణ పరిస్థితులే ఎలా మారిపోతాయో

మొదటిసారిగా హెచ్చరించినవాడు పాల్ క్రట్జన్. 100 మెగా టన్నుల అణుశక్తి అంటే 8,200 ''హిరోషిమాల'తో సమానం. అదే పదివేల మెగాటన్నుల శక్తి విడుదలయితే 10 లక్షల శ్మశానవాటికలు - ''హిరోషిమాలు' నేడు అమెరికా, రష్యాల దగ్గరున్న అన్ని రకాల అణ్వాయుధాలు 50,000. వీటి శక్తి 15,000 మెగాటన్నుల విధ్వంసక శక్తికి సమానం! అణుయుద్ధంవల్ల సంభవించే ''అణుశీతలం'' వల్ల ఉష్ణోగ్రతలు తారుమారవుతాయి. ఆమ్ల (యాసిడ్) వర్షాలు కురుస్తాయి. వాతావరణంలో అతినీలలోహిత కిరణాల ధార్మిక శక్తి భూమికి చేరకుండా జీవరాశికి రక్షరేఖగా ఉన్న ''ఓజోన్'' పొర కాస్తా నాశనమై పోతుంది. ఏక కణ జీవులన్నీ కనుమరుగై సాగర సంపద కాస్తా ధ్వంసమై పోతుంది. ''హిరోషిమా'' సృష్టి - లుకేమియా వ్యాధి, 30 ఏళ్ళ తర్వాత కూడా మానవుల్ని పీడిస్తున్న బ్లెడ్ కాన్సర్; వంశపారపర్య లక్షణాలు కూడా తారుమారై, అనూహ్యమైన వికృతాలకు దారితీస్తుంది; ఇక మానసిక సంబంధమైన రోగాలకు లెక్క ఉండదు, బతికిఉంటే. సోవియెట్ అకాడమీషియన్ నటోలియా బెక్తరేవా చెప్పినట్లుగా అణుయుద్ధం తరువాత బహుశా అక్కడక్కడా కొంతమంది మానవులు బతికి ఉండవచ్చు. కాని వారిని సాకడానికి సాంఘిక వ్యవస్థగానీ, ప్రాణదానం చెయ్యగల వైద్య, ఆరోగ్య వ్యవస్థగానీ ఉండదుగాక ఉండదు. ఈ ఘోరకలిని మానవుని మెదడు భరించలేదు. అదొక జీవచ్ఛవంగా మిగిలి పోతుంది. అందుకే శ్రీ శ్రీ అన్నాడేమో - ఈసారి యుద్ధం వస్తే దేవుడున్నట్టే, అయితే అతణ్ణి కీర్తించడానికి మానవులుండరు, యుద్ధం రాకపోతే మానవుడే దేవుడౌతాడు!!

ఆదివారం 6, ఆగస్టు 1989

త్వరలో

## ఎబికె ప్రసాద్ కలం నుంచి

మరో ఆణిముత్యం

# నిబద్ధాక్షరి

(సాహిత్యకీయాలు)

## నవ్య ప్రచురణ